

# స్వారోచిష
# మనుచరిత్రము

ఆంధ్ర కవితాపితామహ

అల్లసాని పెద్దనామాత్య ప్రణీతము




తర్కాచార్య, భాషాప్రవీణ

శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి

విరచిత టీకాతాత్పర్యసహితము.





ప్రకాశకులు:

కల్యాణిగ్రంథమండలి

విజయవాడ-1

# పీఠిక

'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' యని పేరుగన్న యాంధ్ర భాష యేనాటినుండియున్నదోకూడ వివాదగ్రస్తమైనది. నన్నయయే తెనుఁగున నాదికవి. కవిత్రయము భారతముఁ బూరించుటకు మున్నూఱేండ్లు పట్టినది. తరువాతికాలమున నా త్రోవనే శ్రీనాథాదులు సంస్కృత గ్రంథానువాదమే చేసినను స్వప్రతిభాస్ఫోరకంబులుగ వర్ణనల సమకూర్చి భావి ప్రబంధకవులకు మార్గదర్శకులైరి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు భారత, అభిజ్ఞాన శాకుంతలములలోని కథను గ్రహించి 'శృంగార శాకుంతల'మను పేర ప్రబంధముగా రచించెను. సామాన్యతః ప్రబంధశబ్దము కావ్యమాత్రపరమైనను, అష్టాదశవర్ణనా ఘటితమై గద్య పద్యాత్మకమైన తెనుఁగు కావ్యమందే రూఢమైనది. కథావస్తువును ప్రసిద్ధమైనదానిని గ్రహించి కవిప్రతిభ నద్దానికి జోడించిన మిశ్రకావ్యములే శ్రోత్రసేయములుగా నుండునని పినవీరన—

'ప్రఖ్యాతంబన మిశ్రబంధమన నుత్పాద్యంబనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతంబగు వస్తువందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతంబితివృత్తమైనఁ గృతిసెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమన్ విశ్వంభరామండలిన్'

అని చెప్పినాఁడు.

శృంగార శాకుంతలము తర్వాత సర్వాంగ సుందరముగా వెల్వడిన మహాప్రబంధ మీ 'మనుచరిత్రము'. దీనికిఁ గవి పేరొన్న పేరు 'స్వారోచిషమనుసంభవము' కాని కవియే 'మనుచరిత్రంబందు కొను వేళఁ బురమేఁగఁ బల్లకిఁ దనకేలఁబట్టియెత్తె' నని 'మనుచరిత్ర' మనుపేరునుగూడ వాకొనెను. అదియే లోకమునఁగూడ రూఢమైనది.

దీని నాంధ్రభోజుఁడనఁబరఁగు శ్రీకృష్ణదేవరాయల కంకితము చేసెను. ఆ రాజకవిచంద్రుఁడు దాను గవియై విష్ణుచిత్తీయాదుల రచించి కవిపండితులఁ బోషించి తెనుఁగున స్వర్ణయుగమును వెల

యించెను. ఆతని సరసతనుఁ దెల్పు నితిహాసములెన్నేఁ గలవు. రాజ్యరక్షణ, నూతనరాజ్యస్వీకరణముల నాతనికిఁ, గవిగోష్ఠిజరుపుట కెక్కడ నవకాశముండెడిదో! దండయాత్రలకు వెడలునపుడు కవులనుగూడఁ గొనిపోయెడివాఁడట. ఆతని యాస్థానకవీశ్వరులగు నష్టదిగ్గజములలో వయసా, కవితయాచ పెద్దవాఁడు పెద్దన, యీ కృతికర్త.

ఈతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు. మొదట స్మార్తుఁడై తర్వాత వైష్ణవమును స్వీకరించినవాఁడు. అల్లసాని చొక్కనకుఁ బుత్రుఁడు. బళ్లారి ప్రాంతమందలి దోపాడు పరగణాలలోని దోగాల గ్రామ మితని నివాసము. పెద్దన ప్రాసంగికముగాఁ జెప్పు పద్యముల కలరి రాయలు కృతినిమ్మని కోరఁగా—

'నిరుపహతి స్థలంబు, రమణీప్రియదూతిక దెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మకింపయిన భోజన, ముయ్యెల మంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తము,
ల్దొరకినగాక, యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే ?'

అని ప్రబంధరచనానుకూల పరిస్థితులను జెప్పగా రాయలు కవిని కోరుకొమ్మని 'కోకటగ్రామాద్య నేకాగ్రహారముల సీమల యందు నిచ్చెను.' మనుచరిత్రంబందుకొనువేళ పురమేఁగునపుడు పల్లకిఁ దనచేతఁ బట్టియెత్తి కవీశ్వరునిపైఁ దనకున్న యపరిమి తాద రాభిమాన గౌరవముల వ్యక్తపఱచెను. ఎప్పుడు పిల్చినను 'ఆంధ్ర కవితాపితామహ! అల్లసాని పెద్దన కవీంద్ర!' అని పిల్చువాఁడట.

రాయలు నిత్యశః కవిగోష్ఠి సల్పువాఁడు. ఉత్సాహమును రేకెత్తించి వారిలోని ప్రతిభను రాణింపఁజేయువాఁడు. అతఁడొక నాఁడు పైడి పళ్ళెరమునఁ గవిగండపెండేరము నునిచి తెచ్చి సభాస్థలిలోనుంచి 'సంస్కృతాంధ్రములలో సమముగాఁ గైతసెప్పనేర్చిన కవివర్యు లిద్దానిఁ గైకొనఁగలరు' అని నుడివెను. సభాస్తారులు లేవకపోగా రాయ లభిమానముతో—

ఉ. 'ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింపఁగా
నొద్దిక నా కొసంగుమని యొక్కరుఁగోరఁగ లేరు, లేరొకో!
పెద్దన మధ్యలో నందుకొని
'పెద్దనఁబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే?
పెద్దన కీఁదలచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా!'
అని పూరించి

ఉ. పూఁత మెఱుంగులుం బసరుపూప బెడంగులుఁ జూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గు నెనగావలె గమ్మనఁగమ్మనన్వలెన్
రాతిరియుంబవల్ మఱపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దాతిరి తీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్
బాఁతిగఁగ్రైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూఁత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁగాఁగిటను జేర్చినఁ గన్నియచిన్నిపొన్ని మే
లూన్మతలచన్నుదోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్
హాతొడనున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
నాతెఱ దొండపండువలె వాచవిగావలెఁ బంటనూఁదినన్
గాతలఁదమ్మిచూలి దొరకైవసపుం జవరాలి సిబ్బెపు
న్నేతెలియబ్బురంపుజిగి నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూఁతలనున్నకాయ సరిపోఁడిమి కిన్నెర మెట్లబంతి సం
గాతపుసన్నబంతి బయకారపుఁ గన్నడగౌళపంతు కా
సాతతతానతానలపసం దివుటాడెడు గోటుమీటుబల్
మ్రోఁతలునుంబలెన్ హరువుమొల్లముగావలె నచ్చతెన్గు లీ
రీతిగ, సంస్కృతంబు పచరించినపట్టున భారతీ వధూ
శ్రీ తపనీయ గర్భనికటీభవ దాసనపర్వ సాహితీ
భౌతికనాటక ప్రకర భారత భారతసమ్మత ప్రభా
పాతసుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయ సంగతిచుంచు విపంచికా మృదం
గాతతతేహితత్తహిత హాధిత ధంధణుధాణుధింధిమి
వ్రాతలయానుకూల పదవారకుహూద్వహహారికింకిణీ

నూతనఘుల్లు లాచరణ నూపురఝూళఝుళీమరంద సం
ఘాతవియద్ధునీచకచక ద్విక చోత్పలసారసంగ్రహో
ద్యాతకుమార గంధవహహారి సుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁ జేయవలె జిల్లునఁజల్లవలె న్మనోహర
ద్యోతకగోస్తనీ ఫలమధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతిరసప్రసారరుచిర ప్రసరంబుగ సారె సారెకున్.

అను నుత్పలమాలిక నాశువుగా చదివెనట. అంతట రాయలు తానే గండపెండేరము నాతని పాదమునఁ దొడిగెను. ఆశు కవిత్వమనగా నాలోచించియు రసభరితముగా వర్ణించినట్లే యాలోచింపకయుఁ జెప్పుట. అంతేకాని యేదో చిట్టిముట్టిపద బంధము కాదు.

ఇతనికి 'ఆంధ్రకవితాపితామహ' అని బిరుదున్నది. ఈబిరుదము నితనికన్న పూర్వము శివదేవయ్య—క్రీ.శ. 1260 ప్రాంతము వాఁడును, కొఱవిసత్యనారాయణకవి—ఇతనికి సత్తైనారన యనివ్యావహారిక నామము—1400 ప్రాంతము వాఁడును వహించిరి. పెద్దన మూఁడవవాఁడు. ఇతని తరువాత 1600 ప్రాంతమువాఁడగు ఉప్పుగుండూరి వేంకటకవియు, ఎనమండ లక్ష్మీనృసింహకవి—1680 ప్రాంతము వాఁడును వహించిరి. మండపాక పార్వతీశ్వరకవికి 'అభినవాంధ్రపితామహ' బిరుద మున్నది.

ఈ బిరుదు పెద్దన కెప్పుడు వచ్చినది ? గ్రంథావతారికలో 'హితుఁడవు...ఆంధ్రకవితా పితామహుఁడవు' పీఠిక ప. 15. చెప్పినందున గ్రంథరచనకు ముందే యున్నదని కొందఱి యూహ. కాని గ్రంథరచన పరిసమాప్తి పొందిన తరువాతనే యంకితమిచ్చుట పరిపాటి కాన అప్పుడే పీఠికను వ్రాసి తన కా గ్రంథరచనా సమర్థతను బట్టి రాయలిచ్చిన బిరుదమును గ్రంథస్థమునుగఁ జేయుటలో విప్రపత్తియుండదు. అంతియకాని చాటుశ్లోకములచే యట్టి బిరుదునిచ్చిరనుట విచారసహము.

ఈయన 'హరికథాసార' మను మఱొక గ్రంథమును రచించి తన గురువగు శఠకోపయతి కంకిత మొనర్చెను. ఆగ్రంథమునుండి యీక్రింది పద్యములు రంగరాట్ఛందమున నుదాహరింపఁబడినవి.

క. శఠకోపయతికి ఘనతరు, కుఠారకోపమతికిని గురుతమ హృత్క
ర్మఠనిరతికిఁ జతురాగము, పఠనాయతనియతికి నజపాసంభృతికిన్.

గీ. అఖిల పారికాంక్షి కాశ్రయ పర్ణశా, లోపకంఠమునకు లోకకర్త
చేరనేగి యచటఁబొరవంబున డిగ్గి, యధివసించియుండునర్థితోడ.

క. బాలరసాల కిసాలము, గ్రోలుచుఁ బ్రతికెడిపికంబు కో యనఁజాలం
జాలింబడియా నయమధు, రాలాపములనియెనాదరణమునవినఁగన్.

ఇంతేకాక రాయలు స్వర్గస్థుఁడైన పిమ్మట నాతని నిర్యాణ మునుఁ గూర్చి యొకసీసశతకమును రచించెనందురు. కాని దానిలో నొక పద్యము మాత్రమే ప్రచారములో నున్నది.

సీ. ఎదురైనచోఁదనమద కరీంద్రమునెక్కి
కేలూఁతయొసఁగి యెక్కించుకొనియెఁ
గోకటగ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
మనుచరిత్రంబందుకొను వేళఁబురమేఁగఁ
బల్లకిఁదనకేలఁబట్టియెత్తె
బిరుదైన కవిగండ పెండేరమున కీవె
తగుదని తానె పాదమునఁదొడిగె,

గీ. 'ఆంధ్రకవితా పితామహా, అల్లసాని
పెద్దన కవీంద్ర!' యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

ఇందు రాయలు దనకెట్టి మర్యాదనిచ్చి గౌరవించినాఁడో వ్యక్తీకరింపఁబడినది.

మఱియుఁ గృష్ణరాయల యనంతరము కన్నడరాజ్యముపైకి గజపతిరాజు దండెత్తిరాఁగా,

సీ. రాయరావుతు గండరాచ యేనుఁగువచ్చి
యోరట్లకోట గోరాడునాఁడు

సంపెటనరపాల సార్వభౌముఁడువచ్చి
సింహాద్రి జయశీలఁ జేర్చునాఁడు
సెలగోలుసింహంబుచేరి ఛీక్కృతిఁగంచు
తల్పులఁగరుల డీకొల్పునాఁడు
ఘనతర నిర్భరగండపెండెరమిచ్చి
కూతురాయల కొనఁగూర్చునాఁడు

గీ. నోడలెఱుంగవో చచ్చితో యుర్విలేవో
చేరఁజాలక తలచెడి జీర్ణమైతొ
కన్నడంబెట్లు సొచ్చెదు గజపతీంద్ర!
తెఱచి నిలుకుక్క సొచ్చిన తెఱఁగుదోఁప.

అను సీసపద్యమును వ్రాసిపంపగా నాతఁడు సిగ్గుపడి మఱలి పోయెనని తెలియుచున్నది. పూర్వము మనుమసిద్ధి ప్రతాపరుద్రున కోడిన రాజ్యమును తిక్కన కవీంద్రుఁడు నిట్లే ప్రతాపరుద్రునిఁదన కవితానైపుణిని మెప్పించి యా రాజ్య మాతని కిప్పించెనట!

మఱియను గృష్ణరాయ విరచితంబగు నాముక్తమాల్యదయుఁ బెద్దనచే రచింపఁబడినట్లు ప్రథకలదు. కాని కవిరాజగు రాయలట్టి పనికిఁబూనుకొని యుండఁడు. కాక 'కవితాప్రావీణ్యఫణీశ!' మున్నగు కవిసంబోధన లాతని కవితా ప్రావీణ్యమును జాటుచునే యున్నవి. కొందఱికిఁ దమయాశ్రితులు వ్రాసిన గ్రంథములఁ దమవిగాఁ బ్రక టించుకొను నలవాటున్నను ఇప్పట్లు నది యసత్యమని తోఁచును.

కృతి కర్తృ, భర్తృ కీర్తిదాయకంబగు మహాప్రబంధమును రచించి యాంధ్రభాషాయోష కలంకృతినిచ్చి యనేక సత్కృతుల రాయలచే నంది, యనేకాగ్రహార భోగముల ననుభవించి యైహిక భోగములఁ దనివి సెందుటయే కాక, తాను బ్రీతితో దానముపట్టిన కోకటాగ్రహారమునకు గురుని పేర 'శఠకోపపుర' మని పేరు పెట్టి బ్రాహ్మణులకు దాన మొసంగెను. తెనుఁగు భాషనుండు నంతకుఁ బెద్దన కీర్తి శరీరమున కేభంగపాటును రానేరదు.

# గ్రంథవిమర్శనము

## రచనాచాతురి

మార్కండేయ పురాణములో నీ స్వారోచిష మనుసంభవ గాథ యున్నది. దానిని మారన చతుర్థ పంచమాశ్వాసములలో 150 పద్యములలోఁ దెనిఁగించినాఁడు. దాని నీతఁడు 800 వఱకుఁ బెంచి రసభరితముఁ జేసెను. కథనుఁ బోషించుపట్ల మార్కండేయపురాణ గాథకు దీని కథకుఁ గొన్ని భేదములున్నవి. పెద్దన ప్రతి పద్యమునఁ దన భాషానైపుణి, కవితాప్రాగల్భ్యము గనుపడునట్లే చక్కని పరిశ్రమచేసి కవులెల్లందలలూచు నట్లు రచించెను. కాని యూరక పదములఁ గూర్చలేదు. తానెంత పండితకవి యైనను పూర్వకవుల వచనములను ప్రత్యక్షరశః క్షుణ్ణముగాఁ బరిశీలించి వానిలోని యందమును గైకొని తీర్చిదిద్దెను. గ్రంథమున నెక్కడఁ జూచినను పటిమ లేని గద్యపద్యములు దొరకవు. 'అల్లసాని వానియల్లికజిగిబిగి' అన్నట్లు జిగిబిగిగానే యుండును గాని సడలియు నుండవు. ఇతనికి సంస్కృతాంధ్రముల నెట్లు కూర్పవలయునో లెస్సగాఁ దెలియును. కాననే సంస్కృతప్రౌఢియుఁ దెనుఁగు నుడికారముల నందంబుఁ జక్కగాఁ జొప్పించెను.

### మార్కండేయ పురాణమునకు దీనికిఁగల భేదములు

మూలమున—సిద్ధుఁడొకనాఁడు ప్రవరుని యింటి కేతెంచెను. ఆగేస్తతని కాతిథ్య మొసంగి విశేషము లడిగి 'ఇంత చిన్నవయసున మీ రెట్లు తీర్థయాత్రల నన్నిఁటినిఁ జేసినారు?' అని ప్రశ్నింప నాతఁడు పాదలేప విషయముఁ జెప్పి 'దీనిని బాదములకుఁ బూసి కొనిన నాపగలిఁటి లోపల నెన్ని యోజనముల దూరము నైనను బోయి రా వచ్చును' అని చెప్పెను. ప్రవరుని కోరికపై సిద్ధుఁడా మందు నతని కిచ్చెను. ప్రవరుఁడద్దానిని గాలికిఁ బూసికొని హిమగిరి కేఁగెను. అక్కడి మంచుచలికా యౌషధముఁ గరఁగి పోయెను. అతఁడు చాలసేపు చూచి చూచి తనివి పడక మఱునాఁడు రావచ్చు నని వెళ్ళఁదలఁచెను. కాని కాళ్లు లేవలేదు. అంతఁబశ్చాత్తప్తుఁడై

యెవరైన ముని యుండునేమో, యతని యనుగ్రహమున నింటికిఁ బోవచ్చునని నెమకుచుండ వరూథిని యతనిఁ జూచినది.

అతనిని కామించినది. ఎదుటికి వచ్చి నిలబడినది. అతఁడామె వద్దకుఁ జేరి తన కథనంతను జెప్పి దారిఁ జెప్పుమని వేడుకొనెను. ఆమె తన నప్సరసగాఁ దెలిపి తన్ను వలచి రక్షింపుమన్నది. అతఁడు నిత్య కర్మ భంగమును సహింపలేక తన యూరికిఁ బోవు నుపాయమును జెప్పుమనెను. ఆమె 'ఇక్కడి భోగములు మీ మందిరమునఁ గలుగునే? ఇట నన్ను కూడి రమియింపు'మనుచుఁ జక్కఁ గౌఁగిలించినది. అతఁడు త 'న్నంట కంటకు' మని తన కగ్నివలనఁ గల్గు సుఖముల నేకరువు పెట్టెను. ఆమె 'నన్నుఁ జంపక కొన్నాళ్లైనను భోగించి నా కోరిక తీర్పు' మన్నది. అతఁడు 'పరవనితారతి' కీడని గురులు సెప్పిన వాక్యానుసారమప్పని నొల్లక, యాచమించి, శుచియై యగ్నిదేవుం బ్రార్థించి తత్ప్రసాదలబ్ధజవంబున నిజగృహంబున కరిగెను.

మనుచరిత్రలో—సిద్ధుఁడు గుతపకాలమున (మధ్యాహ్నోత్పరము) వచ్చినట్లుసెప్పి, ప్రవరుఁడు హిమగిరి వింతలఁ జూచిన తర్వాత మధ్యాహ్న మయ్యెనని చెప్పుట వలన నది యసంభవమని చర్చింప వలసివచ్చినది. మూలమునఁ గాలనియమములేదు, పగలింటి లోపలననే మందు పని చేయుననియుఁ జెప్పఁబడి నందునఁ బ్రవరుఁ డా మర్నాఁడే వెళ్లెనని కథ కలియుచు నీశంకను దీర్చుచున్నది.

అదికాక, వరూథిని కౌఁగిలించు కొన్నాక జరిగిన వాదోప వాదము నిందు ముందుగానే జరిగినట్లుజెప్పి, కౌఁగిలించు కొనిన తర్వాత నామెను గెంటి, యామె సాపేక్షగా నినిన మాటలకు సరకు సేయక, ప్రవరుఁ డామె యొడలి కలయిక నంటిన గందమును గడిగి కొని వార్చి యగ్నిదేవుం బ్రార్థించెనని మార్చుట యెంతయు గమ ణీయతా పాదకముగా నున్నది.

మూలమున—కలియను గంధర్వుఁడు మున్ను వరూథినిని వలచియు నామెచేఁ తిరస్కృతుఁడై యిప్పు డీ విషయమును దివ్య జ్ఞానముచేఁ దెలిసి ప్రవరు రూపుఁబూని యామె కగపడి 'కలియు

నపుడు కనుమూయవలె' నని చెప్పిననియమము నిందు 'నిదియస్మద్దేశ వ్యవహారము కన్నఁ దెఱవ నఘమగు' ననుట యెంతయు సమయస్ఫూర్తినిఁ దెల్పుచున్నది. పాపభీతికలవారట్టి నియమములఁ బాటింపకపోరు.

స్వరోచి వేటవర్ణన మిందుఁ గేవల కల్పితమే. 'స్వారోచిష జననానంతరము స్వరోచి గిరినిర్ఝర ప్రదేశముల విహరించుచు హంసమిధునముఁ గాంచెను. తన్నురమింపుమని కోరిన హంసితో హంస 'నేను స్వరోచిఁగాను. విషయ సుఖములఁదనిసి విరక్తుఁడనైతి'ననును. అది విని స్వరోచియు విరక్తుఁడై, సపత్నీకుఁడై తపోవనముల కరిగి ఘోరతపం బొనర్చి నిష్కల్మషత్వంబునొంది యమరలోకంబు లందె' నని మూలమున నున్న కథ నిందేలకో పెద్దనగారు విడచిరి. ఇట్లు కొన్ని మార్పులను, జేర్పులను జేసి యాంధ్రకవితాపితా మహు లిద్దానిని రసభరితముఁ జేసిరి.

ఇందలి శైలికీ క్రిందివి మచ్చు తునుకలు.

తావుల్ క్రేవలఁజల్లు. మను. ఆ. 2. ప. 22.
మృగమద సౌరభవిభవ...మారుతమొలసెన్. ఆ. 2. ప. 24
అటఁజనికాంచె...శీతశైలమున్. ఆ. 2. ప. 3
వాలారుంగొనగోళ్ల... దేశాక్షికిన్. ఆ. 3. ప. 57
జిలుఁగులఁ బెట్టుచున్...నిచ్చెనోయనన్. ఆ. 5. ప. 68

ఔచిత్యనిర్వహణము

అల్లదెకంటె సానపౌన...వాలుమెకంబుల్. ఆ. 4. ప. 16
తిమిరంపుగుబ్బచన్నుం...మదమేమిటికిన్. ఆ. 4. ప. 83

కల్పనాచాతురి

మరునకొసంగఁగాలము. . నెత్తె నత్తఱిన్. ఆ. 3. ప. 21

భావప్రకటన

మునుమున్ఫుటెడు...పద్మంబులన్. ఆ. 2 ప. 30
నోములునోచినమ్మలు...అక్కటా! ఆ. 3. ప. 29
ఎంతతపంబుసేసి...అంబుజాననా. ఆ. 3. ప. 8

ఎన్నిభవంబులం గలుగు ... భాగ్యముల్. ఆ. 2. ప. 57

స్వభావపరిజ్ఞానము

పలుకులు నేర్పు వేళ ... కీర శారికల్. ఆ. 3 ప. 58
ఏవిహంగముఁ గన్న ... చక్రవాకి. ఆ. 3. ప. 16

ఇది యతని భాషాంతరీకరణ పాటవమునుఁ జాటుచున్నది.

మూలము. ఆయాతి యాతి పునరేవజలం ప్రయాతి
పద్మాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ ।
ఉన్మత్తవద్భ్రమతి కూజతి మందమందం
కాంతావియోగవిధురో నిశి చక్రవాకః.

ఇందున్న చక్రవాకమే అనువాదమున స్వారస్యమునకై చక్రవాకిగా మార్చబడినది. ఇతఁడు లోకోక్తులనుఁ గైకొని చక్కఁగాఁ జిత్రించును. 'మదకలకుంభి ... ఆ. 1. 41.' దీనిలోని కల్పన పుట్టి మునుక యను లోకోక్తిని బట్టి చేసినది. 'క్రూరవనేభదంత ... పట్టణంబులన్' ఆ. 1. 36 ఇందు గిజిగాడులు మిణుగురు పురుగులను తన గూండ్లలో వెలుతురునకై చేర్చియుంచుకొను నను ప్రకృతి చిత్ర మిందుఁ జక్కఁగాఁ జెప్పఁబడినది. అంతేకాదు, పీఠికలోని కృష్ణరాయ వంశాది వర్ణనమునఁ బ్రతిపద్యమునను నిరుపమాన కల్పనా చాతురి కన్పడుచుండును.

పూర్వకవులలోని విషయములనే పరిగ్రహించు నెడ వానికన్న నందముగా వర్ణించిన పట్టులఁ బరికింపుఁడు.

ఉడిగి మడింగి మై మఱచియున్న తఱిం గలలోనఁ జేరె నె
క్కడి మగవాఁడొకో యనుచుఁ గందగఁ మేల్కనుచో నతండ యి
ప్పుడు మగఁడంచుఁ గోరుటకుఁ బొందుగఁ జెప్పితి ముల్లువుచ్చి కొ
ఱ్ఱడఁచిన చందమయ్యెఁ గమలానన యావిరహానలంబునన్.
సోమన. ఉత్తరహరివంశము.

ఉడుపతి శారికి న్వెఱచి ... మను. ఆ. 3. 34.

మ. అనుమానింపక యాసుధాంధసులు మాయాకల్పనావంచనం
బున వైశ్వానరునిన్ సారించిరి యపుంబో యింతమాత్రంబలో
నన నాయోగమహానుభావమునకున్ భంగంబువాటిల్లునే
పనికల్గాచిన పెండ్లిమానునొకో ? దుశ్చారిత్రముల్గంటికే.

కాశీఖండము. శ్రీనాథుడు.

శా. తండ్రీ నాకు ... గుండ్రాడాచిన పెండ్లి యేమిటికిఁజిక్కున్ ?

మను. ఆ. 5. 17.

సీ. పులిమల్లుఁ డడవిపోతులరాజు గరుడుండు
గాలివేగంబు పందేల పసిఁడి
విష్ణుప్రసాదంబు వెండిగుండులపరి
పచ్చిమిర్యము వెఱ్ఱిపుచ్చకాయ
వేఁటమాణిక్యంబు విరవాదిమెడబల్మి
పెట్టుగాఁడు వకారిపిడుగుతునుక
జిగురుడు చిత్రాంగి శ్రీరామబాణంబు
పులియండు కస్తూరి బొండుమల్లె

గీ. యనఁగ మఱియును బెక్కుతోయముల పేళ్లు
దారకులు దేరవచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజ విగ్రహములు
నటుకనాథుని వాహ్యాళివాహనములు.

శృంగార శాకుంతలము. పినవీరభద్రకవి.

పులియఁడుబూచిగాఁడు ... యుద్ధతిన్. మను. ఆ. 4. ప. 32

పినవీరన శాకుంతలములోని వేటవర్ణనముఁగొని చక్కగా వర్ణించెను. మారన మార్కండేయ పురాణము ననుసరించియే పెంపొందింపఁబడినదగుటచే నందలి రచన లిందుఁ గొన్ని కన్పడును. శ్రీనాథుని రచనలఁ దలఁచినవాఁడగుటచేఁ బెద్దన నుడికారములను చమత్కారముల నచ్చోచ్చోటులఁ జొనిపెను 'మిన్నులువడ్డచోటు, కొలముసాములు, వెన్నతోఁబెట్టినది, కడుపారఁ గన్నతల్లి, హుటాహుటినడలు, చన్నవిసిపిదుకన్, బండి కండెనవోలు' మొదలైన

నుడికారములు శ్రీనాథునినుండి తేఁబడినవే. పోలికలఁ గొన్నింటిని గమనింపుఁడు.

సీ. అని యమ్మహాభాగుఁడాచమన మొనర్చి
నియతుండు శుచియునై నిలిచి గార్హ
పత్యాగ్నిదనమది భావించి వందన
మొనరించి యిట్లను ననిలమిత్ర !
నీయంద యాహవనీయాగ్నియును దక్షి
ణాగ్నియుఁ బ్రభవించె నఖిలదేవ
తలకును దృప్తినీవలన సిద్ధించును
సకలలోకముల కాశ్రయము నీవ
ఆ. నిత్యసత్యమూర్తి నీ ప్రసాదంబున
నినుఁడు గుంకకుండ నిపుడ యింటి
కరుగువాఁడఁగాక యాగమోదితకర్మ
జాత నైష్ఠికుండ నైతి నేని.

మార్క. ఆ. 4. ప. 252.

దివిషద్వర్గము... ఆ. 2.75 దానజపాగ్నిహోత్ర. ఆ. 2.76.

తే. అనఘమందార విద్యాధరాత్మజన్మ నే విభావసి యనుదాన.

మార్క. ఆ. 5. 6 ఆ.

తే. అనఘ మందార విద్యాధరాత్మభవను; ననువిభావసి.

మను. ఆ. 6.17

సీ. సంపూర్ణ పూర్ణిమాసాంద్ర చంద్రాతప
విలసిత శశికాంత వేదికలను
మంజరీ సంజాత మకరంద నిష్యంద
మాకంద మాధవీ మండపముల
శృంగారవనమహా శృంగారమణిశృంగ
హాటకశైల శృంగాటకముల
సంఫుల్లహల్లక సహకారవాసనో
జ్జ్వలదీర్ఘ దీర్ఘికా సైకతముల
గగన గంగాతరంగిణీ గంధవాహ
బంధురోదగ్రసౌధాగ్రభాగములను

నవనవోల్లాస రతికళానైపుణముల

బ్రతిదినంబు రమించిరి సతియుఁ బతియు.

జక్కన, విక్రమార్క చరిత్ర.

సీ. గంగాతరంగిణీ...సామ్రాజ్రిఁజెంది. మను. ఆ. 6. ప. 2

సీ. నలినసంభవు సాహిణము వారువంబులు
కొలముసాములుమాకుఁగువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబులతూండ్లు
భోజనంబులుమాకుఁ బువ్వుబోఁడి
సత్యలోకముదాఁక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మామాటలు వినంగ
నమృతాంధసులె యోగ్యు లనుపమాంగి

గీ. భారతీదేవి ముంజేతిపలుకుఁ జిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్లఁ
దరుణి నీయాన ఘంటాపథంబుమాకు.

శృంగార నైషధము.

సీ. చిన్నివెన్నెలకందు...గోత్రామరేంద్ర. మను. ఆ. 2. ప. 43

సీ. గిరినికుంజములఁ గుంజరపుంజమను శంకఁ
గంఠీరవంబు లుత్కంఠనెగయుఁ
బల్వలంబుల గిరిప్రకరంబులను శంక
నెఱుకరాజులు విండులెక్కుపెట్టఁ
గడలి మధ్యంబునఁ గాకోలమను శంక
జలదేవతలు భీతి సంభ్రమింప
నదముల గువల కాననవాటి యనుశంక
నిందిందిరశ్రేణు లెదురుకొనఁగ

గీ. రజతగిరియందుఁ దాండవారంభరభస
భంగిపతిత పరశ్వథపాణి వికట

కంధరారుద్ధ గజకృత్తి కంఠశంక
బ్రమఘనులకుఁ ద్రోఁప నంధకారంబు బ్రబలె.
భీమఖండము ఆ. 2. 35 ప. శ్రీనాథుఁడు.

సీ. ఉరుదరీకుహరా . . జకరారుణాతపములు. మను. ఆ. 3. ప. 11.
సీ. పతిపాణిపల్లవచ్యుత నీవిబంధనవ్యగ్రబాలాహస్తవనరుహంబు
ధవకృతాధరబింబదశన క్షతవ్యథాభుగ్న లీలావతీభ్రూలతంబు
శృంగారనైషధము.
సీ. సహసా నఖంపచ . . . శయ్యానిపాత . . . మను. ఆ. 3. ప. 116.
చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరు సోనలై
యుసరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱునట్లుగన్.
కాశీఖండము.
ఉ. పాటునకింతులోర్తురె . . . చిందువందఁగన్. మను.ఆ.2.ప.70

ఇట్లెన్నో పోలిక లున్నవి. పై యేడ్పుపద్యములఁబట్టియే తిమ్మన పారిజాతాపహరణములోను, వసుచరిత్రమున రామరాజభూషణుఁడును బద్యముల వ్రాసిరి. ఆ పద్యములఁగూర్చి తెనాలి రామలింగకవి 'ముక్కు తిమ్మన ముద్దుగా నేడ్చినాఁడు, బట్టుమూర్తి బావురుమని'యేడ్చినాఁడు, అల్లసానిపెద్దన అటునిటు నేడ్చె'నని పరిహసించెనట! మనుచరిత్రలోని పద్యములకుఁ బ్రతిబింబములుగాఁ దరువాతి ప్రబంధములలో నెన్నోపద్యములు వెలసినవి.

సాధారణముగాఁ బ్రబంధమున నష్టాదశవర్ణన లుండవలయును. నగర, అర్ణవ, శైల, ఋతు, చంద్రోదయ, సూర్యోదయ, ఉద్యాన, జలక్రీడా, మధుపాన, రతోత్సవ, విప్రలంభ, వివాహ, కుమారోదయ, మంత్ర, ద్యూత, ప్రయాణ, యుద్ధ, నాయకాభ్యుదయ వర్ణనములు. అందు 'అర్ణవ, మధుపాన, మంత్ర,ద్యూత' వర్ణనలిందు లేవు. కనుక చతుర్దశవర్ణనలే యున్నవి. 'ఏషామష్టాదశానాంమధ్యేకైశ్చిదూన మపీష్యతే. ప్రతాపరుద్రీయము. కావ్య. 71. (అందు కొన్ని లేకున్నను మహాకావ్యత్వమునకు భంగములేదు)' అని. బహువచననిర్దేశముచే నాలుగు తగ్గినను నిది మహాప్రబంధమనుట నిర్వివాదము.

# కథా సంవిధానము

సాధారణముగా సంస్కృత కావ్యములలో వస్త్వైక్యములేదు. రఘువంశము దిలీపుని వర్ణనతోఁ బ్రారంభమై యగ్నివర్ణుని వర్ణనతో ముగియుచున్నది. అట్లే దీనిలోను వరూధినీ ప్రవర వృత్తాంతము మూఁడాశ్వాసములతో ముగియుచున్నది. నాల్గవ యాశ్వాసమున నారంభమైన స్వరోచి కథ యాఱవ యాశ్వాసమునఁ గొంత వఱకే కలదు. తర్వాత స్వారోచిషమనువృత్తాంతముతోఁ బ్రబంధము ముగియుచున్నది. అట్లు కథలో విచ్ఛిత్తియున్నను లోకస్వభావాను రూపముగా నద్దానిని మలపు శక్తి పెద్దన్న కున్నది. అతఁడు చక్కని యౌచితిని బోషించి యీ యితివృత్తమును నడపించెను. ఇతని శిల్పముచేతనే యిది మనోజ్ఞముగా నున్నది.

మనోభావములనుఁ జక్కఁగా స్ఫుటపఱచు పదముల వాడుటలో నితనికి కౌశలము మెండు. ప్రవరుని స్వరూప స్వభావవర్ణన, సిద్ధప్రవర సంభాషణ చదువఁగానే ప్రవరుని శాంతమూర్తి కన్నులకుఁ గట్టకపోదు. ఇప్పట్టున 'వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి, ... ఆ 1. 52; మానినాథకుటుంబ జంబాల పటల ఆ 1. 64' వీనినిఁ జదివినచో నతని భావము గోచరించును.

తర్వాత ప్రవర వరూధినీ సంభాషణమున శాంత శృంగార రసములకుఁ జెరియొక తట్టునను జరిగినవాదము వర్ణనాతీతము. ఇచ్చట కాామినులు సూక్తులకు నెట్టి యర్థముఁజెప్పి యువకులను మోసగించి తమ వలలో వేసికొందురో, అందుకై వారుచేయు ప్రయత్నములును చక్కఁగా నిరూపింపఁబడినవి. మఱియు వైదికుల ప్రాపంచిక సుఖ విముఖత, వైదిక కర్మిష్ఠతయుఁ జక్కఁగా వర్ణింపఁబడెను. 'ఎన్ని భవంబులం గలుగు ... జేర్చు భాగ్యముల్. ఆ. 2. 57.' అను వరూధిని స్వపక్షస్థాపన ప్రయత్నము, 'ఈ పాండిత్యము నీకుఁదక్క ... మీ సంప్రదాయార్థముల్. 2. 64.' అను ప్రవరుని యుత్తరము నెంతో యౌచితిని నిర్వహించినవి. ఇట్లు చూపఁగొడంగినచోఁ బొత్తమంతయుఁ జూపవలసి యుండును. సర్వత్ర రసభరితమైయున్న ప్రబంధమున నెచ్చోటు రసమగుపడదు?

ఇం దొండు రెండు శబ్దదోషము లున్నవి. 'పణిన సూనుకణాద ఆ 1. 12' లో పణిన సూనుపద మసాధువు. శ్రీనాథుఁడు 'పణినా

పత్యోక్త శాస్త్రంబులో' అని వాడినాఁడు. పెద్దన దానినే యనుసరించెను. వ్యాకర్తయగుపాణిని 'పాణిన' ముని సంతానము; కాని 'పణిన' సూనుఁడుగాఁడు. కావున దీని సమర్థింప వీలుచిక్కదు.

'కొఱఁతంబడున్ సుకవి మను. ఆ. 1. 9.' లోఁగొఱఁతయను పదమున్యూనతయను నర్థమున సరియగుఁగాని. 'శూల' మను నర్థమునఁ గుదురదు. కొఱుశబ్దమునుండి యట్టి రూపమేర్పడదు.

'కౌఁగిలదియెక్కడ' ఆ. 3. 5. అనుచోట 'కౌగిలి+అది' అనుచోట నికారసంధి చేయఁబడినది. 'అనాశ్వాసిత దుఃఖతేమనసి సర్వమసహ్యమనెన్నఁటుంగవే. ఆ.3. 99' ఇట 'అనన్నెఁటుంగవే' అను సంధి పోతన ప్రయోగానుసారము ప్రయోగింపఁబడినది. దానినిఁగొందఱు 'అసహ్యము నా నెఱుంగవే' అని సర్దిరి.

సుధారసపూర్ణమగు పెద్దన్న గారి కవితాఝరిలో నీనలుసులు లెక్కలోనివి కావు. ఇతనికి సాటి కవులు లేరు; కనుకనే తిట్టుకవియగు కవిచౌడప్ప సైతము.

'పెద్దన వలెఁగృతి సెప్పినఁ బెద్దన వలె, నల్పకవినిఁబెద్దన వలెనా?
యెద్దనవలె మొద్దనవలె, గ్రద్దనవలెఁ గుందవరపుకవిచౌడప్పా!'

అని మెచ్చుకొన్నాఁడు. కృష్ణరాయలవంటి రాజచంద్రుని, పెద్దనవంటి కవినిఁ గను భాగ్యమిఁక నెప్పటికైనను మన యాంధ్రమాత కబ్బునా? ఈ కృతికర్తయుఁగృతిభర్తయు ధన్యులు.

దీనిని ప్రాచీన పండిత సరణినిబట్టి నా బుద్ధిఁబొచ్చినంతవఱకు సవిమర్శనముగా వ్యాఖ్యానించితిని. ఇందేమైన దోసఁగులుపొసఁగెనే గుణ పక్షపాతులగు పండితులు నన్ను క్షమింతురుగాక! ఎన్నో సాధక బాధకముల కోర్చి యిద్దాని నిట్టితఱి ముద్రించి ప్రకటించిన ప్రకాశకుల కెంతయుఁ గృతజ్ఞుఁడను. విద్యార్థికు లిప్పట్టున మాకుఁ జేదోడిత్తురని ప్రార్థించుచున్నాను.

| | |
|---|---|
| విజయవాడ. | ఇట్లు, బుధజనవిధేయుఁడు, |
| క్రీ. శ 30—11—59 | కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి. |
| శా. శ. 9.మార్గశిరము 1881. | |

# కథాసంగ్రహము

ప్రథమాశ్వాసము; వింధ్య హిమాచలములమధ్య దేశమున, వరణానదీ తీరమున అరుణాస్పద మను పురముండెను. అందు ప్రవరుడను బ్రాహ్మణ యువకుడుండెను. అతడు సోమయాజి, నిత్యాగ్నిహోత్రి; శిష్యుల కెల్లప్పుడును స్వాధ్యాయము చెప్పుచుండువాడు. తల్లి దండ్రు లింటిపెత్తనము చేయుచుండ, ఇల్లాలు తోడునీడయై పాదసేవలు సేయుచుండ నతడు కాలము గడుపుచుండెను. అతని భార్య అతిథిపూజలో అన్నపూర్ణ వంటిది. అతనికి తీర్థయాత్ర చేయవలెనని కుతూహలము. అందుచే యాత్రికులు వచ్చిరని వినుటతో నెదురేగి, తీసికొనివచ్చి, ఆతిథ్యమిచ్చి, వారినానాయాత్ర లందలి విశేషములడిగి తెలిసి కొనును.

ఒకనాడొక సిద్ధుడతనియింటికి వచ్చెను. అతని కాతిథ్యమిచ్చి, విశ్రాంతి తీసికొనుచుండ యాత్రావిశేషములు చెప్పుమని యడిగెను. అతడు 'నాల్గుదిక్కుల మధ్య నున్న తీర్థయాత్ర లన్నిటిని సేవించితిని. అక్కడి విశేషములు చూచితీరవలయునే కాని చెప్పుట కలవికాదు' అనెను. 'మీవయస్సు చాల తక్కువ. ఇన్నియెట్లుతిరుగగల్గిరి?' అని ప్రవరుడుప్రశ్నించెను. అతడు'రహస్యమైనను మీకు చెప్పుచున్నాను. నాయొద్ద పాదలేప మను సిద్ధౌషధమున్నది. దానిని కాలికి పూసికొన్నచో వాయువేగముతో పోవచ్చును' అనెను. ప్రవరునికి వేడుకకల్గినది. అతనిని కోరినాడు. సిద్ధుడు తన సజ్జలో బరిణలోని మందు తీసికాలికి పూసినాడు. ప్రవరుడు హిమవత్పర్వతమున కేగదలచు కొనెను.

ద్వితీయాశ్వాసము: తలచుకొనుట తడవుగా నతడు హిమవత్పర్వతముపై వ్రాలెను. అక్కడి విశేషములు చూచెను. మధ్యాహ్నమైనది. మరునాడు వచ్చి మరలచూడ వచ్చునని యింటికి వెళ్లదలచెను. కాని పాపము! అతని పాదలేపము మంచునకు కరగిపోయినది. కాళ్లులేవలేవు. అతని కప్పుడు తెలిసినది తనతప్పు. అనేక క్షేత్రములు లుండగా నీపాడు కొండకేల వచ్చితినిరా? యనుకొని

సిద్ధాశ్రమములకై వెతకుచుండగా నొక దివ్యభవనము కనిపించినది. అతడక్కడికేగుసరికక్కడ నొక దివ్యాంగన యున్నది. ఆమెను చూచి అతడు తొణకక బెణకక 'దారితప్పి వచ్చితిని. నీవెవరవో నన్ను ప్రజలలో చేర్చి పుణ్యము కట్టుకొనుమమ్మా తల్లీ!' అని ప్రార్థించినాడు. ఆమె యాతని చూడగానే మన్మథునిబారికి చిక్కినది. 'నేను వరూథిని యను నప్సరసను. నిన్ను వలచితిని. నాతో నిక్కడ సుఖముగా నుండు' మన్నది. అతడు దారిచెప్పుమనియే వేడెను. అతనిని తనవైపు త్రిప్పుకొనుటకై యెంతో ప్రయత్నించినది. 'కలంచునే సతుల మాయలు ధీరచిత్తంబులన్' ఆమె కడకతని కౌగిలించుకొన్నది. అతడామెను త్రోసివేసి గంగలోనికేగి, ఆమెయొంటి నుండి తనకంటినమంచి గంధము కడిగికొని, అగ్నిదేవుని ప్రార్థించినాడు. ఆతడా దేవు నావేశముచే ప్రొద్దుగ్రుంకక మునుపే యిల్లు సేరెను.

మూడవయాశ్వాసము: తాను దేవతాస్త్రీ; మానవుని కోరినది. అతడు కాదని గెంటిపోయినాడు. ఆమె కారాత్రి జాగరణమే శరణమైనది. చెలులూరడించిరి. ఎట్లో తెల్లవార్చినది. అతడా ప్రాంతముననుండకపోవునాయని వనవిహారమునకని అతని వెదకుటకై చెలికత్తెలతో సాటామె బయల్దేరినది.

ఆమె నంతక్రితమొక గంధర్వుడు కోరినాడు. ఆమె యతని నొల్లలేదు. ఈసమయము తెలిసికొన్నాడు. వెంటనే ప్రవరుని వేషముతాల్చి, ఆయుద్యానములో జటచెప్పుచు పువ్వులు కోయుచు నామెకు కన్పించెను. అమ్మయ్య! బ్రతికితినని య్యామె పరుగు పరుగున వెళ్లి అతనిని 'ఇంకెక్కడికిపోదువు? రాత్రి బాధించితివు, చాలు. రమ్మ'ని చేతులు పట్టుకొన్నది. అతడు 'నేను వెళ్లుట యికకల్ల. కాని నాషరతుల కంగీకరించినచో నీవద్దకు వత్తును. లేదా యిక్కడనే తపము చేసికొందును' అనెను. ఆమె షరతులజెప్పుమన్నది. 'నేను వెళ్లుదు నన్న వరకు నీవుపొమ్మనరాదు. పరదేశినిగదా అని నీయిష్టమువచ్చి నట్లు నన్నందువేమో అని ముందుగా మాట్లాడు చున్నాను. సంగమ వేళ కన్నుమూసికొనవలెను. (ఇది తన కామరూపము బయట

పడకుండ కోరినది) అట్లయిన వత్తున' నెను. ఆమె యంగీకరించినది. ఆమెకు కావలసినది అతని దేహము. ఎన్ని పరతులైననేమి? అతని కామె కావలెను. ఇద్దరును సుఖముగా కోర్కెలుతీర కాపు రము చేసిరి.

కొన్నాళ్ళకామె గర్భవతియైనది. ఇక తనకు కల్గు సుఖము తగ్గుటయే కాక ప్రమాదవశమున తన మాయ బయట పడెనా ప్రాణము మీదికి వచ్చునని అతడామెతో మెల్లగా 'ఈవేళ నాకు పాదలేపమును రాసిన సిద్ధుడగపడినాడు. మాయింటి దగ్గర పరిస్థితి బాగుగా లేదని చెప్పినాడు. ఆపాదలేపరహస్యము చెప్పినాడు. వచ్చుచుపోవుచుందునులే. వెళ్లివత్తును'ని ఆమెనోదార్చి తన దారిని తాఁబోయెను.

నాలవయాశ్వాసము: ఆమెకు పుత్రుడు కల్గినాడు. అతని పేరు స్వరోచి. అతడు పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు నేర్చినాడు. మందరపర్వత ప్రాంతమున విశ్వకర్మ నిర్మితమైన నగరమున నాటవి కులకు రాజై రాజ్యము సేయుచుండెను. ఒకనాడతడు వేట కేగెను. అక్కడ నొక స్త్రీ అతని శరణుకోరినది. ఆమె నతడడుగగా తన కథ నిట్లుచెప్పినది. 'నేను మనోరమ యను నొక గంధర్వ కన్యను. నాతండ్రి ఇందీవరాక్షుడను గంధర్వరాజు. మందారుడను విద్యా ధరుని కూతురు విభావసియు, పారుడను బ్రహ్మర్షి కూతురు కళా వతియు నాచెలులు. మేమొకనాడు కైలాసమున పువ్వులకై వనము లలో తిరుగుచు నొక గుహలో వికృతముగా నున్న మునిని చూచి తిమి. నేనామునిని తాకితిని. అతడు తపోభంగమై లేచి కోపముతో 'నావంటి ముసలి వానితో నీకు సరసములా? నిన్ను రాక్షసుడు బాధించు గాక!' యని శపించి, చేతిలోని నాగబెత్తముతో పశు వును మోదినట్లు మోదెను. నాచెలులది చూడలేక, అతనిని మంద లింపగా 'మీకు క్షయరోగము వచ్చు' నని వారిని శపించెను. వారట్లు రోగదూషితలైరి. నన్నొక రాక్షసుడు మూన్నాళ్లనుండి తరుముచున్నాడు. నావద్ద అస్త్రహృదయమను విద్య యున్నది. దాని పరిగ్రహించి అతనిని జంపు' మని యావిద్యనుపదేశించినది.

అంతలో రాక్షసుడు వచ్చెను. అతడు స్వరోచి సైన్యమును క్రమింగి వేసెను. స్వరోచి యతని నెదుర్కొని ఘోరముగా యుద్ధముచేసి చివరకుఆగ్నేయాస్త్రముచే నతనిచంపెను. అతడు గంధర్వుడై నిలిచెను.

పంచమాశ్వాసము: 'నేనిందీవరాక్షుడను. నీకు మేనమామను. ఒకముని శాపమున నిట్లయితి'నని చెప్పుచుండమనోరమ వచ్చి తండ్రికి నమస్కరించినది. శాపకథను చెప్పుమనగా నతడిట్లు చెప్పెను. బ్రహ్మమిత్రుడనుముని శిష్యులకాయుర్వేదము చెప్పు చుండగా నాకు చెప్పుమని కోరితిని. అతడు రాచ బిడ్డలకు నేర్పుననెను. నీకోసమై ముట్టెత్తుకొందునా? అనినేనెట్లయిన నతనివలన విద్య నేర్వదలచిశాంబరీ మాయచే బ్రాహ్మణ బాలుడనై యాయుర్వేదమును పూర్తిగా నేర్చితిని. అప్పుడు నేనుగర్వముతో నిజరూపము దాల్చి 'నీవు నేర్పనంతలో ఆగునా? ఇదిగో నేర్చితిని.' అంటిని. అత డాగ్రహముతో నన్ను రాక్షసుడవు కమ్మని శపించెను. కాలపడి బతిమాలగా శాపమోక్షము ప్రసాదించెను. ఇప్పుడు నీవు నన్ను రక్షించితివి. నా కూతును పరిగ్రహింపు' మనెను. అత డట్టకేల కంగీకరించెను. ఇందీవరాక్షుడు మహావైభవముగా కూతురి వివాహము జరిపి, యాయుర్వేదము నల్లునికరణముగా నిచ్చెను. నలకూబరుడువచ్చి తన తండ్రిసేరిట వధూవరులకు కానుకల జదివించెను.

షష్ఠాశ్వాసము: అది తొలినాటిరాత్రి. గదిలోని కేగినా రావధూవరులు. స్వరోచి పెండ్లికూతును జేరబోయెను. ఆమెదుఃఖించుచున్నది. కారణమేమని బుజ్జగించినాడా రసికుడు. ఆమె తన చెలులు దుఃఖించుచుండ తాను సుఖపడలేనన్నది. వెంటనే వారి రోగము మాన్పుదునని ఆమెతో వారున్నచోటి కేగెను. వారు కైలాసముపై నుండిరి. తన యాయుర్వేద విద్యాప్రభావమున వారి రోగము నాతడు చేతితో తీసివేసెను. వారు సంతోషించిరి. వారు ప్రత్యుపకారముగా నతని కియ్యదగినది తమయొద్ద నొకటున్నదనిరి.

అందు విభావసి 'నేను మందారుడను విద్యాధరుని కూతురను. పేరు విభావసి. నాకు మృగ పక్షి భాషలన్నియు తెలియును. ఆ విద్యతోసహా నన్ను పెండ్లాడు'మన్నది. కళావతి 'నా తండ్రి పారు

డను బ్రహ్మర్షి. అతడు తపస్సు చేయుచుండగా నింద్రుడు పుంజిక స్థలయను నప్సరస నంపెను. ఆమె వచ్చి నాతండ్రి తపస్సునకు విఘ్నమాచరించి చూలాలై నది. నన్ను కని, ఒక్కచోట విడిచి పోయినది. చంద్రకిరణము లాహారముగా బెరుగుచుంటిని. నాతండ్రి యొకనాడు నన్నుచూచి జాలిపడి, నన్ను తన యాశ్రమమునకు తీసికొనిపోయి పెంచుచుండెను. నాకు యౌవన మంకురించినది. నా యందము చూచి మోహించిన గంధర్వుడొకడు నన్ను తన కిమ్మని నాతండ్రి నడిగెను. అతడు వారిని నాల్గు తిట్టెను. గంధ ర్వుడు పగబట్టి ఆనాటి రాత్రియే వచ్చి నా తండ్రిని చంపెను. అక్కడి మునులు నన్నోదార్చిరి. తెల్లవారగానే నేనతని కుత్తర క్రియలుచేసి ఆత్మహత్య చేసికొనబోగా పార్వతి ప్రత్యక్షమై నాకు పద్మిని యను విద్య నుపదేశించి 'నీవు స్వారోచిని పెండ్లాడుదువు. మహా వైభవము లనుభవింతు'వని చెప్పి వెళ్లినది. కాన నన్ను విద్యతోసహా పెండ్లాడుము' అన్నది. అతడు వారి నిద్దరినికూడ పెండ్లాడి ఆ విద్యాప్రభావమువలన మహావైభవము లనుభవించు చుండెను.

ఒకనాడాతడు వనములో సరస్సులో భార్యలతోగూడి విహ రించుచుండ నొక యాడుహంస చక్రవాకితో 'చూడు, వారెంత యదృష్టవంతులో, ముగ్గురు నొక్క భర్తతో కలిసియుండిరి.' అన్నది అది 'చాలమంది భార్యలున్నచో వారికి పరస్పరము సుఖ ముండదు. మా దంపతులమే అదృష్టవంతులము' అన్నది. అది తెలి సినది స్వారోచికి. బాధపడినాడు. వందేండ్లు గడచినవి.

మరొకసారి వనములో తిరుగుచుండ నొక మగలేడిని ఆడు లేడులు కొమ్ములతో గీరగా అది 'పలువురతో భోగించుటకు నేను స్వారోచిని కాను.' అన్నది. ఆమాటలు వినుసరికి అప్పుడు చక్రవాకి అన్నమాటలు జ్ఞప్తికి వచ్చినవి. అయినను భార్యలను విడువలేక మరియారువందలయేండ్లా ముగ్గురితో కాపురము చేసెను. వారిలో కళావతికి విభావసుడు, విభావసికి మేరునందనుడు, మనోరమకు విజయుడు నను పుత్రులు పుట్టిరి. వారికతడు వేర్వేరుగా పట్టణముల కట్టించి యిచ్చెను.

ఒకనాడా స్వరోచి వేటాడుచు నొక యడవిపందిని చంపబోగా లేడి యొకటి యడ్డుపడి 'దానినెందుకు చంపుదువు! నన్ను చంపుమ'న్నది. 'నీకంత వైరాగ్యమేల వచ్చె'ననగా 'నే కోరినతడు లభించనపుడు చచ్చుటయే మంచిద'న్నది. అతడు సవిమర్శముగా చెప్పుమనగా నది 'నిన్నే కోరితి' నన్నది. 'అదెట్లు' అన్న స్వరోచి 'నొకసారి కౌగిట జేర్చు'మని కోరినది. అతడట్లు చేయగా నది దివ్యస్త్రీయై 'నేనువనదేవతను. నీవలన మనువు కాదగిన పుత్రుని కనుటకై దేవతలు కోరగా వచ్చితిని.' అన్నది. అత డామె కోర్కె నెరవేర్చెను. ఆమె గర్భవతియై పుత్రుని కన్నది. అతడే 'స్వారోచిషు'డను పేరున పెరిగి దయాధర్మనిరతుడై శ్రీమన్నారాయణు గూర్చి తపస్సుచేసి మనుపదవి నందెను. ఆ స్వారోచిషుడు రెండవ మనువై ప్రజలను తన బిడ్డలవలె నేలెను.

ఇది సంగ్రహ కథ. విపులముగా ప్రబంధము జదివి రసము నాస్వాదింతురుగాత!

ఇట్లు,

**వ్యాఖ్యాత.**



శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

(లఘుటీకా తాత్పర్యసహితము)

## ప్రథమాశ్వాసము



వక్షోజకురంభనాభ మెదపైఁ ♦ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీ♦తి న్నిల్పినాఁడోయనం
గా వందారుసనందనాదినిజభ ♦ క్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు గృతార్థుఁ జేయు శుభదృ ♦ ష్టిం గృష్ణ
రాయాధిపున్॥ 1

శ్రీమన్మహీమండల మండనాయమాన విద్యానగరాధిప శ్రీకృష్ణదేవరాయ సంస్థాన దిగ్గజంబును, 'ఆంధ్రకవితా పితామహ' బిరుదాంకితుండునగు నల్లసాని పెద్దన కవీంద్రుఁడు తా రచింపబోవు స్వారోచిషమనుసంభవం బను ప్రబంధము నిర్విఘ్నముగాఁ గొనసాగుటకును, కృతిపతి యగు రాయల కభివృద్ధి దాయకము గాను మంగళాశీర్వచనముఁ జేయుచున్నాఁడు. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణిప్రథన్తే। వీరపురుషకాణ్యాయుష్మత్పురుషకాణిచ భవన్తి,అధ్యేతారఃప్రవక్తారోభవన్తి'అనుభాష్యోక్త్యనుసారముమంగళకరశ్రీకారమాదినుంచెను. "దేవతావాచకాశ్శబ్దాః యేచభద్రాదివాచకాః। తేసర్వేనైవ నింద్యాస్స్యుర్లిపితోగణతో పివా" అను నార్యోక్త్యనుస్మృతిని శ్రీకారము మంగళప్రదమైనది. 'మోభూమి స్త్రిగురుశ్శుభంవితనుతే' అని మగణము భూమిదేవతాకమై శుభాభివర్ధకమగును.

టీక. శ్రీ=లక్ష్మీదేవియొక్క; వక్షోజకురంగనాభము= స్తనములమీఁది కస్తూరి; ఎదపైన్=వక్షస్థలముపైన; చెన్నొందన్=ప్రకాశింపగా; విశ్వంభరాదేవిన్=భూదేవిని; తత్కమలాసమీపమున=ఆలక్ష్మీదేవికి దగ్గఱగా; ప్రీతిన్=ప్రేమతో; నిల్పినాఁడోయనంగాన్=నిల్పెనోయనుభ్రాంతికల్గునట్లు; వందారు=నమస్కరించు, సనందన+ఆది=సనందనుడు మొదలైన; నిజభక్తశ్రేణికిన్=తనభక్త

బృందమునకు; తోఁచు=తోఁచునట్టి; రాజీవాక్షుఁడు=విష్ణుమూర్తి; కృష్ణ...అధిపున్=శ్రీకృష్ణదేవరాయలును; శుభదృష్టిన్=మంచిచూపుతో; కృతార్థున్=ధన్యునిగా; చేయుతన్=చేయుగాక !

తా: విష్ణుమూర్తి వక్షస్థలముపై రాసికొనిన కస్తూరి చూచి సనందనాది మునులు 'లక్ష్మీదేవి ప్రక్కన భూదేవిని నిల్పెనో' యనుకొనిరట. అట్టి విష్ణుమూర్తి కృతిపతియైన శ్రీకృష్ణదేవరాయలను ధన్యుని చేయుగాక ! ఇది ఆశీర్వచనము. ఇందు భ్రాన్తి చెప్పబడినది కనుక భ్రాన్తిమదలంకారము. శార్దూలవిక్రీడితవృత్తము. లక్షణము:మసజసతతగ. 12. అక్షరముల మీఁదయతి.

ఉ॥ ఉల్లమునందు నక్కటిక♦ మూనుట మీకులమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచ♦ లాత్మజమాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపత♦ దివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల క♦ భీష్టశుభప్రతిపాది గావుతన్ 2

ఉల్లమునందున్=మనస్సులో; అక్కటికమూనుట=దయతలచుట, మీకులమంగున్; కంటిమి=చూచితిమి; అంచున్=అనుచు; అల్లనన్+మెల్లగా(పరిహాసముగా) మేలమాడు+వేళాకోళముసేయు; అచలాత్మజమాటకున్=పార్వతి మాటకు; లేతనవ్వుసంధిల్లన్+చిఱునవ్వురాగా; కిరీటిన్=అర్జునుని; పాశుపతదివ్యశరాఢ్యునిన్=పశుపతి దేవతాకమైన మంత్రరాజము కలవానిగా; చేయు=చేసెడి; శాంబరీభిల్లుఁడు=మాయాకిరాతుడైన శివుడు; కృష్ణరాయలకున్=రాయలకు; అభీష్టశుభప్రతిపాదికావుతన్=కావలసిన శుభములను చేయువాడగు గాక !

తా: పాశుపతమ్మునకై యర్జునుఁడు తపస్సుచేసినప్పుడాతనిఁ బరీక్షింపఁబూని కిరాతవేషముతో వచ్చి యాతనిపై దయఁజూపినవేళ పార్వతి 'మీకులమందు దయ కల్గుట నేటికి చూచితి' మని వేళాకోళము చేయుచుండగా నర్జునునికిఁ బాశుపతాస్త్రమునిచ్చిన శివుడు కృష్ణరాయల కోరికలఁదీర్చుఁగావుత! ఇందు కరుణలేని బోయజాతి యందు దయపుట్టినట్లు చెప్పుటచే విరూపకార్యోత్పత్తికమగు విషమాలంకారము. ఉత్పలమాలవృత్తము. 'భరనభభరలగ' 10 అక్షరముల మీఁదయతి.

ఉ॥ నాలుగుమోముల న్నిగమ♦ నాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిం జనించు రొద♦ తోఁడి గుహావళి నొప్పు మేరువుం
బోలెఁ బయోజపీఠి ముని♦ ముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగమున్న ధాత విభ♦ వోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్॥ 3

టీ: నాలుగుమోములన్=నాలుగు ముఖములందును; నిగమనాదములు=వేదధ్వనులు; ఉప్పతిలన్=పుట్టుచుండగా; ప్రచండవాతూలహతిన్=పెనుగాలిదెబ్బచే; జనించు=పుట్టునట్టి; రొదతోడి=ధ్వనికల్గిన; గుహావళినొప్పు=గుహలతో ప్రకాశించు; మేరువుంబోలెన్=మేరుపర్వతమువలె; పయోజపీఠిన్=పద్మమనుపీఠమందు;

మునిముఖ్యులు=మునిశ్రేష్ఠులు; కొల్వఁగన్=సేవింపగా; వాణిఁగూడి=సరస్వతితో కలసి; పేరోలగమున్న=నిండుసభలోనున్న; ధాత=బ్రహ్మ; కృష్ణరాయనిన్=కృష్ణరాయలను; విభవోజ్జ్వలున్=ఐశ్వర్యముచేఁ బ్రకాశించువానిగా; చేయుతఁగా=చేయుఁగాక!

తా: నాలుగుముఖములతో వేదములు చెప్పుచుండగా, పెనుగాలివీచుటచే ప్రతిధ్వనించుచున్న గుహాలు కల్గిన మేరువువలె ప్రకాశించుచు, సరస్వతీసమేతుడై పద్మాసనముపైఁ గూర్చుండి సభతీర్చిన బ్రహ్మదేవుఁడు శ్రీకృష్ణదేవరాయలకు నైశ్వర్యాభివృద్ధి చేయుఁగాక!

దీనిలో మేరువునకును బ్రహ్మకును, గుహాలకు ముఖములకును, గాలినాదకు వేదధ్వనికిని, పోల్చినందున నుపమాలంకారము. ఇందుఁగొలువుతీర్చిన బ్రహ్మను వర్ణించుటచే రాయల సభ యూహింపబడుచున్నది.

ఉ॥ అంకముఁ జేరి శైలతన ♦ యాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున ♦ నవ్వలిచ న్గబళింపఁబోయి యా
వంక కుచంబుగానక హి ♦ వల్లభహారముఁ గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గ ♦ జాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 4

టీ: అంకమున్=ఒడిని, చేరి, శైలతనయా స్తనదుగ్ధములు=పార్వతిచనుబాలను; అనువేళన్=త్రాగునప్పుడు; బాల్యాంకవిచేష్టన్=పసితనపు గుఱుతైన చేష్టతో; తొండమునన్=తొండములో; అవ్వలిచన్=ఆప్రక్కచంటిని; కబళింపఁబోయి=పట్టుకొనబోయి; ఆవంకన్=ఆరెండవప్రక్క; కుచంబున్=చంటిని; కానక=చూడక; అహివల్లభహారమున్=పామునెడిహారమును; కాంచి=చూచి; వేన్=వెంటనే; మృణాళాంకురశంకన్=లేతతామరతూఁడనెడిభ్రాన్తిని; అంటెడి=పొందునట్టి; గజాస్యునిన్=వినాయకుని; అభీష్టసిద్ధికిన్=కోరికసిద్ధించుకొరకై; కొల్తున్=సేవింతును.

తా: అర్ధనారీశ్వరుని యొడిలో వినాయకుడు పరుండి పాలుద్రాగుచున్నాడు. సామాన్యముగా చంటిపిల్లలు పాలుత్రాగునపుడొక చన్నుత్రాగుచు, రెండవచంటిని చేతులతో నలుపుచుందురు. అట్లే ఆతడు నావల చంటినందుకొనబోగా ఆవైపు పురుషదేహముకాన చన్ను దొరకకపోగా పాము తగిలినది. అది మెత్తగా నున్నందున తామరకాడయను భ్రాంతితో తీయఁబోవు విఘ్నేశ్వరుడు కృష్ణరాయలకు కోర్కెల నిచ్చుగాక! ఇందు భ్రాంతియున్నందున భ్రాంతిమదలంకారము.

సీ॥ చేర్చుక్కగా నిడ్డ ♦ చిన్నజాబిల్లిచే
సిందూరతిలకంబు ♦ చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు ♦ నర దున్న మొలదేఁటి
రుతి కించిదంచిత ♦ శ్రుతుల నీన

ఘన మైనరారాపు ♦ చనుదోయిరాయిడిఁ
దుంబీఫలంబు తుం ♦ దుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ ♦ దంతపుసరకట్టు
లింగిలీకపువింత ♦ రంగు లీన

గీ॥ నుపనిషత్తులు బోటులై ♦ యోలగింపఁ
బుండరీకాసనమునఁ గూ ♦ ర్చుండి మదికి
నించువేడుక వీణ వా ♦ యించుచెలువ
నలువరాణి మదాత్మలో ♦ వెలయుఁ గాత. 5

టీ: చేర్చుక్కగాన్=దగ్గరగాపెట్టు చుక్కగా; ఇడ్డ=పెట్టిన; చిన్నజాబిల్లిచేన్=చంద్రకళచే; సిందూరతిలకంబు=సిందూరపుబొట్టు; చెమ్మగిల్లన్=తడియగా; అవతంసకుసుమంబునందున్న=చెవిలోపెట్టుకొన్నపువ్వునందున్న; ఎలదేఁటిరుతి=కొదమతుమ్మెదల ధ్వని; కించిత్+అంచిత=కొద్దిగాబాగున్న; శ్రుతులన్=రాగము కలియుటకైతీయు శ్రుతులను; ఈనన్=పుట్టించగా; ఘనమైన = గొప్పదైన; రారాపు=దగ్గరగారాయునట్టి; చనుదోయిరాయిడిన్=కుచయుగముయొక్క రాపిడిచే; తుంబీఫలము=వీణకున్న యెండుసొరకాయ; తుంటుడుకుఁజెందన్=అదరగా; తరుణాంగుళిచ్ఛాయన్=మృదువైనవ్రేళ్లకాంతిచే; దంతపుసరకట్టులు=దంతముతో చేసినవీణమెట్లు;ఇంగిలీకపువింతరంగులు=ఇంగిలీకముయొక్కవింతయైనరంగులను; ఈనన్=కల్గించగా; ఉపనిషత్తులు=వేదాంతములు; బోటులై=స్త్రీలై; ఓలగింపన్=సేవింపగా; పుండరీకాసనమునన్=తెల్లతామరపువ్వనెడిగద్దెపై, కూర్చుండి; మదికిన్=మనస్సునకు; ఇంచువేడుకన్=ఇంపైన యుత్సాహముతో; వీణన్, వాయించుచెలువ=వాయించునట్టి; నలువరాణి=సరస్వతి; మదాత్మలోన్=నామనస్సులో; వెలయుఁగాతన్=ప్రకాశించుగాక! తాత్పర్యము తేలికయైనది. మొదటి మూడుపాదములలోను అతిశయోక్తియు, నాలవపాదమున స్వభావోక్తియు నలంకారములు, ఇంద్రగణములారు, నినగణంబులు, రెండు,ప్రతిపాదమున నుండును. ఆటవెలదికాని తేటగీతికాని-చివరనుండ వలెను. సీసము.

క॥ కొలుతున్ మద్గురు విద్యా
నిలయుం గరుణాకటాక్ష ♦ నిబిడజ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి ♦ శఠకోపయతిన్. 6

టీ: విద్యానిలయున్=విద్యలకుస్థానమైనవాని (చదువరిని); కరుణాకటాక్ష=దయతోఁడిక్రీఁదంటి చూపులనెడి; నిబిడజ్యోత్స్నా = దట్టమైన వెన్నెలతో; దళిత=పోగొట్టబడిన; ఆశ్రితజన=భక్తులయొక్క; దురితచ్ఛల=పాపమను; గాఢధ్వాంతసమితిన్=కారుచీకటికలవాని; మద్గురున్ = నాగురువగు; శఠకోపయతిన్=శఠకోపుడను సన్యాసిని; కొలుతున్=సేవింతును.

క్రీగంటిచూపులందు చంద్రికాత్వము నారోపించుటచే రూపకమును, ఛల శబ్దముచే అపహ్నుతియు నలంకారములు.

మ॥ వనజాక్షోపము వామలూరుతనయున్ ♦ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబం ♦ ధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిం ♦ జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జే ♦ ర్కొందు న్వచశ్శుద్ధికిన్. 7

సంస్కృతకవిస్తుతి. టీ: వనజాక్షోపమున్ = విష్ణువువంటి; వామలూరుతనయున్ = పుట్టలో పుట్టిన-వాల్మీకిని; ద్వైపాయనుని = వ్యాసుని; భట్టబాణునిన్ = బాణభట్టును, భాసుని, భవభూతిని, భారవిని; సుబంధుని, బిల్హణుని, కాళిదాసుని, మాఘుని, శివభద్రుని, మల్హణకవిని, చోరుని, మురారిని, మయూరుని, సౌమిల్లిని, దండిని, వచశ్శుద్ధికిన్ = వాక్శుద్ధి కల్గుటకై, ప్రస్తుతులన్ = స్తోత్రములం; చేర్కొందును = స్మరింతును; 'సభరనమయవ' 13 అక్షరములమీద యతి. మత్తేభవిక్రీడితము.

ఆ॥ వ్యాసరచితభార ♦ తామ్నాయ మాంధ్రభా
షగ నొనర్చి జగతిఁ ♦ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్క ♦ నను కృతక్రతు శంభు
దాసు నెఱ్ఱసుకవిఁ ♦ దలఁతు భక్తి.

ఆంధ్రకవిస్తుతి. టీ. వ్యాసరచిత = వ్యాసునిచే రచింపఁబడిన; భారతామ్నాయము = పంచమవేదమనబరగు భారతమును, ఆంధ్రభాషగన్ = తెనుఁగుగా; ఒనర్చి = చేసి; జగతిన్ = లోకమందు, పొగడున్ = కీర్తిని; కనిన = పొందిన; నన్నపార్యున్ = నన్నయ్యను; కృతక్రతున్ = యాగము చేసిన; తిక్కనన్ = తిక్కయజ్వను; శంభుదాసుడను బిరుదుకల ఎఱ్ఱసుకవిన్ = ఎఱ్ఱాప్రెగ్గడను; భక్తిని = భక్తితో; తలఁతున్ = స్మరింతును; విషమపాదమందు మూడుసూర్యగణములు, రెండింద్రగణములు, సమపాదలందు సూర్యగణాలు కల్గి మూడుగణముల మీద యతి కల్గిన అటవెలది.

మ॥ భరమై తోఁచు కుటుంబరక్షణకుఁ గాఁ ♦ ప్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటప్రకరకాం ♦ తారంబునం దర్థపుం
దెరువాటుల్ దెగి కొట్టి తజ్జ్ఞపరిష ♦ ద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై కొఱతం బడుం గుకవి పృ ♦ థ్వీభృత్సమీపక్షితిన్. 9

టీ. భరమై తోఁచు = బరువనిపించిన; కుటుంబరక్షణకుఁగాన్ = ఆలుబిడ్డలరక్షించుటకై; ప్రాల్మాలి = సహింపలేక; చింతన్ = విచారముతో; నిరంతర = దట్టమైన; తాళీదళసంపుట = తాటియాకుల పుస్తకముల యొక్క; ప్రకరకాంతారంబునందున్ = సమూహమను కారడవిలో; అర్థపుందెరువాటుల్ = పదార్థముల (ధనముల) దోపిడి; తెగి = సాహసించి; కొట్టి = చేసి; తజ్జ్ఞ = దాని నెరిగిన; పరిషత్ = సభలలో; విజ్ఞాత

చౌర్యక్రియా=తెలియబడిన దొంగతనము కలవాడగుటచే; విరసుండై=ద్వేషింపబడి; పృథ్వీభృత్సమీపక్షితిన్=రాజుముందర; కుకవి=చెడుకవి; కొఱతంబడున్=తప్పకవగును. కొఱతవేయుటయను శిక్షనందును.

తా. కుకవులు తాము గ్రంథముల వ్రాయలేక కుటుంబపోషణకై ప్రాతతాటియాకుల గ్రంథములదడవి, వాటిలోని పద్యములను తాము వ్రాసితిమని మోసపుత్తురు. ఇందు రూపకాలంకారము,

కం॥ అని యిష్టదేవతావం
దనసుకవిస్తుతులుఁ గుకవి ♦ తతి నిక్కృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు
ననుకూలకథల్ దలంచు ♦ నాసమయమునన్॥ 10

టీ. అని=ఈరీతిగా; ఇష్టదేవతావందన, (మును) సుకవిస్తుతులున్=సుకవుల పొగడుటయు; కుకవితతినిక్కృతియున్=కుకవులసమూహమును నిందించుటయును; చేసి, నవీనకావ్యరచనకున్=క్రొత్తకావ్యమును రచించుటకు; అనుకూలకథల్=తగిన కథలను; తలంచునాసమయమందు=తలచెడివేళ. (ముందుపద్యముతో సమన్వయము)

సీ॥ ఉదయాచలేంద్రంబు ♦ మొదల నెవ్వనికుమా
రతకుఁ గ్రౌంచాచల ♦ రాజ మయ్యె
నావాడపతిశకం ♦ ధరసింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ♦ ఖరతరాసి
కాపంచగౌడధా ♦ త్రీపదం బెవ్వాని
కసివాలుగా నేగు ♦ నట్టి బయలు
సకలయాచకజనా ♦ శాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు ♦ కల్పశాఖ

గీ॥ ప్రబలరాజాధిరాజవీ ♦ రప్రతాప
రాజపరమేశ బిరుద వి ♦ భ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరా ♦ యాగ్రగణ్యుఁ
డొక్కనాడు కుతూహలం ♦ బుప్పతిల్ల. 11

టీ. ఎవ్వని కుమారతకున్=ఎవ్వడు కుమారస్వామి అనుటకు; మొదలన్=మొదట; ఉదయాచలేంద్రంబు=ఉదయగిరి దుర్గము; క్రౌంచాచలరాజను=క్రౌంచమను పర్వతము; అయ్యెన్=అయ్యెనో; ఎవ్వానిఖరతరాసికిన్=ఎవనివాడియైన కత్తికి; నావాడపతిశకంధరసింధురాధ్యక్షులు=నావాడదేశపురాజు; శకంధరదేశరాజు, గజపతియను కళింగరాజులు; అరిగాపులు=కప్పముకట్టెడి సామంతరాజులైరో;

ఎవ్వనికిన్ = ఏరాయలకు; ఆపంచగౌడధాత్రీపదంబు = పంచగౌడదేశములతో కూడిన భూమి (గౌడులు, కన్నడులు, సారస్వతులు, ఉత్కలులు, మైథిలులు, అను పంచగౌడులతో కలిసిన హిందూస్థాన రాజ్యము.) అసివాలుగాన్ = స్వారీగా; ఏఁగు నట్టి బయలు = విహరించు ప్రదేశము; ఎవ్వనిఘనభుజాదండము = ఎవని గొప్పదైనదండము వంటిభుజము; సకలయాచకజన+ఆశాపూర్తికిన్ = యాచకుల కోరికలదీర్చుటకు; కల్పశాఖి = కల్పవృక్షమో, ఎవ్వఁడు; ప్రబల = గొప్పవైన; 'రాజాధిరాజ, వీరప్రతాప, రాజపరమేశ' అను బిరుదవిభ్రాజి = బిరుదులతో ప్రకాశించువాడో; అట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁడు, ఒక్కనాడు, కుతూహలంబు = కోరిక; ఉప్పతిల్లన్ = ఉప్పొంగగా (పల్కెనని ముందుపద్యముతో సమన్వయము)

తా: కుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించినట్లు శ్రీకృష్ణదేవరాయలు ఉదయగిరిదుర్గమును భేదించెను. తరువాత నావాడ, శకంధర, కళింగరాజులదు తనకు కప్పముకట్టునట్లుచేసి, పంచగౌడదేశములను విహారప్రదేశములువలె అడ్డులేకుండచేసి, కల్పవృక్షమువలె యాచకుల కోరికల తీర్చుచు రాజాధిరాజాదిబిరుదములు కల్గిన శ్రీకృష్ణదేవరాయలొకనాడు వేడుకగా. ఇందు రూపకాతిశయోక్తులలంకారములు.

సీ॥ ఇందీవరంబుల ♦ నీనుకాఱ్గిన్నులఁ
శరదిందుముఖులు ♦ చామరములిడఁగ
బణినసూనుకణాద ♦ బాదరాయణసూత్రి
ఫక్కి విద్వాంసు లు ♦ పన్యసింపఁ
బార్శ్వభూమి నభీరు ♦ భటకదంబకరాళ
హేతిచ్ఛటాచ్ఛాయ ♦ నిరులుకొనఁగ
సామంతమండనో ♦ద్దామమాణిక్యాంశు
మండలం బొలసి యీ ♦ రెండ గాయ

గీ॥ మూరురాయరగండపెం ♦ డారమణి మ
రీచిరింఛోళిఁ గలయ నా ♦ వృతము లగుచు
నంకపాళినటద్దుకూ ♦ లాంచలములు
చిత్రిమాంజిష్ఠవిభ్రమ ♦ శ్రీ వహింప॥ 12

టీ: ఇందీవరంబులనీను = నల్లకలువల పుట్టించు; క్రాల్గన్నుల = ప్రకాశించు కన్నులుకల; శరదిందుముఖులు = శరత్కాల మందలి చంద్రునివంటి ముఖముకలస్త్రీలు; చామరములఁ = వింజామరములను; ఇడగన్ = వేయగా; విద్వాంసులు; పణినసూను = పాణినియొక్క; కణాద = కణాదునియొక్క; బాదరాయణసూత్ర = వ్యాససూత్రముల యొక్క; ఫక్కిన్ = రీతిని; (వ్యాకరణ, వైశేషికతర్క, వేదాంతశాస్త్రములను) ఉపన్యసింపన్ = శాస్త్రార్థములు చేయగా; పార్శ్వభూమిన్ = రెండుప్రక్కల, అభీరు =

భయములేని; భటకదంబ=భటసముదాయముయొక్క; కరాళ హేతి+ఘటా=భయంకరమైన కత్తుల సముదాయముయొక్క; ఛాయన్=నీడలతో; ఇరులుకొనఁగన్=చీకటివ్యాపించగా; సామంత=సామంతరాజులయొక్క; మండన=అలంకారములందలి; ఉద్దామమాణిక్య=గొప్పవైనమాణిక్యములయొక్క; అంశుమండలంబు=కిరణసమూహము; ఒలసి=వ్యాపించి; ఈగెండ=లేతయెండ; కాయన్=కాయుచుండగా; మూరురాయరగండ=అశ్వపతి, గజపతి, నరపతి, అను ముగ్గురురాజులకు గండడనుబంటిరిదనుపగ్గ్ముసుకు న్నపదభూషితమైన; కెంపారు=కాలియందెయొక్క; మణిమరీచిరింఛోళి=మాణిక్యకాంతి పుంజముచే; కలయన్=అంతటను; ఆవృతములగుచు=ఆవరించబడినవై, అంకపాళి=ఒడిలో; సటత్+దుకూల+అంచలములు=కదలెడి పట్టు వస్త్రముయొక్క అంచులు; చిత్ర=రంగు రంగులైన; మాంజిష్ఠ=ఎఱుపు, పసుపు కలిసిన రంగుయొక్క; విభ్రమశ్రీన్=విలాససంపదను; వహింపన్=భరింపగా; (కాలిగండపెండేరపు మణికాంతులచే కట్టిన పట్టుబట్ట అంచులు చిత్రవర్ణములు కలవిగా ప్రకాశించు చున్నవి. ఇందు తద్గుణాలంకారము.)

క॥ భువనవిజయాఖ్య సంస

ద్భువనస్థిత సింహపీఠి ♦ ప్రాజ్ఞులగోష్ఠిన్

కవితామధురిమ డెందము

దవులం గొలు వుండి సదయ ♦ తన్ ననుఁ బల్కెన్. 13

టీ: భువనవిజయ+ఆఖ్య=భువనవిజయమను పేరుకల; సంసద్భువనస్థిత=సభాభవనముననున్న; సింహపీఠిన్=సింహాసనమందు; ప్రాజ్ఞులగోష్ఠిన్=పండితప్రసంగమందు; కవితామధురిమ=కవిత్వమందలి మాధుర్యము; డెందముదవులన్=హృదయమునకు హత్తగా; కొలువుండి=కొలువుతీరియుండి; సదయతన్=దయతో; ననున్=నన్నుగూర్చి; పల్కెన్=అనెను. (ఏమనెనో ముందు పద్యములోనున్నది.)

తే॥ సప్తసంతానములలోఁ బ్ర ♦ శస్తిఁ గాంచి

ఖిలము గాకుండు నది ధాత్రిఁ ♦ గృతియ కాన

కృతి రచింపుము మాకు శి ♦ రీషకుసుమ

పేశలసుధామయోక్తులఁ ♦ బెద్దనార్య. 14

టీ: పెదనార్య=పూజ్యుడవైన పెద్దనా! ధాత్రిన్=భూమిలో; సప్తసంతానములలోన్='తటాకము, ఆరామము, నిధి, అగ్రహారము, దేవాలయము, ప్రబంధము, పుత్రుడు' అను ఏడు సంతానములలోను; ప్రశస్తిన్=ప్రశస్తిని; కాంచి=పొంది; ఖిలముకాకుండునది=చెడిపోనిది; కృతి+అ=కృతియ=ప్రబంధమే, కాన, శిరీషకుసుమ=దిరిసెనపువ్వువలె; పేశల=మృదువైన; సుధామయ+ఉక్తులన్=అమృతమయమైన (రసభరితములైన) వాక్కులతో; కృతిన్=ప్రబంధమును; మాకున్+అంకితముగా, రచింపుము. ఉపమాలంకారము.

క॥ హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతి ♦ హాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీఁడు ♦ పేర్కొన నీకున్. 15

టీ; హితుడవు=ఇష్టుడవు; చతురవచః+నిధివి=మాటలనేర్పు కలవాడవు; పురాణ = భాగవతాది పురాణములయొక్క; ఆగమ=పాంచరాత్రాద్యాగమముల యొక్క; ఇతిహాస=భారతాదులయొక్క; కథా+అర్థ=కథలలోని అభిప్రాయము యొక్క; స్మృతియుతుండవు=జ్ఞాపకము కలవాడవు; ఆంధ్రకవితా పితామహుడవు ='ఆంధ్రకవితామహ' బిరుదు కలవాడవు; నీకున్=నీతో; పేర్కొనన్=పేరెత్తుటకు; (చెప్పుటకు) ఈడు=సాటి; ఎవ్వరు=ఎవరును లేరు.

క॥ మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసస ♦ మంచితకథలన్
వినవింపు కలిధ్వంసక
మనఘ భవచ్చతురరచన ♦ కనుకూలంబుల్. 16

టీ: అనఘ=పాపము లేనివాడా! మనువులలోన్=స్వాయంభువుడు మొదలైన పదునల్గురు మనువులలో; స్వారోచిష మనుసంభవము=స్వారోచిషుడను మనువు యొక్క పుట్టుక గాథ; అరయన్=ఆలోచింపగా; రససమంచితకథలన్=రసభరితమైన కథలతో; వినవింపు=వినుటకిష్టమైనది; కలిధ్వంసకము=కలిపాపములనుపోగొట్టునది; భవత్+చతురరచనకున్=నీ నేర్పైన రచనకు; అనుకూలంబున్=తగినది కూడ (అగును)

వ॥ కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పుమని యడిగికర్పూరతాంబూలంబు వెట్టినంబట్టి మహాప్రసాదం బనిమోదంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుఁ బ్రారంభించితి నేతత్కథానాయకరత్నంబగు నమ్మహీనాథువంశావతారం బెట్టి దనిన. 17

టీ: కావున, మార్కండేయపురాణ+ఉక్తప్రకారంబునన్=మార్కండేయ పురాణమున చెప్పబడిన రీతిగా, చెప్పుము, అని; కర్పూరతాంబూలంబు+పెట్టినన్=పచ్చకర్పూరముతో కలిసిన తాంబూలమియ్యగా; పట్టి=పరిగ్రహించి; మహాప్రసాదంబు=గొప్పఅనుగ్రహము, అని; మోదంబునన్=సంతోషముతో; ఆ+మహాప్రబంధనిబంధమునకున్=ఆగొప్ప కావ్యరచనకు; ప్రారంభించితిన్=మొదలు పెట్టితిని; ఏతత్కథానాయక రత్నంబగు=కృతిపతియైన; ఆ+మహీనాథు=ఆకృష్ణరాయల యొక్క; వంశ+అవతారము=వంశారంభము; ఎట్టిది+అనినన్=ఎట్టిదనగా;

సీ॥ కలశపాథోరాశి ♦ గర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ ♦ గన్నతల్లి
యనలాక్షుఘనజటా ♦ వనవాటి కెవ్వాఁడు
వన్నెఁ బెట్టు ననార్త ♦ వంపుఁ బువ్వు
సకలదైవతబుభు ♦ క్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టు గానని మేని ♦ మెట్టపంట
కటికిచీకటితిండి ♦ కరములగిలిగింత
నెవ్వాఁడు తొగకన్నె ♦ నవ్వఁ జేయు
గీ॥ నతఁడు వొగడొందు మధుకైట ♦ భారిమఱఁది
కళల నెలవగువాఁడు చు ♦ క్కలకు ఱేఁడు
మిసిమిపరసీమ వలరాజు ♦ మేనమామ
వేవెలుంగులదొరజోడు ♦ రేవెలుంగు. 18

టీ: కలశపాథోరాశి=పాలసముద్రముయొక్క; గర్భ=లోపలి; వీచిమతల్లి=మంచికెరటము; కడుపారన్=కడుపుతనివితీరునట్లు; ఎవ్వానిన్=ఎవనిని; కన్నతల్లి=కన్నదో; ఎవ్వాడు=ఏచంద్రుడు; అనల+అక్షు=అగ్నినేత్రముగాకల శివుని యొక్క; ఘనజటావనవాటికిన్=గొప్పదైనజటాజూటమునకు; వన్నె+పెట్టు=అందమునిచ్చు; అనార్తవంపుబువ్వు=ఒకేకాలమని కాక యెల్లకాలములలో నుండునట్టి పువ్వో, ఎవ్వాడు; సకలదైవత=దేవతలందరి, బుభుక్షాపూర్తికిన్=ఆకలితీరుటకు; పుట్టుకానని=పుట్టుకతెలియని; మేని=శరీరముకల; మెట్టపంట=మెరకపంటయో; కటికిచీకటితిండి=కటికిచీకటిని తినువాడు; (చీకటిని పోగొట్టువాడు) ఎవ్వాడు; కరముల=చేతుల (కిరణముల) యొక్క; గిలిగింతన్=చక్కిలిగింతలతో; తొగకన్నెన్=కలువయను కన్యను; నవ్వన్=నవ్వునట్లు (వికసించునట్లు) చేయున్=చేయునో; మధుకైటభ+అరి=విష్ణువుయొక్క; మఱఁది=బావమఱఁది (భార్య తమ్ముడు) కళల నెలవగువాఁడు=పదాఱుకళలకు స్థానమైనవాడు, చుక్కలకు ఱేఁడు=నక్షత్రములకు భర్త; మిసిమిపరసీమ=అందమునకు పరమావధి (చాలఅందమైనవాడు); వలరాజు మేనమామ=మన్మథునికి మేనమామ; వేవెలుంగులదొరజోడు=సూర్యునికి జతయైన వాడు; రేవెలుంగు=రాత్రి వెలుగువాడు (అయిన) అతడు=చంద్రుడు; పొగడు+ఒంగున్=ప్రసిద్ధిపొందియుండును.

తా: పాలసముద్రమున పుట్టినవాడు, శివునిజటాజూటమునకు పుష్పమైనవాడు, దేవతల కాహారమైనవాడు (దేవతలు చంద్రుని కళల నాహారము తిందురని శ్రుతి)కలువలను వికసింపజేయువాడు, లక్ష్మీదేవి తోబుట్టినవాడు, పదాఱుకళలుకలవాడు; నక్షత్రముల భర్త, కాంతినిధి, సూర్యుని జతగాడు, (పగలు సూర్యుడు, రాత్రి చంద్రుడు ప్రకాశించుచు నీడుజోడుగా నుందురు)నైన చంద్రుడు ప్రసిద్ధుడైయుండును.

తే॥ ఆసుధాధాము విభవమ ♦ హాంబురాశి
కుబ్బ మీఱంగ నందనుఁ ♦ డుదయ మయ్యె
వేదవేదాంగశాస్త్రార్థ ♦ విశద వాస
నాత్తధిషణాధురంధరుం ♦ డైన బుధుఁడు 19

టీ: ఆ=చెప్పబడిన; సుధాధాము=అమృతకిరణుఁడైన చంద్రుని యొక్క; విభవమహా+అంబురాశికిన్=సంపదయను సంద్రమునకు; ఉబ్బమీఱంగన్=సంతోషము హెచ్చుగునట్లు; వేద=ఋగ్యజుస్సామాథర్వణములను నాల్గువేదములయొక్క, వేద+అంగ='శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము' అను నాఱంగశాస్త్రములయొక్కయు; శాస్త్ర=పాతంజలము, పూర్వ, ఉత్తరమీమాంసలు, న్యాయము, వైశేషికము, సాంఖ్యము అను నాఱుదర్శనములయొక్క; అర్థ=అర్థమందు; విశద=స్వచ్ఛమైన; వాసనా=పరిచయముచే; ఆత్త=పొందబడిన; ధిషణా=బుద్ధియొక్క; ధురంధరుడు=సారముకలవాడు, ఐన; బుధుడు=బుధుడను పేరుకల; నందనుఁడు=కొడుకు; ఉదయమయ్యెన్=పుట్టెను.

తా: ఆచంద్రుని యైశ్వర్యమతిశయించునట్టుల, వేదశాస్త్రార్థవేత్తయై బుద్ధిమంతుడైన బుధుడను కొడుకు చంద్రునికి పుట్టెను.

క॥ వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి యుదయించె సింహ ♦ సదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం
డై నెగఁడె నతండు గనె య ♦ యాతి నరేంద్రున్. 20

టీ: వానికిన్=ఆబుధునకు; ప్రజ్ఞానిధి=ప్రజ్ఞకల; పురూరవుడు=పురూరవుడనురాజు; ఉదయించెన్=పుట్టెను; తత్+భూజానికిన్=ఆరాజునకు; సింహసదృశుఁడు=సింహమువంటివి; ఆయువు=ఆయువనురాజు; తనయుండై=కొడుకై; నెగడెన్=అభివృద్ధిపొందెను; అతఁడు=ఆయువు; యయాతినరేంద్రున్=యయాతియనురాజును; కనెన్=కనెను.

తా: ఆబుధునకు పురూరవుడు, ఆతనికి ఆయువు, అతనికి యయాతియు పుట్టిరి.

క॥ అతనికి యదు తుర్వసులను
సుతు లుద్భవమొంది రహిత ♦ సూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించెఁ దుర్వ ♦ సుఁడు గుణనిధియై. 21

టీ: ఆతనికిన్ = ఆయయాతికి; అహితసూదనులు = శత్రువులజంపువారు; కళా + అన్వితమతులు = విద్యాబుద్ధులు కలవారు (నైన); యదుతుర్వసులు = యదువు,తుర్వసుడు; అనుసుతులు = అనుకొడుకులు; ఉద్భవమొందిరి = పుట్టిరి; వారిలోన్ = వారిలో; తుర్వసుడు, గుణనిధియై = గుణవంతుడై; విశ్రుతకీర్తిన్ = ప్రసిద్ధమైన కీర్తిని; వహించెన్ = పొందెను.

తే॥ వానివంశంబు తుళువాన్వ ♦ వాయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుద ♦ యంబు నొంది
నిఖిలభువనపరిపూర్ణ నిర్ణిదరికీర్తి
నధికులైరి తదీయాన్వ ♦ యమునఁ బుట్టి. 22

టీ: వానివంశంబు = ఆతుర్వసుని వంశమే; తుళువ + అన్వవాయము = తుళువ వంశము; అయ్యెన్ = ఆయెను; అందున్ = ఆవంశమున; పెక్కండ్రు = చాలమంది; నృపులు = రాజులు; ఉదయంబున్ + ఒంది = పుట్టి, నిఖిలభువన = అఖిలలోకములందును; పూర్ణనిర్ణిద్ర = నిండిప్రకాశించు; కీర్తిన్ = కీర్తితో; అధికులైరి = తోడివారలమించిరి; తదీయ = అతనిసంబంధమైన; అన్వయమునన్ = వంశమున, పుట్టి (ముందున కన్వయము)

మహాస్రగ్ధర.

ఘనుఁడై తిమ్మక్షితీశా ♦ గ్రణి శరకమఠ
♦ గ్రావ సంఘాతవాతా
శనరాడాశాంతదంతి ♦ స్థవిరకిరుల జం
♦ జాటము ల్మాన్పి యిమ్మే
దిని దోర్దండైకపీఠిం ♦ దిరముపఱిచి కీ
♦ ర్తిద్యుతుల్ రోదసిం బ
ర్వ నరాతుల్ నమ్రులై పా ♦ ర్శ్వములఁ గొలువఁ దీ
♦ వ్రప్రతాపంబు సూపెన్. 23

టీ: తిమ్మక్షితి + ఈశ + అగ్రణి = తిమ్మరాజు; ఘనుడై = గొప్పవాడై; శర కమఠ = మాయతాబేలు (ఆదికూర్మము) యొక్క; గ్రావసంఘాత = కొండలగుంపు యొక్క; వాత + అశనరాట్ = గాలి మేతగాగల పాములరాజైన ఆదిశేషునియొక్క; ఆశా + అంతదంతి = దిక్కులచివరనున్న గజములయొక్క; స్థవిరకిరుల = ముసలి అడవి పందులు (ఆదివరాహము) యొక్కయు; జంజాటముల్ = భారములను; మాన్పి; ఈ + మేదినిన్ = ఈభూమిని; దోర్ + దండ + ఏకపీఠిన్ = దండములవంటి చేతులనెడి పీఠ

ముపై; తిరముపటిచి=స్థిరముగానుంచి; కీర్తిద్యుతుల్ = కీర్తియొక్క కాంతులు; రోదసిన్=భూమ్యాకాశములమధ్యను; పర్వన్=వ్యాపించునట్లు; అరాతుల్ = శత్రువులు; నమ్రులై=వంగినవారై; పార్శ్వములన్=రెండుప్రక్కలందును; కొల్వన్ =సేవింపగా; తీవ్రప్రతాపంబు=తీక్ష్ణమైన ప్రతాపమును; చూపెన్=చూపెను.

తా: తిమ్మరాజు రాజై ఏకచ్ఛత్రాధిపత్యముగా భూభారమును వహించుచుండగా, అదివరలో భూమి భారమును మోయునట్టి ఆదికూర్మవరాహములు, శేషాహి,కులపర్వతములు, దిగ్గజములును బరువుతగ్గి సుఖించినవి. అనగా అంతధర్మముగా పాలించెనని భావము. శత్రువులనణచి కీర్తిసంపాదించెను. అతిశయోక్తి అలంకారము.

క॥ వితరణఖని యా తిమ్మ
క్షితిపగ్రామణికి దేవ ♦ కీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ
డతిపుణ్యుఁడు పుట్టె సజ్జ ♦ నావనపరుఁడై. 24

టీ: వితరణఖని=దానమునిచ్చుటలోగనివంటి; ఆతిమ్మక్షితిపగ్రామణికిన్= ఆతిమ్మరాజునకు; దేవకీదేవికిన్=దేవకియనుపట్టపు రాణికిని; అంచితమూర్తి=అంద మైనశరీరము కలవాడు; అతిపుణ్యుడు=మిక్కిలి పుణ్యముకలవాడునైన; ఈశ్వర ప్రభుడు=ఈశ్వరరాజు; సత్+జన+అవనపరుడై=మంచివారిని రక్షించుటయం దాసక్తికలవాడై; పుట్టెన్=పుట్టెను.

చ॥ బలమదమత్తదుష్టపుర ♦ భంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలపయిఁదొంటియీశ్వరుఁడె♦యీశ్వరుఁడై జనియింప రూపఱెన్
జలరుహనేత్రిలం దొఱఁగి ♦ శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెఁడు శత్రుభూపతుల ♦ మేనులఁదాల్చిన మన్మథాంకముల్.25

టీ: బలమద=బలముచేత, గర్వముచేతను; మత్త=మదించిన; దుష్ట=దుష్టులైన (రాజులయొక్క); పుర=పట్టణములను, (త్రిపురాసురులను) భంజనుడై=నాశనముచేయువాడై; పరిపాలిత+ఆర్యుడై=సజ్జనుల రక్షించువాడై, (పార్వతిని రక్షించువాడై) తొల్లి+ఈశ్వరుడె=మునుపటిశివుడే; ఇలపయిన్=భూమిపై; ఈశ్వరుడై =ఈశ్వరరాజై; జనియింపన్=పుట్టగా; జలరుహనేత్రలన్=పద్మమువంటికన్నులు కల్గిన స్త్రీలను భార్యలను; తొఱఁగి=విడిచి; శైలవనంబులన్=కొండలందు; అడవులందును; భీతచిత్తులై=భయపడిన మనస్సుకలవారై; మెలఁగెడు=తిరిగెడు; శత్రుభూవరుల మేనులన్=శత్రురాజుల శరీరములందు; తాల్చిన=ధరించిన; మన్మథ+అంకముల్=మన్మథచిహ్నములు; రూపఱెన్=నశించెను.

తా: ఈశ్వరరాజు, త్రిపురాసుర సంహారముచేసి లోకరక్షణచేసి పార్వతిని రక్షించిన పరమేశ్వరుని వలె దుష్టులైన రాజులనెల్ల జయించి, శిష్టుల రక్షించుచుండగా, అతని శత్రురాజులు భార్యలను విడిచి కొండలు, అడవులుపట్టిపోయి శ్రం

గారచేష్టలనే మరచుట ఈశ్వరుడు వచ్చెను భయముతో మన్మథచిహ్నములు నశించి నట్లుండెనని కవిచమత్కరించినాడు. రూపకాలంకారము.

సీ॥ నిజభుజాశ్రితధారు ♦ ణీవజ్రకవచంబు
దుష్టభుజంగాహి ♦ తుండికుండు
వనజేక్షణామనో ♦ ధన పశ్యతోహరుం
డరిహంససంసద ♦ భ్రాగమంబు
మార్గణగణపిక ♦ మధుమాసదివసంబు
గుణరత్నరోహణ ♦ క్షోణిధరము
బాంధవసందోహ ♦ పద్మవనీహేళి
కారుణ్యరసనిమ్న ♦ గా కళత్రుఁ
గీ॥ డన జగంబుల మిగులఁ బ్ర ♦ ఖ్యాతిఁ గాంచె
ధరణిధవదత్తవివిధోప ♦ దావిధాస
మార్జితశ్రీవినిర్జిత ♦ నిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి ♦ యీశ్వరుండు. 26

టీ: ధరణిధవ...ఈశ్వరుడు; ధరణిధవ=రాజులచేత; దత్త=ఇయ్యబడిన; వివిధ=నానావిధములైన; ఉపదావిధా=కానుకలచే; సమార్జిత=సంపాదింపబడిన; శ్రీవినిర్జిత=సంపదచే జయింపబడిన; నిర్జర+ఆలయ+ఈశ్వరుడు=దేవేంద్రుడు కలవాడు; తిమ్మభూపతి యీశ్వరుండు=తిమ్మరాజుకొడుకైన యీశ్వరరాజు; నిజ భుజా+ఆశ్రిత=తనబాహువుల నాశ్రయించిన; ధారుణీ=భూమికి; వజ్రకవచంబు =వజ్రకవచమువంటివాడు; దుష్ట=దుష్టులను; భుజంగ=పాములకు; అహితుండికుండు =పాములవాడు; వనజ+ఈక్షణా=పద్మమువంటి కన్నులుకల (స్త్రీల) యొక్క; మనః+ధన=మనస్సనెడిధనమునకు; పశ్యతోహరుడు=చూచుచుండగానే హరించు వాడు; అరిహంససంసత్=శత్రువులను హంసలగుంపునకు; అభ్ర+ఆగమంబు= మేఘమువచ్చు (వర్ష) కాలము; మార్గణగణపిక=యాచకులగుంపులనెడి కోయిలలకు; మధుమాసదివసంబు=వసంతమాసపురోజు; గుణరత్న=గుణములను రత్నములకు; రోహణక్షోణిధరము=రోహణమను పర్వతము (రోహణమున రత్నములు హెచ్చుగా పుట్టునని ప్రతీతి) బాంధవసందోహపద్మవనీహేళి=బంధువుల సముదాయమునకు సూర్యునివంటివాడు; కారుణ్యరస=దయయనెడినీటికి; నిమ్నగాకళత్రుడు=(నదులు భార్యలుగాగల) సముద్రుడు; అనన్=అనునట్లు; జగంబులన్=లోకములందు; మిగులన్=మిక్కిలి; ప్రఖ్యాతిన్=కీర్తిని; కాంచెన్=పొందెను. అలం రూపకోల్లేఖములు.

తా: నానాదేశపు రాజులు కట్టిన కప్పములతో నైశ్వర్యమున నింద్రునిమించిన తిమ్మరాజు కొడుకగు నీశ్వరరాజు భూమినినిష్కంటకముగా పాలించుచు,

దుష్టులనుబట్టి యేరివేయుచు; సుందరుఁడై శత్రువులరూపుమాపుచు, యాచకులదన్పుచు గుణగణనిధియై, బంధువులకు చేరదగినవాఁడై, దయాసముద్రుఁడై పేరందెను.

క॥ ఆయీశ్వరనృపతికిఁ బు
ణ్యాయతమతియైన బుక్క ♦ మాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి
ధీయుతు లగునారసింహ ♦ తిమ్మనరేంద్రుల్. 27

టీ: ఆయీశ్వరనృపతికి = ఆయీశ్వరరాజునకు; పుణ్య + ఆయతమతియైన = పుణ్యకార్యములందు బుద్ధికల; బుక్కమాంబకున్ = బుక్కమదేవికిని; తేజః + తోయజహితులు = తేజస్సునసూర్యునివంటివారైన; ధీయుతులగు = బుద్ధిమంతులైన; నారసింహ తిమ్మనరేంద్రుల్ = నరసింహరాజు, తిమ్మరాజును; ఉదయించిరి = పుట్టిరి.

క॥ అందు నరసప్రభుఁడు హరి
చందనమందారకుంద ♦ చంద్రాంశు నిభా
స్పందయశస్తుందిల ది
క్కందరుఁడై ధాత్రియేలెం ♦ గలుషము లడఁగన్. 28

టీ: అందున్ = ఆయిద్దరిలో; నరసప్రభుడు = నరసరాజు; హరిచందన = దేవవృక్షము; మందార = మందారము; కుంద = మొల్ల పువ్వు; చంద్రాంశు = చంద్రుని కిరణములతో; నిభ = సమమైన; అస్పంద = నిశ్చలమైన; యశః + తుందిల = కీర్తితోనిండిన; దిక్ + కందరుడై = దిక్కులను గుహలుకలవాడై; కలుషములు = పాపములు, అడఁగన్ = అణఁగగా; ధాత్రి = భూమిని; ఏలెన్ = పాలించెను; కీర్తిని వర్ణించు నపుడు తెల్లనివస్తువులతో పోల్చుట కవిసమయమగుటవలన ఇచ్చట కీర్తిహరిచందనాదులతో పోల్చబడినది. అలం. ఉపమాతిశయోక్తులు,

ఉ॥ శ్రీరుచిరత్వభూతిమతి ♦ జిత్వరతాకృతి శక్తికాంతులన్
ధీరతసారభోగముల ♦ ధీనిధి యీశ్వరనారసింహుఁ డా
వారిజనాభశంకరుల ♦ వారికుమారుల వారితమ్ములన్
వారియనుంగుమామలను ♦ వారివిరోధులఁ బోలు నిమ్మహిన్. 29

టీ: ఈ + మహిన్ = ఈలోకమున; ధీనిధి = బుద్ధికిగనియైన; ఈశ్వరనారసింహుడు = ఈశ్వరరాజు కొడుకైన నరసరాజు; శ్రీరుచిరత్వ = లక్ష్మీప్రకాశనము; భూతి = ఐశ్వర్యము; మతి = బుద్ధి; జిత్వరతా = జయిశీలముకల్గుట; ఆకృతి = రూపము; శక్తి = సామర్థ్యము; కాంతులన్ = కాంతులచేతను; ధీరతన్ = ధైర్యముచేతను; సారభోగములన్ = సారముచేత, భోగముచేతను; ఆ, వారిజనాభ = విష్ణుని; శంకరులన్ = శంకరుని; వారికుమారులన్ = బ్రహ్మను, కుమారస్వామిని; వారితమ్ము

లన్ = మన్మథుని, వీరభద్రుని; వారియనుంగుమామలను = చంద్రుని, మైనాకుని; వారి విరోధులన్ = రాహువును, ఇంద్రుని; పోలున్ = పోలియుండును.

తా: ఈశ్వర నరసరాజు సంపదలో విష్ణువు, ఐశ్వర్యమున శివుడు, బుద్ధిని బ్రహ్మ, జయించుస్వభావమున కుమారస్వామి, చక్కదనమున మన్మథుడు, సామర్థ్యమున వీరభద్రుడు, కాంతిలో చంద్రుడు, ధైర్యమున మైనాకుడు, సారమున రాహువు, భోగమున ఇంద్రుడువలె నుండును. అలం. ఉపమాయథాసంఖ్యములు.

సీ॥ అంభోధివసన వి ♦ శ్వంభరావలయంబుఁ
దనబాహుపురి మర ♦ తకముఁ జేసె
నశ్రాంతవిశ్రాణ ♦ నాసారలక్ష్మికిఁ
గవికదంబముఁ జాత ♦ కములఁ జేసె
గకుబంతనిఖిలరా ♦ ణ్ణికరంబుఁ జరణమం
జీరంబు సాలభం ♦ జికలఁ జేసె
మహనీయనిజవిని ♦ ర్మలయశస్సరసికి
గగనంబుఁ గలహంస ♦ కంబుఁ జేసె

గీ॥ నతిశితకృపాణకృత్తమ ♦ త్తారివీర
మండలేశసకుండల ♦ మకుటసూత్న
మస్తమాల్యపరంపరా ♦ మండనార్చి
తేశ్వరుం డగునారసిం ♦ హేశ్వరుండు. 30

టీ: అతిశిత = మిక్కిలివాడిదైన; కృపాణ = కత్తిచే; కృత్త = తెగగొట్టబడిన; అరివీర = శత్రువీరులైన; మండల + ఈశ = రాజులయొక్క; సకుండల = కుండలములతోగూడిన; మకుట = కిరీటములుకల్గి; సూత్న = క్రొత్తవైన; మస్తమాల్య = తలలమాలలయొక్క; పరంపరామండన = పంక్తియను నలంకారములచే; అర్చిత + ఈశ్వరుండగు = పూజింపబడిన ఈశ్వరుడు కలవాడైన; నారసింహేశ్వరుండు = నరసరాజు; అంభోధివసన = సముద్రమేబట్టగాగల; విశ్వంభరావలయంబున్ = భూమండలమును; తనబాహుపురిమరతకమున్ = తనబాహుపురిలోనిపచ్చగా; చేసెన్ = చేసెను; అశ్రాంత = ఎండతెరిపిలేకుండ; విశ్రాణన + ఆసార = వితరణమను వర్షముయొక్క; లక్ష్మికిన్ = సంపదకు; కవికదంబమున్ = కవులసముదాయమును; చాతకములన్ + చేసెన్ = చాతకపక్షులగా జేసెను; కకుప్ + అంత = దిక్కులచివర్లనున్న; నిఖిల రాట్ + నికరంబున్ = రాజులందరిసమూహమును; చరణమంజీరంబు = కాలియందెలోని; సాలభంజికలన్ = బొమ్మలుగా; చేసెన్; మహనీయ = గొప్పదైన; నిజ = తనయొక్క యశః + సరసికిన్ = కీర్తియనుకొలనుకు; గగనంబున్ = ఆకాశమును; కలహంసకంబున్ = హంసనుగా; చేసెన్ = చేసెను.

తా: నరసరాజు భూమిభారమును తేలికగా వహించెను. కవుల కెన్నో దానముల నిచ్చెను. రాజులనుజయించి, వారిరూపములను తనకాలియందెలపై చెక్కించెను. తన కీర్తి ఆకాశముదాటునట్లు చేసెను. ఎందరో శత్రురాజుల తలల నరికి శివపూజచేసెను. రూపకాతిశయోక్తు లలంకారములు.

తే॥ ఆనృసింహప్రభుండు తి ♦ ప్పాంబవలన
నాగమాంబికవలన నం ♦ దనులఁ గాంచె
వీరనరసింహరాయ భూ ♦ విభుని నచ్యు
తాంశసంభవుఁ గృష్ణరా ♦ యక్షితీంద్రు. 31

టీ: ఆనృసింహప్రభుండు=ఆనరసరాజు; తిప్పాంబవలనన్=తిప్పమువలన; వీరసింహరాయభూమినిభుని=వీరనరసరాయలను, నాగమాంబికవలనన్ = నాగమ్మ వలన; అచ్యుతాంశసంభవున్=విష్ణ్వంశసంభూతుడైన; కృష్ణరాయక్షితీంద్రున్= శ్రీకృష్ణదేవరాయలను; నందనులన్=కొడుకులను; కాంచెన్=కనెను.

క॥ వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుష ♦ ధారాహత వీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధరన ♦ వారణమహిమన్. 32

టీ: వీరనృసింహుడు=వీరనరసరాజు; నిజభుజ=తనభుజమండలి; దారుణకర వాల=భయంకరమైన కత్తియొక్క; పరుషధారా=కఠినమైన అంచు (పదను) చే; ఆహతవీరారి=కొట్టబడిన శత్రువీరులుకలవాడు; అగుచు=అయి; ఏక+ఆతపవార ణముగన్=ఏకచ్ఛత్రముగా (రాజులకు చిహ్నముగా ఛత్రముండును. ఒకే రాజైనచో ఒకే గొడుగుండును.) అవారణమహిమన్=అడ్డులేని సామర్థ్యముతో; ధరన్= భూమిని; ఏలెన్=పాలించెను.

క॥ ఆవిభు ననంతరంబ ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణ ♦ రాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు ♦ దేవేరులుగాన్. 33

టీ: ఆవిభు+అనంతరంబ=ఆవీరనరసరాజుతరువాత; కృష్ణరాయుడు=కృష్ణ దేవరాయలు; చిన్నాదేవియు=చిన్నాదేవియను నామెయు; తిరుమలదేవియున్= తిరుమలదేవియనునామెయు; తనకున్=తనకు; కూర్చుదేవేరులుగాన్=ప్రియమైన పట్టపురాణులుకాగా; ధరావలయమున్=భూమండలమును; తాల్చెన్=ధరించెను.

సీ॥ తొలఁగెను ధూమకే ♦ తుక్షోభ జనులకు
నతివృష్టిదోషభ ♦ యంబు వాసెఁ

కంటకాగమభీతి ♦ గడచె నుద్ధతభూమి
భృత్కటకం బెల్ల ♦ నెత్తువడియె
మాసె నఘస్ఫూర్తి ♦ మరుభూములందును
నెలమూఁడువానలు ♦ నిండఁగురిసె
నాబాలగోపాల ♦ మఖిలసద్వ్రజమును
నానందమున మన్కి ♦ నతిశయిల్లెఁ

గీ॥ బ్రజల కెల్లను గడు రామ ♦ రాజ్య మయ్యెఁ
జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర ♦ నారసింహ
భూవిభుని కృష్ణరాయఁ డ ♦ భ్యుదయ మొంది
పెంపుమీఱంగ ధాత్రిఁ బా ♦ లింపుచుండ. 34

టీ: చారుసత్త్వ+ఆఢ్యుఁడు=మంచిబలము కలిగిన; ఈశ్వరనరసింహ భూవిభుని కృష్ణరాయఁడు=ఈశ్వరరాజు కొడుకైన నరసరాజు కొడుకగు కృష్ణదేవరాయలు; అభ్యుదయము+ఒంది=మేలునుపొంది; పెంపుమీఱంగన్=అభివృద్ధిఅతిశయింపగా; ధాత్రిన్=భూమిని; పాలింపుచుండన్=పాలించుచుండగా; జనులకున్=ప్రజలకు; ధూమకేతుక్షోభ=అరిష్టసూచకమైన తోకచుక్కపొడుచుటవంటిబాధ; తొలగెను=తప్పెను; అతివృష్టి దోషభయంబు = ఎక్కువవానలు కురియునను భయము; పాసెన్=పోయెను; కంటక+ఆగమభీతి=బాధించు బందిపోటుదొంగలు మున్నగువారి వలన భయము; కడచెన్=లేదు; ఉద్ధత=పొగరుకల; భూమిభృత్=రాజులయొక్క; కటకంబు+ఎల్లన్=దుర్గములన్నియు, ఎత్తు+పడియెన్=అణగెను; అఘస్ఫూర్తి=పాపవిజృంభణము; మాసెన్=తగ్గెను; మరుభూములందును=నిర్జలప్రదేశములందుఁగూడ; నెలమూడు వానలు=నెలకుమూడు వానలు; నిండన్=తృప్తిగా; కురిసెన్=వర్షించెను; ఆబాలగోపాలము=పిన్నలు మొదలు పశువులకాపరుల వరకు; అఖిలసత్+వ్రజమును=అందరు సజ్జనుల సమూహమును; ఆనందమునన్=ఆనందముతో; మన్కిన్=బ్రతుకుటతో; అతిశయిల్లెన్=అతిశయించియుండెను; ప్రజలకున్=జనులకు; ఎల్లను=అందరకు; కడున్=మిక్కిలి; రామరాజ్యమయ్యెను=శ్రీరాముడు పరిపాలించునప్పుడునట్లు ఎంతో సుఖకరముగా నుండెను.

మ॥ అలపోత్రిప్రభుదంష్ట్రిభోగివరభో ♦ గాగ్రాశ్రిరా లుద్భటా
చలకూటోపలకోటిరూపు చెడ ని ♦ చ్చల్ రాయగా నైన మొ
క్కలు భూకాంతకు నున్న నయ్యె నరస ♦ క్ష్మాపాలుశ్రీకృష్ణరా
యలబాహామృగనాభిసంకుమదసాం ♦ ద్రాలేపపంకంబునన్. 35

టీ. భూకాంతకున్=భూదేవికి; అల=ఆ; పోత్రిప్రభు=ఆదివరాహము యొక్క; దంష్ట్రి=కోఱయును; భోగివర=ఆదిశేషునియొక్క; భోగ=పడగల

యొక్క; అగ్ర+ఆళి=చివరలపంక్తి యందలి; రాలు=మణులు; ఉద్భట=గొప్పవైన; అచలకోటి=పర్వతశిఖరములందలి; ఉపలకోటి=రాళ్లగుట్టలు; రూపుచెడన్=అందము చెడునట్లు; నిచ్చల్=ఎల్లపుడు, రాయగాన్=ఒరసికొనగా; ఐన=వచ్చిన; మొక్కలు=గంట్లు; నరసక్ష్మాపాలు శ్రీకృష్ణరాయల=నరసరాజు కొడుకైన శ్రీకృష్ణదేవరాయలయొక్క; బాహా=బాహువులందలి; మృగనాభి=కస్తూరి; సంకుమద=జవ్వాదులచే; సాంద్ర=దట్టమైన; ఆలేప=పూతయొక్క; పంకంబునన్=బురదచే; సున్నసయ్యెన్=(గంట్లుతగ్గి)నును పయ్యెను.

తా: భూమినివహించెడి ఆదివరాహముకోఱ, ఆదిశేషుని పడగలమీదిమణులు, కులపర్వతముల శిఖరములమీది రాళ్లు రాయుటచే భూమికి నొక్కులు పుట్టెను. ఆగంట్లు కృష్ణదేవరాయలుభుజమునకు రాసికొనిన కస్తూరి, జవ్వాది మున్నగు గంధపుపూతఅంటుటచే పూడిపోయెను. కృష్ణరాయలు ఆదివరాహాదులకంటెకూడ సున్నితముగా భూభారమును వహించెనని భావము. అతిశయోక్తి అలంకారము,

ఉ॥ కూ్రరవనేభదంతహత ♦ కుడ్యపరిచ్యుతవజ్రపంక్తిఁ బా
ల్పారు మిడుంగురుంబురువు ♦ లంచు వెసం గొనిపోయి ప్రాంతశృం
గారవనద్రుమాళి గిజి ♦ గాడులు గూడులఁ జేర్చు దీపికల్
గా రహిఁ గృష్ణరాయమహీ ♦ కాంతునిశాత్రవపట్టణంబులన్. 36

టీ: కృష్ణరాయమహీకాంతుని=కృష్ణరాయలయొక్క; శాత్రవపట్టణంబులన్=శత్రువుల పట్టణంబులయందు; క్రూరవనేభదంత=కఠినమైన అడవి యేనుగుల దంతములచే; హత=కొట్టబడిన; కుడ్యపరిచ్యుత=గోడలనుండిరాలిన; వజ్రపంక్తిన్=వజ్రములగుట్టను; పొల్పారు=మెరసెడి; మిడుంగురుపురువులంచున్=మిణుగురు పురుగులనుకొనుచు; గిజిగాడులు=బంగారు పిచ్చుకలను పక్షులు; వెసన్=వెంటనే; కొనిపోయి=తీసికొనివెళ్లి; ప్రాంతన్=దగ్గరలోనున్న; శృంగారవనద్రుమ+ఆళిన్=ఉద్యానములోని చెట్లయందలి; గూడులన్=తమగూళ్లలో; దీపికల్ గాన్=దీపములవలె; రహిన్=ఆసక్తితో; చేర్చున్=పెట్టుకొనును.

తా: కృష్ణరాయల శత్రువుల పట్టణములు పాడుపడి అడవులుకాగా అడవియేనుగుల దంతపు దెబ్బలకు గోడల నతికిన మణులు క్రిందికి రాలగా, పిచ్చుకలు వాటిని మిణుగురు పురుగులని పట్టుకొనివెళ్లి తమగూళ్లలో అంటించుకొనుచున్నవి. రాయలు శత్రువుల నెందరినో మట్టుపెట్టెనని భావము. అతిశయోక్తి, భ్రాంతిమదలంకారములు.

సీ॥ తొలుదొల్త నుదయాద్రి ♦ శిలఁ దాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చ ♦ నయి జనించె
మఱి కొండవీ డెక్కి ♦ మార్కొని నలిదైన
యలకసవాపాత్రు ♦ నంటి రాఁజె

నట సాఁగి జమ్మిలో ♦ యఁ బడి వేగ దహించెఁ
గోనఁ బి ట్టేర్చెఁ గొ ♦ ట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ ♦ గరఁచె గౌతమిఁ గ్రాఁచె
నవుల నాపొట్నూర ♦ రవులుకొనియె

గీ॥ మాడెములు ప్రేల్చె నొడ్డాది ♦ మసి యొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు ♦ గలఁగి పఱవఁ
దోఁక చిచ్చన నౌర యు ♦ ద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజా ♦ గ్రన్మహాగ్ని. 37

టీ: కృష్ణరాయ=కృష్ణదేవరాయలయొక్క; బాహుప్రతాప=భుజప్రతాపము యొక్క; జాగ్రత్=ప్రకాశించెడి; మహా+అగ్ని=పెద్దనిప్పు; ఉద్ధురతన్=తెగ మండుటచే; తోఁకచిచ్చనన్=నిప్పంటించిన పిడుకల వరుసయో అన్నట్లు(ఉత్ప్రేక్ష) తొలుదొల్తన్=మొట్టమొదట; ఉదయాద్రిశిలన్=ఉదయగిరియను చెకుముకిరాతిని; తాకి=తగిలి; తీంద్రించు+అసిలోహమునన్=తీవ్రమైన కత్తియను నుక్కువలన; వెచ్చనయి=వేడెక్కి; జనించెన్=పుట్టెను; మఱి=తర్వాత; కొండవీడెక్కి=కొండ వీడు పట్టణము నాక్రమించి; మార్కొనినలిదైన=ఎదిరించినదైన, అలకసవాపాత్రు నిన్=ఆ, కసవాపాత్రుడను రాజును; అంటి=అంటుకొని; రాజెన్=రగుల్కొనెను (కసవాపాత్రుడనుటచే గడ్డియనియు శ్లేషచే తెలియుచున్నది,) అటన్=తర్వాత; సాగి= ముందునకుపోయి; జమ్మిలోయన్ పడి=జమ్మిలోయ యను పట్టణమున (జమ్మిచెట్లు న్నలోయలో) పడి; వేగన్=వేగముగా; దహించెన్=తగులబెట్టెను; కోనన్= కోనయను నడవిని; బిట్టు+ఏర్చెన్=ఎక్కువగా కాల్చెను; కొట్టానన్=కొట్టా మనుదేశమును; తగిలెను=అంటుకొనెను; కనకగిరిస్ఫూర్తిన్=కనకగిరియొక్క అతిశ యమును; కరచెన్=కరగించెను; గౌతమిన్=గోదావరీనదిని; క్రాచెన్=వేడెక్కు నట్లు క్రాచెను; అవులన్=అటుతర్వాత; ఆపొట్నూరన్=పొట్నూరియందు; రవులు కొనియెన్=రగుల్కొనెను; మాడెములు=మాన్యపుభూములను; ప్రేల్చెన్=ప్రేలు నట్లుచేసెను; ఒడ్డాదిన్=ఒడ్డాదియను పట్టణమును; మసియొనర్చెన్=మసిగాచేసెను; గజరాజు=గజపతి; కలగి=కలతచెంది; పఱవన్=పరుగెత్తగా; కటకపురిన్=కట కమను పట్టణమును; కాల్చెను=తగులబెట్టెను; ఔర=ఎంతఆశ్చర్యము!

తా: కవిఈపద్యమునకృష్ణరాయల ప్రతాపమునగ్నిగాచెప్పి అగ్నిలక్ష ణములను చెప్పెను. అవన్నియు రాయలవిజయమును చెప్పునవే. కృష్ణరాయలు మొట్టమొదట ఉదయగిరిపై దండెత్తి, తర్వాత క్రమముగా కొండవీడు, జమ్మిలోయ, వేగి, కోన, కొట్టాము; కనకగిరి, గోదావరీతీరము, పొట్నూరు, మాడెములు, ఒడ్డాది, కటకములను జయించెను. ఇట్లు ప్రతాపాగ్ని తోకచిచ్చువలె ఉదయగిరిలో నంటు

కొని కటకము వరకు వ్యాపించెనని యుత్ప్రేక్షింపబడినది. ఆప్రతాపమునే అగ్నిగా చెప్పుటచే రూపకోత్ప్రేక్షలకిందు సంకరము.

మ॥ ధరకెంధూళులు కృష్ణరాయలచమూ ♦ ధాటీగతి న్వింధ్యగ
హ్వరముల్ దూఱఁగఁ జూచి తారచటఁగాఁ ♦ పై యుండుటం జాలన
చ్చెరువై యెఱ్ఱనివింతచీఁకటులు వ ♦ చ్చెం జూడరే యంచు వే
సారిదిం జూతురు వీరరుద్రగజరా ♦ ట్ఛుద్ధాంతముగ్ధాంగనల్. 38

టీ: వీరరుద్రగజరాట్ = వీరరుద్రగజపతియొక్క; శుద్ధాంతముగ్ధాంగనల్ = అంతఃపురమందలి ముగ్ధలైన స్త్రీలు, తారు = తాము; కృష్ణరాయల = రాయలయొక్క; చమూధాటీగతిన్ = సేనయొక్క దాడి నడచుటచే; ధరకెంధూళులు = భూమిమీఁది యెఱ్ఱనైన పరాగములు; వింధ్యగహ్వరముల్ = వింధ్యగుహలను; దూఱఁగన్ = చొరగా; చూచి; అచటన్ = అక్కడ; కాఁపైయుండుటన్ = కాపురముండుటచే, చాలన్ = మిక్కిలి; అచ్చెరువై = ఆశ్చర్యమై; ఎఱ్ఱని వింత-చీకటులు = ఎఱ్ఱనైనవింతయైనచీకట్లు; వచ్చెన్ = వచ్చెను; చూడరే = చూడుఁడు; అంచున్ = ఒకరితో నొకరనుకొనుచు; వేన్ = వేగముగా; సారిదిన్ = వరుసగా (నిలిచి); చూతురు = చూచుచుందురు.

తా. రాయల శత్రువైన వీరరుద్ర గజపతి భార్యలతోసహా పారిపోయి వింధ్యపర్వతగుహలలో కాపురముండెను. రాయలదండు వచ్చునపుడు రేగిన,కొండ ప్రదేశమగుటచే ఎఱ్ఱనైన ధూళినిచూచి ఆరాజుభార్యలు గోలతనముచేతఅవేవో క్రొత్త చీకట్లనుకొని వారిలోవారు చెప్పుకొనజొచ్చిరి. రాయలపేరు విన్నంతనే గజపతి తనభార్యలతోసహా కొండలకు పారిపోయెననియు, రాయలదండయాత్రవేళ సేననుండి రేగినధూళి చీకటివలె నున్నదనియు భావము. అతిశయోక్తి, ముగ్ధపదము సాభిప్రాయమగుటచే పరికరము, ధూళిని చీకటిగా భ్రమించుటచే భ్రాంతిమదలంకారములు.

చ॥ అభిరతి కృష్ణరాయఁడు జ ♦ యాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ ♦ నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం దిగు సు ♦ రప్రకరంబు కళింగమేదినీ
విభు నపకీర్తికజ్జలము ♦ వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. 39

టీ: కృష్ణరాయఁడు = కృష్ణదేవరాయలు; అభిరతిన్ = ఆసక్తితో; జయ + అంకములన్ = జయచిహ్నములను; లిఖియించి = వ్రాయించి; తాళసన్నిభముగన్ = తాటిచెట్టుగా; పొట్టునూరికడన్ = పొట్నూరివద్ద; నిల్పినకంబము = పాతించిన స్తంభము; సింహభూధరప్రభుతిరునాళ్లకున్ = సింహాచలముమీదనున్న వరాహనరసింహస్వామివారియుత్సవములకు; దిగుసురప్రకరంబు = దిగునట్టిదేవతా సముదాయము; కళింగమేదినీవిభు = కళింగరాజుయొక్క; అపకీర్తికజ్జలమున్ = అపకీర్తియను కాటుకను; వేమఱున్ + పట్టి = పలుమారుచూచి; నిచ్చలున్ = ఎల్లప్పుడును; పఠించున్ = చదువును; (మాసినయక్షరములను చదువుటకు మసిపూయుట పరిపాటి)

తా: కృష్ణరాయలు కళింగదేశ విజయానంతరము విజయమును స్తంభముపై వ్రాయించి పొట్నూరివద్ద నాటించెను. అదిచూచువారికి కళింగరాజుయొక్క అపకీర్తి స్పష్టముగా తెలియుచున్నది. ఈవిషయమునే దేవతోత్సములకువచ్చు దేవతలు, మాసినయక్షరములను మసిపూసి చదువునట్లు ఆ స్తంభములపై, అపకీర్తిని పూసిచదువు దురని చమత్కరించినాడు; రూపకాతిశయోక్త్యలంకారములు.

మహాస్రగ్ధర.

ఏకరాలన్ మండువాసా ♦ హిణములుగల భ
♦ ద్రేభసందోహవాహ
ప్రకరంబుం గొంచుఁ దత్త ♦ త్ప్రభువులు పనుపన్
♦ రాయబారుల్ విలోకో
త్సుకులై నిత్యంబు శ్రీకృ ♦ ష్ణుని యవసరముల్
♦ చూతు రందంద కొల్వం
దక యాప్రత్యూష మాసం ♦ ధ్యము పనివడి త
♦ న్మందిరాళిందభూమిన్. 40

టీ: తత్తత్ప్రభువుల్ = ఆయారాజులు; పనుపన్ = పంపగా (వచ్చిన); రాయబారుల్ = దూతలు; ఏకరాలన్ = మొగసాలలందు; మండువాసాహిణములన్ = మండువాగానున్న గుఱ్ఱపుశాలలందును; కల = వారికున్న; భద్రేభ = మంచిజాతి యేనుగుల; సందోహ = గుంపులను; వాహప్రకరంబున్ = గుఱ్ఱాల గుంపులను; కొంచున్ = కానుకలుగాతెచ్చుచు; విలోక + ఉత్సుకులై = రాజదర్శనమునకు వేడుకకలవారై; నిత్యంబున్ = ఎల్లపుడును; కొల్వు + అందక = దర్శనము దొరకక; ఆప్రత్యూషము = తెల్లవారినది మొదలు; ఆసంధ్యము = సాయంకాలమువఱకు; పనివడి = ప్రయత్నించి; తత్ + మందిర + అళిందభూమిన్ = ఆరాయల యింటిముంగిట; శ్రీకృష్ణునియవసరముల్ = రాయలదర్శన సమయములను; అందున్ + అంగున్ + అ = మఱిమఱి; చూతురు = ఎదురుచూచుచుందురు. 'స, త, త, న, స, ర, ర, ల,' గణములు, 9, 16 అక్షరములుయతి.

తా: ఆయాదేశపు రాజులు కానుకలుగా ఏనుగులను, గుఱ్ఱముల నిచ్చి దూతలనంపగా వారువచ్చి ఆకానుకలను శాలలలోకట్టి ఎప్పుడుప్రభువుదర్శనమగునాయను నాతురతతో నిలబడి నిరీక్షించుచుందురు. వచ్చిన రాయబారులెక్కువగా నుండుటచే దర్శనము త్వరగా దొరకదని భావము. స్వభావోక్తి.

చ॥ మదకలకుంభికుంభనవ ♦ మౌక్తికముల్ గనుపట్టు దట్టమై
వదలక కృష్ణరాయకర ♦ వాలమునం దగుధార నీట న
భ్యుదయము నొందిశాత్రవుల ♦ పుట్టి మునుంగఁగ ఫేనపంక్తితోఁ
బొదిగొని పైపయిన్వెడల ♦ బుద్బుదపంక్తులువోలెఁ బోరులన్. 41

టీ: పోరులన్ = యుద్ధములందు; కృష్ణరాయకరవాలమునన్ = కృష్ణదేవరాయల కత్తియందు; తగుధారనీటన్ = తగినధారనీటియందు; మదకల = మదముచే నొప్పెడి; కుంభికుంభ = ఏనుగుల కుంభస్థలములందలి; నవమౌక్తికముల్ = క్రొత్త ముత్యములు; అభ్యుదయమునొంది = ఎక్కువై; శాత్రవుల = శత్రువులయొక్క; పుట్టి = నీటినిదాటెడు పరికరము; మునుంగగన్ = మునుగగా; ఫేనపంక్తిలోన్ = నురుగులతో; పొదిగొని = కూడి; పైపయిన్ వెడలు = మీదిమీదికి లేచునట్టి; బుద్బుదపంక్తులువోలెన్ = నీటిబుగ్గలవలె, వదలక = ఎల్లప్పుడును; దట్టమై = దట్టముగా; కనుపట్టున్ = కన్పడుచుండును.

తా: కృష్ణదేవరాయలు యుద్ధములందేనుగుల కుంభస్థలముల పగులగొట్టగా నెన్నో ముత్యములు రాలి తేలుచున్నవి. అవి కత్తిధారలో నాశత్రువుల పుట్టిమునుగగా లేచిన నీటిబుగ్గలవలె నున్నవి.

వెదురు బద్దలు మున్నగువాటితో నీటినిదాటుటకై కట్టెడి సాధనమును పుట్టి యందురు. ఏదైనను మునిగినప్పుడు 'పుట్టిమునిగిన' దనుటలోకోక్తి. ఇప్పుడు రాయలు కత్తిపట్టగా శత్రువుల పుట్టి మునుగుచున్నది. ముత్యములు కల్గిన యేనుగులుకల శత్రువులను సైతము తేలికగా రాయలు జయించుచుండెనని భావము.

సీ॥ వేదండ భయదశుం ♦ డాదండనిర్యాంత
వమథువుల్ పైఁజిల్కు ♦ వారిగాఁగఁ
దత్కర్ణవిస్తీర్ణ ♦ తాళవృంతోద్ధూత
ధూళి చేటలఁ జల్లు ♦ దుమ్ముగాఁగ
శ్రమబుర్బుర త్తురం ♦ గమనాసికాగళ
త్ఫేంకంబు వైచుక ♦ ర్దమముగాఁగఁ
గుపితయోధాక్షిప్త ♦ కుంతకాంతారఖే
లనములు దండఘ ♦ ట్టనలుగాఁగఁ

గీ॥ జెనఁటి పగఱప్రతాపంబు ♦ చిచ్చు లార్చు
కరణి గడిదేశములు సొచ్చి ♦ కలఁచి యలఁచు
మూరురాయరగండాంక ♦ వీరకృష్ణ
రాయభూభృద్భయంకర ♦ ప్రబలధాటి॥ 42

టీ. మూరురాయరగండాంక = 'మూరురాయరగండ' అను బిరుదుకల; వీరకృష్ణరాయభూభృత్ = వీరుడగు కృష్ణరాయలయొక్క; భయంకర ప్రబలధాటి = భయంకరమైన గొప్పదైనదాడి, వేదండ = ఏనుగులయొక్క; భయద = భయంకరమైన; శుండాదండ = దండములవంటి తొండములనుండి; నిర్యాంత = వెడలునట్టి, వమథువుల్ = తుంపురులు, పైన్ = మీద, చిల్కు = చల్లెడి, వారి+కాగన్ = నీరుకాగా, తత్+

కర్ణ=ఆ యేనుగు చెవులను, వి స్తీర్ణతాళవృంత=వెడల్పైన విసనకఱ్ఱలచే, ఉద్ధూత=ఎగురగొట్టబడిన, ధూళి=పరాగము, చేటలన్=చేటలతో, చల్లు నుమ్ము+కాఁగన్=చల్లెడి మట్టికాఁగా; శ్రమ=అలసటచే; బుర్బురత్=బురబురలాడు, తురంగమ=గుఱ్ఱములయొక్క, నాసికా=ముక్కులనుండి, గళత్=జాఱునట్టి, పంకంబు=చీమిడి; వైచు=వేసెడి, కర్దముకాఁగన్ = బురదకాఁగా, కుపిత = కోపించిన యోధ=సైనికులచే, ఆక్షిప్త=విసరబడిన, కుంతకాంతారఖేలనములు = ఈటెల, తోఁడియాటలు; దండఘట్టనలు గాఁగన్=కఱ్ఱలతో కొట్టుటకాఁగా, చెనటిపగఱ=దుష్టులైన శత్రువులయొక్క; ప్రతాపంబు చిచ్చులు=ప్రతాపమను నిప్పులు, ఆర్చు కరణిన్=ఆర్పెడి రీతిగా, గడిదేశములు=సరిహద్దు దేశములను, చొచ్చి=ప్రవేశించి, కలఁచి=కలతపెట్టి, అలచున్=అలసిపోవునట్లు చేయును.

తా. నిప్పుమంటలు పెరిగినప్పుడు వాటి నార్పుటకై నీరు చల్లుదురు, చేటలతో దుమ్ముకొట్టుదురు, బురద వేయుదురు, కఱ్ఱలతో మోదుదురు. అట్లే శత్రువుల ప్రతాపాగ్ని రేఁగగా రాయలు సేనలు నడిపించి యుద్ధముచేసి శత్రువుల యుద్ధతి నణగించెను. వారిని జయించెను. ఉత్ప్రేక్షారూపకము లలంకారములు.

—షష్ఠ్యంతములు—

క॥ ఏవంవిధగుణవంతున
కావల్గత్తురగబహువి ♦ ధారోహకళా
రేవంతున కతిశాంతున
కావిష్కృతకీర్తిధవళి ♦ తాశాంతునకున్. 43

టీ. ఏవంవిధగుణవంతునకున్=ఇట్టిగుణములుకల; ఆవల్గత్=అంతట దూఁకుచున్న; తురగ=గుఱ్ఱములయొక్క; బహువిధ+ఆరోహకళా=పలురకములైన ఎక్కుటలయందు, రేవంతునకున్= నేర్పుకల; అతిశాంతునకున్=శాంతమైన, ఆవిష్కృత=వ్యాపించిన, కీర్తి=కీర్తిచే; ధవళిత=తెల్లనగాజేయఁబడిన, ఆశా+అంతునకున్=దిక్కులకొసలుకల, (కృష్ణరాయల కభ్యుదయ పరంపరాభివృద్ధిగా, అని ముందున కన్వయము) 5 పద్యముల తరువాత క్రియయుండుటచే నిది 'కులకము.'

క॥ పుంఖానుపుంఖసైంధవ
రింఖాసంఘాతజాత ♦ రేణూద్గతమో
రింఖద్రిపున్నృపదహర
ప్రేంఖదసుగ్రసనజఠర ♦ భృత్యసిఫణికిన్. 44

టీ. పుంఖానుపుంఖ=ఎడతెగని, సైంధవరింఖాసంఘాత = గుఱ్ఱములగిట్టల త్రొక్కుడులచే, జాతరేణు=పుట్టినధూళియనెడు, ఉద్గతమః=కారుచీకటిలో, రింఖత్=తిరుగాడుచున్న, రిపున్నృపదహర = శత్రురాజుల హృదయములందు, ప్రేంఖత్=చలించెడి,అసు=ప్రాణములయొక్క; గ్రసన=మ్రింగుటచే, జఠరభృతి=కడుపునింపుకొను, అసిఫణికిన్=కత్తియను సర్పము కలవానికి.

తా. ఎక్కువ అశ్వసైన్యముతో దండయాత్రచేసి తన కత్తితో శత్రువులను ఖండించి ప్రాణముల గొనువాడు.

క॥ అవిరళవితరణవిద్యా
నవరాధేయునకు సజ్జ ♦ న విధేయునకుం
గవితాస్త్రీలోలునకున్
ఖవిటంక నటద్యశోబ్ధి ♦ కల్లోలునకున్॥ 45

టీ అవిరళ=ఎడతెగని; వితరణవిద్యా=దానమనువిద్యలో; నవరాధేయునకున్=క్రొత్తకర్ణుడైనవాడు; సజ్జనవిధేయునకున్=పండిత విధేయుడు; కవితాస్త్రీలోలునకున్=కవిత్వమను స్త్రీయందాసక్తిగలవాడు; ఖవిటంక = ఆకాశముమందరను; నటత్ =నటించు; యశః+అబ్ధి కల్లోలునకున్=కీర్తియను సముద్రముయొక్క కెరటములుకలవాడు. దానకర్ణుడు, పండితపోషకుడు, కీర్తివంతుడును.

క॥ దిగధీశాసహ్యధగ
ద్ధగితేద్ధరుచిప్రతాప ♦ తపనస్ఫురణ
స్థగితద్యుమణికి నిమిషా
ర్ధగృహీతకళింగరాజ ♦ తనయాగ్రణికిన్. 46

టీ: దిక్+అధీశ=దిక్పాలకులకు; అసహ్యా=సహింపరాని, ధగద్ధగిత+ఇద్ధరుచి=ధగధగమెరయు; ప్రతాపతపన=ప్రతాపమను సూర్యునియొక్క; స్ఫురణస్థగిత=కాంతిచే కప్పబడిన; ద్యుమణికిన్=సూర్యుడుకలవానికి; నిమిషార్ధ=అరనిమిషములో; గృహీత=గ్రహింపబడిన; కళింగరాజ తనయాగ్రణికిన్=కళింగరాజ కుమారుడు కలవానికి; దిగంతవ్యాప్తమైన ప్రతాపము కలవాడు. కళింగరాజును సులభముగా ఇట్టేపట్టుకొన్నవాడు.

క॥ కరుణాకర వేంకటవిభు
చరణస్మరణప్రసంగ ♦ సంగతమతి కీ
శ్వరనరసింహమహీభృ
ద్వరనందనకృష్ణరాయ ♦ ధరణీపతికిన్. 47

టీ: కరుణాకర=దయకుగనియగు; వేంకటవిభు=వేంకటేశ్వరునియొక్క; చరణ స్మరణ ప్రసంగ=పాదస్మరణమునందు; సంగతమతికిన్=ఆసక్తమైన బుద్ధి కలవాడు; ఈశ్వర...నందన=ఈశ్వరరాజు కొడుకగు నరసింహరాయలసుపుత్రుడగు; కృష్ణరాయ ధరణీ పతికిన్=కృష్ణరాయలను మహారాజునకు.

# కథాప్రారంభము



వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన: జైమినిముని స్వాయంభువమనుకథాశ్రవణానంతరంబున మీఁద నెవ్వాఁడు మనువయ్యె నెఱిఁగింపు మనవుఁడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పినప్రకారంబున నిట్లని చెప్పం దొడంగె.

టీ: అభ్యుదయపరంపరాభివృద్ధిగాన్ = శ్రేయస్సులపరంపర కభివృద్ధికల్గునట్లు; నాయొనర్పన్ + పూనిన = నేరచింప ప్రారంభించిన; మహాప్రబంధమునకున్ = అష్టాదశవర్ణనలుకల గద్యపద్యయుతమైన గ్రంథమునకు; కథాక్రమము = కథవరుస; ఎట్టిది + అనినన్ = ఎట్టిదనగా; జైమినిముని = జైమినియనుముని; స్వాయంభువ... అనంతరంబునన్ = స్వాయంభువమనువుయొక్క కథను విన్నతరువాత; మీఁదన్ = ఆఁగుపై; ఎవ్వాఁడు = ఎవడు; మనువు + అయ్యెన్ = మనువుగావచ్చెను; ఎఱిగింపుము; అనవుడున్ = అనగా; పక్షులు = ధర్మపక్షులు; చెప్పన్ + తొడంగెన్ = చెప్ప నారంభించెను;

జైమినిధర్మపక్షుల నడుగగా-అవి మార్కండేయుడు క్రోష్టికి చెప్పిన రీతిగా చెప్పినవి.

మ॥ వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళిత ♦ ప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నా ♦ ర్యావర్తదేశంబునన్
పుర మొప్పున్ మహికంఠహారతరళ ♦ స్ఫూర్తిన్విడంబించుచున్.

టీ: ఆర్యావర్తదేశంబునన్ = వింధ్యహిమవత్పర్వతముల మధ్యదేశమున; వరణాద్వీపవతీ = వరణానదియొక్క; తట + అంచలమునన్ = తీరప్రాంతమున; వప్రస్థలీ = ప్రాకారములచే; చుంబిత + అంబరమై = తాకబడిన యాకాశముకలదై; సౌధ = మేడలయొక్క; సుధాప్రభాధవళిత = సున్నపుకాంతిచే తెల్లగాజేయబడిన; ప్రాలేయరుక్ + మండలీ = చంద్రమండలమందలి; హరిణంబై = జింకకలదై; మహి = భూమియొక్క; కంఠహార = కంఠహారముయొక్క; తరళస్ఫూర్తిన్ = హారము మధ్యనుండు నాయకమణియొక్క కాంతిని; విడంబించుచున్ = అనుకరించుచు; అరుణాస్పదంబు + అనఁగన్ = అరుణాస్పదమను పేరుతో; పురము = పట్టణము, ఒప్పున్ = ప్రకాశించును.

తా: ఆర్యావర్తదేశమున, వరణానది యొడ్డున అరుణాస్పదమను పట్టణము కలదు. అది ఆకాశమునంటెడి ప్రాకారపు గోడలు, చంద్రమండలములోని జింకను కూడ ప్రకాశింపజేయు తెల్లనిమేడలుఁ; కలిగి భూదేవికి కంఠహారములో నాయకమణి వలె నున్నది. అలం. అతిశయోక్తి, ఉపమ, ఉత్ప్రేక్ష.

సీ॥ అచటి విప్రులు మెచ్చ ♦ రఖిలవిద్యాప్రౌఢి
ముది మది దప్పిన ♦ మొదటివేల్పు
నచటిరాజులు బంటు ♦ నంపి భార్గవునైన
బింకానఁ బిలిపింతు ♦ రంకమునకు
నచటిమేటికిరాటు ♦ లలకాధిపతినైన
మును సంచి మొదలిచ్చి ♦ మనుప దక్షు
లచటినాలవజాతి ♦ హాలముఖాత్తవిభూతి
నాదిభిక్షువుభైక్ష ♦ మైనమాన్చు
గీ॥ నచటివెలయాండ్రు రంభాదు ♦ లైన నొరయఁ
గాసె కొంగున వారించి ♦ కడపఁ గలరు
నాట్యరేఖాకళాధురం ♦ ధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురుఁగొ ♦ మ్మైనచేవ. 50

టీ: అచటివిప్రులు=ఆపట్టణమునందలి బ్రాహ్మణులు; అఖిల విద్యాప్రౌఢిన్=అన్ని విద్యలందలి నేర్పుతో; ముది... వేల్పున్=ముసలితనముచేమతిచెడిన (ట్లుండిన) బ్రహ్మను; మెచ్చరు. అచటిరాజులు. బంటునంపి=భటునిపంపి; భార్గవునైనన్=పరశురామునైనను; బింకానన్=బింకముతో; అంకమునకున్=దగ్గరకు; మేటికిరాటులు=గొప్పవారగుకోమట్లు; అలకాధిపతినైనన్=కుబేరునైనను; మును=ముందుగా; సంచిమొదలు=మూలధనము; ఇచ్చి; మనుపన్=రక్షించుటకు; దక్షులు=సమర్థులు; నాలవజాతి=శూద్రులు; హాలముఖ+ఆత్త=నాగలికొనచే సంపాదింపబడిన; విభూతిన్=సంపదచే; ఆదిభిక్షువు=బిచ్చగాండ్రలో మొదటివాడైన శివుని యొక్క; భైక్షమైనన్=బిచ్చమెత్తుకొనుటనుకూడ; మాన్చున్=మాన్పును; వెలయాండ్రు=వేశ్యలు; నాట్యరేఖాకళా=నాట్యమనుకళతో; ధురంధరనిరూఢిన్=ఎక్కువనేర్పుచే; రంభాదులైనన్=రంభ మున్నగునప్సరస్త్రీలనైనను; ఒరయన్=ఎదుర్కొనగా; కాసెకొంగునన్=చీరచెఱగుతో; వారించి=ఊరకొనపెట్టి; కడపగలరు=వెళ్లింతురు; చిగురుకొమ్మైనన్=లేతచిగురుకూడ (దత్తమండలములలో చివురు చెట్టునుకొకరకపుచెట్టున్నది. అదెంత ముదిరినను చేవపట్టదు, అట్టిదికూడ అక్కడ చేవపట్టునని భావము.) చేవ=గట్టితనముకలది.

తా: ఆపట్టణములోని బ్రాహ్మణులు చదువులో బ్రహ్మను మెచ్చరు. రాజులు పరశురామునైన దగ్గరకు పిలిపింతురు. కోమట్లు కుబేరునికైన నప్పుపెట్టగలరు.

శూద్రులు పంటపండించి శివుని బిచ్చ మెత్తుకొనుటను మాన్పగలరు. వేశ్యలు నాట్యకళలో రంభాదులు పోటీచేసినను పైటతో నివారింతురు. అచ్చట చిగురు కొమ్మైనను చేవగా నుండును. అలం. అతిశయోక్తి.

ఉ॥ ఆపురిఁ బాయకుండు మక ♦ రాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివి ♦ ధాధ్వరనిర్మలధర్మకర్మ దీ
క్షాపరతంత్రుఁ డంబురుహ ♦ గర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవ ♦ రాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై. 51

టీ. ఆపురిన్ = ఆపట్టణమును; మకరాంక = మన్మథునివలె; శశాంక = చంద్రునివలె; మనోజ్ఞమూర్తి = అందమైన దేహముకలవాడు: భాషా+అపరశేషభోగి = భాషలో రెండవ యాదిశేషుడు; (ఆదిశేషుడు పతంజలిగా నవతరించి వ్యాకరణ భాష్యము వ్రాసి భాషను కట్టుదిట్టము చేసినవాడు. ఇతడుకూడ అంతటివాడని భావము.) వివిధ+అధ్వర = సమస్తయాగములందు; నిర్మలధర్మకర్మ = స్వచ్ఛమైన ధర్మకార్యములందు; దీక్షాపరతంత్రుడు = దీక్షయందాసక్తికలవాడు; అంబురుహగర్భకుల+ఆభరణంబు = బ్రాహ్మణజాతి కలంకారమైనవాడు; అనారత = ఎల్లప్పుడును; అధ్యాపన = వేదముల జదివించుటయందు; తత్పరుండు = ఆసక్తికలవాడు; ప్రవర+ఆఖ్యుడు = ప్రవరుడను పేరు కలవాడు; అలేఖ్య = వ్రాయుటకు వీలుకాని; తనూవిలాసుడై = రూపరేఖలుకలవాడై; పాయక = విడువక; ఉండున్ = ఉండును. అలం. రూపకోపమలు.

ఆ॥ వానిచక్కఁదనము ♦ వైరాగ్యమునఁ జేసి
కాంక్షసేయు జార ♦ కామినులకు
భోగబాహ్య మయ్యెఁ ♦ బూచినసంపెఁగ
పొలుపు మధుకరాంగ ♦ నలకుఁ బోలె. 52

టీ: వానిచక్కదనము = వానియందము; వైరాగ్యమునఁజేసి = విరాగముకల్గుటచే, కాంక్షసేయు = అతనికోరెడి; జారకామినులకున్ = జారస్త్రీలకు; పూచిన సంపెఁగపొలుపు = పూచినసంపెగయొక్క అందము; మధుకర+అంగనలకుబోలెన్ = ఆడుతుమ్మెదలకువలె; భోగబాహ్యము = అనుభవింపరానిది! అయ్యెన్ = ఆయెను.

తా: తుమ్మెద అన్ని పువ్వులమీద వ్రాలునుగాని సంపెంగపువ్వుపై వ్రాలదు. వ్రాలినచో అది వెంటనే చనిపోవునట, అందుచే తుమ్మెదలకది పనికిరానట్లే అతడెంత అందమైనవాడైనను జాగవృత్తి లేనివాడగుటచే జారకామినులకు పనికిరాని వాడయ్యెను. అలం. ఉపమ.

ఉ॥ యాగావనమందు యజ్వ యయు ధ ♦ నాఢ్యుఁడునై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి ♦ చేసిన కూరిమిసోమిదమ్మ సౌ
ఖ్యావహ యై భజింప సుఖు ♦ లై తలిదండ్రులు గూడి దేవియున్
దేవరవోలె నుండి యిలు ♦ దీర్పఁగఁ గాపుర మొప్పు వానికిన్. 53

టీ: యాగావనమందున్ = పడుచుదనమున; యజ్వయయున్ = యాగముచేసిన వాఁడును; ధన+ఆఢ్యుఁడునై = ధనవంతుఁడునై; కమనీయకౌతుకశ్రీవిధిన్ = వివాహమందు; కూఁకటుల్ = పిల్లజుట్టులు; కొలిచి = కొలిచిచూచి (ఇద్దరి చిఱుత యీడును సరిచూచి); చేసిన = పెండ్లిచేసిన; కూరిమిసోమిదమ్మ = ప్రియమైన సోమిదేవి; (సోమయాజిభార్య సోమిదేవి) సౌఖ్య+ఆవహ యై = సుఖముచేకూర్చునదై; భజింపన్ = సేవింపగా; సుఖులై = సుఖముకలవారై; తలిదండ్రులు; కూడి = కలిసియుండి; దేవియున్ దేవరవోలెన్ = పార్వతీ పరమేశ్వరులవలె; ఉండి; ఇలుదీర్పఁగన్ = ఇల్లుచక్కబెట్టగా; వానికిన్ = ప్రవరునికి; కాపురము; ఒప్పున్ = జరుగుచున్నది.

తా: అతఁడు ధనవంతుఁడై, తనకీడుజోడైన భార్య తన్ను సేవింపగా పడుచుదనముననే యజ్ఞముచేసి తలిదండ్రులింటిలో సుఖులై యిల్లు సర్దుచుండ సుఖముగా కాపురము చేయుచుండెను.

సీ॥ వరణాతరంగిణీ ♦ దరవికస్వరనూత్న
కమలకషాయ ♦ గంధము వహించి
ప్రత్యూషపవనాంకు ♦ రములు పైకొనువేళ
వామనస్తుతిపర ♦ త్వమున లేచి
సచ్ఛాత్త్రుఁ డగుచు ని ♦ చ్చలు నేగి యయ్యేట
నఘమర్షణస్నాన ♦ మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి ♦ సావిత్రి జపియించి
సైకతస్థలిఁ గర్మ ♦ సాక్షి కెఱఁగి
గీ॥ ఫలసమిత్కుశకుసుమాది ♦ బహుపదార్థ
తతియు నుదికిన మడుఁగుదో ♦ వతులు గొంచు
బ్రహ్మచారులు వెంట రా ♦ బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ దన్ను ♦ మెచ్చిచూడ 54

టీ: వరణాతరంగిణీ = వరణానదియొక్క; దరవికస్వర = కొద్దిగావికసించిన; నూత్నకమల = క్రొత్తతామరపువ్వులయొక్క; కషాయగంధము = పక్వముకాని వాసనను; వహించి = పూని; ప్రత్యూషపవన+అంకురములు = వేకువవేళవీచు పిల్లగాలులు; పైకొనువేళన్ = మీదికితగులునప్పుడు; వామనస్తుతిపరత్వమునన్ = వామన

స్తోత్రముచేయుచు; లేచి=నిద్రలేచి; స+ఛాత్రుడు+అగుచున్=శిష్యులతోకూడినవాడై; నిచ్చలున్=నిత్యమును; ఏగి=వెళ్లి; ఆ+ఏఱు+అన్=ఆనదియందు; అఘమర్షణస్నానము=పాపముపోవుటకై చెప్పు మంత్రములు=అఘమర్షణ మంత్రములు. వాటితో జేయుస్నానము; ఆచరించి=చేసి; సాంధ్యకృత్యమున్=సంధ్యావందనమును; తీర్చి=చేసి; సైకతస్థలిన్=ఇసుకతిన్నెపై; సావిత్రిన్=గాయత్రిని; జపియించి=జపించి; కర్మసాక్షికిన్=సూర్యునికి; ఎఱఁగి=నమస్కరించి; ఫల=పండ్లు; సమిత్+కుశ=సమిధలు దర్భలు, కుసుమాది...తతియున్=పూలు మున్నగు పదార్థములను; ఉదికినమడుగుదోవతులు=ఉతికి మడతపెట్టిన పంచెలు; కొంచున్=తీసికొనుచు; బ్రాహ్మణులు=వటువులు; వెంటన్+రాన్=వెనుక నేరాగా; ప్రజ = జనులు; తన్ను; మెచ్చి; చూడన్=చూచుచుండగా; బ్రాహ్మణుండు=ప్రవరుడు; ఇంటికిన్; వచ్చున్.

శా॥ శీలంబుం గులమున్ శమంబుదమమున్ ♦ జెల్వంపు లేఁబ్రాయముం
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే ♦ భూపాలుఁ డీవచ్చినన్
సాలగ్రామము మున్నగాఁగొనఁడుమా♦న్యక్షేత్రముల్ పెక్కుచం
దాలంబండునొకప్పుడుందఱుఁగదిం♦టంబాడియుంబంటయున్.55

టీ: శీలంబున్=మంచిశీలమును; కులమున్=వంశమును; దమమున్=బహిరింద్రియనిగ్రహమును; శమమున్=అంతరింద్రియనిగ్రహమును; చెల్వంబున్=అందము; లేఁబ్రాయమున్=పడుచుదనమును; పోలన్=తగియుండగా, చూచి=ఆలోచించి; ఇతండు; పాత్రుడని=దానమిచ్చుటకు (ప్రతిగ్రహమునకు) తగిన వాడని; ఏభూపాలుడు=ఏరాజు; ఈన్+వచ్చినన్=ఇయ్యబోగా; సాలగ్రామమున్నగాన్=సాలగ్రామము మొదలు; కొనడు=పరిగ్రహింపడు; మాన్యక్షేత్రముల్=ఈనాములు; పెక్కుచందాలన్=పలురీతులుగా; పండున్; ఇంటన్=ఇంటిలో; ఒకప్పుడున్=ఎప్పుడైన; పాడియున్, పంటయున్; తఱుగదు.

తా: ప్రవరుని పాత్రతచూచి తగినవాడని ఏరాజైన ప్రతిగ్రహముపట్టినను దోషములేని సాలగ్రామము మొదలైనవి తెచ్చియియ్యబోయినను పరిగ్రహింపడు. మాన్యములు పండుచున్నవి. ఇంటిలో పాడిసమృద్ధిగా నున్నది.

తే॥ వండ నలయదు వేవురు ♦ వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియా ♦ నతనిగృహిణి
యతిథు లేతేర నడికిరే ♦ యైనఁ బెట్టు
వలయుభోజ్యంబు లింట న ♦ వ్వారిఁ గాఁగ.

టీ: అన్నపూర్ణకున్=కాశీవిశ్వేశ్వరుని భార్యయగునన్నపూర్ణాదేవికి; ఉద్దియా=సాటియైన; అతనిగృహిణి=ప్రవరుని భార్య; వేవురు=వేయిమంది, వచ్చిరేనిన్=వచ్చినను; వండన్+అలయదు=వండుటకు విసుగుకొనదు; అతిథులు=అన్నము కోరివచ్చునట్టివారు; ఏతేరన్=రాగా; నడికిరేయైనన్=అర్ధరాత్రమైనను; ఇంటన్

=ఇంటియందు; అవార్యరీగాగన్=సమృద్ధముగా; వలయుభోజ్యంబులు=కావలసిన సామగ్రులు; పెట్టున్=పెట్టును.

తా: ఆతనిభార్య వండివడ్డించి అతిథుల తృప్తిపొందించుటలో అన్నపూర్ణకు సాటియైనది. వెయ్యిమంది రానిండు, అర్ధరాత్రముకానిండు, విసుగుకొనక కావలసిన పదార్థములను వండి తృప్తిగా పెట్టును.

సీ॥ తీర్థసంవాసు లే ♦ తెంచినా రని విన్న
నెదురుగా నేగు ద ♦ వ్వెంతయైన
నేఁగితత్పదముల ♦ కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నా ♦ తిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసం ♦ తృప్తులుఁ గాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ ♦ జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు ♦ వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ ♦ తెలియ నడుగు
గీ॥ నడిగి యోజనపరిమాణ ♦ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు ♦ నూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శ ♦ నాభిలాష
మాత్మ నుప్పొంగ న త్తరు ♦ ణాగ్నిహోత్రి. 57

టీ: అత్తరుణాగ్నిహోత్రి=ఆపడుచుసోమయాజి; అనుదినము=ప్రతిదినమును; తీర్థసందర్శన+అభిలాషను=తీర్థముల చూడవలెనను కోరిక; ఆత్మన్=మనసులో; ఉప్పొంగన్=రేకెత్తగా; తీర్థసంవాసులు=తీర్థయాత్రలు చేయువారు; వచ్చినారు+అనివిన్నన్; దవ్వు+ఎంతయైనన్=ఎంతదూరమైనను; ఎదురుగాన్+ఏగున్+ఏగి; తత్పదములకున్=వారిపాదములకు; ఎఱఁగి=నమస్కరించి; ఇంటికిన్+తెచ్చున్=ఇంటికి తీసికొనివచ్చును; తెచ్చి; సద్భక్తిన్=మంచిభక్తితో; ఆతిథ్యము=అతిథిపూజను; ఇచ్చున్=చేయును; ఇచ్చి; ఇష్ట+అన్నసంతృప్తులగాన్=ఇష్టమైన అన్నము, పదార్థములతో తనివిపొందినవారిగా; చేయున్=చేసి; కూర్చున్నచోన్=కూర్చుండగా; చేరవచ్చున్=దగ్గరకుచేరును; వచ్చి; ఈ+ధరన్=ఈభూమిలో; వనధి=సముద్రములు; పర్వత,సరిత్+తీర్థ=కొండలు, నదులు, తీర్థములయొక్క; మాహాత్మ్యముల్=మహత్త్వమును; తెలియన్ = తెలియునట్లు; అడుగున్; అడిగి; యోజనపరిమాణము=ఎన్నియామడలదూరముండునో; అరయన్=తెలిసికొనును; అరసి =పోవలయున్; చూడన్=చూచుటకు; అనుచున్; ఊర్పులు=నిట్టూర్పులు; నిగుడ్చున్=విడుచును; ముక్తపదగ్రస్తము శబ్దాలంకారము.

క॥ ఈవిధమున నభ్యాగత
సేవాపరతంత్రసకల ♦ జీవనుఁ డయి భూ
దేవకుమారకుఁ డుండం
గా విను మొకనాఁడు కుతప ♦ కాలము నందున్. 58

టీ: ఈవిధమునన్ = ఈరీతిగా; అభ్యాగతసేవా = అతిథిసేవయందు; పరతంత్ర = ఆసక్తికల; సకలజీవనుడయి = జీవితమంతయుకలవాఁడై; భూదేవకుమారకుడు = బ్రాహ్మణయువకుడు; ఉండంగన్, వినుము, ఒకనాడు, కుతపకాలమునందున్ = మధ్యాహ్నము దాటిన తర్వాత. (ముందుపద్యమునకు సమన్వయము)

సీ॥ ముడిచినయొంటి ♦ కెంజడమూయ మువ్వన్నె
మెగముతోలు కిరీట ♦ ముగ ధరించి
కకపాలకేదార ♦ కటకముద్రితపాణిఁ
గుఱుచలాతాముతోఁ ♦ గూర్చి పట్టి
యైణేయమైన యొ ♦ డ్డాణంబులవణిచే
నక్కళించిన పొట్ట ♦ మక్కళించి
యారకూటచ్ఛాయ ♦ నవఘళింపఁగ జాలు
బడుగు దేహంబున ♦ భస్మ మలఁది
గీ॥ మిట్టయురమున నిడుయోగ ♦ పట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్షపోఁగులు ♦ చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండి ♦ కయును బూని
చేరెఁ దద్గేహ మౌషధ ♦ సిద్ధుఁ డొకఁడు. 59

టీ: ముడిచిన = ముడివేసిన; ఒంటి = ఒక్కటిగానున్న; కెంపు+జడ = ఎఱుపురంగైనజడ; మూయునట్లు; మూడు+వన్నె మెగము = మూడురంగులుకల మృగము (పులి) యొక్క, తోలు = చర్మము; కిరీటముగన్ = తలపాగగా; ధరించి. కకపాల = కక్షపాలను (సన్యాసులు చంకలో పెట్టుకొను తోలుసంచి) కేదారకటక = పంచలోహములతో చేయబడిన కడియముచే; ముద్రిత = ఒత్తుకొనిన; పాణిన్ = చేతియందు; కుఱుచలాతాముతోన్ = పొట్టిదగుయోగదండముతో; కూర్చిపట్టి = అదిమిపట్టుకొని; ఐణేయమైన = ఆడుజింకతోలుతో చేసిన; ఒడ్డాణంబులవణిచేన్ = నడ్డికిబిగించుకొన్న పట్కాయొక్క బిగువుచే; అక్కళించిన = లోనికణచుకొన్న; పొట్టన్ = కడుపును; మక్కళించి = ఉబ్బించి; ఆరకూట+ఛాయన్ = ఇత్తడిరంగును; అవఘళింపఁగజాలు = తిరస్కరింపదగిన; బడుగుదేహమున = చిక్కినశరీరముపై; భస్మమున్ = విభూతిని; అలఁది = పూసికొని; మిట్టయురమున = ఎత్తైనరొమ్ముపై; నిడుయోగపట్టె =

పాదవైనయోగపట్టె (యోగాభ్యాసము చేయుచున్నట్లుగు నైన జందెము వంటిది) మెఱయన్=ప్రకాశింపగా; చెవులన్=చెవులందు; రుద్రాక్షపోగులు=రుద్రాక్షలనెడి చెవులకమ్మలు; చవుకళింపన్=ఊగుచుండగా; కావిసుబుసంబున్=కాషాయపురంగు బట్టయును; జలకుండికయును=కమండలువును; పూని=ధరించి, ఒకడు; ఔషధసిద్ధుడు=ఔషధసిద్ధికలవాడు; తద్గేహమున్=ఆప్రవరుని యింటిని; చేరెన్=చేరెను.

తా: తలకు పులితోలు టోపీగా పెట్టుకొన్నాడు. పంచలోహముల కడియమున్న చేతితో కకపాలను, యోగదండమును నొక్కిపట్టుకొన్నాడు. నడ్డికి జింకతోలుతో చేసి పట్కాయు, మెడలో యోగపట్టెయు నున్నవి. పచ్చనిశరీరమునకు విభూతిపూసికొన్నాడు; చెవులకు రుద్రాక్షపోగులూగు చున్నవి. కావిచొక్కా తొడిగికొని కమండలువును చేతబట్టి సిద్ధుడొకడు ప్రవరుని యింటికి వచ్చెను.

తే॥ ఇట్లు చనుదెంచు పరమయో ♦ గీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేగి ♦ ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాదిపూజనం ♦ బాచరించి
యిష్టమృష్టాన్నకలన సం ♦ తుష్టుఁ జేసి. 60

టీ: ఇట్లు=పైనచెప్పిన రీతిగా; చనుదెంచు=వచ్చెడి; పరమయోగీంద్రున్=ఉత్తమయోగిని; కాంచి=చూచి; భక్తిసంయుక్తిన్=భక్తితో; ఎదురేగి=ఎదురుగా వెళ్లి; ప్రణతుడు+అగుచున్=నమస్కరించినవాడై; అర్ఘ్య=చేతులుకడిగిగికొనుటకైననీరు; పాద్య=కాళ్లుకడిగికొనునీరు; ఆదిపూజనంబు=మొదలైన విచ్చుపూజను; ఆచరించి=చేసి; ఇష్టమృష్ట+అన్నకలనన్=ఇష్టమైన అన్నమునువండితృప్తిగా పెట్టుటచే; సంతుష్టున్=సంతోషించినవానినిగా; చేసి (ముందున కన్వయము)

క॥ ఎందుడి యెందుఁ బోవుచు
నిందుల కేతెంచి నార ♦ లిప్పుడు విద్వ
ద్వందిత నేఁడు గదా మ
న్మందిరము పవిత్రమయ్యె ♦ మాన్యుఁడ నైతిన్. 61

టీ: విద్వద్వందిత=పండితులచే నమస్కరింప బడువాడా! ఎచుండి=ఎక్కడినుండి; ఎందున్=ఎక్కడికి; పోవుచున్; ఇందులకున్=ఇక్కడికి; ఏతెంచినారలు=వచ్చిరి? సత్+మందిరము=నాయిల్లు; ఇప్పుడుగదా; పవిత్రము+అయ్యెన్ మాన్యుడన్=పూజింపదగినవాడను; ఐతిన్.

క॥ మీమాటలు మంత్రంబులు
మీమెట్టినయెడఁ బ్రయాగ ♦ మీపాదపవి
త్రామలతోయము లలఘు
ద్వ్యోమార్గఝురాంబుపౌన ♦ రుక్తము లుర్విన్. 62

టీ: ఉర్విన్ = భూమియందు; మీమాటలు; మంత్రంబులు = వేదవాక్యములు; మీ మెట్టినయెడ = మీరు త్రొక్కినచోటు; ప్రయాగ = పవిత్రమైనది; మీపాద = మీయడుగులయొక్క; పవిత్ర + అమలతోయములు = పవిత్రమగు స్వచ్ఛమైననీరు; అలఘు = గొప్పదైన; ద్యోమార్గ = స్వర్గమందలి; ఝరీ + అంబు = ప్రవాహోదకము నకు; పౌనరుక్తములు = పునరుక్తివంటివి (వాటితో సమమైనవి)

తా: మీ మాటలే వేదవాక్యములు; మీరు త్రొక్కినచోటు పవిత్రక్షేత్రము. మీ కాళ్లు కడిగిననీరు గంగోదకము వంటిది.

ఉ. వానిది భాగ్యవైభవము ♦ వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము ♦ వానిది జన్మము వేఱుసేయ కె
వ్వాని గృహాంతరంబున భ ♦ వాదృశ యోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల ♦ సంతస మందుచుఁ బోవు నిచ్చలున్. 63

టీ: భవాదృశయోగిజనంబు = మీవంటియోగులు; ఎవ్వాని గృహాంతరంబునన్ = ఎవనియింటిలో; వేఱుసేయక = భేదములేక; పావన = పవిత్రమైన; స్నానవిధ = స్నానవిధి; అన్నపానములన్ = అన్నముతినుట. నీరుత్రాగుటలతో; సంతసము + అందుచున్ = తృప్తిపొందుచు; నిచ్చలున్ = నిత్యమును; పోవున్ = వెళ్లుచుండునో; వానిది = వానిదే; భాగ్యవైభవము = అదృష్టము; పుణ్యవిశేషము = ఎక్కువపుణ్యము; ఏ + మెయిన్ = ఏరీతిగానైనను; అవంధ్యజీవనము = సఫలమైన జీవితము.

తా: యోగీశ్వరా! మీవంటివారెవరింటివద్ద భేదమెంచక ఇష్టమువచ్చినట్లు స్నానపానముల తృప్తిపొందుదురో వారిదే అదృష్టము. వాని జీవితమే సఫలమైనది. వాడే పుణ్యాత్ముడు.

తే. మానినాథ! కుటుంబ జం ♦ బాలపటల
మగ్నమాదృశగృహమేధి ♦ మండలంబు
నుద్ధరింపంగ నౌషధ ♦ మొండు గలదె
యుష్మదంఘ్రిరజోలేశ ♦ మొకటిదక్క, 64

టీ: మానినాథ = యోగీశ్వరా! కుటుంబ...మండలంబు: కుటుంబ = కుటుంబమను; జంబాలపటల = బురదలో; మగ్న = దిగబడిన; మాదృశ = మావంటి; గృహమేధిమండలంబున్ = గృహస్థుల సముదాయమును; ఉద్ధరింపంగన్ = లేవనెత్తుటకు; యుష్మత్ = తమయొక్క; అంఘ్రి = పాదములయొక్క; రజః + లేశము = ధూళిరవ్వ; ఒకటితక్కన్ = ఒక్కటితప్ప; ఒండు = మరొక; ఔషధము = మందు; కలదా?

తా: మునీంద్రా! సంసారమను బురదలో కూరుకొనిపోయిన మావంటివారి నుద్ధరించుటకు మీవంటివారి పాదధూళితప్ప వేరే యౌషధము లేదు. రూపకాలంకారము.

క. నావిని మునియిట్లను వ
త్సా! విను మావంటి తైర్థి ♦ కావళి కెల్లన్
మీవంటి గృహస్థుల సుఖ
జీవనమునఁ గాదె తీర్థ ♦ సేవయుఁ దలఁపన్. 65

టీ: నాన్ = అనగా, విని, ముని = సిద్ధుడు; ఇట్లు + అనున్ = ఇట్లుపల్కెను; వత్సా = నాయనా! విను. మావంటి తైర్థిక + ఆవళికిన్ = మావంటి తీర్థయాత్రలు సేయు వారికి; ఎల్లన్ = అందరకును; మీవంటి, గృహస్థుల సుఖజీవనమునన్ = గృహస్థులు సుఖముగానుండుటచేతనే; తీర్థసేవయున్ = తీర్థయాత్రయు; తలంపన్ = ఆలోచింపగా: కాదె = అగుచున్నదికదా!

తా: మీవంటి అతిథిమర్యాదలుచేయు గృహస్థులు చల్లగానున్నందుననే మా వంటివారందరును హాయిగా తీర్థయాత్రలు చేయుచున్నారు.

సీ. కెలకులనున్న తం ♦ గెటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకసి ♦ తార్థ పేటి
పండిన పెరటికల్ ♦ పకము వా ♦ స్తవ్యుండు
దొడ్డిఁ బెట్టినవేల్పు ♦ గిడ్డి కాఁపు
కడలేనియమృతంపు ♦ నడఁబావి సంసారి
సవిధమేరునగంబు ♦ భవనభర్త
మరుదేశపథమధ్య ♦ మ ప్రప కులపతి
యాకటి కొదవు స ♦ స్యము కుటుంబి

తే. బధిర పంగ్వంధ భిక్షుక ♦ బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి ♦ క్షపణ కావ
ధూత కాపాలికాద్యనా ♦ థులకుఁ గాన
భూసురోత్తమ! గార్హస్థ్య ♦ మునకు సరియె? 66

టీ: గృహమేధి = గృహస్థు; బధిర...అనాథులకున్ = బధిర = చెవిటివారు, పంగు = కుంటివారు; అంధ = గ్రుడ్డివారు; భిక్షుక = బిచ్చగాండ్రు; బ్రహ్మచారి = వడుగులు; జటి = జడలు కలవారు; పరివ్రాజక = సన్యాసులు; అతిథి = ఆగంతుకులు; క్షపణక = బౌద్ధభిక్షుకులు; అవధూత = దిగంబరులు; కాపాలిక = ఒకమతమువారు; ఆది = మొదలైన; అనాథులకున్ = దిక్కులేని వారికి; కెలకులన్ = ప్రక్కన ఉన్న; తంగెటి జున్ను = తంగేటి చెట్టునకు పట్టిన తేనె తెరవంటివాడు; పండిన = పండ్లుకాచిన; పెరటికల్పకము = దొడ్డిలోని కల్పవృక్షము; వాస్త

వృంతము, యజమానుడు=గృహస్థు; అంకస్థిత=దగ్గరలోనున్న; అర్థపేటి=ధనము దాచినపెట్టె; దొడ్డిన్=దొడ్డిలో; పెట్టిన=ఉంచిన; వేల్పుగిడ్డి=కామధేనువు; కాఁపు=గృహస్థు; కడలేని=అంతములేని; అమృతంపు=అమృతముయొక్క; నడబావి=నడవకలబావి; సవిధ=సమీపముననున్న; మేరునగంబు=మేరుపర్వతము; మరుదేశపథమధ్యమ=నీరులేనిచోటికి మధ్యనున్న; ప్రప=చలిపందిరి; కులపతి=గృహస్థు; ఆకటికిన్=ఆకలివేళకు; ఒదవు=దొరికిన; సస్యము=పైరు; (వంటివాడు) కుటుంబి=గృహస్థు; కాన=అందుచే; భూసుర+ఉత్తమ=బ్రాహ్మణశ్రేష్ఠుడా! గార్హస్థ్యమునకున్=గృహస్థాశ్రమమునకు; సరియె=(ఇతరాశ్రమములు) సాటియగునా? ఇందుతంగెటిజున్ను మొదలైన పదార్థములు తేలికగా దొరకునవి. అట్టివాడు గృహస్థుడని చెప్పబడినది. అలం. రూపకోల్లేఖములు.

క. నావుడుఁ బ్రవరుం డిట్లను
దేవా! దేవర సమస్త ♦ తీర్థాటనముం
గావింపుదు రిలపై నటు
గావున విభజించి యడుగఁ ♦ గౌతుక మయ్యెన్. 67

టీ: నావుడున్=అట్లనిన తర్వాత; ప్రవరుండు; ఇట్లు+అనున్; దేవా! దేవర=పూజ్యులైనమీరు; ఇలపైన్=భూమిమీద; సమస్తతీర్థ+అటనమున్=అన్ని తీర్థముల తిరుగుటను; గావింపుదురు=చేయుదురు; అటుగావునన్=అందుచే; విభజించి=(ఒక్కొక్క విషయమునే) వేఱుపరచి; అడుగన్=అడుగుటకు; కౌతుకము=వేడుక; అయ్యెన్=అయినది.

శా. ఏ యే దేశములన్ వసించితిరి మీ ♦ రే యే గిరుల్ చూచినా
రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి రే ♦ యే ద్వీపముల్ మెట్టినా
రే యే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రే ♦ యే తోయధుల్ డాసినా
రా యాచోటులఁ గల్గు వింతలు మ ♦ హాత్మా!నా కెఱింగింప రే.68

టీ: మహాత్మా! మీరు; ఏయేదేశములన్=ఏయేదేశములందు; వసించితిరి=ఉండిరి; ఏయేగిరుల్=ఏయేకొండలు; చూచినారు. ఏయేతీర్థములందున్=ఏయేపుణ్యనదులలో; క్రుంకిడితిరి=స్నానము చేసితిరి ? ఏయేద్వీపముల్=ఏయేదీవులను; మెట్టినారు=త్రొక్కితిరి; ఏయేపుణ్యవన+ఆళి=ఏయేపుణ్యమైన వనపంక్తులను; త్రిమ్మరితిరి=సంచరించితిరి? ఏయేతోయధుల్=ఏయేసముద్రములను; డాసినారు=సమీపించితిరి? ఆయాచోటులన్=అక్కడక్కడ; కల్గువింతలు=ఉన్నచోద్యములను; నాకున్, ఎఱింగింపరే=తెలుపగదయ్యా !

తా: అయ్యా ! మీరేకొండలు తిరిగితిరో, ఏయేనగులలో స్నానమాడితిరో, ఏయేసముద్రములలో స్నానము చేసితిరో, అక్కడక్కడ నున్న వింతలు చెప్పుడు !

తే. పోయి సేవింపలేకున్న ♦ పుణ్యతీర్థ
మహిమ వినుటయు సకల ♦ కల్మషహరంబ
కాన వేడెద ననిన న ♦ మ్మౌనివర్యుఁ
డాదరాయత్తచిత్తుఁడై ♦ యతని కనియె. 69

టీ: పోయి=తీర్థయాత్రలకువెళ్లి; సేవింపలేకున్నన్=సేవించలేనిచో; పుణ్యతీర్థమహిమ=పుణ్యక్షేత్రముల గొప్పదనమును; వినుటయున్=వినుటకూడ; అఖిలకల్మషహరంబ=పాపములనెల్ల పోగొట్టునదే, కానన్=అందుచే; వేడెదన్=ప్రార్థింతును; అనినన్=అనగా; ఆ+మౌనివర్యుడు=ఆసిద్ధులలో శ్రేష్ఠుడు; ఆదరః+ఆయత్తచిత్తుడై=ఆదరముకల మనస్సు కలవాడై; అతనికిన్=ఆబ్రాహ్మణునితో; అనియెన్=పల్కెను,

తా: వెళ్లి సేవింపలేకున్నచో పుణ్యతీర్థమహిమ విన్నను పాపములు పోవును. కాన మిమ్ము వేడుచున్నాను. అని అడుగుటతో ఆసిద్ధుడతనితో ఇట్లు చెప్పెను.

ఉ. ఓచతురాస్యవంశకల ♦ శోదధిపూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలినై జనప ♦ దంబులు పుణ్యనదీనదంబులుం
జూచితి నందునందుఁ గల ♦ చోద్యములం గనుగొంటి నాపటీ
రాచల పశ్చిమాచల హి ♦ మాచల పూర్వదిశాచలంబులన్. 70

టీ: ఓచతురాస్య...శశాంక- చతురాస్య=బ్రహ్మయొక్క; వంశకలశ+ఉదధి=వంశమను పాలసముద్రమునకు; పూర్ణశశాంక=నిండుచంద్రుని వంటివాడా; తీర్థయాత్రాచణశీలినై=తీర్థయాత్రలు చేయుటయందాసక్తికల మనస్సు కలవాడనై; జనపదంబులు=దేశములు; పుణ్యనదీనదంబులున్=పవిత్రమైన నదులను, నదములను; చూచితిన్, ఆపటీరాచల= (దక్షిణమున) మలయపర్వతము మొదలుకొని; పశ్చిమాచల=పడమటికొండ; హిమాచల=హిమవత్పర్వము; పూర్వదిశాచలంబులన్=తూర్పుకొండల వరకు; అందున్+అందున్=అక్కడక్కడ; కలచోద్యములన్=ఉన్నట్టివింతలను; కనుగొంటిన్=చూచితిని;

తా: ఓబ్రాహ్మణోత్తమా! నేను నాల్గుదిక్కులందుగల వింతలనన్నిటిని చూచితిని. ఎన్నో పుణ్య నదీనదములను చూచితిని.

శా. కేదారేశు భజించితిన్ శిరమునం ♦ గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం ♦ బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రుబదరీ ♦ నారాయణుం గంటి నీ
యా దేశం బన నేల చూచితి సమ ♦ స్తాశావకాశంబులన్. 71

టీ: కేదారేశున్ = కేదారేశ్వరుని; భజించితిన్ = సేవించితిని; హింగుళాపాదాంభోరుహముల్ = హింగుళాదేవియొక్క పాదపద్మములను; శిరమునన్ = తలయందు కీలించితిని = చేర్చితిని; (తల పాదములకానునట్లు మ్రొక్కితిని) ప్రయాగనిలయున్ = ప్రయాగలో నున్న; పద్మాక్షున్ = విష్ణుమూర్తిని; సేవించితిన్. యాదోనాథసుతా = లక్ష్మి; కళత్రున్ = భార్యగాగల; బదరీనారాయణున్ = బదరీలోని నారాయణుని; కంటిన్ = చూచితిని; ఈయాదేశంబు = ఈదేశము ఆదేశము; అనన్ + ఏల = అనుటయేటికి; సమస్త + ఆశా + అవకాశంబులన్ = అన్నిదిక్కుల మధ్యప్రదేశములను; చూచితిన్ = చూచితిని.

వ. అది యట్లుండె వినుము. గృహస్థరత్నంబ! లంబమాన రవిరథ తురంగ శృంగార చామరచ్ఛటాపేక్షణక్షణోద్గ్రీవ చమరసముదయంబగు నుదయంబునం గలవిశేషంబులు శేషఫణికైన లెక్కింప శక్యంబె? అంధరిపుకంధరావాస వాసుకివియోగ భవదుర్వ్యథాభోగభోగినీ భోగభాగ పరివేష్టితపటీర విటపివాటికావేల్లదోలాలతావలయం బగు మలయంబునం గలచలువకు విలువ యెయ్యది? అకటకట! వికటకూట కోటివిటంక శృంగాటకాఘాటక మానజరదిందుబింబగళ దమృతబిందుదుర్దినార్ద్రీకృత సల్లకీపల్లవప్రభంజనప రాంజనహస్తిహస్తం బగున స్తంబునంగలమణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జింతించిన మేనం బులకలిప్పుడుం బొడమెడు. స్వస్వప్రవర్ధితవర్ధిష్ణుధరణీరుహ సందోహదోహద ప్రధానాసమానఖేలద్బైలబిల విలాసినీవిలాసవాచాలతులాకోటికలకలాహూయమానమానస మదాలసమరాళం బగురజతశైలంబునోలంబులం గాలగళువిహారప్రదేశంబులం గన్న సంసృతిక్లేశంబులు వాయవే? సతతమదజలస్రవణపరాయ ణైరావణవిషాణ కోటిసముట్టంకిత కటకపరిస్ఫురత్కురువింద కందళవ్రాతజా తాలాతశంకాపసర్పదభ్రముభ్రమీవిభ్రమధురంధరం బగుమేరుధరాధరంబు శిఖరంబుల సోయగంబులు గలయం గనుంగొనుట బహుజన్మకృత సుకృత పరిపాకంబునంగాక యేల చేకూరనేర్చు? నేనిట్టిమహాద్భుతంబు నీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుంగొంటి ననుటయు నీషదంకురితహాసనగ్రసిష్ణుగండ యుగళుండగుచుఁ బ్రవరుం డతని కిట్లనియె.

టీ: గృహస్థరత్నంబ = గృహస్థులలో శ్రేష్ఠుడా! అది = ఆచూచుట; అట్లు + ఉండెన్ = అటుండనిమ్ము; వినుము = చెప్పబోవునది వినుము; లంబమాన...సముద

యంబు: లంబమాన=వ్రేలాడుచున్న; రవిరథతురంగ=సూర్యునిరథపు గుఱ్ఱములకు; శృంగార=అలంకారములై; చారు=అందమైన; చామర+ఛటా=వింజామరలగుత్తులను; ప్రేక్షణక్షణ=చూచుటలోని వేడుకచే; ఉద్గ్రీవ=మెడలెత్తిన; చమరసముదయంబు=చమరీమృగముల గుంపులు కలది; అగునుదయంబునన్=అయిన తూర్పుకొండయందు; కలవిశేషంబులు=ఉన్నవింతలు; శేషఫణికైనన్=ఆదిశేషునకైనను (వేయినోళ్లున్నను) లెక్కింపన్=ఇన్నియని లెక్కించుటకు; శక్యంబె=తరమా; అంధక...వలయంబు: అంధకరిపుకంధరా=శివుని కంఠమే; ఆవాస=నివాసముగాగల; వాసుకి=వాసుకియొక్క; వియోగభవ=వియోగమువలనపుట్టిన; దుర్వ్యథా+ఆభోగ=ఎక్కువబాధకల; భోగినీ భోగభాగ=సర్పస్త్రీల శరీరభాగములచే; పరివేష్టిత=చుట్టుకొనబడిన; పటీరవిటపి=మంచిగంధపుచెట్లయొక్క; వాటికా=వరుసలందు; వేల్లత్=చుట్టుకొన్న; ఏలాలతావలయంబగు=ఏలకతీగలుకల; మలయంబునన్=మలయమందు; కలచలువకు=ఉన్నచల్లదనమునకు; విలువయొయ్యది=వెలయున్నదా? (వెలకట్టలేము) అకటకట=ఆహాహా! వికట...హాస్తంబు వికటకూట కోటి=మెరకపల్లములుగా నున్న శిఖరముల యొక్క; విటంక=మూంజూరులందున్న (గువ్వగూండ్లవంటి సందులందున్న;) శృంగాటక=నలువీధుల మొగలలో; ఆఘూర్ణమాన=తిరిగెడి; జరత్=అస్తమింపబోవు; ఇందుబింబ=చంద్రబింబమునుండి; గళత్=జారుచున్న; అమృతబిందు=అమృతబిందువులచే; దుర్దిన=వర్షపురోజుచే; ఆర్ద్రీకృత=తడుపబడిన; సల్లకీపల్లవ=అందుగుచిగుళ్ల యొక్క; ప్రభంజనపర=భంజించుటయందాసక్తికల; అంజనహాస్తి=అంజనమనెడి పశ్చిమదిగ్గజముయొక్క; హాస్తంబగు=తొండముకల; అస్తంబునన్=పడమటికొండయందు; కల=ఉన్న; మణిప్రస్తరంబుల విశ్రాంతిన్=మాణిక్యపురాళ్లపై విశ్రమించుటను, చింతించినన్=తలచుకొనగా; మేనన్=శరీరమందు; పులకలు=గగుర్పాటులు; ఇప్పుడున్=ఇప్పుడుగూడ, పొడమెడున్=పుట్టుచున్నవి. స్వస్వ...మరాళంబు; స్వస్వప్రవర్ధిత=తమచే పెంచబడినవై;వర్ధిష్ణు=పెరిగెడిస్వభావముకల; ధరణీరుహసందోహ=చెట్లగుంపునకు; దోహద=అకాలమున పుష్పించుటకు చేయుక్రియయే; ప్రధాన=ప్రధానముగా; అసమానఖేలత్=సాటిలేనట్లుఆడెడి; ఐలబిలవిలాసినీ=కుబేరుని భార్యలయొక్క; విలాసవాచాల=విలాసచేష్టలందుమ్రోగెడి, తులాకోటి=అందెలయొక్క; కలకల+ఆహూయమాన=కలకలధ్వనులచే పిలువబడు; మానస=మానససరస్సునందలి; మద+అలసమరాళంబు=మదించిమందమైన హంసలుకల; అగురజతశైలంబునోలంబులన్=అయినకైలాసపుమారుమూలల; కొలగళువిహార ప్రదేశంబులన్=శివునివిహారప్రదేశములను; కన్నన్=చూచినచో; సంసృతి క్లేశంబులు=సంసార దుఃఖములు; పాయవె=పోవా?. సతత...ధురంధరంబు-సతత=ఎప్పుడును; మదజలస్రవణ=మదజలమును స్రవించుటలో; పరాయణ=ఆసక్తికల, ఐరావణ=ఐరావతముయొక్క; విషాణకోటి=దంతముకొనలచే; సముట్టంకిత=పొడువబడిన, కటక=కొండప్రదేశములందు; పరిస్ఫురత్=ప్రకాశించుచున్న; కురువింద=కెంపులయొక్క; కందళవ్రాత=మొలకల సముదాయముచే; జాత=పుట్టిన; అలాతశంకా=కొఱవులనెడి సందేహ

ముచే; అపసర్పత్=తొలగుచున్న; అభ్రము=ఐరావతముయొక్క భార్యయైన యేనుగుయొక్క; భ్రమీ=గిరగిరతిరుగుట వలన; విలాస=ఒయ్యారము యొక్క; ధురంధరంబగు=బరువుమోయునట్టి; మేరుధరాధరంబు=మేరుపర్వతముయొక్క; శిఖరంబుల సోయగంబులు=శిఖరముల యందములను; కలయన్+కనుగొనుట=కలయజూచుట; బహుజన్మకృత=అనేక జన్మలందుచేసిన; సుకృతపరిపాకంబునన్ = పుణ్యఫలముచేత; కాక=కానిచో; ఏల=ఏరీతిగా; చేకూరు నేర్చున్ = సంభవింపగలుగు? నేను, (సిద్ధుడు) ఇట్టిమహాద్భుతంబులు=ఇటువంటిగొప్పవింతలను; ఈశ్వరానుగ్రహంబునన్=దైవకృపవలన; అల్పకాలంబునన్=కొద్దికాలములో: కనుగొంటిన్=చూచితిని; అనుటయును=అనిచెప్పగా; ఈషత్+అంకురిత=కొద్దిగా మొలచిన; హాసనగ్రసిష్ణు=చిరునవ్వును మ్రింగునట్టి; గండయుగళుండు+అగుచున్=రెండుచెక్కిళ్లుకలవాడగుచు; ప్రవరుండు; అతనికిన్=సిద్ధునికి; ఇట్లు+అనియెన్=ఇట్లుచెప్పును.

చ. వెఱవక మీ కొనర్తు నొక ♦ విన్నప మిట్టివి యెల్లఁ జూచిరా
నెఱకలు గట్టుకొన్న మఱి♦యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము ♦ సెప్పక చెప్పెడు నద్దిరయ్య! మా
కెఱుఁగఁ దరంబె మీమహిమ♦లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్.

టీ: వెఱవక=జంకులేక; మీకున్,ఒకవిన్నపము; ఒనర్తున్ = చేయుచున్నాను; ఇట్టివియెల్లన్=ఇటువంటి తీర్థములన్నియు, చూచిరాన్=చూచివచ్చుటకు; ఎఱకలు=రెక్కలు; కట్టుకొన్నన్=కట్టుకొనినను; మఱి=ఇంకను; ఏండ్లునుబూండ్లును =చాలసంవత్సరములు; పట్టున్, మీ మొగము; ప్రాయపుంజిఱుతదనంబున్ = చిన్నవయస్సును; చెప్పక చెప్పెడున్=మీరుచెప్పకయే చెప్పుచున్నది; అద్దిర+అయ్య=ఎంతఆశ్చర్యమయ్యా! మీమహిమలు=మీప్రభావములు; మాకున్, ఎఱుంగన్=తెలిసికొనుటకు; తరంబె=శక్యమా? ఈరు+అ=మీరే; ఎఱుంగుదురు; ఏమిచెప్పుదున్=నేనేమి చెప్పగలను?

తా: నిర్భయముగా ఒక్కమాట అనుచున్నాను. రెక్కలు కట్టుకొని యెగిరివెళ్లి చూచివచ్చినను ఇవన్నియు తిరుగుటకెన్నియేండ్లైనను చాలదే. మీ మొగముచూడగానే మీకెంతోవయస్సు లేనట్లుతెలియుచున్నది. మరియింత స్వల్పకాలములో నివన్నియు నెట్లు చూడగల్గితిరో? మీమహిమలు మీకే తెలియవలెగాని మాబోంట్లకు తెలియవు.

క. అనినఁ బరదేశి గృహపతి
కనియెన్ సందియముఁ దెలియ ♦ నడుగుట తప్పా?
వినవయ్య జరయు రుజయును
జెనకంగా వెఱచు మమ్ము ♦ సిద్ధుల మగుటన్ 74

టీ: అనినఁ = అనుటతో; పరదేశి = సిద్ధుడు; గృహపతికిన్ = గృహస్థుడైన ప్రవరునికి; అనియెన్ = చెప్పెను; సందియమున్ = సందేహమును; తెలియన్ = తెలిసికొనుటకై; అడుగుట, తప్పా? వినవయ్యా = వినుము, సిద్ధులము = ఔషధసిద్ధి కలవారము; అగుటన్ = అగుటచే; మమ్ము; జరయున్ = ముసలితనమును; రుజయున్ రోగమును; చెనకంగాన్ = తాకుటకు; వెఱచున్ = భయపడును.

తా: మీ సందేహ మడుగుటతప్పులేదు. జవాబు వినుము. మాకౌషధసిద్ధి యున్నందున నెన్నేండ్లైనను మేమల్లేయుందుము. ముసలితనము, రోగమును మా దరికిరావు.

మ. పరమంబైన రహస్య మా నయిన డా ♦ పంజెప్పెదన్ భూమి ని
ర్జరవంశోత్తమ! పాదలేప మను పే ♦ రం గల్గు దివ్యౌషధం
పురసం బీశ్వరసత్కృపం గలిగెఁ ద ♦ ద్భూరిప్రభావంబునం
జరియింతుం బవమానమానసతిర ♦ స్కారిత్వరాహంకృతిన్. 75

టీ: భూమినిర్జరవంశోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుడా! పరమంబు = గొప్పదైన; రహస్యము = చెప్పరానిది; ఔన్ = అగును; అయినన్ = అయినను; డాపన్ = దాచక; చెప్పెదన్ = చెప్పెదను; పాదలేపమను పేరన్ = పాదలేపమను పేరుతో; కల్గుదివ్యౌషధంపురసంబు = చెల్లెడిదివ్యమైన ఔషధము; ఈశ్వరసత్కృపన్ = భగవంతుని దయచే; కలిగెను = నాకులభించెను; తద్భూరిప్రభావంబునన్ = దానిగొప్పమహిమచే; పవమాన = వాయువును; మానస = మనస్సును; తిరస్కారి = మించెడి; త్వరా = వేగముయొక్క; అహంకృతిన్ = గర్వముతో; చరియింతున్ = తిరుగుదును,

తా: ఇది రహస్యమైనను నీకు దాచక చెప్పెను. నాకు దైవకృపవలన 'పాదలేప' మను దివ్యౌషధము లభించినది. దానిమహిమచే వాయుమనోవేగములను మించిన వేగముతో సంచరింపగలను.

క. దివి బిసరుహబాంధవ సైం
ధవసంఘం బెంతదవ్వు ♦ దగ లే కరుగున్
భువి నంతదవ్వు నేమును
రవరవ లే కరుగుదుము హు ♦ టాహుటి నడలన్. 76

టీ: దివిన్ = ఆకాశమందు; బిసరుహబాంధవ = సూర్యునియొక్క; సైంధవ సంఘంబు = అశ్వములు; ఎంతదవ్వు = ఎంతదూరము. దగలేక = శ్రమలేక; అరుగున్ = వెళ్లునో; భువిన్ = భూమియందు; ఏమును = మేమును; రవరవలేక = ఆయాసము లేక; హుటాహుటినడలన్ = చురుకైననడకలతో; అరుగుదుము = వెళ్లుదుము.

మ. అనిన న్విప్రవరుండు కౌతుకభర ♦ వ్యగ్రాంతరంగుండు భ
క్తి నిబద్ధాంజలిబంధురుండునయి మీ ♦ దివ్యప్రభావం బెఱుం

గని నాపల్లదముల్ సహించి మునిలో ♦ కగ్రామణీ! సత్కృపన్
నను మీశిష్యునిఁ దీర్థయాత్రవలనన్ ♦ ధన్యాత్ముఁగాఁ జేయరే. 77

టీ: అనినన్=అనగా; విప్రవరుండు=బ్రాహ్మణశ్రేష్ఠుడు; కౌతుకభర=వేడుకతో; వ్యగ్ర=తొందరకల్గిన; అంతరంగుడు=మనస్సుకలవాడు; భక్తి=భక్తిచే; నిబద్ధ+అంజలిబంధురుండునయి=కట్టబడిన దోసిలికలవాడునై; మీదివ్యప్రభావంబు=మీగొప్పమహిమను; ఎఱుంగని; నాప్రల్లదముల్=నాకూడని మాటలను; సహించి=మన్నించి; మునిలోకగ్రామణీ=మునిశ్రేష్ఠుడా! సత్కృపన్=మంచిదయతో; మీశిష్యునిన్=మీశిష్యుడైన; నన్నున్=నన్ను; తీర్థయాత్రవలనన్=తీర్థయాత్ర చేయుటచే; ధన్యాత్మున్+కాన్=ధన్యుడనగునట్లుగా; చేయరే=చేయుడు!

తా: ఎంతో వేడుకపడినవాడై దోసిలికట్టి, ఏవో తెలియక అన్న మాటలు క్షమించి, మీశిష్యుడనైన నన్ను తీర్థయాత్రచేయించి ధన్యునిచేయుడు.

క. అనుటయు రసలింగము నిడు
తనవటుప్రేఁపసజ్జ ♦ దంతఁపుబరణిన్
నినిచిన యొకపస రిది యది
యని చెప్పక పూసెఁ దత్ప ♦ దాంబుజయుగళిన్ 78

టీ: అనుటయున్=అనగా; (సిద్ధుడు) రసలింగమున్=పాదరసముతో చేసిన శివలింగమును; ఇడు=ఉంచెడి; తనవటుప్రేము+సజ్జన్=తనగుండ్రనైన ప్రేప సజ్జలో; దంతపుబరణిన్=దంతపుబరణిలో; ఇనిచినయొకపసరు=ఉంచినపసరును; ఇదియదియని చెప్పక=అదేయాకుపసరో చెప్పక; తత్పాదాంబుజయుగళిన్=అతని రెండు కాళ్లకును; పూసెన్=రాసెను.

క. ఆమం దిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహిన ♦ భూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాఢ్యదరీఝరీని ♦ రీక్షాపేక్షన్. 79

టీ: ఆమందున్=ఆపసరును; ఇడి=ఇచ్చి (పూసి) అతడు=ఆసిద్ధుడు; అరిగినన్=వెళ్లగా; భూమీసురుడు=ప్రవరుడు; తుహిన...అపేక్షన్-తుహినభూధర=మంచుకొండయొక్క; శృంగ=శిఖరములందలి; శ్యామలకోమలకానన=నల్లని మృదువైన యడవులను; హేమ+ఆఢ్య=బంగారుతో నిండిన; దరీ=గుహలను; ఝరీ=సెలయేళ్లను, నిరీక్షా+అపేక్షన్=చూచుకోరికతో, అరిగెన్=వెళ్లెను.

వ. అనిన విని యమ్మహీసురవరుఁ డట్లరిగి యెట్లు ప్రవర్తించె నతనిపుణ్యావర్తనశ్రవణంబు మనంబునకు హర్షోత్కర్షంబు కల్పించెఁ దర్వాతివృత్తాంతంబు కృపాయత్తచిత్తంబున నానతీయవలయు ననియడుగుటయును.

టీ: అనినన్=అనిపక్షులు చెప్పగా; విని=జైమిని విని; ఆ+మహీసురప్రవరుండు=ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; అట్లు, అరిగి=వెళ్లి; ఎట్లు, ప్రవర్తించెన్=నడచెను; అతని పుణ్యావర్తనశ్రవణంబు=అతనియొక్క పుణ్యమైన నడవడికను వినుట; మనంబునకున్=మనస్సునకు; హర్షోత్కర్షంబున్=ఎక్కువ సంతోషమును; కల్పించెన్=కల్గించెను; తర్వాతివృత్తాంతంబు=తర్వాతికథను; కృపా+ఆయత్తంబు+అగు=దయకల; చిత్తంబునన్=మనస్సుతో; ఆనతి+ఈయవలయును=చెప్పవలయును; అనియడుగుటయున్=అనియడుగగా (దీనికి రెండవ యాశ్వాసములోని 'అవధరింపుము' అన్నక్రియతో అన్వయము)

శా. గంగాస్వచ్ఛతరంగభంగిక యశో ♦ గాఢచ్ఛవిచ్ఛన్నసా
రంగాంకాంకనిరంకుశప్రతికళా ♦ ప్రౌఢిప్రియంభావుకా!
గాంగేయాచల చాపనూపుర వచో ♦ గాంభీర్య లీలాస్పదా!
బంగాళాంగ కళింగభూప సుభటా ♦ భ్రశ్రేణి ఝంఝానిలా! 81

టీ: గంగా=గంగానదియొక్క, స్వచ్ఛతరంగ=స్వచ్ఛమైన కెరటములయొక్క; భంగిక=రీతికల; యశః=కీర్తియొక్క; గాఢ+ఛవి+ఛన్న=గాఢమైన కాంతిచేకప్పబడిన; సారంగ+అంక=చంద్రునిలోని చిహ్నముకలవాడా; (అతిశయోక్తి) నిరంకుశ=అడ్డులేని; ప్రతికళా=అన్నికళలయందలి; ప్రౌఢి=సామర్థ్యముచే; ప్రియంభావుకా=ప్రియమైనవాడా! గాంగేయ+అచలచాప=మేరువువిల్లుగాగల శివునియొక్క; నూపుర=కాలియాభరణమైన ఆదిశేషునియొక్క; వచః+గాంభీర్యలీలా=వాక్కులలోని ప్రౌఢిమకు; ఆస్పదా=స్థానమైనవాడా! బంగాళ+అంగ, కళింగభూప=బంగాళ, అంగ, కళింగదేశపు రాజులయొక్క; సుభట+అభ్రశ్రేణి=భటులను మేఘములకు; ఝంఝానిలా=పెనుగాలియైనవాడా! (రూపకము)

క. మండలికతపనశోభిత
కుండలిపతిశయనకర్ణ ♦ కుండలితరసా
ఖండకవికావ్య దిగ్వే
దండశ్రుతిదళనకలహ ♦ తాడితపటహా!

టీ: మండలికతపన='మండలికతపనుడు' (సామంతులను తపింపజేయువాడు) అనుబిరుదుచే; శోభిత=శోభించువాడా! కుండలిపతిశయన=విష్ణువునకు; కర్ణకుండలిత=చెవులకు కుండలములుగాచేయబడిన; రస+అఖండ=నవరసములతో నిండిన;

కవికావ్య = కవులకావ్యములుకలవాడా! దిక్ + వేదండ = దిగ్గజములయొక్క; శ్రుతిదళన = చెవులను బ్రద్దలుచేయు; కలహతాడిత = యుద్ధమున వాయింపబడు; పటహా = పటహములుకలవాడా!

—: ఉత్సాహము :—

కురుకురుకాశకురుకరూశ ♦ కోసలాంధ్రసింధుబా
హ్లికశకాంగ వంగసింహ ♦ ళేశకన్యకామణి
ప్రకరపాణిఘటితరత్న ♦ పాదుకాకలాచికా
ముకురవీటికాకరండ ♦ ముఖ్యరాజలాంఛనా! 83

టీ: కుకురు...ఈశ = కుకురు, కాశ, కురు, కరూశ, కోసల, ఆంధ్ర, సింధు, బాహ్లిక, శక, అంగ, వంగ, సింహళముల ప్రభువులయొక్క; కన్యకామణిప్రకర = కన్యలసమూహముయొక్క; పాణిఘటిత = చేతులలోనుంచుకొనబడిన; రత్నపాదుకా = రత్నములుపొదివిన పాదుకలు; కలాచికా = తమ్మలముమియుపడిగము; ముకుర = అద్దము; వీటికాకరండ = తాంబూలపుబరణి; ముఖ్య = మొదలైన; రాజలాంఛనా = రాజచిహ్నములు కలవాడా!

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస
శఠకోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితా మతల్లి
కాల్లసాని చొక్కయామాత్య పుత్త్ర పెద్దనార్య
ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం
బనుమహాప్రబంధమునందుఁ

ప్రథమాశ్వాసము

సంపూర్ణము.

—(★)—

శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

(టీకాతాత్పర్యసహితము)

## ద్వితీయాశ్వాసము



ఖండశీతనగమ
ధ్యాఖండక్షోణిమండ ♦ లాఖండల వి
ద్యాఖేలనభోజ! సుధీ
లేఖద్రుమ! కృష్ణరాయ ♦ లీలామదనా! 1

టీ: శ్రీఖండశీతనగ = మలయ, హిమాలయముల; మధ్య = మధ్యనున్న; అఖండ = సమస్తమైన; క్షోణిమండల = భూమండలమునకు; ఆఖండల = ఇంద్రునివలె పాలకుడైనవాడా! విద్యాఖేలన = చదువులలో క్రీడించుటలో; భోజ = భోజునివంటి వాడా! సుధీలేఖద్రుమ = విద్వాంసులకు కల్పవృక్షమైనవాడా! లీలామదనా = విలాసములందు మన్మథునివంటివాడా! కృష్ణరాయ = శ్రీకృష్ణదేవరాయా! (అవధరింపుము అని ముందుతో సమన్వయము)

వ. అవధరింపుము. జైమినిమునీంద్రునకుం బ్రజ్ఞాసాంద్రంబు లగు పక్షీంద్రంబు లవ్వలికథ యిట్లని చెప్పం దొడంగె. 2

టీ: అవధరింపుము = వినుము; జైమినిముని + ఇంద్రునకున్ = జైమినిమునికి; ప్రజ్ఞాసాంద్రంబులు + అగు = ఎక్కువ బుద్ధికల్గిన; పక్షీంద్రంబులు = ధర్మపక్షులు; అవ్వలికథన్ = తరువాతి కథను; ఇట్లని = ఈరీతిగా; చెప్పన్ + తొడంగెను = చెప్ప నారంభించెను.

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ ♦ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠద ♦ భంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరి ♦ ఫుల్లకలాపకలాపిజాలమున్
కటకచరత్కరేణుకర ♦ కంపితసాలము శీతశైలమున్. 3

టీ. భూమిసురుడు=ప్రవరుడు; చని=వెళ్లి; అట=అక్కడ; అంబర... జాలమున్-అంబరచుంబి = ఆకాశమునంటెడి; శిరస్+సరత్ = శిఖరములనుండి స్రవించు; ఝరీపటల=సెలయేళ్లయందు; ముహుర్ముహుః=మాటిమాటికి; లుఠత్ =ఎగురుచున్న; అభంగ=ఎడతెగని; తరంగ=కెరటములనెడి; మృదంగనిస్వన=మద్దెలచప్పుడుచే; స్ఫుటనటన=స్పష్టమైన నాట్యమునకు; అనురూప=తగినట్లు; పరిఫుల్ల=విప్పబడిన; కలాప=పురికల; కలాపిజాలమున్ = నెమళ్లగుంపులుకలదియు; కటకచరత్ =చరియలందు తిరుగుచున్న; కరేణు=ఏనుగులయొక్క; కర=తొండములచే; కంపితసాలము=కదల్పబడినచెట్లుగల; శీతశైలమున్ =హిమవత్పర్వతమును; కాంచెన్ =చూచెను.

తా: ప్రవరుడు హిమాలయమును చేరెను. అక్కడ ఆకాశము నంటిన శిఖరములనుండి స్రవించుచున్న సెలయేళ్లలో నెగురుచున్న కెరటముల చప్పుళ్లు మద్దెల మ్రోతకాగా దానికనుకూలముగా పురులువిప్పి నెమళ్లు నాట్యముచేయుచున్నవి. ఏనుగులు చెట్లను కదల్చుచున్నవి. వాటినతడుచూచెను.

వ. కాంచి యంతరంగంబునఁ దరంగితంబగు హర్షోత్కర్షంబున.

టీ: కాంచి=చూచి; అంతరంగంబునన్ =మనస్సులో; తరంగితంబగు=పొంగెడి; హర్ష+ఉత్కర్షంబునన్ =ఎక్కువయానందముతో.

క. నరనారాయణచరణాం
బురుహద్వయభద్రచిహ్న ♦ ముద్రితబదరీ
తరుషండమండలాంతర
సరణిన్ ధరణీసురుండు ♦ చనఁ జన నెదుటన్. 5

టీ: ధరణీసురుండు=ప్రవరుడు; నర...సరణిన్-నరనారాయణ=నరనారాయణులను మహర్షులయొక్క; చరణ+అంబురుహద్వయ=పద్మములవంటి రెండు పాదములయొక్క; భద్రచిహ్నముద్రిత=మంగళకరమైన వజ్రాదిరేఖలచే గుర్తింపబడిన; బదరీతరుషండమండల=రేగుచెట్లగుండ్రనితోపుయొక్క; అంతర=మధ్యనుండియున్న; సరణిన్=త్రోవను; చనన్+చనన్=వెళ్లగా; ఎదుటన్. (ముందు దానితో నన్వయము)

తా: ఆపర్వతమునుచూచి సంతోషించి ప్రవరుడు నరనారాయణులు సంచరించినందున వారిపాదములందలి రేఖలు కలిగి గుర్తింపదగిన తోటమధ్యనుండియున్న త్రోవనే వెళ్లి యేగుట. (ఆతోటయే 'బదరీనారాయణము' అని పిలువ బడునది)

క. ఉల్లలదలకాజలకణ
పల్లవితకదంబముకుళ ♦ పరిమళలహరీ
హల్లోహలమదబంభర
మల్లధ్వను లెసఁగ విసరె ♦ మరుదంకురముల్. 6

టీ: ఉల్లల...ధ్వనులు-ఉల్లలత్ = పైకెగురుచున్న; అలకా = అలకానది యొక్క; జలకణ = నీటిబిందువులచే; పల్లవిత = చిగిర్చిన; కదంబముకుళ = కడిమి మొగ్గలయొక్క; పరిమళలహరీ = సువాసనయను ప్రవాహమున; ఈహత్ + లోహల = కోరికకల్గిజుమ్మనెడి; మదబంభరమల్లధ్వనులు = మదించిన తుమ్మెదలరొదలు; ఎసగన్ = ఎక్కువకాగా; మరుత్ + అంకురములు = పిల్లగాలులు; విసరెన్ = వీచెను; అలం. స్వభావోక్తి.

తా: అలకానదిమీదినుండి గాలి వీచినది. ఆయొడ్డున చిగిర్చిన కడిమిమొగ్గల మీద వ్రాలి మదించిన తుమ్మెదల రొదయు వినబడుచున్నది.

సీ. తొండము ల్సాచి యం ♦ దుగుఁజిగుళ్లకు నిక్కి
కరుల దంతచ్ఛాయ ♦ గడలుకొనఁగ
సెలవులవనదంశ ♦ ములు మూఁగి నెఱెవెట్టఁ
గ్రోల్పులు ల్పొదరిండ్ల ♦ గుబురు లిడఁగ
సెలయేటియిసుకలం ♦ కల వరాహంబులు
మొత్తమ్ములై త్రవ్వి ♦ ముస్తె లెత్త
సడ్డంబు నిడుపు నా ♦ పడ్డలగతి మను
బిళ్లు డొంకలనుండి ♦ క్రేళ్లు దాటఁ

గీ. ప్రబలభల్లుకనఖభల్ల ♦ భయదమథన
శిథిలమధుకోశవిసర వి ♦ శీర్ణమక్షి
కాంతరాంతర దంతురి ♦ తాతపమునఁ
బుడమి తిలతండులన్యాయ ♦ మున వెలుంగ. 7

టీ: తొండములు = తొండములను; చాచి; అందుగుజిగుళ్లకున్ = అంగుగు చెట్లచిగుళ్లకై; నిక్కి = మునికాళ్లతో నిలుచున్న; కరుల = ఏనుగులయొక్క; దంత + ఛాయ = దంతకాంతి; కడలుకొనగన్ = వ్యాపించగా; సెలవులన్ = పెదవులమూలలందు; వనదంశములు = అడవియీగలు; మూగి = మూసుకొనుచు; నెఱె + వెట్టన్ =

సందులు చేయగా; క్రోల్పులుల్ = పెద్దపులులు; పొద+ఇండ్లన్ = ఇల్లుగానుండు పొదలలో; గుఱకలిడగన్ = గుఱ్ఱుపెట్టినిద్రింపగా; సెలయేటియిసుకలంకలన్ = సెలయేళ్లఇసుక తిప్పలపై; వరాహంబులు = అడవిపందులు; మొత్తంబులై = మందలై; త్రవ్వి = పెల్లగించి; ముస్తెలు+ఎత్తన్ = తుంగముస్తలుతీయగా; అడ్డంబు = అడ్డము; నిడుపును = పొడవును (కల) అపడ్డలగతిన్ = ఆవుపెయ్యలవలె; మనుబిళ్లు = పెంటిమన్నులు (ఒకరకము మృగములు); డొంకలనుండి = పొదలనుండి; క్రేళ్లుదాటన్ = గంతులువేయగా; ప్రబలభల్లుక = పెద్దయెలుగుబంట్లయొక్క; నఖభల్ల = ఈటెలవంటిగోళ్లచే; భయదమథన = భయంకరముగాలాగుటచే; శిథిల = చెదరిన; మధుకోశవిసర = తేనెతెరలగుంపునుండి; విశీర్ణమక్షికా = రేగినతేనెటీగలయొక్క; అంతర+అంతర = మధ్యమధ్యసందులనుండి; దంతురిత = వ్యాపించునట్టి; ఆతపమునన్ = ఎండచే; పుడమి = భూమి; తిలతండులన్యాయమునన్ = నువ్వులు బియ్యముకలిసినట్లు; వెలుంగన్ = ప్రకాశింపగా. (ముందునకన్వయము)

తా: అంగుగుచిగుళ్లనంగుకొనుటకై మునికొళ్లపై లేచు నేనుగుల దంతకాంతులు చిమ్ముచుండెను. పెద్దపులులు నిద్రపోవుచుండగా నడవియీగలు సెలవులంగు ముసరి వోలుచున్నవి. ఇసుకతిప్పలలో నున్నతుంగముస్తల నడవిపందులు త్రవ్వుచున్నవి. మన్నులను మృగములు డొంకలదాటుచున్నవి. ఎలుగుబంట్లు గోళ్లతో తేనెతెట్లను లాగగా తేనెటీగలు రేగినవి. వాటిమధ్యనుండి కొంతమేర నెండపడి, కొంతమేర నీడగానున్నందున నువ్వులు, బియ్యము కలిపి నట్లున్నవి. స్వభావోక్తి.

క. పరికించుచు డెందంబునఁ
బురికొను కౌతుకముతోడ ♦ భూమీసురుఁ డ
గ్గిరికటకతటనిరంతర
తరుగహనగుహావిహార ♦ తత్పరమతియై. 8

టీ: పరికించుచున్ = పరిశీలించుచు; భూమీసురుడు = ప్రవరుడు; డెందంబునన్ = మనసులో; పురికొనుకౌతుకముతోడన్ = ఎక్కువైనవేడుకతో; ఆ+గిరికటకతట = ఆకొండచరియలందు; నిరంతర = దట్టమైన; తరుగహన = కారడవులందు; గుహా = గుహలందు; విహార = విహరించుటయందు; తత్పరమతియై = ఆసక్తికలవాడై.

సీ. నిడుదపెన్నెఱిగుంపు ♦ జడగట్ట సగరుము
ద్మనుమెండు తపముఁ ♦ గైకొనినచోటు
జరఠకచ్ఛపకులే ♦ శ్వరు వెన్ను గాన రా
జగతికి మిన్నేఱు ♦ దిగినచోటు
పుచ్ఛడీకతనంబు ♦ పోఁబెట్టి గిరికన్య
పతిఁ గోర్వ నాయాస ♦ పడినచోటు
వలధాచరాచవాఁ ♦ డలికాక్షుకను వెచ్చఁ
గరఁగిన యల కని ♦ కరపుఁజోటు

గీ. తపసియిల్లాండ్రచెలువంబుఁ ♦ దలఁచి తలఁచి
మున్ను ముచ్చిచ్చును విరాళిఁ ♦ గొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁ ♦ గన్నచోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన. 9

టీ: ప్రవర+ఆఖ్యుఁడు=ప్రవరుడను పేరుకలవాడు; సగరుమున్మనుమండు=సగరుని మనుమని కొడుకు-భగీరథుడు; నిడుదపెన్నెఱిగుంపు=పొడవైన జుట్టు; జడగట్టన్=జడవలె నల్లుకొనగా; తపము=తపస్సును; కైకొనినచోటు=చేసినచోటు; మిన్ను+ఏఱు=ఆకాశగంగ; జరఠకచ్ఛపకుల+ఈశ్వరువెన్ను=ముసలివాడైన ఆదికూర్మముయొక్క వీపు; కొసరాన్=కన్పడునట్లు; (పైనుండి ధారపడుచుండగా కొండమీదకూడ అంతలోతు గొయ్యిపడినదని భావము.) జగతికిన్=భూలోకమునకు, దిగినచోటు=అవతరించిన ప్రదేశము; గిరికన్య=పార్వతి; పుచ్చడీకతనంబున్=సిగ్గును; పోవెట్టి=దిగవిడిచి; పతిన్=భర్తకాబోవు శివుని; కొల్వన్=సేవించుటకు; ఆయాసపడినచోటు; వలరాచరాచవాడు=మన్మథుడనురాజు; అలికాక్షుకనువెచ్చన్=నొసటకన్నుకల శివుని కంటిమంటతో; కరగిన=బూదియైన; అల=ప్రసిద్ధమైన; కనికరపుజోటు=జాలిపుట్టించుచోటు; మున్ను=పూర్వము; తపసియిల్లాండ్ర=మునిపత్నులయొక్క; చెలువంబు=అందమును; తలచితలచి=ధ్యానించి; మూఁడు+చిచ్చును=త్రేతాగ్ని (యజ్ఞములోనుండు దక్షిణాగ్ని, గార్హపత్యాహవనీయములు) విరాళిన్=విరహమును: కొన్నచోటు=పొందినచోటు; కనుచు+పులు=కణుపులుండుగడ్డి (రెల్లు) వేల్పుపడవాలున్=దేవసేనాపతియగు కుమారస్వామిని; కన్నచోటు=కనిన ప్రదేశము; హర్షమునన్=సంతోషముతో చూచి; ఆత్మలోనన్=మనసులో. (మునుగునకన్వయము) (ముచ్చిచ్చుఅనగా మూడు చిచ్చులు కలవాడు శివుడని యర్థముచెప్పి శివనాగువనవిహారముగాగతి కొందరు చెప్పుచున్నారు. అసంయుక్తమని తోచును.)

చ. విలయకృశానుకీలముల ♦ వేఁడిమిఁ బోడిమి మాలి వెల్మిడిన్
గలసిన భూతధాత్రి మఱి ♦ క్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్
మొలువఁగఁ జేయునట్టి నయ ♦ ముం బ్రతికల్పము నెట్లు గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలు ♦ చల్లఁదనంబును నూనకుండినన్. 10

టీ: విలయకృశానుకీలములన్=ప్రళయకాలాగ్నిజ్వాలలయొక్క; వేడిమిన్=వేడిచే; పోడిమి=పస; మాలి=చెడి; వెల్మిడిన్=బూదిలో; కలసినభూతధాత్రి=కలసినభూమి; మఱి=మరల; క్రమ్మఱన్=తిరిగి; రూపయి=భూమిగానై; నిల్చి=ఉండి; ఓషధుల్=చెట్లు; మొలువగన్=మొలుచునట్లు; చేయునట్టి; నయమున్=శక్తిని; ప్రతికల్పమున్=బ్రహ్మయొక్క ప్రతిదినారంభమునను, ఈచలిమలవల్లన్=ఈమంచుకొండవలన; ఉల్లసిలు=కల్గు, చల్లదనంబును; ఊనకుండినన్=వహించనిచో; ఎట్లు; కాంచున్=పొందును?

తా. ప్రళయకాలమున అగ్నిచేకాలి బూడిదయైన భూమి మరల సృష్టిలో పూర్వరూపమును పొందినను, ఈహిమవత్పర్వతమువలన చలువేలేనిచో మొక్కలు మొలుచునట్టి శక్తిలేకపోయెడిది. అలం. కావ్యలింగము. వాక్యార్థమునకు వాక్యార్థము కారణమైనచో కావ్యలింగము.

సీ. పసుపునిగ్గులు దేఱు ♦ పాఁపజన్నిద మొప్పఁ
బ్రమథాధిపతి యింటి ♦ పట్టెఱింగె
శచి కీఁతఁ గఱపుచుఁ ♦ జదలేట సురరాజు
జలకేళి సవరించు ♦ చెలు వెఱింగె
నదనుతోఁ జేఁపి చ ♦ న్నవిసి యోషధుల మ
న్మోదవు కొండలఁ గెల్ల ♦ బిదుక నెఱిఁగె
వేల్పుటింతులలోన ♦ విఱ్ఱవీగుచు మేన
నవరత్నరచనల ♦ రవణ మెఱిఁగెఁ
గీ. బరిపరివిధంపు జన్నంపుఁ ♦ బరికరంపు
సొంపు సంపద నిఖిల ని ♦ లింప సభయు
నప్పటప్పటికిని జిహ్వా ♦ త్రుప్పు డుల్ల
నామెత లెఱింగె నీతుషా ♦ రాద్రి కతన. 11

టీ: ఈతుషారాద్రికతనన్ = ఈమంచుకొండ మూలముగా; పసుపునిగ్గులు = పసుపుకాంతులు; తేఱు = తేటగాకనిపించు; పాము+జన్నిదము = పాముజంధెము; ఒప్పన్ = ప్రకాశింపగా; ప్రమథ+అధిపతి = శివుడు; ఇంటిపట్టు = ఇంటిలోనుండుటను (గృహస్థధర్మమును) ఎఱింగెన్ = ఎరిగెను; శచికిన్ = శచీదేవికి; ఈఁత = ఈదుటను; కఱపుచున్ = నేర్పుచు; చదలేఱు+అన్ = ఆకాశగంగలో; సురరాజు = ఇంద్రుడు; జలకేళి = జలక్రీడ; సవరించుచెలువు = చేయురీతిని; ఎఱిఁగెన్; మన్మోదవు = గోరూపమును ధరించిన భూదేవి; అదనుతో = సమయమున; చేపి; చన్నుఁ = చన్నులు, అవిసి = ఉబ్బించి; కొండలకెల్లన్ = అన్నికొండలకును; ఓషధులన్ = చెట్లను; పిదుకనెఱిఁగెన్ = పిదుకుటకునేర్చెను (హిమవంతుడు దూడయయ్యెను) మేన = హిమవంతుని భార్య; వేల్పుటింతులలోనన్ = దేవతాస్త్రీలలో; విఱ్ఱవీగుచున్ = మిక్కిలిగర్వపడుచు; నవరత్న = తొమ్మిది రత్నములయొక్క; రచనల = చెక్కడపు పనిగల; రవణము = అలంకారము; ఎఱిఁగెను; నిఖిలనిలింపసభయున్ = దేవతలందరును; పరిపరివిధంపు = పలురకములైన; జన్నంపుపరికరంపు = యజ్ఞపరికరములయొక్క; సొంపుసంపదన్ = అభివృద్ధిచే; అప్పటికిన్+అప్పటికిన్ = ఆయా సమయములందు; జిహ్వాత్రుప్పుడుల్లన్ = నాలుకకు పట్టిన పూచిపోవునట్లు; (హితవైనది తిననందున పూచిపట్టును) ఆమెతలు = విందులు; ఎఱింగెన్. (మేన = మేనక యను నప్సరసయని కొందఱు.)

తా: ఈహిమవంతుని మూలముగా బ్రహ్మచారిగానున్న శివుడొక యింటివాడైనాడు. ఇంద్రుడు శచికీత నేర్పుచు జలక్రీడా సౌఖ్యమనుభవించెను. హిమవంతుడు దూడగాయై కుడుచుకొనగా గోరూపమైన భూదేవి నే ఓషధులు పిదికిరి. మేన ఈకొండ మీది నవరత్నఖచితములైన యాభరణములను ధరించి దేవతాస్త్రీలలో విఱ్ఱవీగినది. ఇందు పుట్టిన యజ్ఞపరికరములచే దేవతలకు నాలుక త్రుప్పుడుల్లుచున్నది.

మ. తలమే బ్రహ్మకునైన నీనగ ♦ మహత్వం బెన్ననే నియ్యెడం
గలచోద్యంబులు రేపు గన్గొనియెదం ♦ గా కేమి నే డేగెదన్
నళినీబాంధవ భానుతప్త రవికాం ♦ త స్యంది నీహార కం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మ ♦ ధ్యాహ్నముం దెల్పెడిన్

టీ: ఈనగమహత్త్వంబు = ఈకొండగొప్పదనము; ఎన్నన్ = ఎన్నుటకు; బ్రహ్మకునైనన్; తలమే = శక్యమా ? ఈ+ఎడన్ = ఇక్కడ; కల = ఉన్న; చోద్యంబులు = అద్భుతములు; రేపు; కన్గొనియెదన్ = చూతును; కాకేమి = కాక అంత హడావిడేమి వచ్చినది ? నేడు; ఏగెదన్ = వెళ్లుదును; నళినీబాంధవ = కమలములకు హితుడైన సూర్యునియొక్క; భాను = కిరణములచే; తప్త = వేడెక్కింపబడిన; రవికాంత = సూర్యకాంతపురాలమీదికి; స్యంది = జారుచున్న; నీహారకందళ = మంచు బొట్లవలని; చూత్కారపరంపరల్ = 'చుంయి చుంయి' మనుచప్పుళ్లు; పయిపయిన్ = మీదమీద; మధ్యాహ్నమున్, తెల్పెడిన్ = తెల్పుచున్నవి.

తా: ఈహిమవత్పర్వతముయొక్క వింతల నెన్నుట బ్రహ్మతరమైనకాదు. ఈరోజుననే చూడవలెనా ? రేపుచూతును. నేటికిపోదును. అప్పుడే మధ్యాహ్నమైనట్లు సూర్యకాంతపురాళ్ల మీదపడి మంచుబిందువులు చుంయి చుంయి మనుటచే తెలియుచున్నది.

గీ. అనుచుఁ గ్రమ్మఱువేళ నీ ♦ హారవారి
బెరసి తత్పాదలేపంబు ♦ కరఁగిపోయెఁ
గరఁగిపోవుట యెఱుఁగఁ డ ♦ ద్ధరణిసురుఁడు
దైవకృతమున కిల నసా ♦ ధ్యంబు గలదె. 13

టీ: అనుచున్; క్రమ్మఱువేళన్ = మరలునప్పుడు; నీహారవారి = మంచునీరు; బెరసి = అంటి; తత్+పాదలేపంబు = అదని పాదములకు పూసికొన్న పసరు; కరఁగి పోయెన్; కరగిపోవుట; ఆ+ధరణిసురుడు = ప్రవరుడు; ఎఱుఁగఁడు; ఇలన్ = భూమిపై; దైవకృతమునకున్ = దైవముచేయుపనికి; అసాధ్యంబు = సాధ్యముకానిది; కలదె = ఉన్నదా ?

తా: అక్కడిమంచు నీరుతగిలి పాదలేపము కరగిపోయినది. ఆప్రవరుడది కరగి నట్లెరుగడు. దైవముతలచినది కాకపోదుకదా ! అలం. అర్థాంతరన్యాసము.

మ. అతఁ డట్లౌషధహీనుఁడై నిజపురీ ♦ యాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపది స్ఫుటార్తిఁ జరణ ♦ ద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా ♦ నన్నిట్లు దైవంబ తె
చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ ♦ సిద్ధాపదేశంబునన్. 14

టీ: అతఁడు, అట్లు, ఔషధహీనుఁడై=మందులేనివాఁడై; నిజపురీ=తనయూరికి; యాత్రా=వెళ్లుటకై; మిళత్=కూడిన; కౌతుక+ఉద్ధతిన్=ఎక్కువవేడుకతో; పోవన్=వెళ్లుటకు; చరణద్వంద్వంబు=రెండుకాళ్లు; రాకుండినన్=రాకపోఁగా; సపది=అప్పుడు; స్ఫుట+ఆర్తిన్=స్పష్టమైన బాధతో; మతిన్=బుద్ధియందు; చింతించుచున్=విచారించుచు; ఆ+విధంబు=పాదలేపము కరఁగినట్లు; ఎఱిఁగి; హా=అయ్యో! దైవంబ=దైవమా! నన్నున్+ఇట్లు; సిద్ధ+అపదేశంబునన్=సిద్ధుని మిషతో; ఈఘోరవనప్రదేశమునకున్=భయంకరమైన అడవిపట్టునకు; తెచ్చితి+ఎ=తెచ్చితివా?

తా: పాదలేపము కరఁగిన తర్వాత అతఁడు తన యూరికి పోఁదలఁచెను. కాని కాళ్లు పైకి లేవలేదు. అప్పుడు జరిగినది తెలిసికొన్నాడు. మనసులో 'హా దైవమా! సిద్ధుని మిషతో నన్ను యడవికి తెచ్చి పారవేసితివే!' అని విచారించెను.

క. ఎక్కడి యరుణాస్పదపుర?
మెక్కడి తుహినాద్రి? క్రొవ్వి ♦ యే రాఁ దగునే!
యక్కట! మును సనుదెంచిన
దిక్కిది యని యెఱుఁగ వెడలు ♦ తెరు వెయ్యదియో! 15

టీ: ఎక్కడి యరుణాస్పదపురము=నా పట్టణ మెంత దూరము? తుహిన+అద్రి=హిమవత్పర్వతము; ఎక్కడ; క్రొవ్వి=పొగరెక్కి (రావచ్చునా కాదా అని ఆలోచింపక) ఏన్=నేను; రాన్+తగునే=రావచ్చునా? అక్కట! మును=మునుపు; చనుదెంచిన=వచ్చిన; దిక్కు=మార్గము; ఇది+అని+ఎఱుఁగన్=ఇదని నేనెరుఁగను; వెడలు తెరువు=వెళ్లెడి మార్గము; ఏ+అది+ఓ=ఏదో.

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మా ♦ యా ద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే ♦ సేవింప కుద్దండగం
డక వేదండ వరాహ వాహారిపు ఖ ♦ డ్గ వ్యాఘ్రఘు మిమ్మంచుఁగొం
డకు రాఁ జెల్లునె? బుద్ధిజాడ్యజనితో ♦ న్మాదుల్ గదా శ్రోత్రియుల్.

టీ: నేన్=నేను; అకలంక=నిర్దుష్టమైన; ఔషధసత్త్వమున్=ఔషధమహిమను; తెలియన్=తెలిసికొనుటకు; మాయా=హరిద్వారమును; ద్వారకా; అవంతి=ఉజ్జయిని; కాశి; కురుక్షేత్రే; గయా; ప్రయాగములు=ప్రయాగక్షేత్రములను;

సేవింపక; ఉద్దండ=క్రూరమైన; గండక=గండకమృగములు; వేదండ=ఏనుగులు; వరాహ=అడవి పందులు; వాహరిపు=అడవి దున్నపోతులు; ఖడ్గ=ఖడ్గమృగములు; వ్యాఘ్రము=పెద్దపులులు కలదైన; (ఇచ్చట పక్షివిశేషణమునకు ప్రథమ వచ్చినది) ఈ+మంచుకొండకున్=ఈకొండకు; రాన్+చెల్లును+ఎ=రాదగునా? శ్రోత్రియుల్=వేదము చదివినవారు; బుద్ధిజాడ్య=తెలివితక్కువచే; జనిత+ఉన్మాదుల్=పుట్టిన మనశ్చాంచల్యము కలవారు; కదా?

తా: నేను సిద్ధునిమందువలన నెరుగగోరి ప్రసిద్ధమైన గయా, ప్రయాగ, కాశీ, హరిద్వారము, ఉజ్జయిని మున్నగు పట్టణములకుపోక, క్రూరమృగములుకల యీకొండకేల రావలెను. అక్కడనే ఇట్టి బాధకల్గినచో తిరిగి యింటికి వెళ్లుటకు దారిదొరకెడిది. వేదవేత్తలైనవారు తెలివితక్కువ వారుకదా! అలం. అర్థాంతరన్యాసము.

సీ. నను నిముసంబు గా ♦ నక యున్న నూ రెల్ల
నరయు మజ్జనకుం డెం ♦ తడలు నొక్కొ
యెపుడు సంధ్యలయందు ♦ నిలు వెళ్లనీక న
న్నోమెడు తల్లి యెం ♦ తొఱలు నొక్కొ
యనుకూలవతి నాదు ♦ మనసులో వర్తించు
కులకాంత మది నెంత ♦ కుందు నొక్కొ
గెడఁదోడు నీడలై ♦ క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంతచిం ♦ తింతు రొక్కొ

గీ. యతిథిసంతర్పణంబు లే ♦ మయ్యె నొక్కొ
యగ్నులే మయ్యెనొక్కొ ని ♦ త్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ ♦ కినుక నిట్లు
పాఱునై చితె మిన్నులు ♦ పడ్డచోట. 17

టీ: ననున్=నన్ను; నిముసంబు=నిమిషము; కానకయున్నన్=చూడకున్నచో; ఊరు+ఎల్లన్=ఊరంతయు; అరయు=వెదకెడి; మత్+జనకుడు=నాతండ్రి; ఎంత+అడలును+ఒక్కొ=ఎంతగా విచారించునో? ఎపుడున్=ఎల్లప్పుడును; సంధ్యలయందున్=సంధ్యాకాలములందు; ఇలువెళ్లనీక=ఇల్లువెడలిపోనియ్యక; ఓమెడు=కాపాడునట్టి; తల్లి; ఎంత+ఒఱలునొక్కొ=ఎంతగా బాధపడునో? అనుకూలవతి=నాకనుకూలముగా నడచునది; నాదుమనసులోన్=నామనసునందు; వర్తించు=ఎక్కిన (నాకునచ్చిన;) కులకాంత=భార్య; మదిన్=మనసులో; ఎంత; కుందునొక్కొ=కుములునో? గెడన్=దగ్గర; తోడునీడలై=సహాయులై; క్రీడించు=విహారించెడి; సత్+ఛాత్రులు=మంచిశిష్యులు; ఇంతకున్=ఇప్పటికే;

ఎంతచింతింతురో కొ; అతిథిసంతర్పణంబులు=అతిథులకు భోజనములు పెట్టుటలు; అగ్నులు=హోమము చేయవలసిన మూడగ్నులును; దైవంబ=దైవమా? కినుకన్=కోపముతో; నిత్యంబులైన=ప్రతిదినము చేయవలసిన; కృత్యములన్=కర్మలనుండి; పాపి=ఎడబాపి; మిన్నులు+పడ్డచోటన్=ఆకాశములు వాలినచోట (చాలయెత్తైన దూరప్రదేశమున) పాఱవైచితె=విసరివేసితివా? అలం. సందేహము.

క. నను నిలుసేరు నుపాయం
బొనరింపఁగఁ జాలు సుకృతి ♦ యొకఁడొదవఁడొకో
యనుచుం జింతాసాగర
మున మునిఁగి భయంబు గదురఁ ♦ బోవుచు నెదురన్. 18

టీ: ననున్=నన్ను; ఇలు+చేరు+ఉపాయంబు=ఇల్లుచేరెడి ఉపాయము; ఒనరింపగన్=చేయుటకు; చాలుసుకృతి=శక్తికలపుణ్యాత్ముడు; ఒకడు=ఎవడైనను; ఒదవడొకో=దొరకకుండునా? అనుచున్; చింతాసాగరమునన్ = విచారమను సముద్రమున; మునిగి, భయంబు, కదురన్=కల్గగా; పోవుచున్=ఏదోదారినిపోవుచు; ఎదురన్=ఎదుట; (ముందున కన్వయము) అలం. రూపకము, సందేహము.

సీ. కులిశధారాహతి ♦ పొలుపునఁ బైనుండి
యడుగుమోవఁగ జేగు ♦ రైన తటులఁ
గనుపట్టులోయ గం ♦ గానిర్ఝరము వాఱఁ
జలువయౌ నయ్యేటి ♦ కెలఁకులందు
నిసుకవెట్టిన నేల ♦ నేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై ♦ యిరులు గవియు
క్రముకపున్నాగనా ♦ రంగరంభానాళి
కేరాదివిటపకాం ♦ తారసీమఁ

గీ. గెరలు పికశారికాకీర ♦ కేకిభృంగ
సారసధ్వనిఁ దనలోని ♦ చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గం ♦ ధర్వయక్ష
గానఘూర్ణిత మగునొక్క ♦ కోనఁ గనియె. 19

టీ: కులిశధారా=వజ్రాయుధపుపదనుచేనైన; హతిపొలుపునన్=దెబ్బవలె; పైనుండి; అడుగుమోవగన్=క్రిందివరకును; జేగురైన=ఎఱ్ఱని: తటులన్=చరియలతో; కనుపట్టులోయన్=కనుపడుచున్న రెండు కొండల మధ్యప్రదేశమున, గాంగ

నిర్ఝరము=గంగాప్రవాహము; పాఱన్=ప్రవహించుచుండగా; చలువదగు=చల్లనైన; ఆ+ఏఱు+కొలకులందున్=ఆనదికి రెండు ప్రక్కలను; ఇసుక+పెట్టిన నేలన్=ఇసుక భూములందు; ఏచి=పెరిగి; అర్క+అంశులన్=సూర్యకిరణములను; చొరనీక=ప్రవేశింపనియ్యక; దట్టమై=చిక్కగానుండి; ఇరులు+కవియు=చీకట్లు క్రమ్ము; క్రముక=పోక; పున్నాగ=పొన్న; నారంగ=నారింజ; రంభా=అరటి; నాళికేర+ఆది=కొబ్బరిమున్నగు; విటపి=చెట్లయొక్క; కాంతారవీధిన్=తోపులలో; కెరలు=కూయుచున్న; పిక = కోకిలలయొక్క, శారిక = గోరువంకలయొక్క; కీర=చిలుకలయొక్క; కేకి=నెమళ్లయొక్క; భృంగ = తుమ్మెదలయొక్క; సారస=బెగ్గురు పక్షులయొక్క; ధ్వనిన్=చప్పుడుచే; తనలోని=తనలోనున్న; చంద్రకాంతదరులు = చంద్రకాంతపురాలగుహలు; ప్రతిశబ్దము=ప్రతిధ్వని; ఈనన్=పుట్టించగా; గంధర్వయక్ష=గంధర్వులయొక్క; యక్షులయొక్క; గానఘూర్ణితమగు=సంగీతముచే ధ్వనించు; ఒక్కకోనన్ = ఒకకొండల సందును; కనియెన్=చూచెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా: అక్కడ కొండలోయ యున్నది. దాని కిరుప్రక్కలను వజ్రాయుధముచే తెగగొట్టబడినట్లుగా జేగురైన కొండలున్నవి, ఆమధ్యనుండి గంగ ప్రవహించుచున్నది. దాని కిరుప్రక్కలందు నీటి చలువచే నిసుక తిప్పలందు పెరిగిన చెట్లతోపులలో కూయుచున్న పికాదిధ్వనులు గుహలనుండి ప్రతిధ్వనించుచున్నవి. గంధర్వయక్షుల సంగీతధ్వనులు వినబడుచున్నవి. ప్రవరుఁడాలోయను చూచెను.

క. కనుగొని యిది మునియాశ్రమ
మను తహతహ వొడమి యిచటి ♦ కరిగిన నాకుం
గన నగు నొక తెఱువ యని
మనమునఁ గల దిగులు కొంత ♦ మట్టువడంగన్. 20

టీ: కనుగొని=చూచి; ఇది=ముందుకనిపించుచున్నది; మునియాశ్రమము; అనుతహతహ=అనియెడి ఆతుర్దా; పొడమన్ = పుట్టగా; ఇచటికిన్; అరిగినన్=వెళ్లినచో; నాకున్; ఒక తెఱువ=ఒకదారి; కననగున్ = తెలిసికొన వీలగును; అని; మనమునన్+కలదిగులు=మనస్సులోని బాధ; కొంత=కొంచెము; మట్టు+పడంగన్ =తగ్గగా. (ముందునకన్వయము)

చ. నికటమహీధరాగ్రతట ♦ నిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁక ♦ లై దిగుకాలువ వెంటఁ బూచు మ
ల్లిక లవలంబనంబుగ న ♦ లిప్రకరధ్వని చిమ్మ రేఁగ లో
నికి మణిపట్టభంగసర ♦ ణిన్ ధరణీసురుఁ డేగి చెంగటన్. 21

టీ: ధరణీసురుడు=ప్రవరుడు; నికట=సమీపమునఉన్న; మహీధర+అగ్రతట=కొండచివరి ప్రదేశమునుండి; నిర్గత=స్రవించు; నిర్ఝరధారన్ = సెలయేటిధారను; పాసి=విడిచి; లోయకున్=కోనకు; తలక్రిందుగాన్=నిలువుగా; మల

కలై = మెలికలుగా; దిగుకాలువవెంటన్ = ప్రవహించుకాలువవెంటనే; పూచుమల్లికలు = పూచెడిమల్లెలు; అవలంబనంబుగన్ = ఆధారముగా; అలిప్రకరధ్వని = తుమ్మెదల గుంపురొద; చిమ్మిరేగన్ = ఎక్కువకాగా; మణిపట్టభంగసరణిన్ = మణుల మెట్ల దారిని; లోనికిన్ = కోనలోపలికి; ఏగి; చెంగటన్ = దగ్గరలో (ముందున కన్వయము)

తా: ప్రవరుడు తానున్నచోటికి దగ్గరలో కొండశిఖరమునుండి లోయలోనికి వంపులుతిరిగి తలక్రిందుగా పడుచున్న సెలయేటిపాయకు రెండు ప్రక్కలందు మొలిచి పూచిన మల్లెతీగలు పట్టుకొని, అవి కదలినందున రేగి తుమ్మెదలు రొదసేయుచుండగా రత్నముల మెట్లదారిగుండా కోనలోనికిదిగి ఆసమీపమున...

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువకే ♦ దారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాం ♦ తారంబునం దైందవ
గ్రావాకల్పితకాయమానజటిల ♦ ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పు నొక్కభవనం ♦ బున్ గారుడోత్కీర్ణమున్.

టీ: క్రేవలన్ = ప్రక్కలందు, తావుల్ = పరిమళములను, చల్లు = ప్రసరింపజేయు; చెన్ను + కలువ = ఎఱ్ఱకలువలుగల; కేదారంబుతీరంబునన్ = పల్లపునేలగట్టున; మావుల్ = మామిడిచెట్లు; క్రోవులు = ఎఱ్ఱగోరింటచెట్లు; అల్లిబిల్లిగొనుకాంతారంబునందున్ = ఒకదానితోనొకటి పెనవేసికొన్న అడవిలో; ఐందవగ్రావ = చంద్రకాంత పురాలచే; ఆకల్పిత = తయారుచేయబడిన; కాయమాన = పందిరియందు; జటిల = దట్టముగానల్లుకొన్న; ద్రాక్షాగుళుచ్ఛంబులన్ = ద్రాక్షతీగెలకున్న గుత్తులతో; పూవుందీవెలన్ = పూలతీగెలతోను; ఒప్పు = ప్రకాశించు; ఒక్కభవనంబున్ = ఒక మేడను; గారుడ + ఉత్కీర్ణమున్ = పచ్చనిమాణిక్యములచే పొదుగబడినదానిని (కాంచి అని ముందుదానితో అన్వయము)

తా: ఎఱ్ఱకలువలున్న పల్లపునేలప్రక్కనున్న మామిడి, ఎఱ్ఱగోరింటతోపుసమీపమున చంద్రకాంతపు రాతి స్తంభములుకల్గిన పందిరిమీద అల్లుకొన్న ద్రాక్షతీగెలు, పూల తీగెలనుండి వ్రేలాడు ద్రాక్షపండ్లగుత్తులు, పూలగుత్తులతో ఇంపుగానున్న మేడను (చూచి.)

క. కాంచి తదీయవిచిత్రో
దంచితసౌభాగ్యగరిమ ♦ కచ్చెరువడి య
క్కాంచనగర్భాన్వయమణి
యించుక దరియంగ నచటి ♦ కేగెడువేళన్. 23

టీ: కాంచి = చూచి; తదీయ = దానిసంబంధమైన; విచిత్ర = వింతగానైన; ఉదంచిత = ఇంపైన; సౌభాగ్య = అందముయొక్క; గరిమకున్ = గొప్పదనమునకు; అచ్చెరువడి = ఆశ్చర్యపడి; ఆ + కాంచనగర్భాన్వయమణి = ఆబ్రాహ్మణవంశ

శ్రేష్ఠుడు; ఇంచుక = కొద్దిగా; తఱియంగన్ = సమీపించగా; అచటికిన్; ఏగెడు వేళన్ = వెళ్లునప్పుడు. (ముందునకన్వయము)

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్ర ♦ వీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపు దెలుపు నొక్క ♦ మారుత మొలసెన్. 24

టీ: మృగమదపరిమళవిభవ = కస్తూరి సువాసనకన్న; ద్విగుణిత = రెట్టించబడిన; ఘనసార = పచ్చకర్పూరముతో కూడిన; సాంద్ర = దట్టమైన; వీటీగంధస్థగిత = తాంబూలపువాసనచే కప్పబడిన; ఇతరపరిమళమై = ఇతరసువాసనలుకలదై; మగువ పొలుపు = స్త్రీయున్నట్లుచాయ; తెలుపు + ఒక్క మారుతము = తెలిపెడియొక గాలి; ఒలసెన్ = వీచెను.

తా: కస్తూరి, పచ్చకర్పూరము మున్నగు పరిమళద్రవ్యములతోడి తాంబూలపు వాసన తక్కిన పువ్వులవాసనల నణచి, స్త్రీయున్నట్లు తెలుపుచు వీచినది. ఆగాలివీచుటతో అక్కడ స్త్రీయున్నట్లు తెలిసినది. అలం. కావ్యలింగము.

మ. అతఁ డావాతపరంపరాపరిమళ ♦ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చో టని చేరఁబోయి కనియెన్ ♦ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం ♦ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరు ♦ న్నారీశిరోరత్నమున్. 25

టీ: అతడు; ఆవాతపరంపరా = ఆగాలితెరలవలని; పరిమళవ్యాపారలీలన్ = సువాసనతగులుటచే; ఈ + చోటు = ఈప్రదేశము; జన + అన్వితము = జనులతో కూడినది; అని; చేరన్ + పోయి = దగ్గరకేగి; విద్యుత్ + లతావిగ్రహన్ = మెరపుతీగవంటి శరీరముకలదాని; శతపత్ర + ఈక్షణన్ = వందరేకులుకల తామరపువ్వువంటి కన్నులుకలదాని; చంచరీకచికురన్ = తుమ్మెదలవంటి జుట్టుకలదాని; చక్రస్తనిన్ = చక్రవాకపక్షులవంటి స్తనములు కలదానిని; నతనాభిన్ = లోతైనబొడ్డు కలదాని; ఒకానొకమరుత్ + నారీశిరోరత్నమున్ = దేవతాస్త్రీలలోశ్రేష్ఠురాలైన; నవలాన్ = స్త్రీని; కనియెను = చూచెను.

తా: ఆగాలితెరలవలన ఇక్కడ జనులుందురని చేరబోయి, మెరపుతీగవంటి శరీరము, తామరపువ్వువంటి కన్నులు, తుమ్మెదలవంటి జుట్టు, చంద్రునివంటి ముఖము, చక్రవాకములవంటి స్తనములు, లోతైన నాభికల ఒకానొక దేవతాస్త్రీని చూచెను.

తే. అమలమణిమయనిజమంది ♦ రాంగణస్థ
తరుణసహకారమూల వి ♦ తర్ది మీఁద
శీతలానిల మొలయ నా ♦ సీనయైన
యన్నిలింపాబ్జముఖియు న ♦ య్యవసరమున. 26

టీ: అమల=స్వచ్ఛమైన; మణిమయ=మణులచే చప్టాచేయబడిన; నిజమందిర=తనయింటి; అంగణస్థ= ముందరనున్న; తరుణసహకార = లేతమావిగున్నయొక్క; మూల=మొదటనున్న; వితర్ది మీఁదన్=అరుగుపై; శీతల + అనిలము= చల్లనిగాలి; ఒలయన్=వీచగా; ఆసీనయైన=కూర్చున్న; ఆ+నిలింప+అబ్జముఖియున్+ఆదేవతాస్త్రీయును; ఆ+అవసరమునన్=ఆసమయమందు; (ముందున కన్వయము)

సీ. తతనితంబాభోగ ♦ ధవళాంశుకములోన
యంగదట్టపుఁ గావి ♦ రంగువలన
శశికాంతమణిపీఠి ♦ జాజువాఱఁగ గాయ
లుత్తుంగకుచపాళి ♦ నత్తమిల్లఁ
దరుణాంగుళీఘాత ♦ తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ము ♦ ద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి ♦ యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్యవి ♦ భ్రమముఁ దెలుపఁ
గీ. ప్రౌఢిఁ బలికించు గీతప్ర ♦ బంధములకుఁ
గ్రమకరపంకరుహరత్న ♦ కటకఝణఝ
ణ ధ్వనిస్ఫూర్తి తాళమా ♦ నములు గొలుప
నింపు దళుకొత్త వీణ వా ♦ యింపుచుండి. 27

టీ: తత=వెడల్పైన; నితంబ=పిరుదులయొక్క; ఆభోగ=నిండుమీఁదనున్న; ధవళ + అంశుకములోని=తెల్లనివస్త్రములోపలి; అంగదట్టపు=శావడయొక్క; కావిరంగువలనన్=ఎఱుపురంగుచే; శశికాంతమణిపీఠి=చంద్రకాంతపుపీట; జాజు+వాఱగన్=ఎఱ్ఱగాకాఁగా; కాయలు=వీణెకునమర్చిన సొరకాయలు; ఉత్తుంగకుచపాళిన్=ఎత్తైనస్తనప్రదేశమును; అత్తమిల్లన్=ఆనఁగా; తరుణ=మృదువైన; అంగుళీ=వ్రేళ్లచే; ఘాత=మీటబడిన; తంత్రీస్వనంబుతోన్=తీఁగలధ్వనితో; జిలిబిలిపాట=సన్నని గొంతుపాట; ముద్దులునటింపన్=వినుటకింపుగాఁగా; ఆలాపగతిన్=రాగాలాపముచేయుటలో; చొక్కి=పరవశయై; అరమోడ్పుగనుదోయి=సగము మూసినకన్నులజంట; రతి=సురతవేళకల్గు; పారవశ్యవిభ్రమము=పరవశత్వపువిలాసమును; తెలుపన్=తెల్పఁగా; ప్రౌఢిన్=నేర్పుతో; పలికించు = వీణెపైపలుకునట్లుచేయు; గీతప్రబంధములకున్=సంగీతపుకృతులకు; క్రమ=అందమైన; కరపంకరుహ=పద్మములవంటి హస్తములయొక్క; రత్నకటక=రత్నములుపొదిగినకంకణములయొక్క; ఝణఝణధ్వని = ఝణఝణమనుచప్పుడుయొక్క; స్ఫూర్తి=వినిపించుట; తాళమానములు=తాళప్రమాణములను; గొలుపన్=కల్గింపఁగా; ఇంపుతళుకొత్తన్=హాయిగూర్పఁగా; వీణ; వాయింపుచుండి=వాయించుచు... (ముందున కన్వయము)

తా: ఆమె లోపల యెఱ్ఱనిపావడ కట్టి పైన తెల్లని సన్నని చీర కట్టినది. ఆచీరలోనుండియెఱ్ఱనిపావడకాంతి ఆమె కూర్చున్నచంద్రకాంతపుపీట మీదికిపడిదాని యెఱ్ఱగా జేయుచున్నది. సారకాయలు చంటినానునట్లు వీణెను పట్టుకొని తంత్రీనాద ముతో తనమృదుమధుర కంఠస్వరము మేళవించి రాగాలాపన చేయుచు రతిపార వశ్యము పొందినట్లు తాదాత్మ్యముతో సగముకన్నులు మూసికొని చేతులకున్నరత్న కంకణ ధ్వనులు తాళములుకాగా వీణవాయించుచున్నది. ఆకాలమునకూడ ఉత్తమ స్త్రీలు లోపలపావడలు (under wears) కట్టుకొనువారు. ఇందు తద్గుణ, నిద ర్శన, రూపకము లలంకారములు.

ఉ. అబ్బురపాటుతోడ నయ ♦ నాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసి ♦ తోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ గ ♦ గుర్పొడువ న్మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నల ♦ కూబరసన్నిభు నద్ధరామరున్. 28

టీ: అబ్బురపాటుతోడన్ = ఆశ్చర్యముతో; నయన+అంబుజముల్ = పద్మ ములవంటికన్నులు; వికసింపన్ = విప్పారగా; కాంతి; పెల్లుబ్బి = ఎక్కువై; కనీని కల్ = కంటిలోనినల్లగ్రుడ్లు; వికసిత+ఉత్పలపంక్తులన్ = వికసించిన కలువలప్రోవును; క్రుమ్మరింపగాన్ = నిండించగా; గుబ్బమెఱుంగు = వట్రువయైనిగనిగలాడు; చన్గవ = చంటిజంట; గగుర్పొడువన్ = పులకరింపగా; మదిలోనన్; కోరికల్; గుబ్బటి లంగన్ = ఎక్కువకాగా; నలకూబరసన్నిభున్ = నలకూబరునితో సమమైన; ఆ+ ధరామరున్ = ఆప్రవరుని; చూచెన్ = చూచెను; అలం. పరిణామము.

తా: ఆదేవతాస్త్రీ నలకూబరుడువలె నందమైన ప్రవరుని చూచినది. ఆమె కాశ్చర్యము వేసినది. కన్నులువిప్పారినవి. నల్లగ్రుడ్లు కదలుచు కలువపంక్తులున్న ట్లనిపించినవి. స్తనద్వయము జలదరించినది. మనస్సులో నెన్నోకోరికలు చెలరేగినవి.

ఉ. చూచి ఝుళంఝుళత్కటక ♦ సూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము ♦ లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్కపోక నును ♦ బోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపద ♦ వీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్. 29

టీ: చూచి; ఝుళంఝుళత్కటక = ఝుళఝుళమని చప్పుడగునందెలచే; సూచిత = సూచింపబడిన; వేగ = వేగముకల; పద+అరవిందయై = పాదపద్మములుకలదై; లేచి; కుచంబులున్ = స్తనములును; తుఱుమున్ = కొప్పును; లేనడుము = సన్నని నడుము; అల్లలనాడన్ = జవజవలాడగా; ఆ+ఎడన్ = అక్కడనున్న; పూచిన; ఒక్కపోక = ఒకపోకచెట్టుయొక్క; నునుబోదియన్ = నునుపైన మొదలును; చేరి = చేరబడి; విలోకనప్రభావీచికలన్ = చూపులకాంతి కెరటములతో; తదీయ = అతని

సంబంధమైన; పదవీకలశాంబుధిన్ = వచ్చెడిమార్గ మనెడి పాలసముద్రమును; వెల్లి గొల్పుచున్ = పొంగిపొరలునట్లు చేయుచు; (ముందున కన్వయము)

తా: ఆదేవతాస్త్రీ అతనిచూచి గల్లుగల్లున మ్రోయునందెల చప్పుడుతో తన తొందరను సూచించుచులేచి, ఆప్రక్కనున్న పూచినపోకబోదెకానుకొని నిలువబడి తెల్లనిచూపుల ప్రసరింపజేయుచు అతడువచ్చు మార్గము నే చూచుచుండెను.

మ. మునుమున్ పుట్టెడు కొంకులౌల్యము నిడన్ ♦ మోదంబు విస్తీర్ణతం
జొనుపన్ గోర్కులు గ్రేళ్లు ద్రిప్పమదిమె♦చ్చుల్ ఱెప్పలల్లార్ప న
త్యనుషంగస్థితి ఱిచ్చపాటొసఁగ నొ ♦ య్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫు ♦ ల్లన్నేత్ర పద్మంబులన్.

టీ: లతా+అంగి=తీగెవంటి శరీరముకలస్త్రీ; మునుమున్ = ముందుగా; పుట్టెడుకొంకు = పుట్టినజంకు; లౌల్యమున్ = చాంచల్యమును; (ఆసక్తిని;) ఇడన్ = కల్గించగా; మోదంబు = సంతోషము; విస్తీర్ణతన్ = వైశాల్యమును; చొనుపన్ = పొందింపగా; కోర్కులు; క్రేళ్లుద్రిప్పన్ = గంతులు వేయించగా; మదిమెచ్చుల్ = మనసులోని మెచ్చుకొనుటలు; ఱెప్పలల్లార్పన్ = కనురెప్పలను చలింపజేయగా; అతి+అనుషంగస్థితి = మిక్కిలిచేరికగానుండుట; ఱిచ్చపాటు = కదలకుండుటను; ఒసఁగిన్ = ఇయ్యగా; ఒయ్యారంబునన్ = విలాసముచే; చంద్రికల్ = వెన్నెలలు; తనుకన్ = ప్రకాశింపగా; ప్రఫుల్లత్+నేత్రపద్మంబులన్ = వికసించిన కనుదామరలతో; భూసురన్ = బ్రాహ్మణుని; చూచెన్.

తా: ప్రవరునిచూడగానే ముందు జంకుకల్గినది. ఒంటరిగా నందమైనవాడు లభించెనని సంతోషము హెచ్చినది. కోరికలతో కేరంతలు కల్గినవి. తగినవాడేఅను మెచ్చురెప్పలల్లార్ప జేసినది. అతడింకను దగ్గరకు రాగా నిశ్చేష్టమైనది. ఒయ్యారముగా చూచుచుండగా వెన్నెలలు విరియునట్లున్నది. అలం. ఉత్ప్రేక్ష.

క. పంకజముఖి కప్పుడు మై
నంకురితము లయ్యెఁ బులక ♦ లావిష్కృత మీ
నాంకానలసూచక ధూ
మాంకురములుఁ బోలె మఱియు ♦ నతనిం జూడన్. 31

టీ: మఱియున్; అతనిన్ = ప్రవరుని; చూడన్ = చూడగా; అప్పుడు; పంకజముఖికిన్ = పద్మమువంటి ముఖముకలయామెకు; మైన్ = శరీరమందు; ఆవిష్కృత = ప్రకటింపబడిన; మీనాంక = మన్మథుడను; అనలసూచక = అగ్నినిసూచించు; ధూమ+అంకురములుపోలెన్ = పొగ మొలకలుభలె; పులకలు = గరిపాటులు; అంకురితములు = పుట్టినవి; అయ్యెన్.

తా: ఆమెకు ప్రవరుని చూడగానే మన్మథాగ్ని లోపల పుట్టినట్లు సూచించు పొగవలె గరిపాట్లు పుట్టినవి.

ఉ. తోఁగలి ఱెప్పలం దొలఁగ ♦ దోయుచుఁ బైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమించుకొను ♦ నో ముఖచంద్రు నటంచుఁ బోవనీ
కంగజుఁ డానవెట్టి కది ♦ యన్ గుఱివ్రాసె ననంగ జాఱె సా
రంగమదంబు లేఁజెమటఁ ♦ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్. 32

టీ: తోఁగలిఱెప్పలన్ = వాలైనరెప్పలను; తొలఁగన్ = దూరముగా; త్రోయుచున్; పైపయిన్ = మీదమీదకు, విస్తరిల్లు; కన్నుంగవ = రెండుకన్నులు; ముఖచంద్రున్ = చంద్రునివంటి ముఖమును; ఆక్రమించుకొనునో; అటంచున్ = అని; పోవనీక = పోనియ్యక; అంగజుడు = మన్మథుడు; ఆనవెట్టి = ఆపుదలకు సూచనగా ఆజ్ఞాపించి; కదియన్ = దగ్గరగా; గుఱి = గుర్తు; వ్రాసెన్ = వ్రాసెనో; అనంగన్ = అనునట్లు; సారంగమదంబు = బొట్టుగా పెట్టుకొన్న కస్తూరి; లేఁజెమటన్ = చిరుచెమటచే; జాఱి; లలాటమున్ = నొసటినుండి; డిగ్గి = దిగి; చెక్కులన్ = చెంపలను; క్రమ్మెన్ = ఆవరించెను; అలం. ఉత్ప్రేక్ష.

తా: ఆమె కన్నులు విప్పార్చి ప్రవరుని చూచుచున్నది. చెమటతో బొట్టు చెక్కిళ్లపైకి జారినది. రెప్పలను పైకిత్రోయుచు కన్నులు వెడలుపగుచుండగా మన్మథుడు, ముఖమునుకూడ ఆక్రమించుకొనునేమోయని గీటుగీసినట్లుగా కస్తూరిచారికలున్నవని కవియుత్ప్రేక్షించినాడు.

మ. అనిమేషస్థితి మాన్పె బిత్తరపుఁజూ ♦ పస్వేదతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళ మా ♦ న్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీ ♦ టన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం♦ జూపట్టె నానత్తఱిన్. 33

టీ: గీర్వాణవధూటికిన్ = దేవతాస్త్రీకి; ఆత్తఱిన్ = అప్పుడు; భ్రమరకీటన్యాయము = పచ్చపురుగు తుమ్మెదగునట్లు; (తుమ్మెద పచ్చపురుగును తెచ్చి తన గూటిలో పెట్టి గీపెట్టునట. కొంతసేపటి కాపురుగుకూడ తుమ్మెదవలె గీపెట్టును. తుమ్మెదయేయగును) ఒప్పన్ = ఒప్పునట్లు; మనుష్యునిన్ = ప్రవరుని; భావించుటన్ = ఆలోచించుటచే; తోడనె = వెంటనే; మానుషత్వము = మనుష్యునికున్న ధర్మములు; మెయిన్ = శరీరమున; చూపట్టెన్ = కనపడెనేమో; నాన్ = అనునట్లు; బిత్తరపుజూపు = చంచలమైనచూపు; అనిమేషస్థితిన్ = రెప్పార్పకపోవుటను; మాన్పెన్; నవస్వేదసమృద్ధి = క్రొత్తచెమట ఎక్కువగా పట్టుట; అస్వేదతావృత్తిన్ = చెమట పట్టకపోవుటను; మాన్పెన్; మోహవిభ్రాంతి = ప్రేమాతిశయము వలన ఆలోచన లేకపోవుట; బోధకళన్ = జ్ఞానము కల్గుటను; మాన్పెన్.

తా: దేవతాస్త్రీయైనను మనుష్యుని భావించుటచే భ్రమరకీటన్యాయముగా ఆమెకు రెప్పార్పకుండుట, చెమటపట్టకుండుట, వివేకము అను దేవతా లక్షణములు పోయి రెప్పలుమూయుట, చెమటపట్టుట, మోహముకల్గుట అను మనుష్యధర్మములు కల్గినవి.

వ. ఇట్లతని రూపరేఖావిలాసంబులకుం జొక్కి యక్కమల పత్రేక్షణ యాత్మగతంబున. 34

టీ: ఇట్లు; అతనిరూపరేఖావిలాసంబులకున్ = ఆతనియొక్క అందము, విలాసములకు; చొక్కి = పరవశయై; ఆ + కమలపత్ర + ఈక్షణ = తామర రేకులవంటి కన్నులుకల ఆమె; ఆత్మగతంబునన్ = తనలో; (తలచెను.)

ఉ. ఎక్కడివాఁడొ యక్షతన • యేందు జయంత వసంత కంతులన్
జక్కదనంబునం గెలువఁ • జాలెడివాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ • మెక్కడ యేలనిబంటుగా మరుం
డక్కఁగొనంగ రాదె యకట • యా నను వీఁడు పరిగ్రహించినన్. 35

టీ: (ఇతడు) యక్షతనయ = కుబేరుని కొడుకగు నలకూబరుని; ఇందు = చంద్రుని; జయంత = ఇంద్రుని కొడుకైన జయంతుని; వసంత = వసంతుని; కంతులన్ = మన్మథుని; చక్కదనంబునన్ = అందములో; గెలువన్ = గెల్చుటకు; చాలెడువాడు = సమర్థుడు; ఎక్కడివాడొ = ఎక్కడినుండివచ్చెనో? మహీసురాన్వయంబు = బ్రాహ్మణకులము; ఎక్కడ; ఈతనూవిభవము = ఈ యందము; ఎక్కడ; అకటా = అయ్యో! వీడు = ఇతడు; ననున్ = నన్ను; పరిగ్రహించినన్ = చేపట్టినచో; మరున్ = మన్మథుని; ఏలనిబంటుగా = జీతమియ్యకయే కొలువుసేయు బంటుగా; డక్కగొనంగరాదె = స్వాధీనము చేసికొనరాదా?

తా: ఈ బ్రాహ్మణు డందములో దేవయువకులను మించును. బ్రాహ్మణునికింత అందమా? ఆహా! వీడే నన్ను చేపట్టినచో మన్మథుని బంటుగా నిలబెట్టనా? అనగా మన్మథుని గెల్తును. నన్నిక మన్మథుడు బాధింపలేడని భావము. విషమాలంకారము.

సీ. వదనప్రభూతలా • వణ్యాంబు సంభూత
కమలంబు లన వీని • కన్నులమరు
నిక్కి వీనులతోడ • నెక్కసక్కెము లాడు
కరణి నున్నవి వీని • ఘనభుజములు
సంకల్పసంభవా • స్థానపీఠికవోలె
వెడఁదయై కనుపట్టు • వీని యురము
ప్రతిఘటించు చిగుళ్ల • పై నెత్తువాఁకిన
రీతి నున్నవి వీని • మృదుపదములు

గీ. నేరెటేటియపసలు తెచ్చి • నీరజాప్తు
సానఁబట్టిన రాపాడి • చల్లి మెదిపి

పదను సుధనిడి చేసెనో ♦ పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ ♦ మేనికాంతి. 36

టీ. వీనికన్నులు; వదన=ముఖముయొక్క; ప్రభూతలావణ్య=ఎక్కువ యందమను; అంబుసంభూత=నీటిలోపుట్టిన; కమలంబులనన్=పద్మములనునట్లు; అమరున్=ఒప్పును. వీనిఘనభుజములు; నిక్కి=ఎత్తుకల్గి; వీనులతోడన్ = చెవులతో; ఎకసక్కెములాడుకరణిన్=వికటముగా మాటలాడు రీతిని; ఉన్నవి; వీని యురము=వీనిరొమ్ము; సంకల్పసంభవ=మన్మథునియొక్క; ఆస్థానపీఠికవోలెన్= సభలోని సింహాసనమువలె; వెడదయై=విశాలమై, కనుపట్టున్=కనపడును; వీని మృదుపదములు=వీనిమెత్తనిపాదములు; ప్రతిఘటించు=పోటీచేయు; చిగుళ్లపైన్ =చిగుళ్లమీద; ఎఱ్ఱవాఱినరీతిన్=కోపముతో నెఱ్ఱపడినట్లుగా; ఉన్నవి, వీనిన్, పద్మభవుడు=బ్రహ్మ; నేరెటేటియసల్=జంబూనదిలోని బురదను; తెచ్చి; నీరజ+ఆప్తున్=సూర్యుని; సానబట్టినరాపొడి=సానపట్టగా రాలినపొడిని; చల్లి; పొదిపి =పిసికి; సుధన్=అమృతముతో; పదను+ఇడి=బొమ్మచేయుట కనువుగాచేసి; చేసెనో=సృష్టించెనేమో? కాకున్నన్=లేనిచో; ఈమేనికాంతి=ఇట్టిశరీరపు టందము; కలదె=కల్గునా?

తా: ఇతని కన్నులు ముఖపుటందములో పుట్టిన పద్మములువలె నున్నవి. వీనిభుజము లెత్తుగా చెవులతో పరిహాసముచేయు చున్నట్లున్నవి. రొమ్ము విశాలమై మన్మథుని సభాస్థలిలోని సింహాసనమువలె నున్నది. పాదములు తమతో పోటీచేయు చిగుళ్లపై కోపించినట్లున్నవి. చిగుళ్లకన్న నెక్కువ మృదువుగాను, ఎఱ్ఱగానుఉన్నవి. ఇతని సృష్టించునప్పుడు బ్రహ్మ జంబూనదిలోని బంగారుమట్టితెచ్చి, సూర్యుని సాన పట్టిన పొడిని కలిపి, అమృతముతో పదునుచేసెనా అన్నంత అందముగా తేజస్సుతో అమృతాయమానముగా నున్నాడితడు.

క. సురగరుడోరగనర ఖే
చరకిన్నరసిద్ధసాధ్య ♦ చారణవిద్యా
ధరగంధర్వకుమారుల
నిరతము గనుఁగొనమె పోల ♦ నేర్తురె వీనిన్. 37

టీ: సుర...కుమారులన్=దేవతలు, గరుడులు, నాగులు, నరులు, ఖేచరులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, విద్యాధరులు, గంధర్వులు, నైన యువకులను; నిరతము=ఎల్లప్పుడును; కనుగొనమె=చూడమా? వీనిన్; పోలనేర్తురె సాటిరాగలరా?

మ. అని చింతించుచు మీనకేతనధను ♦ ర్జ్యాముక్తనారాచ దు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహుఁడై ♦ దీపించు మెం ద త్తఱం

బునఁ బేరెత్తిన లజ్జ నంఘ్రికటకం ♦ బుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జని ప♦ల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.

టీ: అని; చింతించుచున్=ఆలోచించుచు; మీనకేతన=మన్మథునియొక్క; ధనుర్జ్యాముక్త=వింటినారినుండి విడువబడిన; నారాచ=బాణములచేనైన; దుర్దిన=సూర్యరశ్మితగులని దినముచే; సమ్మూర్ఛిత=మూర్ఛనొందిన; (వికసింపని) మానస+అంబురుహాస్యై=మనస్సను పద్మము కలదై; దీపించు=పైకికన్పడు; పెన్+తత్తంబునన్=ఎక్కువతొందరతో; పేరెత్తినలజ్జన్=చిట్లబోయిన సిగ్గుతో; అంఘ్రికటకంబుల్=కాలియందెలు; మ్రోయన్=చప్పుడుకాగా; అడ్డంబు = (ప్రవరుని త్రోవకు) అడ్డముగా; నిల్చినన్; ఆ+అచ్చరన్=ఆయప్సరసను; చూచి; వాడు=ప్రవరుడు; విభ్రాంతుడై=ఆశ్చర్యపడి (తెల్లబోయి;) చేరన్+చని=దగ్గరగావెళ్లి పల్కెన్.

తా: ఆమె మన్మథవేదన హెచ్చగా, తాళలేక, సిగ్గుపోగా, కాలియందెలు మ్రోయగా, పోకబోయెనుండి అతని త్రోవ కడ్డముగా, వచ్చి నిలిచెను. అట్టిసాహసము నెక్కడను చూడనివాడగుటచే తెల్లపోయి (తగుపాటి) దగ్గరగా వెళ్లి ఇట్లనెను. రూపకను.

ఉ. ఎవ్వతె వీవు భీతహరి ♦ ణేక్షణ! యొంటి చరించె దోటలే
కివ్వనభూమి? భూసురుఁడ ♦ నే బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమున ♦ కుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగద ♦ వే! తెరు వెద్ది? శుభంబు నీ కగున్. 39

టీ: భీతహరిణ+ఈక్షణ=జడిసిన లేడికన్నులవంటి కన్నులు కలదానా! ఈవు=నీవు; ఎవ్వతెవు? ఈ+వనభూమిన్=ఈయడవిలో; ఓటలేక=భయములేక; ఒంటిచరించెదు=ఒంటరిగా తిరుగుదువు; నేన్; భూసురుడన్=బ్రాహ్మణుడను; ప్రవర+ఆఖ్యుడన్=ప్రవరుడను పేరు కలవాడను; క్రొవ్వునన్=మదముచే; ఈ+నగ+అగ్రమునకున్=ఈకొండ శిఖరమునకు; చనుదెంచి=వచ్చి; త్రోవ; తప్పితిన్; ఇంకన్; పురంబుఁజేరన్=పురముచేరుటకు; ఏ+విధిన్ = ఏరీతిని; కాంతున్=చూతును; తెరువు=త్రోవ; ఎద్ది=ఏది; తెల్పగదవే=తెల్పుమమ్మా! నీకున్; శుభంబు=మేలు; అగున్=అగుగాక!

తా: ఓతరుణీ! నీవెవరెవు? భయములేకుండ నొంటరిగా నీవనమున చరించుచుంటివే. నేను ప్రవరుడను బ్రాహ్మణుడను. ఒళ్లుమదించి (ఇక్కడ ఇంత బాధ కల్గునని తెలియక) ఈశిఖరమునకు వచ్చితిని. త్రోవతప్పితిని. నాపట్టణముచేరుటకేదైన త్రోవ చెప్పుమమ్మా! నీకు మేలుకల్గును.

క. అని తనకథ నెఱిఁగించినఁ
దన కనుఁగవ మెఱుఁగులుబ్బఁ ♦ దాటంకములుం

జనుఁగవయు నగుము వడఁకఁగ
వనిత సెలవివాఱ నవ్వి ♦ వానికి ననియెన్. 40

టీ: అని; తనకథన్ = తనవృత్తాంతమును; ఎఱిఁగించినన్ = తెల్పగా; వనిత = స్త్రీ; తనకనుఁగవమెఱుఁగులు = తనకంటికాంతులు; ఉబ్బన్ = ఎక్కువకాగా; తాటంకములన్ = చెవులకమ్మలను; చనుగవయును = రెండుస్తనములును; నగుమున్; వడఁకఁగన్ = కదలగా (సంతోషాతిశయముతో;) సెలవివాఱన్ = పెదవుల వెంబడి విచ్చునట్లు (చిఱునవ్వు) నవ్వి; వానికిన్ = అతనితో; అనియెన్ = పల్కెను.

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు ♦ వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవ ♦ రాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియకాక నీ వెఱుఁగ ♦ వే మును వచ్చినత్రోవచొప్పు; నీ
కింతభయంబు లే కడుగ ♦ నెల్లిద మైతిమి; మాట లేటికిన్. 41

టీ: భూసురేంద్ర = బ్రాహ్మణశ్రేష్ఠుడా! ఇంతలు = ఇంతవిశాలమైన; కన్నులు; ఉండన్; తెరువు = త్రోవ; ఎవ్వరిన్; వేఁడెదు = అడిగెదవు; ఏకాంతమునందునున్న = రహస్యప్రదేశమునన్నున్న; జవ+ఆండ్రన్ = యువతులను; నెపంబిడి = వంకపెట్టుకొని; పల్కరించులాగు = పల్కరించురీతి; ఇంతియకాక = ఇంతేకాక; మును = ముందుగా; వచ్చినత్రోవచొప్పు = వచ్చినదారియేదో; నీవు; ఎఱుఁగవే; ఇంత = కొంచెమైనను; భయంబులేక+అడుగన్ = నిర్భయముగా; అడుగుటకు; ఎల్లిదమైతిమి = చులకనైతిమి; మాటలు + ఏటికిన్ = పలుమాటలేల? ఇందు 'ఏకాంతమునందు నున్న జవరాండ్రను' అన్నపదములు సాభిప్రాయములు. వీటిచే మనమిచ్చవచ్చినట్లుండవచ్చుననియు, భోగించుటకు యోగ్యమైన వయస్సనియు సూచింపఁజేసినది.

తా: బ్రాహ్మణుడా! ఇంత పెద్దపెద్దకన్నులున్నవే. వచ్చినదారి తెలియదా నీకు? ఏదో నెపముపెట్టుకొని రహస్యములోనున్న పడుచుభామినులను పల్కరించుటకై నీవు చేసిన యెత్తిది. సరేలే. అంతచులకనైతిమి. ఇంక అని యేమిప్రయోజనము? అసహ్యపాలఁగాను.

వ. అని సనర్మగర్భంబుగాఁ బలికి క్రమ్మఱ నమ్మగువ యమ్మహీసురున కిట్లనియె.

టీ: అని; సనర్మగర్భంబుగా = ప్రేమతోచునట్లుగా; (తన అభిప్రాయము కొంతతెలియునట్లుగా) పలికి; క్రమ్మఱన్ = మరల; ఆ+మగువ = ఆస్త్రీ; ఆ+మహీసురునకున్ = ఆబ్రాహ్మణునితో; ఇట్లు+అనియెన్.

సీ. చిన్నివెన్నెలకందు ♦ వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁ ♦ బుట్టు మాకు
రహిఁబుట్టు జంత్రగా ♦ త్రముల రాల్ గరఁగించు
విమలగాంధర్వంబు ♦ విద్య మాకు

ననవిల్తుశాస్త్రంపు • మినుకు లావర్తించు
పని వెన్నతోడఁ బె • ట్టినది మాకు
హయమేధరాజసూ • యములనఁ బేర్వడ్డ
సవనతంత్రంబు లుం • కువలు మాకుఁ

గీ. గనకనగసీమఁ గల్పవృ • క్షములనీడఁ
బచ్చరాచట్టు గమిరచ్చ • పట్టుమాకుఁ
బద్మసంభవ వైకుంఠ • భర్గసభలు
సాముగరిడీలు మాకు గో • త్రామరేంద్ర. 43

టీ: గోత్రా+అమర+ఇంద్ర=భూసురశ్రేష్ఠుడా! చిన్నివెన్నెలకందున్ =బాలచంద్రుని; వెన్నుదన్ని=వెనుదగిలి; సుధా+అబ్ధిన్=పాలసముద్రమున; పొడమినచెలువ=పుట్టిన స్త్రీ (లక్ష్మి) మాకుతోఁబుట్టువు=కూడపుట్టినది. (అప్సరసలు కూడ పాలసముద్రములో పుట్టినవారే) రహి+పుట్టన్=రక్తికట్టునట్లు; జంత్ర= వాద్యపరికరములతోను; గాత్రములన్=కంఠముతోను; రాల్+కరగించు=రాళ్లను కరగునట్లుచేయు; విమలగాంధర్వంబు=స్వచ్ఛమైన సంగీతము; (ఇది గాంధర్వులకు కులవిద్య) మాకు, విద్య = వచ్చినచదువు; ననవిల్తుశాస్త్రంపుమినుకులు=మన్మథుని శాస్త్రముమాటలు; (కళాశాస్త్ర వచనములు) ఆవర్తించుపని=వల్లింపజేయుపని; మాకు, వెన్నతోడన్+పెట్టినది=చిన్నప్పటినుండియు నభ్యసింపబడినది; హయమేధ=అశ్వమేధము; రాజసూయములు; అనన్=అనగా; పేరు+పడ్డ=పేరందిన; సవనతంత్రంబులు=యాగక్రియలే; మాకు; ఉంకువలు=కన్యలకై యిచ్చుధనము; కనకనగసీమ=మేరుపర్వతప్రాంతము; కల్పవృక్షములనీడన్=నందనములోని దేవతావృక్షముల నీడయందలి; పచ్చరాచట్టుగమి=మరకతమణులతో కూర్చిన ప్రదేశము; మాకు; రచ్చపట్టు=సభచేసెడిచోటు, పద్మసంభవ=బ్రహ్మయొక్క; వైకుంఠ =విష్ణువుయొక్క; భర్గ=శివునియొక్క; సభలు; మాకు; సాముగరిడీలు=అభ్యాసము చేసికొను ప్రదేశములు.

తా: మేము లక్ష్మీదేవికి తోబుట్టువులము. జంత్రగాత్రముల సంగీతముపాడి రాళ్లను కరగింపగలము. కళాశాస్త్రము నెరిగి అరితేరినారము. మేము అశ్వమేధరాజసూయములు చేసినవారికి లభింతుము. మేరుసానువు, కల్పవృక్షముల నీడలందలి మరకతమణులపై కూర్చుందుము. త్రిమూర్తుల కొలువుకూటములలో విద్యాప్రదర్శనములు చేయుచుందుము.

క. పేరు వరూథిని విప్రకు
మార! ఘృతాచీ తిలో త్తమా హారిణీ హే
మా రంభా శశిరేఖ లు
దారగుణాఢ్యలు మదీయ • లగు ప్రాణసఖుల్ 44

టీ: విప్రకుమార=బ్రాహ్మణుల చిన్నవాడా! పేరు=నా పేరు; వరూధిని; ఉదారగుణ+ఆఢ్యలు=మంచిగుణము కలవారైన; ఘృతాచి, తిలోత్తమ, హరిణి, హేమ, రంభ, శశిరేఖయును, మదీయలగు=నాసంబంధమైన; ప్రాణసఖుల్=చెలికత్తెలు.

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీ ♦ భాగంబులం బొల్చు ని
మ్మిహికాహార్యమునం జరింతు మెపుడున్ ♦ ప్రేమ న్నభోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖే ♦ లన్మంజరీసౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివి మ ♦ త్కాంతారసంతానముల్.

టీ: బహురత్నద్యుతి=ఎక్కువ రత్నకాంతులతో; మేదుర = దట్టమైన; ఉదర=మధ్యభాగములుకల; దరీభాగంబులన్=గుహలలో; పొల్చు=ప్రకాశించు; ఈ+మిహికా+అహార్యమునన్ = ఈమంచుకొండయందు; ఎపుడున్=ఎల్లపుడును; ప్రేమన్=ప్రేమతో; చరింతుము=సంచరింతుము; నభః+వాహినీ=ఆకాశగంగ యొక్క; లహరీ=ప్రవాహమువలన; శీతల=చల్లనైన గంధవాహ=గాలిచే; పరిఖేలత్=కదలెడి; మంజరీపూలగుత్తుల యొక్క; సౌరభ = పరిమళముల యొక్క; గ్రహణ=గ్రహించు; ఇందిందిర=తుమ్మెదలచే; తుందిలంబులు=బలిసినవి - ఎక్కువగాగలవైన; ఇవి; మత్+కాంతారసంతానముల్=మా విహారప్రదేశములు.

క. భూసురకైతవకుసుమ శ
రాసన! మాయింటవింద ♦ వైతివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేదదేఱి ♦ యాతిథ్యంబున్. 46

టీ: భూసురకైతవ=బ్రాహ్మణుడను నెపముననున్న; కుసుమశరాసన=మన్మథుడా! మాయింటన్=మాయింటిలో; విందవు=చుట్టమవు; ఐతివి; సముదంచత్+మణిభవన=అందమైన మణిమయమైన మేడలో; ఆసీనతన్=కూర్చుండుటచే; సేదదేఱి=శ్రమతీర్చుకొని; ఆతిథ్యంబున్=అతిథిపూజను; గైకొనుము=పరిగ్రహింపుము.

తా: మన్మథునివంటి బ్రాహ్మణుడా! నీవు మాయింటికిచుట్టముగావచ్చితివి. ఈ మేడలో కూర్చుండి విశ్రాంతి తీసికొని ఆతిథ్యము స్వీకరించి వెళ్లుము.

తే. కుందనమువంటి ♦ మేను మ ♦ ధ్యందిన నాత
పోష్మహతిఁ గందె వడ దాఁకె ♦ నొప్పు లొలుకు
వదన మస్మద్గృహంబు పావనము సేసి
బడలికలు వాసి చను మన్న ♦ బ్రాహ్మణుండు. 47

టీ: కుందనమువంటి=బంగారమువలెనున్న; మేను=దేహము; మధ్యందిన=మధ్యాహ్నపువేళనున్న; ఆతప+ఊష్మహతిన్=ఎండవేడితగులుటచే; కందెన్=

నల్లపడెను; ఒప్పులొలుకు=ముద్దులొలుకుచున్న; వదనము=ముఖము; వడదాకెన్ వేడితగిలి వాడినది; అస్మత్+గృహంబు=నాయిల్లు; పావనంబు+చేసి=పవిత్రము చేసి; బడలికలు+పాసి=శ్రమపోగొట్టుకొని; చనుము=వెళ్లుము; అన్నన్=అనగా; బ్రాహ్మణుడు=ప్రవరుడు. (పల్కెను)

ఉ. అండజయాన నీ వొసఁగు ♦ నట్టి సపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగరాదు పోవలయు ♦ నూరికి నింటికి నిప్పు డేను రా
కుండ నొకండువచ్చి మఱి♦యొండునె? భక్తియ చాలు సత్క్రియా
కాండముఁదీర్ప వేగ చనఁ ♦ గావలయుం గరుణింపు నాపయిన్.48

టీ: అండజయాన=హంసవంటినడక కలదానా! నీవు; ఒసగునట్టి=చేయునట్టి; సపర్యలు=పూజలు-మర్యాదలు; మాకున్; వచ్చెన్=ముట్టెను; ఇంగున్; ఉండంగరాదు=ఉండుటకు వీలుపడదు; ఊరికిన్=మాయూరికి; పోవలయున్; ఇప్పుడు; ఇంటికిన్=మాఇంటికి; రాకుండఁన్+ఒకండు=రానిచో నొకటి; వచ్చి మఱియొండునె=వచ్చినమఱొకటియునా? భక్తి+అ=భక్తియే; చాలున్. సత్క్రియాకాండము=సత్కర్మలనన్నింటిని; తీర్పన్=తీర్చుకొనుటకు; వేగ=వేగమే; చనగావలయున్=వెళ్లవలెను; నాపయిన్ = నామీద; కరుణింపుము = దయ చూడుము.

తా: ఓతరుణీ! నీవు చేయుమర్యాదలు నాకు ముట్టినట్లే భావించుకొనుము. భక్తియేచాలు. మాయింటికి వచ్చిన నొకటియు, రాకున్న మఱొకటియునా? మాధ్యాహ్నిక క్రియలను (అనుష్ఠానములను) తీర్చుకొనుటకై వేగమే పోవలెను. నాపై దయచూడుము.

ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు ♦ నెద్ది యుపాయము మీమహత్త్వము
ల్మానిని! దివ్యముల్ మదిఁ ద♦లంచిన నెందును మీకసాధ్యముల్
గానము గాన తల్లి! ప్రజ ♦ లన్ ననుఁ గూర్పు మటన్న లేఁత న
వ్వాననసీమఁ దోఁప ధవ ♦ ళాయతలోచన వాని కిట్లనున్. 49

టీ: ఏన్=నేను; ఇకన్, ఇల్లు+చేరుటకున్; ఉపాయము; ఎద్ది = ఏది? మానిని=అభిమానముకలదానా! మీమహత్త్వముల్=మీమహిమలు; దివ్యముల్ =దేవతా సంబంధమైనవి; మదిన్=మనసులో; తలంచినన్; ఎందును = ఎక్కడ నైనను; మీకున్; అసాధ్యముల్=సాధింపశక్యముకానివి; కానము=చూడము-లేవు. కానన్; తల్లి=ఓయమ్మా! నన్నున్; ప్రజలన్=ప్రజలతో; కూర్పుము= కలుపుము; అటన్నన్=అనగా; ధవళ+ఆయతలోచన=తెల్లనిదీర్ఘమైన కన్నులు కలయామె; లేతనవ్వు=చిరునవ్వు; ఆననసీమన్=ముఖమందు; తోఁపన్ = కన్పడగా; వానికిన్=ప్రవరునితో; ఇట్లు+అనున్,

తా: నాకిల్లు చేరుటకేదియుపాయము? మీరుదివ్యమహిమ కలవారగుటచే మీకు సాధ్యముకాని పనులులేవు. కాన ఓతల్లీ! నన్ను ప్రజలలో పడవేయుము.

(తానిప్పుడడవిలోనున్నాడు. ఊరిలోనికి తన వారి మధ్యకు వచ్చుటయే ప్రజలలో పడుట.) అని ప్రవరుడనగా వరూధిని చిరునవ్వునవ్వి ఆతనితో నిట్లన్నది. (ఇచ్చట 'తల్లి' అనుటచే ఆతని మాతృభావము వ్యక్తమైనది.

ఉ. ఎక్కడియూరు కాల్నిలువ ♦ కింటికిఁ బోయెద నంచుఁ బల్కెదీ
వక్కట మీకుటీరనిల ♦ యంబులకున్ సరిరాకపోయెనే
యిక్కడిరత్నకందరము ♦ లిక్కడినందనచందనోత్కరం
బిక్కడిగాంగసైకతము ♦ లిక్కడియాలవలీనికుంజముల్. 50

టీ: ఎక్కడియూరు = ఊరేమిటి? (మాటిమాటికి 'మాయూరు, మాయూరు' అందువు. అక్కడేమున్నది? అని ఎగతాళిగా అనుట) కాల్+నిలువక = మోపినకాలాపలేక; ఇంటికిన్; పోయెదను+అంచున్ + పల్కెదు + ఈవు; అక్కట = అయ్యో! మీకుటీరనిలయంబులకున్ = మీతాటాకు గుడిసెలకు; ఇక్కడి; రత్నకందరములు = రత్నములున్న గుహలు; నందన = ఉద్యానములోని; చందన+ఉత్కరంబు = మంచిగంధపుచెట్లతోపు; గాంగసైకతములు = గంగానదిలోని యిసుకతిన్నెలు; లవలీనికుంజముల్ = వెన్నెల తీగలల్లుకొన్న పొదరిండ్లు; సరిరాకపోయెనే = సాటిరాలేకపోయినవా?

తా: ఏమిటయ్యా! ఊరు ఊరందువు. అక్కడేమున్నది. పూరిగుడిసెలే కదా! ఇక్కడనున్న రత్నాలగుహలు, గంధపుచెట్లతోపులు, యిసుకతిన్నెలను మీపూరిండ్లకు సాటియేరాలేక పోయెనా?

ఉ. నిక్కము దాపనేల ధర ♦ ణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు ననుఁ ♦ జిత్తజు బారికి నప్పగించెదో;
చొక్కి మరందమద్యముల ♦ చూఱలఁ బాటలు పాడు తేంట్లు సొం
పెక్కిన యట్టిపూవుఁబొద రిండ్లను గౌఁగిట గారవించెదో. 51

టీ: ధరణీసురనందన = బ్రాహ్మణ కుమారుడా! ఇంకన్ = ఇప్పుడు; నిక్కము = నిజము; దాపనేల = దాచుటయేటికి? నాకున్; నీపయిన్; మనంబు = మనస్సు; చిక్కెన్ = లగ్నమైనది; ననున్; చిత్తజుబారికిన్ = మన్మథబాధకు; అప్పగించెదో = వదలుదువో; మరందమద్యముల చూఱలన్ = పూదేనెయను కల్లుతొట్లలతో; చొక్కి = మదించి; పాటలు+పాడు; తేంట్లన్ = తుమ్మెదలచే; సొంపు+ఎక్కిన = అందగించిన; పూవుఁబొదరిండ్లను = పూలుపూచిన పొదరిండ్లలో; కౌఁగిటన్ = కౌగిలింతలచే; గారవించెదో = మర్యాదచేయుదువో.

తా: ఓవిప్రవరా! నిజము దాచుట యేటికి? నామనసు నీపైతగుల్కొన్నది. నన్నిక్కడ బాధపడుమని వెళ్లిపోదువో, దయతలచి, మకరందము త్రాగి రొదసేయు తుమ్మెదలున్న పూచిన పొదరిండ్లలో నన్ను కౌగిలించుకొని ఆనంద పరతువో? (అది నీచిత్తము-నాయదృష్టమును.)

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను
వనజేక్షణ యిట్లు వలుక ♦ వరుసయె వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనునే కామింప? మది వి ♦ చారము వలదే. 52

టీ: అనుటయున్=అనగానే; ప్రవరుండు; ఇట్లు+అనున్; వనజ+ఈక్షణ =పద్మములవంటి కన్నులు కలదానా! ఇట్లు=ఈరీతిగా; పలుకన్=అనుట; వరుసయె=న్యాయమా? వ్రతులై=జపతపోగ్నిహోత్రములు చేసికొనుచు; దినములు =కాలమును; గడపెడు; విప్రులన్=బ్రాహ్మణులను; కామింపన్+తగునే= కోరవచ్చునా? మదిన్=మనసులో; విచారము=ఆలోచన; వలదే=ఉండవద్దా?

తా: ప్రవరుడిట్లన్నాడు. నీవిట్లనవచ్చునా? వ్రతములతో కాలక్షేపము చేసెడి బ్రాహ్మణులను కోరవచ్చునా? ఆలోచించుము.

ఉ. వేలిమియు న్సురార్చనయు ♦ విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళయతిక్రమించె జన ♦ నీజనకుల్ కడువృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు ♦ సూచుచు నుందు రాహితాగ్ని నేఁ
దూలుసమస్తధర్మములుఁ ♦ దొయ్యలి నేఁ డిలు సేర కుండినన్. 53

టీ, తొయ్యలి=ఓవరూధినీ; వేలిమియున్=హోమములు; సుర+అర్చనయున్=దేవతాపూజయు; విప్రసపర్యయున్=బ్రాహ్మణుల పూజయును; చిక్కెన్ =తప్పినది; భుక్తికిన్=భోజనమునకు; వేళ; అతిక్రమించెన్=దాటెను; జననీజనకుల్=తల్లిదండ్రులు; కడువృద్ధులు=మిక్కిలిముదుసలులు; ఆకటన్ = ఆకలిచే; సోలుచున్=పడిపోవుచు; చింతతోన్=(నేనింకనురాలేదను) విచారముతో; ఎదురు సూచుచునుందురు; నేన్=నేను; ఆహితాగ్ని=యజ్ఞము చేసినవాడను; నేఁడు =ఇప్పుడు; ఇల్లు+చేరకుండినన్=ఇల్లుచేరకపోయినచో; సమస్తధర్మములున్= అన్ని గృహస్థకార్యములును; తూలున్=చెడిపోవును.

తా: నాకు హోమము, దేవతార్చన, అతిథిపూజ చేసికొను వేళ తప్పినది. ముసలివారైన నాతల్లితండ్రులాకలిచే సోలుచు నాకై యెదురుచూచుచుందురు. అగ్నిహోత్రములుచేసి కోవలసిన నేనిప్పుడిల్లు చేరకపోయినచో గృహస్థధర్మములు చెడును.

ఉ. నావుడు విన్నఁబాటు వద ♦ నంబున నించుక దోఁప బల్కె నో
భావజరూప! యిట్టియెల ♦ ప్రాయము వైదికకర్మనిష్ఠలం
బోవఁగ నింక భోగములఁ ♦ బొందుట యెన్నఁడు యజ్ఞకోటులం
బావను లౌటకు న్ఫలము ♦ మా కవుఁగిళ్ల సుఖించుటేకదా. 54

టీ: నాథ్రుడున్ = అనినతర్వాత; వదనంబునన్ = ముఖమందు; ఇంచుక = కొద్దిగా; విన్న బాటు = తెల్లపోవుట; తోపన్ = కనపడగా; వరూధిని పల్కెన్; ఓ భావజరూప = మన్మథునివంటి రూపముకలవాడా! ఇట్టియెలప్రాయము = ఇటువంటి యౌవనము; వైదికకర్మనిష్ఠలన్ = వేదోక్తమైన యజ్ఞయాగాది కర్మలందలి ఆసక్తితో; పోవగన్ = గడవగా; ఇంకన్; భోగములన్ = ఇంద్రియ సుఖములను; పొందుట = అనుభవించుట; ఎన్నఁడు? యజ్ఞకోటులన్ = ఎన్నో యజ్ఞములచే; పావనులు + ఔటకున్ = పవిత్రులగుటకు; ఫలము = లాభము; మాకవుగిళ్లన్ = మా కౌగిలింతలలో; సుఖించుట + ఏ = సుఖించుటయే కదా!

తా: ఓ బ్రాహ్మణుడా! యౌవనమున్న పదిరోజులు వైదికకర్మలతో గడపినచో ఇక సుఖము ననుభవించుట యెప్పుడు? కాక మీరీ యజ్ఞయాగాదులు చేయుటకు ఫలము మాకౌగింలితలు పొందుటేకదా! ఫలితము దొరకుచుండగా ఇక కర్మ చేయనేటికి? కర్మలు చేయవలెనను తొందరలో ఫలితమును చెడగొట్టు కొనకుము.

సీ. సద్యోవినిర్భిన్న ♦ సారంగనాభికా
హృతమై పిసాళించు ♦ మృగమదంబు
కనటువో బీఱెండఁ ♦ గరఁగి కఱ్ఱలనంటి
గమగమవలచుఁ జొ ♦ క్కపుజవాజి
పొర లెత్తి ఘనసార ♦ తరువులఁ దనుఁ దాన
తొరఁగిన పచ్చక ♦ ప్పురపుసిరము
గొజ్జంగి పూఁబొదల్ ♦ గురియంగఁ బటికంపు
దోనల నిండినయట్టి ♦ తుహినజలము

గీ. వివిధకుసుమకదంబంబు ♦ దివిజతరుజ
మృదులవసనఫలాసవా ♦ మేయరత్న
భూషణంబులు గల విందు ♦ భోగపరుఁడ
వయి రమింపుము ననుఁ గూడి ♦ యనుదినంబు॥ 55

టీ: ఇందున్ = ఇక్కడ; సద్యః + వినిర్భిన్న = అప్పుడే బ్రద్దలైన; సారంగనాభికా హృతమై = కస్తూరి మృగముల బొడ్డులనుండి తేబడి; పిసాళించు = సువాసన వేయు; మృగమదంబు = కస్తూరి; కసటు + పోన్ = మురికిపోవునట్లు; బీఱెండన్ = మండు టెండచే; కరగి; కఱ్ఱలన్ + అంటి = కర్రలనంటుకొని; గమగమవలచు = గుప్పున పరిమళించెడి; చొక్కపుజవాజి = స్వచ్ఛమైన జవ్వాదియు; పొరలు + ఎత్తి = పైపట్టలూడి; ఘనసారతరువులన్ = కర్పూర పుటరటి చెట్లనుండి; తనుఁ దాన = దానంతటది; తొరగిన = క్రిందరాలిన; పచ్చకప్పురపుసిరము = పచ్చకర్పూరపుపొడి; గొజ్జంగిపూ

బొదల్ = పన్నీరువూవులపొదలు; కురియంగన్ = వర్షింపగా; పటికంపుదొనలన్ = స్ఫటికపు రాతినేల అందలి తొట్టులలో; నిండినయట్టి; తుహినజలము = పన్నీరు; వివిధ = పలువిధములైన; కుసుమకదంబంబు = పూలగుత్తులు; దివిజతరుజ = కల్ప వృక్షము నుండి వచ్చిన; మృదులవసన = మెత్తని వస్త్రములు; ఫల = పండ్లు; ఆసవ = మద్యము; అమేయ = ఊహింపరాని-ఎన్నో; రత్నభూషణంబులు = రత్నములు పొదివిన అలంకారములు; కలవు; భోగపరుడవై = భోగాసక్తికలవాడవై; అనుదినంబు = ప్రతిదినమును; ననున్; కూడి = కలిసి; రమింపుము = క్రీడింపుము.

తా: ఇందు అప్పటి కప్పుడు కస్తూరిమృగముల బొడ్డులను కోసి తెచ్చిన కస్తూరి, జవ్వాది, పన్నీరు, పచ్చకర్పూరపురజము, ఇంకను ఎన్నో పూవులు, పండ్లు, వస్త్రాభరణాదులు నున్నవి. నీవు భోగమందాసక్తి కలిగి నాతో కూడి సుఖించుము. అలం. ఉదాత్తము.

క. అంధునకుఁ గొఱయె వెన్నెల
గంధర్వాంగనల పొందు ♦ గాదని సంసా
రాంధువునఁ బడియె దకట! ది
వాంధము వెలుఁగుఁ గని గొంది ♦ నడఁగినభంగిన్. 56

టీ: అంధునకున్ = గ్రుడ్డివానికి, వెన్నెల; కొఱయె = పనికివచ్చునా? అక్కట = అయ్యో! దివా+అంధము = పగలు కన్నులు కన్పడని గ్రుడ్లగూబ; వెలుఁగుకని = వెలుతురుచూచి; గొందిన్ = చీకటిమూలలందు; అడగినభంగిన్ = మణగినట్లు; గంధర్వాంగనలపొందు = గంధర్వస్త్రీలతోడికలయిక; కాదు+అని = అక్కరలేదని; సంసార+అంధువునన్ = సంసారమను నూతిలో; పడియెదు = పడుచున్నావు.

తా: గ్రుడ్డివానికి వెన్నెల యుపయోగము లేదు. గ్రుడ్లగూబ వెల్తురుచూచి చీకటిగొందిలో మణుచుకొని యుండునట్లు నీవు గంధర్వస్త్రీల పొందు కాదని సంసారములో పడుచునందు వేమి? ఇంత తెలివి తక్కువ యుండునా? సరిచూచుకొనుము. అలం. ప్రతివస్తూపమ, ఉపమయు.

ఉ. ఎన్నిభవంబులం గలుగు ♦ నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి ♦ కేలఁ గపోలము లూఁది చూపులన్
విన్నదనంబు తోఁపఁ గను ♦ వేదుఱునం బయిగాలి సోకినన్
వెన్నవలెం గరంగు నలి ♦ వేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్. 57

టీ: ఇక్షుశరాసన = మన్మథునియొక్క; సాయకవ్యథా = బాణపుబాధచే; ఖిన్నతన్ = విచారముతో; వాడి = నవకము చెడి; వత్తలయి = ఎండిపోయినట్లయి; కేలన్ = చేతులమీద; కపోలములు+ఊది = చెక్కిళ్లుపట్టుకొని; చూపులన్; విన్నదనంబు = దైన్యము; తోపన్ = తోచగా; కను వేదుఱునన్ = చూచినఅపేక్షచే; పయి

గాలిసోకినన్ = (వలచిన పురుషునిమీదినుండివచ్చు) గాలి సోకినచో; కరంగు + ఆలివేణులన్ = కరగెడి స్త్రీలను; కౌఁగిటన్ = కౌగిటిలోనికి; చేర్చు భాగ్యముల్; ఎన్ని భవంబులన్ = ఎన్నిజన్మలకు; కలుగున్ = కొరకును ?

తా: ఎవరికైనను తన్ను చూడగానే మోహించి మన్మథబాధచే కృశించి, ఆ విచారముతో సంపకు చెయ్యిచేచ్చుకొని కోరిక తీర్చుమన్నట్లుగా వెఱ్ఱిచూపులు చూచుచు, వలపుకాని మీదినుండి గాలి తగిలినంతనే కరగిపోయి సులభముగా చెప్పినట్లు వినెడి యువతులను కౌగిలించుకొని సుఖించు నదృష్ట మెన్ని జన్మలకు లభించునో ? (అట్టి దుర్లభమైన నా ప్రేమ లాభమును చేజేతుల త్రోసిపుచ్చకుము. అని భావము.)

క. కుశలత యే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రి ♦ య నిరోధమునం
గృశుఁడవయి యాత్మ నలఁచుట
సశరీరస్వర్గసుఖము ♦ సమకొని యుండన్. 58

టీ: సశరీరస్వర్గసుఖము = మానవశరీరముతో నుండగనే స్వర్గమందలి అప్సరస్సంభోగాదిసుఖము; సమకొని = సిద్ధించి; ఉండన్ = ఉండగా; వ్రతములన్ = వ్రతములతో; అగు నశనాయాసమునన్ = అగునట్టి ఆకలి బాధచేతను; ఇంద్రియానిరోధమునన్ = చక్షురాదీంద్రియములను విషయములైన రూపాదులననుభవింప నియ్యక నిరోధించుటచేతను; కృశుడవయి = చిక్కి; ఆత్మన్ = జీవుని; అలచుట = శ్రమపెట్టుట; కుశలతయే = నేర్పా ?

తా: ఎప్పుడో చనిపోయిన తర్వాత లభించు స్వర్గసౌఖ్యమిప్పుడే లభించుచుండగా వ్యర్థముగా వ్రతముల నాచరించుట వలని యాయాసములు పడుట తెలివి తక్కువ. అలం. కావ్యలింగము.

తే. అనినఁ బ్రవరుండు నీ వన్న ♦ యర్థ మెల్ల
నిజము కాముకుఁడైన వా ♦ నికి; నకాముఁ
డిది గణించునె? జలజాక్షి ♦ యెఱిఁగి తేని
నగరమార్గంబుఁ జూపి పు ♦ ణ్యమునఁ బొమ్ము. 59

టీ: అనినన్ = ప్రవరుండు; ఓజలజ + అక్షి = పద్మముల వంటి నేత్రములు కలదానా! నీవు; అన్న = చెప్పిన; అర్థము + ఎల్లన్ = విషయమంతయు; కాముకుడు = కామాసక్తికలవాడు; అయినవానికిన్; నిజము = అంతే; అకాముడు = కోరికలేనివాడు; ఇది = నీవుచెప్పినది; గణించునె = లెక్కసేయునా ? ఎఱిగితి + ఏని = తెలిసినచో; నగరమార్గంబున్ = పట్టణముత్రోవను; చూపి; పుణ్యమువన్ + పొమ్ము = పుణ్యము కట్టుకొమ్ము.

తా: ప్రవరుడిట్లనెను, ఓతరుణీ! నీవన్నది కానుకుసైనవానికి; కాని, విష యసుఖములపై కోరికలేనివాడిదేమియుగణింపడు. నీవెరిగినచో నాకు నగరమార్గము చూపి పుణ్యముకట్టుకొనుము. (లేదా యూరకుండుము నన్ను వలవకుము. నేనొల్లను.)

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మచరణైకనిపుణ • చిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్య • పదవీచ్యుతుఁడై. 60

టీ: బ్రాహ్మణుడు; ఇంద్రియవశగతిన్=ఇంద్రియములకు స్వాధీనమైన నడకతో; జిహ్మచరణ=చెడుపనులు చేయుటయందు; ఏకనిపుణ=కేవలము నేర్పుకల; చిత్తజ=మన్మథునియొక్క; నిశిత=వాడియైన; అజిహ్మగములపాలై=బాణముల దెబ్బలపడి, బ్రహ్మానంద=బ్రహ్మయొక్క ఆనందము యొక్క; అధిరాజ్య=సామ్రాజ్యముయొక్క; పదవీ=దారినుండి; చ్యుతుడై=జారినవాడై; చెడున్=నశించును.

తా: బ్రహ్మజ్ఞానము కలిగినవాడు ఇంద్రియాలోలుడై మన్మథబాణములకు గురియయ్యెనా బ్రహ్మానంద మార్గమునుండి జారి నశించును. అలం. కావ్యలింగము.

వ. అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల కులికి గఱిగఱిం గఱువ గరకరిం జెఱకువిలుకాఁడు పరగించు విరిదమ్మిగొరకలు నెఱకులఁ జఱుకుచుఱుకునం గాఁడినఁ గడుం గెరలి పరిణత వివిధ విబుధ తరుజనిత మధున మధురసం బానుమదంబు నదటునం జిదిమిన నెఱుంగక మదనహరునైనఁ జదురునం గదియ గమకించు తిమురునం గొమిరెప్రాయంపు మదంబునను ననన్యకన్యాసామాన్య లావణ్యరేఖా మదంబునను నొంటిపాటునం గంటికిం బ్రియుండై తంగేటిజుంటి చందంబునం గొంటుదనం బెఱుంగక కుఱుంగట నున్నయమ్మహీసురవరకుమారు తారుణ్యభాగ్యంబులం జేసి తనదైన్యంబు మెఱుయఁగలిగె నని పల్లవించు నుల్లంబు నుల్లాసంబునం గదుపు మదంబున నోసరించక చంచలదృగంచలపరిభ లతని ముఖాంబుజంబునం బొలయ వలయమణిగణచ్ఛాయాకలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు చక్కం జెక్కుచు జక్కవగిబ్బలుంబోని గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తాతారకంబుల నఖకోరకంబులం గీఱి తీరుపడం జేయుచుఁ బతితవనతరుకుసుమ కేసరంబులు

రాల్చు నెపంబునం బయ్యెద విదిల్చి చక్కసవరించుచుఁ సారెసారె
బాలయు చెలులం దలసూపక యుండఁ దత్తఱంబునం జేసి బోమ
ముడిపాటులో మగిడి మగిడి చూచుచుఁ జడిముడిపాటు చూపుల
నంకురించు జంకెనల వారించుచుఁ జేరి యిట్లనియె. 61

టీ: అనినన్ = అనగా; అ + తెఱవ = అవయూధిని; ఆక్కఱకఱపలుకులకున్ = ఆకతిసమగు మాటలకు; ఉలికి = ఉలికిపడి; చెఱకువిలుకాడు = మన్మథుడు; కెరకరిన్ = క్రూరముగా; గఱిగఱిన్ + కఱవన్ = రెక్కరెక్కలాడుచుకొనునట్లు (పరంపరగా;) పఱగించు = ప్రయోగించు; విరిదమ్మిగొరకలు = వికసించిన తామరపువ్వులను బాణములు; నెఱకులు = మర్మస్థానములందు; చుఱుకుచుఱుక్కనన్ = చుఱుక్కుమనునట్లుగా; కొఁడినన్ = నాటగా; కడుంగనలి = మిక్కిలి కోపించి; పరిణత = పక్వమైన; వివిధవిబుధతరు = పలురకములైన దేవతా వృక్షములనుండి; జనిత = పుట్టిన; మధుర = తియ్యని; మధురసంబు = పువ్వుతేనెను; ఆనుమదంబు + అదటునన్ = త్రాగుట వలన మత్తుయొక్క అతిశయముచే; చిడిమినన్ = గిల్లినను; పెఱుంటేఁ; మదనహరుడైనన్ = శివుడైనను; చగురునన్ = నేర్పుచే; కదియన్ = తాకుటకు; గఱికించుతిమురునన్ = ప్రకాశించు కండకావరముచే; కొమిరెప్రాయపుమదంబునన్ = యౌవనమువలనిమదముచే; అనన్యకన్యాసామాన్య = ఇతర కన్యలకులేని; లావణ్యరేఖా = అందముయొక్క; మదంబుచేన్ = గర్వముచేతను; ఒంటిపాటునన్ = ఒంటరిగా; కంటికికిన్ = చూపునకు; ప్రియుండై = ఇంపైనవాడై; తంగేటిజుంటి చందంబునన్ = తంగేటిచెట్టునకు పట్టిన తేనెతెరవలె-చాలసులభుడై; గొంటుతనంబు = గడుసుదనము; ఎఱుఁగక = తెలియక; కుఱంగటన్ = దగ్గరలో; ఉన్న; ఆ + మహీసురకుమారు = ఆ బ్రాహ్మణ యువకునియొక్క; తారుణ్యమాధుర్యంబులంజేసి = యౌవనము, తెలివిసలితనములచే; తనవైదగ్ధ్యము = తన నేర్పు; మెఱయన్ = ప్రకాశించునట్లు; కలిగెను = అవకాశము కల్గెను; అని; పల్లవించు = పెరుగుచున్న; ఉల్లంబు + ఉల్లాసమునన్ = మనస్సుయొక్క ఉత్సాహముతో, కదురుమదంబునన్ = కలుగుచున్న గర్వము చేతను; ఓసరింపక = ఇటునటుతప్పుకొనక; చంచల = చలించుచున్న; దృక్ + అంచలప్రభలు = కనుకొలకులకాంతులు; అతనిముఖ + అంబుజమునన్ = ప్రవరుని పద్మమువంటి ముఖమందు; పొలయన్ = ప్రసరింపగా; వలయ = కంకణముల యొక్క; మణిగణ + ఘాయాకలాపంబులు = మణులకాంతులు; ఉప్పరంబు + ఎగయన్ = పైకివ్యాపించగా; కొప్పు; చక్కన్ = బాగుగా; చెక్కుచున్ = సవరించుచు; జక్కవగిబ్బలుంబోని = పడుచు తనములోనున్న చక్రవాక పక్షులవంటి; గబ్బిగుబ్బలన్ = పెద్దచనులనుండి; జొబ్బిల్లు = ప్రసరించు; కుంకుమరసంబునన్ = కుంకుమపువ్వుతో కలిసిన మంచిగంధముచే; పంకిలంబులగు = మట్టికొట్టుకున్నట్లున్న; హారముక్తాతారకంబులు = ముత్యాలపేరులోని ముత్యాలను; నఖకోరకంబులన్ = మొగ్గల వంటి గోళ్లతో; గీఱి = గీచి; తీరుపడంజేయుచున్ = చిక్కులు పోవునట్లు చేయుచు; పతిత = మీదపడిన; వనతరు = అడవిచెట్లయొక్క; కుసుమకేసరంబులు = పూలకింజ

ల్కములను; రాల్చునెపంబునన్ = దులిపెడిమిషతో; పయ్యెద = పైటను; విదల్చి = విదిపి; చక్కసవరించుచున్ = చక్కగా సర్దుకొనుచు; అంతంతన్ = అంతటంతట; పొలయు చెలులన్ = సమీపించు చెలికత్తెలను; తలచూపకయుండన్ = కనుపడకుండునట్లు; తత్తరంబునంజేసి = తొందరచే; బొమముడిపాటుతోన్ = కనుబొమ్మలుముడిచి చూచు సంజ్ఞచే; మగిడిమగిడిచూచుచున్ = తిరిగి తిరిగి చూచుచు; బిడిముడిపాటు చూపులన్ = కోపముతోడిచూపులందు; అంకురించుజంకెనలన్ = పుట్టెడిబెదరింపులతో; వారించుచున్ = నివారించుచు; చేరి = అతనికి దగ్గరగా వెళ్లి; ఇట్లు+అనియెన్;

శా. ఎందే డెందము గందళించు రహిచే ♦ నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికా ♦ శ్రీ దోఁప నెం దెందుఁబో
కెందే నింద్రియముల్ సుఖంబు గను నా♦యింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ'యటన్న ప్రాఁజదువు నం♦తర్బుద్ధి నూహింపుమా.

టీ: ఎందేన్ = దేనియందు; డెందము = మనస్సు; రహిచేన్ = అనురాగముచే; కందళించున్ = తగుల్కొని వికసించునో; ఎందున్; ఏకాగ్రతన్ = నిశ్చలత్వముచే; కుంభగత = కుండలోనున్న; ప్రదీపకళికా శ్రీదోపన్ = దీపముయొక్క కాంతివలె; నిర్వృతిన్ = సుఖమును; చెందున్ = పొందునో; ఎందేన్ = దేనియందు; ఇంద్రియముల్ = జ్ఞానేంద్రియములు; ఎందున్+పోక = దేనివీడికినిపోక; సుఖంబున్ = సుఖమును; కనును = పొందునో; ఆయింపే = ఆయానందమే; పరబ్రహ్మము = పరమాత్మ; ఆనందః+బ్రహ్మ = ఆనందమే బ్రహ్మ; అటన్న ప్రాఁజదువున్ = అనెడి వేదవాక్యమును; అంతర్బుద్ధిన్ = మనసులో; ఊహింపుమా = ఆలోచింపుము.

తా: ఏవిషయమందు లగ్నమైన మనస్సు, నింద్రియములును కుండలో పెట్టిన దీపమువలె నిశ్చలములై కేవలము సుఖమునే పొందునో ఆవైషయికానందమే పరబ్రహ్మము, 'ఆనందో బ్రహ్మ' అన్న వేదవాక్యమును స్మరించుము. (కాన రతిసుఖము కూడ బ్రహ్మానందమే కాన నేచెప్పినట్లొప్పుకొన వచ్చునని ఆమె భావము.)

గీ. అనుచుఁ దన్నొడఁబఱచు న♦య్యమరకాంత
తత్తఱముఁ జూచి యాత్మ న♦తండు దనకు
సిగ్గు వెగటును బొడమ ని♦స్పృహతఁ దెలుపు
నొక్క చిఱునవ్వు నవ్వి య♦య్యువిద కనియె. 63

టీ: అనుచున్ = ఇట్లుచెప్పుచు; తన్ను; ఒడబఱచు = ఒప్పించెడి; ఆ+అమరకాంత = ఆదేవతా స్త్రీయొక్క; తత్తఱమున్ = తొందరను; చూచి; అతండు; ఆత్మన్ = తనలో; తనకున్; సిగ్గున్ = లజ్జయు; వెగటును = అసహ్యమును; పొడమన్ = పుట్టగా; నిస్పృహతన్ = అక్కరలేదని భావమును; తెలుపు+ఒక్క = తెలిపెడి ఒక; చిఱునవ్వు; నవ్వి; ఆ+ఉవిదకున్ = ఆస్త్రీకి; అనియెన్ = చెప్పెను.

తా: ఆరీతిగా తన్నెట్లయినను ఒప్పించదలచి మాట్లాడెడి ఆమె తొందఱను చూచి ప్రవరుడు సిగ్గుపడి, అసహ్యించుకొని, ఎంత చెప్పినను విననట్లు నిష్ఫలహాసా ఒక్క చిరునవ్వునవ్వి ఇట్లనెను.

శా. ఈపాండిత్యము నీకుఁ దక్క మఱియెం ♦ దేఁగంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మే ♦ లోహో! త్రయీధర్మము
ల్పాపంబుల్ రతి పుణ్య మంచు నిఁకనే ♦ లా తర్కముల్? మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తికివె పో ♦ మీసంప్రదాయార్థముల్.

టీ: ఈపాండిత్యము = ఈ నేర్పు; నీకున్ + తక్క = నీకుతప్ప; మఱియెందేన్ = మరెవ్వరియందైనను; కంటిమే = చూచితిమా ? కామశాస్త్ర + ఉపాధ్యాయివి = కళాశాస్త్రము నేర్పుదానవు; నాన్ = అన్నట్లుగా; త్రయీధర్మముల్ = మూడు వేదములలో చెప్పిన ధర్మములును; పాపంబుల్ = పాపములు; రతి = స్త్రీసంగమము; పుణ్యము; అంచున్; వచించెదవు = చెప్పెదవు; మేలు; ఓహో; ఇకన్ = ఇంక; తర్కముల్ = విచారణలు; ఏలా = ఎందుకు ? మోక్షలక్ష్మీ = మోక్షసంపదయొక్క; పథి = మార్గమైన; ఆగమసూత్రపంక్తికిన్ = వేదసూత్రములకు; (పా. ఫక్కికిన్ = రీతికి) మీసంప్రదాయ + అర్థముల్ = మీసంప్రదాయములో వచ్చు నర్థములు; ఇవెపో = ఇవేనేమో ?

తా: ఇట్టి నేర్పు నీకే కాని మరెవరికిని లేదు. కేవలము కామశాస్త్రమును చెప్పుదానవు కాన అట్లు చెప్పుచుంటివి. వేదత్రయములో చెప్పిన కర్మకాండంతయు పాపమా ? రతియొక్కటే పుణ్యమా ? మోక్షప్రతిపాదకమైన వేదాంతసూత్రములకు నివేనా మీరు చెప్పెడి యర్థము? బాగున్నది. ఓహోహో ! (అని యెగతాళి చేసెను)

అలం. వ్యాజస్తుతి. స్తుతివలె కన్పించునింద.

మ. తరుణీ! రేపును మాపు హవ్యములచే ♦ తం దృప్తుఁడౌ వహ్నిస
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుం ♦ గన్ శక్యమే నీకు? నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియము లై ♦ నట్లన్యముల్ గావొడల్
తిరమే చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ ♦ మీసాలపైఁ దేనియల్. 65

టీ: తరుణీ = పడుచుదానా ! రేపును = సూర్యోదయకాలమున; మాపున్ = సాయంసమయములందును; హవ్యముల చేతన్ = హోమద్రవ్యములచే; తృప్తుడౌ వహ్ని = తృప్తిపొందెడి అగ్నిహోత్రుడు; సత్కరుణాదృష్టిన్ = మంచిదయాదృష్టితో; ఒసంగుసౌఖ్యములు = ఇచ్చుసుఖములు; ఎఱుంగన్ = తెలియుటకు; శక్యమే = వీలా? నీకున్; నాకున్; అరణుల్ = నిప్పును మథించికొను పరికరములు, దర్భలున్; అగ్నులున్, ప్రియములు + ఐనట్లు = హితమైనట్లుగా; అన్యముల్ = తక్కినవి; కావు; ఒడల్ = శరీరము; తిరమే = స్థిరమా ? ఇట్టితుచ్ఛసుఖముల్ = ఈనీచమైనసుఖములను; చెప్పకుము. మీసాలపైదేనియల్ = మీసాలపైనంటుకొనిన తేనెవలె పైకి మెరయునవి.

తా: తరుణీ! రెండుసంధ్యలందు హోమము చేయుటచే తృప్తిపొందెడి అగ్నిహోత్రుడు మాకిచ్చు బ్రహ్మానందసౌఖ్యములను నీవెరుగవు. నాకు నిత్యకర్మానుష్ఠానమునకైన అగ్నులు, దర్భలు అరణులు ఇష్టమైనట్లు తక్కినవి కావు. శరీరము శాశ్వతమైనదా? శాశ్వతముకాని శరీరముచే ననుభవించు సుఖములు మాత్రమేపాటి నిత్యములు? మీసాలమీద అంటుకొన్న తేనెబొట్లవలె క్షణికసుఖము నిచ్చునవే. ఇట్టి తుచ్ఛసుఖములమాట నాకు చెప్పకు. నాచెవి కెక్కదు.

చ. అనుటయు మాటలేక హృద ♦ యాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలి ♦ కన్నుల నాతనిఁ బుల్కుఫుల్కునం
గనుకొని మాటలం బొదువు ♦ గద్గదికం దల యూఁచి యక్కటా!
వనిత తనంతఁ దా వలచి ♦ వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్. 66

టీ: అనుటయున్ = అట్లనగానే; మాటలేక = (బదులిచ్చుటకు) నోటమాట రాక; హృదయాబ్జము = పద్మమువంటి గుండె; జల్లు + అనన్ = జల్లుమనగా; మోము = ముఖము; వెల్లనై = తెల్లపోయి; కనలుచున్ = కోపించుచు; నీరుదేఱు = నీరు క్రమ్మిన; తెలికన్నులన్ = తెల్లనికన్నులతో; ఆతనిన్; ఫుల్కుఫుల్కనన్ = మూయుచు తెరుచుచు; కనుగొని = చూచి; మాటలన్ = మాటలందు; పొదువుగద్గదికన్ = ఆవరించెడి డగ్గుత్తికతో; తలయూఁచి; (ముందునకన్వయము) అక్కటా = అయ్యో! వనిత = స్త్రీ; తనంతదాన్ = తనంతటతాను; వలచివచ్చినన్ = కోరివచ్చినచో; ఏరికిన్ = ఎవరికైనను; చుల్కనగాదె = చులకనకదా! అర్థాన్తరన్యాసాలంకారము.

తా: ఆమాటలనుటతో ఆమె గుండె జల్లుమన్నది. ముఖము వెలవెలబోయినది. కన్నులనీరు క్రమ్మినది. ఎంతమాటన్నాడు తన్నే తిరస్కరించెనే అన్నట్లు అవమానము భరింపలేక మినుకుమినుకున చూచుచున్నది. నోటమాటరాక గొంతులో రప్పించుకొన్నందున బొంగురుపోయిన స్వరముతో ఇట్లన్నది. ఆడుది తనకుతానై వరించినప్పుడింత చులకనగదా! అతడు మానవుడైయుండి దివ్యస్త్రీ కోరికను నిరసించినాడు.

మ. వెతలం బెట్టకు మింక నన్ననుచు నీ ♦ వీబంధ మూడన్ రయో
ద్ధతి నూర్పులు నిగుడన్ వడిన్ విరులు చిం♦దం గొప్పు వీడం దనూ
లత తోడ్తోఁ బులకింపగా ననునయా ♦ లాపాతిదీనాస్యయై
రతిసంరంభము మీఱ నిర్జరవధూ ♦ రత్నంబు పైపాటునన్. 67

టీ: నిర్జరవధూరత్నంబు = దేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలైనయామె; ఇంకన్; నన్నున్; వెతలన్ = బాధలను; పెట్టకుము; అనుచున్; నీవీబంధము = కోకముడి; ఊడన్ = ఊడిపోగా; రయ + ఉద్ధతిన్ = వేగాతిశయముచే; ఊర్పులు = శ్వాసలు; నిగుడన్ = హెచ్చగా; వడిన్ = వేగముచే; విరులు = పువ్వులు; చిందన్ = రాలగా;

కొప్పు; వీడన్ = విడిపోగా; తోడ్తోన్ = వెనువెంటనే; తనూలత = తీగవంటి శరీరము; పులకింపగాన్ = గగుర్పొడువగా; అనునయ+ఆలాప = బతిమాలు మాటలతో; అతిదీన = మిక్కిలి దీనమైన; ఆస్యయై = ముఖము కలదై; రతిసంరంభము = సంభోగముమీఁదకోరికచే కల్గుతొందర; మీఱన్ = హెచ్చగా; పైపాటునన్ = పైనపడుటచే; (ముంగున కన్వయము) అలం. స్వభావోక్తి.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ ♦ బాలిండ్లుపొంగారఁబై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం ♦ బాసింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడితదీ♦యాంసద్వయంబంటిపో
మ్మంచుం ద్రోచె;కలంచునే సతులమా ♦ యల్ ధీరచిత్తంబులన్.

టీ: ప్రాంచత్+భూషణ = అందమైన అలంకారముల యొక్కయు; బాహామూల = చంకలయొక్కయు; రుచితోన్ = కాంతితో; పాలిండ్లు = స్తనములు; పొంగారన్ = ఉబ్బగా; పైయంచుల్ = చనుమొనలు; మోవగన్ = ఆనుకొనగా; కౌగిలించి; అధరంబు = పెదవిని; ఆశింపన్ = కోరగా; బ్రాహ్మణుఁడు = ప్రవరుడు; హా! శ్రీహరీ! అంచున్ = అనుచు; ఓరమోము+ఇడి = ముఖము ప్రక్కకుత్రిప్పి; తదీయ = ఆమె సంబంధమైన; అంసద్వయంబు = రెండుమూపులను; అంటి = తాకి; పొమ్ము+అంచున్ = పోఅనుచు; త్రోచెన్ = త్రోసెను; సతులమాయల్ = స్త్రీల మాయలు; ధీరచిత్తంబులన్ = ధీరులమనస్సులను; కలంచునే = కలతచెందింపగలవా? అలం. అర్థాంతరన్యాసము.

క. త్రోపువడి నిలిచి ఘనల
జ్జాపరవశయగుచుఁ గొప్పు ♦ సవరించి యొడల్
దీపింప నతనిఁ జుఱచుఱఁ
గోపమునం జూచి క్రేఁటు ♦ కొనుచుం బలికెన్. 69

టీ: త్రోపు+పడి = త్రోయబడి; నిలిచి; ఘనలజ్జాపరవశయగుచున్ = ఎక్కువ సిగ్గుకలదై; కొప్పుసవరించి = ఊడిన కొప్పును సర్దుకొని; ఒడల్ = శరీరము; దీపింపన్ = ప్రకాశింపగా; అతనిన్; కోపమునన్ = కోపముతో; చుఱచుఱచూచి = కొరకొరలాడుచు చూచి; క్రేటుకొనుచున్ = గొంతుక సవరించుకొనుచు (కొందఱు 'వెక్కుచు' అనిరి.) పలికెన్.

ఉ. పాటున కింతు లోర్తురె కృ ♦ పారహితాత్మక నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము ♦ సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నె ♦ పం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చుగుబ్బచను ♦ మిట్టల నశ్రులు చిందువందఁగన్ 70

టీ: కృపారహిత+ఆత్మక = దయలేని మనస్సుకలవాడా! పాటునకున్ = పడుటకు; ఇంతులు = స్త్రీలు; ఓర్తురె = సహింపగలరా? నీవు; త్రోవన్ = త్రోయగా; ఇచ్చోటన్ = ఇక్కడ; భవత్+నఖ+అంకురము = నీసన్ననిగోరు; సోకెన్ = తగిలెను-గీరుకొన్నది. కనుంగొనుము = చూడుము; అంచున్ = అనుచు; చూపి; ఆ+పాటలగంధి = ఆవరూధిని; వేదననెపంబు+ఇడి = బాధవంక పెట్టుకొని; మీటినన్ = గోటితోకొట్టినచో; విచ్చు = ఉబ్బునట్టి; గుబ్బ = వక్షుపలైన; చనుమిట్టలన్ = మెరకైన చన్నులందు; అశ్రులు = కన్నీళ్లు; చింగువందగన్ = పడిచెదరగా; కలస్వనంబుతోన్ = మధురమైన కంఠధ్వనితో; ఏడ్చెన్.

తా: 'ఓరినిర్దయుడా! నీవు త్రోయునప్పుడు ఇక్కడ నీగోరు గీచికొన్నది. చూడు'మనిచూపుచు బాధవంక పెట్టుకొని కన్నీళ్లు చన్నులపైపడి చెదరునట్లుగా కార్చుచు, మధురముగా ఏడ్చెను. ఆమె యేడుపుకూడ ప్రియుని మనసు కరగించవలెనని కనుక వీనుల విందుగా ఏడ్చినది.

క. ఈవిధమున నతికరుణము
గా వనరుహనేత్రి కన్నుఁ ♦ గవ ధవళరుచుల్
కావికొన నేడ్చి వెండియు
నా విప్రకుమారుఁ జూచి ♦ యులమటఁ బల్కెన్. 71

టీ: వనరుహనేత్ర = పద్మములవంటి నేత్రములుకల వరూధిని; ఈవిధమునన్ = ఇట్లు; అతికరుణముగాన్ = మిక్కిలి దయపుట్టునట్లుగా; కన్నుగవధవళరుచుల్ = రెండుకన్నులయొక్క తెల్లని కాంతులు; కావికొనన్ = ఎఱ్ఱపడునట్లు; ఏడ్చి; వెండియున్ = మరియు; ఆవిప్రకుమారున్ = ఆ ప్రవరుని; చూచి; ఉలమటన్ = దుఃఖముతో; పల్కెన్.

ఉ. చేసితి జన్నముల్ తపము ♦ చేసితి నంటి; దయావిహీనతన్
చేసిన పుణ్యముల్ ఫలము ♦ నెందునె? పుణ్యము లెన్నియేనియుం
జేసినవానిసద్గతియె ♦ చేకుఱు భూతదయార్ద్రబుద్ధి కో
భూసురవర్య! యింత దల ♦ పోయవు నీచదు వేల చెప్పుమా? 72

టీ: ఓ.భూసురవర్య = ఓబ్రాహ్మణశ్రేష్ఠుడా! జన్నముల్ = యజ్ఞములను; చేసితిన్ = చేసితిని; తపముచేసితిని; అంటి = అంటివి. దయావిహీనతన్ = జాలిమాలి; చేసినపుణ్యముల్ = చేసినమంచిపనులు; ఫలము+ఎందునె = ఫలించునా? పుణ్యములు; ఎన్నియేనియుఁ = ఎన్నియైనను; చేసినవానిసద్గతి+ఎ = చేసినవానికివచ్చుస్వర్గమే; భూత = జీవులయందు; దయా+ఆర్ద్రబుద్ధికిన్ = దయచే మృదువైనబుద్ధి కలవానికి; చేకుఱున్ = వచ్చును; ఇంత = ఈపాటిదైనను; తలపోయవు = ఆలోచింపవు; నీచదువు; ఏల = ఎందుకు? చెప్పుమా?

తా: ఓవిప్రవరా! యజ్ఞాలు చేసినాను, తపస్సులు చేసినాను అంగువు కాని దయలేకుండ చేసిన పుణ్యకార్యములకు ఫలితముండునా? దయకలవానికి పుణ్యకార్యములు చేసినవాని సద్గతియేవచ్చునని చెప్పుదురు. ఈపాటి ఆలోచింపని నీచగు వెందుకు? చెప్పు?

సీ. వెలివెట్టిరే బాడ ♦ బులు పరాశరుఁబట్టి
దాశకన్యాకేళి ♦ తప్పుఁ జేసి
కులములో వన్నె త ♦ క్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక ♦ చుట్టరికము
ననుపుకాఁడై వేల్పు ♦ నాగవాసముఁ గూడి
మహిమ గోల్పడియెనే ♦ మాండకర్ణి
స్వారాజ్య మేలంగ ♦ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైనజం ♦ భాసురారి

గీ. వారికంటెను నీమహా ♦ త్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షులై ♦ నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను ముని ♦ ముచ్చులెల్ల
తామరసనేత్రలిండ్ల బం ♦ దాలు గారె. 73

టీ: బాడబులు=బ్రాహ్మణులు; దాశకన్యాకేళిన్=దాశకన్యయగు సత్యవతితో కూడుటను; తప్పుజేసి=తప్పుగాభావించి; వెలివెట్టిరే=వెలివేసిరా? గాధిపట్టికిన్=విశ్వామిత్రునకు; మేనకచుట్టరికము = మేనకతోడిసాంగత్యము; కులములో=తనవంశములో; వన్నె=వాసి; తక్కువయయ్యెనే? మాండకర్ణి=మాండకర్ణియను మహర్షి; ననుపుకాఁడై=విటుడై; వేల్పునాగవాసమున్ = అప్సరసలవాడను; కూడి=కలసి; మహిమన్=గొప్పదనమును; కోల్పోయెనే = పోగొట్టుకొనెనా? సురలు = దేవతలు; అహల్యాజారుడైన=అహల్యతో వెళ్లిన; జంభ+అసుర+అరిన్=ఇంద్రుని; స్వర్+రాజ్యము=స్వర్గరాజ్యమును; ఏలంగన్ = ఏలుటకు; ఈగైగె=ఇయ్యలేదా? వారికంటెను = పైనచెప్పిన పరాశరాదులకంటె; నీమహత్త్వంబు=నీమహిమ; ఘనమె=గొప్పదా? పవన=గాలి; పర్ణ = ఆకులు; అంబు=నీరు; భక్షులై =తినువారై; నవసి=చిక్కి; ఇనుపకచ్చడాల్=ఇనుపగోచీలు; కట్టుకొను=బిగించుకొను; (ఇంద్రియనిగ్రహముకలవారివలె) మునిముచ్చులెల్లన్=దొంగమునులందరును; తామరసనేత్రలిండ్లన్=స్త్రీలయిండ్లలో; బందాలు = చెరసాలలోనుంచబడినట్లున్నవారు; కాదె=కాదా? (ఇందలి పరాశరకథ భారతమాదిపర్వతమునను, మాండకర్ణి, విశ్వామిత్ర, దేవేంద్రుల కథలు రామాయణములో బాలకాండ, అయోధ్యా కాండలందు నున్నవి.)

తే. అనిన నేమియు ననక య ♦ వ్వనజగంధి
మేన జవ్వాదిపస కదం ♦ బించు నొడలు
గడిగికొని వార్చి వ్రివరుండు ♦ గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భా ♦ వమునఁ దలఁచి. 74

టీ: అనిన్=అనగా; ప్రవరుండు; ఏమియున్+అనక=జవాబు చెప్పక; ఆ+వనజగంధి=ఆవరూధినియొక్క; మేని=శరీరముయొక్క; జవాదిపస=జవ్వాజి వాసన; కదంబించు+ఒడలు=అంటుకొన్న శరీరము; కడిగికొని; వార్చి=సంధ్య వార్చుకొని; గార్హపత్యవహ్నిన్=గార్హపత్యమను ప్రధానాగ్నిని; భావమునన్=మనసునందు; తలచి=ధ్యానించి; ఇట్లని=చెప్పబోవురీతిగా; పొగడెన్=స్తుతించెను.

మ. దివిషద్వర్గము నీముఖంబునన తృ ♦ ప్తింగాంచు ని న్నీశుఁగా
స్తవముల్ సేయుశ్రుతుల్ సమస్తజగదం ♦ తర్యామివి న్నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీ ♦ యం దుద్భవించుఁ గ్రతూ
త్సవసంధాయక నన్నుఁ గావఁ గదవే ♦ స్వాహావధూవల్లభా. 75

టీ: క్రతు+ఉత్సవసంధాయక=యజ్ఞమను ఉత్సవమును చేకూర్చువాడా! స్వాహావధూవల్లభా=స్వాహాదేవికి ప్రియమైనవాడా! దివిషత్+వర్గము=దేవతల సమూహము; నీముఖంబునన్+అ=నీవనెడిముఖముచేతనే. (అగ్నిలో చేసినహోమము దేవతల కందును. అందుచే అగ్నియే దేవతలకు ముఖము;) తృప్తిన్=తనివిని; కాంచున్=పొందును; సమస్తజగత్+అంతర్యామివిన్=అంతఃజగత్తునకు లోపలనుండు వాడవును; నీవు+అ=నీవే; ఆహవనీయంబును; ఆహవనీయమనునగ్నియు; దక్షిణాగ్నియును=దక్షిణాగ్నియను అగ్నియును; నీయందున్=నీనుండియే; ఉద్భవించున్=పుట్టును; (యజ్ఞము చేసినవారు మూడగ్నులను పెట్టి మూడిటిలోను హోమములు చేయుదురు. అందు గార్హపత్యములో అగ్నినిదాపి, హోమసమయములందు తక్కిన వాటిలో అగ్నిని విహరింప జేయుదురు.) నన్నున్; కావగదవే=రక్షింపుమా! 

ఉ. దానజపాగ్నిహోత్రపర ♦ తంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బర ♦ దారధనాదులఁ గోర నేని స
న్మానముతోడ నన్ను సద ♦ నంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ ♦ మున్న రయంబున హవ్యవాహనా. 76

టీ: హవ్యవాహనా=దేవతలకు చేయు హోమమును (హవ్యమును) తీసికొని వెళ్లువాడా! దాన జప+అగ్నిహోత్ర=దానములు, జపములు, అగ్నిహోత్రములు చేయుటలో; పరతంత్రుడ నేని=ఎక్కువ ఆసక్తికలవాడనైనచో; భవత్=నీయొక్క; పద+అంబుజ=పద్మములవంటి పాదములయొక్క; ధ్యానరతుండ నేని=ధ్యానించుటయందాసక్తికలవాడనైనచో; పరదారధన+ఆదులన్=పరుల భార్యలను,

ఫలమున్న గువాటిని కోరని వాడవైనచో; ననున్; సన్మానముతోడన్ = గౌరవముగా; ఇనుండు = సూర్యుడు; పశ్చిమ+అంభః+నిధిలోనన్ = పడమటిసముద్రములోనికి; క్రుంకకయున్న = మునగకయున్నచో; రయంబునన్ = వడిగా; సదనంబునన్ = ఇంటి యందు; నిల్పుము.

వ. అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగుటయు నమ్మహాభాగుండు గండుమీఱి పొడుపుఁగొండ నఖండసంధ్యారాగప్రభామండలాంతర్గతుం డగు పుండరీకవనబంధుం డునుంబోలె నుత్తప్తకనకద్రవధారాగౌరంబగు తనుచ్ఛాయాపూరం బున నక్కాన వెలిఁగించుచు నిజగమననిరోధిని యగునవ్వరూధిని హృదయ కంజంబున గంజిల్లు నమందానురాగరస మకరందంబు నం దంద పొంగంజేయుచుఁ బావకప్రసాదలబ్ధం బగుపవనజవనంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించె నని మార్కండేయుండు క్రోష్టికిం జెప్పెనని చెప్పిన. 77

టీ: అని = ఇట్లు; సంస్తుతించినన్ = పొగడగా; అగ్నిదేవుండు; ఆ+మహీదేవు దేహంబునన్ = ఆ ప్రవరుని శరీరములో; సన్నిహితుండు = సన్నిధానము చేసినవాడు-ఆవేశించినవాడు; అగుటయున్ = కాగా; ఆ+మహాభాగుండు = ఆమహానుభావుడు; గండు = దేహపుష్టి; మీఱి = అతిశయించి; పొడుపుఁగొండన్ = ఉదయపర్వతమునందు; అఖండ = నిండుగానున్న; సంధ్యారాగ = సంధ్యవేళయందలి యెరుపు యొక్క; ప్రభామండల = కాంతిపుంజమునందు; అంతర్గతుండు+అగు = లోపలనున్న; పుండరీకవనబంధుండుంబోలెన్ = పద్మములకు బంధువైన సూర్యునివలె; ఉత్తప్త = పుటము వేయబడిన; కనకద్రవధారా = బంగారు ద్రవమువలె, గౌరంబగు = పసిమిరంగు కల, తను+ఛాయాపూరంబునన్ = శరీరకాంతి ప్రవాహముతో; ఆ+కానన్ = ఆయడవిని; వెలిగించుచున్ = ప్రకాశింపజేయుచు; నిజగమననిరోధిని యగు = తనవెళ్లుటకడ్డమైన; ఆ+వరూథిని = ఆవరూథిని యొక్క; హృదయకంజంబునన్ = పద్మమువంటి హృదయములో; గంజిల్లు = పొంగారు; అమంద = ఎక్కువైన; అనురాగరస = స్నేహరసమును; మకరందంబున్ = పూదేనెను; అందున్+అందున్+అ = అందందే; పొంగం జేయుచున్ = పొంగునట్లు చేయుచు; పావకప్రసాద = అగ్నిహోత్రుని అనుగ్రహముచే; లబ్ధమైన = పొందబడిన; పవనజవనంబునన్ = వాయువువంటి వేగముతో; నిజమందిరంబునకున్ = తనయింటికి; అరిగి = వెళ్లి; నిత్యకృత్య = నిత్యమును చేసికొను కర్మములు; సత్కర్మకలాపంబులు = అనుష్ఠానములను; నిర్వర్తించెను = పూర్తిచేసికొనెను; అని; మార్కండేయుండు; క్రోష్టికిన్; చెప్పెను+అని; చెప్పినన్ = ఇట్లు ధర్మపక్షులు జైమినితో చెప్పగా (ముందున కన్వయము)

క. జైమిని యా దివ్యఖగ
గ్రామణులం జూచి వేడ్క • గడలుకొనంగా
నామీఁద వరూథిని విధ
మే మయ్యె నెఱుంగఁ జెప్ప • రే నా కనుచున్. 78

టీ: జైమిని; ఆదివ్యఖగగ్రామణులన్ = ఆదివ్యమైన పక్షిశ్రేష్ఠులను; చూచి; వేడ్క = కుతూహలము; కడలుకొనంగాన్ = అతిశయించుచుండగా; ఆమీఁదన్ = ఆతర్వాత; వరూథినివిధము = వరూథిని యొక్క రీతి; ఏమి + అయ్యెన్ = ఏమైనది? నాకున్; తెలియన్ = తెలియునట్లు; చెప్పరే = చెప్పుడు; అనుచున్ = అనిన తర్వాత (దీనికి మూడవపద్యాశ్వాసములోని 'అవధరింపుము' తో అన్వయము.)

శా. నిస్తంద్రప్రతిభా సుధీనుతదిశో • న్మీలద్యశశ్శ్రీవధూ
హస్తాగ్రామలకాయమానమహనీ • యాంభోజగర్భాండ సై
న్యస్తోమోత్థరజోవ్రజస్థగితకృ • ష్ణాగౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్కలరాట్పురీహరణలీ • లావార్యశౌర్యోదయా. 79

టీ: నిస్తంద్ర = చురుకైన; ప్రతిభా = ప్రతిభకలవాడా! సుధీనుత = విద్వాంసులచే పొగడబడువాడా! దిశా + ఉన్మీలత్ = దిక్కులందు వ్యాపించిన; యశః + శ్రీవధూ = కీర్తిసంపదయను స్త్రీయొక్క; హస్తాగ్ర = అరచేతియందు; ఆమలకాయమాన = ఉసరికకాయవంటిదగు; మహనీయ = గొప్పదైన; అంభోజగర్భ + అండ = (పద్మమునుండి పుట్టిన) బ్రహ్మాండము కలవాడా! సైన్యస్తోమ = సైన్యసముదాయము వలన; ఉత్థ = పుట్టిన; రజః + వ్రజ = పరాగముచే; స్థగిత = కప్పబడిన; కృష్ణాగౌతమీ మధ్యభూమి = కృష్ణాగౌతమీ (గోదావరీ) నదుల మధ్యభాగమందలి; అస్తోక = గొప్పదైన; ఉత్కలరాట్ = ఉత్కల దేశపు రాజుయొక్క; పురీహరణ = పట్టణమును హరించుటయను; లీలా = విలాసమునందు; అవార్య = నివారింపరాని; శౌర్య + ఉదయా = శౌర్యసమృద్ధికలవాడా!

తా: చురుకైన బుద్ధియు, పండితుల పొగడ్తయు, బ్రహ్మాండమును వ్యాపించిన కీర్తియు కలిగి, కృష్ణా గోదావరీ మధ్యభూమి నాక్రమించి ఉత్కల రాజధాని నాక్రమించిన శౌర్యము కలవాడా! అలం. అతిశయోక్తి, రూపకమును.

క. బిసరుహనయనా నవవిధ
కుసుమాయుధ యవధికుధర • కూటాంచలభూ
విసృమర తేజశ్చంపక
భసలదసత్కీర్తిమలిన • పరిపంథినృపా. 80

టీ: బిసరుహనయనా = పద్మములవంటి నేత్రములుకల స్త్రీలకు; నవవిధకుసుమాయుధ = క్రొత్తరకపు మన్మథుడా! అవధికుధర = చక్రవాళ పర్వతముయొక్క; కూట + అంచలభూ = శిఖరపుకొనల యందలి భూమిని; విసృమర = వ్యాపించిన;

తేజః+చంపక = తేజస్సను సంపెఁగ పువ్వులకు; భసలత్ = తుమ్మెదలగు; అసత్కీర్తి = అపకీర్తిచేనగు; మలిన = మాలిన్యముకల; పరిపంథినృపా = శత్రురాజులు కలవాడా! అలం. రూపకము.

తా: చక్కదనమున మన్మథునివంటివాడై స్త్రీలను మోహింప జేయువాడును, లోకాలోకపర్వతమువరకు వ్యాపించిన తేజస్సుచే పరాభూతులైన శత్రువులు కలవాడా!

—: కవిరాజవిరాజితము :—

నల నృగ రంతి భగీరథ భారత ♦ నందన కల్ప యనల్పయశ
శ్చులుకితలోక విలోకివధూజన ♦ సూనశరాసన మానఖనీ
ప్రళయఘనాఘనఘోషజయానక ♦ భాంకృతిభీమచపేటలుఠ
త్కలబరిగీకటకక్షితిరక్షక ♦ కన్నడరాజ్యరమాగమణా. 81

టీ: నల...కల్ప = నలుడు; నృగుడు, రంతిదేవుడు, భగీరథుడు, భరతసుతులగు ధర్మరాజాదులబోలినవాడా! అనల్పయశః = ఎక్కువ కీర్తిచే; చులుకిత = పుడిసిలిలో లోనికి తీసికొనబడిన; లోక = లోకములు కలవాడా! విలోకివధూజన = చూచెడి స్త్రీజనములకు; సూనశరాసన = మన్మథునివంటివాడా! మానఖనీ = అభిమానమునకు గనివంటివాడా! ప్రళయ...రక్షక-ప్రళయఘనాఘన = ప్రళయకాల మందలి మేఘములయొక్క; ఘోష = ధ్వనివంటిధ్వని కల్గిన; జయ+ఆనక = జయభేరియొక్క; భాంకృతి = 'భాం' అను; భీమచపేట = భయంకరమైన చెంపదెబ్బచే; లుఠత్ = నేలపై పొరలెడి; కలబరిగీకటకక్షితిరక్షక = కలబరిగియను కోటయొక్క రాజుకలవాడా! కన్నడరాజ్యరమారమణా = కన్నడరాజ్యలక్ష్మికి భర్తయైనవాడా!

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస
శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితా మతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం
బనుమహాప్రబంధమునందు

ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

—— (★) ——

శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

(టీకాతాత్పర్యసహితము)

## తృతీయాశ్వాసము



వేంకటేశపదప
ద్మావేశితసదయహృదయ ♦ హరనిటలనట
త్పావకపరిభావిమహః
ప్రావృతనిఖిలాశ కృష్ణ ♦ రాయమహీశా. 1

టీ: శ్రీ వేంకటేశ = లక్ష్మీయుతుఁడగు వేంకటేశ్వరస్వామియొక్క; పదపద్మ = పద్మములవంటి పాదమూలందు; ఆవేశిత = లగ్నము చేయఁబడిన; సదయహృదయ = దయతోఁ గూడిన మనస్సు కలవాఁడా! హర = శివునియొక్క; నిటల = ఫాలమందు; నటత్ = నటించెడి; పావక = అగ్నిని; పరిభావి = తిరస్కరించు-మించెడి; మహః = తేజస్సుచే; ప్రావృత = వ్యాపించఁబడిన; నిఖిల + ఆశ = అన్ని దిక్కులు కలవాఁడా! కృష్ణరాయమహీశా = శ్రీకృష్ణదేవరాయా! అలం. ఉపమ.

వ. అవధరింపు మమ్మహాత్మునకుఁ బక్షు లిట్లనియె. 2

టీ: అవధరింపుము = చిత్తగింపుము; ఆ + మహా + ఆత్మునకున్ = ఆ జైమినికి; పక్షులు; ఇట్లు + అనియెన్ = ఇట్లు చెప్పెను.

శా. ఆభూదేవకుమారుఁ డేఁగినఁ దదీ ♦ యానూనరమ్యాకృతిం
దా భావంబున నిల్పి యంగభవకో ♦ దండోగ్రమార్వీరవ
క్షోభాకంపితధైర్యయై యలఁత న ♦ చ్చో నిల్వ కచ్చెల్వ త
ద్భూభృన్మేఖలవెంటఁ గానలఁ బడిన్ ♦ దుఃఖాబ్ధినిర్మగ్నయై. 3

టీ: అనూనదేవకుమారుడు=ఆప్రవరుడు; ఏగినన్=వెళ్లగా; ఆ+కొమ్మ=ఆస్త్రీ; తాన్=తాను; తదీయ=ఆప్రవరుని సంబంధమైన; అనూన=గొప్పదైన; రమ్య+ఆకృతిన్=సుందరమైన ఆకారమును; భావంబునన్=మనస్సునందు; నిల్పి; అంగభవ=మన్మథునియొక్క; కోదండ=ధనుస్సుయొక్క; ఉగ్రమౌర్వీరవ=భయంకరమైన నారిమ్రోతవలని; క్షోభ=కలతచే; ఆకంపిత=కదల్పబడిన; ధైర్యయై=ధైర్యముకలదై; అలంతన్=ఆయాసముచే; దుఃఖ+అబ్ధి=దుఃఖమను సముద్రములో; నిర్మగ్నయై=మునిగినదై; అచ్చోన్=అక్కడ; నిల్వలేక; తత్=ఆ; భూభృత్+మేఖల వెంటన్=పర్వతము నడిప్రదేశము వెంబడిని; కానలబడిన్=అడవిమార్గము నందు. (ముందున కన్వయము.)

తా: ఆప్రవరుడేగిపోగా వరూధిని మన్మథబాణాఘాతముల కాగలేక అతనినే ధ్యానించుచు, దుఃఖిత్తై, అక్కడ నిల్వలేక అడవుల వెంటపడి...

క. తిరుగుచు ధరణీసురవరుఁ
డరిగిన చొప్పరసి యరసి ♦ యటఁ గానక యా
హరిణాంకముఖి సఖీజన
పరివృతయై మగిడి వచ్చి ♦ భావములోనన్ 4

టీ: తిరుగుచున్; ధరణీసురవరుడు=బ్రాహ్మణశ్రేష్ఠుడు; అరిగినచొప్పు=వెళ్లినరీతిని; అరసియరసి=తెగవెదకి; అట=అక్కడ; కానక=చూడలేక; ఆ హరిణ+అంకముఖి=లేడిచిహ్నముగాకల చంద్రుని వంటి ముఖముకల వరూధిని; సఖీజన పరివృతయై=(తన్ను వెదకుచు వచ్చిన) చెలికత్తెలతో కూడుకొని; మగిడివచ్చి=మరలి యింటికివచ్చి; భావములోనన్=మనసులో. (ముందున కన్వయము)

తా: అడవులలో తిరుగుచు తెగవెదకినది. అతడు కన్పడలేదు. తన్ను వెదకుచు వచ్చిన చెలికత్తెలతో కలిసి తిరిగి యింటికి వచ్చినది.

ఉ. అక్కట వాఁడు నాతగుల ♦ మాఱడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచి పోయె దరి ♦ జేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన నిఁక ♦ నీకొఱనోములు నోచినట్టి నే
నెక్కడ వానికౌఁగి లది ♦ యెక్కడ హా విధి యేమి సేయుదున్.

టీ: అక్కట=అయ్యో! వాడు=ఆప్రవరుడు; నాతగులము=నాప్రేమను; ఆఱడిసేసి=వ్యర్థముచేసి; దయావిహీనుడై=కరుణమాలినవాడై; చిక్కక=(నాకు) లొంగక; త్రోచి=నన్నుత్రోచి; పోయెన్=వెళ్లిపోయెను; ఇకన్=ఇంక; దరిన్=ఒడ్డును; చేరగన్+రాని=చేరుటకు-శక్యముకాని; వియోగసాగరంబు=విరహమను సముద్రమును; ఎక్కడన్=ఎంతని; ఈదుదానన్=ఈదగలను; ఈకొఱనోములు=ఈతక్కువదైనవ్రతములు; నోచినట్టినేను=చేసిననేను; ఎక్కడ? వానికౌగిలి=ప్రవరుని కౌగిలింత; అది; ఎక్కడ? ఈ రెండును కుదరవు. హా! విధి=దైవమా! ఏమిసేయుదున్=ఏమిచేయుదును.

తా: ఆ ప్రవరుడు నా ప్రేమను కాదని నన్నుఁ ద్రోసివేసి పోయెనే. నే నెట్లీ విరహ సముద్రము నీదగలను? కోరికతీరుటకు సరిపోని నోములు నోచిన నాకునా అతని కౌగిలికిని ఎంతదూరము? నాకిక కోరిక తీరునా? అలం. పరిణామము. విషమము.

ఉ. కమ్మనికుందనంబు కసు ♦ గందని మే నెలదేఁటి దాటులన్
బమ్మరవోవఁ దోలు తెగ ♦ బారెడు వెండ్రుక లిందుబింబముం
గిమ్మన నీదు మోము గిరి ♦ క్రేపులు మూఁపులు కౌను గాన రా
దమ్మక చెల్ల వానివిక ♦ చాంబకముల్ శతపత్రజైత్రముల్. 6

టీ: అమ్మక చెల్ల = ఆహా! వాని = ఆ ప్రవరునియొక్క; కసుగందని మేను = పసవాడని శరీరము; కమ్మనికుందనంబు = పరిమళించెడి మేలిమి బంగారము. తెగ బారెడు వెండ్రుకలు = నిండుగా బారెడున్న జుట్టు; ఎలదేఁటిదాటులన్ = పడుచు తుమ్మెదల బారును; బమ్మరవోవన్ = భ్రమపడునట్లుగా; తోలున్ = తరుమును; మోము = ముఖము; ఇందుబింబమున్ = చంద్రబింబమును; కిం+అననీదు = ఏమి అననియ్యదు; మూఁపులు = భుజముల పైభాగములు; గిరిక్రేపులు = పర్వతశిఖరములు-ఎత్తైనవి; కౌను = నడుము; కానరాదు = కన్పడదు; వికచ+అంబకముల్ = వికసించిన (విశాలమైన) కన్నులు; శతపత్రజైత్రముల్ = నూరు రేకులుకల పద్మములను జయించు స్వభావము కలవి. ఉపమోత్ప్రేక్షా రూపకాతిశయోక్త్యలంకారములు.

తా: ఆహా! వాని అందమేమని చెప్పుదును? వాని శరీరము పరిమళించెడి బంగారమే. జుట్టు తుమ్మెదల బారువలె తెగ బారెడున్నది. ముఖము చంద్రబింబమును మించినది. భుజ శిరస్సు లెత్తుగా నున్నవి. కన్నులు విశాలముగా తమ్మిపూలవలె నున్నవి.

ఉ. చొక్కపుఁబ్రాయమున్ మిగుల ♦ సోయగముం గలప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతన్ రతుల ♦ నేఁకట దీర్చి సమేళ మొప్పఁగా
నక్కున గారవించి ప్రియ ♦ మందగ నోచనియింతి దైన యా
చక్కఁదనం బదేమిటికి ♦ జవ్వన మేటికిఁ బ్రాణ మేటికిన్. 7

టీ: చొక్కపుఁబ్రాయమున్ = నిండుయౌవనమును; మిగులన్ = మిక్కిలి; సోయగమున్ = అందమును; కలప్రాణనాయకుండు = కల్గిన ప్రియుడు; ఎక్కుడు వశ్యతన్ = మిక్కిలి స్వాధీనతతో; రతులన్ = సంభోగములందు; ఏఁకటన్ = కోరికను; తీర్చి = నెరవేర్చి; సమేళము = ఏకమగుట; ఒప్పగాన్ = ఒప్పునట్లు; అక్కునన్ = రొమ్మునందు; గారవింపన్ = ముద్దుచేయగా; ప్రియమందగన్ = ప్రేమను పొందునట్లు; నోచనియింతిదైన = అదృష్టములేని స్త్రీదగు; ఆచక్కదనంబు = ఆవ్యర్థమగునందము; అది; ఏమిటికిన్ = ఎందుకు? జవ్వనము = యౌవనము; ఏటికిన్; ప్రాణము = బ్రతుకు, ఏటికిన్ = ఎందుకు? వ్యర్థమని భావము. అలం. అప్రస్తుత ప్రశంస.

తా: అందము, పడుచుదనముకల స్త్రీకి, తాను వలచిన పురుషుడు చెప్పు చేతలలోనుండి, కోరినకోర్కెలు తీర్చుచు రొమ్ముపై రొమ్ము నదిమి కౌగిలించుకొని ముద్దుచెల్లించునట్లుండుటకు నోచుకోని, స్త్రీయొక్క చక్కదనము, యౌవనము, బ్రతుకును వ్యర్థములు.

ఉ. ఎంతతపంబు చేసి జని ♦ యించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞ చేసినను ♦ కాయము వాయుదు రే నమర్త్యనై
చింతల వంతలం జివికి ♦ సిగ్గఱితిన్ మృతి లేనినాదు చె
ల్వింతయు శూన్యగేహమున ♦ కెత్తిన దీపిక యయ్యె నక్కటా! 8

టీ: మర్త్యభామినుల్ = మనుష్యస్త్రీలు; ఎంతతపంబుసేసి = ఎంతఘోరతపస్సు చేసి; జనియించినవారొకొ = పుట్టినారో; కాంతుడు = భర్త; అవజ్ఞ + చేసినను = అవమానము చేసినచో; కాయము = శరీరమును; వాయుదురు = విడుతురు. ఏన్ = నేను; అమర్త్యనై = దేవతాస్త్రీనై; (చావులేనిదాననై) చింతలన్ = విచారముచేత; వంతలన్ = సంతాపముచేత; చివికి = చిక్కి; సిగ్గఱితిన్ = సిగ్గులేని దాననైతిని; అక్కటా! మృతిలేనినాదు; చెల్వు = అందము; ఇంతయున్ = ఉన్నదంతయును; శూన్యగేహమునకున్ = పాడుపడిన యింటిలో; ఎత్తినదీపిక = పెట్టిన దీపము; అయ్యెన్.

తా; మనుష్యస్త్రీలు చావు కలవారు కనుక ప్రియులు కొంచెము అవమానము చేసినచో శరీరము విడుతురు. నాకు చావు లేనందున ఎంత అవమానము వచ్చినను సహించి, క్రుంగి, కృశించి సిగ్గులేక బాధలు పడుచున్నాను. అయ్యో! కోరికతీరని నాఅందము పాడుపడిన యింటిలో పెట్టిన దీపమువలె నున్నది. ఎవరానందించినది నాయౌవనము? చావు కల్గిన మనుష్యస్త్రీలెంత తపస్సు చేసిరో కదా! అలం. ఉత్ప్రేక్ష, లేశము, పరికరాంకురము, నిదర్శనయును.

వ. అని వితర్కించుచుఁ గ్రించుదనంబునఁ బునఃపునః పరిభవ కారియై కాఱియం బెట్టి సిరిపట్టి బెట్టేయం గాఁడి చనునలరంపకట్టియల గుట్టు చెడి వెచ్చవెచ్చనై హెచ్చి విచ్చలవిడిం గాయు నుద్దామ విరహదవదహనదాహంబున దేహంబు తల్లడిల్ల మల్లడిగొని పెల్ల డరు నిట్టూర్పుగాడ్పు విసరులం గసరెత్తి యంతకంత కంతరంగం బున నింతంతనరాక పొంగి చింతాసాగరంబు వేగిరంబ వెల్లివిరిసి చె నసం దుడిచిన నడంగక సారెకుం దారకల నీరిక లెత్తుపొగరన నిగ నిగ లినుమడిగ నిగుడ మిగులు వగల బుగులుబుగులున నెగసి మొగసి యొప్పులకుప్పలగు చెప్పలం జిప్పిలుకాటుక లప్పళించి కరంచి దర దళదరుణ కమలదళశోణంబులగు దృక్కోణంబులం దిగువారు

కన్నీరు చెన్నారు కర్ణద్వయీగోళంబులునిండి తనుతాపతప్తం బగు హాటకతాటంక యుగళంబునంబడి క్రొంబొగలెగయింప బిసకిసలయ సగంధం బగుమణిబంధంబునఁ జికురబంధంబుఁ జేర్చికొని పొరలం మఱిమిన విరు లురుల నరవిరిసి కలిసి యిరులుకొను గరగరని నెఱికుఱులు గుఱిగడవఁ బెరిగిన వగుటం జేసి రాసిపడి మెయిమూసి కొని గ్రహగణంబులం జెన్నగు మిన్నువిఱిగి పయింబడిన నడువున బెడంగువడఁ గలయం దలకొను పులకమొలకపయిరునకుం బాఱు దుర్వారవారపూరంబునం గ్రమక్రమంబున నంగంబులం గ్రమ్ము చెమ్మటల మిన్నేటి పెన్నీటి వఱ్ఱున మునుంగకుండ సవరించిన మిం చుకుంభపల్లవంబనం బరిభ్రష్టోత్తరీయంబై బయలువడి యుబ్బరపు గుబ్బచనుదోయి నిబ్బరంపుమెఱుంగు లీనం గుపిత హారనయన శిఖి శిఖాభస్మీకృతస్మరవిరహ శోకంబునంబడి చందురునిం బట్టుకొని యడలు రతిరమణి చందంబునం గుసుమితలతా నిశాంత శశికాంత వేదికాంతరంబున మేను సేర్చి వివిధ దశాంతరంబుల వేఁగుచుండె నంత.

టీ: అని; వితర్కించుచున్ = ఆలోచించుచు; క్రించుదనంబునన్ = నైచ్యముచే; పునః పునః = మాటిమాటికి; పరిభావకారిణియై = తిరస్కారము చేయునదై; కాఱియం బెట్టు = బాధించు; సిరిపట్టి = మన్మథుడు; బెట్టు + ఏయన్ = ఎక్కువగా బాణను వేయగా; కాఁడి = నాటి; చను + అలరు + అంపకట్టియలన్ = దూసికొనుపోవు పువ్వుఁబాణముల చే; గుట్టుచెడి = గుట్టుగా నుండుటమాని; వెచ్చవెచ్చనై = గోరువెచ్చనై; హెచ్చి; విడి + విడి = విచ్చలవిడిన్ = ఎక్కువగా; కాయు = కాసెడి; ఉద్దామ = ఎక్కువైన; విరహదవదహన = వియోగమను దవాగ్నియొక్క; దాహంబునన్ = తాపముచేత; దేహంబు; తల్లడిల్లన్ = బాధపడగా; మల్లడిగొని = క్రిక్కిరిసి; పెల్లు = మిక్కిలి; అడరు = అతిశయించు; నిడు + ఊర్పు = దీర్ఘమైననిశ్వాసముయొక్క; గాలివిసరులన్ = గాలివిసరుటలచే; కసరు + ఎత్తి = తుపానురేగి; అంతకంతకున్ = అప్పటప్పటికి; అంతరంగంబునన్ = మనసులో; ఇంతంతనరాక = హద్దులేక; పొంగి; చింతాసాగరంబు = దుఃఖమనెడి సముద్రము; వేగిరంబు = వెంటనే; వెల్లి + పొడిచెననన్ = ప్రవహించెనో అనునట్లు; తుడిచినన్ = గుడ్డతో ఒత్తినను; ఆఁడంగక = ఆగక; సారెకున్ = మాటిమాటికి; తారకలన్ = నల్లగ్రుడ్లనుండి; ఊరికలెత్తు = పుట్టునట్లు; పొగరు + అనన్ = నల్లరంగో అనునట్లు; నిగనిగలు = కాంతులు; ఇనుమడిగన్ = రెట్టింపుగా; నిగుడన్ = వ్యాపించగా; మిగులువగలన్ = ఎక్కువైన విచారములచే; బుగులుబుగులునన్ = బుగబుగమని; ఎగసి = పైకివ్యాపించి; ఒప్పులకుప్పలగు = అందాలరాసులైన; ఱెప్పలన్ = కనురెప్పలనుండి; చిప్పిలు కాటుకలు =

పైకివచ్చు కొలకులు; అప్పళించి=ఆక్రమించి; కరంచి=కరగించి; దరదళత్=కొద్దిగా వికసించుచున్న; అరుణ కమలదళ=ఎఱ్ఱతామర రేకులవలె; శోణంబులగు=ఎఱ్ఱనైన; దృక్+కోణంబులన్=కనుకొనలనుండి; దిగువాఱుకన్నీరు=క్రిందికి దిగజాఱు కన్నీరు; చెన్నగు=అందమైన; కర్ణద్వయీ=రెండుచెవులయొక్క; గోళంబులు=బింద్రువులు; పెండి; తనుతాపతప్తంబగు=శరీరతాపముచే తపింపబడిన; హాటకతాటంక యుగళంబునన్=బంగారు కమ్మలజతమీద; పడి=చింది; క్రొత్త+సొగలు=క్రొత్తసొగలు; ఎగయింపన్=పైకిలేపగా; ఓరకిసలయసగంధంబగు=తాజాకు మొలకలను పోలిన; మణిబంధంబునన్=మణికట్టుపై; చికురబంధంబున్=కొప్పును; చేర్చుకొని=పెట్టుకొని; సొరలన్=పొర్లగా; తుఱిమినవిరులు=కొప్పులో నుంచుకొన్న పూలు; ఉరులన్=రాలగా; అరవిరిసి=సగము విడిపోయి; కలిసి=వ్యాపించి; ఇసులుకొను=చీకట్లుక్రమ్మ; సరసరని నెఱికొనులు=అందమైన ముఖ్లు; గుటకడవన్=లక్ష్యముదాటినట్లు; పెరిగిన గుటంజేసి=పెరిగెడంగా; రాశివడి=ప్రోవై; మెయిన్=దేహమునను; మూసికొని=క్రమ్ముకొని; గ్రహగణంబులన్=గ్రహముల గుంపులతో; చెన్నగుమిన్ను=అందమైన ఆకాశము; నిండినపయిబడిన పసువునన్=విరిగిమీదపడినట్లుగా; చెడంగువడన్=అందగించగా; కలయన్=అంతటను; తలకొను=పుట్టెడి; పులకమొలకపయిరునకున్=గరిపాటను మొలిచెడి సస్యమునకు; పాఱు=ప్రవహించు; దుర్వార=అడ్డులేని; వారిపూరంబునన్=నీటిప్రవాహమునట్లు; క్రమక్రమమ్మునన్=వరుసగా; అంగమ్ములన్=అవయవములందు; క్రమ్మ=వ్యాపించు; చెమ్మటల=చెమటలను; మిన్నేటిపెన్నెటివఱ్ఱునన్=ఆకాశగంగ వరదలందు; మునుంగకుండన్=మునుగకుండునట్లు; సవరించిన=కూర్చిన; మించుకుంభప్లవంబునన్=మంచికడవలను తెప్పవోయినట్లు; పరిభ్రష్ట=జారిన; ఉత్తరీయంబై=పైటగలదై; బయలువడి=బయటపడి; అబ్బురపుసిబ్బెంపు=అద్భుతమైన అందముకల; గబ్బిగుబ్బ=పెద్దవైవట్రువైన; చనుంగవ=స్తనద్వయము; నిబ్బరపుమెఱుంగులు=ఎక్కువ కాంతులు; ఈనన్=పుట్టించుచుండగా; కుపిత=కోపించిన; హర=శివునియొక్క; నయనశిఖిశిఖా=కన్నుగానున్న అగ్నిజ్వాలచే; భస్మీకృత=బూడిదగాచేయబడిన; స్మరవిరహశోకంబునన్=మన్మథునిలేని దుఃఖముచే; చందురునిన్=చంద్రుని; పట్టుకొని; అడలు=దుఃఖించు; రతిరమణిచందంబునన్=రతీదేవివలె; కుసుమిత=పూచిన; లతానిశాంత=పొదరింటిలోపల; శశికాంత=చంద్రకాంతమణులతో కట్టిన; వేదిక+అంతరంబునన్=అరుగుమధ్యన; మేను+చేర్చి=శరీరమువాల్చి; వివిధ=పలురకములైన; దశా+అంతరంబులన్=అవస్థలచే; వేగుచున్=బాధపడుచు; ఉండెన్=ఉండెను; అంతన్=అప్పుడు.

చ. తరుణి ననన్యకాంత నతి ♦ దారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవు ♦ బారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డ ♦ హంకృతితో నని రోషభీషణ
స్ఫురణవహించెనో యన న♦భోమణి దాల్చెఁ గషాయదీధితిన్. 10

టీ: తరుణిన్ = పడుచుదానిని; అనన్యకాంతన్ = పరుని భార్య కానిదానిని; అతిదారుణ = మిక్కిలి దారుణమైన; పుష్పశిలీముఖ = కుసుమబాణునియొక్క; వ్యథాభర = దుఃఖాతిశయముచే; వివశ = వశము తప్పిన; అంగిన్ = శరీరము కలదానిని; అంగభవు బారికిన్ = మన్మథబాధకు; అగ్గముసేసి = లోబరిచి; క్రూరుఁడై = నిర్దయుఁడై; మహీసుర+అధముఁడు = బ్రాహ్మణాధముఁడు; అహంకృతితోన్ = అహంకారముతో; అరిగెన్ = వెళ్లెను; అని; రోష = కోపముచే; భీషణ = భయంకరమైన; స్ఫురణన్ = కాంతిని; వహించెనో; అనన్ = అనునట్లు; నభః+మణి = సూర్యుఁడు; కషాయదీధితిన్ = ఎఱ్ఱని కాంతిని; తాల్చెన్ = ధరించెను.

తా: సూర్యుఁడు సంధ్యారాగముచే ఎఱ్ఱని కాంతి వహించినాఁడు. అదెట్లున్నదనగా:-పరస్త్రీ కానందున భోగ్యమైన పడుచుదానిని దారుణబాధకు లోనుచేసి నిర్దయుఁడై ప్రవరుఁడు వెళ్లెనని కోపించినట్లున్నాఁడు సూర్యుఁడు. అలం. పరికరము, ఉత్ప్రేక్ష, కావ్యలింగము.

సీ. ఉరుదరీకుహరసు ♦ ప్తోత్థశార్దూలముల్
ఝరవారిశోణిత ♦ శంకఁ ద్రావ
వనకుంజమధ్య శా ♦ ద్వల చరన్మృగపంక్తి
దావపావకభీతిఁ ♦ దల్లడిల్ల
నాశ్రమాంతర భూరు ♦ హాగ్రముల్ మునికోటి
బద్ధకాషాయ వి ♦ భ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగశృం ♦ గాటకంబుల గాంచి
యమరులు హేమాద్రి ♦ యనుచు వాలఁ
గీ. గాసెఁ బేశలరుచిఁ గింశు ♦ కప్రవాళ
ఘుసృణకిసలయకంకేళి ♦ కుసుమగుచ్ఛ
బంధుజీవ జపా రాగ ♦ బాంధవంబు
లన్నగంబున జరఠారు ♦ ణాతపములు. 11

టీ: ఉరుదరీకుహర = పెద్దగుహలను కలుగులనుండి; సుప్త+ఉత్థ = నిద్రించి లేచిన; శార్దూలముల్ = పెద్దపులులు; ఝరవారిన్ = సెలయేటినీటిని; శోణితశంకన్ = రక్తమను భ్రాంతితో; త్రావన్ = త్రాగుచుండఁగా; వనకుంజమధ్య = అడవిపొదల మధ్యనున్న; శాద్వలచరత్ = పచ్చికబయళ్లలో తిరిగెడి; మృగపంక్తి = లేళ్లగుంపులు; దావపావకభీతిన్ = దావాగ్ని యను భయముతో, తల్లడిల్లన్ = భయపడఁగా; ఆశ్రమ+అంతర = ఆశ్రమము మధ్యలోనున్న; భూరుహ+అగ్రముల్ = చెట్లచివరలను; మునికోటి = మునులు; బద్ధ = కట్టబడిన; కాషాయవిభ్రాంతిన్ = కాషాయవస్త్రములను భ్రాంతితో; చూడన్ = చూడఁగా; ఘన = గొప్పవైన; సాను = చరియలను; శృంగశృంగాటకములన్ = శిఖరభూములను; కాంచి = చూచి; అమరులు = దేవతలు;

హేమాద్రియనుచున్ = మేరుపర్వతమని; వాలన్ = క్రిందికి దిగగా; ఆ+నగంబునన్ = ఆపర్వతమందు; కింశుకప్రవాళ = మోదుగచిగుళ్లు; ప్రవాళ = పగడములు; ఘుసృణ = కుంకుమపువ్వు; కిసలయ = చిగుళ్లు; కంకేళికుసుమగుచ్ఛ = ఎఱ్ఱని అశోకపు పూలగుత్తులు; బంధుజీవ = మంకెనపువ్వులు; జపా = దాసానిపువ్వులు-వీటియొక్క; రాగ = ఎఱుపుతో; బాంధవములు = బంధువులైనవి-సాటివచ్చునవియైన; జరఠ+అరుణ+ఆతపములు = ముసలి సూర్యుని ఎండలు; పేశలరుచిన్ = వాడిలేని కాంతితో కాశెన్ = ప్రకాశించెను.

తా: సూర్యాస్తమయ సమయమున కాయు నెండచే వస్తువులన్నియు నెఱ్ఱనైనవి. అందుచే కల్గిన భ్రాంతిని వర్ణించుచున్నాడు. గుహలలో నిద్రించిలేచిన పెద్దపులులు సెలయేటినీటిని చూచి రక్తప్రవాహమని త్రాగుచున్నవి. పొదలమధ్య నున్న పచ్చిక బయలులోనున్న లేళ్లమందలు దావాగ్ని వ్యాపించినదని పారిపోవుచున్నవి. మునులు చెట్లచిగుళ్లుచూచి తా మారవేసిమరచిన కావిబట్టలని చూచుచున్నారు. దేవతలు పర్వతముమీది శిఖరప్రాంతములను మేరుప్రదేశములని దిగుచున్నారు. అట్లు భ్రాంతి కల్గునట్లు సంధ్యాకాల మందెండ చల్లగా కాయుచున్నది. ఉపమా, భ్రాంతి మదలంకారములు.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బా♦ఱెం బక్షు లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణ మయ్యె మృగతృ♦ ష్ణావార్ధు లింకెన్ జపా
శోణం బయ్యెఁ బతంగబింబము దిశా♦ స్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు ని♦ద్రాణంబు లయ్యెం గడున్.

టీ: పక్షులు; నభః+అంతరాళమునన్ = ఆకాశము మధ్య; శ్రేణుల్ గట్టి = బారులుతీరి; పాఱెన్ = వెళ్లెను; ఉష్ణాంశుపాషాణవ్రాతము = సూర్యకాంతమణులు; కోష్ణము = గోరువెచ్చనివి; అయ్యెన్; మృగతృష్ణావార్ధులు = ఎండమావులనెడి సముద్రములు; ఇంకెన్ = ఇగిరినవి; పతంగబింబము = సూర్యబింబము; జపాశోణంబు = దాసానిపువ్వువలె నెఱ్ఱనిదై; అయ్యెన్; దిశాస్తోమంబు = దిక్కుల సముదాయము; శోభాదరిద్రాణంబు = శోభతో దరిద్రమైనది; (శోభలేనిది) అయ్యెన్; సరోజషండములు = పద్మములతోపులు; కడున్ = మిక్కిలి; నిద్రాణంబులు = ముకుళించునవి; అయ్యెన్.

తా: పక్షులు బారులుతీరి గూళ్లకు వచ్చుచున్నవి. ఎండచే వెచ్చగిలిన సూర్యకాంతమణులు చల్లబడినవి. ఎండమావులింకినవి. సూర్యబింబ మెఱ్ఱనైనది. దిక్కులందు కాంతి తగ్గినది. పద్మములు ముకుళించుకొని పోవుచున్నవి. అలం. స్వభావోక్తి, పరిణామము, ఉపమయు.

క. తరణి యుదె కుంకుచున్నాఁ
డరుదెమ్మని చంద్రుఁ బిల్వ ♦ నరిగెడు రజనీ
తరుణీమణిదూతిక లన
నరిగెం దూర్పునకు నీడ ♦ లతిదీర్ఘములై.

టీ: తరణి = సూర్యుఁడు; ఇదె = ఇదిగో; క్రుంకుచున్నాఁడు = అస్తమించు చున్నాడు; అరసెమ్ము = రమ్ము; అని = అనిచెప్పి; చంద్రున్ = చంద్రుని; పిల్వన్ = పిల్చుటకై; అరిగెడు = వెళ్లెడి; రజనితరుణీమణి = రాత్రియను స్త్రీయొక్క; నూతికలనన్ = నూతికలసనట్లు; నీడలు; అతిదీర్ఘములై = మిక్కిలిపొడవై; తూర్పునకున్ = తూర్పుదిక్కునకు; అరిగెను = వెళ్లెను.

తా: రాత్రియను స్త్రీ ప్రొద్దుక్రుంకగానే రమ్మని తనప్రియుడగుచంద్రునకు కబురంపెడి దూతలను నట్లుగా మనుష్యులు మొదలైనవారి నీడలు తూర్పునకు పొడవుగా సాగుచున్నవి. అలం. ఉత్ప్రేక్ష.

క. క్రుంకె నపరాంబురాశిం
బంకజబంధుఁడు తదీయ ◆ బడబాముఖ వీ
క్షాంకురితకుతుకరథ్యని
రంకుశవేగాపహృతశ ◆ తాంగుఁడుఁ బోలెన్. 12

టీ: పంకజబంధుఁడు = పద్మములకు చుట్టమైన సూర్యుడు; అపర+అంబురాశిన్ = పటమటి సముద్రములో; తదీయ...బోలెన్ - తదీయ = ఆసముద్రము సంబంధమైన; బడబా = ఆడుగుఱ్ఱము యొక్క; ముఖవీక్షా = ముఖమును చూచుటచే; అంకురిత = పుట్టిన; కుతుక = వేడుకకల; రథ్య = గుఱ్ఱములచే; నిరంకుశవేగ = ఎక్కువ వేగముచే; అపహృత = లాగబడిన; శతాంగుడుబోలెన్ = రథము కలవాడువలె; క్రుంకెన్ = అస్తమించెను.

తా: సూర్యుడు పటమటి సముద్రప్రాంతమునకేగుసరికి ఆసముద్రములోనున్న బడబయను నాడుగుఱ్ఱము యొక్క ముఖమును చూచి దానిని కలియు కోరికతో చురుకుగ గుఱ్ఱములు రథమును లాగినా యనునట్లు త్వరగా చూచుచుండగ నే ప్రొద్దు గ్రుంకెను. అలం. ఉత్ప్రేక్ష.

వ. ఆసమయంబున. 14

టీ: ఆసమయంబునన్ = అప్పుడు.

సీ. ఏవిహంగముఁ గన్న ◆ నెలుఁగించుచును సారె
కును సైకతంబులఁ ◆ గూడఁ దారుఁ
దారి కన్గొని యది ◆ తనజోడు గాకున్న
మెడ యెత్తి కలయంగ ◆ మింట నరయు
నరసి కన్నీటిచో ◆ మఱలి తామరయెక్క
వదన మెండఁగ సరో ◆ వారి నద్దు
నద్ది తొరివఁగ నైప ◆ కట్టెట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి ◆ భ్రమసి యుఱుకు

గీ. నుఱికి యెఱకలు దడియ వే ♦ ఱొక్క తమ్మి
కరుగు నరిగి రవంబుతోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున నుఱియును ♦ బోవు వెదకి
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క ♦ చక్రవాకి. 16

టీ: ఒక్కచక్రవాకి= ఆడుచక్రవాకపక్షి; సంజన్ =సంధ్యాకాలమందు; ప్రియునిన్ =భర్తయైన మగపక్షిని; పాసి=విడిపోయి; వగన్ =విచారముతో; సైకతంబునన్ =ఇసుకతిన్నెలందు; ఏవిహంగమున్ = ఏపక్షినైనను; కనన్ =చూచినను; ఎలుఁగించుచున్ =కూయుచు; సారెకున్ =మాటిమాటికి; కూడన్ =కలియుటకై; పాఱున్ = వెళ్లును; తాఁకి = దగ్గరగావెళ్లి; కన్గొని = చూచి; అది=ఆపక్షి; తనజోడు గాకున్నన్ =తనజంటదైన పక్షి కానిచో; మెడనెత్తి = మెడనుపైకెత్తి (తన జంటపక్షి పైకెగిరినదేమోయని) మింటన్ =ఆకాశమునను; కలయంగన్ =అంతటను; అరయున్ = వెదకును; అరసి – వెదకిచూచి; కన్నీటితోన్ =కన్నులనీరుపెట్టుకొని; నుఱికి; తామరయెక్కి = తామరపువ్వుపైకెక్కి; వదనమెండఁగన్ = నోరెండగా; సరోవారిన్ = కొలనులోని నీటితో; అద్దున్ = నోటిని నీరామునఁ జేయును; అద్ది; త్రాగఁగన్ = త్రాగుటకు; సైపక = సహించక (ఇష్టపడక) అట్టిట్టు కన్గొని = అటునిటు చూచి; ప్రతిబింబము = తననీడను; ఈక్షించి = చూచి; భ్రమసి = భ్రాంతిపడి; ఉఱుకున్ = నీటిలోని కురుకును; ఉఱికి; ఎఱకలు = రెక్కలు; తడియన్ = తడియగా; వేఱొక్క తమ్మికిన్ = మరొక తామరపువ్వునకు; అరుగున్ = వెళ్లును; అరిగి; రవంబుతోన్ = కూయుచు; తిరుగు తేంట్లన్ = తిరిగెడి తుమ్మెదలను; ముక్కునన్ = ముక్కుతో; పొడుచున్ = (వాటి కూత తన కసహ్యము కాగా) పొడుచును. నుఱియును; వెదకన్ = వెదకుటకు; పోవున్ = పోవును; ఇందు ఆడుచక్రవాక పక్షి యొక్క విరహవేదన వర్ణింప బడినది. చక్రవాక పక్షులు జంటలు వీడి సహింపలేని నీటిపక్షులు. ప్రొద్దుగ్రుంకుటతో వాటికి కన్ను లగపడవు. అందుచే ప్రొద్దుండగనే దగ్గరగా కలిసికొని యుండుటకు ప్రయత్నించును. అట్లు కనపడని ప్రియునికై వెదకుచున్నది. స్వభావోక్తి, భ్రాంతి మదలంకారములు.

సీ. రవిబింబపతనదీ ♦ ర్ణపయోధిగర్భని
ర్గతశేషఫణిఫణా ♦ రత్నరుచియొ
దివసావసానసం ♦ దీప్తాస్తగిరిశిఖా
జ్యోతిర్లతాప్రతా ♦ నాతపంబొ
తపనధూర్ద్దండని ♦ ర్దళితది_క్తటదృశ్య
కమలజాండకటాహ ♦ కనకఘృణియొ
చండీశతాండవో ♦ త్సవసంభృతక్షపా
హస్తాగ్రదీపక ♦ భస్త్రిచయమొ

గీ. ద్రాగ్దిగ్విదాహచ్ఛిదావిని ♦ ద్రాణమదవ
దంజనాలానమూలశ ♦ య్యావిధాన
వారుణాధోరణాకల్పి ♦ తోరుశోణ
మృత్తికారాశియో యన ♦ మెఱసె సంధ్య. 17

టీ: సంధ్య=సంధ్యాకాల మందలి యెరుపు; రవి...రుచియో-రవిబింబ=సూర్యబింబము యొక్క; పతన=పడుటచే; దీర్ణ=పడిపోయిన; పయోధిగర్భ=సముద్రగర్భమునుండి; నిర్గత=బయటికి వచ్చిన; శేషఫణి=శేషాహియొక్క; ఫణా=పడగలమీది; రత్నరుచియో=రత్నముల కాంతియో? దివస...ఆతపంబో-దివస+అవసాన=సాయంకాలమందు; సందీప్త=వెలుగుచున్న; అస్తగిరిశిఖా=పడమటి కొండ శిఖరము లందలి; జ్యోతిర్లతాప్రతాన=వెలిగెడి తీగల గుంపు యొక్క; ఆతపంబో=కాంతియో? తపన...ఘృణియో-తపన=సూర్యునియొక్క; ధూర్దండ=రథపు కాడిచే; నిర్దళిత=బ్రద్దలుచేయబడిన; దిక్తట=దిక్కుప్రక్కన; దృశ్య=కన్పడు; కమలజాండ=బ్రహ్మాండమనెడి; కటాహ=పెద్దకాగు (జేగిసా) యొక్క; కనకఘృణియో=బంగరుకాంతియో? చండీశ...చయమో-చండీశ=నటరాజుయొక్క; తాండవ+ఉత్సవ=నృత్యమను నుత్సవమున; సంభృత = పట్టుకొనబడిన; క్షపా హస్త+అగ్ర=రాత్రియను స్త్రీ యొక్క చేతి చివరనున్న; దీప=దీపముయొక్క; గభస్తిచయమో=కిరణ సముదాయమో? ద్రాక్...రాశియో-ద్రాక్ = వెంటనే; విదాహ+ఛిదా=ఎక్కువ దప్పిని పోగొట్టుటయందు; వినిద్రాణ = మెలకువతో నుండు; మదవత్ =మదించిన; అంజన=పడమటి దిగ్గజముయొక్క; ఆలాన=కట్టు కర్రయొక్క; మూల=మొదట; శయ్యావిధాన=పక్క వేయుటయందు; వారుణ =వరుణుని సంబంధమైన; ఆధోరణ=మావటి వానిచే; ఆకల్పిత=చక్కగా చేయబడిన; ఉరు=విశాలమైన; శోణమృత్తికారాశియో=ఎఱ్ఱనిమట్టిదిబ్బయో? అనన్ =అనునట్లుగా; మెఱసెన్ = ప్రకాశించెను; (మదమెక్కిన కొలది యేనుగునకు దాహ మెక్కువగుననియు, అందుకై ఎఱ్ఱమట్టిపై పరుండ బెట్టినచో దాహము తగ్గుననియు గజశాస్త్రము)

తా: సాయంకాలమున సూర్యుడు పడుటతో పాయగావిచ్చిన సముద్రము నుండి పైకి ప్రసరించిన ఆదిశేషుని పడగలమీది రత్నకాంతియో, పడమటి కొండ శిఖరములపై సూర్యకాంతి తగ్గుటతో వెలిగెడి మెరుపుతీగల కాంతియో, సూర్యుని రథము కాడి తగిలి బ్రద్దలైన దిక్కుప్రక్కన ప్రకాశించు బ్రహ్మాండమను పెద్దకాగు యొక్క కాంతియో, శివతాండవవేళ రాత్రిచే పట్టబడిన దివిటీల కాంతియో, పడమటి దిగ్గజమునకు దప్పికకాగా అది తీరుటకై, మావటివాడు కట్టుకర్ర మొదటికి చేర్చిన ఎఱ్ఱమట్టిప్రోగో అన్నట్లుగా సంధ్యారాగము ప్రకాశించెను. అలం. ఉత్ప్రేక్ష.

క. బహుళజలప్లవమాన
ద్రుహిణాండము చెమ్మ యుతికి ♦ రూక్షార్కవిభా
రహితతఁ గానక పట్టెను
రహి చెడి యన నంధతమస ♦ రాసులు బెరసెన్. 18

టీ: బహుళజల=ఎక్కువ నీటియందు; ప్లవమాన=తేలుచున్న; ద్రుహిణ+అండము=బ్రహ్మాండము; చెమ్మయుతికి=నాని; రూక్ష=తీక్ష్ణమైన; అర్క విభా=సూర్యకాంతియొక్క; రహితతన్=లేకపోవుటచే; రహి=అందము; చెడి; కానకపట్టెను=నలుపాగెను; అనన్=అన్నట్లు; అంధతమసరాసులు=కారుచీకట్లు; బెరసెన్=క్రమ్మెను.

తా: నీటిలో తేలుచున్న బ్రహ్మాండము మండుటెండ తగులకుండుట నానినదా అన్నట్లుగా కారు చీకట్లు క్రమ్మెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. మృగనాభిపంకంబు ♦ మెయినిండ నలఁదిన
మాయాకిరాతి మై ♦ చాయఁ దెగడి
నవపింఛమయభూష ♦ లవధరించి నటించు
పంకజాక్షుని చెల్వు ♦ సుంక మడిగి
కాదంబ నికురుంబ ♦ కలితమై ప్రవహించు
కాళిందిగర్వంబుఁ గాకు సేసి
తాపింఛవిటపి కాం ♦ తారసంవృతమైన
యంజనాచలరేఖ ♦ నవఘళించి

గీ. కవిసె మఱియును గాకోల ♦ కాలకంఠ
కంఠకలకంఠకరిఘటా ♦ ఖంజరీట
ఘనఘనాఘనసంఘాత ♦ గాఢకాంతిఁ
గటికిచీఁకటి రోదసీ ♦ గహ్వరమున. 19

టీ: కటికిచీకటి=కారుచీకటి; మృగనాభిపంకంబు=బురదవంటి కస్తూరిని; మెయినిండన్=ఒంటినిండుగా; అలదిన=పూసికొన్న; మాయాకిరాతి = కిరాతస్త్రీగా మారిన పార్వతియొక్క; (పా. మాయాకిరాతు=కిరాత వేషమునున్న శివుని యొక్క;) మైచాయన్=దేహకాంతిని; తెగడి=తిరస్కరించి-మించి; నవపింఛమయ=క్రొత్త నెమలి పింఛములను; భూషలు=అలంకారములు; అవధరించి=పెట్టుకొని; నటించు=నాట్యముచేయు; పంకజాక్షుని చెల్వు=కృష్ణునియందమును; సుంకమడిగి=పన్నిమ్మని-ఎక్కువగానుండి; కాదంబ=నల్లనిముక్కు, కాళ్లు, రెక్కలును కల్గిన హంసలయొక్క; నికురుంబ=సమూహముతో; కలితమై=కూడినదై; ప్రవహించు; కాళిందిగర్వంబున్=యమునానదియొక్క (నల్లగానుంటినను) గర్వ

ముసు; కావుసేసి = ఈసడించి-నీకన్న మించినవాననని. నీయందు ఏమిటి 'ఛీ' అని చీదరించుకొని; తాపింఛవిటపి = కాటుక చెట్లయొక్క; కాంతారసంవృతమైన = అడవిచే కప్పబడిన; అంజన+అచలశేఖరన్ = కాటుక కొండ కాంతిని; అవఘళించి = క్రిందుగాఁజేసి; మఱియును = అంతేకాక; కాకోల = హాలాహలము; కాలకంఠ కంఠ = శివుని కంఠము, కలకంఠ = కోకిల; కిరిఘటా = పందుల గుంపు; ఖంజరీట = కాటుకపిట్ట; ఘనఘనాఘన = కారుమబ్బులయొక్క; సంఘాత = గుంపులయొక్క; గాఢకాంతిన్ = కారునలుపును; కవిసెన్ = మించెను.

తా: కారుచీకటి మిక్కిలి నల్లగా వ్యాపించెను. అది నలుపు కాంతి శ్రీగైన సాహ్వాలి పూసికొన్న కస్తూరికన్న, కృష్ణుని యలంకారమైన నెమలి పింఛముకన్న, యమునానది కన్న, కాటుక చెట్లున్న కాటుకకొండ కన్న, హాలాహలము మున్నగు వాటికన్న మించియున్నది.

క. అంతటఁ బ్రాచి నిశాపతి
యంతికగతుఁ డౌట విని ము • ఖాలంబి తమః
కుంతలములు దీర్పఁగఁ గొను
దంతపుదువ్వెన యనంగ • ధవళిమ దోఁచెన్. 20

టీ: అంతటన్ = చీకటి క్రమ్మగాన్; ప్రాచి = తూర్పుదిక్కనెడి స్త్రీ; నిశాపతి = రాత్రికి భర్తయైన చంద్రుడు; అంతికగతుడౌట = దగ్గరకు వచ్చిన వాడగుట; విని; ముఖ+ఆలంబి = ముఖమున వ్రేలాడు; తమఃకుంతలములు = చీకటియను ముంగురులను; తీర్పఁగన్ = దువ్వుకొనుటకు; కొనుదంతపు దువ్వెన యనంగన్ = తీసికొన్న దంతపు దువ్వెనయో యన్నట్లు; ధవళిమ = తెలుపు కాంతి; తోఁచెన్ = కనపడెను.

తా: తరువాత తూర్పుదిక్కను స్త్రీ తన చెలియగు రాత్రియను స్త్రీకి భర్తయైన చంద్రుడు వచ్చుచున్నాడని తెలిసి తానుకూడ మొగము మీదికివచ్చిపడిన ముంగురుల నెగదువ్వుకొనుటకై దంతపు దువ్వెనను తీసికొన్నదా అన్నట్లు తూర్పున చంద్రోదయమును సూచించుచు తెల్లబడినది. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

చ. మఱునకొసంగఁ గాలము త • మశ్ఛట గాటుకగా నవోదయ
స్ఫురదరుణప్రభా పథిక • శోణిత సిక్త సితోడు భక్తమున్
హరిహయదిఙ్నభస్థ్సలము • నన్ బలి చల్లి వటాంకమున్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁ • గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్. 21

టీ: ఆ+తఱిన్ = అప్పుడు; కాలము = సమయమను పురుషుడు; మఱునకున్ = మన్మథునకు; ఒసంగన్ = ఇచ్చుటకు; తమస్+ఛట = చీకటిరాశి; కాటుక = నిధులున్నట్లు తెలిపెడి అంజనము; కాన్ = కాగా; నవ+ఉదయ = క్రొత్తదైన ఉదయముచే; స్ఫురత్ = ప్రకాశించెడి; అరుణప్రభా = ఎఱ్ఱని కాంతియను; పథికశోణిత = బాటసారుల రక్తముచే; సిక్త = తడుపబడిన; సిత+ఉడు = తెల్లని నక్షత్రములను;

భక్తమున్ = అన్నమును; హరిహయదిక్ = తూర్పుదిక్కునందున్న; నభస్స్థలమునన్ = ఆకాశప్రదేశమున; బలిచల్లి = భూతబలిగాచల్లి; వట+అంకమున్ = మఱ్ఱిచెట్టు గుర్తుగా కలిగి; వసు+ఉత్కర భరితంబునై = కిరణ సముదాయమను ధనముతో నిండి; వెలుఁగన్ = ప్రకాశించుచుండగా; కాంచి = చూచి; సుధానిధిన్ = చంద్రుడను నిధిని; ఎత్తెన్ = పైకెత్తెను.

తా. సామాన్యముగా నిధులు త్రవ్వుకొనువారు సిద్ధాంజనమును పెట్టుకొని ఎక్కడ నిధియున్నదియు గుర్తించి రక్తాన్నమును భూతబలిగా వేసి, అప్పుడు నిధిని పైకిత్రవ్వుదురు. అట్లే కాలపురుషుడు చంద్రుడను నిధిని చీకటియను సిద్ధాంజనము పెట్టుకొని గుర్తించి, చంద్రోదయమునకు ముందు వచ్చిన యెరుపుతో నెఱ్ఱనైన నక్షత్రములనెడి భూతబలినిచల్లి చంద్రుని కళంకమైన మఱ్ఱిచెట్టును గుర్తించి, మన్మథునకిచ్చుటకై పైకి తీసెనా అన్నట్లు చంద్రోదయమయ్యెను. అలం. రూపకము. (చంద్రుని లోని కళంకమును మఱ్ఱిచెట్టుగాకూడ వర్ణింతురు.)

మ. జలజాగారపరంపరల్ మఘవదా ♦ శాభిత్తిఁ దీండ్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళ ♦ ద్బాహ్యచ్ఛదశ్యామికా
చ్ఛలనం గంది ముడుంగుచోఁ సిమసిమ ♦ చ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్ ♦ గర్భస్వనద్భృంగముల్

టీ: జలజ = నీటినుండిపుట్టు-పద్మములనెడి; అగారపరంపరల్ = ఇండ్లవరుసలు; మఘవత్ + ఆశాభిత్తిన్ = తూర్పుదిక్కనెడిగోడయందు; తీండ్రించుచున్ = వెలుగుచు; వెన్నెలచిచ్చులు = వెన్నెలలను నిప్పులు; దళమై = దట్టమై; అంటినన్ = అంటుకొనగా; మిళత్ = ఒకదానితో నొకటి కలిసికొనెడి; బాహ్య+ఛద = వెలుపలి రేకుల యొక్క; శ్యామికా+ఛలనన్ = నలుపను నెపముతో; కంది = కమిలి; ముడుంగుచోన్ = ముణుచుకొనుచుండగా; సిమసిమత్+శబ్దంబుతోన్ = సిమసిమయనుచప్పుడుతో; పుట్టు+అగ్గలపు = పుట్టెడి, ఎక్కువైన; క్రొత్త+పొగలు+ఓ+అనంగన్ = క్రొత్తపొగలో యనునట్లుగా; గర్భస్వనత్ = ఆతామరపువ్వుల లోపలినుండి ఝుమ్మనెడి; భృంగముల్ = తుమ్మెదలు; వెడలెన్ = పైకివచ్చెను.

తా: చంద్రోదయము కాగానే తామరపువ్వులు ముడుచుకొనును. అప్పుడు వాటిమీద వ్రాలిన తుమ్మెదలు పైకి పోవును. దాని నుత్ప్రేక్షించుచున్నాడు. తామరపూలను నిండ్లవరుసలు తూర్పుగోడల నుండి లేచిన వెన్నెలలనునిప్పు మంటలు లేచి తగుల్కొనగా వెలుపలనున్న నల్లని రేకులను నెపముతో కమలి, ముడుచుకొని పోవుచుండగా సిమసిమయనుచు పైకి వచ్చు పొగలో యనునట్లు వాటిపై వ్రాలిన తుమ్మెదలు ఝుంఝుమ్మనుచు పైకి వచ్చుచున్నవి. అలం. రూపకము, అపహ్నవము, ఉత్ప్రేక్షయు.

సీ. శిథిల కైరవదళ ♦ శ్రేణి నొక్కులు దీఱె
శశికాంతపంక్తుల ♦ జలము లూరెఁ

కోరి కాంతులతోఁ జ ♦ కోరికల్ రతిఁ గేరె
వారాశిగర్వంబు ♦ మేర మీఱెఁ
ద్రోపడి యిరులు ప ♦ టాపంచలై పాఱె
దిఙ్ముఖంబులవింత ♦ తెలివి సేరెఁ
జక్రవాకంబు ల ♦ బ్జకుడుంగములఁ దూఱెఁ
గామినీకాంతుల ♦ కలఁక దేఱె

గీ. మదనుఁ డమ్ములు నూఱె హి ♦ మంబు పేరె
జడిసి విరహిణి వగఁ గూరె ♦ జారచోర
దర్పములు జాఱె రవికర ♦ తాప మాఱెఁ
జూడఁ జూడంగఁ దారక ♦ స్ఫురణ దాఱె. 23

టీ: శిథిల=ప్రాతపడిన (పా. ప్రిదిలి=వికసించుచు;) కైరవ=తెల్లకలువలయొక్క; దళశ్రేణి=రేకుల సముదాయము యొక్క; నొక్కులు=ముడుతలు; తీఱెన్=చక్కపడెను-బాగుగా వికసించుటతో నొక్కులు లేకుండ పోయెను; శశికాంత పంక్తులన్=చంద్రకాంతపు రాల వరుసలందు; జలములు=నీళ్లు; ఊరెన్; చకోరికల్ = ఆడుచకోరపక్షులు; కోరి = తమకుతామై; కాంతులతోన్ =భర్తలగుచకోరములతో; రతిన్=సంభోగములందు; కేరెన్=ఉత్సాహముతో ఆనందించెను; వార్+రాశి=నీటిరాశియగు సముద్రము యొక్క; గర్వంబు= పొగరు-పొంగుట; మేరన్=హద్దును; మీఱెన్=దాటెను; ఇరులు = చీకట్లు; ద్రోపడి=(వెన్నెలచే) త్రోయబడి; పటాపంచలై=చెల్లాచెదరై; పాఱెన్=పరుగెత్తెను; దిక్+ముఖంబులన్=దిక్కుల ముందర; వింత తెలివి=క్రొత్తవెలుతురు; చేరెన్=కల్గెను; చక్రవాకంబులు; అబ్జకుడుంగములన్=తామర పూపొదలందు; దూఱెన్=ప్రవేశించెను; కామినీకాంతుల=కాముకులైన స్త్రీలయొక్క ప్రియుల యొక్క; కలఁక=కోపము; తేఱెన్=తగ్గెను; మదనుడు=మన్మథుడు; అమ్ములన్ =బాణములను; నూఱెన్; హిమంబు=మంచు; పేరెన్ = పేరుకొనెను-హెచ్చెను; విరహిణి=భర్తలతో వియోగముకల స్త్రీజనము; (జాత్యేకవచనము;) జడిసి=భయపడి; వగన్=దుఃఖముతో; కూరెన్ =పొందెను; జారచోరదర్పములు=జారచోరుల గర్వములు; జాఱెన్=తగ్గెను; (చీకటిలో జారచోరుల యథేచ్ఛముగా తిరుగుదురు. కాని వెన్నెల వచ్చుటతో కనిపింతుమన్న భయముతో సంచారము మానుదురు.) రవికరతాపము=సూర్యకిరణముల వలని తాపము; ఆఱెన్ = ఉపశాంతిపొందెను; చూడఁజూడంగన్=అంతకంతకు; తారకస్ఫురణ=నక్షత్రకాంతి; తాఱెన్=తగ్గిపోయెను. స్వభావోక్తి అలంకారము.

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచియై ♦ బూనెం జపాసన్నిధి
స్ఫటికం బట్లుదయాద్రిగైరికశిర ♦ స్థానస్థితిం జంద్రుఁడ

చ్చోటుఁబాయన్ శుచి యయ్యె నౌఁ బ్రకృతి న ♦ చ్ఛుండైన సన్మార్గి యె
న్నటికిం గూటమివంక వచ్చువికృతి ♦ న్మగ్నుండుగా నేర్చునే. 24

టీ: చంద్రుడు; ఉదయ+అద్రి=తూర్పుకొండ యొక్క; గైరిక=మనశ్శిల మున్నగు గైరికధాతువులతో కూడిన; శిరస్స్థానస్థితిన్=శిఖరప్రదేశమునందుటచే; జపాసన్నిభ=దాసానిపువ్వు దగ్గరనున్న; స్ఫటికంబట్లు=తెల్లని స్ఫటికపు రాయి వలె; సౌగంధిక=ఎఱ్ఱకలువల యొక్క; రాగ=ఎఱుపువంటి; రక్తరుచి=ఎఱ్ఱని కాంతిని; మైన్=శరీరమందు; పూనెన్=వహించెను; అచ్చోటు=ఆ ప్రదేశమును; పాయన్=వీడగా; శుచి=పరిశుద్ధమైన (తెల్లని) వాడు; అయ్యెన్; ఔన్=అంతే; ప్రకృతిన్ = స్వభావముచే; అచ్ఛుండైన = స్వచ్ఛమైనవాడగు (తెల్లనివాడు;) సన్మార్గి=మంచిత్రోవను పోవువాడు; ఎన్నటికిన్=ఎప్పటికైనను; కూటమివంక వచ్చువికృతిన్=సాంగత్యముచేవచ్చు దోషమందు; మగ్నుండు=మునిగినవాడు; కానేర్చునే=అగునా?

తా: చంద్రు డుదయించగానే తూర్పుకొండమీదనున్న శిలల మెఱుపు సంక్రమించెనో యన్నట్లు ఎఱ్ఱనిపువ్వు ప్రక్కనున్న స్ఫటికపురాయివలె నెఱ్ఱనయ్యెను. పైకివెళ్లిన కొలది తెల్లనయ్యెను. అతడు నైజముగా తెల్లనివాడు. సాంగత్యము వలన అతని కెఱుపురంగు వచ్చినది. కాని అత డారంగులో నిలబడలేదు. దానినే లోకోక్తిచే సమర్థించుచున్నాడు. ప్రకృతిచే నిష్కల్మషమైనవాడు సాంగత్యమువలన ఏమైన దోషమును పొందినను ఆసంగతి పోవుటతో వానికి ఆదోషముకూడ పోవునే కాని అతడు దానిలోనే నిమగ్నుడై యుండడు. అలం. అర్థాంతరన్యాస, ఉపమయు.

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితా ♦ జాండంబులోఁ జంద్రుఁ డొ
ప్పారెం గాలభిషగ్వరుం డవిరతం ♦ బై కాముక శ్రేణికిన్
మారోత్సాహము నిల్వఁ బాదరసమున్ ♦ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి గుటికా ♦ సిద్ధౌషధంబో యనన్. 25

టీ: చంద్రుడు; ఆరూఢస్థితిన్=ఆకాశముపై నుండుటచే; చంద్రికా=వెన్నెలచే; ధవళిత=తెల్లగాజేయబడిన; అజాండంబులోన్ = బ్రహ్మాండమందు; కాలభిషక్+వరుండు=సమయమను వైద్యశ్రేష్ఠుడు; కాముకశ్రేణికిన్=కాముకులకు; మార+ఉత్సాహము=మన్మథోద్రేకము; అవిరతంబై=ఎడతెగనిదై; నిల్వన్=నిల్చుటకై; పాదరసమున్; బంధించి=మూలికలద్వారా మాత్రకట్టునటువచ్చునట్లుచేసి; గ్రాసార్థమై=మ్రింగుటకై; క్షీరస్థాలికన్=పాలకుండలో; పెట్టినట్టి; గుటికాసిద్ధౌషధంబోయనన్=మాత్రయైన మందో అన్నట్లుగా; ఒప్పారెన్=ప్రకాశించెను.

తా: కాలమను పురుషుడు విషవేల్పుకలవారి కాళోకిక నిలుచుటకై పాదరసమును మాత్రగాచేసి, త్రింగుటకై పాలకుండలో పెట్టెనా యన్నట్లు చంద్రుడు ఆకాశముపైకివచ్చి తెల్లనికాంతి వెన్నెలను పాలు చిమ్మినట్లు వెదజల్లుచు ప్రకాశించుచుండెను.

తే. రాజు తేజస్వియై గ్రహ ♦ రాజుమీఁద
నలిగి దాడిగ వెంటాడ ♦ నిలువ కతఁడు
బెగడుపడి పాఱుచోఁ జెఱ ♦ దగిలినట్టి
ఛాయ యిది యన నీల లాం ♦ ఛనము మెఱసె. 26

టీ: రాజు=చంద్రుడనురాజు; తేజస్వియై = తేజశ్శాలియై; గ్రహరాజు మీఁదన్=సూర్యునిపై; అలిగి=కోపించి; దాడిగన్=దండయాత్రగా; వెంటాడన్=వెంబడించగా; అతడు=సూర్యుడనురాజు; బెగడుపడి=భయపడి; నిలువక=ఆగక; పాఱుచోన్=పరుగెత్తుచుండగా; చెఱన్=చెరలో; తగిలినట్టిఛాయ=చిక్కుకొన్న ఛాయాదేవి; ఇది=కన్పించునది; అనన్=అన్నట్లు; నీలలాంఛనము=చంద్రునిలోని కళంకము; మెఱసెన్=ప్రకాశించెను. అలం. ఉత్ప్రేక్ష.

గీ. కలయ జగమునఁ గలయట్టి ♦ నలుపు తెల్లఁ
దెలుపులుగఁ జేసి నీడలు ♦ తెలుపు సేయఁ
గా వశముగామిఁ బొడము దుః ♦ ఖమునఁ బోలె
సాంద్రచంద్రిక తుహినబా ♦ ష్పములు గురిసె. 27

టీ: సాంద్రచంద్రిక=దట్టమైన వెన్నెల; జగమునన్=లోకములో; కలయన్=వ్యాపించగా; కలయట్టి నలుపు తెల్లన్=ఉన్న నల్లని వస్తువులన్నియు; తెలుపులుగన్=తెల్లనివిగా; చేసి; నీడలు=చెట్లనీడలు; తెలుపు చేయగాన్=తెలుపు చేయుటకు; వశముగామిన్=వీలుకాకుండుటచే; పొడము=పుట్టిన; దుఃఖమునన్ బోలెన్=దుఃఖముచే వలె; తుహినబాష్పములు=మంచుబిందువులను కన్నీళ్లను; కురిసెన్. అలం. ఉత్ప్రేక్ష.

తా: వెన్నెల కాయుచుండగా నల్లనివన్నియు తెల్లనైనవి. కాని నీడలు మాత్రము తెల్లనకాలేదు. అందుచే అన్ని వస్తువులను తెల్లనచేయలేక పోతినే యను విచారముతో వెన్నెలకన్నీరు వదలుచున్నదా అన్నట్లు మంచుబిందువులు రాలుచున్నవి.

వ. మఱియు వికసిత కైరవంబు లగు సరోవరంబుల నిజధవళ ధాళధళ్యంబున నాక్రమించి యందు నానందించు నరవిందమందిరకుం బుట్టినింటి సొబగు చూపి, చూపఱకు నిందుబింబం బిది గ్రహంబు లివియను నంతరంబు లేకుండ నేకవర్ణంబు గావించి, సేవించు చకోరకదంబంబుల పుక్కిళ్లకు వెక్కసంబై ముక్కులకు నెక్కి

చిక్కంబడి యొండొండ బొండుమల్లియల దండడిం దోఱఁగు పుప్పొళ్ల నుప్పతిల్లు నెత్తావులకు నెకలులై యూడుమొకరితుమ్మెదలు రొదలుగల మెఱుఁగుఁదుంబురువు లట్లు మిసమిసని మెఱవ పసిమెఱుం గుముత్తెమ్ముల నుమిసియుమిసి, యందంద ప్రవహించు నిండూపల స్యందంబులకు విందు లగునిందీవరమరందంబుల బెండడింబడి బందన గొను వలిమించు క్రొమ్మంచుపాదు లీఁదియాఁది, వడిసడలి సుడి వడుచు నొడలోముసోమరిగాలి యొలవోక సోఁకులంగదలెంగదలవనం గదలు నుపవనకదళీ కేతకీ తాల హింతాల నారికేళ పూగావళీ కోమలపలాశద్రోణికల నునుపుగల పొరలయొరల శరధితరగలమీఁద నుంబోలె గిఱికొని, యెల్లవల్లికలుఁ బూవక పూచిన ట్లుల్లసిల్ల జెల్లు ల్లసిల్లిన చందంబునం దెల్లతెల్లనై, మొల్లమిగ నంతకంతకు దిగం తంబుల దంతంబులు దీరిచినయిడుపులుంబోలెఁ దీండ్రింప శ్రేయొండఁ దానగుటం జేసి యెండమావులం బుట్టించె ననం బట్టుగల పటికంపు రాచట్టు నేలల నెట్టుకొని వెండియుం జిట్టకంబులకుం బెడనొగంబు వెట్టుకొని, పట్టఁబట్టం బోవు ప్రాణభర్తలవెంటం బడి నూపురంబులు మొరయ వేనలులు విరియఁ గ్రీమంబునం బుట్టు నిట్టూర్పుపవనంబు జవంబునంబై కొం గెడలింప నందనికౌఁగిటం బొదవి ప్రియంబు చిలుకం బలికి ముద్దాడు జవరాండ్ర దంత చంద్రికల సాంద్రితం బంతంబు మెఱసి, మంతనంపు వేళల మాటతబ్బిబ్బునం బుట్టు పొలయలుకలం దలలు వంచి రొదలేని నాలియేడ్పు లేడ్చు ప్రియల ననునయింప నింపునం జనవు మెరసి చెక్కుటద్దంబులు నొక్కి మొగం బెగయ నెత్తి ముత్తియంపుముంగఱరంగునఁ గడలుకొని బుడిబుడికన్నీటం బ్రతిఫలించి తుఱంగలించు తనదునిగనిగలు కనుంగొని నగె నగె ననుచుం జుంబనం బిడంబోయి కెంగేల నదరంట వాటువడు కావు కుల వెలవెలపాటుకూటువం గోటికిఁ బడగ లెత్తి, పిండిచల్లినగతిం గాయ డాయ లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకుం దార్చి కాంతులం గవయు నంగనాచు లగునంగనల యంగంబులపస ముంగిటంబడఁ జలితకిసలయాంతరాళంబులం దూఱి దూఱి, యిరులు విరియించి సతుల ప్రార్థనంబులం బుంభావసురతాడంబరంబునకుఁ దోడుసూపి దూపటిలి యంగరాగంబులు గరంగం జెమర్చిన చంచలాక్షుల

నిద్దంపుతనూలతలం బుట్టి దట్టంబు లగుచిఱుచెమటబొట్టులం బొడ
కట్టి తెలుపారు మలయజంపుఁజిటులు గందంబులయందంబు లొసంగి
సంజకడం దాగు నొడివిన సంకేతంబులనుండక తెరువు గట్టి పొరువుఁ
దరువులనీడల నడంగి నవ్వటాలకు వెనుకపాటునఁ గదిసి ముసుంగు
తెడలింప బెగడి కళవళంపుఁజూపుల వల్లభులం జూచి యల్లన నగు
నభిసారికల వెడందకన్నుల చెన్నున నన్నుకొని పొదలు మదనో
న్మాదంబునకుం బ్రోదిగా మోదంబునం గాదంబరి గండూషించి
విట కదంబంబునకు నొసంగు నంబురుహాముఖుల యొప్పులకుప్ప లగు
నిప్పపూమొగ్గలంబోని బుగ్గలం దగ్గలిక సూపు కమ్మపంజులవజ్రపుం
జకచకల నకనకలు వీడుకొని, కలికితనంబునం గలిసి మెలిసి రతాం
తంబునం బరిశ్రాంతి యడంగనంగణంబుల నిలిచి యొండొరుల
కురులు దువ్వుచు విహరించు సమయంబునం బల్లవులు కేళి కల్లప్పు
డన్న తమమాటలు దలపించిన నుదరిపడిమందస్మితంబు లంకురించు
హుంకృతుల కంకించి కంకణంబు రత్నపుఁదళుకులు సెదర నుం
కించినైచు చేమంతి బూబంతులం బుటపుటనై, మిటమిటంగాయు
దట్టంపుపండు వెన్నెలమెండున బెండువడి డెందంబు గంది, తాలిమి
చిందువందై, కెందలిరుపాన్పునం దను వొందక, లేచి కూర్చుండి
కన్నీరు గోటమీటుచు బోటికో వరూధిని యిట్లనియె. 28

టి: మఱియున్; వికసితకైరవంబులగు=వికసించిన కలువలు కల్గిన; సగో
వరంబులన్=సరస్సులను; నిజధవళ=తన తెలుపుయొక్క; ధాళధళ్యంబునన్=కాం
తిచే; ఆక్రమించి; ఆంచున్=ఆకొలనులలో; ఆనందించు+అరవిందమందిరకున్=
సంతోషించెడి లక్ష్మీదేవికి; పుట్టినింటిసొబగు=పుట్టినిల్లైన పాలసముద్రముయొక్క
అందమును; చూపి; చూపఱకున్=చూచెడివారికి; ఇందుబింబంబు+ఇది=ఇది
చంద్రబింబము; గ్రహంబులివి=ఇవి నక్షత్రములు; అనునంతరంబు=అనునట్టి భేదము;
లేకుండన్=లేనట్లు; ఏకవర్ణంబు=ఒకే (తెల్లని) రంగు; కాపించి=చేసి; సేవించు
=వెన్నెల ననుభవించెడి; చకోరకదంబంబుల=వెన్నెలపులుగుల గుంపులయొక్క;
పుక్కిళ్ళకున్=నోళ్ళకు; వెక్కసంబై=ఎక్కువై; ముక్కులకుఁ=ముక్కుల
లోనికి; ఎక్కి=ఎగదన్ని; చిక్కంబడి=చిక్కనై; ఒండొండ=ఒక్కొక్కటే;
బొండుమల్లియలన్=బొండుమల్లెలనుండి; దందడిన్=ఎక్కువగా; తొరఁగుపుప్పొ
ళ్ళన్=రాలెడిపుప్పొళ్ళచే; ఉప్పతిల్లు=గుప్పుమను; నెఱ+తావులకున్=మంచి
సువాసనలకు; వెకలులై=ఆసక్తికల్గినవై; ఆడుమొకరి తుమ్మెదలు=తిరిగాడి రొద
సేయు తుమ్మెదలు; రొదలుగిల=ధ్వనులుచేయు; మెఱుఁగుడుంబురువులట్లు=

మిణుఁగురుపురుగులవలె; మిసమిసని మెఱవన్ = మిసమిసలాడుచు మెరయఁగా; పసిమెఱుంగు మొత్తంబులన్ = నిగ్గైన వెలుఁగు ప్రోగులను; ఉమిసియుమిసి = వెడలఁగ్రక్కి; (మల్లెపువ్వులకై తిరుగాడి తుమ్మెదలపై వెన్నెల పడగానే అవి మిణుగురు పురుగులవలె మెరయుచున్నవి.) అందంద = మిక్కిలి; ప్రవహించు; ఇందు+ఉపల = చంద్రకాంతపురాలయొక్క; స్యందంబులకున్ = నీటియూటలకు; విందులగు = బంధువులైన-పోలియున్న; ఇందీవరమరందంబుల = నల్లకలువలలోని పూదేనెలయొక్క; బెండడిన్ = బురదలో; పడి; బందనగాను = చిక్కనైన; వలిమించు = చలిహెచ్చిన; క్రొత్త+మంచు+జొంగులు = క్రొత్తమంచు కాలువలు; ఈఁదియీఁది = చాలదూరమీది; వడిఁదలి = వేగముతగ్గి; సుడివడుచు = బాధపడుచు; ఒడలు = శరీరమును; ఓఁసు = కాపాడెడి; సోమరిగాలి = మెల్లగా వీచుగాలి యొక్క; అలవోకసోకలన్ = మెల్లగా తాకుటచే; కదలెన్+కదలవు+అనన్ = కదలెనా లేదా అన్నట్లు; కదలు = కదలెడి; ఉపవనకదళీ = ఉద్యానములోని అరటిచెట్ల యొక్క; కేతకీ = మొగలిచెట్లయొక్క; హింతాళ = ఈఁదాళ్ల యొక్క; నారికేళ = కొబ్బరిచెట్లయొక్క; పూగ = పోకచెట్లయొక్క; ఆవళీ = పంక్తులయొక్క; కోమల = మృదువైన; పలాశద్రోణికలన్ = దొన్నెలవంటి ఆకులందు; నునుపుకల = నున్నగానున్న; పొరలయోరలన్ = పొరలఅంచులందు; శరధితరఁగలమీఁద నుంబోలెన్ = సముద్రపు కెరటములమీదవలె; గిఱికొని = ఆవరించి; ఎల్లవల్లికలున్ = తీగెలన్నియును; పూవక = పుష్పింపకయే; పూచినట్లు; ఉల్లసిల్లన్ = ప్రకాశించగా; తెల్లు; ఉల్లసిల్లిన చందంబునన్ = విరియఁగాచినట్లు; తెల్లనై; మొల్లమిగన్ = దట్టనగా; అంతకంతకున్; దిగంతంబులు = దిక్కులకొనలు; దంతంబులన్ = ఏనుగుదంతములచే; తీరిచిన = దిద్దిన; ఇడుపులుంబోలెన్ = ప్రక్క ప్రదేశములువలె; తీండ్రింపన్ = ప్రకాశింపగా; రేయెండ = రాత్రికాయు ఎండ-వెన్నెల; తాన్ = తాను; అగుటంజేసి = అగుటవలన; ఎండమావులన్ = ఎండమావులను; ఘట్టించెననన్ = ఘట్టించెనా అన్నట్లు; పట్టుకల = అవకాశమున్న; పటికంపురాగట్టునేలలన్ = స్ఫటికపురాళ్లచే గట్టిపడిన నేలలందు; నెట్టుకొని = దట్టముగా వ్యాపించి; వెండియున్ = మరియు; చిట్టకంబులకున్ = పరిహాసములకు; పెడమొగంబు పెట్టుకొని; పట్టన్+పట్టన్ = పట్టగా పట్టగా; పోవు = తప్పించుకొనిపోవు; ప్రాణభర్తల వెంటన్+పడి = ప్రియుల వెంటపడి; నూపురంబులు = కాలియందెలు; మొరయన్ = చప్పుడుకాగా; వేనలులు = కొప్పులు; విరియన్ = వీడగా; క్రమంబునన్ = క్రమముగా; పుట్టు = పుట్టెడి; నిడు+ఊర్పు = దీర్ఘమైన శ్వాసలవలని; పవనంబుజవంబునన్ = గాలివేగముచే; పైఁటకొంగు; ఎడలింపన్ = తొలగింపగా; అందనికౌఁగిటన్ = చాలని కౌగిటిలోనికి; పొదివి = లాగికొని పట్టి; ప్రియము = ప్రేమ; చిలుకన్ = హెచ్చునట్లు; పలికి = మాట్లాడి; ముద్దాడు = ముద్దువెట్టుకొను; జవరాండ్ర = యువతులయొక్క; దంతచంద్రికల = దంతములనుండివచ్చు వెన్నెలయొక్క; సాంద్రతన్ = దట్టనతో; పంతంబుమెఱసి = పందెము వేసికొని; మంతనంబువేళలన్ = ఏకాంతముగా నున్నప్పుడు; మాటతబ్బిబ్బునన్ = మాటలపొరపాటుచే; పుట్టు = కల్గిన; పొలయలుకలన్ = ప్రణయకలహములచే; తలలువంచి; రొదలేని = చప్పుడులేని; గాలియేడ్పులు = దొంగయేడుపులు; ఏన్చు

ప్రియులన్ = ఏడ్చెడి భార్యలను; అనునయింపన్ = బతిమాలుటకు, ఇంపునన్ = చనవుతో; చనవు మెరసి = ఎక్కువ పరిచయము చూపి; చెక్కుటద్దంబులు = అద్దములవంటి చెక్కిళ్లను; నొక్కి; మొగంబును; ఎగయనెత్తి = పైకెత్తి; ముత్తియంపు ముంగఱరంగునన్ = ముత్యము గుప్పిన ముక్కెర (ముక్కున పెట్టుకొను ఆభరణము) వలె; కదలుకొను = పెల్లుబికివచ్చు; బుడిబుడికన్నీటన్ = కొద్దికన్నీటియందు; ప్రతిఫలించి = ప్రతిబింబించి; తుఱంగలించు = ప్రకాశించు; తనదునిగనిగలు = తనకాంతులు; కనుంగొని = చూచి; నగినగాన్ = నవ్వేనునవ్వేను; అనుచున్; చుంబనంబిడబోయి = ముద్దు పెట్టుకొనబోయి; కెంపు+కేలన్ = ఎఱ్ఱని చేతితో; అదరంటన్ = చురుకుమనునట్లు నాటువడు = దెబ్బపడెడి; కాముకుల = కామాసక్తులైన పురుషులయొక్క; వెలవెలపాటుకూటువన్ = వెలవెలపోవుటకలియుటచే; కోటికింబడగలెత్తి = ఎక్కువగానుండి; పిండిచల్లినగతిన్ = తెల్లని పిండి చల్లినట్లు; కాయన్ = వెన్నెలకాయగా; డాయన్ = దగ్గరకు చేరుటకు; లజ్జించి = సిగ్గుపడి; బుజ్జవంబునన్ = ఉపలాలనచే; పొదరిండ్లకున్ = ఇండ్లుగానున్న పొదలకు; తార్చి = చేర్చి. కాంతులన్ = ప్రియులను; కలియు = కలియునట్టి; నంగనాచులగు = నేర్పుకల; అంగనలయంగంబులపస = స్త్రీలయవయవములవన్నె; ముంగింటంపడన్ = బయల్పడునట్లు; చలిత = కదలెడి; కిసలయ = అంతరాళంబులన్ = చిగుపలసందులలో; తూటిదూటి = చొచ్చి; ఇరులు — చీకటిని; విరియించి = తొలగించి; పతులప్రార్థనంబులన్ = ప్రియులప్రార్థనలచే; పుంభావసురత+ఆడంబరంబునన్ = ఉపరతితొందరయందు; తోడు+చూపన్ = సహాయమును కనుపర్చగా; సూపటిలి = శ్రమించి; అంగరాగంబులు = గంధపుబూతలు; కరంగన్ = కరుగునట్లు; చెమర్చిన = చెమటపట్టిన; చంచలాక్షుల = స్త్రీలయొక్క; నిద్దంపుతనూలతన్ = నిగనిగమెరయు శరీరమందు; పుట్టి; దట్టంబులగు; చిఱుచెమటబొట్టులన్ = చిన్నచెమటబొట్లయందు; పొడకట్టి = కనపడి; తెలుపాఱు = తెలుపెక్కిన; మలయజంపు = ఆచందనముయొక్క; చిటులుగందంబుల = బీటలుతీసిన గంధపుబూతలయొక్క; అందంబులు = ఆచక్కదనములను; ఒసంగి = ఇచ్చి; (కామినుల చిరుచెమట బొట్లలో ప్రతిబింబించిన వెన్నెల చిట్లిన గంధపుబూతవలె నున్నది) సంజకడన్ = సంధ్యవేళ; తారు = తాము; నొడివినసంకేతంబులన్ = చెప్పిన చోటులంగు; ఉండక; తెరువుగట్టి = దారికాచి; పొరువుందరువులనీడలన్ = త్రోవప్రక్కనున్న చెట్లనీడలందు; అడంగి = దాగి; నవ్వుటాలకున్ = ఎగతాళికి; వెనుకపాడునన్ = వెనుకనుండి; కదిసి = దగ్గరకువచ్చి; ముసుంగులు = (తెలియకుండుటకై వేసికొనిన) ముసుగులను; ఎడలింపన్ = తీయగా; బెగడి = భయపడి; కళవళంపుంజూపులన్ = బెదరు చూపులతో; వల్లభులన్ = ప్రియులను; చూచి; అల్లనన్ = మెల్లగా; నగు = నవ్వెడి; అభిసారికల = సంకేతమున కేగి ప్రియులను కలియు స్త్రీలయొక్క; వెడందకన్నుల చెన్నులన్ = విశాలమైన నేత్రముల యందముచే; అన్నుకొని = అతిశయించి; పొదలు = పెరిగెడి; మదన+ఉన్మాదంబునకున్ = పొగరువలనిపిచ్చికి; ప్రోదిగా = పోషణగా; మోదంబునన్ = సంతోషముతో; కాదంబరి = మద్యమును; గండూషించి = పుక్కిలించి; విటకదంబంబునకున్ = విటులసముదాయమునకు; ఒసంగు = ఇచ్చెడి; అంబురుహముఖుల = స్త్రీలయొక్క; ఒప్పులకుప్పలగు = అందాలరాసులగు; ఇప్పపూమొగ్గలుంబోని = ఇప్పమొగ్గలవంటి; బుగ్గలందున్ = చెక్కిళ్లయందు; అగ్గలిక

నూపు=ఎక్కువగనపరచెడి; కమ్మపంజుల=చెవులకమ్మలందలి; వజ్రపుంజకచకల=వజ్రాలకాంతులచే; నకనకలు=చిక్కుటను; వీడుకొని=వదలి; కలికితనంబులన్=నేర్పుచే; కలిసిమెలసి=కూడికొని; రతాంతంబునన్=సంభోగించినపిదప, పరిశ్రాంతి=అలసట; ఆడంగన్=పోవుటకై; అంగణంబులన్=ముంగిళ్లయందు; నిలిచి; ఒండొరులకురులు=ఒకరిజుట్టు మరొకరు; దువ్వుచున్; విహరించు సమయంబునన్; పల్లవులు=విటులు; కేళికిన్=ఉపరతికి; అల్లప్పుడు=ఆటవేళ; అన్నతమమాటలు=పల్కినతమ మాటలను; తలపించినన్=జ్ఞాపకముచేయగా; ఉదరిపడి=ఉలికిపడి; మందస్మితంబులు=చిఱునవ్వులు; అంకురించుహుంకృతులన్=పుట్టెడి ఝుంకారము (అదలింపు) లతో; జంకించి=కసరి; కంకణంబుల=చేతుల గాజులయొక్క; రత్నంపు దళుకులు=రత్నాలకాంతులు; చెదరన్=వ్యాపించగా; ఉంకించి=పూని; వైచు=విసరెడి; చేమంతిపూబంతులన్ = చేమంతిపూలబంతులచే; పుటపుటనై=బలిసి; మిటమిటన్+కాయుదట్టంపు బండువెన్నెలమెండునన్=మిటమిటమనికాసెడి పండు వెన్నెలచే; జెండువడి=తెల్లపోయి; డెందంబు = మనస్సు; కంది=బాధపడి; తాల్మి=ఓర్పు; చింగువండై=చలించి; కెంపు+తలిరుపాన్పునన్ = ఎర్రని పూల పక్కపై; తనువు=శరీరము; ఒందక=అనువుపడక; లేచి = పక్కనుండిలేచి; కూర్చుండి; కన్నీరు=కన్నీటిని; గోటన్=గోటితో; మీటుచున్=పై కెగజిమ్ముచు; బోటితోన్=చెలికత్తెతో-వరూధిని; ఇట్లనియెన్.

ఇందు వెన్నెలయొక్క ప్రాభవము, అప్పుడు జరిగెడి పనులలో కామినీ కాముకులకు జరిగెడి సయ్యాటముల రీతులు వర్ణింపబడినవి; ఆవెన్నెలకు వరూధినికి తాపము హెచ్చినది. పూలపాన్పుపైకూడ పరుండలేక లేచి చెలికత్తెతో నిట్లన్నది.

ఉ. నోములు నోచినమ్మలు మ ♦ నోరథముల్ దయివాఱ నిత్తఱిం
తామరతంపరై ప్రియులఁ ♦ దారు విహారము సల్ప వీరిలో
నీమెయి దుఃఖశీల నగు ♦ నే వసియింపఁ దరంబె? పోద మా
రామము జూడ నందు సుక ♦ రంబగు సర్వము నంబుజాననా. 29

టీ: అంబుజ+ఆననా=పద్మమువంటి ముఖము కలదానా! ఈ+తఱిన్=ఈసమయమందు; నోములునోచినమ్మలు=పూర్వజన్మమున మంచి వ్రతము లాచరించిన స్త్రీలు; మనోరథముల్=కోరికలు; దయివాఱన్=లోటులేకుండ నెరవేరునట్లు; (పా. తనివారన్=తనివితీరునట్లు;) తామరతంపరై=పెచ్చుపెరిగి; ప్రియులన్=ప్రాణనాయకులను; తారున్=తామును; విహారముసల్పగా=విహరింపగా; వీరిలోన్=అట్లువిహరించెడి స్త్రీలలో; ఈమెయిన్=ఈరీతిగా; దుఃఖశీలనగు=దుఃఖముకలదాననైన; నేన్; వసియింపన్ = ఉండుటకు; తరంబె=శక్యమా? ఆరామమున్=ఉద్యానమును; చూడన్ = చూచుటకు; పోదము = వెళ్లుదము; అందున్; సర్వము=అంతయును; సుకరంబగున్=తేలికయగును.

తా: ఓచెలీ! భాగ్యవంతులగు స్త్రీలు ప్రియులతో కలిసి యథేచ్ఛముగా విహరించు చుండగా వారిలో నేనెట్లు నిలువగలనే? ఉద్యానవనమునకు పోయిన అక్కడనే హాయిగా నుందునేమో?' అన్నది. అలం. కావ్యలింగము.

క. అని పలికి పాన్పు డిగి కా
మిని చంద్రాతపము వేడి ♦ మికిఁ బైఁట చెఱం
గున ముసుఁగిడి నిజకేళీ
వనిఁ జొచ్చి వియోగవహ్ని ♦ వడఁబడి తెగువన్. 30

టీ: అనిపలికి; పాన్పుడిగి=పక్కనుండిదిగి; కామిని=వరూధిని; చంద్ర+ఆతపము వేడికిన్=వెన్నెల వేడికి; పైఁటచెఱంగునన్=పైటతో; ముసుఁగిడి=కప్పుకొని; నిజకేళీవనిన్=తనవిహారోద్యానమును; చొచ్చి=ప్రవేశించి; వియోగవహ్నిన్=విరహాగ్ని చే; వడఁబడి=ఎక్కువ తాపముచెంది; తెగువన్=చొరవతో. (ముందున కన్వయము)

సీ. చనుఁగప్పు దొలఁగ వా ♦ సనగాలి కెదు రేఁగుఁ
బరువొప్పు నలుఁగులఁ ♦ బాఱుకరణి
నిడుద వేసలి నూనె ♦ ముడివీడఁ జిగురాకుఁ
బొదఁ జూఱఁ గార్చిచ్చుఁ ♦ గదియుకరణిఁ
బసిడిగాజులు పైకి ♦ వెసఁ ద్రోచి నునుఁదీఁగ
దెమలించు నురితాడు ♦ నెమకుకరణి
మొలనూలు బిగియించి ♦ వెలఁది వెన్నెలఁ జొచ్చుఁ
బిఱుదీయ కేటిలో ♦ నుఱుకుకరణి

గీ. జడియ దళులకుఁ గురియు పు ♦ ప్పొదుల ముసుఁగు
మావికడ నిల్చి వికలనె ♦ త్రావిఁ గ్రోలు
విషమసాయకు నేపుల ♦ విసివి విసివి
తనువుఁ దొఱఁగంగఁ దలఁచి య ♦ వ్వనరుహాక్షి. 31

టీ: అవనరుహ+అక్షి=అవరూధిని; విషమసాయకు నేపులన్ = మన్మథుని దెబ్బలచే; విసివి విసివి=తెగిసిసిగి; తనువున్=శరీరమును; తొఱఁగంగన్=విడుచుటకు; తలంచి; పరువు+ఒప్పున్=పసగుణతో; అలుఁగులన్=బాణములలోనికి; పాఱుకరణిన్=పరుగెత్తునట్లు; చనుఁగిప్పు=పైట; తొలఁగన్=జారగా; వాసనగాలికిన్=సువాసనవేయు చల్లగాలికి; ఎదురేఁగున్=ఎదురుగా వెళ్లును; కార్చిచ్చున్=దావాగ్నిలో; కదియుకరణిన్=ప్రవేశించురీతిని; నిడుద = నిడుపైన; వేసలి=కొప్పుయొక్క; నూనెముడి=జారుముడి; వీడన్=ఊడగా; చిగురాకుఁబొదన్=చిగురుటాకులున్న పొదలోనికి; జూఱున్=దూరును; ఉరిత్రాడు; నెమకు

కరణిన్ = వెదకునట్లు; పసిడిగాజులు = బంగారు గాజులను; పైకిన్; వెసన్ + త్రోసి = తొందరగా త్రోసి; నునుఁదీఁగెన్ = నున్నని తీగను; తెమలించున్ = కదలించును; ఏటిలోన్ = ఏటిలోనికి; ఉఱుకుకరణిన్ = ఉరుకునట్లు; పిరుదీయక = వెనుదీయక; మొలనూలు = మొలత్రాడు; బిగియించి; వెలఁదివెన్నెలన్ = తెల్లనివెన్నెలలోనికి; చొచ్చున్ = చొరబడును; అళులకున్ = తుమ్మెదలకు; జడియదు; కురియుపుప్పొడులన్ = మీదికి రాలెడి పూపరాగములలో; మునుఁగున్; మావికడన్ = మామిడివద్ద; నిల్చున్ = నిలుచును; విరులకెత్తావిన్ = పువ్వులసువాసనను; క్రోలున్ = ఆఘ్రాణించును. (ఇందు చెప్పబడిన చల్లగాలి మున్నగునవి విరహులకు బాధాకరములు. అయినను వరూధిని ప్రాణములు వీడదలచి వాటినన్నిటి నెదుర్కొనుచున్నది. కాని లాభము లేక పోయెను.)

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ
బట్టి సఖీజనము వెడఁగుఁ ♦ బట్టీ తగవే?
యిట్టితెగు వనుచుఁ జెక్కులఁ
దొట్టినకన్నీరు వోవఁ ♦ దుడుచుచుఁ బలికెన్. 32

టీ: అట్టియెడన్ = అప్పుడు; ఆ + మృగ + ఈక్షణన్ = లేడికన్నులవంటి కన్నులకల ఆవరూధినిని; సఖీజనము = చెలికత్తెలు; పట్టి; వెడఁగుఁబట్టీ = వెఱ్ఱిపిల్లా! ఇట్టితెగువ = ఇటువంటి సాహసము; తగవే = న్యాయమా? అనుచున్ = అనిబుజ్జగించి; చెక్కులన్ = చెక్కిళ్లయందు; తొట్టినకన్నీరు = కారిన కన్నీటిని; పోవన్ = పోవునట్లు; తుడుచుచున్ = ఒత్తుచు; పలికెన్ = పలికిరి.

ఉ. ప్రాఁతపసిండివంటి వల ♦ పుం బచరించు కులంబు నీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు ♦ లేమ సురాంగన లెల్ల నిట్టి నీ
చేఁతకు మెత్తురమ్మ దయ ♦ సేయక తిన్నని మేను వెన్నెలన్
వేఁతు రఁటమ్మ యింత కను♦వేఁదుఱు సెల్లునఁటమ్మయింతికిన్. 33

టీ: లేమ = వరూధినీ; ప్రాఁతపసిండివంటి వలపున్ = పైపూత ప్రాచిన బంగారమువలె నుండు మోహమును; పచరించు = కనపరచు; కులంబునీతికిన్ = జాతిధర్మమునకు; ఇత్తెఱఁగు = ఈరీతి (నిజమైన ప్రేమతో పరితపించుట) లేఁతకదమ్మ = చులుకనకాదా? ఇట్టినీచేఁతకున్ = ఈపనికి; సురాంగనలెల్లన్ = దేవతాస్త్రీలందరు; మెత్తురమ్మ = మెచ్చుకొందురా? దయసేయక = (శరీరముపై) శ్రద్ధచూపక; తిన్నని మేను = అందమైన దేహమును; వెన్నెలన్ = వెన్నెలయందు; వేఁతురటమ్మ = వేయించవచ్చునా? ఇంతకనువేఁదుఱు = ఇంతచూచుటతో వచ్చినఆశ; చెల్లునటమ్మ = తగునా?

తా: భోగమునాటి లేని మోహమును చూపి వలపించ వలెనే కాని ఇట్లు నిజముగా ఒకడు దొరకనందుకు తపించవచ్చునా? నీనడత విన్నచో తోడివారు నవ్వరా? చక్కని శరీరమును దయమాలి వెన్నెలలో వేసి వేపుదువా? చూచినంతమాత్రాన అంత భ్రమయా? అప్సరసవై యుండి మానవునికై యింతగా తపించుట తగదు.

చ. ఉడుపతిబారికిన్ వెఱచి ♦ యూరట యౌనని పేరటామనిన్
ముడివడుకంతుసేనలకు ♦ ముయ్యెల గుట్టయినట్టి యిందు రా
నడఁగునె తాపవహ్ని మన ♦ మైె హరిణేక్షణ ముల్లు వుచ్చి కో
ల్లుడచిన చంద మయ్యెఁ బద ♦ మా యెలదోఁటఁ జరింప కింటికిన్.

టీ: హరిణ+ఈక్షణ=వరూధినీ! ఉడుపతిబారికిన్ = చంద్రుని బాధకు; వెఱచి=భయపడి; ఊఱటయౌను=ఊరడించుటయగును; అని=అనుకొని, పేరు+ఆమనిన్=ఎక్కువగానున్న వసంతకాలముతో; ముడివడు=మిడిసిపడు; కంతు సేనలకున్ = మన్మథుని సేనలకు-చిలుకలు, కోయిలలు, వెన్నెల మున్నగువానికి; ముయ్యెలగుట్ట=కలిసియుండుచోటు; అయినట్టియిందున్ = అయిన యీతోటకు; రాన్=వచ్చినచో; తాపవహ్ని=విరహము వలని తాపమునునిప్పు; అడఁగునె= తగ్గునా? (ఇప్పుడు మన మిచ్చటికి వచ్చుట) మనమై=మనంతట మనము; ముల్లు+ పుచ్చి=గ్రుచ్చుకొన్న ముల్లునూడదీసి; కొల్లు=ఇనుపమేకును; అడిచినచందము= దిగగొట్టిన రీతి; అయ్యెన్; ఎలదోఁటన్=ఈశేఁవోటలో; చరింపక=విహరింపక; ఇంటికిన్; పదమా=పొమ్ము.

తా: కాలిలో గ్రుచ్చుకొన్న ముల్లుతీసి, అక్కడ ఇనుపమేకును దిగగొట్టి నట్లుగా, ఇంటిలో ఉన్నచో బాధగా నున్నదని మన్మథబాధ సహింపలేక, నిండు వసంతకాలమగుట వలన మన్మథసేన అంతయు ప్రోగైయున్న యిక్కడికి వచ్చినం దున బాధయెక్కువ యగునే కాని తగ్గదు.

క. అని యొడఁబడఁ బల్కుచుఁ దో
డ్కొనివచ్చినఁ బొన్పుఁ జేరి ♦ గురుకుచ దనపైఁ
గనకనఁ గనలెడు వెలుఁగులఁ
గనికరమఱి మండుచంద్రుఁ ♦ గని కర మలుకన్. 35

టీ: అని=ఇట్లు; ఒడఁబడన్=ఒప్పుకొనునట్లు; పల్కుచున్; తోడ్కొని వచ్చినన్=తీసికొనిరాగా; గురుకుచ=గబ్బిగుబ్బలుకల వరూధిని; తనపైన్; కన కనన్=కణకణలాడుచు; కనలెడువెలుఁగులన్=మండెడి కిరణములతో; కనికరము +అఱి=దయమాలి; మండుచంద్రున్=వెలిగెడి చంద్రుని; కని=చూచి; మిక్కిలి; అలుకన్=కోపముతో; (ఇట్లనెను)

క. ఓ చెల్ల విరహిణీవధ
మేచతురత నీకు దురిత ♦ మే చేయుపనుల్
రాచటికపుఁగలమే య
య్యో చంద్రా! వివేక మెఱుఁగ వాకో ♦ గురుసేవన్. 36

టీ: ఓచెల్ల=అయ్యో! చంద్రా=చంద్రుడా! నీకున్; విరహిణీవధము= విరహముకల స్త్రీలను హింసించుట; ఏచతురత=ఏమినేర్పు? దురితమే=పాపమునే;

చేయుపనుల్ = కల్గించు పనులు; రాచఱికపుఫలమే = రాజవగుటకు ఫలమా? గురుసేవన్ = గురువును సేవించుటవలన; వివేకము = మంచిచెడ్డల నెఱుగుటను; ఎఱుఁగవో = తెలియవా?

తా: చంద్రునకు రాజని పేరున్నది. అందుచే ఆతడు రాచరికము చేయుచున్నాడని చెప్పినాడు. ఓచంద్రా! విరహిణులను బాధించుట నేర్పా? పాప మాచరించుటయే రాచరికమున్నందుకు ఫలమా? గురువును సేవించి మంచి చెడ్డల నెఱుగలేక పోతివా?

సీ. తొలుదొల్తఁ గమలమి ♦ త్రునివంక రూపొట
దక్షాధ్వరధ్వంసి ♦ తన్ను గనుటఁ
బరివేషమిషమున ♦ బాశంబుఁ దాల్చుటఁ
గప్పు దేహమునందుఁ ♦ గానఁబడుటఁ
గాలవశంబునఁ ♦ గాని తోఁపకయుంట
సతతనిష్ఠురగదా ♦ న్వితతఁ గనుటఁ
గాని పాండుక్షేత్రి ♦ మునఁ బ్రవర్తించుటఁ
బ్రకటానురాగతా ♦ రకుఁడగుటను

గీ. నంతరం బెద్ది యాత్మలో ♦ నరసి చూడ
రాజ నీకును నల ధర్మ ♦ రాజునకును
బ్రాణిలోకంబు బాధలఁ ♦ బఱచునపుడు
ధర్మపద మొక్కఁ డెక్కుడా ♦ ధన్యునందు. 37

టీ: తొలుదొల్తన్ = మొట్టమొదట; కమలమిత్రునివంకన్ = సూర్యునివలన; రూపొటన్ = జన్మముకల్గుటచేతను; (ఇందు చంద్ర యమధర్మరాజులకు పోలిక చెప్పబడినది. అందుచే ఇందు రెండర్థము లుండును.) యముడు సూర్యుని కొడుకు, చంద్రునికి సూర్యకిరణ ప్రసారము వలననే ఆకారము-కాంతి కల్గును. దక్ష+అధ్వరధ్వంసి = వీరభద్రుని (శివుని) యొక్క; తన్ను = తాపును; కనుట = పొందుట. శివుడు మార్కండేయ రక్షణకై యముని తన్నినాడు; వీరభద్రుడు దక్షయజ్ఞమున చంద్రుని తన్నినాడు. పరివేషమిషమునన్ = గుడికట్టుటయను వంకతో; పాశంబున్ = (యముని చేతిలోనుండు) పాశమును; తాల్చుటన్ = ధరించుటచేతను; దేహమునందున్ = శరీరమునందు; కప్పు = నలుపురంగు-యముడు నల్లగా నుండును. చంద్రునిలో నల్లని మచ్చయున్నది. కానబడుటన్ = కన్పడుటచేతను; కాలవశంబునగాని = కాలము వచ్చినపుడేకాని; తోఁపకయుంట = కనపడకుండుట; యముడు కాలమునిండినపుడే కన్పించును; చంద్రుడు రాత్రి వేళనే కన్పించును. సతత = ఎల్లపుడును; నిష్ఠుర =

కఠినమైన-బాధాకరమైన; గదా+అన్వితత=గదతోకూడియుండుటను; గద+అన్వితత=రోగముతో-క్షయతో, కూడియుండుటను; కనుట=పొందుట; పూని=ప్రయత్నించి; పాండుక్షేత్రమునన్=తెల్లనిశరీరముతో (చం). పాండురాజుభార్యయందు (య); ప్రవర్తించుటన్=మెలగుటచే; సంభోగించుటచే; ప్రకట=స్పష్టమైన; అనురాగ=అనురాగముకల; ఎఱ్ఱదనముకల; తారకుడు=నక్షత్రములు కలవాడు (చం); కంటిగ్రుడ్లు కలవాడు (య); అగుటన్=అగుటచేతను; ఆత్మలోన్=మనస్సులో; అరసిచూడన్=ఆలోచించిచూడగా; రాజ=రాజనామముకలచంద్రుడా! నీకునున్; అలధర్మరాజునకును; ప్రాణిలోకంబున్ = జీవులను; బాధలఁబఱచునపుడు=బాధించుటలో; అంతరంబు=భేదము; ఎద్ది=ఏది? అధన్యునందున్ = ఆయమునిలో; ధర్మపదము='ధర్మ' అనుపదము మాత్రము; ఎక్కుడు=ఎక్కువ. (చంద్రా! నీవును, యముడును ప్రాణులను బాధించుటలో సములే. కాని ఆతడు ధర్మప్రభువు కనుక ధర్మరాజు; నీ వధర్ముడవు కాన 'రాజవు' మాత్రమే. అదే మీయిద్దరికిని భేదము. అనగా నీకన్న యముడే మెరుగు అని.)

చ. ఒకపెనుఁబాఁపఱేఁడు చల ♦ మొప్ప రసాతలసీమకుం జకో
రకములు భూతధాత్రికి సు ♦ రల్ దివికిం బగ దీఱునట్లుగా
మెకమెకపాటుతోడ నిను ♦ మ్రింగక పో రెపుడుం ద్రిలోక కం
టకుఁడవు గాన నీయొడలు ♦ నజ్జుగఁ జేసి కురంగలాంఛనా! 38

టీ: కురంగలాంఛనా=లేడిచిహ్నముగా కలవాడా! త్రిలోకకంటకుడవు=ముల్లోకములకును శత్రుడవు; కానన్; చలము = మత్సరము; ఒప్పన్; ఒప్పునట్లు; రసాతలసీమకున్=పాతాళదేశమునకు; ఒక పెనుఁబాము+ఱేఁడు=ఒక పెద్ద సర్పరాజు-రాహువును; భూతధాత్రికిన్=భూలోకమునకు; చకోరకములు=చకోరపక్షులును, దివికిన్=స్వర్గమునకు; సురలు=దేవతలును; పగదీఱునట్లుగన్ =కసితీరునట్లు; మెకమెకపాటుతోడన్ =అహంకారముతో; నీయొడలు = నీశరీరమును; నజ్జుగన్+చేసి=ముక్కలుగాచేసి; నినుమ్రింగకపోరు=నిన్నుమ్రింగకమానరు.

తా: నీవు మూడులోకములకును బాధకుడవు కావున నిన్ను పాతాళమున రాహువును, భూమిలో చకోరపక్షులును, స్వర్గమున దేవతలును ముక్కముక్కలుగా జేసి మ్రింగుచున్నారు. కళలుగా తినుటయను ప్రసిద్ధినిబట్టి చెప్పబడినది. అలం. ఉత్ప్రేక్ష.

క. వాతాపివలన నెఱిఁగితొ
శీతకిరణ కడుపుఁ జొచ్చి ♦ జీర్ణింపని యీ
రీతి నినుఁ దనియ నాయువు
చేత సురల్ చెడరుగాక ♦ చెఱుపరె వారిన్. 39

టీ: శీతకిరణ=చల్లని కిరణములు కలవాడా! కడుపుఁజొచ్చి=కడుపులోనికి ప్రవేశించి; జీర్ణింపని యీరీతిన్=జీర్ణింపకయుండు నీపద్ధతిని; వాతాపివలనన్=

వాతాపియను రాక్షసునినుండి; ఎఱింగితో = తెలిసికొంటివా? సురల్ = దేవతలు; నిన్నుతినియున్ = నిన్నుతినికూడ; ఆయువుచేతన్ = ఆయు వుండుటచే; చెడరుగాక = నశింపరుగాని; వారిన్ = ఆదేవతలనుగూడ; చెఱుపవె = నశింపజేయకుందువా?

తా: వాతాపియను రాక్షసుడు అన్నముతో పాటు కడుపులోనికేగి మరల బ్రతుకువాడు. ఇల్వలుడను-వాతాపి తమ్ముడు మునులకు విందుచేయగా వాతాపి వారి కడుపులోనికేగి, అక్కడ స్వరూపమును ధరించి కడుపు-చీల్చి బయటికి వచ్చువాడు. ఓచంద్రా! నీవు వాతాపి వలన ఆ నేర్పు నేర్చియుందువు, లేకున్నచో దేవతలాహారముగా నిన్ను భుజించినను మరల జీవింతువా? ఆదేవతల కాయువు గట్టిగానున్నందున వారు బ్రతుకుచున్నారు. కాని లేకున్న వారినికూడ చంపుదువు.

తే. త్రిపురసంహార మొనరించు ♦ నప్పుడు హరుఁడు
బండికల్లుగ నీమేను ♦ గండి చేసె
నదియు సెలవాఱి తెగటాఱ ♦ నైతి చంద్ర
యకట రోహిణియెడ నప ♦ థ్యమునఁ జేసి. 40

టీ: చంద్ర = చంద్రుడా! హరుడు = శివుడు; త్రిపురసంహారము = పట్టణముల యాకారములో నున్న ముగ్గురు రాక్షసులను చంపుటను; ఒనరించునపుడు = చేయునప్పుడును; బండికల్లుగన్ = రథచక్రముగా (నుండుటకై); నీమేను = నీశరీరమును, గండి = తొలను; చేసెన్; అదియు = అదికూడ; సెల+పాఱి = సెలలుపడి-గాయము తగ్గక చీముపట్టి; రోహిణియెడన్ = రోహిణితోడి; అపథ్యమునఁజేసి = అపథ్యమైన సంభోగముచే; తెగటాఱవైతి = చావకుంటివి; అకట = అయ్యో!

తా: త్రిపురాసురుల సంహరించినపుడు రుద్రుడు తనరథమునకు నిన్ను చక్రముగాచేసి, అందుకు వీలుగాతొల పొడిచెను. ఆతొల గాయమై, సెలలువేసి, అపథ్య దోషముచేతనైన చావవైతివి. (రోగము వచ్చినవారికి సంభోగము అపథ్యము)

తే. పాలఁ బుట్టినమాత్రాన ♦ మేలిగుణము
నేఁడు నీ కేలఁ గల్గునో ♦ నీరజారి
నీటఁ బుట్టినవాడు గాఁ ♦ డోటు వహ్ని
గాల్చుచున్నాఁడు జగ మెల్లఁ ♦ గరుణలేక. 41

టీ: ఓనీరజారి = పద్మములకు శత్రువవైన చంద్రా! పాలన్ = పాల (సముద్రము) లో; పుట్టినమాత్రానన్ = పుట్టినంతలో; నీకున్; నేఁడు = ఈవేళ; మేలిగుణము = మంచిగుణము; ఏలకల్గున్ = ఎట్లుకల్గును? వహ్ని = నిప్పు; నీటన్ = నీటిలో; పుట్టినవాడు; కాడోటు = కాడా? కరుణలేక, జగమెల్లన్ = లోకమునంతను; కాల్చుచున్నాడు.

తా: నీటిలో పుట్టిననిప్పు లోకముల దహించుచున్నది. మంచిగుణము సహజముగా నుండవలెను కాని పుట్టిన చోటునుబట్టి రాదు. నీవు పాలలో పుట్టితివి. అయిన

నేమి? ఘట్టకత్తో జేని మంచిగుణ మీనాడా నీకెట్లు వచ్చెను? అలం. ప్రతివస్తూపమ.

క. గోవధము సేయుతురకల
దైవంబవు నీవు మొదలఁ ♦ దక్కక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె
నీవర్తన మేమి చెప్ప ♦ నీరజవైరీ. 42

టీ: నీరజవైరీ=పద్మములకు శత్రువవైనవాడా! నీవు; మొదలన్=మొదటనే; గోవధముచేయు=గోవులచంపెడి; తురకల దైవంబవు = తురకల కుపాస్యదేవతవు; తక్కక=జంకక; పాంథస్త్రీవధము—బాటసారుల (పరదేశము వెళ్లినవారి) భార్యలను హింసించుటను; చేయరోయుదె=చేయుటకు వెనుకాడెదవా? నీవర్తనము=ఇట్టి నీనడతనుగూర్చి; ఏమిచెప్పన్=చెప్పలేను;

తా: ఓచంద్రా! నీవసలే తురకల కిష్టదైవమవు. వారు గోవధచేయుటకు వెనుకాడని వారు. వారికి దేవుడవగు నీవు స్త్రీవధ చేయుటకు జంకెదవా? అలం. కావ్యార్థాపత్తి.

క. విడువక తలపయిఁ గొన్నా
ళ్లిడి చూచి కళంకి వగుట ♦ యెఱిఁగి మహేశుం
డుడుకుచు దక్షాధ్వరమున
నడుగునఁ బడవైచె దాన ♦ నడఁగవు చంద్రా! 43

టీ: చంద్రా! (నిన్ను) మహేశుండు=శివుడు; ఉడుగక=మానక; తలపయిన్=నెత్తిమీఁద, కొన్నాళ్లు; ఇడి=పెట్టుకొని; చూచి=నీనడత గమనించి; కళంకివగుట = మచ్చకలవాడవగుటను (దోషివని) ఎఱిఁగి=తెలిసికొని; ఉడుకుచున్=కోపముచే పరితపించి; దక్ష+అధ్వరమునన్=దక్షుని యజ్ఞములో; అడుగునన్=కాలిక్రింద; పడవైచెన్=పడవేసి త్రొక్కెను; దానన్=దానివలనకూడ; అడఁగవు=అణగిపోవు.

తా: శివుడు నిన్నలంకారముగా కొన్నాళ్లు నెత్తినెక్కించుకొని, నీదోషమెరిగి నిన్ను దక్షుని యజ్ఞములో కాలిక్రిందవేసి మట్టించినాడు. అట్లయినను బ్రతికితివి. అలం. విశేషోక్తి.

క. గాండీవము నీచేతిది
పాండవునిం జేర బట్టి ♦ బ్రతికితి మావి
ల్లుండిన నేఁడు నిశాచర!
చెండవె యల్లునికిఁ దోడు ♦ శితభల్లమునన్. 44

టీ: నిశాచర=రాత్రి వేళ తిరుగాడినవాడా! (రాక్షసుడా!) నీచేతిది=నీచేతిలో నుండెడి; గాండీవము=గాండీవమను విల్లు; పాండవునిన్=పాండురాజు కొడుకైన అర్జునుని; చేఁబట్టి=చేపుటవలననేమో; బ్రతికితిమి. ఆవిల్లు; ఉండినన్=ఉన్నచో; నేఁడు=ఈవేళ; అల్లునికి=మేనల్లుడైన మన్మథునికి; తోడు=సాయముగా; శిత భల్లములన్=వాడియగు బాణములచే; ఖండింపవె=ఖండింపవా?

తా: రాత్రి తిరుగువాడా! తొలుతలో నీచేతిలో నుండెడి గాండీవమా అర్జునుని చేతికి వెళ్లినది కనుక బ్రతికితిమి కాని లేకున్నచో నీవు నీయల్లుడైన మన్మథునికి తోడు కాకుందువా? అలం. ఉత్ప్రేక్ష.

వ. అనిపలికి యక్కలికి తేనియ లొలుకు పూములుకుల జళుకుఁ బుట్టించు నించువిలుతు నుద్దేశించి. 45

టీ: అనిపలికి; ఆ+కలికి=ఆవరూధిని; తేనియలొలుకు=తేనెను వర్షించెడి; పూములుకులన్=పూవుబాణములతో; జళుకు పుట్టించు=జడిపించెడి; ఇంచువిలుతున్=చెఱకువిల్లుగాగల మన్మథుని; ఉద్దేశించి=గురించి; (ముంగున కన్వయము.)

చ. తొడిఁబడఁ బాఱి పైకుఱికి ♦ ధూర్జటికంటికడిందిమంటలో
నడఁపొడ గానరాక తెగ ♦ టాఱియుఁ గాలినయట్టి మ్రోడు కై
వడి రతిలోచనాంబువుల ♦ వాన చిగిర్చితె పాంథబాధకై
మడియక నంగ యవ్వెలఁది ♦ మంగళసూత్రమహత్త్వమెట్టిదో. 46

టీ: అనంగ=శరీరము లేని మన్మథుడా! తొడిఁబడన్=తొందరతో; పాఱి=పరుగెత్తి; పైకిన్=(శివుని) మీదికి; ఉఱికి=ఉఱికి; ధూర్జటి=శివునియొక్క; కంటి=కంటివలని; కడిందిమంటలోన్=పెద్దమంటలలో; అడఁపొడ గానరాక=జాడ తెలియకుండునట్లు; తెగటాఱియున్=నశించికూడ; కాలినయట్టిమ్రోడుకైవడిన్=కాలిన మొద్దువలె; మడియక=చావక; రతి=రతీదేవియొక్క; లోచన=కన్నులనుండి వచ్చు; అంబువులవానన్=నీరనువానచే; పాంథబాధకై=ప్రవాసులను బాధించుటకై; చిగిర్చితె=చిగిర్చితివా? (బ్రతికితివా) ఆ+వెలఁది = ఆరతీదేవియొక్క; మంగళసూత్రమహత్త్వము=మంగళసూత్రమహిమ; ఎట్టిదో=ఎంతగట్టిదో?

తా: శివునకు పార్వతిపై ప్రేమపుట్టించుటకై మన్మథుడు వెళ్లి బాణము వేయగా తపోభంగమునకు కోపించి శివుడు తన కంటిమంటతో మన్మథుని బూడిద చేసెను. అప్పుడు రతీదేవి యేడ్వగా దేవతలు మన్మథుని బ్రతుకునట్లు చేసిరి. దానిని పురస్కరించుకొని వరూధిని మన్మథుని దూషించుచున్నది. నీవట్లు బూడిదయై నశింపక మరల బ్రతుకుట మమ్ములను బాధించుటకే. నిన్నేమనను? ఆరతీదేవి త్రాడు గట్టిది.

శా. సాహంకారత శంకరుం డలిగి నే♦త్రాగ్నిం బయిం బంపినన్
స్వాహాకాముకుఁ డౌట నిన్నతఁడు గా♦వం బోలు మోమోడి సం
దేహం బేని రతీశ నీవు మగుడన్ ♦ దేహంబుతో నుండు టె
ట్లాహా దైవము దోసకారులకె తో♦డై వచ్చు నెప్పట్టునన్. 47

టీ: రతి+ఈశ=మన్మథా! సాహంకారతన్=అహంకారముతో కూడి యుండుటచే; శంకరుఁడు=అందరికి సుఖమునిచ్చు శివుడు; అలిగి=కోపించి; నేత్ర+అగ్నిన్=కంటినిప్పును; పయిన్=నీమీదకు; పంపినన్=ప్రయోగింపగా; అతడు=ఆపంపబడిననిప్పు; స్వాహాకాముకుడౌటన్=స్వాహాదేవిపై కోరికకలవాడగుటచే; మోమోడి=మోమోటపడి; నిన్నున్; కావంబోలున్=రక్షించియుండవచ్చును; సందేహంబేని=ఇంకను సందేహమున్నచో; మగుడన్=మరల; నీవు; దేహంబుతోన్=శరీరముతో; ఉండుటెట్లు=ఉండుట యెట్లు సిద్ధించును? దైవమున్=దేవుడు కూడ; ఎప్పట్టునన్=ఎప్పుడును; దోసకారులకె=పాపులకే; తోడైవచ్చున్=సహాయమగును; ఆహా=ఎంతఆశ్చర్యము!

తా: ఓ మన్మథుడా! నీవు లోకకంటకుడవని తెలిసి శివుడు నీమీదికి తన కంటిమంటను ప్రయోగించినాడు. కాని ఆయగ్ని తనకు, స్వాహాదేవికి ప్రేమాభివృద్ధి చేసినను అభిమానముతో కరుణచూపి నిన్ను కాల్చియుండడు. అట్లు కానిచో నీవు మరల దేహము నేల ధరించి యుందువు? దైవముకూడ పాపకర్మ చేయువారికే తోడగునుకదా! అలం. అర్థాన్తరన్యాసము.

చ. జడ నొకయింత లేని నెఱ♦ చక్కదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడవయినట్టి ధన్యుఁడవు ♦ భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున ♦ కె ట్లలవాటుగఁ జేసి తక్కటా
పడఁతులమీఁద నేయ రతి ♦ పయ్యెదకున్ ననువైనచేతులన్. 48

టీ: జడను=మాంద్యము; ఒకయింతలేని=కొద్దియైనను లేని; నెఱచక్కదనంబుల నెల్లన్=అందముల నన్నింటిని; కూర్పగన్=ఒకచోటికి చేర్చగా; పొడవయినట్టి=ఆకృతిపొందిన; ధన్యుడవు=అదృష్టవంతుడవు; భోగివి=సుఖముల ననుభవించు వాడవు; పూవిలుకాడవు=పువ్వులే విల్లుగాకల వాడవు; ఇట్టినీవు; రతిపయ్యెదకున్=రతీదేవి పైటకు, ననువైన చేతులన్=అలవాటుపడిన చేతులతో; ఎడపక=మానక; పడఁతులమీఁదన్=స్త్రీలమీద; ఏయన్=బాణములను ప్రయోగించుటకు; నిష్ఠురత్వమునకున్=కాఠిన్యమునకు; ఎట్లు; అలవాటుగన్=పరిపాటిగా; చేసితి=చేసితివి. అక్కటా=అయ్యో!

తా: ఓ సుందరుడా! నీవు లోకములోని అందమునంతను ప్రోగుచేసిసృష్టింపబడినట్లున్న అందగాడవు, సుకుమారుడవు, భోగివి, మెత్తనివిల్లుదాల్చెడివాడవు. రతీ

దేవి పైటను పట్టుట కలవాటైన మృగాల హస్తములతో స్త్రీల నెప్పుడును కఠినముగా కొట్టుట నెట్లు నేర్చితివి? అన్నియు మృదువైనవి కాగా కొట్టుటకు కాఠిన్యమెట్లు వచ్చినది? అలం. విషమము.

తే. అనుచు నిందించి వలవంత ♦ యినుమడింప
యవ్వరారోహ విదళిత ♦ హల్లకముల
కమ్మపుప్పొడిపై దుమా ♦ రమ్ము రేఁచు
మలయమంథరపవనుపై ♦ నలుక వొడమి. 49

టీ: అనుచున్; నిందించి=మన్మథునితిట్టి; ఆ+వరారోహ=ఆవరూథిని; వలవంత=మన్మథతాపము; ఇనుమడింపన్ = రెట్టించగా; విదళిత=వికసింపచేయబడిన; హల్లకముల=ఎఱ్ఱకలువలయొక్క; కమ్మపుప్పొడిపైన్ = కమ్మని పూపరాగముమీాది; దుమారమ్మున్=ధూళిని; రేఁచు=రేగఁగొట్టు; మలయ=మలయపర్వతము మీాదినుండివచ్చు; మంథర=మందమైన; పవనుపైన్=గాలిపై; అలుక=కోపము; పొడమి=పుట్టి. (దీనికి 52 లో 'అనిపలికి' తో అన్వయము)

తా: మన్మథుని నిందించినది. అంతలో పైరుగాలి మెల్లగా ఎఱ్ఱకలువల మీాది పరాగమును విసరుచు వీచినది. అది సహింపలేక దానిపై కోపించి తిట్టుచున్నది.

ఉ. అక్కట గంధవాహ తగ ♦ వా హరిణాంకునిఁ గూడి పాంథులం
బొక్కఁగఁ జేయఁ బావకుని ♦ పొం దొనరించి జగమ్ము లేర్చు నీ
యక్కొఱగామి మాన వది ♦ యట్టిద చుల్కనవృత్తి దుర్జనుం
డొక్కనిఁ జొచ్చి క్రిందుపడు♦నొండ్లకుఁ గీ డొనరింపఁ గల్గినన్. 50

టీ: అక్కట=అయ్యో! గంధవాహ=పరిమళమును మోయునట్టి వాయుదేవుడా! హరిణాంకునిన్=చంద్రుని; కూడి=కలిసి; పాంథులన్=వియోగులను; పొక్కఁగఁజేయన్=బాధింప జేయుట; తగవా=న్యాయమా? పావకునిపొందు=అగ్నితోడి స్నేహమును; ఒనరించి=చేసి; జగమ్ములు=లోకములను; ఏర్చు+నీ+ఆ+కొఱగామి=బాధించు నీదైన ఆచెడుపనిని; మానవు; అది+అట్టిది+అ=ఆచెడుబుద్ధిఅంతే; దుర్జనుండు=చెడ్డవాడు; ఒండ్లకున్=ఇతరులకు; కీడు=అపకారము; ఒనరింపన్+కల్గినన్=చేయకల్గినచో; చుల్కనవృత్తిన్=తేలికయైనపనిలో; ఒక్కనిన్ = ఒక్కగాష్టుని; చొచ్చి – చేరి; క్రిందుపడున్ = అతనికి లోబడియుండును. అలం. అర్థాన్తరన్యాస, పరికరాంకురములు.

తా: ఓ మలయమారుతమా! నీవు చంద్రునితో కలిసి విరహులను బాధింప న్యాయమా? అగ్నికి స్నేహితుడవైనందులకీ చెడుపనిని నీవు మానవు. చెడుబుద్ధి అంతే. దుర్జనుడు తనకు తోచిన చెడుపనిని చేయుటకై తనకు తోడుగా మరొకని చేరి అతనికి లొంగి యుండును. అది లోకమర్యాదయే.

క. నాలుకలు రెండు నిన్నుం
గ్రోలనె కల్పించె నలువ ♦ ఘోరాహికి న
న్నాలిగ్రహ మిప్పుడుఁ దెగఁ దినఁ
జాలద మృదుపవన విరహి ♦ జనదురితమునన్. 51

టీ: మృదుపవన = మెల్లనివాయువా! నలువ = నాలుగు ముఖములుకల బ్రహ్మ; ఘోరాహికిన్ = భయంకరమైన పామునకు; (పాములకు అని అర్థము. జాత్యేకవచనము.) నాలుకలు రెండు = రెండు నాలుకలను; నిన్నున్ + క్రోలనె = నిన్ను త్రాగుటకైయే; కల్పించెన్ = సృష్టించెను; ఆ + నాలిగ్రహము = ఆపాదు గ్రహము; (వేయేండ్లు దాటిన నాగుగ్రహ మగును. కొన గ్రహమని పేర్కొనబడినది.) ఇప్పుడును = ఇప్పుడుకూడ; విరహిజన దురితమునన్ = విరహము కలవారు చేసికొన్న పాపముచే; తెగఁదినన్ = నశించునట్లు తినుటకు; చాలద = సమర్థమైనది కాదు.

తా: బ్రహ్మ నిన్ను తినుటకే పాములకు రెండేసి నాలుకలను సృష్టించెను, కాని విరహము కలవారు చేసికొన్న పాపము వలననేమో ఆపాములుకూడ నిన్ను పూర్తిగా తినలేక పోవుచున్నవి. అలం. విశేషోక్తి.

వ. అని పలికి యక్కలకంఠకంఠి దీపించు తాపంబున పెల్లున మూర్ఛిల్లినం దోడిపల్లవోష్ఠు లల్లనల్లన హల్లకంబుల హిమాంబు పూరంబులం గర్పూరపటీర కర్దమాసారంబులం జెంగావుల మృణాళ భంగంబుల నంగంబులకుం జలువ పుట్టింప నెట్టకేలకుం దెలిసె నంత ప్రభాతసమయం బగుటయు నొక్కపువ్వుఁబోఁడి వరూధినితో నిట్లనియె. 52

టీ: అనిపలికి = ఇట్లునిందించి; ఆ + కలకంఠకంఠి = కోకిల స్వరమువంటి స్వరముకల ఆవరూధిని; దీపించు = హెచ్చైడి; తాపంబు పెల్లునన్ = ఎక్కువ తాపముచే; మూర్ఛిల్లినన్ = మూర్ఛపోగా; చూచి; తోడిపల్లవ + ఓష్ఠులు = ఆమెతో నున్న స్త్రీలు-చెలికత్తెలు; అల్లనల్లనన్ = మెల్లమెల్లగా; హల్లకంబులన్ = ఎర్ర కలువలతో; హిమాంబు పూరంబులన్ = పన్నీటితో; కర్పూర = పచ్చకర్పూరము కలిపిన; పటీరకర్దమ = రాసికొనుటకు వీలుగానున్న మంచిగంధముయొక్క; ఆసారంబులన్ = చల్లుటలతోను; చెన్ను + కావులన్ = ఎర్రని వస్త్రములతోను; మృణాళ భంగంబులన్ = తామరకాడల ముక్కలతోను; అంగంబులకున్ = అవయవములకు; చలువ; పుట్టింపన్ = కలిగింపగా; ఎట్టకేలకున్ = ఎంతోసేపటికి; తెలిసెన్ = మూర్ఛతేరెను; అంతన్ = అప్పుడు; ప్రభాతసమయంబగుటయున్ = ప్రాతఃకాలము కాగా; ఒక్కపువ్వుబోడి = ఒక్కస్త్రీ; వరూధినితోన్. ఇట్లనియెన్.

తా: వరూధిని తాపము హెచ్చగా మూర్ఛపోయినది. అప్పుడు చెలికత్తెలు పన్నీరుచల్లి, పచ్చకర్పూరము కలిపిన గంధమురాసి, తామరకాడల ముక్కలు వేసి,

శైత్యోపచారములు చేయుగా ఆమె తేరుకొన్నది. అంతట నొక చెలికత్తె ఆమెతో నిట్లన్నది.

ఉ. పాటనసేయమిం గురులు ♦ పైఁబడి శీర్ణపటీరపంక లా
లాటికమై దరస్మితవి ♦ లాసపుఁజంద్రిక డొంకి వాడుటం
దేటఁ దొఱంగి విన్ననగు ♦ నీమొగమో యనమాసి చంద్రుఁడో
పాటలగంధి వ్రాలె నదె ♦ భానురుచిం దనకందు మీఱఁగన్. 53

టీ: పాటలగంధి=ఓవరూధినీ! పాటనసేయమిన్=దువ్వుకొనక పోవుటచే; కురులు=జుట్టు; పైఁబడి=మీదికి వ్యాపించి; శీర్ణ=విడిపోయిన; పటీరపంక=మంచిగంధముతో పెట్టిన; లాలాటికమై=బొట్టుకలదై; దరస్మిత=చిరునవ్వుయొక్క; విలాసపుజంద్రిక=విలాసమను వెన్నెల; డొంకి=అణగి; వాడుటన్=వాడిపోవుటచే; తేటఁదొఱంగి=కాంతితగ్గి; విన్ననగు=వెల్లబోయిన; నీమొగమోయనన్=నీముఖమాయనునట్లు; చంద్రుడు; మాసి=కాంతితగ్గి; భానురుచిన్ = సూర్యకాంతిచే; తనకందు=తనమచ్చ; మీఱన్=హెచ్చగా; వ్రాలెన్=క్రిందికిదిగెను-అస్తమించెను.

తా: ఓవరూధినీ! దువ్వుకొనని సందున మొగము మీదికి జుట్టుపడగా, చిరునవ్వులేక కాంతితగ్గి చిన్నబోయిన నీముఖమా అన్నట్లు కాంతితగ్గి చంద్రుడు సూర్యకాంతి వచ్చుచుండుటచే మచ్చ కన్పించుచు అస్తమించుచున్నాడు.

సీ. సకుటుంబముగఁ వీఁగి ♦ చరమశైలముఁ జేరు
తుహినాంశుదుముదారు ♦ దోర యనంగ
నాసీరమై వచ్చు ♦ నలినబాంధవుటెక్కె
యంబుపై దీపించు ♦ నద్ది యనఁగ
నరుణాగ్రనిబిడ వా ♦ ద్యములలోఁ గనుపట్టు
సమయశాంఖికుచేతి ♦ శంఖ మనఁగ
నినుఁ దప్పు డఱుఁ జోట ♦ మునుమున్న పడివాగెఁ
గొనివచ్చు రాయంచ ♦ కోదమ యనఁగ

గీ. నుదయపురి మీఁదఁ గోపురం ♦ బుండి నిగుడు
నహితరవిరశ్మిచే బద్ధుఁ ♦ డగుచుఁ దోడి
బలగమై నట్టిచుక్కల ♦ వలసతోవఁ
జూప నేతెంచె నన వేగుఁ ♦ జుక్క వొడిచె. 54

టీ: సకుటుంబముగన్=కుటుంబముతో కూడి; పోఁగి=పాఁపోవుచు; చరమ శైలమున్=పడమటి కొండను; చేరు=చేరెడి, తుహిన + అంశు చమూధౌరే యనంగన్=చంద్రుని సేనానాయకు డనునట్లుగాను; నాసీరమై=సేనకు ముందు నడచునదై; వచ్చు; నలినబాంధవు = సూర్యునియొక్క; టెక్కెయంబుపైన్= జెండాపై; దీపించునద్దమనఁగన్=వెలిగెడి అద్దమా అన్నట్లును; అరుణ=సూర్యుని యొక్క; అగ్ర=ముందున్న; నిబిడవాద్యములలోన్=ఎక్కువగానున్న వాద్యము లలో; కనుపట్టు=కన్పడెడి; సమయశాంఖికుచేతి=కాలమను శంఖముపట్టెడి పురుషుని యొక్క చేతిలోనున్న; శంఖమనగన్ = శంఖమా అన్నట్లును; ఇనుడు= సూర్యుడు; అప్పుడు=ఉదయవేళ. అజుడౌటన్ = బ్రహ్మస్వరూప మగుటచే; మునుమున్న=ముందుగా; పడివాగెన్=ఎక్కుటకనువైన సర్దుబాటుతో; కొనివచ్చు =తీసికొనివచ్చు; రాయంచకొదమయనగన్=రాజహంసగున్నవలెను; ఉదయగిరి మీదన్=ఉదయ పర్వతముపై; కోవురంబుండి=పొంచియుండి; నిగుడు=ముందు నకువచ్చు; అహిత=శత్రువైన; రవిరశ్మి చేన్=సూర్యకిరణములచే; బద్ధుడగుచున్ =కట్టబడినవాడై; కోడిబలగమైన=తనతోడిసేనయగు; చుక్కల వలస త్రోవన్ =నక్షత్రములు పారిపోవు మార్గమును; చూపన్=చూపుటకై; ఏతెంచెననన్= వచ్చెనా యన్నట్లు; వేగుచుక్క; తెల్లవారు నపుడుదయించు చుక్క; పొడిచెన్ =ఉదయించెను; ఇందు వేగుచుక్క పొడుచుట నుత్ప్రేక్షించెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి ♦ శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశ ♦ బ్దజ్ఞానమే మూల మిం
తకునుఁ బోలన్ వినుఁ డంచుఁ దెల్పుగతిఁ జెం♦తం గొండపైపల్లెలం
గృకవాకుల్మొరసెన్ గృహోపరిఁ ద్రిభం♦గిన్ భుగ్నకంఠధ్వనిన్.

టీ: సకల+ఆశాగతి=జనులన్ని దిక్కులకు పోవుట; నర్మకోపవిరతి= దంపతులు ప్రణయకోపమును తగ్గించుకొనుట; శ్రౌతక్రియా=వేదవిహితమైన కర్మల యొక్క; ఆరంభణ=ఆరంభించుట; ఆత్మక=స్వరూపమైన; వర్గత్రయికిన్=అర్థ కామ ధర్మములను మూడిటికిని; మత్+ఉచ్చరిత=నాచేపల్కబడిన; శబ్దజ్ఞానమే= శబ్దమును తెలిసికొనుటయే-కూతవినుటయే; ఇంతకున్ = ఈలోకమున కింతకును; మూలము=కారణము; పోలన్=పోల్చుకొనునట్లు; వినుడు=(లోకులారా)వినుడు; అంచున్=అని; తెల్పుగతిన్=తెలిపెడి రీతిగా; చెంత=దగ్గరలో; కొండపైపల్లె లన్=కొండ మీదనున్న చిన్న చిన్న పల్లెలలో; గృహ+ఉపరిన్=ఇండ్లమీది కెక్కి; కృకవాకుల్=కోళ్లు; భుగ్నకంఠధ్వనిన్ = వంపులు త్రిప్పబడిన కంఠ ధ్వనితో; త్రిభంగిన్=మూడురకములుగా; మొరసెన్=కూసెను; అలం. స్వభా వోక్తి, ఉత్ప్రేక్షయు.

తా: కోడికూత వినగానే జను లెవరి పనులు వారు చూచుకొనుటకై పొల ముల కేగుదురు. దంపతులు ప్రణయకలహములు మానుదురు, వేదవిహిత కర్మలను

చేయుటకు వెళ్లుదురు. ఈరీతిగా ధర్మార్థకామములు నాకూత వినియె చేయుచున్నా రని కోళ్లు జనులకు తెలియునట్లు గొంతెత్తి హ్రస్వదీర్ఘప్లుత స్వరములలో మూడు వంపులతో, ఆచుట్టుపట్టులనున్న పల్లెటూళ్లలోని ఇండ్లకు కూసినవి. (వరూధిని తన యింటిలో కోడిని పెంచుట లేదనియు, కొండపల్లెలలో నున్నవనియు, ఇందు స్పష్టపరుపబడినది.)

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ ♦ డేతేరఁ దద్దీప్తి నం
జనసంబంధజబాంధవంబున రతి ♦ శ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమం ♦ దాఁబూనెనో చొప్పు మా
ర్చ ననన్ వెల్వెలఁ బాఱె దీపకళికా ♦ వ్రాతంబు శాతోదరీ. 56

టీ: శాతోదరీ=వరూధినీ; ఇనుడు=సూర్యుడు; అస్త+అద్రికిన్=పడమటి కొండకు; పోవన్=పోగా; కొల్లగొని=దోచుకొని; నేడు=ఇప్పుడు; ఏతేరన్=వచ్చుచుండగా; తత్+దీప్తిన్ = అసూర్యుని కాంతిని; అంజన = కాటుక యొక్క; సంబంధజ=సంబంధము వలన పుట్టిన; బాంధవంబునన్=చుట్టరికముచే; రతిశ్రాంత=సురతముచేబడలిన; అంగనా=స్త్రీలయొక్క; నేత్ర=కన్నులయొక్క; కోణనికాయంబులన్=కొలకులందు; డాచి = దాచి; తత్+ధవళిమన్=వాటి తెలుపురంగును; తాన్=అవి; చొప్పుమార్చన్=వేషము మార్చుటకై; పూనెనో=ధరించెనో; అనన్=అనునట్లు; దీపకళికావ్రాతంబు=దీపములు; వెల్వెలబాఱెన్=వెలవెల పోవుచున్నవి.

తా: దీపములు, సాయంకాలము వేళ సూర్యునినుండి కాంతిని దొంగిలించి, మరల అతడు వచ్చుచున్నాడని తెలిసి మారువేషమున దాగుకొనుటకై, కాటుక కలుగుటయును సంబంధముండుటచే సంభోగము వలన బడలిక చెందియున్న కామినుల కనుకొలకులందు ఆకాంతిని దాచి తా మాతెల్లదనమును పుచ్చుకొన్నవా అన్నట్లు కాంతిహీనములై వెలవెల బారుచున్నవి. రాత్రినిద్ర లేకపోవుటచే కామినుల కన్ను లెఱ్ఱనైనవి. తెల్లవారగ వచ్చినందున దీపకాంతి తగ్గినది. అలం. భ్రాంతిమత్; ఉత్ప్రేక్షలు.

శా. వాలారుంగొనగోళ్ల నీ వలసతన్ ♦ వాయించుచోఁ నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ ♦ నీ వంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభా ♦ తాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁ గదవే ♦ లోలాక్షి దేశాక్షికిన్. 57

టీ: లోలాక్షి=చంచలమైన నేత్రములుకల వరూధినీ! నీవు; అలసతన్=బద్ధకముచే; వాలారుంగొనగోళ్లన్=వాడియైన గోటికొనలతో; వాయించుచోన్=మీటునప్పుడు; నాటకున్=నాటరాగమునకు; మేళంబైన=మేళవింపబడిన; విపంచి=వీణ; నిన్న మొదలున్=నిన్నటినుండి; నీవు+అంటమింజేసి=నీవుతాకకపోవుటచే;

అవేళన్=ఆరాగము పాడరాని సమయమందు; ప్రభాత=ప్రొద్దునపే; ఆయాత =వచ్చెడి; వాత=గాలిచే; ఆహత=కొట్టబడినవై; ఆలోలత్=కదలెడి; తంత్రులన్=తీగెలచే; ఆ+ఆలాపంబె=ఆనాటరాగాలాపమునే; పల్కెడున్=మ్రోగుచున్నది; దేశాక్షికిన్=ఉదయ కాలమున పాడదగిన దేశాక్షియను రాగమునకు; మేళవింపగదవే– మేళవించుమా !

తా: ఓ వరూధినీ ! నీవు నిన్న మధ్యాహ్నమున నాటరాగమునకు మేళవించి వదలిన వీణ, తంత్రులకు గాలి వీచుటచే కాని వేళ నాటరాగమునే ఆలపించుచున్నది. ఇంతవరకు నీవు దానిని ముట్టకుంటివాయె. ఇప్పుడైనను దేశాక్షిరాగమునకు మేళవింపుము. అలం. స్వభావోక్తి.

చ. పలుకులు నేర్పువేళ కల ♦ భాషిణి నీవిటులుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖ ♦ ముల్ చరణాగ్రనఖాళిఁ గోఁకుచున్
నిలుగుచు నావులించుచు వ ♦ నీవిహగోత్కర మెట్లువల్కె న
ప్పలుకులె యఱ్ఱు లెత్తి విని ♦ పల్కెడు వింటివె కీరశారికల్. 58

టీ: కలభాషిణి=మధురముగా మాట్లాడుదానా ! పలుకులు = మాటలను; నేర్పువేళన్, నీవు; ఇటులుండన్=ఇట్లు బాధపడుచుండగా; పంజరంబులన్=పంజరములలో; కీరశారికలు=చిలుకలు, గోరువంకలును; అరగన్ను వెట్టి=సగము కన్ను మూసికొని; ముఖముల్=మూతులను; చరణ+అగ్ర+నఖ+ఆళిన్=కాలిగోళ్ళతో; గోఁకుచున్=గీరుకొనుచు; నిలుగుచున్=ఒళ్ళు విరుచుకొనుచు; ఆవులించుచున్; వనీవిహగ+ఉత్కరము=అడవి పక్షుల గుంపు; ఎట్లు పల్కెన్=ఏరీతిగాకూయునో; అప్పలుకులె=ఆమాటలే; అఱ్ఱులెత్తి = మెడలెత్తి; విని; పల్కెడున్ = కూయుచున్నవి; వింటివె ?

తా: ఓవరూధినీ! నీవు పలుకులు నేర్పు చిలుకలు, గోరువంకలును, ఈనాడు నీవు పసిగాలేక బద్ధకించగా పంజరములో నిద్రమత్తుగా ఆవులించుచు, ముక్కులు గోకికొనుచు, అడవి పక్షుల కూతలను విని కూయుచున్నవి. విన్నావా ? అలం. స్వభావోక్తి, భ్రాంతి.

మ. ఉరుసంధ్యాతపశోణమృత్కలితమై ♦ యొప్పారు బ్రహ్మాండ మ
న్గరిడిం గాలపుహొంతకాఁడు చరమా ♦ గస్కంధముఁ జేర్చు ని
బ్బరఘన్ సంగడమోయనన్ శశి డిగెం ♦ బ్రాగ్భూమిభృన్మైత్రకృతవే
తరబాహాగ్రపుసంగడంబనఁగ మా ♦ ర్తాండుండు దోఁచెన్ దివిన్.

టీ: ఊరు=గొప్పదైన; సంధ్యా+ఆతప=ప్రాతఃకాల సంధ్యారాగమును; శోణమృత్=ఎర్రమన్నుతో; కలితమై=కూడినదై; ఒప్పారు=ఒప్పెడి; బ్రహ్మాండము+అన్+గరిడిన్=బ్రహ్మాండమను సాముచేయు ప్రదేశమున; కాలపు హొంతకాఁడు=కాలమను మల్లుడు; చరమ + అగస్కంధమున్ = పడమటికొండయను

మూపునందు; చేర్చు=చేర్చుకొన్న; నిబ్బరపున్=గట్టిదైన; సంగడమో=సాము సాధన చేసెడి తిరుగలివంటిగుండ్రని పరికరమో; అనన్=అనునట్లు; శశి=చంద్రుడు; దిరొను=క్రిందికిదిగాలెను; ప్రాక్+భూమిభృత్+కైతవ=తూర్పుకొండయను; ఇతరబాహా+అగ్రపు=రెండవచేతిచివరి; సంగడంబనగన్=సాముపరికరమా అన్నట్లు; మార్తాండుండు=సూర్యుడు; దివిన్=ఆకాశమందు; తోచెన్=ఉదయించెను.

తా: ప్రొద్దుటివేళనున్న సంధ్యారాగమును నెత్రమన్ను కలిపిన గరిడీశాలలో కొలమును మల్లుడు ఒక చేతిలో తిరుగలివలెనున్న చంద్రుని, మరొక చేతిలో సూర్యుని పట్టినట్లుగా చంద్రుడ స్తమించుచుండగా సూర్యుడుదయించుచుండెను. రూపకోత్ప్రేక్షా పహ్నవము లలంకారములు.

చ. కరకరిఁ గూటఁ గట్ట యిడఁ ♦ గా మొఱ పెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళ వి ♦ ఘట్టన నించుక వాయివడ్డ తా
మర మొఱ వెట్టివెట్టి పలు♦మాఱును వాకిలి దాఁటి యూఁగుచున్
మొరయ విపంచి మీటుగతి♦మ్రోసి యళుల్ వెడలెం గొలంకులన్.

టీ: కరకరిన్=క్రౌర్యముగా; గూటన్=గూటిలో; కట్టయిడగాన్=కఱ్ఱపెట్టగా; మొఱ+పెట్టెడులీలన్=మొఱ్ఱోఅనునట్లు; బాలభాస్కర=లేతసూర్యునియొక్క; కరకాండ=కఱ్ఱవంటి కిరణములయొక్క; విఘట్టనన్=తాకిడిచే; ఇంచుక=కొంచెము; వాయి+వడ్డ=విచ్చిన; తామరన్=తామరపువ్వులందు; మొఱ+పెట్టిపెట్టి; పలుమాఱును=మాటిమాటికి; వాకిలిన్=ద్వారమును; దాఁటి; ఊఁగుచున్; మొరయన్=మ్రోగునట్లు; విపంచి=వీణెను; మీటుగతిన్=వాయించినట్లు; మ్రోసి=ఝుంకారములుచేసి; అళులు=తుమ్మెదలు; కొలంకులన్=సరస్సులనుండి; వెడలెన్=బయటికి వచ్చెను.

తా: పక్షిగూటిని కఱ్ఱపెట్టి పొడువగా లోనుండి పక్షులు కూయునట్లు సూర్యకిరణ ప్రసారము తగిలి వికసించిన తామరపువ్వులనుండి తుమ్మెద లీవలకు వచ్చి వీణమీటినట్లు రొదచేయుచున్నవి. అలం. స్వభావోక్తి, ఉపమయు.

చ. అడరునవీనభానుకిర ♦ ణానల మంటినఁ గూడుకొన్న పు
ష్పొడి కొలు చెల్ల మోచికొని♦పోయెడి సంభ్రమ మొప్పఁగంటివే
పడఁతి భవద్విహారవన ♦ పద్మసరఃకుముదాలయంబులన్
వెడలు మిళిందబృందములు ♦ వీఁపు పిశంగిమకైతవంబునన్. 61

టీ: పడతి=వరూధినీ! భవత్=నీయొక్క; విహారవన=ఉద్యానమందలి; సరః=సరస్సునందలి; కుముద+ఆలయంబులన్=కలువలనెడి ఇండ్లనుండి; వెడలు=బయటికివచ్చు; మిళిందబృందములు=తుమ్మెదగుంపులు; వీఁపుపిశంగిమకైతవంబునన్=వీపునయున్న పసుపురంగను వంకతో; అడరు=అతిశయించెడి; నవీనభా

కిరణ=శ్వేతసూర్యుని కిరణములను; అనలము=నిప్పు; అంటినన్ = అంటుకొనగా; కూడుకున్న=ప్రోగుపడిన; పుష్పాడికోలుచు=పూపరాగమను ధాన్యము; ఎల్లన్ =అంతను; సంభ్రమము=తొందర; ఒప్పన్ = ఒప్పునట్లు; మోచుకొనిపోయెడిన్ = మోచుకొని పోవుచున్నవి; కంటివే=చూచితివా ?

తా: ఓ పడతీ ! నీ యుద్యానములోని సరస్సులలోని కలువలనుండి తుమ్మెదలు పుష్పాడి వీపులకంటుకొని ఎగిరి పోవుచుండగా, సూర్యకిరణములను నిప్పంటుకొనగా ఇండ్లనుండి దాచుకొన్న ధాన్యము నెత్తుకొని పాఱిపోవు చున్నట్లున్నవి. చూచితివా? అలం. ఉత్ప్రేక్ష, రూపకము, అపహ్నవము.

చ. కొలకొలఁ గూయుఁ బై నొఱగుఁ ♦ గుత్తుకఁ గుత్తుకఁ జుట్టు పాఱుఁచి
ల్వలక్రియఁ గానరానిగతు ♦ లన్ మయి మైఁ బెనుచుం జనించున
శ్రులఱుత నొత్తు సోలు నిలు ♦ చున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలపవు కంటె పాసినవె ♦ తల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 62

టీ: కోకదంపతుల్=చక్రవాకపు జంటలు; విధిచాతురిన్ = దైవము నేర్పుచే; కూడియున్=మరల కలిసికొనియు; పాసినవెతల్ = రాత్రివిడిపోయిన బాధలను; తలఁపించుచున్=తలచుకొనునట్లు చేయుచు; కొలకొలఁగూయున్=కొలకొలమని కూయుచున్నవి; పైన్=ఒకదానిపైనొకటి; ఒఱగున్=ఒరగియానుకొనును; కుత్తుకన్+కుత్తుకన్+చుట్టున్ = మెడతో మెడనుచుట్టివైచును; పాఱుచిల్వలక్రియన్ =పడగెత్తు పాములవలె; కానరాని గతులన్ = తెలిసికోలేని నడకలతో; మయి మైన్ = ఒంటితో ఒంటిని; పెనఁచున్ = పెనవేసికొనును; జనించు+అశ్రులు= పుట్టెడి కన్నీళ్లు; అఱుతన్ = మెడచే; ఒత్తుః = తుడుచును; సోలున్ = పరవశముగా వ్రాలును; నిలుచున్ = నిలబడును. రతిన్+తలఁపవు = సంభోగమును మాత్రమును తలచుటలేదు; కంటె=చూచితివా?

తా: చక్రవాకపు జంటలు రాతిరెల్ల కన్నులగపడక విడిపోయి మరల సూర్యోదయము కాగానే కలిసికొని ఆవిరహ బాధను పోగొట్టుకొనునట్లు మెడ మెడ కలుపుకొనుచు, ఒకదాని నొకటి నాకుచు క్రింద మీదపడుచున్నవే కాని సంభోగించుటను మరచి పోయినవి. చూచితివా దైవఘటన ? అలం. స్వభావోక్తి, కారకదీపకము, ఉపమ, విశేషోక్తియు.

ఉ. ఇందునిభాస్య వాఁ డనఁగ ♦ నింద్రుఁడొ చంద్రుఁడొ యా
యుపేంద్రుఁడో
యిందునకై వగం బొగుల ♦ నేటికి నేఁటికి నందుఁబోద మా
నందనభూమి భూమిసుర ♦ నందనుఁ డుండకపోఁడు రమ్మునీ
చందము నందముం గనిన ♦ జవ్వని యెవ్వని వెట్టిఁ జేయదే. 63

టీ: ఇందునిభ+ఆస్య=చంద్రుని వంటి ముఖముకల వరూథినీ! వాడు+అనఁగన్ = అప్రవరుఁడనగా; ఇంద్రుఁడో? చంద్రుఁడో? ఆ+ఉపేంద్రుఁడో=విష్ణువో? ఇందులకై=వానిచూచుటకై; వగన్=విచారముతో; పొగుల నేటికిన్=బాధపడ నేల? నేఁటికిన్=నేడుకూడ; అందున్=ఆతోటలోనికి; పోదము=వెళ్లుదము; ఆనందనభూమిన్=సంతోషమునకు తావైన అక్కడ; భూమిసురనందనుడు=ప్రవరుడు; ఉండకపోడు; రమ్ము; జవ్వని=పడుచుదాన! నీచందమున్=నీరీతిని; అందమున్=అందమును; కనిసన్=చూచినచో; ఎవ్వనిన్=ఎవనినైనను; వెఱ్ఱిన్=వికారము కల వానిగా; చేయదే=చేయదా? -చేయును,

తా: వాడేమి ఇంద్రుడా? చంద్రుడా? ఈపాటి భాగ్యమునకు విచారింప నేల? ఆ వనమునకు పోదము. అతడక్కడ ఉండకపోడు, నీఅందము చూచినచో వెర్రియెత్తని (వలవని) వాడెవడు? రమ్ము. అలం. ఉపమ, ప్రతిషేధము, కావ్యార్థాపత్తియు.

ఉ. ఏల దురంతవేదన మె ♦ యిం బొరలాడెదు తాల్మి దక్కి మే
లే లలితాంగి యెంతపని ♦ లెమ్మిది విప్రవరుండు గోలయున్
బాలుఁడు గాన నప్పటికిఁ ♦ బైపడఁ గొంకెను గాని వానికిన్
గా లొకచోట నిల్చునె వ♦గన్మగుడన్ నినుఁ జూచు నంతకున్. 64

టీ: లలిత+అంగి=అందమైన శరీరము కలదాన! ఏల, తాల్మి = ఓర్పు; దక్కి=విడిచి; దురంత వేదనమెయిన్=అంతులేని బాధతో; పొరలాడెదు=దొర్లుచున్నావు; మేలే=ఇది తగునా? ఇది=నీప్రియుని తెచ్చుట; ఎంతపనిలెమ్ము=చాల తేలిక లే; విప్రవరుండు=ప్రవరుడు; గోలయున్=ఏమియు తెలియనివాడు; బాలుడున్=చిన్న వాడును; కానన్; పైఁబడన్=నీకు ప్రీతిగా కౌగిలించు కొనుటకు; కొంకెను=జడిసెను; కాని; వానికిన్; మగుడన్=మరల; నినున్; చూచునంతకున్=చూచువరకు; వగన్=బాధచే; ఒకచోటన్=ఒక్కచోట; కాలునిల్చునె=కాలాగునా? నిలువలేడు.

తా: ఓ వరూథినీ! నీవేదో అంతులేని బాధతో దొర్లుచుంటివి కాని నీప్రియుని తెచ్చుట యెంతపని? లే. అతడు ముగ్ధుడగుటచే నీచేతకు బదులు చేయలేక పోయినాడు. అంతేకాని అతనికి నిన్ను చూచు వరకు కాలునిల్చునా? అతడే వచ్చి నిన్ను కలియును.

క. రా ర మ్మనుటయు దివిజ
నారీరత్నంబు నికట ♦ నాకధునీక
ల్హారాంభోరుహమధురస
ధారాచంద్రికితసలిల ♦ ధౌతాననయై. 65

టీ: రారమ్మని; అనుటయున్ = అని చెలికత్తె అనగా; దివిషత్ + నారీ రత్నంబు = దేవతాస్త్రీ, నికట = దగ్గరలోని; నాకధునీ = గంగయందలి; కల్హార = చెంగలువ యొక్క; అంభోరుహ – పద్మములయొక్క; మధురస = పూదేనెయొక్క; ధారా = ధారలచే; చంద్రకిత = నెమలి కన్నులవలె నున్న; సలిల = నీటిచే; ధౌత = కడుగబడిన; ఆననమై = ముఖము కలదై -(ముందున కన్వయము)

తా: అట్లు చెలికత్తె చెప్పుటతో వరూధిని కొంత బాధ తగ్గించుకొని గంగలోని కమలముల, కలువల పూదేనెతో, నెమలికన్నుల రంగుకల నీటితో మొగము కడిగికొని...

సీ. ఘనసారపంక మొ ♦ క్కలతాంగి దెచ్చిన
 ముట్టి వ్రేలనె చుక్క ♦ బొట్టు వెట్టి
యింతి యొక్కతె పూవు ♦ టెత్తు లెత్తినఁ జూచి
 విసువుతో నొకకొన్ని ♦ విరులు దుఱిమి
పడఁతి యొక్కతె రత్న ♦ పాదుక లిడ నిల్చి
 తొడుగ కవ్వలికిఁ బో ♦ నడుగు వెట్టి
బాగాలు వెస నొక ♦ పద్మాక్షి యొసఁగిన
 వెగ్గలం బని కొన్ని ♦ వెడల నుమిసి

సీ. సగము గోఱికిన యాకులు ♦ సఖులు పిలువ
సగ మొసఁగు నుత్తరముఁ దెల్వి ♦ సగము మఱపు
సగము నయి చింతచే సగ ♦ మగుచు నరిగె
నవ్వరూధిని యంతికో ♦ ద్యానమునకు. 66

టీ: ఒక్కలతాంగి = ఒక చెలికత్తె; ఘనసార పంకము = పచ్చకర్పూరము కలిపిన గంధమును; తెచ్చినన్, వ్రేలనె = కొనవ్రేలితోనే; ముట్టి = తాకి; చుక్కబొట్టు పెట్టి; ఇంతియొక్కతె = ఒక చెలి; పువ్వు + ఎత్తులు = పూలదండలు; ఎత్తినన్ = ఎత్తిచేతితో పట్టుకోగా; చూచి; విసువుతోన్ = విసుగుతో; ఒకకొన్ని విరులు = కొన్ని పూలను మాత్రమే; తుఱిమి = కొప్పులో ముడుచుకొని; పడతియొక్కతె = ఒకపరిచారిక; రత్నపాదుకలు = రత్నాలు పొదివిన పాదరక్షలు; ఇడన్ = తెచ్చియుంచగా; నిల్చి; తొడుగక; అవ్వలికిన్ + పోన్ = ఒకప్రక్కకు పోవుటకు; అడుగు + పెట్టి = కాలుపెట్టి; ఒక్కపద్మాక్షి = ఒకపరిచారిక; వెసన్ = వెంటనే; బాగాలు = సన్నవక్కలు; ఒసఁగినన్ = ఇయ్యగా; వెగ్గలంబని = ఎక్కువఅని; కొన్ని = నోటిలో పోసికొన్న వాటిలో కొన్నిటిని;. వెడలనుమిసి; సగము కొఱికిన యాకును = కొరికిన తమలపాకును; సఖులు = చెలులు; పిల్వన్ = పిల్వగా; సగము

ఉత్తరమున్=సగము జవాబును; ఒసగును=చెప్పును; తెల్వి+సగము; మఱుపు+సగమునై=చిరాకుపరాకుగా; చింతచేన్=విచారముతో; సగమగుచున్=చిక్కి సగమై, ఆ+వరూథిని; అంతిక+ఉద్యానమునకున్=దగ్గరలోనున్న ఉద్యానవనమునకు; చనియెన్=వెళ్లెను.

తా: వరూథిని విరహబాధతో అలంకారముల నర్ధాంగీకారముగా స్వీకరించి, చెలు లడిగిన దానికి మఱపు-చెఱుపుగా జవాబిచ్చుచు పరధ్యానముతోనే ఉద్యానవనమున కేగినది.

వ. ఆసమయంబున దేవజాతిత్వజనిత విమలజ్ఞానపాటవంబునం దద్వృత్తాంతంబు సమస్తంబు నెఱుంగుటం జేసి. 67

టీ: ఆసమయంబునన్=అప్పుడు; దేవజాతిత్వ=దేవతయగుటచే; జనిత=కల్గిన; విమల=స్వచ్ఛమైన; జ్ఞానపాటవంబునన్=తెలివి బలముచే; తత్+వృత్తాంతంబున్=ఆమెవిషయమును; ఎఱుంగుటంజేసి=ఎరుగుటవలన...(కర్తగంధర్వుడు)

శా. ఏగంధర్వుఁడు తద్విలాసముల ము ♦ న్వీక్షించి తానెంతయున్
రాగాంధుండయి కోరి హత్తక గడున్ ♦ రారాపులం గంతుఁ డు
ద్వేగంబందఁగఁ జేయ నెవ్వగల ను ♦ ద్విఘ్నూరుచున్ వేఁగువాఁ
డాగంధర్వకుమారుఁడంగభవవి ♦ ద్యాపారగుండాత్మలోన్. 68

టీ: మున్ను=మును పెప్పుడో; ఏగంధర్వుడు; తత్+విలాసములన్=ఆవరూధినియొక్క విలాసములను; ఈక్షించి=చూచి; తాన్=తాను; రాగ+అంధుండయి=అనురాగముచే ఒళ్లుతెలియనివాడై; కోరి=ఆమెనుకోరియు; హత్తక=కుదరక; కంతుడు=మన్మథుడు; కడున్=మిక్కిలి; రాపు+రాపులన్=ఎక్కువ రాపిడిచే; ఉద్వేగంబు+అందగన్=మనస్సు కలవరపడునట్లు; చేయన్=చేయగా; నెఱ+వగలన్=ఎక్కువ విచారముచే; ఉద్విఘ్నూరుచున్=ఎప్పుడు వరూధిని కూడునాయని తొందరపడుచు; వేఁగువాడు=బాధపడుచుండెనో; అంగభవ విద్యాపారగుండు=మన్మథ (కళా) విద్యలో నేర్పుకల; ఆగంధర్వకుమారుడు=ఆగంధర్వయువకుడు; ఆత్మలోన్=తనలో...

తా: ఒకప్పుడొక గంధర్వుడా వరూధినిని చూచి మోహించి ఆమెను కోరెను. కాని ఆమె అంగీకరించనందున అత డెట్లామెను పొందుదునా అని వేచియుండెను. అత డీనా డీమె పడు బాధను తెలిసికొని తనలో...

ఉ. ఒక్కొకవేళ పద్మముఖు ♦ లొల్లమి సేయుదు రొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్ష ♦ ణక్షణముల్ జవరాండ్రచిత్తముల్

పక్కున వేసటఁ జనదు ♦ పాయములం దగు నిచ్చకంబులన్
జిక్కఁగఁ జేసి డాసి సతి♦చిత్తముఁ బట్టి సుఖింపఁ గాఁ దగున్. 69

టీ: పద్మముఖులు=స్త్రీలు; ఒక్కొకవేళన్=ఒక్కొక్కప్పుడు; ఒల్లమి చేయుదురు=ఒప్పుకొనరు; ఒక్కవేళన్=ఒకప్పుడు; పెను+మక్కువన్=ఎక్కువ మక్కువతో; ఆదరింతురు=ప్రేమింతురు; జవరాండ్ర చిత్తముల్=పడుచువారి మనస్సులు; క్షణక్షణముల్=క్షణమునకొక రీతిగా నుండును-నిలకడలేనివి! (కాన) పక్కునన్=తటాలున; వేసటన్=విసుగుకొనుట; చనదు=తగదు; ఉపాయములన్=ఉపాయములతో; తగు+ఇచ్చకంబులన్=తగిన నొప్పైనమాటలతో; డాసి=దగ్గరకుచేరి; చిక్కగజేసి=లోబడునట్లు చేసికొని; సతిచిత్తముబట్టి=ఆడుదాని మనస్సు ననుసరించి; సుఖింపగాన్=అనుభవించుటకు; తగున్=యుక్తమైనది.

తా: స్త్రీలొకప్పుడొప్పుకొనరు. ఒకప్పుడెంతో ప్రేమ పూనుదురు. కావున ఆలోచింపక విసుగుకొనరాదు. తగిన యుపాయములతో, తగిన మెప్పుమాటలు చెప్పి యొప్పించి లోబరచుకొన వలెను. అలం. అప్రస్తుత ప్రశంస, కావ్యలింగము.

క. అని తలఁచి యవ్విలాసిని
యనిశము గ్రీడించు పుష్పి ♦ తారామంబున్
మునుకలుగఁ జొచ్చి యొక చం
దనభూజమునీడ నిల్చి ♦ దంభం బమరన్ 70

టీ అనితలఁచి=అనుకొని; ఆ+విలాసిని=ఆవరూధిని; అనిశము=ఎల్లపుడును; క్రీడించు=విహరించెడి; పుష్పిత+ఆరామంబున్=పుష్పించిన యుద్యానమును; మునుకలుగన్ = తాను ముందుగా; చొచ్చి = ప్రవేశించి; ఒక చందన భూజమునీడన్=ఒకమంచి గంధపుచెట్టు నీడను; నిల్చి=నిలువబడి; దంభంబు=మాయ; అమరన్=సరిపడు నట్లుగా; (ముందున కన్వయము)

సీ. అర్ధచంద్రుని తేట ♦ నవఘళించు లలాట
పట్టిఁ దీర్చిన గంగ ♦ మట్టితోడఁ
జెక్కుటద్దములందు ♦ జిగి వెల్లువలు చిందు
రమణీయమణికుండ ♦ లములతోడ
పసిఁడివ్రాఁతచెఱఁగు ♦ మిసిమిదోఁపఁ జెలంగు
నరుణాంశుకోత్తరీ ♦ యంబుతోడ
సరిలేని రాకట్టు ♦ జాళువామొలకట్టు
బెడఁగారు నీర్కావి ♦ పింజెతోడ

గీ. ధవళధవళము లగు జన్ని ♦ దములతోడఁ
గాశికాముద్రి యిడిన యుం ♦ గరముతోడ
శాంతరస మొల్క బ్రహ్మతే ♦ జంబుతోడఁ
బ్రవరుఁ డయ్యె వియచ్చర ♦ ప్రవరుఁ డపుడు. 71

టీ: అపుడు; వియచ్చరప్రవరుడు = ఆకాశమున సంచరించు వారిలో శ్రేష్ఠుడైన గంధర్వుడు; అర్ధచంద్రుని తేటన్ = సగమున్న చందమామయొక్క కాంతిని; అవఘళించు = తిరస్కరించెడి (పోలిన;) లలాటపట్టిన్ = మొగముపై; తీర్చిన = బొట్టుగా దిద్దిన; గంగమట్టితోడన్ = గంగలోని మట్టితోను (స్నానము చేయగానే శిష్టులు మృత్తికతో నూర్ధ్వపుండ్రమును పెట్టుకొందురు) చెక్కుటద్దము లందున్ = అద్దములవంటి చెక్కిళ్లపై; జిగివెల్లువలు = కాంతిప్రవాహములు; చిందు = వెదజల్లు; రమణీయ = సుందరమైన; మణికుండలముల తోడన్ = మణులు దాపిన కుండలముల తోను; పసిఁడివ్రాఁత = బంగరుతో అక్షరములుగా నేసిన; చెఱఁగుమిసిమి = అంచుల కాంతి; తోఁపన్ = కన్పడునట్లు; చెలంగు = ప్రకాశించు, అరుణ + అంశుక + ఉత్తరీయంబుతోడన్ = లేయెఱ్ఱని కండువాతోను; సరిలేని = సాటిలేని; రాకట్టు = మణులుపొదుపుటకల; జాళువా మొలకట్టు = బంగారుతో నేయఁబడి మొలకు కట్టు కొనబడిన; బెడఁగారు = అందమైన; సెరు + కావిపింజెతోడన్ = నీటిలో తడుపు చుండుటచే కాషాయ వర్ణము కలిగిన ధోవతితోను; ధవళధవళములగు = తెల్లగానున్న; జన్నిదములతోడన్ = జందెములతోను; కాశికాముద్రయిడిన = కాశీముద్ర చెక్కిన; ఉంగరముతోడన్; శాంతరసమొల్క = శాంతము చిందెడి; బ్రహ్మతేజంబుతోడన్ = బ్రహ్మతేజస్సుతోను; ప్రవరుడు = ప్రవరుడుగా; అయ్యెన్ = మారెను.

తా: నొసట గంగమట్టితో దిద్దిన బొట్టు, రత్నాల కుండలములు, బంగారు జరీనేత నేసిన కండువా, దోవతులు, తెల్లని జందెము, కాశీముద్రయున్న యుంగరమును ధరించి అచ్చముగా ప్రవరునివలె తన మాయాశక్తిచే మారినాడా గంధర్వ కుమారుడు.

క. ఇట యవ్వరూధినియు నొ
క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ ♦ గొలిచి నడువఁగాఁ
జటులఝుళంఝుళరవపద
కటకసమాకృష్టకేళి ♦ కలహంసికయై. 72

టీ: ఇట = ఇక్కడ; అవరూధినియున్ = వరూధినికూడ; ఒక్కొటన్ = ఒక గుంపుగా; కతిపయసఖులు = కొందరు చెలులు; తన్నున్; కొలిచి; నడువగాన్; చటుల = చలించెడి; ఝుళఝుళరవ = ఝుళఝుళమను చప్పుడుకల; పదకటక = కాలి యందెలచే; సమాకృష్ట = ఆకర్షింపబడిన; కేళికలహంసికయై = ఆటగా పెంపబడిన హంసలు కలదై ...

సీ. ఉరగఫూత్కారధూమో ♦ గ్రగంధముఁ బాసి
పోలయుఁ బో యీతావి ♦ మలయపవనుఁ
డనలాక్షుపెడబొబ్బ ♦ నలమిన తలదిమ్మఁ
బాయుఁ బో యీతేంట్ల ♦ పాట మరుఁడు
ఘర్మసామీప్యసం ♦ కలితదాహస్ఫూర్తి
నాఁగుఁ బో యీనీడ ♦ నల్ల మధుఁడు
గరళసౌందర్యాత్త ♦ కరసుధాకటుకత్వ
ముడుపుఁ బో యీతేనె ♦ నోషధీశుఁ
గీ. డనఁగఁ జంపక కురవక ♦ పనస తినిశ
నిచుల వంజుల దాడిమీ ♦ విచికి లామ్ర
పాటలీ పూగ కేసర ♦ ప్రముఖతరుల
సొబగు మీఱు నుద్యానంబు ♦ జొచ్చి యచట. 73

టీ: మలయపవనుడు = పైరుగాలి; ఈతావిన్ — ఈపరిమళముచే; ఉరగ = (మలయ పర్వతముపై మంచి గంధపు చెట్లకు చుట్టుకొన్న) పాముల యొక్క; ఫూత్కార = ఉఫ్ అను బుసల వలని; ధూమ + ఉగ్ర = పొగచే సహింపరాని; గంధమున్ = వాసనను; పాసి = వదలి; పోలయుఁబో = వీచునసుమా; మరుడు = మన్మథుడు, ఈతేంట్లపాటన్ = ఈతుమ్మెదల పాటచే; అనల + అక్షు = అగ్నికన్నుగాకల శివునియొక్క; పెడబొబ్బన్ = హుంకారముచే; అలమిన తలదిమ్మన్ = క్రమ్మినతలనొప్పిని; పాయుబో = విడుచును; అల్లమధుడు = ఆవసంతుడు; ఈనీడన్ = ఈచెట్ల నీడచే; ఘర్మసామీప్య = గ్రీష్మమునకు దగ్గరగా నుండుటచే; సంకలిత = కల్గిన; దాహస్ఫూర్తిన్ = వహింపజేయుటను; ఆఁగుఁబో = ఆపును; ఓషధి + ఈశుడు = చంద్రుడు; ఈతేనెన్ = ఇక్కడ తేనెతో; గరళసౌందర్య = కాలకూటముతో బుట్టినందున; ఆత్త = వచ్చిన; కర = కిరణములందలి; సుధా = అమృతములోని; కటుకత్వము = కారమును; ఉడుపుచో = పోగొట్టుకొనును; అనగన్ = అనునట్లు; చంపక... తరులన్ — చంపక = సంపెఁగ; కురవక = గోరింట; పనస; తినిశ = తివాసము; నిచుల = ఎఱ్ఱగన్నేరు; వంజుల = అశోకము; దాడిమీ = దానిమ్మ; విచికిల = సన్నమల్లె; ఆమ్ర = మామిడి; పాటలీ = కలిగొట్ట; పూగ = పోక; కేసర = సురపొన్న; ప్రముఖ = మొదలైన; తరులన్ = చెట్లచే; సొబగుమీఱు = ఎక్కువ అందముగానున్న; ఉద్యానంబున్ = వనమును; చొచ్చి = ప్రవేశించి అచటన్ = అక్కడ.

తా: ఈయుద్యానములోని వృక్షముల, తీగెల పుష్పఫలాదుల పరిమళము, పూదేనెలచే పైరుగాలిలోని బాధ కల్గించు గుణము, మన్మథుని తలనొప్పి,

వసంతుని తాపము, చంద్రుని అమృతములోని మొగము మొత్తు గుణమును తగ్గుచున్నవి. అన్నట్లుగా నెంతో బాగున్న తోటలోని కేగి అక్కడ...అలం. అప్రస్తుత ప్రశంస, ఉత్ప్రేక్ష.

మ. పవమాన ప్లవమాన పంకజరజః ♦ పాళీ పిశంగచ్ఛవీ
భవదభ్యర్ణ వికీర్ణ కృత్రిమసరి ♦ త్పాథ స్తరంగా హతైం
దవపాషాణ వితర్దికాతలమునన్ ♦ నాళీకపత్రాక్షు లు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవా♦చాప్రౌఢిమ ల్మీఱఁగన్.

టీ: పవమాన...తలమునన్—పవమాన=గాలిచే; ప్లవమాన=తేలుచున్న; పంకజ=పద్మములయొక్క; రజఃపాళీ=ఎక్కువపరాగముచే, పిశంగ+ఛవీభవత్=పసుపుపచ్చగా నగుచున్న; అభ్యర్ణ=సమీపములో; వికీర్ణ=చెదరిన; కృత్రిమ సరిత్=కొలువలయొక్క; పాథ స్తరంగ=నీటి కెరటములచే; ఆహత=కొట్టబడిన; ఐందవపాషాణ=చంద్రకాంతపు రాళ్లచే కట్టబడిన; వితర్దికాతలమునన్=అరుగుపై; నాళీకపత్ర+అక్షులు=స్త్రీలు; ఉత్సవము+ఒప్పన్=వేడుకతో; విహరించుచున్; వాచాప్రౌఢిమల్=మాటలలోని నేర్పులు; మీఱఁగన్=మించగా...

తా: చల్లని గాలి కెగిరిన పుప్పొడితో పచ్చనైన కొలువలోని కెరటములు తాకెడి చంద్రకాంతపు టరుగులపై విహరించుచు నాస్త్రీలు ఒకరి నొకరు మాటలతో మించుచు...

చ. బటువయి విఱ్ఱవీఁగి పరి ♦ పాటిగఁ బూచి పరాగపుంజ మొ
క్కాటఁ గలయంగఁ బర్వఁ గొన ♦ గొమ్మను గోయిల మించ నొప్పెఁ జెం
గటియెలమావి హారరుచి ♦ గందవొడిం గనుపట్టి నీలతా
స్ఫుటతరచూచుకం బగుచు ♦ బొల్చు వనేందిరగుబ్బచన్ననన్.75

టీ: బటువయి=గుండ్రనగానుండి; విఱ్ఱవీఁగి=గుబురుగా పెరిగి; పరిపాటిగన్=అలవాటుగా; పూచి; పరాగపుంజము=పుప్పొడి రాశిని; ఒక్కసారిగా; కలయంగన్=అంతటను; పర్వన్=వ్యాపించునట్లు; కొనగొమ్మను=చివరికొమ్మపైనున్న; కోయిల; మించన్; చెంగటి యెలమావి=దగ్గరలోనున్న మావిగున్న; హారరుచిన్=ముత్యాలహారపు కాంతితోను; గందవొడిన్=గంధపు పొడితోను; కనుపట్టి=కంటికింపుగానున్న; నీలతా=నల్లని రంగుచే; స్ఫుటతర=స్పష్టమైన; చూచుకంబగుచున్=చనుమొన కలదై; పొల్చు=అందముగానున్న; వన+ఇందిర+వనలక్ష్మియొక్క; గుబ్బచన్ను=పెద్ద స్తనమేమో; అనన్=అనునట్లు; ఒప్పెన్.

తా: ఈయెదుటనున్న గుజ్జుమామిడి చక్కగాపూచి, పుప్పొడిపైనంతను క్రమ్ముట చేతను, కొనకొమ్మపై కోకిల వ్రాలియుండుట చేతను, ముత్యాలహారములతోను, గంధపు పూతతోను నల్లగానున్న మొనతోను అందముగానున్న వనలక్ష్మి వక్షముపైన స్తనమో అన్నట్లున్నది. అలం. ఉత్ప్రేక్ష.

తే. వెలఁది యిచ్చటిసంపెంగ ♦ విరులు గహన
దేవతల యిండ్ల నెత్తిన ♦ దీపశిఖలు
గాక యుండినఁ బంచబం ♦ గాళ మగుచుఁ
బాయునే? మత్తమధుకర ♦ పటలతమము. 76

టీ: వెలఁది=చెలీ! ఇచ్చటి సంపెంగ విరులు=సంపెంగ పువ్వులు; గహన దేవతల యిండ్లన్=వనదేవతల యిండ్లమీద; ఎత్తిన=పెట్టిన; దీపశిఖలు=దీపములు; కాకయుండినన్=కాకున్నచో; మత్తమధుకరపటల=మదించిన తుమ్మెదల గుంపనెడి; తమము=చీకటి; పంచబంగాళ మగుచున్=అదృశ్యమగుచు; పాయునే=పోవునా?

తా: సంపెంగ పువ్వులమీద తుమ్మెదలు వ్రాలవు. దానిని పురస్కరించుకొని చెప్పుచున్నాడు. ఈసంపెంగ పువ్వులు వనదేవతల యిండ్లమీది దీపజ్వాలలే, కానిచో తుమ్మెదల గుంపనెడి చీకటి యేల పారిపోవును? అలం. అనుమానము. రూపకము.

చ. అపరిమితానురాగసుమ ♦ నోలసయై చిగురాకుఁ జేతులన్
తపసినిఁ గౌఁగిలించె వని ♦ తా! యిదె రంభ దలంప రంభ దా
నపరిమితానురాగసుమ ♦ నోసలయై చిగురాకుఁ జేతులన్
తపసినిఁ గౌఁగిలించు టుచితంబె♦కదాయన నవ్వె రంభయున్. 77

టీ: వనితా=చెలీ! రంభ=అరఁటిచెట్టు; అపరిమిత=ఎక్కువైన అనురాగ=ఎరుపుకలిగిన; సుమనః+అలసయై=పువ్వుచే వాలినదై; చిగురాకుఁజేతులన్=చిగురుటాకుటను చేతులతో; తపసినిన్ = అవిసెచెట్టును; కౌఁగిలించెన్; ఇదె=ఇదిగో! (అనగా మరొకతె) తలంపన్=ఇదిచూడగా; రంభ=అప్సరస; తాన్=ఆమె; అపరిమిత+అనురాగ = ఎక్కువ అనురాగముకల; సుమనః+అలసయై=మంచిమనసుచే తాళలేనిదై; చిగురాకుఁజేతులన్=చిగురుటాకులవంటి చేతులతో; తపసిని=మునిని; కౌగిలించుట; ఉచితంబెకదా=తగునుకదా! అనన్+అనుటతో; రంభయున్=చెలికత్తెలలో నొకతెగానున్న రంభకూడ; నవ్వెన్.

తా: ఒకచెలి! మరొకతెతో 'చెలీ చూచితివా రంభ తపసిని కౌగిలించినది, అని అవిసెచెట్టు మీదికి వాలిన అరటిచెట్టును చూపి చెప్పగా,' ఆమె 'అవును; రంభ

తపసిని కౌగిలించునులే' అని రంభ మునిని కౌగిలించు కొను నను భావముతో నన్నది. అడివిని రంభ నవ్వినది.

ఆ. కొమ్మ కన్నుఁగవకు ♦ గోరగింపఁగఁ బూచి
తఱచు జొత్తు గ్రిక్క ♦ దాసనంబు
గవియు నీతమాల ♦ గహనాంధకార వి
తానమునకు నుదయ ♦ భానుఁ డయ్యె. 78

టీ: కొమ్మ = చెలీ! కన్నుఁగవకున్ = రెండు కన్నులకును; గోరగింపగన్ = తేరిపార చూచుటకు వీలు లేకుండునట్లు; పూచి = పుష్పించి; తఱచుజొత్తు = ఎక్కువ యెరుపును; గ్రిక్క దాసనంబు = చిమ్మెడి దాసాని చెట్టు; కవియు = వ్యాపించు; నీతమాలగహన = నీ తాపింఛపు చెట్ల అడవి యనెడి; అంధకారమునకున్ = ఎక్కువ చీకటికి; ఉదయభానుడు = ఉదయించుచున్న సూర్యుడు (వలె) అయ్యెన్ = అయినది.

తా: విరియ పూచిన దాసానిచెట్ల యెఱపు కాంతితో తాపింఛపుచెట్లు వ్యాపించినందున వచ్చిన నలుపుకాంతి, సూర్యోదయముతో చీకటి పోవునట్లు పోయినది. అలం. రూపకము.

తే. శ్యామలోపరినిబిడ ప ♦ త్రాభ్రములకుఁ
గాండషండంబు దిగు వాన ♦ కాళ్లు గాఁగఁ
బంకరుహనేత్రి వర్షర్తు ♦ శంక నొసఁగు
పోఁకఁబోదియ నవకంపు ♦ మోకఁ గంటె. 79

టీ: పంకరుహనేత్ర = చెలీ! శ్యామల = ఆకులు ముదిరిన నలుపుకలిగి; ఉపరి నిబిడ = పైనదట్టనగానున్న; పత్ర + అభ్రములకున్ = ఆకులను మేఘములకు; కాండ షండంబు = చెట్ల కాండముల సముదాయము; వానకాళ్లు గాఁగన్ = వానక్రిందికి దిగు నట్లుగ పడుచారికలు కాగా; వర్షర్తుశంకన్ = వర్షఋతువేమోయను సంశయమును; ఒసఁగు = ఇచ్చు; పోఁకబోదియ = పోకబోదెలయొక్క; నవకంపుమోకన్ = నవనవ లాడుచున్న మొక్కలను; కంటె = చూచితివా?

తా: ఇక్కడి పోకచెట్ల ఆకులు మేఘములు క్రమ్మినట్లును, చెట్ల కాండ ములు వానకాళ్ల వలెను, ఉన్నందున వర్షర్తువు వచ్చెనా అనిపించుచున్నది. చూచి తివా! పోకచెట్లెంత నవనవలాడు చున్నవో! అలం. రూపకోత్ప్రేక్షలు.

ఉ. చూతమె డాసి పక్వతర ♦ శుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక
వ్రాతములై వెలుంగు గరు♦వంపుఁగొటారుల నొప్పు తామ్రప

ర్ణీతట మట్లు జీర్ణదళ ♦ బృందసమావృతపాండుర ప్రసూ
నాతిమనోజ్ఞ మూలముల ♦ నర్థి నెసంగు మధూకసాలముల్. 80

టీ: పక్వతర=పండబారిన; శుక్తిపుట=ముత్యపు చిప్పలయొక్క; అంతర లోపలి భాగములందు; దృశ్య = కనపట్టు; మౌక్తికవ్రాతములై = ముత్యముల ప్రోవులు కలవై; వెలుంగు=ప్రకాశించు; గరువంపు=గొప్పవైన; కోటారులన్ =రాసులు పోయు చోటులచే; ఒప్పు=ఒప్పెడి; తామ్రపర్ణీ తటమట్లు=తామ్ర పర్ణీనదీ తీరమువలె; జీర్ణదళ బృంద=పండుటాకుల ప్రోగులచే; సమావృత=కప్ప బడిన; పాండురప్రసూన=తెల్లనిపువ్వులచే; అతిమనోజ్ఞ=మిక్కిలి సుందరములైన; మూలములన్ = మొదళ్లచే; ఎసంగుమధూకసాలముల్ = పెరిగెడి ఇప్పచెట్లను; అర్థిన్ = వేడుకతో; డాసి=సమీపించి; చూతమె=చూచెదమా ?

తా: మొదళ్ల రాలిన పండుటాకులలోనున్న పువ్వులను ప్రోగులను పెట్టగా, ముత్యపు చిప్పలలోనున్న ముత్యాల ప్రోగులు వేసిన తామ్రపర్ణీనదీ తీరమువలె నున్న ఇప్పచెట్లను చూదమా ? (తామ్రపర్ణీనదిలో ముత్యాలు పుట్టునని ప్రసిద్ధి) అలం. ఉపమ.

క. పంకజముఖి విరహులపయిఁ
గింకన్ నిజసైన్యకోటి ♦ కిని సెలవిడు మీ
నాంకుని కరతల మన నల
కంకేళిం జిగురు గాలిఁ ♦ గదలెడుఁ గంటే. 81

టీ: పంకజముఖి=చెలీ! విరహులపైన్=వియోగుల మీదికి; కింకన్=కోప ముతో; నిజసైన్య కోటికిని=తన సేనాసముదాయమునకు; సెలవిడు—దండయాత్రకు వెళ్లుటకు సెలవిచ్చెడి; మీనాంకుని = మన్మథుని యొక్క; కరతలమనన్ = అర చేయియో యన్నట్లు; అలకంకేళిన్ = ఆ అశోక వృక్షమున; చిగురు; గాలిన్= గాలిచే; కదలెడున్=కదలుచున్నది. కంటే=చూచితివా ?

తా: మన్మథుడు ప్రోవైన సేనలను దండయాత్రకు వెడల నాజ్ఞాపించు అర చేయియో యన్నట్లు కదలుచున్న అశోక పల్లవమును చూడుము. అలం. ఉత్ప్రేక్ష.

చ. నునుఁజిగురాకు మేయుతరి ♦ నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలం గువ కు ♦ వధ్వనిఁ బాఱు పికాంగనం బికం
బనునయ మొప్ప మాన్పఁగతి♦నాత్మముఖంబుముఖంబుఁ జేర్చిచుం
బన మొనరించె సందుసుడి ♦ మాయలుగా మగవారికృత్యముల్.82

టీ: నునుఁజిగురాకున్ = మెత్తని చిగురుటాకును; మేయుతఱిన్ = తిను నప్పుడు; నోరికెలంకులన్=చెలవ్రులందు; తేటి=ఆకుమీది తుమ్మెద; కుట్టి

నన్ = సుట్టగా కుహుకుహుధ్వనిన్ = కుహుకుహుమని కూయుచు; వనతరుశాఖలన్ = చెట్ల కొమ్మల మీఁదుగా; పాంసుపికాంగనన్ = పర్విత్తెడి ఆడుకోయిలను; పికంబు = మగకోయిల; అనునయ మొప్పన్ = బతిమాలుట కన్పడునట్లు; మాన్పుగతిన్ = పర్వెత్తుటమాన్పునట్లు; ఆత్మముఖంబు = తనముఖమును; ముఖంబున్ = దానిముక్కును; చేర్చి; చుంబన మొనరించెన్ = ముద్దు పెట్టుకొనెను; మగవారి కృత్యముల్ = మగవారు చేయుపనులు; సంగసుడి మాయలుగా = సందుచూచుకొని మాయగాచేయు పనులే కదా!

తా: ఆడుకోకిల చిగురుటాకు కొరుకగా దానిమీఁద వ్రాలియున్న తుమ్మెద కుట్టినది. బాధ కలిగి ఆడుకోకిల కుహుకుహు కూయుచు పరుగెత్తుచుండగా మగకోకిల పరుగెత్త వలదని బతిమాలుచున్నట్లు దాని నోటిలో నోరుపెట్టి ముద్దు పెట్టుకొనుచున్నది. కొంచెము సందు దొరికినచో మాయగా తమ పని నెరవేర్చుకొందు రీమగవారలు. అలం. అర్థాన్తరన్యాసము.

క. అని పొగడుచు నొయ్యారపు
టనువున జడ లల్లి జిలుఁగు ♦ లగు పయ్యెదలన్
జనుకట్లు గట్టి గట్టిగ
ననిమిష కాంతలు లతాంత ♦ హరణోత్సుకలై. 83

టీ: అనిమిషకాంతలు = దేవతాస్త్రీలు; అని పొగడుచున్ = ఇట్లు ఉద్యానమును వర్ణించుచు; లతా + అంత = పువ్వులను; హరణ + ఉత్సుకలై = కోయు వేడుక కలవారై; ఒయ్యారము + అనువునన్ = విలాసముతో కూడిన రీతితో; జడలల్లి; జిలుఁగులగు = సన్నని; పయ్యెదలన్ = పైటలతో; గట్టిగన్; చనుకట్లు + కట్టి = రవికెలపై గట్టిగా గట్టుకొని; (వెల్లిరని అధ్యాహారము చేసికొననగును.)

తా: ఆ దేవతాస్త్రీలు ఉద్యాన శోభను పొగడి పూవులుకోయు వేడుకతో పైటలను రవికెలపైబిగియ కట్టుకొని కోయనారంభించిరి.

—:ర గ డ:—

నేర్పుమై నల్లయది ♦ నెఱులఁ దోలుపూఁ దుఱిమె
దర్పకున కర్పింపఁ ♦ దలఁప దెంతటి పెరిమె
యింతి పావురపుఱొద ♦ యేల విని దారజము
వింతయే విరహిణుల ♦ వెతఁ బెట్టు బేరజము
సురపొన్నకొమ్మినవలు ♦ సొచ్చి నలుగడ వెదకు
తరుఁగ దండులతావి ♦ తండంబు కొమ్మెదకు
నటిమినునుఁ జివురునకు ♦ నగునె కంటక మాడఁ

జాలుకు మని వేఱొక్క ♦ చోటఁ గంటక మాడఁ
గుందములు నీకొసఁగఁ ♦ గూర్చితిని గైశికము
నిందులకు వెల యడుగ ♦ నేల విడు వైశికము
చిఱుదేంట్ల కొసఁగె గు ♦ జ్జనఁగూళ్లు గొజ్జంగ
నెఱుఁగ కది పూవంద ♦ నేల యిటు రజ్జంగ
నెదిరింపఁ బోలు నీ ♦ వింతి రతిపతిఁ దెగడఁ
బొదలఁ జిగురులు తుదలఁ ♦ బూచి యున్నది పొగడ
పుడుకు మల్లన గంద ♦ వొడికి నీ ప్రేంకణము
దడయ కిటు నీ కిత్తుఁ ♦ దగ రత్నకంకణము
నెఱసిపోఁ జూచెదవు ♦ నిలునిలువుమా కనము
గురియు తేనెల జేబు ♦ కొన్న దంతట వనము
కా దల్ల యది ఫుల్ల ♦ కంకేళి పన్నిదము
మోదు గోడిననీదు ♦ ముత్యాలజన్నిదము
ఏటవాలైనయది ♦ యీయరఁటిబాలెంత
చేటునకె యగుచూలు ♦ చేఁ గలుగుమే లెంత
నెలఁత యీగేదంగి ♦ నీ కబ్బె బుక్కాము
చిలుకు నీపుప్పొళ్లు ♦ చెంచెతల బుక్కాము
మితిలేని తేనె నా ♦ మెత చేసె విరవాది
యితరలతికల మరగి ♦ యేఁగునది పరవాది
కలిగొట్లు ప్రాఁకువే ♦ డ్కలె నీకుఁ దఱచెదను
నళినాక్షి కడిమిగం ♦ డమున కే వెఱచెదను
గురువింద నదె గిలుబు ♦ కొనియెఁ బయ్యెరదొంగ
విరులఁ గరికుంభకుచ ♦ వెరఁజుమై యర గ్రుంగ
మెరమెరని కొలనిదరి ♦ మీలంచు లకుముకులు
మరిగె నీకనుదోయి ♦ మాయింపు చకచకలు
ఏకాంత మని తొలఁగె ♦ దిందు నీవఱె వేఱు
చేకొనవె మున్నాడి ♦ చెలువ యీవటివేరు
అరిది యీయేడాకు ♦ లరఁటి నగు కప్పురము

సరిరాదు దానికల ♦ శశియొడలు కప్పురము
పాళి కల్లది పోఁకఁ ♦ బాఱఁకబందము దెగియె
నాళి యది దిగజారు ♦ నట్టిచందము నగియె
మలయపవనునిఁ బిలిచె ♦ మావి బళి యీవేళ
మలయు కోవెలపంచ ♦ మస్వరం బను నీల
సులభమై దొరకె మం ♦ జులవాణి చంపకము
చిలుకవన్నెపుఁబొదలు ♦ చేరి యిఁక వంపకుము
చనకుఁ డిఁక దవ్వులకు ♦ సఖులార పువ్వులకు
ననుచు నలరులు గోసి ♦ రతివ లల్లన డాసి. 84

టీ: (ఈ పద్యమున పూలు కోయునప్పటి దేవతాస్త్రీల సంభాషణ రీతి చెప్ప బడినది.) అల్లయది=ఆమె; నేర్పుమైన్=నేర్పుతో; తొలుపూన్ = మొదట కోసిన పువ్వును; నెఱులన్=తలలో; తుఱిమెన్=ముడుచుకొనెను; దర్పకున కున్=మన్మథునికి; అర్పింపఁదలపదు=ఇయ్యదలంప లేదు; ఎంతటిపెరిమె=(పువ్వుపై) ఎంత ప్రేమయో? ఇంతి=చెలీ! పావురము+పొద=పావురపు కూతను; ఏలవినెదు =విందువేలనే? ఆరజము=అది ఇంపుగానున్నదే; ఐంతయే = ఇదెప్పుడును విని యెరుగనిదా? విరహిణులకున్=వియోగము కల స్త్రీలకు; వెతబెట్టుబేరజము= బాధపెట్టునట్టి కుత్సితమైనది; సురపొన్నక్రొన్ననలు = సురపొన్న చెట్టుయొక్క క్రొత్త పూలను; చొచ్చి=ప్రవేశించి; నలుగడన్=నలుమూలల; వెదకు=వెద కుము, అంగులతానితండంబు=అందలి తీగెలజొంపము; క్రొత్త+వెదకున్=క్రొత్త దైన కొప్పునకు; తఱుఁగగు=తీసిపోగు; అఱిమి=గొంటి; ననున్; చివురునకున్ =చిగురునకై; కంటకమాడన్=కఠినముగా పలుకగా; అగునె=తగునా? వేఱొక్క చోటన్=మరొకచోట; కంటకము=ముల్లు; ఆడన్ = నాటుకొనగా; చుఱుకు మనెన్ = చురుక్కుమన్నది. కుందములు = బొండుమల్లెలలను; నీకొసఁగన్ = నీకియ్యను; కైశికమున్=కొప్పులో; కూర్చితిన్=పెట్టుకొంటిని; ఇందులకున్; వేల; అడుగనేలా? వైశికమున్=వేశ్యాత్వమును--వంచనను; విడు=విడువుము; గొజ్జం గన్=గొజ్జంగిపొదను; చిఱుదేంట్లకున్=చిన్న తుమ్మెదలకు; గుజ్జనగూళ్లు; ఒస గెన్=ఇచ్చెను; అది=ఆస్త్రీ; ఎఱుగక=తెలియక; పూవు+అందన్=పువ్వుముట్ట గనే; ఇటు=ఇట్లు; రజ్జగన్=నిష్ఠురములాడుట; ఏల=ఏమిటికి? ఇంతి=చెలీ! నీవు; రతిపతిన్=మన్మథుని; తెగడన్=నిందించుటకు; ఎదిరింపబోలున్=అతడు నిన్నెదిరించి యుండవచ్చును; (కొన) పొగడ=పొగడచెట్టు; తుదలన్=కొమ్మ కొనలందు; చివురులు=చిగుళ్లు; పొదలన్=పెరుగగా; పూచియున్నది; ఈప్రేంక ణమున్=ఈప్రియాళువృక్షమును; గందవొడికిన్=గంధపు పొడిలోనికి; అల్లనన్= మెల్లగా; పుడుకుము=మునివ్రేళ్లతో కోయుము; ఇటు; తడయకు=ఆలసించకుము;

తెగన్=జాగ్రత్తగా కోసినందులకు; నీకున్; రత్నకంకణము; ఇత్తున్; నెరసిపోన్ =పారిపోవుటకు; చూచెదవు; నిలునిలువుమా=ఆగుమాగుము (అత్యాదరేద్విరుక్తి) కనము=చూడము; కురియుతేనెలన్=పూలనుండికురియుతేనెలచే; వనము=ఉద్యానము; అంతటన్=అంతయు; జీబుకొన్నది=సందులేకున్నది; అల్లయది=ఆదూరమున కన్పడునది; ఫుల్లకంకేళి=వికసించిన యెఱ్ఱని అశోకపు చెట్టు; కాదు; అది మోహనగ్రమాను (అని మఱొకతె యనగా) ఓడినన్; పన్నిదము=పందెమేమి? సిరుముత్యాల జన్నిదము=జందెమువలె వేసికొన్న ముత్యాల పేరు; (అనెను) ఈయరటి బాలెంత=గెలవేసిన అరటిచెట్టు; ఏటవాలైనయది=వంగినది; చేటునకే=తనచావునకే; అగుమాలు మేలు=అయిన ఆకడుపు వచ్చినందుననైనమంచి; ఎంత=ఏమిటి? (పాపము! అనవసరముగా గెలవేసినదే అని భావము) నెలఁత=చెలీ! ఈగేదంగిన్ =ఈపచ్చ మొగలియందు; బుక్కా=గందవొడి; నీకబ్బెన్ = నీకేదొరికినది; చిలుకు+ఈపుష్పాళ్లు=రాలెడి యీపుష్పాళ్లు; చెంచెతలబుక్కాము = చెంచు స్త్రీలకు గందవొడియగును; విరవాది=విరజాజితీగ; మితిలేని తేనెన్=ఎక్కువైన పూదేనెను; ఆమెతచేసెన్=(తుమ్మెదకు) విందుచేసెను; అది=ఆతుమ్మెద; పరవాది=అత్రమెక్కువ కలది; మరిగి=అలమరిగి; ఇతరలతలకున్=తక్కిన తీగెలకు; ఏగున్=పోవును, నలినాక్షి=చెలీ! నీకున్; ఎదన్=మనసునందు; కలిగొట్లు= పాదిరిచెట్లను; ప్రాఁకువేడ్కలె=ఎగప్రాకెడి కోరికలే; తఱచు=ఎక్కువ; ఏన్= నేను; కడిమిగండమునకున్=అపాయమునకు; వెఱచెదను = భయపడెదను; కరికుంభకుచ=చెలీ! అదె=అదిగో; పయ్యెరదొంగ=దొంగయైనగాలి; గురివెందన్ =బండిగురివింద తీగను; గిలుబుకొనియెన్=కొల్లగొట్టెను; మై=శరీరము; అరగ్రుంగన్=సగము వంగగా; విరులన్=పూలను; వెరఁజు=కోయుము; లకుచుకులు= పక్షులు; మెరమెరని = మెరసెడి; కొలనిదరివీలు = సరస్సుగట్టునోర నున్న చేపలు; అంచున్=అనుకొని, నీకనుదోయిన్=నీరెండు కన్నులను; మరగెను= కోరెను, చకచకలు=కన్నుల కాంతులను; మాయింపు=అణచుము; ఏకాంతమని =రహస్యమని; తొలఁగెదు=దూరముగా పోదువు; ఇందున్=మాలో; వేఱు= పరాయి దానవు; నీవటె=నీవా? చెలువ = చెలీ! ఈవటివేరు = ఈవట్టివేరు; మున్నొడి=ముందుగా; చేకొనవె=తీసికొనవే; ఈయేడాకులరఁటిన్ = ఈఅరటిచెట్టునందు; అగుకప్పురము=తయారగు కర్పూరము; అరిది=దుర్లభము; దానికిన్ =ఆకర్పూరమునకు, అలశశియొడలును=ఆచంద్రుని శరీరముకూడ; సరిరాదు= పోలదు; ఊరము=చంద్రుని రొమ్ము; కప్పు=నలుపు. అల్లది=ఆచిన్నది; పాళికున్=పూవుగెలకై; పోఁకన్=పోకచెట్టును; ప్రాఁకన్ = ఎగబ్రాకుచుండగా, బందము=ప్రాకుటకు వీలుగా రెండు కాళ్లకు తగిలించుకొన్న త్రాడు; తెగెయెన్; ఆళి=చెలికత్తె; అది దిగజాఱునట్టి చందము = ఆమె పోకచెట్టునుండి క్రిందికి జారిపోవుటను; (చూచి) నవ్వెన్; మావి = మామిడిచెట్టు; ఈవేళ; మలయు= తనపై సంచరించెడి; కోవెల = కోకిలయొక్క; పంచమస్వరంబు=వీణవలన పుట్టు

స్వరమువంటి స్వరమును; అనుసిలన్ = అనుకొనునట్టి కూతచే; మలయపవనునిన్ = పైరుగాలిని; పిలిచెన్; ఓసీ! మంజులవాణి = ఓసీ! చంపకము = సంపెంగ; సులభమై = తేలికగా; దొరకెన్; అన్నెపుబోదలు = తక్కిన తీగెలు; చిలుకవు = పువ్వులను రాల్చవు; ఇకన్ = ఇంక; చేరి = వాని దగ్గరకేగి; వంపకుము = కొమ్మలను వంచకుము; సఖులార — చెలులారా! పువ్వులకున్ = పువ్వులకై; ఇకన్ = ఇంక; దవ్వులకున్ = దూరమునకు; చనకుడు = పోకుడు; అనుచున్ = అని చెప్పుకొనుచు; అతివలు = స్త్రీలు; డాసి = అందరును కలిసికొని; అల్లనన్ = మెల్లగా; అలరులు = పువ్వులను; కోసిరి.

క. నాళీకమధూన్మత్త మ
రాళీముఖరాళి సుఖక ♦ రంబగు కొలనం
గేళీలాలసగతి డిగి
యాళీనివహంబు లోల ♦ లాడెడి వేళన్. 85

టీ: నాళీక = తామరపువ్వుల యొక్క; మధు = మకరందముచే; ఉన్మత్త = మదించిన; మరాళీ = ఆడుహంసలవలనను; ముఖర = రొదచేయు; ఆళి = తుమ్మెదలవలనను; సుఖకరంబగు = సుఖమునిచ్చు; కొలనన్ = సరస్సులో; కేళీలాలసగతిన్ = విలాసమైన రీతిగా; డిగి = దిగి; ఆళీనివహంబులు = చెలికత్తెలందరును; ఓలలాడెడి వేళన్ = ఓల-ఓలయని కేకలు వేయుచు ఈదులాడునప్పుడు. (ముందున కన్వయము)

ఉ. వాడినమోముఁదమ్మి తెలి ♦ వాలికకన్నులు విన్నఁబోవఁ దో
నాడక నెన్నొసల్ కరము ♦ నం దిడి తీరనిషణ్ణయై జలం
బాడఁగఁ బిల్చువారి నొక ♦ హస్తపుమ్రొక్కున నాడు డంచుఁ దాఁ
జూడక చూచుచూడ్కి నల ♦ జోటి దిశల్ పరికింప నొక్కచోన్. 86

టీ: అలజోటి = ఆవరూధిని; వాడిన = దీనముగానున్న; మోముదమ్మి = తామరపువ్వువంటి ముఖమును; తెలి = తెల్లని; వాలిక = నిడుపైన; కన్నులు; విన్నబోవన్ = చిన్నపోయి యుండగా; తోన్ = చెలులతో; ఆడక = జలక్రీడలాడక; నెఱనొసలు = అందమైనమోమును; కరమునందున్ = చేతియందు; ఇడి = పెట్టుకొని; తీరనిషణ్ణయై = గట్టునకూర్చున్నదై; జలంబాడగన్ = ఈదులాడుటకు; పిల్చువారిన్ = పిల్చునట్టివారికి; ఒకహస్తపుమ్రొక్కునన్ = ఒంటిచేతి దండముతో; ఆడుడు = మీరాడుకొనుచు; అంచున్ = అనిచెప్పుచు; తాన్ = తాను; చూడక = వారికేసియైనను చూడ ఇష్టములేక; చూచుచూడ్కిన్ = చూచెడిచూపుతో; దిశల్ = నలుమూలలు; పరికింపన్ = చూడగా; ఒక్కచోన్ = ఒక్కచోట...

తా: ఆవరూధిని చిన్నబోయిన మొగమును చేతిపై నానుచుకొని జలక్రీడలాడుటకు హితవులేక గట్టున కూర్చుండి, తన్ను రమ్మని పిల్చెడి చెలికత్తెలను ఒక్క చేతితోనే 'నమస్కారము. మీరాడుకొనుడు నన్ను చంపక' అన్నట్లు మ్రొక్కుచు నాల్గువైపుల చూచినది. ఒక్కచోట...

మాలిని.

రవిరుచిఁ ద్రసరేణు ♦ వ్రాతముల్ మించువాత్యా
నివహనిహతిలో నిం ♦ దిందిరశ్రేణు లాడం
గువలయఘనకుల్యా ♦ కూలవల్లీవనీ సం
భవము లగుచు మింటం ♦ బర్వు పుష్పాళిలోనన్. 87

టీ: రవిరుచిన్ = సూర్యకాంతిలో-ఎండలో; త్రసరేణువ్రాతముల్ = (మూడణువులు కలిసినది త్రసరేణువు) నలుసుల సముదాయము; మించు = ఎక్కువగానున్న; వాత్యానివాహ = సుడిగాలుల; నిహతిలోన్ = వీచుటలో; ఇందిందిరశ్రేణులు = తుమ్మెదల బారులు; ఆడన్ = సంచరింపగా; కువలయఘన = ఎక్కువగా కలువలున్న; కుల్యాకూల = కాలువలయొడ్డనున్న; వల్లీవనీ = తీగజొంపమున; సంభవము లగుచున్ = పుట్టినవై; మింటన్ = ఆకాశమున; పర్వు = వ్యాపించు; పుష్పాళిలోన్ = పుష్పపరాగములలో...

తా: సుడిగాలులు వీచుచు దుమ్ము నెగురగొట్టగా తుమ్మెదలు తిరుగాడుచున్నవి. కలువ లెక్కువగా నున్న కాలువల గట్లపైనున్న లతలనుండి పైకెగిరిన పూపరాగములలో...

సీ. పసిఁడితోరముతోడి ♦ బాహు వల్లన యెత్తి
సారెకుఁ బాదలపైఁ ♦ జాఁచి చాఁచి
బింబాధరంబు గం ♦ పింప నొయ్యన విపం
చీ స్వరంబున జట ♦ సెప్పి సెప్పి
దిశలమార్గాన్వేషి ♦ దీర్ఘలోచనదీప్తి
గణముచేఁ దోరణ ♦ గట్టి కట్టి
కమనీయతనుకాంతి ♦ కనకద్రవంబున
నారామరంగంబు ♦ నలికి యలికి

గీ. యానితంబవిలంబి కా ♦ లాహికల్ప
ఘనకచగ్రంథి నచటిభృం ♦ గముల కసిత
దీధితుల వడ్డి కొసఁగుచు ♦ దేవపూజ
విరులు చిదిమెడి కపట భూ ♦ సురునిఁ గనియె. 88

టీ: పసిడితోరముతోడి = బంగారు తోరమున్న; బాహువు = చేతిని; అల్లన = మెల్లగా; ఎత్తి; పాదలపైన్ = సారెకున్ = మాటిమాటికి; చాచిచాచి = చాచుచు; బింబ+అధరంబు = దొండపండువంటి క్రింది పెదవి; కంపింపన్ = కదలగా; ఒయ్యనన్ = తిన్నగా; విపంచీస్వరంబునన్ = వీణవంటి కంఠ స్వరముతో;

జట = వేదములో పదములను జట యల్లినట్లు ముందు వెన్కలకు త్రిప్పుచు చెప్పుట; చెప్పిచెప్పి; దిశలన్ = దిక్కులందు; మార్గ+అన్వేషి = త్రోవవెదకెడి; దీర్ఘలోచన = పొడవైన కన్నులయొక్క; దీప్తిగణముచేన్ = కాంతిపుంజముచే; తోరణగట్టికట్టి = తోరణమువలె చూచుచు; కమనీయ = ఇంపైన; తనుకాంతి = శరీర కాంతియను; కనకద్రవంబునన్ = బంగారు ద్రవముతో; ఆరామరంగంబున్ = తోట ప్రదేశమునంతను; అలికియలికి; ఆనితంబ = పిరుదులవరకు; విలంబి = వ్రేలాడు; కాలాహికల్ప = నల్లత్రాచువంటి; ఘనకచగ్రంథిన్ = పెద్దజుట్టు ముడిని; అచట; భృంగములకున్ = తుమ్మెదలకు; అసితదీధితులు = నల్లని కాంతులను; వడ్డికొసగుచున్ = అప్పిచ్చుచు; దేవపూజవిరులు = దేవతార్చనకై పువ్వులను; చిదిమెడు = కోయుచున్న; కపటభూసురునిన్ = మాయబ్రాహ్మణుని; కనియెన్ = చూచెను.

తా: ప్రవరుని రూపము ధరించి గంధర్వుడు బంగారు తోరముకట్టుకొన్న చేతిని మెల్లగా ఎత్తి పువ్వులకై పొదలమీదికి చాచుచు, పెదవికదలుచు అందగించునట్లు వీణాస్వరమువలె పలుకుచు వినసొంపుగాను వేదము పఠించుచు, త్రోవవెదకుచున్నట్లుగా నాల్గుమూలలకు చూచుచు, శరీరకాంతిచే ఉద్యానమును పూతపూచినట్లు చేయుచు, నల్లనిజుట్టును వ్రేలిముడివేసికొని పిరుదులవరకు వ్రేలాడవేసి దేవతార్చనకై పూలు కోయుచుండెను. ఆమె అతనిని చూచినది. అలం ఉపమ, పరిణామము, నిదర్శనయును..

ఉ. కాంచి కలక్వణత్కనక ♦ కాంచికయై యెదురేఁగి యప్పుడ
కాంచనకేతకీ కుసుమ ♦ గాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచలవీథిఁ దాఁటుచు ఘ ♦ నాంత చలచ్చపలాకృతిం గలం
గాంచిన వస్తువుం దెలిసి ♦ కాంచిన యట్లనురక్తిఁ గాంచుచున్. 89

టీ: కాంచి = చూచి; ఆ+కాంచనకేతకీకుసుమగాత్రి = బంగారుమొగలిరేకువంటి శరీరముకల యా వరూథిని; అప్పుడు; వయస్యలన్ = చెలికత్తెలను; డించి = విడిచి; కలక్వణత్ = మధురముగా చప్పుడగు; కనకకాంచికయై = బంగారు గంటల మొలత్రాడు కలదై; ఎదురేగి; ఘన+అంత = మేఘముల చివర; చలత్ = కదలుచున్న; చపలా+ఆకృతిన్ = మెరుపువలె, తత్ = ఆ; నికుంజ + అంచలవీథిన్ = పొదరిండ్లయొక్క చివరి పంక్తిలో; తాటుచున్ = ఒదిగి యొదిగి వెళ్లుచు; కలన్ = కలలో; కాంచిన వస్తువున్ = చూచిన వస్తువును; తెలిసి = నిద్రమేల్కాంచి; కాంచినయట్లు = చూచినట్లు; అనురక్తిన్ = అనురాగముతో; కాంచుచున్ = చూచుచు...

తా: వరూథిని ప్రవరుడుగా మారిన గంధర్వుని చూచి ప్రవరుడే అనుకొని కలలో చూచిన వస్తువును మేల్కొన్నాక చూచినంత సంతోషముతో చెలులుకైనను చెప్పక తానొక్కతెయే అతడున్న పొదరింటి దగ్గరకు పొంచి పొంచి మేఘముల వెంట మెరపువలె వెళ్లుచు...అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, నిదర్శనయు.

ఉ. ఆకమలాక్షి యింపున దృ ♦ గంచల మించుక మూసి హర్షబా
ష్పాకులకోణశోణరుచు ♦ లగ్రమునం జనఁ జూచు చూపు తీ
రై కనుపట్టెఁ దమ్మరస ♦ మంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైకధురీణతం గఱచి ♦ యేసిన సింగిణికోలయో యనన్. 90

టీ: ఆకమలాక్షి=ఆవరూధిని; ఇంపునన్=సంతోషముతో; దృక్+అంచలము=కంటికొనను; ఇంచుక=కొద్దిగా; మూసి; హర్షబాష్ప=సంతోషము వలన వచ్చిన కన్నీళ్లతో; ఆకుల=వ్యాకులమైన, కోణ=కనుకొలకుల; శోణరుచులు=ఎఱ్ఱని కాంతులు; అగ్రమునన్=ముందునకు; చనన్=పోవునట్లు; చూచుచూపు; తీరై=అందమై; వెడవింటివాడు=మన్మథుడు; క్రోధ+ఏకధురీణతన్ = కోపమే కలిగి; తమ్మరసము=తాంబూలపు రసమును; అంటుకొనన్=అంటునట్లుగా; కఱచి=పెదవికొరుకుచు; ఏసిన=కొట్టిన; సింగిణికోలయోయనన్ = వింటిబాణమోఅను నట్లు; కనుపట్టెన్=కన్పడెను.

తా: అప్పుడావరూధిని ప్రియుడు లభించెనను సానందముతో నీరుక్రమ్మ, కొలకుల నెఱ్ఱనైన చూపులతో చూచుచుండెను. ఆచూపు కోపముతో మన్మథుడు వదలిన బాణమేమో అన్నట్లున్నది. అలం. ఉత్ప్రేక్ష.

సీ. తొలుదొల్త వానిఁ గ ♦ న్నులఁ గాంచినప్పుడ
పల్లవాధరగుండె ♦ జల్లు మనియె
నట రెండుమూఁడంజ ♦ లరుగు నప్పుడ కాళ్లఁ
బంకజాక్షికిఁ దొట్రు ♦ పాటు గదిరె
డాయంగఁ జనునప్పు ♦ డ ముఖాంబుజంబునఁ
గంబుకంధరకు దై ♦ న్యంబు దోఁచెఁ
గదిసి నిల్చిన యప్డు ♦ కనుదోయి ఱెప్పల
లలనకు మిగులఁ జం ♦ చలత బెరసెఁ

గీ. గటకటా యనునపుడ గ ♦ ద్గదిక వొడమెఁ
జెఱఁగువట్టిన యపుడ లేఁ ♦ జెమట గ్రమ్మె
సొలసి మాటాడ నుంకింపఁ ♦ దలఁచి మోముఁ
దేఱుకొనఁ జూచునపుడ క ♦ న్నీరు వొడమె. 91

టీ: తొలుదొల్తన్=మొట్టమొదట; వానిన్=మాయప్రవరుని; కన్నులన్=కన్నులతో; కాంచినప్పుడ=చూచినప్పుడే; పల్లర+అధర=చిగురువంటి పెదవికల వరూధినియొక్క; గుండె; జల్లుమనియెన్; అట = అక్కడ; రెండుమూఁడు; అంజలు=అడుగులు; అరుగునప్పుడ=వేయగానే; పంకజాక్షికిన్=ఆమెకు; కాళ్లన్

= పాదములందు; తొట్రుపాటు = తడబడుట; కదిరెన్ = కల్గెను; డాయంగన్ = సమీపించునట్లు; చనునప్పుడ = వెళ్లునప్పుడే; ముఖ+అంబుజంబునన్ = పద్మము వంటి ముఖమునందు; కంబుకంధరకున్ = శంఖమువంటి కంఠముకల వరూధినికి; దైన్యంబు = దీనత్వము; తోఁచెన్ = కన్పడెను; కదిసి = సమీపించి; నిల్చినయప్డ = నిల్చినప్పుడే; కనువోయి ఱెప్పలన్ = రెండుకంటి రెప్పలందును; లలనకున్ = ఆమెకు; నిగులన్ = మిక్కిలి; చంచలత = ఆగకుండ కదలుట; పెరసెన్ = కల్గెను; కటకటా యనునప్పుడ = అయ్యో! ఎంతపని చేసితివి! అనునపుడే; గద్గదిక = కంఠము బొంగురువోయి మాటరాకుండుట; పొడమెన్ = కల్గెను; చెఱఁగు+పట్టినయపుడ = అతని కండువా చివరను పట్టుకొన్నప్పుడే; లేఁజెమట = చిరుచెమట; క్రమ్మెన్ = వ్యాపించెను; సొలసి = అలసిపోయి; మాటాడన్ = మాట్లాడుటకు; ఉంకింపదలఁచి = ప్రయత్నము చేయబోయి; మోము = ప్రవరుని ముఖమును; తేఱుకొనన్ = తేరిపార; చూచునపుడ = చూచుచుండగా; కన్నీరు = ఆనందముతో కన్నులనీరు; పొడమెన్ = పుట్టెను.

తా: ఆమాయ ప్రవరుని చూడగనే వరూధినికి గుండె జల్లుమన్నది. రెండడుగులు వేయగానే కాళ్లు దడదడ లాడినవి. దగ్గరకేగు సరికి ముఖము దీనమైనది. దగ్గరకేగి నిలువగా కనురెప్పలు కదలినవి. అయ్యో! ఎంత మోసము చేసి వెళ్లితివి? అని యింకను ఏమేమో అనబోవుసరికి కంఠము వెకిలి మాట రాలేదు. అతని కొంగు పట్టుకొనగానే లేజెమట పట్టినది. ఎట్లో తనకు కల్గిన తొందరవలని భావములను సర్దుకొని, అలసి, అతనికేసి తేరిపార చూచుచుండగా కన్నుల నీరు క్రమ్మినది. అలం. స్వభావోక్తి.

క. పాటితకరిదంతద్యుతి
 పాటచ్చరగండఫలక ♦ భాగంబులపైఁ
 గాటుకకన్నీ రొలుకఁగ
 మాటవెడలఁ గ్రేటుకొనుచు ♦ మానిని పలికెన్. 92

టీ: మానిని = వరూధిని; పాటిత = బ్రద్దలుచేయ బడిన; కరిదంత = ఏనుగు దంతములయొక్క; ద్యుతి = కాంతికి; పాటచ్చర = దొంగలైన; గండఫలక = పలకలవంటి చెక్కిళ్లయొక్క; భాగంబులపైన్ = ప్రదేశములమీద; కాటుకకన్నీరు = కాటుకతో కలిసిన కన్నీరు; ఒలుకగన్ = కారగా; మాటవెడలన్ = మాటబయటికి వచ్చుటకై; క్రేటుకొనుచున్ = గొంతుక సవరించు కొనుచు; పలికెన్;

తా: ఆవరూధిని విరహముచే పాలిపోయిన చెక్కిళ్లనుండి కాటుక కలిసిన కన్నీరు కారుచుండగా ఎట్లో మాట రప్పించు కొనుటకై గొంతుక సవరించుకొనుచు పల్కెను. అలం. ఉపమ, స్వభావోక్తియు.

ఉ. ఏలర యీచలం బుడిగి ♦ యేలర బాలరసాల మాలతీ
 జాలములో శశాంకకర ♦ జాలములో వలవంత నొంద్రివుల్

జాలుగ నాల్గుజాలు నిఁకఁ ♦ జాలు భవం బనునంత కాఁకకుం
బాలయి రాత్రి పంచశరు ♦ బారికిఁ జిక్కితి నీకు దక్కితిన్. 93

టీ: ఈ చలంబు=ఈ పెంకితనము; ఏలర=ఎందుకురా? ఉడిగి=మాని; బాలరసాల=లేతతియ్య మామిడి యొక్క; మాలతీ=జాజిపొదలయొక్క; జాలములోన్=గుంపులో; ఏలర = నన్నేలుకోరా! రాత్రి = కడచిన రాత్రి; నాల్గు జాలున్=నాల్గుజాములును; వలవంతన్=మన్మథతాపముతో; అశ్రువులు=కన్నీళ్లు; జాలుగన్=ప్రవహించగా; శశాంకకర జాలములోన్ = చంద్రకిరణములో-వెన్నెలలో; భవంబు=జన్మము; ఇక+చాలు=ఇంతేచాలు; అనునంతకున్=అనుభావము పుట్టు నంతటి; కాకకున్=తాపమునకు; పాలయి=లోబడి; పంచశరుబారికిన్= మన్మథుని హింసకు; చిక్కితిన్=లోనైతిని; నీకున్; దక్కితిన్.

తా: ఓయీ! ఏమిపట్టుదల? ఈ మామిడిగున్నలమధ్య, జాజిపొదలలో నాతోకూడి సుఖింపుము రా! వెన్నెలలో బ్రతుకుపై అసహ్యముపుట్టి నిన్నరాత్రి యంతయు నెంతో తాపముతో బాధపడితిని. ఇప్పటికి నీకు దక్కితిని.

శా. రా వైరాగ్యముఁ బూని నీవు కడు ని ♦ ర్దాక్షిణ్యచిత్తంబునన్
రానైతేఁ జవిగాని యిందులకు హా ♦ రాహారిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా బ్రిమకు నీ ♦ వాచారవంతుండవై
చావో యెక్కుడొ నీయెడం బొడము వాం ♦ ఛన్ భూసురగ్రామణీ. 94

టీ: భూసురగ్రామణీ=బ్రాహ్మణశ్రేష్ఠుడా! రా=రమ్ము; నీవు; కడున్ =మిక్కిలి; నిర్దాక్షిణ్యచిత్తంబునన్=దయమాలిన మనస్సుతో; వైరాగ్యమున్= విరక్తిని; పూని; రానైతేన్ = రానిచో; చవిగాని యిందులకున్=నీకురుచింపని యీపనికి; హారాహారిగాన్ = పట్టుదలగా; పోరి; వాలాయము సేయగాన్= నిర్బంధముచేయుట; ఏలా=ఎందుకు ? నీవు; ఆచారవంతుడవై=నీనిత్యకర్మలు నెరవేర్చుకొనుచు; బ్రతుకుము = జీవింపుము; నీయెడన్ = నీమీద; పొడము వాంఛన్=పుట్టినకోరికతో; చావో = చచ్చుటయో; ఎక్కుడో = అంతకుమించి యేమగునో? అలం. ఆక్షేపము.

తా: ఓ ప్రవరా! నన్నేలుకోరా. నీవు రానిచో ఇంక నిన్ను బతిమాలి లాభములేదు. నీవు నీయాచార వ్యవహారములను నిర్వర్తించుకొనుము. నేను చనిపోదునులే. నీకేమి? అనగా నాప్రాణము కాపాడుటకైనను నియమము వదలి నన్నేలు కొనుమని వరూధిని యుద్దేశ్యము.

క. కట్టెఁడితనమున కిట్లాడి
గట్టి మనసు ఱాయి సేసి ♦ కరఁగవు మఱి నీ

పట్టినది విడువ విఁక ని
న్నిట్ట ట్టన నేల మా యదృష్టం బుండన్. 95

టీ: కట్టిఁడితనమునకున్ = కటికితనమునకు; ఒడిగట్టి = సిద్ధపడి; ఇట్లు; మనసు = మనస్సును; రాయి సేసి = రాయివలె చేసికొని; కరఁగవు. మఱి; నీపట్టినది = నీవన్న మాటను; విడువవు; మా యదృష్టంబు; ఉండన్ = ఇట్లుండగా; ఇంకన్ = ఇక మీద; నిన్ను; ఇట్టట్టనన్ = ఇట్లు-అట్లు అనుట; ఏల = ఎందుకులే.

తా: నీవు దయమాలి గుండెరాయి చేసికొని పట్టినదే పట్టుగా, కూర్చు న్నావు. ఇది మా యదృష్టము-మా దురదృష్టమన్న మాట. నిన్ననవలసిన దేమియు లేదు. అలం. వ్యాజనింద.

వ. అనిన నక్కుహనాభూసురకుమారకుండు. 96

టీ: అనినన్ = అనగా; ఆ+కుహనాభూసుర కుమారకుండు = మాయ ప్రవరుడు.

సీ. కొనసాఁగి కామినీ ♦ గోష్ఠిఁ బ్రౌఢములైన
యుదుటుఁజూపుల ఱెప్ప ♦ తుదల నాఁచి
సంతసంబున ముఖా ♦ బ్జంబునఁ జిఱునవ్వు
కందళింపకయుండ ♦ డిందు పఱిచి
పొంగారుమైఁ దోఁచు ♦ శృంగారచేష్టల
తమిఁ దెచ్చి కోలు మాఁ ♦ గ్ధ్యమున డాఁచి
పొడము రసావేశ ♦ మున వచ్చు నర్మోక్తు
లాదవి నాలుకకు రా ♦ కుండ గుక్కి

గీ. మస్తకము వాంచి యుసు రని ♦ మౌనముద్రి
నేల బొటవ్రేల వ్రాయుచు ♦ నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి ♦ శిర సొకింత
యెత్తి సన్నంపుఁబలుకుతో ♦ నిట్టు లనియె. 97

టీ: కొనసాగి = నానాటికి పెరిగి; కామినీ గోష్ఠిన్ = కామినులతోడి సంభాషణలతో; ప్రౌఢములైన = ఆరితేరిన; ఉగటుఁజూపులన్ = రసముచిల్కెడి చూపులను; ఱెప్పతుదలన్ = రెప్పల చివర, ఆఁచి = అణచిపెట్టి; సంతసంబునన్ = సంతోషముతో; ముఖ+అబ్జము నందున్ = పద్మమువంటి ముఖమున; చిఱునవ్వు; కందళింపకయుండన్ = రాకుండ; డిందుపఱిచి = అణచి; పొంగారుమైన్ = ఉప్పొంగెడి

శరీరమున; తోఁచు=కనిపించు; శృంగార చేష్టలతమిన్ = శృంగార చేష్టలవలని తమకమును; తెచ్చికోలుమౌగ్ధ్యమునన్ = తెచ్చిపెట్టుకొన్న తెలియని తనముచే; డాఁచి=దాచి; పొడము=పుట్టెడి; రస+ఆవేశమునన్=ఎక్కువ ఆనందముతో; వచ్చు; నర్మోక్తులు=సరసమైన పరిహాస వాక్యములను; నాలుకకున్ = నాలుక పైకి; ఒదవి=కదలి; రాకుండన్; త్రొక్కి=నిబ్బరముగా అణచి; మస్తకము= తలను; వాంచి=వాల్చి; ఉసురని='ఉస్సు' అనుచు; మౌనముద్రన్=మాటలాడ కుండ; బొటవ్రేలన్=బొటనవ్రేలితో; నేలన్=నేలను; వ్రాయుచున్=గోకుచు; నిలిచి; కొంతసేపు; వెడవెడ–ఏదేదో; చింతించి=ఆలోచించి; శిరసు=తలను; ఒకింత=కొద్దిగా; ఎత్తి; సన్నము+ఎలుఁగుతో=సన్నని కంఠధ్వనితో; ఇట్టులు +అనియెన్.

తా: గంధర్వుడు చేయి తిరిగిన వాడగుటచే ఆమె చేసిన చేతలకు బదులు చేయుటకు సమర్థత కలవాడైనందున చూపులలోని నేర్పు నణచి, చిరునవ్వునాపుకొని, ఒంటికి కల్గు మార్పునణచి, పరిహాసపు మాటనాలుకచివరకురాగా నొక్కిపట్టి తెలియని తనమును తెచ్చి పెట్టుకొని, బొటనవ్రేలితో నేలవ్రాయుచు, ఏదో ఆలోచించి, ఉస్సురని, మెల్లగా తలెత్తి సన్నసన్నగా ఇట్లన నారంభించెను. అది ప్రవరుని వేషముకన్న దానికి తగినట్లతని భావమును నటించినాడు. అలవాటైన వాడగుటచే రాబోయిన భావముల నణచి పెట్టినాడు. అలం. స్వభావోక్తి.

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గానని మన ♦ స్తాపంబునం బొక్కఁగా
నిల్లా లార్తిఁ గృశింపఁగా సవన వ ♦ హ్ని శ్రేణి చల్లారఁగా
నిల్లున్ శూన్యత నొంది సొంపుచెడఁగా ♦ నిచ్చోట నేఁజిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యేసుఖమతిన్ ♦ భోగించెదం జెప్పవే. 98

టీ: ఫుల్ల+అంభోరుహనేత్ర = వికసించిన పద్మమువంటి నేత్రములు కలదానా! తల్లి+తండ్రియున్=నాతల్లి దండ్రులు; నన్నున్; కానని=చూడనందున; మనస్తాపంబునన్=విచారముతో; పొక్కగాన్=దుఃఖించగా; ఇల్లాలు = భార్య; ఆర్తిన్=దుఃఖముతో; కృశింపగాన్=చిక్కగా; సవనవహ్నిశ్రేణి=యజ్ఞము చేసినందున వచ్చిన అగ్నులు మూడును; చల్లారగాన్=హోమములు మానినందున ఆరిపోగా; ఇల్లున్=ఇల్లుకూడ; శూన్యతన్ = యజమానుడులేనందున; పాడుపడి; సొంపుచెడగాన్=అందము చెడగా; నేన్; ఇచ్చోటన్=ఇక్కడ; చిక్కి=వెళ్లుటకు వీలులేక ఆగిపోయి; ఏసుఖమతిన్=ఏరీతి సుఖాపేక్షతో; భోగించెదన్=సుఖముల ననుభవింతునో; చెప్పవే=నీవేచెప్పు?

తా: నా తల్లిదండ్రులు నేను కన్పడలేదని బాధపడుచుండగా, భార్య చిక్కి సగముకాగా, అగ్నులారగా, ఇల్లు పాడుపడగా వెళ్లుటకు దారిదొరకక నేనిక్కడ ఆగిపోయి ఇంటి దగ్గరి బాధల తలచుకొనగానే మనస్సు తరుగుకొని పోవుచుండగా నేనెట్లు సుఖము ననుభవింప గలను? నాకా కోరిక యెట్లు కల్గునో నీవే చెప్పవే?

ఉ. ఓసరసీరుహాక్షి విన ♦ వో రతిఁ గౌఁగిటఁ జేర్చు నింపా సురభర్తకైనఁ గల ♦ దా వలదంచుఁ బెనంగ నేను సన్న్యాసినె యొక్కచో తహాత ♦ హా న్మన సొగ్గదు కేళిపై 'ననాశ్వాసితదుఃఖితే మనసి ♦ సర్వమసహ్యం' మనా నెఱుంగవే. 99

టీ: ఓసరసీరుహ+అక్షి=పద్మములవంటి కన్నులు కలదానా! వినవో=నామాటవినంటివికదా! రతిన్=సంభోగమున; నీవు; కౌఁగిటఁజేర్చు+ఇంపు=కౌఁగిటిలోనికి చేర్చుకున్న ఆయానందము; ఆ సురభర్తకైనన్=ఆ యింద్రునకైనను; కలదా=కల్గునా? వలదంచున్=వద్దని; పెనంగన్=వాదులాడుటకు; నేను; సన్న్యాసినె=సంసారము వదలిన వాడనా? ఒక్కచో తహాతహన్=ఇంటికద్ద విషయములపైనుండువిచారముతో; కేళిపైన్=రతిపై; మనసు+ఒగ్గదు=మనస్సిష్ట పడదు; మనసి=మనస్సు; అనాశ్వాసితదుఃఖితే = ఊరటలేని దుఃఖముకల దగుచుండగా సర్వం=ఏదైనను; అసహ్యం=సహింపరానిది-సహించరాని-ఇష్టము లేనిది; అనన్=అనుట; ఎఱుంగవే=నీవెరుగవా?

తా: నీకు నీవై సంభోగమునకై కౌఁగిటిలోనికి చేర్చుకొను భాగ్యమహా దేవేంద్రునకైన పట్టునా? వద్దనుటకు నే నేమి సర్వసంగ పరిత్యాగినా? ఇల్లు-వాకిలి-పెండ్లాము ఆధోరణిలో, వారేమయిరో అన్న విచారములో మనస్సు సుఖము మీదికి పోవుటలేదు. కాక, ఒకే విచారముతో కుములుచు ఊరట లేనప్పుడు మనస్సున కేదియును రుచింప దన్నది నీవెరుగనిది కన్నా? అలం. కావ్యార్థాపత్తి, ప్రతిషేధము, అర్థాన్తరన్యాసమును.

క. ఐనం గానిమ్ము భవ
ద్దీనతకై వ్రతము విడిచి ♦ తిం బరులకు మే
లైనం జాలు శరీరం
బైన నుపేక్షింపవలయు ♦ నది యట్లుండెన్. 100

టీ: ఐనన్=అటయినను; కానిమ్ము; భవత్+దీనతకై=నీదైన్యమువలన; వ్రతము=ఆచారవ్యవహారములను; విడిచితిన్; పరులకున్=ఇతరరులకు; మేలు+అయినన్=మంచికల్గినచో; చాలును=అంతేచాలు; శరీరంబైనన్=దేహమునైనను; ఉపేక్షింపవలయును = విడువ వలయును; అది; అట్లు + ఉండెన్ = అది అటుండగా...

తా: నావిషయ మట్లుండెనిమ్ము. కాని నీవు ప్రాధేయ పడుచుంటివి కాన వ్రతము విడుచు చున్నాను. ఇతరుల కుపకారమైనచో శరీరమునైనను విడువ వలెనని ధర్మశాస్త్రముకదా! అ దటుండగా...అలం. అప్రస్తుతప్రశంస, కావ్యార్థాపత్తియు.

క. తివురక యింకొక్కటి విను
కవయు నెడన్ వలయుఁ గన్నుఁ ♦ గవయును మూయన్
భువి నిది యస్మద్దేశ
వ్యవహారము కన్నుఁ దెలివ ♦ నఘ మగుఁ దెలివా. 101

టీ: తెలివా=ఓ వరూధినీ! తివురక=తొందరపడక; ఇంక+ఒక్కటి= ఇంకొక విషయమును; విను; కవయు+ఎడన్=సంభోగించు వేళ; కన్నుగవయును =రెండుకన్నులను; మూయన్ వలయున్=మూసికొనవలెను; భువిన్=భూమిలో; ఇది; అస్మత్+దేశవ్యవహారము=మాదేశములోని ఆచారము; కన్నన్=కంటిని; తెలివన్=తెలచుటచే; అఘము=పాపము; అగున్=కల్గును.

తా: ఒక్క విషయము విను. సంభోగసమయమున స్త్రీ కన్నుమూసి కొనవలెను. తెరచినచో పాపము చుట్టుకొనునని మాదేశాచార మున్నది. (గంధర్వాదులు కామరూపముచే కోరిన రూపమును స్వీకరించినను, సంభోగసమయమున, చనిపోయిన తర్వాత, నిద్రాసమయమున నిజరూపమే వచ్చును. అందుచే, తన నిజరూపము తెలిసినచో వరూధిని శపించునను భయముతో ఈయెత్తు పన్నినాడు.) అలం. కావ్యలింగము.

శా. ఈమర్యాదకు నీ వొడంబడిన మే ♦ లీభంగి గాదేని మా
భూమిం జేరఁగ నెట్లు నీయొడలితోఁ ♦ బోవంగ లేనే కదా
యీమందాకినిపొంత నీమునులతో ♦ నీవృక్షవాటంబులో
భామా యేఁ దప మాచరింతు విధిక ♦ బ్రహ్మణ్యముం బెట్టుచున్.

టీ: భామా! నీవు; ఈమర్యాదకున్=ఈనియమమునకు; ఒడంబడినన్= ఒప్పుకొన్నచో; మేలు=మంచిదే; ఈభంగి = ఇట్లు; కాదేనిన్ = కానిచో; ఈయొడలితో=ఈశరీరముతో; ఎట్లును; మాభూమిన్=మాదేశమును; చేరఁగన్ =చేరునట్లు; పోవంగలేనే కదా=పోలేనుకదా! (ఇక) ఏన్=నేను; ఈమందాకిని పొంతన్=ఈగంగానదీ ప్రాంతమున; ఈమునులతోన్=ఇక్కడనున్న మునులతో; ఈవృక్షవాటంబులలోన్=ఈచెట్లగుంపులో; విధికిన్=దైవమునకు; అబ్రహ్మణ్యమున్=నన్ను చంపవద్దని; పెట్టుచున్=మొరపెట్టుచు; తపము+ఆచరింతున్= తపస్సు చేయుదును.

తా: ఓ భామా! నీ వీ నియమమున కంగీకరించితివా మంచిదే. కానిచో ఇక ఈశరీరముతో నెట్లును మాదేశమునకు పోలేను కనుక ఇక్కడనే ఈమునులతో కలిసి తపస్సు చేసికొందును.

తే. ఇంక నొక్కటి వినుము పూ ♦ ర్ణేందువదన
వ్రతము చెడ సౌఖ్య మైనను ♦ వలయుఁ గలుగ

వాంఛితము దీర నను నీవు ♦ వదలఁ జెల్ల
దేను నిను సమ్మతిలఁ జేసి ♦ యేఁగుదనుక. 103

టీ: పూర్ణ+ఇందువదన=నిండు చందురువంటి ముఖము కలదానా! ఇంకన్; ఒక్కటి; వినుము; వ్రతము చెడన్=నియమము చెడినను, సౌఖ్యమైనను=సుఖమైనను; కలుగన్ వలయున్=కలుగవలెను; వాంఛితము=నీకోరిక; తీరన్=తీరగాన్; ఏను=నేను; నినున్; సమ్మతిలన్+చేసి=ఒప్పించి; ఏఁగుదనుకన్=వెళ్లువరకు; నీవు; ననున్; వదలన్=వదలుటకు; చెల్లదు=వల్లకాదు,

తా: ఇంకొక్కటి, విను. వ్రతము చెడినను ఫలము దక్కవలెను గదా! నీకోరిక తీరినంతలో, నేను నిన్నొప్పించి వెళ్లువరకు నీవు నన్ను వెళ్లుమనరాదు. అలం. లోకోక్తి.

వ. ఇంతయేమిటికంటేనింజెప్పెద. నేను వైదేశికుండ. బంధుమిత్రకళత్రంబులం బాసి దైవయోగంబున నింతదూరం బేఁగుదెంచినవాఁడ. మీఁద భవదర్థంబు ప్రార్థితుండనై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువం గలవాఁడ నగుటం జేసి యంతరంగంబుపం గలతెఱంగు తేటపడం బలుకవలసె, నాకర్ణింపుము. 104

టీ: ఇంతియేమిటికిన్+అంటేనిన్=ఇన్నివిధాల ఏల చెప్పవలసి వచ్చెననగా; చెప్పెదన్; నేను; వైదేశికుండన్=విదేశీయుడను; బంధుమిత్ర కళత్రంబులన్=బందుగులను; మిత్రులను, భార్యను; పాసి=వీడి; దైవయోగంబునన్=సురదృష్టవశాత్తు; ఇంతదూరంబు=చాలదూర దేశమునకు; ఏఁగుదెంచినవాడన్=వచ్చినవాడను; మీదఁన్=అపై; భవదర్థంబు=నీ నిమిత్తమై; ప్రార్థితుండనై=కోరబడినవాడనై; వ్రత హోమ+ఆది = వ్రతములు, హోమములు మొదలైన; అనుష్ఠానంబులు=బ్రాహ్మణాచారములైన సత్కర్మలను; విడువన్+కలవాడున్=విడుచుటకు సిద్ధపడుచున్న వాడను; అగుటంజేసి=అగుట వలన; అంతరంగంబునన్=మనసులో; కలతెఱంగు=ఉన్నరీతిని; తేటపడన్=స్పష్టపడగా; పలుక వలసెన్ = చెప్పవలసి వచ్చినది; ఆకర్ణింపుము=వినుము.

ఉ. నీచనుదోయిసంభ్రమద ♦ నిర్భరవాసన మేన నూనన
య్యో! చిరసౌఖ్యముల్ గనుట♦యొండెఁ దపంబొనరించిపాపముల్
రాచుట యొండెఁ గాకిహప ♦ రంబులకూరక దూరమై వయ
శ్శ్రీచన రెంటికిం జెడిన ♦ రేవఁడ నౌదునె నీరజేక్షణా. 105

టీ: నీరజ+ఈక్షణా=పద్మములువంటి కన్నులు కలదానా; నీచనుదోయి=నీరెండు చన్నులయొక్క; సంభ్రమద=జవ్వాజియొక్క; నిర్భరవాసన=ఎక్కువ పరిమళము; మేనన్=శరీరమందు; ఊనన్ = నాటుకొనగా; చిరసౌఖ్యముల్=ఎంతోకాలము సుఖములను; కనుటయొండె=పొందుటయో? తపంబు+ఒనరించి=

తపస్సుచేసి, పాపముల్ = చేసిన పాపములను; రాచుటయొండె = పోగొట్టుకొనుటయో? కాక = అదియు, ఇదియు లేక; ఊరక = వృథాగా; ఇహపరంబులకున్ = భూలోక, స్వర్గలోక సౌఖ్యములకు; దూరమై = లేనిదై; వయః+శ్రీ = పడుచుదనపుసంపద; చనన్ = గడవగా; రెంటికిన్ = రెండుపనులకును; చెడిన = దూరమైన; రేవడన్ = రేవడను చాకలివాడను; ఔదునె = అగుదునా?

తా: వరూధినీ! నీచంటి జంటపై పూసికొన్న, జవ్వాది పరిమళమెంటి కంటగా తోచినన్నాళ్లు హాయిగా సుఖించుటయో? లేదా ముక్కు మూసికొని తపస్సు చేసికొని పాపములను పోగొట్టుకొని పరలోక సౌఖ్యములను పొందుటయో చేయువాడను. అంతేకాని నీవు రమ్మనగా వచ్చి నా కోరిక తీరక మునుపే పొమ్మన్న పోవునంతటి వెర్రివాడను కాను. రేవడను చాకలివాడు రేవులో బట్టలుతుకుకొనుచుండగా నదివచ్చినదట. ఇసుక తిన్నెలపై నారవేసిన బట్టలను తీసికొని వచ్చుటకై వెళ్లుచుండగా ప్రవాహమువచ్చి అవి కొట్టుకొని పోయినవట. వెనుకకు రాగా రేవులోనివి పోయినవట; అట్లు ఉభయ భ్రష్టుడను కానేరను. ఏదో యొకటి దక్కవలెను, అందుచే ముందే నిశ్చయించుకొని చెప్పుము. నామాట కొప్పుకొననిచో నాదారిని నేను పోయెదను. అలం. లోకోక్తి.

క. అని యాస గలుగఁ బలికిన
విని వేలుపువెలఁది మోము ♦ వికసిల్లంగాఁ
దనచేతిచెఱఁగు బిగియం
బెనఁచుచుఁ దల వాంచి నగవు ♦ బెరయఁగఁ బలికెన్. 106

టీ: అని = ఇట్లు; ఆసగలుగన్ = ఆశపుట్టునట్లు; పలికినన్ = పల్కగా; విని; వేలుపువెలఁది = దేవతాస్త్రీ; మోము = ముఖము; వికసిల్లంగాన్ = వికసింపగా; తనచేతి చెఱఁగు = తనచేతిలోనున్న ప్రవరుని కండువా చివరను; బిగియన్ = బిగియునట్లు; పెనఁగుచున్ = లాగుచు; తలవాంచి; నగవు = నవ్వు; బెరయఁగన్ = రాగా; పలికెన్.

శా. హా! నీనిష్ఠురవృత్తి మాని కరుణై ♦ కాయత్తచిత్తంబునన్
మానం జాలనటంచు నేఁడు శ్రవణా ♦ నందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రిన్ వెలవెట్ట కేలితసుఖా ♦ ర్ణోరాశిలోఁ గ్రుంకితిన్
నానోముల్ ఫలియించె నావయసు ధ ♦ న్యం బయ్యె విప్రోత్తమా.

టీ: విప్రోత్తమా = విప్రవరా! హా! నీనిష్ఠురవృత్తిన్ = నీకటికి తనమును; మాని; కరుణా+ఏక+ఆయత్తచిత్తంబునన్ = దయయే కలిగిన మనస్సుతో; మానన్+చాలను = నిన్ను విడువలేను; అటంచున్ = అని; శ్రవణ+ఆనందంబుగాన్ = వీనుల విందుగా; పల్కుటన్ = పలుకుటతో; సూన+అస్త్రిన్ = కుసుమబాణుని; వెలవెట్టక = జీత-బత్తెములియ్యక; ఏలితిన్ = ఏలుకొంటిని; సుఖ+అర్ణః+రాశిలోన్ =

సుఖసముద్రమున; క్రుంకితిన్ = మునిగితిని; నానోముల్ = నేను క్రితము జన్మలో చేసిన వ్రతములు; ఫలియించెన్; నావయసు = నాపడుచుదనము; ధన్యంబయ్యెన్ = సఫలమయ్యెను.

తా: నీవు కౌతిన్యము పిడిచి 'నిన్ను విడువలేన'ని పల్కుటతో మన్మథుని గెల్చితిని; !ఆనంద మందితిని; నానోములు ఫలించెను; నాయౌవన మిప్పుడు సార్థక మైనది.

వ. నీ వెట్లు చెప్పి తట్లు సేయం గలదాన నని యతని నొడంబ
అచుసమయంబునం దోడినెచ్చెలు లచ్చకోరాక్షిం గూడికొని, 108

టీ: నీవు; ఎట్లు; చెప్పితి = పల్కితివో; అట్లు = ఆరీతిగాన్; చేయంగల దానను = చేయుదును; అని; అతనిన్; ఒడంబఱచు సమయంబునన్ = ఒప్పించు నప్పుడు; తోడి నెచ్చెలులు = ఆమె చెలికత్తెలు; అ+చకోర+అక్షిన్ = ఆవరూధినిని; కూడికొని = కలిసి...

సీ. అకట నిర్దయబుద్ధి ♦ వని దూఱెఁ గడు రంభ
యాహా! వివేకి వౌ ♦ దనియె హరిణి
చేఁదు మ్రింగెద వంచుఁ ♦ జిలికి నవ్వె ఘృతాచి
మాయలాఁ డని తిట్టె ♦ మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ ♦ బ్రార్థించె నూర్వశి
జంకించె ర మ్మంచుఁ ♦ జంద్రరేఖ
చెలి నేఁచితని దిసం ♦ తులు గొట్టె మేనక
విడువు మాయ లటంచు ♦ నొడివె హేమ

గీ. గొంట వనియెఁ దిలోత్తమ ♦ కూర్మిఁ గొసరె
ధాన్యమాలిని పుంజిక ♦ స్థల యదల్చె
దివిజకామిను లీరీతిఁ ♦ దిరుగువాఱి
గువ్వకో ల్గాంచుఁ దమలోన ♦ నవ్వుకొంచు. 109

టీ: రంభ; అకట! నిర్దయబుద్ధివి = దయాహీనుడవు; అని; 'దూఱెన్ = నిందించెను; హరిణి; ఆహా! వివేకివి = తెలివైనవాడవు; ఔదు = అగుదువు; అనియెన్. ఘృతాచి; చేదుమ్రింగెదవు = ఈమెతో కలిసి సుఖించుట చేదుమ్రింగినట్లే; ఎట్లు చేయగల్గుదువో? అంచున్ = అనుచు; చిలికినవ్వెన్ = పరిహాసమాడి నవ్వినది; మంజుఘోష; మాయలాడు = మాయకలవాడు; అని తిట్టెను; ఊర్వశి; న్యాయనిష్ఠురములన్ = న్యాయయుక్తమైన కఠినపు మాటలతో, ప్రార్థించెన్; చంద్రరేఖ; రమ్ము+అంచున్; జంకించెన్ = అదల్చెను; మేనక; చెలిని = మా స్నేహితురాలిని, ఏఁచితి = బాధించితివి; అని; దిసంతులు కొట్టెన్ = నిందించెను; హేమ; మాయలు;

విడువు; అటంచున్ = అని; నొడివెన్ = పల్కెను; తిలోత్తమ; గొంటువు = ధూర్తుడవు; అనియెన్. ధాన్యమాలిని; కూర్మిన్ = ముద్దును; కొసరెన్ = చెలికిమ్మని బతిమాలినది; పుంజికస్థల; అదల్చెన్. దివిజకామినులు = దేవతాస్త్రీలు; ఈరీతిన్ = ఇట్లు; తిరుగువాఱి = చుట్టుముట్టి; గువ్వకొల్గొంచున్ = గుంపులు కూడుచు; తమలోనన్ = తమలోతాము; నవ్వుకొంచున్. (ఉండిరి. అన్న క్రియఅధ్యాహార్యము.) వరూధిని చెలులు ప్రవరుని వేళాకోళము చేయుట యిందు చక్కగా వర్ణింపబడినది;

క. ఆకుహనాభూసురుఁ డపు
డాకాంతల సరస సమ్మ ♦ దాలాపములం
గైకొనుచు ముదితహృదయుం
డై కేళీవనము వెడలి ♦ యరిగి కుఱఁగటన్. 110

టీ. అపుడు; ఆకుహనాభూసురుడు = ఆమాయా ప్రవరుడు; ఆకాంతల = ఆస్త్రీలయొక్క; సమ్మద+ఆలాపమునన్ = పరిహాస వాక్యములను; కైకొనుచు = పడుచు; ముదితహృదయుడై = సంతోషించిన హృదయము కలవాడై; కేళీవనము = ఉద్యానము; వెడలియరిగి = విడిచివెళ్లి; కుఱఁగటన్ = దగ్గరలోనున్న ...

సీ. మృగనాభి నికరంపు ♦ బుగబుగల్ గలచోటఁ
జదలేటితుంపురుల్ ♦ చెదరుచోట
వకుళవాటీగంధ ♦ వహుఁడు పైకొనుచోటఁ
గర్పూరతరుధూళి ♦ గప్పుచోటఁ
బసమీఱు సెలయేఱు ♦ లిసుక వెట్టినచోటఁ
జిగురుమావుల సంజ ♦ నిగుడుచోటఁ
నవమాలికలతీవె ♦ నంట్లుటిపడుచోట
మాణిక్యదీపముల్ ♦ మలయుచోటఁ
గీ. బ్రిమదమునఁ దేఁటు లెలుఁగెత్తి ♦ పాడుచోట
శారిక లనంగశాస్త్రముల్ ♦ చదువుచోటఁ
గీరకలకంఠములు క్రొవ్వి ♦ కేరుచోటఁ
బావురము లారజంబులు ♦ పలుకుచోట. 111

టీ: మృగనాభినికరంపు బుగబుగల్ = కస్తూరి రాశియొక్క సువాసనలు; కలచోటన్; చదలు+ఏఱు+తుంపురుల్ = గంగాజల బిందువులు; చెదరుచోటన్ = చెదరిపడు చోటను; వకుళవాటీ = పొగడచెట్లవరుసల నుండి; గంధవహుడు = గాలి; పైకొనుచోటన్ = మీదికి తగిలెడుచోట; కర్పూరతరుధూళి = కర్పూరపు టరటిచెట్ల పరాగము; కప్పుచోటన్ = కప్పెడి ప్రదేశమున; పసమీఱు = ఎక్కువ పసకల్గిన; సెలయేఱులు; ఇసుక+పెట్టినచోటన్; చిగురుమావులన్ = చిగిర్చిన మామిడిచెట్ల

యొక్క, సంజ=సంధ్యాకాలకాంతి; నిగుడుచోటన్=వ్యాపించు చోటునందు; నవమాలికలతీవెనంట్లు=జాజి తీగెలయంట్లు; ఉట్టిపడుచోటన్=ఎక్కువగానున్న చోట; మాణిక్య దీపముల్=దీపములుగా నున్న మాణిక్యములు; మలయుచోటన్=వ్యాపించినచోట; తేఁటులు=తుమ్మెదలు; ప్రమదమునన్=సంతోషముతో; ఎలుఁగెత్తి=పూర్తిస్వరముతో; పాడుచోటన్; శారికలు=గోరువంకలు; అనంగ శాస్త్రముల్=మన్మథక్రీడకు సంబంధించిన చదువులను; చదువుచోట; కీరకలకంఠములు=చిలుకలు, కోకిలలును; క్రొవ్వి=బలిసి; కేకచోటన్=గంతువేయుచోట; పావురములు; ఆరజంబులు=మధురమైన కూతలను; పలుకుచోటన్...ఈ చెప్పిన లక్షణములు కలచోట...అలం. ఉదాత్తము, రూపకము, పరిణామమును.

తే. ఆవరూథిని మణిమండి ♦ తాలయంబుఁ
గాంచి యనురాగమునఁ బ్రవే ♦ శించి యంత
వారి నిరువురఁ గూర్చి య ♦ వ్వనజగంధు
లాత్మగృహముల కేఁగి ర ♦ నంతరంబ. 112

టీ: ఆవరూథిని=ఆవరూథినియొక్క; మణిమండిత=మణులతో అలంకరింపబడిన; ఆలయంబున్=ఇంటిని; కాంచి=చూచి; అనురాగమునన్=ప్రేమతో; ప్రవేశించి; అంతన్=వారందరు ప్రవేశింపగాన్; వారి నిరువురన్+కూర్చి=వారిద్దరిని కలిపి; ఆ+వనజగంధులు=ఆస్త్రీలు; ఆత్మగృహంబులకున్=తమయిండ్లకు; ఏగిరి; అనంతరంబ=తరువాత...

క. ఫుల్లలవలీ నవైలా
వల్లీ మల్లికలతోడ ♦ వాసంతిక లు
ద్వల్లీల నల్లిబిల్లిగ
నల్లికొనిన యొకలతాగృ ♦ హాంతరసీమన్. 113

టీ: ఫుల్ల=వికసించిన; లవలీ=వెన్నెల తీగలతోను; నవ+ఏలావల్లీ మతల్లికలతోడన్=క్రొత్తయేలక తీగెలతోను; వాసంతికలు=బండిగురివెందతీగలు; ఉద్యత్+లీలన్=అభివృద్ధితో; అల్లిబిల్లిగన్=చిక్కగా; అల్లుకొనిన=అల్లుకొనియున్న; ఒకలతాగృహ+అంతరసీమన్=పొదరింటి లోపల ప్రదేశమున...

క. ఆగంధర్వకుమారుఁడు
నా గజగమనయుఁ బ్రఫుల్ల ♦ హల్లకతల్పా
భోగంబున రహి మిగులఁగ
భోగింపఁ దొడంగి రాత్మఁ ♦ బొంగెడు కాంక్షన్. 114

టీ: ఆగంధర్వకుమారుడును; ఆగజగమనయున్=ఏనుగువలె నడుచు వరూథినియు; ప్రఫుల్ల=వికసించిన; హల్లక = ఎఱ్ఱకలువలయొక్క; తల్ప+ఆభోగంబునన్=పెద్దపాన్పుపై; రహిమిగులన్=ఎక్కువ యింపుతో; ఆత్మన్=

మనస్సులో; పొంగెడికాంక్షన్ = పొంగివచ్చు కోర్కెతో; భోగింపన్ = సంభోగించుటకు; తొడంగిరి = ఆరంభించిరి.

వ. ఆసమయంబున;

సీ. సహసానఖంపచ ♦ స్తనదత్తపరిరంభ
మామూలపరిచుంబి ♦ తాధరోష్ఠ
మతిశయప్రేమక ♦ ల్పితదంతసంబాధ
మగణితగ్లానిశ ♦ య్యానిపాత
మతివేలమణితయా ♦ చ్ఞార్థగల్లచపేట
మతిదీనవాక్సూచి ♦ తాత్మవిరహ
మంకురత్పులకజా ♦ లావిద్ధసర్వాంగ
మానందకృతహార ♦ వాననాబ్జ
గీ. మాక్రమక్షీణనుతివర్ణ ♦ మానిమీలి
తాక్ష మాస్విన్నగండ మా ♦ యత్తచేష్ట
మాస్తిమితభూషణారవ ♦ మావధూటి
ప్రథమసురతంబు గంధర్వ ♦ పతిఁ గరంచె. 116

టీ: సహసా = తొందరగా; నఖంపచ = గోరువెచ్చని; స్తనదత్త = స్తనములచే నియ్యబడిన; పరిరంభము = కౌగిలింతలుకలది; ఆమూలపరిచుంబిత = మొదలంట ముద్దుపెట్టుకొనబడిన; అధర+ఓష్ఠము = క్రిందిపెదవికలది; అతిశయప్రేమ = అతిశయించుచున్న ప్రేమచే; కల్పితదంతసంబాధము = చేయబడిన పల్లుకొటుకలది; అగణిత = లెక్కింపని; గ్లాని = శ్రమచే; శయ్యానిపాతము = పక్కపై పడుటలుకలది; అతివేల = మిక్కిలి; మణిత = రతికాలమున పుట్టు కంఠధ్వనియొక్క; యాచ్ఞార్థ = యాచనకై; గల్లచపేటము = చెంపకాయకలది; (హుషారుగా ధ్వనికల్గునట్లు చేయుమని చెంపకాయ కొట్టుకొనిరని భావము) అతిదీనవాక్ = మిక్కిలి దీనమగు మాటలచే; సూచిత = సూచింపబడిన; ఆత్మవిరహము = తమవిరహము కలది; అంకురత్ = అంకురించుచున్న; పులకజాల = ఎక్కువ గగిరిపాటుచే; ఆవిద్ధ = నిండుకొన్న; సర్వ+అంగము = అంత శరీరము కలది; ఆనందకృత = సంతోషముతో చేయబడిన; హారవ = 'హా' అను ధ్వనికల; ఆనన+అబ్జము = ముఖపద్మము కలది; ఆక్రమ = క్రమక్రమముగా; క్షీణనుతివర్ణము = క్షీణించుచున్న పొగడుటలుకలది; ఆనిమీలిత+అక్షము = కొద్దిగా మూయబడిన కన్నులు కలది; ఆస్విన్నగండము = అంతటను చెమట పట్టబడిన చెక్కిళ్లు కలది; ఆయత్తచేష్టము = స్వాధీనమైన శృంగార చేష్టలు కలది; ఆస్తిమిత = ఎక్కువగా సణగిన; భూషణ+ఆరవము = అలంకారముల చప్పుడుకలది; ఆవధూటి = ఆవరూధినియొక్క; ప్రథమసురతంబు = మొదటిరతి; గంధర్వపతిక్ =

గంధర్వుని; కరంచెన్=మనస్సు కరుగునట్లు చేసెను, అలం. ఉదాత్తము. ఇందు వరూధిని ప్రథమసురత విశేషములు వర్ణింపబడినవి.

క. అన్నునఁ గనుమూయుట రొద
సన్నగిలుట కౌఁగిలింత ♦ సడలుట నేర్పుల్
సు న్నగుట వరూధినిరతి
క న్నెరికపురతియుఁ బోలెఁ ♦ గడు నిం పొసఁగెన్. 117

టీ: అన్నునన్ = ఎక్కువ సుఖముకల్గుటచే; కనుమూయుటన్=కన్ను మూయుటచేతను; రొద=కంఠధ్వని; సన్నగిలుటన్ = తగ్గుటచేతను; కౌఁగిలింత; సడలుటన్=వదులగుట చేతను; నేర్పులు=రీతిలోని మెలకువలు; సున్న+అగుటన్=అసలు లేకపోవుటచేతను; వరూధినిరతి=వరూధినియొక్క సంభోగము; కన్నెరికము+రతియుబోలెన్=కన్యతోడిసంగమునువలె; కడున్=మిక్కిలి; ఇంపు=ఆనందమును; ఒసఁగెన్=ఇచ్చెను;

తా: వరూధిని రతిలోనినేర్పు కలదైనను గంధర్వుడు పెట్టిన నియమము ప్రకారము కన్ను మూసికొని యుండుటచే కొన్ని బగులుచేతలుమానినది. అందువలన కన్య వలె ఊరకుండినది. అలం. ఉత్ప్రేక్ష.

క. ఈవిధమున నయ్యిరువురు
భావజతంత్రైకపరత ♦ బహుకాలము సౌ
ఖ్యావహలీలల నుండం
గా వేలుపుముద్దరాలు ♦ గర్భముఁ దాల్చెన్. 118

టీ: ఈవిధమునన్=ఇట్లు; ఆ+ఇరువురున్=ఆయిద్దరును; భావజతంత్ర=మన్మథకార్యములందు; ఏకపరతన్=అదేపనిగా; బహుకాలము = చిరకాలము; సౌఖ్య+అవహలీలన్ = సౌఖ్యమునిచ్చు విలాసములతో; ఉండంగన్=ఉండగా; వేలుపుముద్దరాలు=వరూధిని; గర్భమున్=కడుపును; తాల్చెన్=ధరించెను.

క. నడ జడనువడియె నారే
ర్పడియెం జనుమొనలు నల్ల ♦ వడియెన్ వడియం
బడియెఁ గడు నొడలు పడఁతికి
బడలికయును నిదుర యరుచి ♦ బహుళం బయ్యెన్. 119

టీ: పడఁతికిన్ = వరూధినికి; నడ=నడక; జడను+పడియెన్=మందమయ్యెను; ఆరు=నాభినుండి పైకిక్రిందికినుండు రోమావళియొక్కనూగారు; ఏర్పడియెన్=స్పష్టముగా కన్పడెను; చనుమొనలు; నల్లవడియెన్=నలుపెక్కెను; ఒడలు=శరీరము; కడున్=మిక్కిలి; వడియంబడియెన్=చిక్కెను; బడలికయున్=ఆయాసమును; నిదుర=నిద్ర; అరుచి=దేనిమీదనుహితవులేకుండుట; బహుళంబు=ఎక్కువై; అయ్యెన్=అయ్యెను.

తా: వరూధినికి గర్భము రాగానే నడక మందగించినది. చనుమొనలు నలుపెక్కినవి. నూగారు స్పష్టముగా కనిపించినది. శరీరము చిక్కినది. అరుచి, నిద్ర ఎక్కువైనది. అలం. స్వభావోక్తి.

మ. పలుచంబాఱుటఁ గోమలస్మితరుచుల్ ♦ పైఁదోఁచెనా గౌరకాం
తుల గండద్వితయంబు పొల్చెఁ బ్రమదా ♦ర్ణోరాశిఖేలన్నవో
త్కలికా భంగపరంపరోపరిసము ♦ ద్యత్పాండుడిండీరపం
క్తులు నాఁ జిట్టుములుల్లసిల్లెఁ దఱుచై ♦ తోడ్తోఁగురంగాక్షికిన్.

టి: కురంగ+అక్షికిన్=లేడికన్నులు వంటి కన్నులుకల వరూధినికి; తోడన్+తోన్=గర్భచిహ్నములు రాగానే; గండద్వితయంబు=రెండుచెక్కిళ్లును; పలుచంబాఱుటన్=పల్చఁగుటచే; కోమలస్మితరుచుల్=మృదువైనచిరునవ్వుకాంతులు; పైన్=మీద; తోఁచెన్+నాన్=కన్పడెనా అన్నట్లు; గౌరకాంతులన్=తెల్లని కాంతులతో; పొల్చెన్ = అందగించెను; ప్రమద+అర్ణః+రాశి=సంతోషమను సముద్రమున; ఖేలత్ = విహరించుచున్న; నవ+ఉత్కలికా+భంగ=క్రొత్తవైన ఉవ్విళ్లూరుటయను కెరటములయొక్క; పరంపరా+ఉపరి=పంక్తిమీద; సముద్యత్=పుట్టుచున్న; పాండు=తెల్లనైన; డిండీరపంక్తులు నాన్=నురుగుపంక్తులనునట్లు; చిట్టుముల్=నోరూరివచ్చు ఉమ్ములు (వేవిళ్లచే అరుచి, డోకులు, పుట్టుట సహజము) తఱుచై=ఎక్కువై; ఉల్లసిల్లెన్=వచ్చెను.

తా: వరూధినికి గర్భము రాగానే చెక్కిళ్లు పల్చనైనవి. వేవిళ్లు పుట్టినవి. నోరూరుచుండెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

తే. నాకజలజాక్షి నిఱుపేద ♦ నడుము బలిసి
యల్లనల్లన వళిసీమ ♦ నాక్రమించెఁ
బేర్చి దివసక్రమంబున ♦ బీదబలిసి
బందికాఁడైనఁ బొరువులు ♦ బ్రతుకుఁ గనునె. 121

టి: నాకజలజాక్షి=వరూధినియొక్క; నిఱుపేద నడుము=సన్ననినడుము; బలిసి=లావై; అల్లనల్లనన్=మెలమెల్లగా; వళిసీమన్=కడుపుమీది ముడుతలుండు ప్రదేశమును; ఆక్రమించెన్ = తనలోనికి కలుపుకొనెను; బీద=పేదవాడు; దివసక్రమంబునన్=రోజురోజుకు; బలిసి; పేర్చి=అతిశయించి; బందికాడైనన్=బందిపోటు దొంగ యైనచో; పొరువులు=ఇరుగుపొరుగువారు; బ్రతుకున్+కనునె=మనగలరా?

తా: ఆమె నడుము లావెక్కి, అదివరలో ముడుతలు పడిన శరీరముకూడ నడుమేయైనది. బీదవాడు బలిసి బందిపోటైనచో చుట్టుప్రక్కలవారు బ్రతకలేరు. అలం. అర్థాన్తరన్యాసము.

క. పాటలసుగంధి పాటలు
నాటలు లేకప్పు డొప్పె ♦ నలసతఁ బథికో

త్పాటనజయపరిశాంత
జ్యాటంకృతిచలనమదన ♦ చాపముఁ బోలెన్. 122

టీ: పాటలసుగంధి=పాదిరి పువ్వులవలె పరిమళించు వరూధిని; అప్పుడు; అలసతన్ = బడలికచే; పాటలున్ = పాడుటయు; ఆటలున్ = నాట్యమును; లేక =మాని; పథిక+ఉత్పాటన= బాటసారులను బాధించుటచే; జయ = విజయముచే; పరిశాంత = శాంతిపొందిన-నిల్చిపోయిన; జ్యాటంకృతి = నారియొక్క టంకారము; చలన=కదలిక కల; మదనచాపముఁబోలెన్ = మన్మథుని వింటివలె; ఒప్పెన్ = ప్రకాశించెను.

తా: గర్భభారముచే ఆట—పాటలు మానిన వరూధిని ప్రవాసులను బాధించి జయముగొన్నందున శాంతిపొంది కదలకున్న మన్మథ ధనువువలె నున్నది. అలం. ఉత్ప్రేక్ష.

సీ. మనసుకక్కుఱితి మె ♦ ల్లన లేచి చేతులఁ
గాంతుని జబ్బుగాఁ ♦ గౌఁగిలించు
నలసత మృద్గంధి ♦ యైన కమ్మనినోర
నధరంబు నెడనడ ♦ నాని కూర్కు
మణితాదిపవన ధా ♦ రణశక్తిచాలమి
నొయ్యన నర్మోక్తి ♦ నుబ్బొనర్చుఁ
గాంక్షితక్రీడ కం ♦ గము పంపుసేయమి
నొడ్డుగా నిట్టూర్పు ♦ లొలయఁ బొగులు

గీ. నిచ్చ యెఱిఁగిన రతికేళి ♦ మెచ్చి పొగడు
నప్పు డక్కాంత రతిపరి ♦ హాసవేళ
జీవితేశు సమేళింపఁ ♦ జేఁత లుడుపుఁ
బ్రార్థనాపూర్వదీనసం ♦ భాషణముల. 123

టీ: అప్పుడు=అట్లు ఆయాసము పెరిగినపుడు; ఆ+కాంత=ఆ వరూధిని; మనసు కక్కుఱితిన్ = మనసులోని లౌల్యమువలన; మెల్లనన్ = మెల్లగా; లేచి; కాంతునిన్ = ప్రియుని; జబ్బుగాన్ = వగలు వగలుగా; కౌగిలించున్ = కౌగిలించు కొనెడిది. మృత్+గంధియైన = మట్టి తినుటవలన సువాసనవేయు; కమ్మనినోరన్ = రుచిగొన్న నోటితో; అలసతన్ = బడలికచే; అధరంబున్ = క్రింది పెదవిని; ఎడనెడన్ =అప్పుడప్పుడు; ఆని = ముద్దాడి; కూర్కున్ = పరుండును; మణిత+ఆది= రతివేళ కల్గు కూతలు మున్నగువాటికి; పవనధారణశక్తి= ఊపిరిపట్టుటయందలి శక్తి; చాలమిన్ = చాలకపోవుటచే; ఒయ్యనన్ = మెల్లగా; నర్మోక్తిన్ = పరిహాసపుమాటలచే; ఉబ్బు= (ప్రియునికి) సంతోషమును; ఒనర్చున్; కాంక్షితక్రీడకున్ = ఇచ్చవచ్చి నట్లు సంభోగించుటకు; అంగము= శరీరము; పంపుసేయమిన్ = అనువుపడకున్నందున;

(గర్భిణీస్త్రీలు కొన్ని బంధనములకు అనువుపడరు. శరీరము మెలికలు తిరుగుటకు వీలైనప్పుడే కాని ఆ బంధనములు కుదరవు.) ఒడ్డుగాన్ = ఎక్కువగా; నిడు + ఊర్పులు = దీర్ఘములైన శ్వాసలు, ఒలయన్ = కలుగునట్లు; పొగులున్ = విచారించును; ఇచ్ఛ = తన కోరికను; ఎఱిగిన రతికేళిన్ = తెలిసికొనిచేయు ప్రియునిరతిని; మెచ్చి; పొగడున్ = పొగడును (గర్భవతులకు కొన్నిమాసములందు సంభోగేచ్ఛ హెచ్చుగా నుండును) రతిపరిహాసవేళన్ = రతికై పరిహాసము (ప్రియుడు) చేయునపుడు; జీవితేశున్ = ప్రియుని; ప్రార్థనాపూర్వసంభాషణములన్ = బతిమాలు మాటలచే; సమేళంపుఁజేతలు = కలియుటకై చేయుపనులను; ఉడుపున్ = మాన్పును;

తా: ప్రియుడు సంభోగము కోరినపుడు తనశక్తిలేనందున బతిమాలి మాన్పుచుండును. అలం. స్వభావోక్తి.

క. అంత వియచ్చరుఁ డభిమత
మంతయు సమకూఱుటయును ♦ నచ్చర గర్భ
శ్రాంత యగుటయును గనుఁగొని
యింతట నిచ్చోటు వాయ ♦ కే నిఁక నున్నన్. 124

టీ: అంతన్ = వరూధిని పరిస్థితి అట్లుండగా; వియచ్చరుడు = గంధర్వుడు; అభిమతము + అంతయున్ = తనకోరిక యంతయు; సమకూఱుటయునున్ = నెరవేరుటయు; అచ్చర = వరూధిని; గర్భశ్రాంత = గర్భము వచ్చుటచే అలసినదగుటను; కనుఁగొని = చూచి, ఆలోచించి; ఇంతటన్ = ఈపరిస్థితిలో; ఇచ్చోటు = ఈ ప్రదేశమును; పాయక = విడువక; నేను, ఇఁకన్ = ఇంకను; ఉన్నన్ = ఉన్నచో...

క. వంచన యెఱిఁగిన మఱి శపి
యించునొ సురకాంత చెప్ప ♦ కేఁగినఁ బ్రేమన్
పంచశర శరపరంపరఁ
బంచత ప్రాపించి మీఁదఁ ♦ బాపం బిడునో. 125

టీ: సురకాంత = వరూధిని; వంచన = తనుచేసిన మోసమును; ఎఱిగినన్ = తెలిసికొన్నచో; మఱి = తర్వాత; శపియించునొ, చెప్పక = ఆమెతో చెప్పకుండ; ఏగినన్ = వెళ్ళినచో; ప్రేమన్ = ప్రేమతో; పంచశర = మన్మథునియొక్క; శరపరంపరన్ = బాణములచే; పంచత = మరణము; ప్రాపించి = పొంది; మీఁదన్ = ఆపై; పాపంబు = పాపము; ఇడునొ = కల్గించునో?

తా. ఇంకను తా నక్కడే యున్నచో మోసము తెలిసికొని వరూధిని శపించునో? చెప్పకుండ వెళ్ళినచో ప్రేమవలన తాళలేక చనిపోవునో? అలం. సందేహము.

వ. అని వితర్కించి యక్కపటవిప్రుం డెఱిగించి యనిపించుకొనియ పోవువాఁడై యప్పు డప్పువ్వుఁబోఁడి డాయం బోయి బుజ్జవం బొప్ప ని ట్లనియె. 126

టీ: అని చింతించి = ఇట్లు తనలో భావించుకొని; ఆ+కపటవిప్రుండు = ఆ మాయ బ్రాహ్మణుడు; ఎఱింగించి = మునీంద్రునికి చెప్పి. అనిపించుకొని+అ = వెళ్ళుమని చెప్పించుకొనియే; పోవువాడై = వెళ్ళదలచినవాడై; అప్పుడు; ఆ+పువ్వుబోడిన్ = ఆ వరూథినిని; డాయన్+పోయి = దగ్గరకు వెళ్ళి; బుజ్జవంబు = అనునయము-లాలించుట; ఒప్పన్ = ఒప్పునట్లు; ఇట్లు+అనియెన్.

తే. ఎవ్వఁ డేఁ బాదలేప మొ ♦ కింత నాదు
పాదములఁ బూయ నింతేసి ♦ పనులు పుట్టె
నమ్మహాయోగి బహుయోజ ♦ నాధ్వగామి
యీగిరికి నేఁగుదెంచె నేఁ ♦ డేఁగి కంటి. 127

టీ: ఎవ్వడేన్ = ఏసిద్ధుడు; పాదలేపము = కాళ్లకు పూసికొను పసరు; ఒకింత = కొద్దిగా; నాదుపాదములన్ = నాపాదములకు; పూయన్ = పూయగా; ఇంతేసి = ఈజరిగినయంత; పనులు; పుట్టెన్; ఆ+మహాయోగి; బహుయోజన+అధ్వగామి = ఎన్నోవ ఆమడల దూరము పోగలవాడు; ఈగిరికిన్ = ఈకొండకు; ఏగుదెంచెన్ = వచ్చెను; నేడు = ఈనాడు; ఏగి = వెళ్లి; కంటిన్ = చూచితిని.

తా: ఏసిద్ధుడు నాకాళ్లకు పాదలేపము రాసినందున ఇంతటి పనులు జరిగెనో ఆసిద్ధుడు ఇక్కడికి వచ్చినాడు. నే వెళ్లి చూచితిని.

క. అతఁడు మఱి తీర్థయాత్రా
వ్రతవశమున వచ్చి మా పు ♦ రంబు తెరువుగాఁ
గతలుగ మాసంసార
స్థితు లెల్లను జెప్పె నేమి ♦ సెప్పుదు నబలా. 128

టీ: అబలా = వరూథినీ! అతడు; మఱి = మరియును; తీర్థయాత్రావశమునన్ = తీర్థయాత్రచేసికొను వరుసలో; మా పురంబు తెరువుగాన్ = మా యూరు మార్గముగా; వచ్చి; మాసంసార పరిస్థితులు = మా సంసార పరిస్థితులను; ఎల్లన్ = అన్నిటిని; కతలుగన్ = జరిగిన కథలుగా; చెప్పెన్; ఏమి చెప్పుదును = ఇక నేను చెప్పలేకున్నాను.

సీ. పైపరామరిక చా ♦ ప్పపమిఁ బక్వముఁ దప్పి
పండఁ బాఱిన పొల ♦ మెండఁ బాఱెఁ
గట్టఁ గాపింప ద ♦ క్షత లేమి నూరూర
బందెలఁ బడిపోయెఁ ♦ బశుగణంబు
వంచనామతిఁ ♦ బ్రోడ్వి ♦ వాకులై వటువులో
జ్జల కొప్పగించిరి ♦ చదువు లెల్లఁ

గికురించి రిచ్చి పు ♦ చ్చుకొను చోటుల వార
లాఁకకు లోనుగా ♦ కప్పు లీక

గీ. గ్రహణసంక్రమణాదుల ♦ రాచనగరఁ
గాసువీసంబు వెడలమి ♦ గ్రాసమునకు
నాధి వెట్టిరి క్షేత్రంబు ♦ లందుఁ గొన్ని
లెస్స యిుండునె గృహకర్త ♦ లేనిబ్రతుకు. 129

టీ: పైపరామరిక = పైన విచారణ జేయువాడు; చొప్పడమిన్ = లేనందున; పక్వముడప్పి = కోసెడి సమయము చెడి; పండఁబాఱిన పొలము = పండుటకు సిద్ధమైన చేను; ఎండఁబాఱెన్ = ఎండిపోవు చుండెను; కట్టన్ = కట్టుటకును; కాపింపన్ = కాపించుటకును; దక్షతలేమిన్ = దిక్కులేనందున; పశుగణంబు = పశువుల మందలు; ఊరూరన్ = ప్రతి గ్రామములోనున్న; బందెలన్ = బందెలదొడ్డిలో; పడిపోయెన్ = పడియున్నవి. వటువులు = బ్రహ్మచారులైన విద్యార్థులు; వంచనామతిన్ = వంచనచేయు బుద్ధితో; ప్రాడ్వివాకులై = తగవులాడువారై; చదువులెల్లన్ = అన్నిచదువులను; ఒజ్జలకున్ + ఒప్పగించిరి = గురువులకే అప్పగించిరి-మరచిరి; ఇచ్చిపుచ్చుకొను చోటులవారలు = అప్పులు తీసికొన్న వారు, అప్పులిచ్చుకొను వారును; ఆఁకకున్ = నిర్బంధమునకు; లోనుగాక = లోబడక; అప్పులు + ఈక = అప్పునియ్యక; కికురించిరి = మోసపుచ్చిరి; గ్రహణ = సూర్య చంద్ర గ్రహణముల లోను; సంక్రమణ + ఆదులన్ = సూర్యసంక్రమణము మొదలైన పుణ్యసమయాలలో; రాచనగరన్ = రాజులకోటలో; కాసువీసంబు = కాసో వీసమో; వెడలమిన్ = రాక పోవుటచే; గ్రాసమునకున్ = తిండికి; క్షేత్రంబులందున్ = పొలాలలో; కొన్ని = కొన్నింటిని; ఆధిపెట్టిరి = కుదువబెట్టిరి; గృహకర్త = ఇంటి యజమానుడు; లేని బ్రతుకు = లేని ఆయింటి పరిస్థితి; లెస్స = బాగుగా; ఉండునె = ఉండునా? అలం. అర్థాన్తరన్యాసము.

క. అది గాకే నిట వచ్చిన
యది మొదలుగఁ జింతచేన ♦ హర్నిశమును నా
కెదు రెదురె చూచు చిద్దఱు
ముదుసళ్లును పుత్రమోహ ♦ మున నగు నార్తిన్. 130

టీ: అదిగాక = అంతేగాక; ఏన్ = నేను; ఇటవచ్చినయది మొదలుగన్ = ఇక్కడికి వచ్చినది మొదలు; చింతచేన్ = విచారముతో; అహర్నిశమును = పగలు, రాత్రియును; నాకున్; ఎదురెదురె = ఎదురుగా; చూచుచున్; ఇద్దఱు ముదుసళ్లును = ముసలులైన నా తల్లి దండ్రు లిద్దరును; పుత్రమోహముననగు + ఆర్తిన్ = కొడుకుమీఁది ప్రేమాతిశయము వలని బాధతో...

క. తడి గంట నెప్పుడు దఱుఁగక
కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి ♦ గాసిం బుడమిం
బడినఁ గనరాక మంచపుఁ
దొడుగలై రట్టె రుజల ♦ తో నే మందున్. 131

టీ: కంటన్=కంటియందు; తడి=నీరు; ఎప్పుడున్; తఱుఁగక=తగ్గక; కడి=ఆహారము; తఱుఁగఁగన్=తగ్గగా; వడియున్=దేహపుబిగువును; తఱిఁగి=తగ్గి; గాసిన్=ఆయాసముతో; పుడమిన్=నేలమీద; పడినన్=పడిపోయినను; కనరాక=కనపడక; రుజలతోన్=వ్యాధులతో; మంచపుఁదొడుఁగలలు = మంచము నంటుకొనియున్న ముళ్లకంపలు; ఐరట్టె=అయిరట; ఏమందున్?

తా: కంటతడి యారకుండ ఏడ్చుచు, అన్నము తగ్గి, శరీరము వడిమళ్లి, ముళ్లకంపలవలె మంచము నంటుకొన్నారట. అలం. అతిశయోక్తి.

క. కావున వారలఁ జూడం
గా వేగమ చనఁగవలయుఁ ♦ గమలదళాక్షీ
నీ వెఱుఁగని ధర్మాధ
ర్మావస్థితి గలదె దీని ♦ కై యడలకుమీ. 132

టీ: కావునన్; వారలన్=అనా తల్లిదండ్రులను; చూడంగాన్=చూచుటకై; వేగము+అ=వేగముగా; చనఁగవలయున్=వెళ్లవలెను; కమలదళ+అక్షీ=వరూథిని! నీవు; ఎఱుఁగనిధర్మ+అధర్మావస్థితి=నీకు తెలియని ఈమంచి-చెడ్డలు; కలదె = ఉన్నవా? దీనికై=నేను వెళ్లుటకై; అడలకుమీ = మనస్సులో బాధపడకుమా!

తా: అందుచే నా తల్లిదండ్రులను చూచుటకై వెళ్లవలెను; వెళ్లుట ధర్మమని నీవే యెరుగుదువు; నేవెళ్లుచుంటినని బాధపడవలదు.

క. వడిఁ గాఁచి కాఁచి యుండం
గడవల నీ రినుము ద్రావు ♦ కై వడిఁ బైఁ బైఁ
బొడమెడు కోర్కులచేఁ బె
ల్లుడికిన మది భోగముక్తి ♦ కూఱట గనునే. 133

టీ: కాఁచి కాఁచి+ఉండన్=ఎక్కువగా కాచగా; ఇనుము; కడవలనీరు=కడవల కొలది నీటిని; వడిన్ = త్వరగా; త్రావుకైవడిన్ = పీల్చునట్లుగా; పైపైన్=ఒకదానిమీద నొకటిగా; పొడమెడు కోర్కులచేన్=పుట్టుచున్న కోరికలచే; పెల్లు+ఉడికినమది=ఎక్కువగా తపించిన మనస్సు; భోగముక్తికిన్=సుఖముల ననుభవించుట మానుటకు; ఊరటగనునే=శాంతిపొందునా?

తా: ఎక్కువగా కాచిన ఇనుముపై ఎన్ని నీళ్లు పోసినను హరించినట్లు, కోరిక లవిచ్ఛిన్నముగా పుట్టుటచే తపించిన మనస్సున కెన్ని సుఖము లనుభవించినను విరక్తికల్గదు.

ఉ. కావున నెన్నఁడుం దెగని ♦ కాంక్ష నెపం బొకఁ డెన్ని రోసి నేఁ
బోవఁ దలంతు నేని వల ♦ పున్ననుపుం దగవుం బ్రియంబునున్
నీవలన్ సమగ్రములు ♦ నిల్చిన సంపెఁగపువ్వుఁ దేనె క్రొ
త్తావికిఁ దేఁటి చిక్కిన వి ♦ ధంబునఁ జిక్కనె లోలలోచనా. 134

టీ: లోలలోచనా=వరూధినీ! కావునన్; ఎన్నఁడున్=ఎప్పుడును; తెగని కాంక్షన్=తెంపులేని కోర్కెను; రోసి=అసహ్యించుకొని; నెపంబొకఁడు=ఏదో ఒకవంక; ఎన్ని=చూచి; నేన్; పోవన్+తలంతున్+ఏనిన్=పోదలచినచో; వలపున్=మోహమును; ననుపున్=ప్రేమయు; తగవున్=న్యాయమును; ప్రియంబునున్=ఇష్టమును; నీవలనన్=నీమీద; సమగ్రములు=పూర్తిగా నున్నవి; నిల్చినన్=నేవెళ్లక యిక్కడనే యున్నచో; సంపెఁగపువ్వుఁదేనె=సంపెగపువ్వులోని తేనె యొక్క; క్రొత్త+తావికిన్=క్రొత్త వాసనకు; తేఁటి=తుమ్మెద; చిక్కినవిధంబునన్=తగుల్కొన్నట్లుగా; చిక్కనె=బాధపడనా?

తా: కావున తీరని కోరికలతో భోగములపై అసహ్యము పుట్టి ఇదొకవంక పెట్టుకొని పోవుటలేదు. నీపై నాకు ప్రేమ—అనురాగము పూర్తిగా నున్నవి. నిన్నెట్లు విడుతును? అట్లని నిన్నువిడువక ఇక్కడనేయున్నచో సంపెంగపువ్వుపై తగుల్కొన్న తుమ్మెదవలె బాధపడుదును. తుమ్మెద సంపెంగపువ్వుపై వ్రాలినచో బాధపడును. అలం. ఉపమ.

ఉ. ఎవ్వఁడు మీఁ దెఱుంగక య ♦ థేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రత ♦ హాని యశోధనహాని పుట్టుఁ దా
న వ్వెడఁగ మ్మనుష్యపశు ♦ వయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁ బాలు రౌరవము♦నం బడఁ బాలును నిందపాలునై. 135

టీ: ఎవ్వఁడు=ఏమనుష్యుడు; మీఁదు+ఎఱుంగక=రాబోవునది తెలియక; యథా+ఇచ్ఛ=కోరిక ననుసరించిన; సుఖ+ఏకరతిన్=సుఖముమీది ఆసక్తితో; చరింపఁగాన్=ప్రవర్తించగా; అవ్వలన్=తరువాత; వంశహాని=కులము చెడుట; వ్రతహాని=ఆచారభంగము; యశః+ధనహాని=కీర్తియును ధనముపోవుట; పుట్టున్=కల్గును; ఆ+వెడఁగు=ఆవెర్రివాడగు; తాన్=అతడు; ఆ+మనుష్యపశువు=జ్ఞానము లేనందున పశువువంటి ఆ మనుష్యుడు; ఆ+అవివేకి=వివేకములేని యాతడు; జగంబునన్=భూమిలో; నవ్వఁగన్+పాలు=నవ్వులపాలు; రౌరవంబునన్=నరకమున; పడన్+పాలును=పడుటకు పాపము పాలును; నిందపాలునై=నిందలు నొగ్గియు; చెడున్=చెడిపోవును.

తా: ఎవడు ముందు వెనుకలు గుర్తింపలేక, కేవలము సుఖములనే అనుభవించుచుండునో వాడు పశువు, అవివేకి. వానికి వంశము, వ్రతము, కీర్తియు చెడును. ఇక్కడ నవ్వులపాలు. అక్కడ నరకముపాలు, నిందలపాలునై చెడిపోవును. అలం. అప్రస్తుతప్రశంస.

మ. అనినం జిత్తము జల్లనన్ సొరుగ న ♦ య్యంభోజపత్రాక్షి లో
చనగోళంబులఁ జిమ్మలై చిలుపలై ♦ జాలై తరంగంబులై
చనుదోయిం గొనబౌ కురంగమద చ♦ర్చల్ జాతిపో నొక్కమెం
డున బాష్పాంబుఝరంబు లుప్పతిలెఁ బో ♦ టుం బాటుగా నెం
తయున్. 136

టీ: అనినన్=మాయ ప్రవరుడిట్లనగానే; చిత్తము=మనస్సు; జల్లు+అనన్=జల్లుమనగా; సొరుగ = సోలిపోవ; ఆ+అంభోజపత్ర+అక్షి=ఆవరూథిని; లోచనగోళంబులన్=కన్నులంతయు; చిమ్మలై=బొట్లుగా వెడలి; చిలుపలై=కొంచెము పల్లపుచోట్ల నిల్చి; జాలై=ప్రవాహమై; తరంగంబులై=కెరటములై; చనుదోయిన్=రెండు స్తనముల మీదను; గొనబౌ=అందమైన; కురంగమదచర్చల్=కస్తూరిపూతలు; జాతిపోన్ = కరగిపోవునట్లు; ఒక్కమెండునన్ = ఒక్కటే ఎక్కువగా; బాష్ప+అంబుఝరంబులు = కన్నీటి ప్రవాహములు; పోటున్+పాటు=వచ్చుట–పోవుట; కాన్=కాగా; ఎంతయున్=మిక్కిలి; ఉప్పతిలెన్=కల్గెను.

తా: ఆ మాట వినుసరికి వరూథిని కెంతో విచారము కల్గి, కన్నులలో పుట్టిన నీరు, ఒక్క క్షణములో కన్నులనుండి బొట్లు, ధార, ప్రవాహముగా ఎక్కువై పోయి స్తనములకు పూసికొన్న కస్తూరిని కరగించి పోటు--పాటుగా కారినది. అలం. సారము.

క. అత్తఱి గంధర్వవిభుం
డత్తామరసాక్షివదన ♦ మక్కునఁ గృపతో
నొత్తి మొగ మెత్తి యశ్రులు
మెత్తనఁ గొనగోరఁ బాఱ ♦ మీటుచుఁ బలికెన్. 137

టీ: ఆ+తఱిన్=అప్పుడు; గంధర్వవిభుండు=గంధర్వుడు; ఆ+తామరస+అక్షి=ఆ వరూథినియొక్క; వదనము=ముఖమును; అక్కునన్=రొమ్మునను; కృపతోన్ = ప్రేమతో; ఒత్తి=హత్తుకొని; మొగమెత్తి = మొగముపైకెత్తి; అశ్రులు=కన్నీళ్లు; మెత్తనన్=మెల్లగా; గొనగోరన్ = గోటికొనతో; పాఱ మీటుచున్=పోవునట్లు తుడుచుచు; పలికెన్.

శా. ధీరస్వాంతవు వంత నీకుఁ దగునే ♦ దివ్యాంగనల్ కోవిదల్
గారే యోగవియోగముల్ సతములే ♦ కర్తవ్యముల్ సేయరే

పోరే రారె ప్రియంబు గల్గిన జనుల్ ♦ పోరామి పోఁబోవునే
పోరాకుండఁగ నేమి కాళ్లు దెగెనే ♦ ఫుల్లాంబుజాతేక్షణా. 138

టీ: ఫుల్ల+అంబుజాత+ఈక్షణా=వికసించిన పద్మమువంటి కన్నులుకల దానా! ధీరస్వాంతవు=ధైర్యముకల మనస్సు కలదానవు; నీకున్; వంత=విచారము; తగునే=యుక్తమా? దివ్య+అంగనల్=దేవతాస్త్రీలు; కోవిదల్=వివేకినులు; కారే? యోగవియోగముల్=కలియుట—విడిపోవుటయును; సతములే=నిత్యములా? కర్తవ్యముల్ = చేయవలసిన పనులను; చేయరే = ఎవరైనను చేసికొనరా? ప్రియంబు=ప్రేమ; కల్గినజనుల్=ఉన్న జనులు; పోరే రారె=పోరా? రారా? పోరామి=అక్కఱలు; పోన్=వెళ్లినంతమాత్రాన; పోవునే=నశించునా? పోరాకుండగన్=వెళ్లక, రాకయుండుటకు; కాళ్లు; తెగనేమి=తెగినవా?

తా: వరూధిని! నీవు ధీరురాలవు. దివ్యస్త్రీలు వివేకము కలవారలు. ఎవరైనను ఎప్పుడును కలిసియే యుందురా? ఎప్పుడును విడిపోదురా? సంయోగవియోగములు శాశ్వతములుకావు. చేయవలసిన పనులు సేయక తప్పునా? ఇష్టమున్న వారు రారా? పోరా? వెళ్లినంతలో ఇష్టమంతయు నశించునా? వెళ్లిన తర్వాత రాకపోవుటకు కాళ్లు తెగినవా? నేను వచ్చుచు పోవుచుందును. అలం. అప్రస్తుతప్రశంస.

తే. మూలముట్టుగఁ దెల్పె న ♦ మ్మునివరుండు
ప్రార్థితుండయి నాకు న ♦ ప్పరమవిద్య
వచ్చుచును బోవుచుండెద ♦ వదల నిన్ను
శుకకలాలాప ననుఁ ద్రిశు ♦ ద్ధికిని నమ్ము. 139

టీ: శుకకలా+ఆలాప=చిలుకవలె మాటలాడుదానా? ఆ+మునివరుండు=ఆసిద్ధుడు; ప్రార్థితుండయి=నాచే ప్రార్థింపబడినవాడై; ఆ+పరమవిద్యన్=ఆదివ్యమైన విద్యను; మూలముట్టుగన్=రహస్యముతో సహా; తెల్పెన్=చెప్పెను. వచ్చుచును; పోవుచున్+ఉండెదన్=కావలసినప్పుడెల్ల వత్తును-పోదును.; నిన్నున్; వదలన్; త్రిశుద్ధికిని=త్రికరణశుద్ధిగా; నమ్ము=నమ్ముము.

తా: ఓ వరూధినీ! ఆసిద్ధుడు నేను ప్రార్థించగా పాదలేపనము తయారు చేయుటను పూర్తిగా చెప్పినాడు. ఇకపై నేను ఇష్టము వచ్చినప్పుడు వచ్చుచు పోవుచుందును. నిన్ను వదలను. ఇది నమ్ముము.

తే. అని వరూధిని నూరార్చి ♦ యచటు వాసి
పోయెఁ దనయిచ్చ గంధర్వ ♦ పుంగవుండు
తప్పరాదు ఋణానుబం ♦ ధంబు దెగినఁ
బ్రాణపదమైన వలపును ♦ బాసి చనదె. 140

టీ: అని=ఇట్లు; వరూధినిన్; ఊరార్చి=ఊరడించి; గంధర్వపుంగవుండు=గంధర్వశ్రేష్ఠుడు; అచటు+పాసి = ఆప్రదేశము వదలి; తనయిచ్చన్ = తన యిష్టము వచ్చినట్లు; పోయెన్=వెళ్లెను; ఋణ+అనుబంధంబు = ఋణముండుట వలని సంబంధము; తెగినన్=తెగినచో; ప్రాణపదము+ఐనవలపును=ప్రాణముతో

సమమైన ప్రేమను; పాసి=వదలి; చనదె=పోదా? తప్పన్=తప్పుటకు; రాదు=వీలుపడదు.

తా: ఆ గంధర్వుడట్లా వరూధిని నూరడించి వెళ్లిపోయెను. అనేకఋణము. ఆ ఋణము తీరగానే ఎంతటి ప్రేమమైనను విడిచి వెళ్లవలెను. అది తప్పరానిది.

వ. అనుటయుం దరువాతివృత్తాంతంబుగృపాయత్తం బగు
చిత్తంబున నాన తీవలయు నని యడుగుటయును. 141

టీ: అనుటయున్=అని పక్షులు చెప్పగా; తరువాతి వృత్తాంతంబు=తర్వాత కథను; కృపా+ఆయత్తచిత్తంబునన్ = దయకల్గిన మనస్సుతో; ఆనతి+ఈవలయును = చెప్పవలెను; అని+అడుగుటయును = అనియడుగగా; (దీనికి నాల్గవ యాశ్వాసములోని 'ఇట్లనియె' అన్న క్రియతో అన్వయము)

శా. హిందూరాజ్యరమాధురంధరభుజా ♦ హిగ్రామణీకంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ యవన ♦ క్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష యసకృ ♦ న్మార్దద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తరకకు ♦ ద్ధాత్రీసమాటీకనా. 142

టీ: హిందూరాజ్య=హిందూదేశ రాజ్యముయొక్క; రమా=సంపత్తుయొక్క; ధురంధర=భారమును వహించిన; భుజ+అహిగ్రామణీ=భుజమను సర్పశ్రేష్ఠమునకు; కంచుకత్=కుబుసమగుచున్న; కుంద=మొల్లపువ్వులవలె; స్వచ్ఛ=నిర్మలమైన; యశః+గుళుచ్ఛ=కీర్తియను పూలగుత్తి కలవాడా! యవనక్షోణీధవస్థాపన=యవనరాజును పునః ప్రతిష్ఠ చేయుటయందు; అమందీభూత=ఎక్కువైన; కృపాకటాక్ష=దయతో కూడిన చూపుకలవాడా! అసకృత్=ఎన్నోసార్లు; మార్ద్యత్=మర్దించిన; కళింగ=కళింగరాజుయొక్క; అంగనా=స్త్రీలయొక్క; బందీగ్రాహ=చెఱపట్టుటయందు; విగాహిత=ప్రవేశపెట్టబడిన; ఉత్తరకకుప్+ధాత్రీ = ఉత్తరదిగ్విజయ యాత్రయందలి; సమాటీకనా=ప్రయత్నము కలవాడా!

తా: హిందూదేశ రాజ్యమును పరిపాలించి కీర్తిపొందినవాడు, తనకు చిక్కిన యవనరాజును మరల అతని రాజ్యమును స్థాపించినవాడును, పలుసార్లు కళింగరాజ్య స్త్రీలను చెరబట్టుటకై-కళింగరాజును జయించుటకై, ఉత్తర దిగ్విజయయాత్ర చేసినవాడును. అలం. ఉపమ.

క. తిరుమలదేవీచరణో
దరలాక్షాకల్పకల్పి ♦ త స్థలకమల
స్ఫురదిందీవరబంధుర
హరిహయమణివలయకూట ♦ హర్మ్యవిహారీ. 143

టీ: తిరుమలదేవీ=తిరుమలదేవి యను భార్యయొక్క; చరణ+ఉదర=కాలి క్రింద; లాక్షా+ఆకల్ప=లత్తుకపూయుటచే; కల్పిత=కల్పించబడిన; స్థలకమల=మెట్టతామరల; స్ఫురత్=ప్రకాశించెడి; ఇందీవర=నల్లకలువలవలె; బంధుర=

ఒప్పెడి; హరిహయమణీ=ఇంద్రనీలమణులు గుప్పిన; వలయ=గుండ్రని; కూట హర్మ్య=కపట యంత్రములున్న మేడయందు; విహారీ=విహరించువాడా!

తా: తిరుమలదేవి యను కృష్ణదేవరాయల భార్య కాలికి పూసికొన్న లత్తుకరసపుపంటినందున ఇంద్రనీలములతో కట్టిన ప్రదేశములు మెట్టతామరలతో కూడిన నల్లకలువలు కల్గినట్లుగా ప్రకాశించుచున్న 'లక్ష్మీవిలాసమ'ను మేడలో విహరించు వాడా! అలం. ఉదాత్తము.

—: ఉత్సాహ :—

వర్ణనీయకీర్తివైభ ♦ వా ప్రభూతభూతిదృ
క్కర్ణకుండలా! వితీర్ణి ♦ కర్ణ! దీర్ణహృద్భ్రమ
ద్దుర్ణయారి మానహారి! ♦ దుర్భరానకార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి ♦ కొండవీటిమండలా. 144

టీ: వర్ణనీయ = పొగడదగిన; కీర్తివైభవా = కీర్తియొక్క వైభవము కల వాడా! ప్రభూత=ఎక్కువైన; భూతి=సంపదచే; దృక్+కర్ణ = నేత్రములే చెవులుగా కల పాములు; కుండలా=కుండలములుగా కల శివుని వంటి వాడా! వితీర్ణికర్ణ = దాతలలో కర్ణునివంటివాడా! దీర్ణహృత్ = బ్రద్దలైన హృదయములతో; భ్రమత్=తిరిగెడి; దుర్ణయ=అవినీతి పరులైన; అరి=శత్రువులయొక్క; మానహారి=గర్వమును పోగొట్టినవాడా! దుర్భర=భరింపరాని; ఆనక + ఆర్భటీ=భేరి యొక్క ధ్వనిచే; ఘూర్ణమాన = తిరుగుడుపడుచున్న; కొండపల్లి, కొండవీటి మండలా=కొండపల్లి, కొండవీడు మండలములు కలవాడా!

తా: ఎక్కువ కీర్తియు, ఎక్కువ సంపదయు కల్గినవాడా! దానకర్ణా! భేరీ ధ్వని విన్నంతమాత్రముననే జడిసెడి కొండపల్లి, కొండవీడు మండలముల నేలు రాజులు కలవాడా!

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస
శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితా మతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం
బనుమహాప్రబంధమునందు
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

——(★)——

శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

(టీకాతాత్పర్యసహితము)

## చతుర్థాశ్వాసము



కృష్ణరాయ గుణర
త్నాకల్పా కల్పకద్రు ♦ మాధికదాన
శ్రీకుతుకాగతలోకా
లోకాంతరసకలసుకవి ♦ లోకస్తుత్యా! 1

టీ: శ్రీకృష్ణరాయా! గుణరత్న+ఆకల్ప=సుగుణములనెడి రత్నములచేత అలంకారముగా కలవాడా! కల్పకద్రుమ = కల్పవృక్షముకన్న; అధిక=ఎక్కువైన; దానశ్రీ=దానసంపద యందలి; కుతుక=వేడుకచే; ఆగత=వచ్చిన; లోకాలోక+అంతర=లోకాలోక పర్వతము లోపలనున్న; సకలసుకవిలోక=సుకవులందరిచే; స్తుత్యా=పొగడ బడువాడా!

తా: సుగుణములతో ఒప్పువాడా! దానమెక్కువగా చేయుటవలన ఎక్కడనున్న సుకవులును వచ్చి పొగడుచుండగా ఆనందించువాడా!

వ. అవధరింపుము. జైమినిమునీంద్రునకుఁ బతంగపుంగవంబు
లిట్లనియె. 2

టీ: అవధరింపుము=వినుము; జైమినిమునీంద్రునకున్; పతంగపుంగవులు=ధర్మపక్షులు, ఇట్లు+అనియెన్.

సీ. మున్ను విప్రాకార ♦ మునఁ గూడుచో శంకఁ
గనుమూయఁ బనిచె నా ♦ ఖచరభర్త

యవ్వరారోహయు ♦ నాసక్త గావున
నిచ్ఛలో నటుసేయ ♦ నియ్యకొనియె
నాప్రతిజ్ఞాపూర్తి ♦ యయ్యెఁ దనంత న
వ్వనితకు రతిపార ♦ వశ్యపటిమ
నప్పుడు తత్ప్రవర దే ♦ హసమిద్ధశిఖిదీప్తి
శాంబరీమహిమచే ♦ సంగ్రహించి

గీ. నట్టి గంధర్వమూర్తి సౌ ♦ ఖ్యానుభూతిఁ
జలన మేదిన మానసా ♦ బ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన ♦ వృద్ధి నట్టి
మేటిగర్భంబు నెలలు తొ ♦ మ్మిదియు నిండె. 3

టీ: మున్ను = మునుపు; విప్ర+ఆకారమునన్ = ప్రవరుని రూపముతో; కూడుచోన్ = సంగమించునపుడు; శంకన్ = తన నిజ రూపము తెలియునను భయముతో; ఆ ఖచరభర్త = ఆగంధర్వుఁడు; కనుమూయన్ = కన్నుమూయునట్లు; పనిచెన్ = ఆజ్ఞాపించెను; ఆ+వరారోహయున్ = ఆవరూధినికూడ; ఆసక్త గావునన్ = ఆసక్తికలదికావున; అటు+చేయన్ = అట్లే చేయుటకు; ఇచ్ఛలోన్ = మనస్సునందు; ఇయ్యకొనియెన్ = ఒప్పుకొనెను; ఆ+వనితకున్ = ఆవరూధినికి; రతిపారవశ్యపటిమన్ = సురతమువలని పరవశత్వముచే; ఆప్రతిజ్ఞాపూర్తి = కన్నుమూయుటయను ప్రతిజ్ఞ నెరవేర్పుట; తనంతన్ = దానంతటది; అయ్యెన్ = నెరవేరెను. అప్పుడు; తత్+ప్రవర = ఆ ప్రవరునియొక్క; దేహ = శరీరమందు; సమిద్ధ = ప్రకాశించు; శిఖిదీప్తిన్ = అగ్నివంటి తేజస్సును; శాంబరీమహిమచేన్ = మాయామహిమవలన; సంగ్రహించి+అట్టి = కైకొన్న; గంధర్వమూర్తి = గంధర్వుని ఆకారము; సౌఖ్య+అనుభూతిన్ = సుఖమునను భవించుటచే; చలనము+ఏదిన = చలనములేని; మానస+అబ్జమునన్ = పద్మమువంటి మనస్సున; నిలువన్ = నిల్వగా; అట్టి మేటిగర్భంబు = ఆ మంచిగర్భము; తేజః+మయంబు+ఐన = తేజోరూపమైన; వృద్ధిన్ = అభివృద్ధితో; వెలసెన్ = ప్రకాశించెను; నెలలు, తొమ్మిదియున్ = తొమ్మిదికూడ; నిండెన్.

తా. ఇదివరలో గంధర్వుడు తన మాయాప్రభావముచే ప్రవరుని యాకారమును ధరించి తన మాయ బయల్పడకుండ వరూధినిని కన్నుమూసికొనుమనెను. ఆమె మనసార ఒప్పుకొన్నది. కాని రతిలోని పరవశత్వముచే వాటంతటవే కన్నులు మూతపడినవి. ఆ ప్రియుని దేహమే ఆమె మనస్సులో ముద్రించుకొనిపోయినది. అతనిచే నిక్షిప్తమైన యింద్రియము క్రమముగా పెరిగినది. తొమ్మిది నెలలు నిండినవి.

వ. అనంతరంబ యొకానొక పుణ్యదివసంబున. 4

టీ: అనంతరంబ = పిమ్మట; ఒక+ఒక = ఒకానొక; పుణ్యదివసంబునన్ = మంచిరోజున.

శా. తేజం బబ్జభవాండగేహమునకున్ ♦ దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జే ♦ రం బోనిలగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనో ♦ రాజన్యమాన్యున్ జనుల్
జేజే వెట్టఁ బ్రసూనవర్ష మమర ♦ శ్రేణుల్ ప్రవర్షింపగన్. 5

టీ: గ్రహపంచకంబు = చంద్ర, కుజ, గురు, శుక్ర, శనులు; రవిన్ = సూర్యుని; చేరంబోని = చేరని; లగ్నంబునన్ = లగ్నమునందు; రాజీవ+అక్షి = తామరపువ్వుల వంటి కన్నులుకల వధూమణి; తేజంబు = శరీరకాంతి; అబ్జభవ+అండగేహమునకున్ = బ్రహ్మాండమను నింటికి; దీప+అంకుర+ఛాయమై = దీపపు వెలుగై (ఛాయాశబ్దము సమాసమున వైకల్పికముగా నపుంసకము) రాజిల్లంగన్ = ప్రకాశించగా; జనులు; జేజే+పెట్టన్ = జయజయ ధ్వానములు చేయగా; అమర శ్రేణుల్ = దేవతా సమూహములు; ప్రసూనవర్షము = పూలవాన; ప్రవర్షింపగన్ = కురియింపగా; సుమనః+రాజన్యమాన్యున్ = ఇంద్రునిచే గౌరవింపదగినట్టి; కుమారున్ = కొడుకును; కాంచెన్ = కనెను.

తా. జ్యోతిశ్శాస్త్రరీత్యా బుధుఁడు కస్తంగతత్వదోషముండదు; తక్కిన గ్రహములు సూర్యునితో కలిసియున్నచో అస్తంగతములగును. అట్టి యస్తంగతత్వదోషములేని లగ్నమున, శరీరకాంతితో బ్రహ్మాండమునంతను దీపమింటిని వెలిగించు నట్లుగా ప్రకాశించజేయు కుమారుని కనెను. దేవతలు పుష్పవృష్టి కురిసిరి. జయజయ ధ్వానములు చేసిరి. అలం, రూపకము. సమసోక్తి.

క. స్వరుచిస్ఫురణను శశి భా
స్కరపావకతారకా ప్ర ♦ కాశము లెల్లన్
విరళములు సేయ నతనికి
స్వారోచి యను నామ మిడి ర ♦ చటిమును లెల్లన్. 6

టీ: స్వరుచిస్ఫురణను = తనకాంతియొక్క వెల్గుటచే; శశి = చంద్రుడు; భాస్కర = సూర్యుడు; పావక = అగ్ని; తారకా = నక్షత్రములయొక్క; ప్రకాశము లెల్లన్ = కాంతులన్నియు; విరళములు = తక్కువైన వాటిగా; చేయన్ = చేయుటచే; అతనికిన్ = ఆబాలునికి; అచటిమునులు+ఎల్లన్ = అక్కడి మునులందరును; స్వారోచియను = స్వారోచి అనెడి; నామము = పేరును; ఇడిరి = ఉంచిరి.

తా: ఆబాలుడు తన దేహకాంతిచే సూర్య చంద్ర నక్షత్రముల కాంతిని నణచుటచే అక్కడి మునులతనికి 'స్వారోచి' అని పేరు పెట్టిరి. అలం, అతిశయోక్తి.

చ. మఱియు నతండు సంయమిస ♦ మాజవినిర్మితజాతకర్ముఁడై
నెఱిఁ బరివర్ధితుం డగు నుప ♦ నీతుఁడునై వివిధాయుధంబులన్

గఱకరియై రణస్థలుల ♦ గద్దఱియై నిగమార్థవేదియై
నెఱతనకాఁడునై మెఱసె ♦ నిర్మలకాంతి విలాసరేఖలన్. 7

టీ: మఱియున్; అతండు = ఆ స్వారోచి; సంయమిసమాజ = మునుల సమూహముచే; వినిర్మిత = చేయబడిన; జాతకర్ముఁడై = జాతకర్మకలవాఁడై; సెటిన్ = బాగుగా; పరివర్ధితుండు = పెంచబడినవాఁడును; ఉపనీతుఁడునై = ఉపనయనము చేయబడినవాఁడునై; వివిధ+ఆయుధంబులన్ = అన్ని ఆయుధముల ప్రయోగములందును; కఱకరియై = నేర్పరియై; రణస్థలులన్ = యుద్ధభూములందు; గద్దఱియై = దిట్టయై; నిగమ+అర్థవేదియై = వేదార్థము నెఱిగినవాఁడై; నెఱతనకాఁడునై = అన్నిటియందును కౌశలము కలవాఁడై; నిర్మల = స్వచ్ఛమైన; కాంతివిలాసరేఖలన్ = అందము, విలాసములతో; మెఱసెన్ = ప్రకాశించెను.

తా: ఆ స్వారోచికి అక్కడి మునులు జాతకర్మ, ఉపనయనమును చేసిరి. శస్త్రాస్త్రవిద్యలందు నారితేరి, వేదార్థముల నెరిగి, యుద్ధములో నేర్పుకలిగి చక్కని శరీరకాంతి విలాసములతో నతఁడు ప్రకాశించెను.

స్రగ్ధర. గుద్దున్ గోత్రాచలంబుల్ ♦ గులగుల లయి పో
♦ గోతముల్ గుద్దులీలన్
ఖద్దిం జెండాఁడు మ్రాఁకుల్ ♦ కవుఁగిటికోలఁదుల్
♦ కత్తి నొక్కొక్క ఘాతం
బోద్దామప్రౌఢి వాతా ♦ ద్భుతగతిఁ బఱచున్
♦ భూమి జవ్వాడఁగా ని
ట్లద్దేవీనందనుం డ ♦ త్యనుపమబలుఁడై
♦ యౌవనారంభవేళన్. 8

టీ: గోత్ర+అచలంబుల్ = కులపర్వతములు-వింధ్య, హిమవంతము మొదలైనవి; గులగులలయిపోన్ = పిండియగునట్లు; గోతముల్ = సంచులను; గుద్దులీలన్ = గుద్దునట్లు; గుద్దున్. కవుఁగిటికోలఁదుల్ = రెండు చేతులనుచాపి పట్టుకొనునంతలావైన; మ్రాఁకుల్ = చెట్లను; ఖద్దిన్ = బలముతో; కత్తిన్ = కత్తితో; ఒక్కొక్క ఘాతన్ = ఒక్కొక్క దెబ్బతో; చెండాఁడున్ = నరికివేయును; భూమి = నేల; జవ్వాడగాన్ = అదరునట్లు; ప్రోద్దామప్రౌఢిన్ = ఎక్కువ సామర్థ్యముతో; వాత+అద్భుతగతిన్ = గాలివంటి వేగముతో; పఱచున్ = పరుగెత్తును; ఇట్లు = ఈరీతిగా; ఆ+దేవీనందనుఁడు = ఆవరూధినికొడుకు; అతి+అనుపమ బలుఁడై = మిక్కిలి సాటిలేని బలముకలవాఁడై; యౌవన+ఆరంభవేళన్ = యౌవన మారంభించు నప్పుడు...

తా: ఆస్వారోచి యౌవనము వచ్చుచుండగా రాళ్లు పోసిన గోతములు జెట్టీలు గ్రుద్దునట్లుగా కులపర్వతములనే పిండి యగునట్లు గ్రుద్దువాడు. పట్టుబారెడు లావున్న చెట్లమొదళ్లను కత్తితో ఒక్కవ్రేటుతో తెగునట్లు నరుకువాడు. భూమి యదరునట్లు పరుగెత్తువాడు. అలం. అతిశయోక్తి, ఉపమయు.

క. వేదండకరము తోండము సరి
కోదండముఁ దివియు నెడమఁ ♦ గుడి నిబిడజ్యా
నాదము రోదసి నిండఁగ
భేదించున్ గండశిలలఁ ♦ బృథుబాణములన్. 9

టీ. వేదండము తొండముసరి=ఏనుగు తొండముతో సమమైన; కోదండమున్=విల్లును; ఎడమన్+కుడిన్=ఎడమవైపునకు, కుడివైపునకు; నిబిడ=ఎక్కువైన; జ్యానాదము=నారిమ్రోత; రోదసిన్=భూమ్యాకాశములమధ్యను; నిండగన్=నిండునట్లు; తివియున్=లాగును; పృథుబాణములన్=పెద్దబాణములతో; గండశిలలన్=పెద్దరాళ్ళను; భేదించున్=ముక్కలు చేయును.

తా. ఏనుగుతొండమువంటి వింటిని నారిమ్రోత భూమ్యాకాశములమధ్యప్రదేశము నిండునట్లు సవ్యాపసవ్యములకు వంచునాడు. పెద్ద పెద్ద రాళ్ళను పెద్ద బాణములతో ముక్కలు చేయువాడు. అలం: అతిశయోక్తి: ఉపమ.

క. అతఁడు మఱి తనకు మంథ
క్షితిభృత్తటి విశ్వకర్మ ♦ చేసిన నగరిన్
వితతాటవిక చమూసే
వితుఁడై సామ్రాజ్య మనుభ ♦ వింప నొకతఱిన్. 10

టీ. అతడు; మఱి=మఱియు; తనకున్; మంథక్షితిభృత్+తటిన్=మందరపర్వతపు చరియయందు; విశ్వకర్మ=దేవశిల్పి; చేసిన నగరిన్=నిర్మించిన పట్టణమందు; వితత+ఆటవిక=విస్తారమైన అడవిలో తిరిగెడి కోయలయొక్క; చమూ=సేనలచే; సేవితుడై=సేవింపబడువాడై; సామ్రాజ్యము=రాజ్యవైభవమును; అనుభవింపన్=అనుభవించుచుండగా; ఒకతఱిన్=ఒకప్పుడు.

తా: ఆ స్వారోచి విశ్వకర్మ మందరపర్వతముపై నిర్మించిన పట్టణమున కోయ సేనలు కొల్చుచుండ రాజ్యసుఖములనుభవించుచుండగా......

క. కరకాచిటపటరవ భీ
కరమై పెళపెళనినాద ♦ ఘనమై ఝంఝా
మరుదుజ్ఝిత బిలమంద్ర
స్వరమై యక్కొండ నొక్క ♦ వర్షము గురిసెన్. 11

టీ. ఆ+కొండన్=ఆ కొండమీద; కరకా=వడగండ్లయొక్క; చిటపటరవ=చిటపటమను చప్పుడుతో; భీకరమై=భయంకరమై; పెళపెళనినాదఘనమై=పెళపెళమను మేఘములు కలదై; ఝంఝామారుత్=వానతోడి పెనుగాలిచేత; ఉజ్ఝిత=విడువబడిన; బిల=కొండగుహలయొక్క; మంద్రస్వరమై=గంభీరధ్వని కలదై; ఒక్కవర్షము=ఒకవాన; కురిసెన్,

తా: ఆ కొండపై వర్షంబు చిటపటమని రాలగా, మేఘములు పెళపెళ లాడగా వానతో డిగాలి వీచుటచే కొండగుహలు హోరున్ మ్రోగునట్లు వాన కురిసినది.

క. తెలతెల వేఁగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించు సెలల • చప్పుళ్లు శిఖా
వల కుల కల కేకా కల
కలములు గలతలపాలంబు • గనుఁగొను వేడ్కన్. 12

టీ. తెలతెల వేగినన్ = తెల్లగా తెల్లవారగా; ఆ+గిరిన్ = ఆ కొండపై; జల జలన్ = జలజలలాడుచు; ప్రవహించు సెలల చప్పుళ్ళు = ప్రవహించెడి సెలయేళ్ళ చప్పుళ్ళు; శిఖావలకుల = నెమళ్లగుంపుయొక్క; కల = అవ్యక్తమధురమైన; కేకా కల కలములుకల = (నెమళ్ళకూతల) కేకల ధ్వనులును కల్గిన; తలపాలంబున్ = ఎత్తు ప్రదేశమును; కనుగొను వేడ్కన్ = చూచెడి కోరికతో......

తా, తెల్లవారగనే ఆ కొండమీద సెలయేళ్ళు జలజల ప్రవహించు చప్పుళ్ళను వాన కురిసినందున కేరింతలుకొట్టుచు సంతోషముతో కూయు నెమళ్ళ కేకలునుకల కొండప్రదేశమును చూచెడి కోరికతో......

ఆ. అన్నగాగ్రి మెక్కి • యం దొక్కశశికాంత
వేదిఁ గతిపయాప్త • వేష్టితుండుఁ
గుటజవిపినపవన • నట దలకభరుండు
నగుచుఁ బ్రొద్దు జరపు • నవసరమున. 13

టీ, అ+నగ+అగ్రము+ఎక్కి = ఆ కొండశిఖరమెక్కి; అందున్ = అక్కడ; ఒక్క శశికాంతవేదిన్ = ఒక చంద్రకాంతపు అరుగుపై; కతిపయ+ఆప్త వేష్టితుండున్ = కొందరాప్తులతో కూడినవాడును; కుటజవిపిన = కొండమల్లెల పొదలనుండి వచ్చు; పవన = గాలిచే; నటత్ = ఎగురుచున్న; అలకభరుండున్ = ముంగురులుకలవాడును; అగుచున్; ప్రొద్దుజరపు+అవసరమునన్ = కాలక్షేపము చేయు సమయమందు...

తా: అప్పుడు స్వరోచి కొండ చివరికెక్కి చలువరాతిపై కూర్చుండి, కొందరాప్తులతో కాలక్షేపము చేయుచుండగా...

ఆ. ఒక్క యెఱుకుఱేఁడు • నక్కకొమ్మును నిఱ్ఱి
గోరజంబు జున్నుఁ • జాఱపప్పు
బీలిగఱులయంప • కోలలు సెలవిండ్లు
గాను కిచ్చి కర యు • గంబు మొగిచి. 14

టీ: ఒక్కయెఱుకుఱేఁడు = ఒక కోయదొర; నక్కకొమ్మును = నక్క యొక్క కొమ్మును—ఒకజాతి నక్కకు నడినెత్తిన కొమ్ముండునట; ఇఱ్ఱిగోరజంబును = కస్తూరియును; జున్నును = తేనెపెరయు; చారపప్పును; పీలిగఱులయంపకోలలును = పికిలి పిట్టల యీకలు కట్టిన బాణములును; సెలవిండ్లును = సెలబద్దలవిండ్లును;

కానుక+ఇచ్చి; కరయుగంబున్=రెండు చేతులను; మొగిచి = దగ్గరకుచేర్చి-దండము పెట్టి...

వ. యుగవిగమసమయ సముద్భూతజీమూత పటలంబునుం బోలె కైలాసగిరినితంబ ప్రాంతకాంతార పర్యంతంబు నిరంతరంబై కాలుకొన్న యొక్కగహనరేఖం గరాంగుళిం జూపి భూపతి కిట్లనియె. 15

టీ: యుగ=మహాయుగము యొక్క; విగమసమయ=ముగియుకాలమందు; సముద్భూత=పుట్టిన; జీమూతపటలంబునుంబోలెన్=మేఘముల సముదాయమువలె; కైలాసగిరి = కైలాస పర్వతముయొక్క; నితంబప్రాంత = మధ్యవరకునున్న; కాంతార పర్యంతంబున్=కారడవి వరకును; నిరంతరంబై=దట్టమై; కాలుకొన్న =గుబురుగా పెరిగిన; ఒక్కగహనరేఖన్=ఒకయడవి వరుసను; కర+అంగుళిన్ = చేతివ్రేలితో; చూపి; భూపతికిన్=స్వారోచితో; ఇట్లనియెన్.

తా: ప్రళయ కాలమందలి మేఘములు వలె నల్లగా గుబురుగా కైలాసగిరి వరకు కన్పడు అడవి చాల్పును చూపి ఆకోయవారు స్వారోచితో ఇట్లనెను.

క. అల్లదె కంటే పొనపొన
దెల్లనిగట్టుఱుత మబ్బు ♦ దేఱెడు పొల మం
దెల్లెడఁ జూచిన ధరణీ
వల్లభ! సీరాముసేన ♦ వాలుమెకంబుల్. 16

టీ: ధరణీవల్లభ=రాజా! అల్లదె=ఆకన్పడుచున్నది; కంటే=చూచితివా? పొనపొన=చూచాయగా; తెల్లనిగట్టు+అఱుతన్=తెల్లని కొండప్రక్కన; మబ్బు దేఱెడు పొలమందున్=మబ్బులులేచు ప్రదేశమున; చూచినన్=చూడగా; ఎల్ల+ఎడన్=అంతటను; వాలుమెకంబుల్=క్రూరమృగములు; సీరాముసేన=శ్రీరాముని సేనవలె లెక్కలేనన్ని యున్నవి.

తా: దొరా! అల్లదిగో, మబ్బులు లేచుచున్న చోట అడవిలో అబ్బ! క్రూరమృగములు లెక్కలేనన్ని యున్నవి.

సీ. కంఠాతికై రాయుఁ ♦ గర్కశం బగుతుంటెఁ
బీఁట వెట్టిన మ్రాను ♦ పెల్లగిల్లఁ
జెవి దార్చి విని చీమ ♦ చిటు కన్న నొకపారి
సెలవి వెంపర లాడు ♦ జిట్ట లెల్ల
జప్పరించు వెదుళ్ళు ♦ సట లుబ్బ దంష్ట్రాగ్ని
చొంగపైఁ బడి చుంయి ♦ చుంయి మనఁగఁ
జండ్రనిప్పులువోలెఁ ♦ దీండ్రించు కనుమించు
లెసఁగ నొండొంటిపై ♦ నెక్కఁ గాలు

తా: ఆ కొండపై వడగండ్లు చిటపటమని రాలగా, మేఘములు పెళపెళ లాడగా నానఁగోడిగాలి వీచుటచే కొండగుహాలు హోరుమ్రోగునట్లు వాన కురిసినది.

క. తెలతెల వేఁగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించు సెలల ♦ చప్పుళ్లు శిఖా
వల కుల కల కేకా కల
కలములు గలతలపాలంబు ♦ గనుఁగొను వేడ్కన్. 12

టీ. తెలతెలవేగినన్ = తెల్లగా తెల్లవారగా; ఆ+గిరిన్ = ఆ కొండపై; జలజలన్ = జలజలలాడుచు; ప్రవహించు సెలల చప్పుళ్ళు = ప్రవహించెడి సెలయేళ్ళ చప్పుళ్ళు; శిఖావలకుల = నెమళ్లగుంపుయొక్క; కల = అవ్యక్తమధురమైన; కేకా కలకలములుకల = (నెమళ్ళకూతల) కేకల ధ్వనులును కల్గిన; తలపాలంబున్ = ఎత్తు ప్రదేశమును; కనుగొను వేడ్కన్ = చూచెడి కోరికతో......

తా. తెల్లవారగనే ఆ కొండమీద సెలయేళ్ళు జలజల ప్రవహించు చప్పుళ్ళును వాన కురిసినందున కేరింతలుకొట్టుచు సంతోషముతో కూయు నెమళ్ళకేకలునుకల కొండప్రదేశమును చూచెడి కోరికతో......

ఆ. అన్నగాగ్ర మెక్కి ♦ యం దొక్క శశికాంత
వేదిఁ గతిపయాప్త ♦ వేష్టితుండుఁ
గుటజవిపినపవన ♦ నట దలకభరుండు
నగుచుఁ బ్రొద్దు జరపు ♦ నవసరమున. 13

టీ, ఆ+నగ+అగ్రము+ఎక్కి = ఆ కొండశిఖరమెక్కి; అందున్ = అక్కడ; ఒక్క శశికాంత వేదిన్ = ఒక చంద్రకాంతపు అరుగుపై; కతిపయ+ఆప్త వేష్టితుండున్ = కొందరాప్తులతోకూడినవాడును; కుటజవిపిన = కొండమల్లెల పొదలనుండి వచ్చు; పవన = గాలిచే; నటత్ = ఎగురుచున్న; అలకభరుండున్ = ముంగురులుకలవాడును; అగుచున్; ప్రొద్దుజరపు+అవసరమునన్ = కాలక్షేపము చేయు సమయమందు...

తా: అప్పుడు స్వరోచి కొండ చివరికెక్కి చలువరాతిపై కూర్చుండి, కొంద రాప్తులతో కాలక్షేపము చేయుచుండగా...

ఆ. ఒక్క యెఱుకుఱేఁడు ♦ నక్కకొమ్మును నిఱ్ఱి
గోరజంబు జున్నుఁ ♦ జారపప్పు
బీలిగఱులయంప ♦ కోలలు సెలవిండ్లు
గాను కిచ్చి కర యు ♦ గంబు మొగిచి. 14

టీ: ఒక్కయెఱుకుఱేఁడు = ఒక కోయదొర; నక్కకొమ్మును = నక్కయొక్క కొమ్మును—ఒకజాతి నక్కకు నడినెత్తిన కొమ్ముండునట; ఇఱ్ఱిగోరజంబును = కస్తూరియును; జున్నును = తేనెపెరయు; చారపప్పును; పీలిగఱులయంపకోలలును = పికిలి పిట్టల యీకలు కట్టిన బాణములును; సెలవిండ్లును = సెలబద్దలవిండ్లును;

కానుక+ఇచ్చి; కరయుగంబున్ = రెండు చేతులను; మొగిచి = దగ్గరకుచేర్చి-దండము పెట్టి...

వ. యుగవిగమసమయ సముద్భూతజీమూత పటలంబునుం బోలె కైలాసగిరినితంబ ప్రాంతకాంతార పర్యంతంబు నిరంతరంబై కాఱుకొన్న యొక్కగహనరేఖం గరాంగుళిం జూపి భూపతి కిట్లనియె. 15

టీ యుగ = మహాయుగము యొక్క; విగమసమయ = ముగియుకాలమందు; సముద్భూత = పుట్టిన; జీమూతపటలంబునుంబోలెన్ = మేఘముల సముదాయమువలె; కైలాసగిరి = కైలాస పర్వతముయొక్క; నితంబప్రాంత = మధ్యవరకునున్న; కాంతార పర్యంతంబున్ = కారడవి వరకును; నిరంతరంబై = దట్టమై; కాఱుకొన్న = గుబురుగా పెరిగిన; ఒక్కగహనరేఖన్ = ఒక యడవి వరుసను; కర+అంగుళిన్ = చేతివ్రేలితో; చూపి; భూపతికిన్ = స్వరోచితో; ఇట్లనియెన్.

తా: ప్రళయ కాలమందలి మేఘములు వలె నల్లగా గుబురుగా కైలాసగిరి వరకు కన్పడు అడవి చాల్పును చూపి ఆకోయవారు స్వరోచితో ఇట్లనెను.

క. అల్లదె కంటే పానపాన
దెల్లనిగట్టుఅుత మబ్బు ♦ దేఱెడు పొల మం
దెల్లెడఁ జూచిన ధరణీ
వల్లభ! సీరాముసేన ♦ వాలుమెకంబుల్. 16

టీ: ధరణీవల్లభ = రాజా! అల్లదె = అకన్పడుచున్నది; కంటే = చూచితివా? పానపాన = చూచాయగా; తెల్లనిగట్టు+అఱుతన్ = తెల్లని కొండప్రక్కన; మబ్బు దేఱెడు పొలమందున్ = మబ్బులులేచు ప్రదేశమున; చూచినన్ = చూడగా; ఎల్ల+ఎడన్ = అంతటను; వాలుమెకంబుల్ = క్రూరమృగములు; సీరాముసేన = శ్రీరాముని సేనవలె లెక్కలేనన్ని యున్నవి.

తా: దొరా! అల్లదిగో, మబ్బులు లేచుచున్న చోట అడవిలో అబ్బ! క్రూరమృగములు లెక్కలేనన్ని యున్నవి.

సీ. కంఠూతికై రాయుఁ ♦ గర్కశం బగుతుంటెఁ
బీఁట వెట్టిన మ్రాను ♦ పెల్లగిల్లఁ
జెవి దార్చి విని చీమ ♦ చిటు కన్న నొకపరి
సెలవి వెంపర లాడు ♦ జిట్ట లెల్ల
జప్పరించు వెదుళ్ళు ♦ సట లుబ్బ దంష్ట్రాగ్ని
చొంగపైఁ బడి చుంయి ♦ చుంయి మనఁగఁ
జండ్రనిప్పులువోలెఁ ♦ దీండ్రించు కనుమించు
లెసఁగ నొండొంటిపై ♦ నెక్కఁ బాఱు

గీ. వెట్టదినముల మడుఁగుల ♦ మట్టికలఁప
బుడబుడధ్వని వెడలు బు ♦ ద్బుదములందు
జిలుప చిలుపని నేతులు ♦ జిడ్డు దేలు
నేమి చెప్పుదుఁ గ్రొవ్విన ♦ యేకలములు. 16

టీ: క్రొవ్విన యేకలములు=మదించిన అడవి పందులు; కండూతికై=దురద తీయుటకై; కర్కశాంగు=బిరుసైన; తుంటిన్=పిఱ్ఱతో; పీటవెట్టిన ద్రుమాను=పాదుకొన్న చెట్టు; పెల్లగిల్లన్=పెల్లగిలిపడునట్లు; రాయున్=రాచును; చీమచిటుకవన్=చిన్నచప్పుడైనచో; చెవి+తార్చి విని=చెవియొగ్గి విని; ఒకపారి=ఒకసారి; సెలవి=కోరతో చిమ్మి; జిట్టలెల్లన్=వెదురువెన్నులన్నియు; వెంపరలాడున్=చెదరగొట్టును; సటలు=మెడమీఁది వెండ్రుకలు; ఉబ్బన్=నిక్కపొడుచుకొనఁగా; దంష్ట్రా+అగ్ని=కోరలరాపిడి వలన పుట్టిన నిప్పు; చౌంగ; పైన్+పడి=మీఁద పడుటచే; చుంయి చుంయి మనఁగన్=చుంయి చుంయి లాడఁగా; వెదుళ్లు=లేత వెదురుమొలకలను; చప్పరించున్; చంద్రనిప్పులు వోలెన్=చంద్రబొగ్గుల నిప్పుల వలె; తీండ్రించు=ప్రకాశించు; కనుమించులు=మెరపులవంటి కన్నులు; ఎసఁగన్=మెరయఁగా; ఒండు+ఒండు+పైన్=ఒకదానిపైనొకటి; ఎక్కన్=ఎక్కుటకు; పొఱుచున్=పరుగెత్తును. వెట్టదినములన్=వేసవిలో; మడుఁగులన్=చెరువులలో; మట్టి=కాళ్ళతో త్రొక్కి; కలఁపన్=బురదను కదలించఁగా; బుడబుడధ్వని వెడలు బుద్బుదములందున్=బుడబుడమను బుడగలలో; చిలుపచిలుపని=కొద్దికొద్దిగా వెడలు; నేతులు జిడ్డు=చమురున్నట్లు జిడ్డు; తేలున్=పైకి కనిపించును; ఏమి చెప్పుదును=వాని చేష్టలేమని వర్ణింపగలను? అలం. అతిశయోక్తి, ఉపమ, స్వభావోక్తియు.

చ. బల మిఁక నేమి సెప్ప విను ♦ పండువెదుళ్లవలీల మోరత్రో
పులఁ బడఁ జొప్ప వంచికొను ♦ పోలిక వంచి తదగ్రధాన్యముల్
సెలవుల ఫేన ముట్టిపడ ♦ జిట్టలతోడనె చప్పరించు న
ప్పొలము వరాహపోతములు ♦ భూవర తొండములేని యేనుఁగుల్.

టీ. భూవర=రాజా! విను=వినుము; ఆ+పొలము=ఆ ప్రదేశమందలి; వరాహపోతములు=అడవిపందిగున్నలు; తొండములేని యేనుగుల్=తొండములేని యేనుగులవంటివి. ఇకన్=ఇంకను; బలము=వాని బలము; ఏమి చెప్పన్=ఏమని చెప్పను? పండువెదళ్లు=ముదిరిన వెదుళ్ళను; అవలీలన్=తేలికగా; మోరత్రోపులన్=ముట్టెతోడి త్రోయుటలచే; పడన్=పడునట్లు; చొప్ప=జొన్నకఱ్ఱను; వంచికొనుపోలికన్=వంచునట్లు; వంచి; తత్+అగ్రధాన్యముల్=దానిచివరనుండు కంకులను; సెలవులన్=పెదవులమూలలలో; ఫేనము=నురుగు; ఉట్టిపడన్=ఎక్కువకాగా; జిట్టలతోడనె=వెన్నులతోనే; చప్పరించున్=నములును.

తా. అక్కడి అడవిపంది పిల్లలు తెగబలిసి యేనుగుగున్నలవలె నున్నవి. పండిన వెదుళ్లను చొప్పలను వంచినట్లు వంచి వెన్నులను చప్పరించుచున్నవి. అలం. రూపకము, స్వభావోక్తి, ఉపమయు.

క. పొడిచిన కైదువునకుఁ జము
రిడఁ గావల దగ్గికాఁక ♦ యించుక యిడినం
జెడుగట్టుల గ్రుచ్చిన సం
జుడు మంటలఁ దగిలి నెయ్యి ♦ జోటజోట వడియున్. 19

టీ: పొడిచిన కైదువునకున్ = ఆ పందులను పొడిచిన ఆయుధములకు; చమురు = నూనె; ఇడగాన్ = త్రుప్పుపట్టకుండుటకై పూయుట; వలదు = అవసరము లేదు; చెడుగట్టులన్ = కర్రలవంటి ఇనుప యూచలతో; గ్రుచ్చిన సంజుడు = గ్రుచ్చబడిన మాంసము; అగ్గికాఁకన్ = నిప్పు సెగయందు; ఇంచుక యిడినన్ = కొద్దిగా పెట్టినను; మంటలన్ = మంటలందు; తగిలి = తగులుటచే; నెయ్యి = చమురు; జోటజోటవడియున్ = ధారగా కారును.

తా: మాంసపుముక్క నిప్పుసెగ చూడగానే నూనె కారునంతగా ఆ పందులు బలిసినవని భావము.

తే. వలదు కుక్కల విడువంగ ♦ వలవ దేయ
నడచి మొలపిడియమ్మునఁ ♦ బొడువవచ్చుఁ
బంకము గొరిజ దిగఁబడఁ ♦ బఱవలేవు
మన్ను లివ్వేళ రేగడి ♦ మన్నులందు. 20

టీ. మన్నులు = ఒకజాతి మృగములు; ఈ + వేళన్ = ఇప్పుడు—వానకురిసినప్పుడు; రేగడి మన్నులందున్ = నల్లమన్నులో; పంకమున్ = బురదలో; గొరిజ = కాలిగిట్ట; దిగఁబడన్ = క్రుంగగా; పఱవలేవు = పరుగెత్తలేవు. (కాన) కుక్కలన్ = వేటకుక్కలను; విడువంగన్ = ఉసికొల్పుటకు; వలదు = అవసరములేదు; ఏయన్ = బాణములేయుట; వలవదు; నడచి = మెల్లగా నడచి; మొలపిడియమ్మునన్ = మొలలో దోపుకొన్న బాకుతో; పొడువవచ్చున్.

తా: రేగటి మన్నులో వానకురిసినప్పుడు బురదగానుండి గిట్టలు దిగబడినందున మన్నులనెడి మృగములు పరుగెత్తలేకున్నవి, కావున వానిని చంపుటకు కుక్కల నుసికొలుపనక్కరలేదు; బాణములేయనక్కరలేదు. బాకుతో పొడువవచ్చును.

క. పొడ చెదరి బోదచఱచిన
మొడలులతో నాల్గు రెండు ♦ నొకటియుఁ బఱిగల్
వెడలిన కొమ్ములు బరువున
నడుగిడఁగా లేవు బలిసి ♦ యందలి దుప్పుల్. 21

టీ: అందలిదుప్పుల్; బలిసి; పొడచెదరి = ఒళ్ళంతయు మచ్చలుగ్రాకి; బోదచఱచిన మొడళ్ళతోన్ = మదించిన శరీరములతో; నాల్గు; రెండును, ఒకటియున్;

ప్రంగల్ = చిగిరికలు; వెడఁదికిఁ = కప్పియున్న; కొమ్ముబయవురన్ = కొమ్ముల బయపుతో; అడుగు+ఇడఁగాలేవు = అడఁగు వేయలేవు.

తా: అక్కడి గొప్పలు సెలగించి కొమ్ములు పంగలుతీరి బరువెక్కినందున పయనాత్త లేకున్నవి. అలం. అతిశయోక్తి.

ఆ. చలము లొదవ ముండ్లు ♦ గల మ్రాఁకుడీములఁ
గెరలి తాఁకి కొమ్ము ♦ లురులఁ దగిలి
వాని లేవ నీడ్చి ♦ కానకే కొనిపోవుఁ
బోతరించి యిఱ్ఱి ♦ పోతులచట. 22

టీ. అచటన్; ఇఱ్ఱిపోతులు = మగజింకలు; పోతరించి = మదించి; చలములు = మాత్సర్యములు; ఒదవన్ = కల్గగా; ముండ్లుకల = ముండ్లున్న; మ్రాఁకుడీములన్ = కొయ్యబొమ్మలను; కెరలి = కోపించి; తాఁకి; కొమ్ములు = తమ కొమ్ములు; ఉరులన్ = వలలో; తగిలి = తగుల్కొని; వానిన్ = ఆ బొమ్మలను; లేవన్ = లేపుకొని; ఈడ్చి = లాగి; కానకే = అడవికే; కొనిపోవున్ = తీసికొనిపోవును.

తా: ఇఱ్ఱులను పట్టుటకై ముండ్లున్న కొయ్య యిఱ్ఱులను ఉరులొగ్గి వేటకాండ్రు పెట్టగా అవి యా బొమ్మలను తాకి కొమ్ములకు ఉరులు తగుల్కొనగా ఆబొమ్మలను లేపుకొని అడవులకు కొనిపోవుచున్నవి. అ వంత బలిసియున్నవి. అలం. అతిశయోక్తి.

ఆ. కప్పువెట్టి వెన్ను ♦ కందమ్ము సమముగాఁ
బొదలి జోళ్లు గట్టి ♦ పోరుచుండి
మలయుఁ గాని పోవు ♦ మానిసిఁ బొడఁగన్న
నేమి చెప్ప వాని ♦ యీసు లధిప. 23

టీ. అధిప = రాజా! కప్పువెట్టి = ఒళ్ళు నలుపెక్కి; వెన్ను = వీపు; కందమ్ము = మూపును; సమము గాన్; పొదలి = బలిసి; జోళ్లుగట్టి = రెండేసి; పోరుచున్+ఉండి = దెబ్బలాడుచును; మానిసిన్ = మనుష్యుని; పొడగన్నన్ = చూచినను; మలయున్+కాని = దెబ్బలాడుచుండునే కాని; పోవు = పారిపోవు. వానియీసులు = వానికోపములు; ఏమిచెప్పన్ = ఏమని చెప్పను? అలం. అతిశయోక్తి.

క. కట్టియఁ జేకొని డేగం
బట్టి యుబుసుపోకఁ బొలము ♦ మట్టినఁ జాలున్
దొట్టినక్రొవ్వులు ♦ గలయవి
చెట్టడిచినఁ జెఱుఁ డేమి ♦ చెప్పం బులుఁగుల్. 24

టీ: కట్టియన్ = కఱ్ఱను; చేకొని = చేతపట్టి; డేగన్ = వేటడేగను; పట్టి = తీసికొని; ఉబుసుపోకన్ = కాలక్షేపమునకై; పొలము = ఆయడవిని; మట్టినన్ = త్రొక్కినచో; చాలున్ = అంతే; పులుఁగులు = పక్షులు; తొట్టిన క్రొవ్వులుగలయవి = తెగ

బలిసినవి; కొట్టు+అడిచినన్ = కొట్టును క్రమతో తాటించినను; చేకోఁడు = నాటల కోలది (దొరకును) ఏమిచెప్పన్ = ఏమిచెప్పనగును? అలం. అతిశయోక్తి.

తే. ఉడుము గరిమిడికొక్కం దం ♦ దడియు వెల్ల
యెలుక కల్లెల్క తఱుచును ♦ నేమిచెప్ప
నడవి నెల్లెడఁ జూచిన ♦ నవనినాథ
జల్లెడయుఁ బోలె లాఁగల ♦ నుల్లసిల్లు. 25

టీ. అవనినాథ = రాజా! ఉడుము = ఉడుములయొక్క; గరిమిడి కొక్కల దండడియు = పందికొక్కుల తఱచును; వెల్లయెలుక = తెల్లయెలుక; కల్లెల్క తఱుచును = రాళ్ళను దొలుచు నెలుకలయొక్క యభివృద్ధిని; ఏమిచెప్పన్ = ఏమనిచెప్పను? అడవిన్ = అడవిలో; ఎల్లెడన్ = అంతటను; చూచినన్ = చూచినచో; లాఁగలన్ = కలుగులతో; జల్లెడయుఁబోలెన్ = జల్లెడవలె; ఉల్లసిల్లున్ = ప్రకాశించును.

తా. ఆ యడవిలో ఉడుములు, పందికొక్కులు, వెల్లెలుకలు, చిట్టెలుకలు, రాయెలుకలు నెన్నియున్న వనగా అడవి యొక్కడ జూచినను జల్లెడవలె అంతటను కన్నములే గుండునంతగా నున్నవి. అలం, అతిశయోక్తి.

క. అనుటయు మృగయాకౌతుక
మునఁ జిత్తము చెంగలింప ♦ భూధరశృంగం
బుననుండి డిగ్గి నగరికి
ననిమిషకాంతాకుమారుఁ ♦ డరిగి రయమునన్. 26

టీ. అనుటయున్ = అని కోయవారు చెప్పగా; మృగయాకౌతుకమునన్ = వేటయందలి వేడుకతో; చిత్తము = మనస్సు; చెంగలింపన్ = మిక్కిలి ఉరకలాడగా; అనిమిష కాంతాకుమారుఁడు = దేవతాస్త్రీకొడుకగు స్వారోచి; భూధర శృంగంబుననుండి = కొండశిఖరమునుండి; డిగ్గి = దిగి; నగరికిన్ = పట్టణమునకు; రయమునన్ = వేగముగా; అరిగి = వెళ్ళి......

తా. అనుటతో వేటమీది వేడుకతో కొండకొమ్ము దిగి నగరికేగి......

వ. నగరు సొచ్చి యచ్చటం గక్ష్యాంతరశాలాంతరాళంబుల నందంద తండతండంబులై వ్రేలు నత్తెంబులం జమురంటు పలల కండంబుల మండితంబులగు నిడుదవెదురు దండెంబుల బర్హిబర్హా నిబద్ధాగ్రంబులై కొమరారు దోరెపుఁ ద్రాళ్లతోడం దిరుగుడుల వెడంగునడి వడిదప్పునట్లు త్రాళ్లం గట్టువడి పొట్ట లదురంగ నిక్కి పరిసెనంబులు వేయునవియును, నపహాసిత శార్దూలకుటిలనఖకోటి పాటవంబు లగుతోఁట్రిపుటంబులం జటక సరటాది జంతుకళేబరంబులం జరణనఖరాంకురంబుల నిటికి చీఱుచుం గేరునవియును, నాఁడు

నాఁటికిం బాటించి వేఁటకాం డ్రిదనెఱింగి మేపుమేపుల చమత్కారంబుల నిరాకరించి వీఁకునం దిరిగి తిరిగి యీఁకదీర్చుకొనునవియును, బడ నగ్గలించి కూయుచుం గడుపు నకనకంబడం గనుకట్టుతోడ మోములు మలంచుచుఁ బంజరస్థిత కీరశారికాపారావతాదుల పలుకు లాకర్ణించి యెగసి యెగసి నిజావస్థితతాదృగ్విధాధార వేణుయష్టులకుఁ జట్టుపలు చెదరం బ్రదక్షిణభ్రమణంబులం బరిభ్రమించి మగుడ నెట్టకేలకు మట్టుకొనునవియును, మేరమీఱం దిన్నయెరల నన్నుకొని యరగన్ను వెట్టి బోరకడం బాటమరింపం గూరుకుచుం గుతికిలంబడునవియునునై, పఱఁగు పలుదెఱంగుల జేగమొత్తంబులను; గుత్తంబులగు మిగుల మెత్తనిజలపోత తోలుపట్టెడలు మెడల నమరం బసుపార్చి కట్టుఁగంబంబులకుం దార్చి బంధించిన కుందనంపు గొలుసులు గల్లుగల్లు మనంగ నొడళ్లు జాడించికొనుచుం గొనసాగి సోగలై ముంగిస మోగలుం బోనిమోరలు. సారెసారెకు నెత్తి బయలు పసిపట్టుచుఁ గట్టెదుటివాజిశాలలం గట్టిన పొట్టేళ్లకై యీది గొని నీల్గి కాలుద్రవ్వి ఘనఘనాఘనఘర్ఘుర ధ్వానసమధ్వనులు చెలంగ మ్రోఁగుచునింగిఁ బ్రాఁకుచు నింగలంబులుమియు నయన గోళంబుల నాభీలంబులై వివృతవదనగహ్వరవిలంబి జిహ్వాపల్లవంబులకుం గ్రూరతరదంతకోణకాంతి కలాపంబులం గోరకస్తబక యోగంబు గల్పించుచు, నల్పేతరగ్రస్తకీలాల పలలజాతగ్రాసంబులు నెన్నడుము సన్నఁదనంబున నటమిగుల డిగ్గి చనకునికిం గటితటంబులకంటెం దారె పుటపుట నయ్యెననం దోరంబులగు బోరల గందంబుల నందంబులు గని బిరుదు లంకించి తమ్ము నుపలాలించు పరిపాలకుల సంస్తవంబులకుం జెవిదార్చె ననం గర్ణకిసలయంబులు వ్రాలంబడి వెండిగుండులుం బోలెఁ గన్నులపండువులై గండభైరవు పూజావారువంబు లన మెందుకొనియుండు జాగిలంబులునుం గాంచి యందునందును వేఁటకు నుఱవైనవాని నేర్పఱించి తెచ్చుటకు ననుచరుల నీవు నీవని నియమించి తాను నాఖేటకోచిత పరిపాటి సన్నద్ధుండయ్యె నయ్యవసరంబున. 27

టీ: నగరు=కోటను; చొచ్చి=ప్రవేశించి; కక్ష్యా+అంతర=కక్ష్యలలోని; శాలా+అంతరాళంబులన్=శాలలలో; అందున్ + అందున్+అ=అక్కడక్కడ;

తండతండంబులై = గుంపులు గుంపులై; ప్రేలు+అత్తెంబులన్ = ప్రేలాడెడు అత్తెములను; (అత్తెములనగా హస్తములు. వేట చేయువారు వాని గోళ్లు గ్రుచ్చుకొనకుండ చేతికి కవచము తొడిగికొందురు.) చమురొందు = ముట్టినచో జిడ్డగు; పలలఖండంబులన్ = మాంసపుముక్కలతో; మండితంబులగు = అలంకరింపబడిన; నిడుదవెదురుదండెంబులన్ = పొడవైన వెదురు దండెములను; బర్హిబర్హ = నెమలి పింఛములతో; నిబద్ధ = కట్టబడిన; అగ్రంబులై = కొనలు కలవై; కొమరారు = అందమైన; దోరెంపుఁద్రాళ్లతోడన్ = కట్టు దారములతోను; తిరుగుడులన్ = తిరుగుటలచే; వెడంగువడి = బాధపడి; వడితప్పినట్లు = వేగము తగ్గినట్లు; త్రాళ్లన్ = త్రాళ్లచే; కట్టువడి = బంధింపబడి; పొట్టలు = డొక్కలు; ఆసురంగన్ = వడకునట్లు; నిక్కి = లేచి పరిసెనంబులు సేయునవియును = పల్లటీలు (పల్టీలు) సేయునవియును; (పరిసెనము = డేగలకు మత్తుతగ్గి వేట కుత్సాహము కల్గుటకై వాంతి చేయుటయని కొందరు. ఆయర్థమున 'పరిసెనము సేయునవి' యని యుండవలెను.) అపహసిత = తిరస్కరింపబడిన; శార్దూల = పెద్దపులుల యొక్క; కుటిల = వంకరలైన; నఖకోటి = గోళ్ల అంచుల యొక్క; పాటవంబులు = బలము కలవి—పులి గోళ్లకన్న బలమైనవి; అగ్రక్రోటిపుటంబులన్ = చొప్పలవంటి ముక్కు కొనలచే; చటక = పిచ్చుక; కరట+ఆది = కొండ మొదలైన; జంతుకళేబరంబులన్ = జంతువుల దేహములను; చరణనఖర+అంకురంబులన్ = కాలిగోళ్ల చివరలతో; ఇఱికి = అదిమిపట్టి; చీరుచున్ = చీల్చుచు; కేరునవియును = కేకలు వేయునవియును; నాఁడునాఁటికిన్ = ఆరోజున కారోజు; పాటించి = శ్రద్ధతీసికొని; వేఁటకాండ్రు; అదనెఱింగి = ఆకలి వేళ తెలిసికొని; మేపు = మేసెడి; మేపుల చమత్కారంబులన్ = మేతల నేర్పులను; నిరాకరించి = నిర్లక్ష్యము చేసి; వీఁకసన్ = గర్వముతో; తిరిగి తిరిగి = మాటిమాటికి; ఈకదీర్చుకొనునవియును = రెక్కల చిక్కుల సవరించుకొనునవియును; పదను = మేతసమయము; అగ్గలించి = దాటి; కూయుచున్; కడుపు; నకనకంబడన్ = మాడగా; కనుకట్టుతోడన్ = కన్ను మూయుటతో; మోములు = ముఖములను; మలంచుచున్ = అటునిటు త్రిప్పుచు; పంజరస్థిత = పంజరములోనున్న; కీర = చిలుకలు; శారికా = గోరువంకలు; పారావత = పావురములు; ఆదుల = మొదలైన వాని యొక్క; పలుకులు = కూతలను; ఆకర్ణించి = విని; ఎగసి యెగసి = వానివైపున కెగిరి యెగిరి; నిజ+అవస్థిత = తామున్న; తాదృగ్విధ = అట్టి; ఆధార = ఆధారములైన; వేణుయష్టులనున్ = వెదురుకఱ్ఱలను; చట్టుపలు = రెక్కలు; చెదరన్ = తెగులునట్లు; ప్రదక్షిణభ్రమణంబులన్ = ప్రదక్షిణముగా తిరుగుటలచే; పరిభ్రమించి = తిరిగి; మగుడన్ = మరల; ఎట్టకేలకున్ = చిట్టచివరికి; మట్టుకొనునవియును = కుదురుపడునవియు; మేరమీఱన్ = మితిమించునట్లు; తిన్నయెరలన్ = తినినయాహారములచే; అన్నకొని = మత్తుకొని; అరగన్నుపెట్టి = మ్రాగన్నుగా; బోరకడన్ = రొమ్మువద్ద; పాటమరింపన్ = పైకిలేచునట్లు; కూరుకుచున్ = నిద్రించుచు; కుతికిలంబడునవియునై = జోగునవియునై; పఱఁగు = ఒప్పెడి; డేగమొత్తంబులను = డేగలగుంపులను; (ఇంతవరకు డేగలను వర్ణించినాడు. ఇకపై జాగిలములను వర్ణించుచున్నాడు.) గుత్తమ్ములగు = సమములైన; మిగులమెత్తని = మిక్కిలి మెత్తని; జలపోత = బంగారు

పూతపూసిన; తోలుపట్టెడలు = మెడకుకట్టుగా వేసిన తోళ్లు; మెడలన్ = కంఠము లందు; అనుగాన్ = సరిపడునట్లు; పసుపార్చి = పసుపుతో స్నానము చేయించి; కట్టుగంబంబులకున్ = కట్టుగాళ్లకు; తార్చి = దగ్గరగా చేర్చి; బంధించిన = కట్టిన; కుందనము + గొలుసులు = బంగారు గొలుసులు; ఘలుగల్లుమనంగన్ = గల్లుమని మ్రోయగా; ఒడళ్లు = శరీరములు; జాడించుకొనుచున్ = దులుపుచు-సాగదీసికొనుచు; కొనసాగి = చివరలుచాచి; సోగలై = పొడవై; ముంగిస మోరలుంబోని = ముంగిసల ముట్టెల వంటి; మోరలు = మూతులను; సాటిమాటికిన్ = మాటిమాటికి; ఎత్తి; బయలు = వెలుపలనున్న; పసి పట్టుచున్ = వాసన చూచుచు; కట్టెదుటిగాజిగాలలన్ = ఎదురుగానున్న గట్టుపు గాలలలో; కట్టిడిపొట్టేళ్లకై = కట్టిన గొఱ్ఱెలకై; ఆదిగొని = పొంచి; నిల్గి = ముందుకు సాగి; కాలుద్రవ్వి = కాళ్లతో నేలనుగీరి; ఘన = గొప్పదైన; ఘనాఘన = మేఘముల యొక్క; ఘర్ఘరధ్వాన = పెద్ద యురుములతో; సమ = సమమైన; ధ్వనులు = మోతలు; చెలంగన్ = హెచ్చగా; మ్రోగుచున్ = మొరుగుచు; నింగిన్ = పైకి; ప్రాకుచున్ = లేచుచు; ఇంగలంబులు = నిప్పులు; ఉమియు = క్రక్కెడి; నయన గోళంబులన్ = కన్నులచే; ఆభీలంబులై = భయంకరములై; వివృత = తెరువబడిన వదనగహ్వర = నోటినుండి; విలంబి = వ్రేలాడు; జిహ్వా = నాలుకలనెడి; పల్లవంబులకున్ = చిగుళ్లకు; క్రూరతర = మిక్కిలి కఠినమైన; దంతకోణ = పళ్లకొనలు; కాంతి కలాపంబులన్ = కాంతిసమూహములచే; కోరక స్తబక యోగంబు = మొగ్గల గుత్తుల కలయికను; కల్పించుచున్ = కలుగజేయుచు; అల్పేతర = మిక్కిలి; గ్రస్త = తినబడిన; కీలాల = రక్తముతో కూడిన; పలలజాల = మాంసముల యొక్క; గ్రాసంబులు = ఆహారములు; సెన్నడుము సన్నదనంబునన్ = నడుము యొక్క సన్నదనముచే; అటమిగులన్ = పశుమునించి; డిగ్గిచనక + ఉనికిన్ = దిగి వెళ్ళకుండుటచే; కటితటంబులకంటెన్ = పిరుదుల ప్రక్కల కన్నను; తారె = తామే-రొమ్ములే; పుటపుటనయ్యెన్ = బలిసెను; అనన్ = అనునట్లు, తోరంబులగు బోరలన్ = స్థూలములుగానున్న రొమ్ములచే; కందంబులన్ = మూపుల చేతను; అంసంబులన్ = మూపుల చేతను; అందంబులుకని = అందగించి; బిరుదులు = గొప్పదనములను; అంకించి = చెప్పి; తమ్మన్ = కుక్కలను; ఉపలాలించు = బుజ్జగించెడి; పరిపాలకుల = పెంచెడివారి; సంస్తవంబులకున్ = పొగడ్తలకు; చెవి దార్చెనన్ = చెవియొగ్గినట్లు; కర్ణకిసలయంబులు = చిగుళ్లవంటి చెవులు; వ్రాలంబడి = వ్రేలపడి; వెండిగుండులంబోలెన్ = వెండిగుండ్లవలె; కన్నులపండువులై = కంటికింపై; గండభైరవదేవుని యొక్క; పూజావారువంబులు = పూజకైన గుఱ్ఱములు; అనన్ = అనునట్లు; మెంచుకొనియుండు = నిండుగానున్న; జాగిలంబులన్ = వేటకుక్కలను; కాంచి = చూచి; అంగునంబునన్ = తేగలలోను; ఉఱువైనవానిన్ = సమర్థములైనవానిని; ఏర్పరించి = ఎంచి; తెచ్చుటకున్ = తెచ్చుటకై; అనుచరులన్ = భటులను; నీవునీవని = పేరుపేరు వరుసల; నియమించి = ఆజ్ఞాపించి; తానును = స్వారోచియు; ఆఖేటక = వేటకు; ఉచిత = తగిన; పరిపాటిన్ = క్రమముతో; సన్నద్ధుండు = సిద్ధమైనవాడు; అయ్యెన్. ఆ + అవసరంబునన్ = అప్పుడు...అలం. స్వభావోక్తి, ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకములు.

సీ. పచ్చని హురుముంజి ♦ పనివాగె పక్కెర
పారసీపల్లంబు ♦ పట్టమయము
రాణ నొప్పారు పై ♦ ఠాణంబు సింగిణి
తళుకు లకోరుల ♦ తరకసంబు
మిహీపసిండిపరుంజు ♦ మొహదా కెలంకుల
తావు గుజ్జరిసేత ♦ కేవడంబు
డాకెలంకున సిరా ♦ జీ కరాచురకత్తి
కుఱుఁగటఁ గ్రొవ్వాఁడి ♦ గొఱకలపాది
గీ. పీలికుంచె తలాటంబు ♦ బేరజంబు
మణుల మొగముట్టు పన్ని సా ♦ హిణి యొకండు
కర్త యెదుటికిఁ గొనివచ్చె ♦ గంధవాహ
బాంధవం బగునొక మహా ♦ సైంధవంబు. 28

టీ. పచ్చని=పసుపురంగుగల; హురుముంజిపని=హురుముంజియను వేశమున చేయు ముత్యాల తాపటములు చేసిన; వాగె=కళ్ళెము; పక్కెర=కప్పడము గొంత; పట్టమయము=పట్టుతో తయారైన; పారసిపల్లంబు=పారసీకదేశపు గంతయు; రాణన్ =అందముగా; ఒప్పారు=ఉన్న; పైఠాణంబుసింగిణి=పైఠాణదేశపు ధనుస్సును; తళుకు=మెరయు; లకోరుల=క్రూరబాణముల; తరకసంబు=అమ్ముల పొదియును; మిహీ=వన్నె హెచ్చిన; పసిండి=బంగారుతో చేసిన; పరుంజు=పిడికల్గిన; మొహదా =అడ్డకత్తియు; కెలంకులతావు=ఆ కత్తిప్రక్కన; గుజ్జరిసేత=గుజరాతిదేశపుపని చేసిన; కేవడంబు=కేడెమును; డాకెలంకునన్ =ఎడమువైపున; సిరాజీ=సిరాజీదేశపు; కరాచురకత్తి=వాడియైన బాకును; కుఱుఁగటన్ =ముందు; క్రొవ్వాడి గొఱకలపాది =క్రొత్తగా పదును పెట్టిన చిన్న యీటెల పొదియును; పీలికుంచె తలాటంబు= పికిలిపిట్ట యీకలకుచ్చు తురాయియును; బేరజంబుమణుల=కృత్రిమమణులయొక్క; మొగముట్టు=ముఖపట్టమును; పన్ని—అమర్చి; సాహిణియొకండు = ఒక గుఱ్ఱపు వాడు; గంధవాహబాంధవంబగు=గాలికి చుట్టమైన-సమమైన; మహాసైంధవంబు= పెద్ద గుఱ్ఱమును; కర్తయెదుటికిన్ =రాజునెదుటకు; కొనివచ్చెన్ =తీసికొనివచ్చెను. అలం. స్వభావోక్తి.

క. తెచ్చుటయు నిచ్చ మెచ్చి మ
రుచ్చటులకురంగరయ ని ♦ రోధిస్యద గ
ర్వోచ్చం బగు నత్తేజి సు
హృచ్చక్రం బలర వేగ ♦ యెక్కి వెడలినన్. 29

టీ: తెచ్చుటయును=అతడట్లు గుఱ్ఱమును తేగా; ఇచ్చన్ =మనస్సులో; మెచ్చి; మరుత్ =వాయుదేవునియొక్క (వాహనమైన) చటుల = సమర్థమైన;

కురంగ = లేడియొక్క; రయనిరోధి = వేగమును నిరోధింపగల; స్వదగర్వ = వేగము వలనిఅహంకారముచే; ఉచ్చంబగు = గొప్పదైన; అ+తేజిన్ = ఆగుఱ్ఱమును; సుహృత్+చక్రంబు = స్నేహితుల బృందము; అలరన్ = సంతోషింపగా; వెఁగ = వెంటనే; ఎక్కి; వెడలినన్ = బయల్దేరగా...అలం. ఉపమ.

చ. జడలు మలంచి చౌళ్లెముగ ♦ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బది ♦ లంబుగఁ గట్టిన మట్టికాసెలం
బిడియములంటఁ దోఁపి పృథు ♦ భీషణబాహుల సాళువంబులన్
దడవి కెరల్చుచుం జనిరి ♦ నాథుని మ్రోల నృపాలనందనుల్. 30

టీ: నృపాలనందనుల్ = రాకుమారులు; జడలు = జడలుగా అల్లినజుట్టులను; మలంచి = పైకిచుట్టి; చౌళ్లెముగన్ = మెలిచుట్టగా; సన్నపుఁబాగలు = కోరపాగలు; అడంగన్ = ఆజడ చుట్టల లోపల నణగునట్లు; చుట్టి; చల్లడములు = లాగులు; పూని—కట్టుకొని; మీఁదన్ = వాటిపై; పదిలంబుగన్ = గట్టిగా; కట్టినమట్టికాసెలన్ = బిగువుగా కట్టుకొన్న కాసెకోకలంగు; పిడియములు = బాకులను; అంటన్+తోఁపి = లోపలికిదోపి; పృథు = పెద్దవైన; భీషణ = భయంకరమైన; బాహుల = చేతుల మీఁది; సాళువంబులన్ = డేగలను; తడవి = నిమిరి; కెరల్చుచున్ = కోపింప జేయుచు; నాథుని మ్రోలన్ = రాజైన స్వరోచికి సుందర; చనిరి = వెళ్లిరి.

తా: స్వరోచి గుఱ్ఱమునెక్కి బయల్దేరగానే తక్కిన రాకుమారులు జడలు పైకి కట్టుకొని, అవి యణగునట్లు సన్నని పాగలు చుట్టుకొని, లాగులు తొడిగి, వానిపై నడ్డికి కాసెకోక చుట్టి బాకులను దోపి, చేతులపై నెక్కించుకొన్న డేగలను నిమురుచు రాజు ముందర నడువసాగిరి.

సీ. ఇవి కంకపాశంబు ♦ లింత దుస్సినమీఁదఁ
బడి దిశాకరి నైనఁ ♦ గెడపఁజాలు
నివి మింటఁ బఱచు పక్షీంద్రుఁ జూపిన నీడఁ
బడివాలునం దాఁకఁ ♦ బఱవఁ జాలు
నివి గాలి కనిన మూ ♦ క వరాహదనుజేంద్రు
నైన జుట్టింటిలో ♦ నాఁగఁ జాలు
నివి కాటుకొల్పిన ♦ వృద్ధకూర్మముపీఁపుఁ
జిప్పైన నెఱచి కై ♦ చింపఁ జాలు

గీ. ననఁగ ఘుర్ఘురగతగర్త ♦ జనితభూరి
భూభృదురుబిలభరిత భా ♦ భా భయంక
రార్భటీదీర్ణదిగ్భిత్తు ♦ లగుచుఁ జెలఁగె
సరిపెణలఁ బట్టి తెచ్చిన ♦ జాగిలములు. 31

ఆ. మువ్వ గదల సత్తె ♦ ములనుండి యెగురుచుం
బదను మీఱ నెరల ♦ వెదకు జేగి
పదువు పట్టి దండ ♦ పాణులై నడచిరి
విఘని గెడల జేగ ♦ వేటగాండ్రు. 35

టీ: జేగ వేటగాండ్రు=జేగలతో వేటాడువారు; మువ్వ = కాలికిగట్టిన మువ్వ; కదలన్=కదలునట్లు; అత్తెములనుండి=హస్తకవచములనుండి; ఎగురుచున్=పైకెగసుచు; పదను=వేత వేయు సమయము; మీఱన్=మించగా; ఎదలన్=తిండ్లలకు; వెదకు జేగపదువు=జేగల గుంపును; పట్టి=పట్టుకొని; దండపాణులై=చేతి కఱ్ఱలుపూని; విఘని గెడలన్=కాల్త్రొక్కులంగ; నడచిరి. అలం. స్వభావోక్తి.

ఆ. గూనివీపుల దుర ♦ గొణగి తిట్టుచు నేకు
గఱచినట్టికుక్క ♦ గంట్ల సంగ
మూతినరపమీస ♦ ములబోయముదుసళ్లు
పందివలలమోచి ♦ పఱచిరపుడు. 36

టీ: గూనివీపులు=ముందుకు వంగినవీపులు; అదరన్=వణకగా; గొణగి=పైకివినపడనట్లు; తిట్టుచున్=(అధికారులను) తిట్టుచు; ఏకు=నూలిచుట్టను; కఱచి నట్టి=నోటకఱచిన; కుక్క గంట్లు+అసంగన్=గొంతుకుక్కలా యానునట్లు; మూతి=మూతిమీద; నరపమీసములు=నెరిసిన మీసములు కల; బోయ ముదుసళ్లు=ముసలిబోయలు; అపుడు; పందివలలు=పందులను పట్టుటకు ఉపయోగించు వలలను; మోచి=మోయుచు; పఱచిరి=పరుగెత్తిరి. అలం. స్వభావోక్తి, ఉత్ప్రేక్షయు.

వ. ఇట్లరిగి యమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటం బచ్చికబయళ్ళ మచ్చిక లచ్చుపడం దటిచ్ఛటులంబగు లోచనప్రభాపటలంబు దిక్తటంబులం బర్వం దాఱునూఱుపడ నిడికొనిన మొగంబులతో నేణీజిహ్వాపల్లవోల్లిహ్యమానాంగంబు లగు సారంగంబుల ఖురశిఖా రంగంబు లనం గనుపట్టు చెలికపట్టులును, బిట్టసంగు నాఁకటం దట్టువడి పొట్టకై పుట్టకూటికిం జీమలకుం జెదలునకు నెలుంగులు గులగులం బుట్టలు నిశితనిజనఖరకులిశకోటులం గోరాడ నాదండ గాచుకొని యుండి వెడలిచను విషవిస్ఫురద్భుజగంబుల నల్గడం గబళించి గెంటకుండ దంటు చప్పరించుగతిం జప్పరించుచు నొండొంటికిం బేరంబులు వాటికుప్పించి తప్పించుకొను దుప్పుల ఖురజరజశ్ఛటల నెసకమెసంగు మసమసకల మఱుంగువడియుండు గండోపలంబులును, పరి

హసితసితేతర పాషాణపటలంబు లగువిషాణపరిఘంబు లొండొంటికిం దాకి కట్లు పెట్లుమనం బోరు కారుపోతుల కోలాహలంబులం బ్రతి శబ్దంబు లీనుకోనలును మద మొదవ నెడపదనుసం బొదలు పెట్టలకుం జుట్టంబులై చిల్లరసలుగులం బిల్లలం జుల్లరంబులసాగనిచ్చి గమికి వెనుకయై మలయుచు బెఱుందం దిరుగు చిరుగున్నలకు వెన్నాడు శోఁపోళ్ళ సివంగులం దిరిగి తిరిగి మొత్తి పోనొత్తి చరియించు నేక చరంబుల ఘుష్టరథ్వానంబుల ఘూర్ణమానంబు లగుపరిగెపక్కెపలు మేపరేఁగువేముఘలుగుడు గురివెంద యూదుఁ గేదంగి మోదు గారు కోసింద కవుము కానుగు మొదలగు పొదలం బొడవగు నానావిపిన పాదపకిలాపంబులును, పూటిమాటికి మానిసికాఱు ముఱఁగి తేనువులు కాచికాచి పగ్గత్రిక్షపం దినుపెద్ద పొలవలనం బుటపుటనై తుప్పళ్లు మళ్ళి పెళ్ళి గంతులిడు గబ్బిబెబ్బులులం నలఁగుడుల నొడ్లజనం బులు మంత్రించి పొకడిగించిన నిరుమే పుడిగి గిరులు క్రిక్కిడల వాపోవుచుం దిరిగితిరిగి వాకట్టు విడచినప్పుడు దప్పికై పాఱి సెలయేటి తెంకులం బాఱుమ్ముగు లొమ్ముకెలంకులంగాఁడ గాండ్రుగాండ్రు మని కొప్పి కొప్పి కుప్పరంబుగా వియత్తలంబునకు విల్లెత్తు పాడవు నెగసి నెత్తురులు గ్రక్కుచుఁ గూలుక్రొల్పులుల ఘుర్ఘురధ్వానుల గుండెయ లవిసి కలగుంటువడు కారండవంబుల పటుఘుటపటాత్కారం బుల బోరుకలంగు సెలయేటితెంకులును, మేఁత నెంబడిం బొలము పల్లంబులం దిరిగితిరిగి వెంట్రికలు వెట్టు సెంటపట్టునకు వచ్చి యున్నచటం గుర్చిచ్చి కానరాకుండ మునుమున్న మృగయుండు బిసయొడ్డి సంఘటించిన కాలిబోనులం బడి బెగడక యద్దారు వీడ్చుకొని యీర ములఁ దఱియంబడి యవ్వలికై వెడలి చనలేక గడసి తన్నుకొను చున్న మెకంబుల యాక్రందనంబులం గ్రిందుకొను విషమప్రదేశంబు లును, జిఱుతగండ్లగమిచేత దైవికంబున డాప్రక్కమీఁదువడ దాటు వడి యవిగొంతుక్రొన్నెత్తురు క్రోలి విడిచి చన మార్మెడలు వడి మశకవనదంశమ్ములు మూఁగ మాగంబాఱిన కొండగొఱియ ముఱు గుడు బొంమలకు సందడించు కంకగృధ్రావళుల మొల్లంబుల ముసుంగుపడు పల్లంబులును, మేయుతఱి వీఁ పెక్కి జేఁచొకటి మూపు రంబు కరచి కగచి యెఱచి పడవైవం దోడి యొకటి రెండు మూఁడు

వెనుక ముందఱ నందందఁ గాళ్ళం బెనఁగొంచు నత్తునక లేఁటి యోఁటి తినఁగా వెడలినమెడ మంతుతద్వేనకుం గాక మట్టలెత్తుకొని యొత్తుగల పొదపుటడవులు చొరం బాఱు పిడికడితికదుప్పు నురవడికి విఱిగిపడిన విటపివిటపంబులం దదుకు గొడిచినగతినొండు నెడలును, బనులు పదులు నూఱులు నూఱులు వేలువేలు గుములుగట్టి దట్టం బగు నెయ్యంబున వెదురు బియ్యంబు లొండొంటికొసంగఁ గరివర కరేణువులు వంప ముంపుచెడి యుట్టట్టు తిట్టలగుజిట్టల సంకటంబు లగు డొంకలు, సీత్షించి హర్షించి యెక్కుడుఁదమి నొక్కయెడ నసుగు వెడలనిరొంకిఁ గని వాఱుగవులునకు మెకము దిగదని యెన్ని మన్ను దూర్పెత్తించి గాలి పరికించి దిగువదెస డొడ్డివల పన్ని యెగువ పొలిమేర బారాదియగు దూరం బేఁగఁ బోగుచాటించి యత్రాణ వల మోవం దెరలెత్తి యెత్తిన తెరఁ దుత్తునియగాఁ జించుకొని పాఱినం బోసేక బారిసమగుటకు వలచుట్టునుం జెట్టుదండ గొని నిలువ నలువుగల పుళిందులఁ గొందఱ నిలిపి యమ్మందిపిటుండ జాగిలంబులతోడ నాగురికుల నిలువ నియమించి తెరలకు లోనగువాని నంపుఁ బడం గొట్టించియు గట్టు వెంటదట్టంబుగాఁ బ్రజ నెక్కించి మఱికలయ గహనతలంబున నెల్లం బెల్లుగా విల్లువేఁటకు నేటుదప్పని మేటివిలుకాండ్రి మృగములు వెలువడుటకు హరితచ్ఛదచ్ఛటావృతశిరః కటిధనుష్కోటులై కొట్టుకాసిం జూసెట్టుకొని యెదురుమాటలు గాకుండ నుండి చెదరి పారదెరువులం బఱవకుండ నీరముల సందుసందులం దమతమ కట్టినమోట కత్తుల నొండొండ ఖండితంబులగు మండగల కంప మండలు దోఁచి మునుములం గనుమలొనరించుకొనం బంచి తాను నొక్కొక్కయెడం బాదచారియు నొక్కొక్కయెడఁ దురగాధిరూఢుండును నై యెల్లెడల మెలంగుచుం గూతలెగయఁ బణవమృదంగదుందుభి ప్రముఖతూర్యంబులు గొట్టించియు గాహళులు వట్టించియు నగ్నియంత్రంబులు ముట్టించియు రోద మిన్ను ముట్టం జోపు వెట్టించిన. 37

టీ: ఇట్లు; అరిగి; ఆ+మహారణ్యంబు=ఆ కోయ చెప్పిన యడవిని; చొచ్చి =ప్రవేశించి; నిచ్చలవిడిన్=ఇష్టమువచ్చినట్లు; అచ్చటన్; పచ్చికబయళ్ళన్= పచ్చగడ్డి పెరిగిన బయళ్ళయందు; మచ్చికలు=చనవులు; అచ్చుపడన్=స్పష్టపడునట్లు; తటిత్+చటులంబు+అగు=మెరపువలె చంచలమైన; లోచన = కన్నుల యొక్క; ప్రభాపటలంబు=కాంతిసమూహము; రిక్తటంబులన్=రిక్కలకొనలంగ;

పర్వఁగన్ = వ్యాపించఁగా; తాఱుమాఱుపడన్ = అటునిటుగా; ఇడిన = పెట్టుకొన్న; మొగంబులతోన్ = ముఖములతో; ఏణీ = ఆఁడులేళ్ళయొక్క; జిహ్వాపల్లవ = చిగుళ్ళ వంటి నాలుకలచే; ఉత్ + లిహ్యమాన = పైకి నాకఁబడుచున్న; అంగంబులగు = దేహములు కల; సారంగంబుల = లేళ్ళయొక్క; ఖురళీకారంగంబులనన్ = గరిడీ సాలలోయన్నట్లు; కనుపట్టు = చూపట్టెడి; చెలికపట్టులు = బీళ్లు (అలం. స్వభావోక్తి, ఉత్ప్రేక్షయు) బిట్టు + ఎసంగు + అకటన్ = అంతకంతకు పెరిగెడి యాకలిచే; తట్టువడి = డీలాపడి; పొట్టకై = తిండికై; పుట్టకూటికిన్ = చీమలపుట్టలను కూటి కోసము; చీమలకున్ = చీమలకై; చెదలకున్ = చెదలకై; ఎలుఁగులు = ఎలుగు బంట్లు; గులగులన్ = గులగులమనుచు; నిశిత = వాడియైన; నిజనఖరకులిశ = తమవజ్రముల వంటి గోళ్లయొక్క; కోటులన్ = కొనలతో; కోరాడన్ = మట్టి చెదరఁగొట్టగా; ఆదండన్ = ఆపుట్టల మొదట; కాచుకొనియుండి = కనిపెట్టియుండి; వెడలి = బయటికివచ్చి; చను = వెళ్లెడి; విషవిస్ఫురత్ = విషముచే ప్రకాశించు; భుజంగంబులన్ = పాములను; సల్లడులన్ = నాల్గుదిక్కులందును; కబళించి = నోటపట్టి; గెంటకుండన్ = కదపకుండునట్లు; దంటు = ఎండుచొప్ప కఱ్ఱను; చప్పరించుగతిన్ = నములునట్లు; చప్పరించుచున్ = నములుచు; ఒండొంటికిన్ = ఒక దానిపై నొకటి; పేరెంబులు కాఱి = పసుగులెత్తి; కుప్పించి = పైకెగిరి; తప్పించుకొను; దుప్పుల = దుప్పుల యొక్క; ఖురజ = గిట్టలనుండి పుట్టిన; రజః + ఛటలన్ = ధూళిపరంపరలచే; ఎసకమెసంగు = ఎక్కువగుచున్న; మసమసకలన్ = చిరుచీకట్లతో; మఱుంగువడి = చాటువనుండి; ఉండుగండ + ఉపలంబులును = ఉండెడి పెద్దరాళ్లును,—ఎలుగుబంట్లు చీమలపుట్టల నాహారమునకై కాళ్ళ గోళ్ళతో పుట్టలను త్రవ్వుచుండఁగా వెలికివచ్చి బుసగొట్టెడి పాములను పొంచియుండి తిని బలిసిన దుప్పులు పోరుచుండఁగా వాటి కాళ్ళ రాపిడికి పిండియై పైకి లేచిన పరాగములో పెద్దపెద్ద రాళ్ళు కప్పఁబడుచున్నవని భావము. అలం, స్వభావోక్తి, ఉపమ; పరిహసిత = పరిహసింపబడిన; సితేతర = నల్లని; పాషాణపాటవంబులగు = రాళ్లయొక్క గట్టితనము కలవగు; విషాణపరిఘంబులు = గుదియలవంటి కొమ్ములను; ఒండొంటిన్ = ఒకదానితో నొకటి; తాకి = తగిలి; పోరు = దెబ్బలాడు; కారుపోతుల = అడవి దున్నల యొక్క; కోలాహలంబులన్ = హడావిడులచే; ప్రతిశబ్దంబులు = ప్రతి ధ్వనులను; ఈను = పుట్టించు; కోనలును = కొండల సందులను-కారెనుబోతులు రాళ్ళవంటి కొమ్ములతో దెబ్బలాడుచుండఁగా కొండ సందులనుండి ప్రతి ధ్వనులు వచ్చుచున్నవి. అలం. స్వభావోక్తి, ఉపమయు. మదము = యౌవనగర్వము; ఒదవన్ = కల్గునట్లు; ఎదపదనునన్ = కామోద్రేకము కల్గినప్పుడు; పొదలు పెట్టలకున్ = ఉద్రేకము కల్గిన ఆడుపందులకు; చుట్టంబులై = తగులాటము కలవై; చిల్లర సలుఁగులన్ = సామాన్యమైన పందులను; పిల్లలన్ = చిన్నపిల్లలను; చుల్లరంబులన్ = ఎడపిల్లలను; సాగనిచ్చి = పోనిచ్చి గమికిన్ = గుంపునకు; వెనుకదై = వెనుకనుండి; మలయుచున్ = పెనగులాడుచు; పిఱుందన్ = వెనుక; తిరుగు చిఱుగున్నలన్ = తిరిగెడి చిన్న పందులకై; వెన్నాడు తోడేళ్ళన్ = వెన్నంటివచ్చు తోడేళ్ళను; సివంగులన్; తిరిగి తిరిగి = పలుమారు వెనుకకు తిరిగి; మొత్తి = కొట్టి; పోనొత్తి = పోవునట్లు తరిమి; చరియించు = తిరిగెడి;

ఏకచరంబుల = అడవి పందులయొక్క; ఘుర్ఘురధ్వానంబులన్ = గురగురలతో; ఘూర్ణమానంబులగు = తిరిగెడి; పరిగె, పక్కి, పలుమేర, రేగు, వేము, ప్రుంకుడు, గురివెంద, ఈదు, గేదంగి, మోదుగు, జౌవు, కోరింద, కనుము, కానుగు; మొదలగు = మొదలైన; పొదలన్ = చెట్లు-తీగెలచే; పొడవగు = ఎత్తైన; నానా = పలుపోకలైన; విపిన = అడవిలోని; పాదపకలాపంబులును = చెట్లగుంపులును -వయసువచ్చి కామోద్రేకము పెరిగినందున, ఎదపోయిన ఆడుపందులను కెన్నాడే, పిల్లలను ముందు పోనిచ్చి, పెంటిపందుల వెనుక వచ్చు చిన్నపిల్లలకై వచ్చు పోతేళ్ళను, సివంగులను తరుముచు గురగుర ధ్వనులు చేయుచు అడవి పందుల చప్పుళ్ళతో నిండిన పొదలు కలది; అలం. స్వభావోక్తి, మాటిమాటికిన్; మానిసికాటు = మనుష్యులను కరచుటకు; మరగి = అలవాటుపడి; తెరువులు = దార్లు; కాచికాచి = పొంచియుండి; డగ్గుత్తికపడన్ = గొంతునిండునట్లు; తినుపెద్దపాలవలసన్ = తినెడి మనుష్య మాంసములచే; పుటపుటనై = మిక్కిలి బలిసి; త్రుప్పాళ్ళు = మేనపెరిగిన జుట్టు; డుల్లి = రాలి; త్రుళ్ళి = బలిసి; గంతులిడు = గంతులు వేయు; గబ్బిబెబ్బులుల = పెద్దపులులయొక్క; నలుగుడులన్ = బాధలచే; దొడ్డజనంబులు = పసువుల దొడ్లలోని జనులు; మంత్రించి = మంత్రము వేసి; పొరకదిగిచినన్ = గడ్డిపరక దిగతుడువగా; నీరు; మేపు = మేత; ఉడిగి = మాని; గిరులు గ్రక్కదలన్ = కొండ లదురునట్లు; వాపోవుచున్ = బొబ్బలిడుచు; తిరిగితిరిగి; వాకట్టు = నోటికట్టు; విడిచినప్పుడు = విడువగా; దప్పికై = దాహమునకై; పారి = పరుగెత్తి; సెలయేటి పెంకులన్ = వాగుల ప్రక్కనున్న మడగలలో; పాఱమ్ములు = పెద్దబాణములు; బొమ్మకెలంకులన్ = బొమ్మల ప్రక్కన; కాఁడన్ = నాటగా; గాంధ్రుగాంధ్రు + అని; రొప్పి = కూసి; నొప్పికిన్ = బాధకు; ఉప్పరంబుగాన్ = పైకి; వియత్తలంబునకున్ = ఆకాశము మీదికి; విల్లెత్తుపొడువు = బాణము పోవునంత యెత్తు; ఎగసి = ఎగిరి; నెత్తురులు గ్రక్కుచును; కూలు = నేలగూలునట్టి; క్రోల్పులుల = పెద్దపులులయొక్క; ఘర్ఘరధ్వనులన్ = గరగరలచే; గుండియలవిసి = గుండెలుపగిలి; కలగుండువడు = కలవర పడెడి; కారండవంబుల = నీటి పక్షుల యొక్క; పక్షపుట = పుటముల వంటి రెక్కలయొక్క; పటాత్కారంబులన్ = పట పటలచే; బోరుకలంగు = మ్రోగెడి; సెలయేటి పెంకులును = కొండవాగుల ప్రదేశములును-పెద్దపులులు మనుష్యులను తినమరగి దారి కాచి మనుష్యులను చంపుచుండగా వానిబాధకు తట్టుకొన లేక పసులకాపరులు మంత్రించి వాని నోరు కట్టగా అవి తిన లేక అక్కడక్కడ తిరిగి వారు కట్టు విప్పినప్పుడు నీరు త్రాగుటకై సెలయేళ్ళకు పోవుచుండగా వేటకాండ్రు వేసిన బాణములు రొమ్ములనాటి గాంధ్రు గాంధ్రు మనుచుండగా ఆ కూతలకు భయపడి రెక్కలు కొట్టుకొనుచు మింటి కెగిరిపోవు నీటి పక్షులుచేయు చప్పుళ్ళతో సెలయేళ్ళు చూడ ముచ్చటగా నున్నవి. అలం. స్వభావోక్తి; మేతవెంబడిన్ = మేయుచు; పాలము పల్లంబులన్ = అడవిలోని పల్లపు ప్రదేశములందు; తిరిగి తిరిగి; పెంట్రికలు పెట్టు పెంటపట్టునకున్ = పేడవేయు చోటికి; వచ్చి; అచటన్; గ్రుచ్చి = నాటి; కానరాకుండన్ = కన్పడకుండ; మునుమున్న = ముందుగనే; మృగయుండు = వేటకాడు; బిస = త్రొక్కుటతో బిగియునట్టికీలు; ఒడ్డి = పన్ని; సంఘటించిన కాలిబోనులన్ = కూర్చిన కాలికి తగుల్కొను బోనులలో; పడి = తగుల్కొని; బెగడక = భయపడక; ఆ + దారువు = ఆబోనుకర్ర; ఈడ్చుకొని;

ఈరములన్ = పొదరిండ్లను; తఱియంబడి = దగ్గరకుచేరి; అవ్వలికై = పొదరిండ్లు దాటి బయటికి; కడచిపోలేక = దాటిపోలేక; కెడసి = క్రిందపడి; తన్నుకొను = గిజగిజలాడును; మన్నుమెకంబుల = మన్నులనెడి మృగములయొక్క; ఆక్రందనంబులన్ = అరపులచే; క్రందుకొను = సందడిగానున్న; విషమ = మెట్టపల్లములైన; ప్రదేశంబులను = చోట్లును—మన్నుపోతులు మేతకుపోగా చూచి అవి తిరిగివచ్చు చోట బోనులొగ్గి వేటకాండ్రు దూరమున నుండగా అవి తిరిగివచ్చి కాలువేసిన యంతనే బోనులు తగులుకొన్నను లెక్కసేయక, ఆ బోనులను తీసికొని పారిపోయి పొదరిండ్లలో దూరి యీవలకు రాలేక అక్కడ గిజగిజ తన్నుకొనుచు అరచుచుండగా ఆ కేకలతో సందడి యగుచున్నది. అలం. స్వభావోక్తి. చిఱుతగండ్లగమిచేతన్ = చిఱుతపులుల గుంపులచే; దైవికంబునన్ = దైవవశమున; డాప్రక్కమీఁదుపడన్ = ఎడమప్రక్క పైభాగముగా నుండునట్లు; దాటుపడి = దాటుటనుపొంది; అవి = ఆచిఱుత పులులు; గొంతుక్రొన్నెత్తురులె = కంఠమునుండి వచ్చు క్రొత్త రక్తములే; క్రోలి = త్రాగి; విడిచి; చనన్ = పోగా; మార్మెడలువడి = మెడలువాలునట్లుపడి; మశకవనదంశమ్ములు = దోమలు నడవి యీగలును; మూఁగన్ = ముసరగా; మాగంబాఱిన = క్రుళ్ళికంపెత్తిన; కొండగొఱియ = కొండగొఱ్ఱెలయొక్క; మఱుగుడు బొంకులకున్ = కళేబరముల కోసము; సందడించు = గుమిగూడివచ్చు; కంక = రాబొందులయొక్క; గృధ్ర = గ్రద్దలయొక్క; ఆవళుల = పంక్తులయొక్క; మొల్లంబులన్ = గుంపులచే; ముసుంగువడు పల్లంబులున్ = కప్పబడిన పల్లపుప్రదేశములును;—అనగా చిఱుతపులులు మీఁదినుండి దాటి క్రిందికి పడగొట్టి మెడ నెత్తురులు మాత్రమే త్రాగి పోగా మిగిలిన కళేబరములు క్రుళ్ళి కంపెత్తగా రాబొందులు మొదలైన పక్షులు సందడిగా తిరుగుచున్నందున ఎడతెరిపిలేని పల్లపు ప్రదేశములు. అలం. స్వభావోక్తి. మేయుతఱిన్ = మేయునప్పుడు; ఱేఁచొక్కటి = ఒక ఱేచుకుక్క; వీఁపెక్కి = వీపుమీఁదికెక్కి; మూపురంబున్ = బుజము పైభాగమును; కఱచి కఱచి = తెగకొరికి; ఎఱచిపడవైవన్ = మాంసమును క్రింద పడవేయుగా; తోడియొక రెండు మూడు = వీఁపెక్కిన దానితో వచ్చిన రెండు మూడు ఱేచు కుక్కలు; వెనుకన్+ముందరన్; అందంద = మాటిమాటికి; కాళ్ళన్ = కాళ్ళతో; పెనఁగుచున్ = దెబ్బలాడుచు; క్రింద వేయుచున్న మాంసఖండములను; ఏఱియేఱి తినన్ = ఏరుకొనితినగా; కాలు+ఎడలినయెడన్ = కాలు తప్పినచోట; మండుతద్వేదనకున్ = మండెడియా బాధకు; కాక = సహింపలేక ; మట్టలు = తోఁకలు; ఎత్తుకొని; ఒత్తుకల = దట్టమైన; పొదఱుటడవులు = పొదలున్న యడవులందు; చొరంబాఱు = ప్రవేశించుటకై పరుగెత్తు; పిడికడితికదుపు = ఆడు గోకర్ణ మృగముల మందలయొక్క; ఉరవడికిన్ = వేగమునకు; విఱిగిపడిన; విటపివిటపంబులకున్ = చెట్లకొమ్మలచే; తొడుకువాఁడిచినగతినొండు = వెలుగు వేసినట్లున్న; ఎడలును = ప్రదేశములును;—ఆడుకడుతులు వచ్చి మేయుచుండగా ఱేచుకుక్కలు వచ్చి పైకెక్కి మాంసమును క్రిందికి పడవేయుచుండ, కొన్ని క్రింద తినుచు దానిని కదలనీయక కాళ్ళతో పెనగులాడుచున్నను వీలు చూచుకొని పారిపోవునప్పుడా కడుతుల వేగమునకు కొమ్మలు విరిగి చెట్లు వెలుగు వేసినట్లున్నవి. అలం. స్వభావోక్తి, పదులు పదులు = పది పదేసి; నూఱులు నూఱులు = నూఱు నూఱేసియు; వేలు వేలు = వేలు వేలునుగా; గుములుగట్టి =

గుంపులుగూడి; దట్టంబగు=ఎక్కువైన; సెయ్యంబులన్=స్నేహముతో; వెదురు
బియ్యంబులు=వెదుళ్ళలోని ధాన్యములు; ఒండొంటికిన్=అన్యోన్యము; ఒసంగన్
=ఇచ్చుటకు; కలభకరేణువులు=మగవి ఆడువియు నైన యేనుగులు; వంపన్=వంచగా;
ముంపుచెడి=దట్టనతగ్గి; ఇట్టట్టువడి=ఇటునటుపడి; తిట్టలగు జిట్టలన్=ప్రోగులైన
కంకులతో; సంకటంబులగు=తరచైన; కొంకులను=పల్లములైన బాటలును;—
వందలు వేలుగా గుంపులుగూడి వెక్కు యేనుగులు వంచుటచే దట్టన తగ్గి యిటునటు
పడిన వెదుళ్ళచే చిందర వందరైన బాటలును. అలం. స్వభావోక్తి. ఈక్షించి=
పైన చెప్పిన చిత్రములను చూచి; హర్షించి=సంతోషించి; ఎక్కుడుదమిన్=
మిక్కిలి కోరికతో; ఒక్కయెడన్=ఒకచోట; అడుగు వెడలని టెంకిన్=
అడుగు వేయలేని చోటును; కని=చూచి; పాటుగవులుసన్=తోలుకంపునకు;
మెకమునిగదని=మృగము నిగ లేదని; విచారించి=ఆలోచించి; మన్ను=మట్టిని;
తూర్పెత్తించి=ఎగురవేయించి; గాలిపరికించి=గాలి వాటము చూచి; దిగువవెసన్
=గాలి దిగువ వైపున; దొడ్డివల=దొడ్డివలెనుండు వలను; పన్ని=ఒడ్డి; ఎగువ
పాలిమేరన్=ఎగువచోట; గారాడియగు గూరంబు=చాలదూరము; ఏగన్=వెళ్లు
నట్లు; పోగువారించి=పోగుదారము చుట్టించి; ఆ+త్రాడు+అన్=అత్త్రాటన్=
ఆ త్రాటియందు; వలమోవన్=వల ఆనునట్లుగా; తెరలెత్తి=అడ్డువలలెత్తి; ఎత్తిన
వలన్=ఎత్తినవలనుండి; తుత్తుమురుగాన్=చిన్నగునట్లు; పాటినన్=పరుగెత్తినచో;
పోనీక=పోనియ్యక; బారిసమకుటకున్=చంపుటకు; వలచుట్టును=వలకుచుట్టు
నోరల; చెట్టు దండగొని=చెట్టు నాసరా చేసికొని; నిలువన్=నిలుచునట్లు; నలువు
కలపులింగులన్=శక్తికల బోయలను; కొంపటన్; నిలిపి; ఆ+మందిపిఱుందన్=
వారివెనుక; జాగిలమ్ముతోడన్=వేటకుక్కలతో; వాగురికులన్=వలలొగ్గి వేటా
డెడి వారిని; నిలువన్=నిలుచునట్లు; నియమించి=ఆజ్ఞాపించి; తెరకున్=అడ్డు
వలకు; లోనగువానిన్=లోపల చిక్కుకొన్న మృగములను; అంపన్=అక్కడనే
పడగొట్టించియు; గట్టువెంటన్=కొండమీదుగా; దట్టంబుగా=తరచుగా; ప్రజన్
=జనములను; ఎక్కించి; మఱి; కలయన్=అడవి యంతయు క్రమ్మునట్లు; గహన
తలమున నెల్లన్=అడవి యంతటను; పెల్లుమన్=ఎక్కువగా; విల్లువేటకున్=
బాణము వేయుటకు; ఏటు=లక్ష్యము; తప్పని=తప్పకుండ వేయగల; మేటివిలు
కాండ్రన్=నేర్పైన విల్లు తాల్పులను; మృగమ్ములు వెలువడుటకున్=మృగములు
పొదలు వెడలి వచ్చుటకు; హరితచ్ఛదచ్ఛటా=పచ్చని యాకుల గుబురులచే; వృత
=కప్పబడిన; శిరః=తలలును; కటి=మొదలును; ధనుఃకోటులై=విండ్ల పై భాగ
ములు కలవారై; కొట్టికానిన్=మృగముల పోకడను చెప్పువానిని; చూపెట్టుకొని
=చూచుచుండి, ఎదురుమాటలు=ఎదుటి భాగము మఱుగులు; కాచుండన్; ఉండి;
చెదరి=కలతచెంది; పారదెరువులన్=తప్పుత్రోవలందు; పరపక=పారిపోక;
ఉండన్=ఉండునట్లు; ఈరముల సంగులన్=పొదల సంగులందు; తమ తమ కట్టిన
మోటకత్తులన్=తాము కట్టిన పెద్దకత్తులచే; ఒండొండ=ఒకటి వెనుక నొకటిగా;
ఖండితంబులగు=నరకబడు; మండగలకంపమండలు=దట్టమైన ముండ్లకొమ్మలు;
త్రోచి=అడ్డముగా వేసి, మునుములన్=మొగదలలందు; కనుమల=ఇరుకుత్రోవలు;
ఒనరించుకొనన్=చేసికొనునట్లు; పంచి=ఆజ్ఞాపించి; తానును=స్వరోచియు;

ఒక్కొక్కయెడన్ = ఒక్కొకచోట; తురగాహూషు గతులై = గుఱ్ఱములు నెక్కినవారై; ఎల్లెడలన్ = అన్నిచోటులందును; మెలంగుచున్ = తిరుగుచు; కూంతలు = కేకలు; ఎగయన్ = వ్యాపించునట్లు; పణవ, మృదంగ, గుంగుభి, ప్రముఖ = మొదలైన; తూర్యంబులు = వాద్యములు; కొట్టించియున్; కాహళులు = తుతారాలు; పట్టించియున్ = ఊదించియును; అగ్నియంత్రంబులు = తుపాకులు; ముట్టించియున్ = ప్రేల్పించియు; గోద = చప్పుడు; మిన్నుముట్టన్ = ఆకాశమునంటగా; చోపు వెట్టించినన్ = కలత పెట్టింపగా......

మ. చకితైణాహూతిదావ మావళిత పు ♦ చ్ఛస్వల్పగచ్ఛత్తర
క్షుక మద్రిగ్రహయాళుభల్లుకము వ ♦ క్షోభాగనిక్షిప్త డిం
భకవల్గత్ప్లవగీకదంబము హ్రదాం ♦ భఃప్రోత్థితక్రోడ నా
యక మాభీలముఖద్విపిస్థపుటితం ♦ బయ్యె న్వనం బత్తఱిన్. 38

టీ: ఆ + తఱిన్ = అప్పుడు; వనంబు = అడవి; చకిత + ఏణ = భయపడిన జింకలనెడి; ఆహుతి = హోమద్రవ్యముకల; దావము = వనాగ్నికలదియు; ఆవళిత = ముడుచుకొనబడిన; పుచ్ఛ = తోకలు కలవై; స్వల్ప = మెల్లగా; గచ్ఛత్ = నడుచుచున్న; తరక్షుకము = సివంగులు కలదియు; అద్రి = కొండలను; గ్రహయాళు = పట్టుకొని ప్రాకెడి; భల్లుకము = ఎలుగుబంట్లు కలదియు; వక్షోభాగ = రొమ్ములందు; నిక్షిప్త = ఉంచుకొనబడిన; డింభక = పిల్లలు కలవై; వల్గత్ = దాటుచున్న; ప్లవగీకదంబము = ఆడు కోతుల గుంపులు కలదియు; హ్రద + అంభః = మడుగునీటినుండి; ప్రోత్థిత = పైకివచ్చిన; క్రోడనాయకము = పెద్దపందులు కలదియు; ఆభీల = భయంకరమైన; ముఖ = మూతులుకల; ద్వీపి = పెద్దపులులచే; స్థపుటితంబు = మిట్టపల్లముగా చేయబడినదియు; అయ్యెన్. (ద్వీపియనుటకు 'వ్యాఘ్రే ద్వీపాదద్వీపినౌ' పర్యాయశబ్దరత్నము.)

తా: అప్పుడు అడవి నిప్పులోపడి కాలిపోవు జింకలును, తోకలు ముడుచుకొని మెల్లగా నడుచు సివంగులను, కొండల కెగప్రాకెడి ఎలుగు బంట్లును, రొమ్మునకు పిల్లల నాన్చుకొని పరుగెత్తు నాడు కోతులును, మడుగులనుండి పైకివచ్చి పరుగెత్తు పందులును; భయంకరములైన పెద్దపులులును కలదయ్యెను. అలం. స్వభావోక్తి.

క. నెలవెడలియు నెఱసడలియుఁ
జల ముడిగియు నిదురచెడియు ♦ జంట లెడసియుం,
గలహము లడగియుఁ బఱచెం
బులి కిరి కరి మన్ను దున్న ♦ మొదలగు మెకముల్. 39

టీ: నెలవు = నివాసము; ఎడలియున్ = విడిచియు; నెఱి = బలము; సడలియున్ = తగ్గియు; చలము = పొగరు; ఉడిగియున్; నిదుర = నిద్ర; చెడియున్; జంటలు = జతలు; ఎడసియున్ = విడిపోయియు; కలహములు; అడగియున్ = మానియు; పులి; కిరి = పంది; కరి = ఏనుగు; మన్ను = ఋశ్యమృగము; దున్న =

కొనుపోతు; మొదలగు మెకముల్ = మొదలైన మృగములు; పఱచెన్ = పారిపోయినవి.

ఉ. అత్తఱి వేఁపికాండ్రు యము ♦ నాంబుతరంగపరంపరాకృతిన్
ముత్తరమైన సూకరస ♦ ముత్కరముం గని మోటుకాండ్రు వి
ల్లెత్తకమున్న రాజుమది ♦ కెక్కుడు నట్లుగ దీని మిత్తికిం
బుత్తమటంచుఁ బట్టెడలు ♦ బోరన డుయ్య భయంకరార్భటిన్.

టీ: ఆ+తఱి=అప్పుడు; వేఁపికాండ్రు=కుక్కల వేటగాండ్రు; యమునా+అంబు=యమునానదీ జలముయొక్క; తరంగపరంపరా+ఆకృతిన్ = కెరటముల పంక్తివంటి ఆకారముతో; మూడు+తరము+ఐన = మూడువరుసలైన; సూకరసముత్కరమున్=పందులగుంపును; కని=చూచి; మోటుకాండ్రు=మోటుపెట్టుకొని వేటాడువారలు; విల్లు; ఎత్తకమున్న=ఎత్తకమునుపే; రాజు=స్వారోచియొక్క; మదికిన్+ఎక్కుడు నట్లుగన్=నచ్చునట్లు; దీనిన్=ఈ పందుల గుంపును; మిత్తికిన్ మృత్యువునకు; పుత్తము=పంపుదము; అటంచున్=అని; బోరనన్=శీఘ్రముగా; పట్టెడలు=మెడలకు కట్టిన త్రాళ్ళను; డుయ్యన్=వదలగా; భయంకర+ఆర్భటిన్ =భయంకరమైన అరపులతో......అలం. ఉపమ.

క. జాగిలములు మొఱసడములుఁ
జాగెఁ గలసి చాపముక్త ♦ శరగతి నందా
జాగిలము లెదిరెఁ బందుల
కై గోధాదికము గాలి ♦ కడరె నితరముల్. 41

టీ: జాగిలములు=పెద్దకుక్కలును, మొఱసడములున్=చిన్నకుక్కలును; కలసి; చాపముక్త=వింటినుండి విడువబడిన; శరగతిన్=బాణమువలె; చాగెన్= పరుగెత్తెను; అందున్=వాటిలో; జాగిలములు=పెద్దకుక్కలు; పందులకై; ఎదిరెన్=వెళ్లెను; ఇతరములు = తక్కినవి; గోధా+ఆదికము గాలికిన్ = ఉడుము మొదలైన వాని పసికట్టుటకు; అడరెన్=పూనెను; అలం. నిదర్శన.

సీ. ఎగుచు కూఁతలు మ్రుట్టె ♦ యెత్తి బిట్టాలించి
గమికిఁ గన్నాకయి ♦ గాలి యరయు
వడిఁ గుక్క లంటంగ ♦ వచ్చిన మెడఁ ద్రిప్పి
ఘుర్ఘురించుచు బయల్ ♦ కొమ్ముఁజిమ్ముఁ
దారసించినచోట ♦ దాడునఁ జొటుఁ బాఱి
యొకటి రెంటిని దొబ్బ ♦ లురలనడుచుఁ
బాలచేరులు వట్టి ♦ తూలింప బలిమి నీ
డ్చుకొని డొంకలఁ దూఱి ♦ చుట్లఁ బెట్టు

సీ. నీఁటెపోటులఁ బడి ప్రేవు ♦ లీఁడులాడఁ
బోయి పోలేక దగనొట్టి ♦ పొదలు సొచ్చి
బెండువడియును జోరనీదు ♦ పీఁటవెట్టి
చూపులనె యేర్చుఁ బ్రజ నొక్క ♦ సూకరంబు. 42

టీ: ఒకసూకరంబు = ఒక్క పంది; ఎగుచుకూతలు = వేటకాండ్రు వేయు కేకలను; ముట్టెయెత్తి = మోరపైకెత్తి; బిట్టు = బాగుగా; ఆలించి = విని; గమికిన్ = గుంపునకు; కన్నాకయి = ముందు నడచునదై; గాలియరయున్ = పసిపట్టును; వడిన్ = వేగముగా; కుక్కలు; అంటంగవచ్చినన్ = దగ్గరకురాగా; మెడద్రిప్పి = మెడ వెనుకకుద్రిప్పి; ఘుర్ఘురించుచున్ = గురగురలాడుచు; బయల్ = ఏమియులేనిచోట; కొమ్మన్ = కోరను; చిమ్మన్ = విసరును; తారసించినచోటన్ = కుక్కలు దగ్గరకు వచ్చినప్పుడు; గాయమున్ = తటాలున; చోరబాఱి = వానిపైకిపోయి; ఒకటిరెంటిన్ = ఒకటిరెండుకుక్కలను; బొబ్బలు = మాంసపుకండలు; ఉరలన్ = తెగిపడునట్లు; అడుచున్ = కొట్టును; పాలచేరులం = పాలనరములను; పట్టి; తూలింపన్ = బాధించగా; బలిమిన్ = బలముతో; ఈడ్చుకొని = కుక్కలగుంజుకొని; గొంకలన్ = ముళ్ళపొదలను; తూఱి = దూరి; చుట్లపెట్లన్ = త్రిప్పులపెట్టును; ఈటెపోటులన్ = ఈటెలపోటులచే; పడి = వెలుపలికివచ్చి; ప్రేవులు = ప్రేగులు; ఈడులాడగా = వ్రేలాడగా; పోయి = కొంతదూరము పరుగెత్తి; పోలేక; దగ = దాహము; ఒట్టి = కలిగి; పొదలు = ముండ్లపొదలను; చొచ్చి = ప్రవేశించి; బెండువడియున్ = దీనముగా నున్నను; పీటవెట్టి = కూర్చుండి; ప్రజన్ = వేటకాండ్రను; చోరనీదు = రానియ్యదు; చూపులనే = చూపులతోనే; ఏర్చుఁగా = బాధించును. అలం. స్వభావోక్తి.

క. అట్టియెడ నొక్క వరాహము
బిట్టడచిన మెఱసెఁ గుక్క ♦ ప్రేవులు దంష్ట్రం
జుట్టుకొని రొంపి గలఁపఁగ
నిట్టలముగఁ దగిలినట్టి ♦ యొట్టిలు వోలెన్. 43

టీ: అట్టియెడన్ = అప్పుడు; ఒకవరాహము = ఒకఅడవిపంది; బిట్టు = గట్టిగా; అడిచినన్ = కొట్టగా; కుక్కప్రేవులు = కుక్కలప్రేగులు; దంష్ట్రన్ = కోరయందు; చుట్టుకొని; రొంపిన్ = బురదను; కలపగన్ = కలియబెట్టగా; ఇట్టలముగన్ = ఎక్కువగా; తగిలినట్టియొట్టిలువోలెన్ = కోఱకు చుట్టుకొన్న యొఱ్ఱలో యున్నట్లుగా; మెఱసెన్ = ప్రకాశించెను.

తా: ఒకపంది తన మీదికి వచ్చిన కుక్కను చీల్చి ప్రేగులు కోరకుచుట్టుకొనగా బురద కలియబెట్టునపుడు కోర కంటిన యొఱ్ఱలోయన్నట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బుళిం♦దానీకముం ద్రోచి యు
ర్వరఁ గా లూఁదక దాట నేటలవికిన్ ♦ వాహంబు నడ్డంబు నూ

కి రసావల్లభుఁ జేసె భల్లమున నిం ♦ గిం గాళ్లు జోడించుచో
గోరిజల్ నాలుఁగుఁ ద్రెవ్వ సేనవొగడెం♦గోదండపాండిత్యమున్.

టీ: హరిణాంగకోటి = ఒకజింక; కుక్కుతండమున్ = కుక్కల గుంపును; పుళిందపతి+ఆనీకమున్ = వేటకాండ్ర గుంపును; ద్రోచి = దాటి; ఉర్వరన్ = నేలపై; కాలూనక = కాలు మోపక; దాటన్ = దాటగా; ఏటు+అలవికిన్ = బాణము వేయుట కనువగుటకు; వాహంబున్ = గుఱ్ఱమును; అడ్డంబు = అడ్డముగా; దూకి = తోలి; రసావల్లభుడు = స్వారోచి; నింగిన్ = మింట; కాళ్లు జోడించుచోన్ = ఆ జింక కాళ్లు కలుపుచున్నప్పుడు; గోరిజల్ = గిట్టలను; నాలుగున్ = నాలుగింటిని; త్రెవ్వన్ = తెగునట్లు; భల్లమున = బాణమును; ఏసెన్ = వేసెను; సేన; కోదండపాండిత్యమున్ = విలువిద్యలోని నేర్పును; పొగడెన్.

తా: ఒకజింక కుక్కలను, వేటకాండ్రను దాటి పరుగెత్తుచుండగా స్వారోచి గుఱ్ఱము నడ్డముగా తోలి, ఆ జింక నాలుగు కాళ్లను ముడుచుటకై దగ్గరకు తీసికొన్న క్షణములో ఒక్క బాణముతో నాలుగు గిట్టలను నరికెను. సేన అతని నేర్పునకు మెచ్చినది.

క. పఱచు నొకకడితిఁ బతి ముకుఁ
జెఱమలకై యేయఁ జిప్ప ♦ చినుఁగఁగ నది యు
క్కఱఁ గాఁడి దుస్సి పాఱిన
నఱిముఱిఁ జాపరువువాఱి ♦ యల్లటువడియెన్. 45

టీ: పతి = స్వారోచి; పఱచు నొకకడితిన్ = పరుగెత్తెడి కణితిని; ముకుజెఱమలకై = ముక్కు నూటిగా తెగులుటకై; ఏయన్ = బాణము వేయగా; చిప్ప = ముక్కు ఎముక, చినుగగన్ = చీలిపోవునట్లు; అది = ఆ బాణము; కాడి = నాటి; ఉక్కఱన్ = చేవతగ్గునట్లు; దుస్సిపాఱినన్ = దూసిపోగా; అఱిముఱిన్ = తత్తరముతో; చాపరువువాఱి = కొంత దూరముపోయి; అల్లటువడియెన్ = క్రిందపడెను.

తా: స్వారోచి పరుగెత్తుచున్న కణితిని ముక్కు తెగులునట్లు కొట్టగా అది ముక్కుచిప్ప ఊడి కొంత దూరము పరుగెత్తి పడెను. అలం. స్వభావోక్తి.

మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱయం ♦ గాఁ గాంచి రాజేసె నే
యవడిన్ బాణము వెంటనే నిగిడి పై ♦ కెల్లేచి రా నేసె రెం
డవకాండంబుఁ దదస్త్రముం గొనక డా ♦ యన్వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నంబయి నేల గూలెఁ బవి ధా ♦ రాభిన్నశైలాకృతిన్. 46

టీ: బెబ్బులి = పెద్దపులి; గవిలోన్ = గుహలో; డాఁగి = దాగి; గ్రుడ్లు = కనుగ్రుడ్లు; మెఱయంగాన్ = మెరయుచుండగా; కాంచి; రాజు; ఏసెన్ = బాణమేసెను; ఏయన్ = బాణము వేయగానే; బాణము వెంటన్ = బాణము వెంబడినే

వడిన్ = వేగముతో; నిగిడి = సాగి; అటు = అట్లు; పైకిన్ = రాజుమీదికి; ఏటి = పరుగెత్తి; రాన్ = రాగా; రెండవకాండంబున్ = రెండవ బాణముతో; ఏసెన్; తదస్త్రమున్ = ఆ బాణముకూడ; కొనక = లక్ష్యపెట్టక; డాయన్ = దగ్గరకు; వచ్చి; కౌక్షేయకన్ = కత్తిచే; ప్రతిభిన్నంబయి = నరకబడినదై; పవిధారా = వజ్రపుపదనుచే; భిన్న = తెగగొట్టబడిన; శైల+ఆకృతిన్ = కొండవలె; నేలన్ = నేలపై; కూలెన్ = కూలెను.

తా: రాజు కొండ గుహలో దాగి కన్నుగుడ్లు మెరయు పెద్దపులిని చూచి దానిపైకి బాణము వేయగా; అది బాణము వెంటనే మీదికి వచ్చినది. మరియొక బాణము వేసినను లెక్కచేయక మీదికిరాగా కత్తితో పొడిచెను. అప్పుడది వజ్రపు దెబ్బతిన్న కొండవలె నేలపై బడినది. అలం. ఉపమా, స్వభావోక్తులు.

తే. క్రొవ్వి నడగొండ కయివడి ♦ గునుకు నొక్క
యొంటిగాని మహీనాథుఁ ♦ డొదిఁగి యేయ
గొరక మే నుచ్చి ధరఁ గాఁడ ♦ శిరము విసరె
లే దసృక్పాన మనుచుఁ దె ♦ ల్పెడు ననంగ. 47

టీ: క్రొవ్వి = మదించి; నడగొండకయివడిన్ = నడచునట్టి కొండవలె; గునుకు నొక్క యొంటిగానిన్ = పరుగెత్తెడి పందిని; మహీనాథుఁడు = స్వారోచి; ఒదిగి = ఎదురు తప్పుకొని; ఏయన్ = బాణమేయగా; గొరక = ఆ బాణము; మేనుచ్చి = శరీరమును దూసికొని; ధరన్ = భూమిలో; కాఁడన్ = నాటగా; అసృక్+పానము = నెత్తురు త్రాగుట; లేదు = కల్గలేదు - నీ బాణము నా నెత్తురును త్రాగలేదు; అనుచున్ = అని; తెల్పెడునన్ అంగన్ = తెల్పునట్లుగా; శిరము = తలను; విసరెన్ = ఆడించెను.

తా: ఒకపంది పరుగెత్తుచుండగా రాజు ప్రక్కనుండి బాణమేయగా అది దూసికొని పోయెను. ఆ పంది 'ఏ బాణము నా నెత్తురు త్రాగలేద' ని చెప్పునట్లు తలనూపెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. ఒక్కఁ డడుగత్తి గొఱకవే ♦ యుచును డాఁచి
నట్టరిగి మెంకిఁ గని వీఁక ♦ బట్టుటయును
మృగయు లందఱుఁ జని వెల్వ ♦ రించి నిశిత
కాండములఁ జెండి రొకపెద్ద ♦ కాఱుబోతు. 48

టీ: ఒక్కఁడు = ఒక వేటకాఁడు; అడుగత్తి = కొలెత్తి; గొఱకవేయుచున్ = దున్నపోలరించినట్లు అరచును; అరిగి = వెళ్ళి; మెంకిన్ = కారుపోతులున్న చోట; ఒక పెద్ద కారుపోతున్ = పెద్దదున్నను; కని = చూచి; డాచినట్లు = అక్కడ దానిని తానే దాచినట్లుగా; వీఁకన్ = పట్టుదలతో; పట్టుటయున్ = పట్టుకొనగా; మృగయులందఱున్ = అందరు వేటకాండ్రును; చని = వెళ్ళి; వెల్వరించి = బయటికి తెచ్చి; నిశితకాండములన్ = వాడియైన బాణములతో; చెండిరి = పొడిచిరి; అలం. స్వభావోక్తి.

ఉ. ఆసమయంబునం జకిత ♦ మై మెక మెవ్వనిమీఁదఁ బాఱె వాఁ
డేసినయమ్ము వమ్మయి మ♦ హిం బడ కొక్కటి కొండ చాలి వీ
తాసులఁ జేయ మెచ్చి వసు ♦ ధాధిపముఖ్యుఁడు మోట్లనున్న బా
ణాసనభృత్పుళిందులకు ♦నర్థి నొసంగె సభీప్సితార్థముల్. 49

టీ: ఆసమయంబునన్ = అప్పుడు; మెకము = మృగము; చకితమై = భయపడిన దై; ఎవ్వనిమీఁదన్; పాఱెన్ = పరుగెత్తెనో; వాఁడు; ఏసినయమ్ము = ప్రయోగించిన బాణము; వమ్మయి = వ్యర్థమై; మహిన్ = భూమిపై; పడక = పడిపోక; ఒక్కటికిన్ = ఒకమృగమునకు; ఒండ = ఒకబాణమే; చాలి = సరిపోయి; వీత+అసులన్ = ప్రాణములు పోయిన వానినిగా; చేయన్ = చేయఁగా; మెచ్చి; వసుధాధిపముఖ్యుఁడు = స్వారోచి; మోట్లన్ = మాయమనుష్యపు బొమ్మలచాటున; ఉన్న; బాణాసనభృత్ = విండ్లుకల్గిన; పుళిందులకున్ = బోయలకు; ఈప్సితార్థముల్ = కోరినవస్తువులను; అర్థిన్ = ప్రీతితో; ఒసంగెన్ = ఇచ్చెను.

తా: వేటకాండ్రు ఒక్కబాణముచే నొక్కొక్కమృగమును చంపఁగా వారి నేర్పునకు మెచ్చి రాజు వారికి కోరిన పదార్థముల నిచ్చెను.

క. వలఁబాఱినవానిని భటు
లలుఁగులపాలాడి రధిపు ♦ కై పట్టిరి బె
బ్బులి మహిష మెలుఁగు కిటి దోఁ
డెలు మొదలగువానిఁగొన్ని ♦ టిని వేఁటకరుల్. 50

టీ: భటులు = వేటకాండ్రు; వలన్ = వలనుండి; పాఱినవానిన్ = పరుగెత్తుకొని పోయిన మృగములను; అలుఁగులపాలాడిరి = బాణముల పాలుచేసిరి; వేటకరుల్ = వేటబోయలు; అధిపునకై = రాజునకై; బెబ్బులి; మహిషము = దున్నపోతు; ఎలుగు = ఎలుగుబంటి; కిటి = అడవిపంది; దోఁడెలు; మొదలగు వానిన్; కొన్నిఁటిన్ = కొన్నింటిని; పట్టిరి.

తా: వలనుండి తప్పించుకొన్న మృగములను కోయలు చంపిరి. కొన్నిమృగములను రాజునకు కానుకగా నిచ్చుటకై పట్టుకొనిరి.

తే. మున్ను జాగిలములఁ గూడి ♦ చన్నయట్టి
యుడుపకుక్కలు కుందేళ్ళ ♦ నుందురువుల
నుడుముల గ్రహింపఁ బుట్టలఁ ♦ కడలఁ బొదల
గిరులసఱియలఁ బసివట్టి ♦ తిరుగుచోట. 51

టీ: మున్ను = ఇదివరకు; జాగిలములన్ = వేటకుక్కలను; కూడిచన్నయట్టి యుడుపకుక్కలు = చేరివెళ్ళిన చిన్నకుక్కలు; కుందేళ్ళన్ = చెవులపిల్లులను; ఉందురువులన్ = ఎలుకలను; ఉడుములన్; గ్రహింపన్ = పట్టుటకై; పుట్టలకడలన్ = పుట్టలవద్ద; పొదలన్ = చెట్లపొదలవద్దను; గిరులసఱియలన్ = కొండచరియలమీదను; పసివట్టి = వాసనచూచి; తిరుగుచోటన్ = తిరుగునప్పుడు...

లాడునట్లు; ముండ్లు=దాని యొంటిముండ్లు; గాలిన్ = గాలిచే; కదలుటన్ = కదలుటను; కని=చూచి; పత్త్రికోలల్ = చిల్లులుకల యీకలకోలలతో; పొడిచెన్. అలం. స్వభావోక్తి.

వ. అత్తఱిం దత్తఱంబున మొత్తంబయి చోప్పుడుఁగోలలు గొని కెలంకుల పొలంబుల బులుంగులం జోప్పుచు వేఁగవేటకాండ్రు వేఱుపడి వేటాడం దొడంగి రందు. 55

టీ: ఆ+తఱిన్ = అప్పుడు; వేఁగవేటకాండ్రు; మొత్తంబై=గుంపుగూడి; వేఱుపడి=తక్కిన వేటకాండ్రతో కలియక; తత్తఱంబునన్ = వేగముతో; చోప్పుడుకోలలు=పక్షుల నెగురగొట్టు కఱ్ఱలు; కొని=తీసికొని; కెలంకులపొలంబులన్ = దగ్గరప్రదేశములందు; పులుగులన్ = పక్షులను; చోప్పుచు= లేవగొట్టుచు; వేటాడన్ = వేటాడుటకు; తొడంగిరి= మొదలిడిరి; అందున్ = ఆ వేటలో...

ఉ. లీలఁ బుళిందుఁ డొక్కఁడు క ♦ ళిందసుతోర్మి సరోజినీదళాం
దోళితకోకరేఖఁ దన ♦ తోరపునల్లని దీర్ఘ బాహుపై
హాలహాలంబ పోలె విడి ♦ యత్తెమునం దల యెత్తి చూచు బల్
సాళువము న్వడిం జనుశ ♦ శంబుపయి వ్విడిచెన్ మహోద్ధతిన్. 56

టీ: పుళిందుఁడొక్కఁడు=ఒకబోయవాడు; లీలన్ = విలాసముగా; కళిందసుతా=యమునానదియొక్క; ఊర్మి=కెరటములందలి; సరోజినీదళ=తామరాకునందు; ఆందోళిత=ఊగులాడింపబడిన; కోకరేఖన్ =చక్రవాకమువలె; తన=తనయొక్క; తోరపు=స్థూలమైన; నల్లని దీర్ఘబాహుపైన్ = నల్లని పొడవైన చేతిమీద; విడియత్తెమునన్ =విడిగానున్న యత్తెముపై; హాలహాలంబపోలెన్ = కాలకూటమువలె; తలయెత్తిచూచు=తలెత్తిచూచెడి; సాళువమున్ = డేగను; వడిన్ = వేగముతో; చనుశశంబుపయిన్ = వెళ్లెడి కుందేటిమీదికి; మహా+ఉద్ధతిన్ =ఎక్కువయొగపుతో; విడిచెన్ = వదలెను.

తా: ఒకబోయవాడు తన నల్లని పొడవైన లావైన బాహువుపై, యమునానదీ తరంగములపైనున్న చక్రవాకమువలెనున్న సాళువపుడేగను పరుగెత్తు కుందేటిపైకి వదలెను, అలం. ఉపమ.

క. మొల దట్టి చెఱఁగుఁ జెక్కుచు
బలుదిట్ట కిరాతుఁ డొకఁడు ♦ పటువగు ముష్టిన్
సెలకట్టెఁ బట్టి వేఱొక
సెలకట్టెం గొట్టినై చెఁ ♦ జెమరుం గాకిన్. 57

టీ: బలుదిట్ట = సమర్థుడైన; కిరాతుడొకడు=ఒకబోయ; మొలదట్టి= మొలకు చుట్టుకొన్న కౌసెకోక యొక్క; చెఱగున్ =కొంగును; చెక్కుచున్ = ఎగదోపుకొనుచు; పటువగుముష్టిన్ =దృఢమైన పిడికిటితో; సెలకట్టెన్ = సెలకట్టె

యును డేగను; పట్టి=పట్టుకొని; వేఱొక వెలకట్టెన్=మఱొక బాణముతో; చెమరుంగాకిన్=చెమరుగాకిని; కొట్టివైచెన్=కొట్టి నేలపై పడవైచెను

సీ. పెనుదవ్వ దగ దాఁటఁ • జని రెట్ట వడఁ గొట్టె
నుడువీధి బెళగువ్వ • నొక్క యణుజు
రెక్కదాఁకున స్రుక్క • నిక్కి ప్రక్కలు నొక్కె
నుఱక కల్లేటి నొ • క్కోరణంబు
పొదఁ దూఱు నొకమేటి • పూరేటి వెలికిఁ బోఁ
దోలి కైకొనె నొక్క • తోఁచిగాఁడు
తను నేలు దొర చిత్త • మున మెచ్చఁ దీతువుఁ
జని పట్టె బిట్టొక్క • జాలెడేగ
గీ. విజ్జువిజ్జునఁ దన్నంగ • విడువ కెలమిఁ
గఱకుటంఘ్రుల నిఱికించి • గజ్జె గదలఁ
గఱికి నెఱి నెఱికో లెమ్మ • కయిసు విఱుగ
విఱిచె వడిఁ గైజు నొక పెద్ద • వేసడంబు. 58

టీ: ఒక్కయణుజు=అణుజ నెడి జాతిడేగ; పెనుదవ్వ=చాలదూరము; దగ దాఁటన్=దాహము వేయునట్లుగా; చని=తరుముకొని వెళ్ళి; ఉడువీధిన్=ఆకాశమున; బెళగువ్వన్=పావురమును; రెట్టవడన్ = మలముపడునట్లు—పాఱుకొను నట్లుగా; కొట్టెన్. ఒక్క+ఓరణంబు=ఓరణమను డేగ; రెక్కదాఁకునన్=రెక్క తగులుటచే; స్రుక్కన్=చిక్కునట్లు; ఉఱక=లక్ష్యపెట్టక; కల్లేటిన్=కల్లేడు అనుపక్షిని; నిక్కి; ప్రక్కలునొక్కెన్=ప్రక్కలు నొక్కి పట్టెను; ఒక్క తోఁచిగాఁడు; పొదన్=పొదలో; తూఱు=దూరుచున్న; ఒక మేటిపూరేటిన్=ఒక పెద్ద పూరేడను పిట్టను; వెలికిన్=బయటికి; పోఁదోలి=వెడలఁగొట్టి; కైకొనెన్=పట్టెను; ఒక జాలెడేగ; తను నేలుదొర = తన్ను పెంచెడి యజమానుడు; చిత్తమునన్=మనసులో; మెచ్చన్=మెచ్చునట్లు; చని=వెళ్ళి; తీతువున్=తిత్తిరిపిట్టను; బిట్టు పట్టెన్=గట్టిగా పట్టుకొనెను; ఒక పెద్ద వేసడంబు=పెద్ద డేగ; కైజున్=కైజుపిట్టను; విజ్జువిజ్జునన్='విజ్జువిజ్జు' అను నట్లుగా; తన్నంగాన్=తన్నుచుండగా; విడువక=వదలక; ఎలమిన్=సంతోషముతో; కఱకుటంఘ్రులన్ = వాడియైన కాళ్ళలో; ఇఱికించి=ఇరుకున పెట్టుకొని; గజ్జె=మువ్వ; కదలన్ = కదలగా; కఱికి=రాచి; నెఱినెఱికోలెమ్మకయును; రెక్కయొక్క ప్రతియెముకయు; విఱుగన్=విరుగు నట్లు; వడిన్=వేగముగా; విఱిచెన్.

తా: ఆ డేగవేటలో అణుజు, ఓరణము మొదలగు డేగలు, బెళగువ్వ, కల్లేడు మున్నగు పక్షులను పట్టికొని చంపి తమ యజమానుల కిచ్చినవి. అలం. స్వభావోక్తి.

క. నింగికయి కుంచె యెత్తి వె
సం గో యని యార్వఁ బక్ష ♦ సంహతి గాడ్పుల్
ఱింగని మ్రోయఁ గుజాగ్రపుఁ
గొంగల నొక లగుడు డిగ్గి ♦ కొట్టె నిలఁబడన్. 59

టీ: కుంచె = తోక యీకలకుచ్చు; నింగికయి = పైకి; ఎత్తి; వెసన్ = వడిగా; కోయనియార్వన్ = 'కో' యని కూయగా; ఒకలగుడు = లగుడనెడిడేగ; పక్షసంహతిగాడ్పుల్ = రెక్కలగాలులు; ఱింగని = రింగుమని; మ్రోయన్ = శబ్దించగా; డిగ్గి = క్రిందికివచ్చి; కుజ+అగ్రపుకొంగలన్ = చెట్టుచివరనున్న కొంగలను; ఇలఁబడన్ = నేలమీదపడునట్లు; కొట్టెన్. అలం. స్వభావోక్తి.

వ. ఇట్లాఖేటఖేలనంబున వివిధమృగవిహగవధంబాచరించి చాలించి యంచెలంచెలం బంచతాపతిత చమర సృమరకిరిహరిణ రురుమహిషపృషదంశగోధికాశశపిశితఖండంబు లొండొండ యువ్వెత్తుగా నాకుఁబొత్తరలం గట్టియు గుదులు గుట్టియుఁ జిక్కంబుల నించియుఁ గావడుల నుంచియు సవరించి దిగదిగన విసరి బగబగన మండు చిదుఁగుసొదమంటల కడ్డంబు వట్టి మాసంబులు చూఁడిసూఁడి వాఁడులగు కత్తులం దిత్తులొలిచి కుత్తుకలు గోసి శితముఖంబులగు నఖంబులం బెకలించి విపులవపురపహసిత మహాశైలంబులగు శార్దూలంబుల బొందుల నందందఁ బడవైచి యంతంత గాంతారంబున దంతురంబుగా బడినదంతావళంబుల దంతంబులు గైకొనియుఁ దత్కుంభనిర్గతమౌక్తికంబు లేఱికొనియు గోరజంబుం జమరవాలంబుల బర్హిబర్హంబులంబరిగ్రహించియు మరలి యత్తఱి గడింది నెత్తురుంబ్రొద్దగుట వెఱ చఱవంజఱవ నేఁదుపెనుముండ్లఁ బండ్లసరి యలు నెఱియలువారి బోరనం గారు ధారాళరుధిరాసారపూరంబు నాకి నాకి నాలుకలు దిగవైచి యేచిన మహాతపోష్ణంబునం దృష్ణవొడమి దగనిగుడ వగ రడరి యొడలం దొడలను మెడలనుబెడిదంపు నిడుదకోఱల సలుగు లడచినయెడలం బొడబొడను వెడలెడు నుడుకు నెత్తుటం బడలి తూలు కౌలేయకమ్ముల యంగమ్ము లార్ద్రకర్పటంబుల గప్పి దప్పిసిగుడ నవ్వాలంబు పశ్చిమపుదండ నుండు వెండికొండబండలఁ జండకరకరహిండనంబునం బాండుప్రభలు నిండి పఱచు తఱచుసెలయేఱుల నూరెలంగారుకొనుభూరుహానికాయంబుల

డాయం జని శాద్వలచ్ఛాయల నిలచి యచ్చటం గ్రొచ్చి గరువు నేలల గుంట లొనరించి లోన నుమ్మగిలి గబ్బు వలవక కమ్మతావులు గల నావురాకులు పఱచి యెఱచిలో మేలేఱి కారిజముం గ్రందన కాయ క్రొవ్వు మొదలగు మిగుల మెత్తని పలలభిత్తంబులందుఁ గ్రందుకొనం గ్రుక్కి యెక్కువ తక్కువలు గాకుండఁ గండగల తింత్రిణీశలాటుసంఘాతంబు లామీఁద నెఱయంబచరించి యెసరుగాఁ దేటలగు లేటినల్లలు గ్రుమ్మరించి లవణకణసంచయంబు నించి లావుగాఁ గావుగప్పి యుపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్లసీరాఱు నేఱుఁ బిడుకల దాల్లిడి నెల్లి కొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చు పెరుఁగు చిచ్చు లాంత్రంబులం దవిలించి చిముడ నుడికిన వెలువరించి యుష్మవెష్మాషం గల యప్పిశితఖండంబులు గనగన నిష్ఠులం జమురుచిప్పిలం గాలిచిన కమ్మకఱుసల్లం జట్రాతిపయిఁ గాఁ జేసికిం గుడుపువెట్టి పిదపఁ గొల్ల వెంబడిం బంచుకొని తాను నుపయోగించి తద్దేవతాప్రీతికై తలలుఁ దోఁకలు డొక్కలు నచటి విటపివిటపంబుల వ్రేలంగట్టి శిశిరమధురసలిలమ్ములు ద్రావి నాసురి కులు విశ్రమింప నిలింపాంగనాసుతుండును సహసమాగత చతురవలల కృతఫలమూలాది శుచిమధుర మృగయోచితాహారంబులం దృప్తి వహించి పరిజనారచితపల్లవాసనాసీనుండై గండూషిత పుండరీక మధురసాసారంబులగు నిర్ఝరానిలకిశోరంబు లొలయ నలయికలు దీరియున్న సమయంబున. 60

టీ. ఇట్లు; ఆఖేటఖేలనంబునన్ = వేట యాడుటలో; వివిధ = పలురకములైన; మృగ = మృగములయొక్క; విహంగవధంబు = పక్షులను చంపుటను; ఆచరించి = చేసి; చాలించి; అంచెలంచెలన్ = అక్కడక్కడ; పంచతా = చనిపోవుటచే; పతిత = పడిన; చమర = చమరీమృగములు; సృమర; కిరి = పందులు; హరిణ = లేళ్లు; రురు = నల్ల చారల దుప్పులు; మహిష = అడవి దున్నలు; పృషదంశ = పిల్లులు; గోధికా = ఉడుములు; శశ = కుందేళ్లు; పిశితఖండంబులు = వీటి మాంసపు ముక్కలు; ఒండొండ = వేర్వేరుగా; ఉద్వృత్తిగాన్ = ఎక్కువగా; ఆకుఁబొత్తరన్ = ఆకులమడతలతో; కట్టి; చిక్కిగుట్టియున్ = వ్రేలాడునట్లుకట్టియును; చిక్కంబులన్ = చేతిత్రాళ్ళ సంచులలో; నించియున్ = నింపియు; కావడులన్ = కావళ్ళలో; ఉంచియున్; సవరించి = సర్ది, దిగదిగనన్ = దిగదిగయనునట్లు; విసరి; బగబగనన్ = బగబగమన్నట్లు; మంచి చిదుగుసాదమంటలకున్ = మండెడి యెండుకట్టెల మంటలకు; అడ్డంబువట్టి = అడ్డముగా పెట్టి; మాసంబులు; చూఁడిసూఁడి = కాల్చి

కాల్చి; వాఁడులగు=పదనైన; కత్తులన్=కత్తులతో; తిత్తులొలిచి=చర్మములూడ దీసి; కుత్తుకలు=గొంతులు; కోసి; నిశితముఖంబులగు=వాడికొనలు కల్గిన; నఖంబులన్=గోళ్ళతో; చెకలించి=పైకెత్తిసి; విపుల=పెద్దవైన; వపుః+అపహసిత=శరీరముచే నవ్వబడిన; మహాశైలంబులగు=పెద్దకొండలుకల; శార్దూలంబులబొందులన్=పెద్దపులుల కళేబరములను; అందంద=ఎక్కడఁబడినక్కడనే; పడవైచి=ప్రోగువేసి; (పులి వేటగాఁడు దాని మీసములను కాల్చవలెను. కాల్చనిచో నెవరైనను ఆ మీసములను పరమాన్నములో వేసి వండి శత్రువులకు పెట్టినచో ఆ విషముతో తిన్నవారు చత్తురు. కావున నిచ్చట మీసములు కాల్చఁబడినట్లు చెప్పఁబడినది.) అంతంతన్=కొంతదూరమున; కాంతారంబునన్=అడవిలో; దంతురంబుగాన్ = దట్టనగా; పడిన; దంతావళంబుల దంతంబులు = ఏనుగుల దంతములను; కైకొనియున్; తత్=వాటియొక్క; కుంభనిర్గత మౌక్తికంబులు = కుంభస్థలములనుండి వెలికి వచ్చిన ముత్యములను; ఏఱికొనియున్; (ముత్యములు, ఏనుగుల కుంభస్థలములు, మేఘము; పందికోర, శంఖము, ముత్యపుచిప్ప, చేపతల, పాముపడగ, చెఱకు, వెదురులలో పుట్టును. ఇప్పుడు మనకు మాత్రము ముత్యపు చిప్పలనుండియే లభించుచున్నది.) గోరోజంబున్=గోరోచనమును; చమరవాలంబులన్=చమరీమృగముల తోకలను; (ఇవే వింజామరములు) బర్హిబర్హంబులన్=నెమలి పింఛములను; పరిగ్రహించియును; మరలి; అత్తఱి; కడిండినెత్తురుం బ్రొద్దు=మిక్కిలి యెఱ్ఱనైన ప్రొద్దు—మధ్యాహ్నము; అగుటన్=అగుటచే; వెఱచఱవంజఱవన్=భయము కల్గగా; ఏఁదు పెనుముండ్లన్=ఏదుపంది ముల్లచే; పండ్లచరియలు=పండ్లచిగుళ్ళు; నెఱియలువాఱి =బ్రద్దలై; బోరనన్=ఎక్కువగా; కాఱు=ప్రవహించు; ధారాళ=అడ్డులేని; రుధిర+ఆసార పూరంబు = రక్తప్రవాహమును; నాకినాకి; నాలుకలు దిగవైచి= నాలుకలను వ్రేల వేసికొని; ఏచినమహాతప+ఉష్ణంబునన్ = కాయునట్టి ఎక్కువ యెండవేడిమిచే; తృష్ణపాడమి=దాహము వేసి; దగనిగుడన్ = తాప మెక్కువ కాగా; వగరు=ఊర్పు; అడరి=కల్గి; ఒడలన్=శరీరములందు; తొడలన్=తొడలందు; మెడలన్=మెడలందు; సలుగులు=అడవి పందులు; బెడిదంపుకోఱలన్= వాడియైన కోరలతో; అడిచినయెడలన్=కొట్టినచోట్ల; బొడబొడను=బుడబుడమనుచు; వెడలెడునుడుకు నెత్తుటన్ = ప్రవహించు వేడి నెత్తుటితో; బడలి= శ్రమించి; తూలు=సోలిపోవు; కౌలేయకమ్ముల=కుక్కలయొక్క; అంగంబులు =శరీరములను; ఆర్ద్రకర్పటంబులన్ = తడి గుడ్డలతో; కప్పి; దప్పినిగుడన్ = దాహమెక్కువకాగా; అపాలంబుపశ్చిమంపుదండన్ =ఆ ప్రదేశము పడమటివైపున; ఉండు వెండి కొండ బండలన్=ఉన్న కైలాసపు రాళ్ళను; చండకర = సూర్యుని యొక్క; కర=కిరణములయొక్క; హిండనంబునన్=వ్యాప్తిచే; పాండుప్రభలు =తెల్లని కాంతులు; నిండి; పఱచు=ప్రవహించు; తఱచు=ఎక్కువైన; సెలయేఱుల=కొండనదులయొక్క; సూరెలన్=ప్రక్కలందు; కాఱుకొను=దట్టమైన; భూరుహ=చెట్లయొక్క; నికాయంబులన్=గుంపులను; డాయంజని = దగ్గఱకేగి; తత్+ఘన+ఛాయలన్=వాటిపెద్ద నీడలందు; నిలిచి=ఆగి; అచ్చటన్; త్రొచ్చి =త్రవ్వి; గరువుసేలలన్= మొరప నేలలందు; గుంటలు=చిన్నపల్లములు; ఒనరిచి = చేసి; లోనన్=గుంటలలో; ఉమ్మగిలి=ఆవిరిపట్టి; గబ్బుకలవక = చెమటకంపు

కొట్టక; కమ్మతావులు=కమ్మని సువాసనలు; కలనావురాకులు=కల్గిన ఆవురుచెట్ల యాకులు; పఱిచి=క్రిందవేసి; ఎఱచిలోన్=మాంసములో; మేలు+ఏఱి=మంచి వానినేఱి; కౌరిజమున్=కడుపులోనుండు తిత్తి వంటి దానిని; కందనగాయ=గుండెకాయ; క్రొవ్వు=మెదడు, మొదలగు మిగుల మెత్తని; పలలభిత్తంబులు=మాంస ఖండములను; అంగు=ఆగుంటలలో; క్రంగకొనన్=నిండునట్లు; క్రుక్కి=అణచి వేసి; ఎక్కువ తక్కువలు; కాకుండన్; కండగల=లావుగానున్న, తింత్రిణీ శలాటుసంఘాతంబులు=పచ్చిచింతకాయలను; అమీదన్ = వాటిపై; నెఱయన్= వ్యాపించునట్లు; పచరించి=వేసి; ఎసఱుగాన్=ఎసరునట్టు నీరుగా; తేటలగు= స్వచ్ఛమైన; లేటినల్లులు=లేళ్ళ నెత్తురులు; క్రుమ్మరించి=కడవలతోపోసి; లవణ కణసంచయంబున్=ఉప్పును; నించి=నిండుగాపోసి; లావుగాన్=దట్టముగా; కొన్న కప్పి=సగ తెఱుండ నాకులతో కప్పి; ఉపరిప్రదేశంబులన్=వాటిపై; కౌగనుము+ పెంటపట్లన్=అడవి గున్నలు పేడ ఉంచుచోట్ల; సెగలునేలుపిడకలన్=బాగుగా వెండిన పిడకలను; ప్రాల్చి=దాలిమండునట్లుగా పేర్చి; నెల్లికొయ్యలు=నిప్పుచేసి కొనదేఱిన కఱ్ఱలను; త్రచ్చి=మథించి; నుచ్చులు=మేకపెంటికలు; అంటించినన్ =రగుల్చగా; పెచ్చుపెరుగుచిచ్చులు = పెంపొందు మంటలు; అంత్రంబులన్= వాళ్ళలో; తపికించి=అంటించి; చిముడన్=మెత్తబడునట్లు; ఉడికినన్=ఉడుకగా; వెలువరించి=బయటికితీసి; ఉప్పువెప్పున=వేడిని; కలయప్పిశితఖండంబులు =కల్గిన మాంసపుముక్కలు; గనగనని నిప్పులన్=కనకనలాడు నిప్పులలో; చాముఱు =నేయి; చిప్పిలన్ = వాడునట్లుగా; కాల్చిన; కమ్మకఱకుట్టున్ = కమ్మని మాంసపుముక్కలచే; (కఱకుట్లుగా ఇనుపయూచలకంటించి కాల్చబడిన మాంసపు ముక్కలు) చట్రాతిపై=చాపరాతిపై; (ఉంచి) కా క్షేత్రికిన్=ఆ ప్రదేశమునకు రాజైన దేవతకు; కుడుపువెట్టి=నైవేద్యమిడి; పిదపన్=తర్వాత; పాళ్ళువెంబడిన్ =తమతమ భాగముల ప్రకారముగా; పంచుకొని; తారును = తామును; ఉప యోగించి=తిని; తత్+దేవతా ప్రీతికై = ఆ దేవత తృప్తికై; తలలు, తోకలు, డొక్కలు; అచటినిటపివిటపంబులకున్=అక్కడిచెట్ల కొమ్మలకు; వ్రేలంగట్టి= వ్రేలాడగట్టి; శిశిరమధురసలిలంబులు=చల్లని తీయని నీరు; త్రావి=త్రాగి; వాగు రికులు=వేటకాండ్రు; విశ్రమింపన్=విశ్రమింపగా; నిలింపాంగనాసుతుండును= స్వారోచియును; సహ=తనతోడ; సమాగత = వచ్చిన; సుహృద = నేస్తులైన; వలల=వంటవాండ్రచే; కృత=చేయబడిన; పలల = మాంసము; ఫల=పండ్లు; మూల=మొదళ్ళు; ఆది = మొదలైన; శుచి = శుభ్రమైన; మధుర=తియ్యని; మృగయా+ఉచిత=వేటకుతగిన; ఆహారంబులన్=భోజనములచే; తృప్తివహించి= తనివిపొంది; పరిజన=సేవకులచే; ఆరచిత=చేయబడిన; పల్లవ+ఆసన = చిగురు టాకుల పరపుపై; ఆసీనుండై=కూర్చున్నవాడై; గండూషిత = పుక్కిలింపబడిన; పుండరీక=తెల్లతామర పువ్వులయొక్క; మధురస=తేనెయొక్క; ఆసారంబులగు =జల్లులుకల; నిర్ఝరానిలకిశోరంబులు=సెలయేటి పిల్లగాలులు; ఒలయన్=సోకు చుండగా; అలయికలు = శ్రమలు; తీఱి = తగ్గి; ఉన్నసమయంబునన్= ఉన్నప్పుడు...

మ త్త కో కి ల

నిండెఁ గావిరి దిక్తటంబుల ♦ నింగిఁ గుండలి చండరు
ఙ్మండలిం గనుగొంచు మ్రోసెను ♦ మాలకాకులమూఁకల
య్యండ నిల్చి యదల్చె నప్డు శి ♦ వాళియూళలఁ బద్మగ
ర్భాండభాండము ధూళిధూసర ♦ మయ్యె నుద్ధతవాత్యలన్. 61

టీ: కావిరి=పొగవంటిది; దిక్+తటంబులన్=దిక్కులప్రక్కన; నిండెన్. నింగిన్=ఆకాశమున; కుండలి=పరివేషముతోనున్న; చండరుక్=సూర్యునియొక్క; మండలిన్=మండలమును; కనుగొంచున్ = చూచుచు; మాలకాకులమూఁకలు= మాలకాకులగుంపులు; మ్రోసెన్=కూసెను; అప్డు; అయ్యండన్ = ఆప్రక్కన; నిల్చి; శివా+ఆళి=నక్కలగుంపు; ఊళలన్ = కూతలతో; అదల్చెన్=భయపెట్టెను. ఉద్ధతవాత్యలన్=పెద్దగాలులతో; పద్మగర్భాండభాండము=బ్రహ్మాండము; ధూళిధూసరము=పరాగముతో బూడిదవన్నెమైనది; అయ్యెన్.

తా: దిక్కుల కావిరి క్రమ్మెను. సూర్యుడు గూడుకట్టెను. మాలకాకులు సూర్యునికేసి చూచుచు కూసెను. నక్కలు దగ్గరలో నిలబడి వెఱ్ఱికేకలు పెట్టినవి. సుడిగాలులు వీచినవి. ఇవన్నియు నరిష్ట సూచనలు.

క. అకాఱిగాములు గనుగొని
శాకునికుం డొకఁడు లేచి ♦ సంభ్రమ మొదవన్
జ్యాకలితశరాసనుఁడై
వీఁకను సైనికులఁ దిట్టి ♦ విభుతో ననియెన్. 62

టీ: అకాఱిగాములన్=అపశకునములను; కనుగొని=చూచి; శాకునికుండు =శకున లక్షణము తెలిసినవాడు; ఒకడు; లేచి; సంభ్రమము=తొందర; ఒదవన్ =కలుగగా; జ్యాకలిత=నారితోకూడిన; శరాసనుడై=విల్లుకలవాడై, వీఁకను= పూనికతో; సైనికులను; తిట్టి; విభుతోన్=రాజుతో; అనియెన్=పల్కెను.

తా: శకునము తెలిసినవా డప్పుడు తొందరగా లేచి విల్లు చేత బట్టుకొని సైనికులను తిట్టి రాజుతో నిట్లనెను.

క. తఱుచుగ మెకములఁబొరిగొను
మఱపున వచ్చితిమి దవ్వు ♦ మనపొల మిట కి
త్తఱినగు నిమిత్తములు నృప
కొఱగా విదె మనకుఁ బెద్ద ♦ గొడవగు ననినన్. 63

టీ: నృప=రాజా! తఱుచుగన్=ఎక్కువగా; మెకములన్=మృగములను; పొరిగొనుమఱపునన్=చంపెడిమఱపులో; వచ్చితిమి. మనభూమి = మనకలవారైన చోటు; ఇచటికిన్=ఇక్కడికి; దవ్వు=దూరము; ఇత్తఱి+అగు=ఇప్పుడయ్యెడు;

నిమిత్తములు = శకునములు; కొఱగావు = మంచివి కావు. ఇదె = ఇదిగో; మనకున్; పెద్దపోరు = పెద్ద యుద్ధము; అగున్ = కల్గును. అనిన్ = అనగా...

మ. అతఁడాస్ఫాలితసజ్యకార్ముకుఁడు వా♦హారూఢుఁడుం బార్శ్వ సం
భృతతూణాహృతచండకాండుఁడు దిశా ♦ ప్రేంఖత్కటాక్షాంచల
ద్యుతిజాలుండునునై పుళిందభటసం ♦ దోహంబుతోడన్ మహో
ద్ధతి నుండన్ జయలాభసూచకనిమి ♦ త్తంబుల్ మెయిందోఁచినన్.

టీ: అతఁడు = స్వరోచి; ఆస్ఫాలిత = మ్రోయింపబడిన; సజ్య = నారితో కూడిన; కార్ముకుఁడు = విల్లుకలవాఁడు; వాహ+ఆరూఢుండును = గుఱ్ఱము నెక్కిన వాఁడును; పార్శ్వ = ప్రక్కల, సంభృత = వహింపబడిన; తూణ = అమ్ములపొదులచే; ఆహృత = తీసికొన బడిన; చండకాండుఁడు = వాడిబాణములు కలవాఁడు; దిశ = దిక్కులకు; ప్రేంఖత్ = ఎగురుచున్న; కటాక్ష+అంచల = క్రీగంటి కొనలయొక్క; ద్యుతి జాలుండునై = కాంతిపుంజము కలవాఁడునై; పుళిందభట సందోహంబుతోడన్ = కోయసైనికులతో; మహోద్ధతిన్ = ఎక్కువ గర్వముతో; ఉండన్ = ఉండగా; మెయిన్ = శరీరమున; జయలాభ సూచక నిమిత్తంబుల్ = జయలాభమును సూచించు శకునములు; తోఁచినన్ = కన్పడగా...

తా: అంతట స్వరోచి గుఱ్ఱమెక్కి పెట్టి నారిమ్రోయించి, అమ్ములపొదుల నిండుగా బాణములు నింపుకొని నాల్గువైపులకు చూచుచు సేనతో సిద్ధముగానుండగా అతనికి లాభమును సూచించునట్లుగా శకునములు కలిగెను. అప్పుడు...

వ. ప్రాణరక్షాసంశయం బగుమహాక్షోభం బొక్కటిగలుగు మీఁద నెట్టకేలకు మితిపెట్టరాని జయమంగళంబులలగునని నిశ్చయించి యూఱడిలు సమయంబున. 65

టీ: ప్రాణరక్షా సంశయంబగు = ప్రాణరక్షణలో సంశయము కల్గించు; మహారణంబొక్కటి = ఒక పెద్దయుద్ధము; కలుగున్, మీఁదన్ = తర్వాత; ఎట్టకేలకు = చిట్టచివరికి; పెట్టరాని = ఎక్కువైన; జయమంగళంబులు = శుభములు; అగునని; అంతరంగంబునన్ = మనస్సులో; నిశ్చయించి; ఊఱడిలు సమయంబునన్ = ఊరట నున్న సమయములో...

క. ఆవిపినాంతరమున హా
హా వనిత ననాథ నబల ♦ నార్తవిపన్నం
గావరె యీపుణ్యము నం
బోవరె యని పలుకు నాఁడు ♦ మొఱ వినఁబడియెన్. 66

టీ: ఆవిపిన+అంతరమునన్ = ఆ యడవి మధ్యలో; హాహా = అయ్యో! వనితన్ = స్త్రీని; అనాథన్ = దిక్కులేని దానను; అబలన్ = బలములేనిదానను; ఆర్తన్ = పీడితురాలను; విపన్నను = ఆపద నొందినదానను; కావరె = రక్షింపరే; ఈపుణ్యమునంబోవరె = ఈ పుణ్యము కట్టుకొనగా! అని; పలుకు+ఆఁడు మొఱ = పలికెడి స్త్రీ ఆర్తనాదము; వినబడియెన్ = వినపడెను.

క. ఆమొఱ వేమఱుఁ జెవి నిడి
భూమండలభర్త కరుణ ♦ పొడమఁగ నయ్యో
యేమానిని కెవ్వనిచే
నేమాయెనొ యనుచు నచటు ♦ నీక్షించుతఱిన్. 67

టీ: భూమండలభర్త = రాజైన స్వరోచి; ఆ మొఱ; వేమఱున్=పలుమాఱు; చెవినిడి = విని; కరుణ = దయ; పొడమగన్ = పుట్టగా; అయ్యో! ఏమానినికిన్=ఏస్త్రీకి; ఎవ్వనిచేన్=ఎవ్వనిచేత; ఏమి+ఆయ్యెన్=ఏమి యాపద వచ్చెనో; అనుచున్, అచటన్=అక్కడను; ఈక్షించుతఱిన్=చూచునప్పుడు...

శా. మట్టెల్ మ్రోయఁగ గబ్బిచన్నుఁగవ గం ♦ పం బంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మచీఁకటులుగా ♦ నశ్రువ్రజం బోడిక
ల్కట్టం జూపులు చిమ్మరేఁగి దివి రో ♦ లంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేనియడవిన్ ♦ మీనాక్షి దీనాకృతిన్. 68

టీ: మీనాక్షి=ఒకస్త్రీ; మట్టెలు=కాలి మట్టెలు; మ్రోయగన్=చప్పుడు కాగా; గబ్బిచన్నుగవ=బిగువైన చంటిజంట; కంపంబు+అందన్=వడకగా; వేణీభరంబు=కొప్పుముడి; అట్టిట్టై=చెదరిపోయి; కటిన్=పిరుదులమీద; చిమ్మచీఁకటులు=దట్టని చీకట్లు; కాన్=కాగా; అశ్రువ్రజంబు = కన్నీటి సముదాయము; ఓడికల్=ప్రవాహములు; కట్టన్=కట్టగా; చూపులు; చిమ్మరేఁగి = కదలుచు; దివిన్=ఆకాశమున; రోలంబాళిన్ = తుమ్మెదల బారును; కల్పింపగాన్=కల్గచేయగా; మిట్టాడంగన్=సంచరింపగా; నరుండు లేని=మనుష్యుడు లేని; అడవిన్=అడవియందు, దీనాకృతిన్=దీనమైన ఆకారముతో...

తా: ఒకస్త్రీ కాలి యందెలు మ్రోయగా, జడయూడి చీకటి క్రమ్మినట్లు పిరుదులపై నటింపగా, కంటివెంట కన్నీరు ధారగా కారుచుండగా, భీతభీతమ్మగు చూపులతో మిన్ను చూచుచు నిర్జనారణ్యమున దైన్యముతో...

క. ఒక్కతె భయశోకంబుల
వెక్కుచు మెయిఁగల విలాస ♦ విభ్రమలక్ష్మిల్
దక్కుటయును నొకరెమొఱపై
నెక్కొన ధరణీశు నెదుట ♦ నిలచి వినీతిన్.

టీ: ఒక్కతె=ఒకయాడుది; భయశోకంబులన్=భయముతోను, విచారముతోను; వెక్కుచు=వెక్కివెక్కి యేడ్చుచు; మెయిన్=శరీరమందు; కలవిలాసవిభ్రమలక్ష్మిల్=కల్గిన విలాస చేష్టల సొంపులు; తక్కుటయును=లేకపోవుటయు; ఒకరెమొఱపై=ఒకరకపుటందమై; నెక్కొనన్=తనయందుండగా; ధరణీ+ఈశు+నెదుటన్=రాజుయొక్క ఎదుటను; నిలిచి; వినీతిన్=వినయముతో...

తా: ఒకస్త్రీ వెక్కివెక్కి యేడ్చుచు, ఒయ్యారములు లేకపోవుటచే నొక విధమైన అందముగా స్వరోచి యెదుట నిలబడి వినయముతో...

క. పలుచని వాతెఱ మెఱుఁగునఁ
బలుమెఱుఁగులు సందడింపఁ ♦ బాపటపై సం
జలిఁ జేర్చి జళుకుఁ జూపులఁ
బలుకులఁ బులకండ మొలుకఁ ♦ బలికెం గలఁకన్. 70

టీ: పలుచని వాతెఱమెఱుగునన్ = పల్చగానున్న పెద్దకాంతితో; పలుమెఱుగులు = దంతకాంతులు; సందడింపన్ = ఎక్కువకాగా; పాపటపైన్ = జుట్టుమీద; అంజలిన్ = దోసిలిని; చేర్చి; జళుకుఁజూపులన్ = బెదరుచూపులతో; కలఁకన్ = కలతతో; పలుకులన్ = మాటలలో; పులకండము = కండచక్కెర; ఒలుకన్ = చిందగా; పలికెన్.

తా: ఆమె ఫాలమున దోయిలిచేర్చి రాజునకు మ్రొక్కి బెదరుచూపులతో కలతపాటుతో మధురస్వరమున నిట్లనెను.

శా. ఓరాజన్యమహేంద్ర యోమణిగణ ♦ ప్రోతాసివాతాశన
ప్రారజ్యత్కటిచక్ర యోముఖరశా ♦ ర్ఙ్గక్రూరబాహార్గళా
యోరుక్మాచలకల్ప యోకవచిత ♦ వ్యూఢాంగ కావం గదే
యోరాహుత్తశిరోమణీ నిరవధి ♦ ప్రోద్యత్ప్రతాపారణీ. 71

టీ: ఓ రాజన్యమహేంద్ర = ఓరాజశ్రేష్ఠా; మణిగణ = రత్నములచే; ప్రోత = గుప్పబడిన; అసివాత+అశన = సర్పమువంటి కత్తిచే; ప్రారజ్యత్ = ప్రకాశించుచున్న; కటీచక్ర = పిరుదులు కలవాడా! ముఖర = మ్రోగుచున్న; శార్ఙ్గ = వింటితో కూడిన; క్రూర = కఠినమైన; బాహా+అర్గళా = గడియలవంటి బాహువులు కలవాడా! రుక్మ+అచలకల్ప = మేరువువంటివాడా! కవచిత = కవచముకల; వ్యూఢ+అంగ = ఉన్నతమైన శరీరము కలవాడా! రాహుత్తశిరోమణీ = గుర్రపురౌతులలో శ్రేష్ఠుడా! నిరవధిప్రోద్యత్ = హద్దులేకుండ ప్రకాశించు; ప్రతాప+అరణీ = ప్రతాపమనుఅరణి కలవాడా! కావంగదే = రక్షింపుమయ్యా! అలం. ఉపమ, రూపకమును.

క. అనినఁ దలంపున నింపిన
యనుకంప నిలింపచంప ♦ కామోదసుతుం
డనునయ మొప్పఁగ నోడకు
మని నిజవృత్తాంత మడుగ ♦ నది యిట్లనియెన్. 72

టీ: అనినన్ = అనగా; తలంపునన్ = మనసులో; నింపిన యనుకంపన్ = నిండిన దయతో; నిలింపచంపకామోదసుతుండు = దేవతాస్త్రీ కొడుకైన స్వరోచి; అనునయము = బతిమాలుట; ఒప్పగన్ = ఒప్పునట్లు; ఓడకుము = భయపడకుము;

అని; నిజవృత్తాంతము = ఆమెకథను; అడుగన్ = అడుగగా; అది = ఆమె; ఇట్లు + అనియెన్.

తా: ఆస్త్రీ కోరవెట్టగా స్వరోచి భయపడవలదని యూరడించి ఆమె కథను చెప్పుమనెను. ఆమె యిట్లనెను.

సీ. విసుమానములుగాఁగ ♦ వసతోడఁ బెనవెట్టి
నెట్టెంబుగాఁ బ్రేవుఁ ♦ జుట్టినాఁడు
బండికందెనచాయ ♦ బైసిమాలిన మేన
మెదడుగందపురొంపి ♦ మెత్తినాఁడు
కునఖంపు డాచేతి ♦ పునుకకప్పెర నిండఁ
బ్రాణికోటుల నల్లఁ ♦ బట్టినాఁడు
కొకిబికి వేసంపు ♦ గూనిమూఁపులమీఁద
మూఁడుపంగలయీఁటె ♦ మోపినాఁడు

గీ. నిట్టతాడనఁ బొడువు చే ♦ నిక్కినాఁడు
నిడుదకోఱల మిడిగ్రుడ్ల ♦ నెగడినాఁడు
నరవరోత్తమ నేఁడు మూ ♦ న్నాళ్ళనుండి
యుసుఱుఁగొన వెంటఁ దిరిగెడు ♦ నసుర యొకఁడు. 73

టీ: సురవరోత్తమ = రాజా! విసుమానములుగాగన్ = వింతలుగా; (పా. విసమానముకాఁగన్ = హెచ్చుతగ్గులుగా) వసతోడన్ = క్రొవ్వుపొరతో; పెనవెట్టి = మెలివెట్టి; నెట్టెంబుగాన్ = గుండుతలపాగగా; ప్రేవున్ = ప్రేగులను; చుట్టినాడు = తలకుచుట్టుకొన్నాడు; బండికందెనచాయన్ = బండికి చక్రములకు నిరుసునకు మధ్య పెట్టెడుమని ఆముదముకలిపిన (గ్రీజు) దాని రంగుతో; బైసిమాలిన మేనన్ = బాగుగాలేని శరీరమున; మెదడుగందపురొంపి = మెదడుగంధమును; మెత్తినాడు = పూసికొన్నాడు; కునఖంపు = పుచ్చుగోళ్ళుకల్గిన; డాచేతి = ఎడమచేతిలోని; పునుకకప్పెరనిండన్ = పుర్రెపాత్ర నిండుగా; ప్రాణికోటులనల్ల = జంతురక్తమును; పట్టినాడు = నిండపట్టెను; కొకిబికివేసంబు = వికృత వేషముకల; గూని మూఁపుల మీదన్ = ఎగుబుజముల పై; మూడుపంగలయీటె = మూడు మొనలుకల యీటెను—త్రిశూలమును; మోపినాడు = పట్టినాడు; నిట్టతాడి + అనన్ = పొడవైన తాడిచెట్టన్నట్లుగా; పొడవుచేన్ = పొడవుచేత; నిక్కినాడు = ఉన్నాడు; నిడుదకోఱలన్ = పొడవైన కోఱలచే; మిడిగ్రుడ్లన్ = పెద్దపెద్దకంటిగ్రుడ్లతోను; నెగడినాడు = భయముగా నున్నాడు; ఒకడుఅసుర = ఒకరాక్షసుడు; నేడుమూన్నాళ్ళనుండి = నేటికి మూడు రోజులనుండి; ఉసుఱుకొనన్ = ప్రాణములు తీయుటకై; వెంటన్ + తిరిగెడున్ = వెంబడించుచున్నాడు; అలం. స్వభావోక్తి, నిదర్శన, రూపకము, ఉత్ప్రేక్షయు.

తా: ఓ రాజా! ఒకరాక్షసుడు వసతో మెలిపెట్టిన ప్రేగులను తలపాగగా చుట్టుకొని, నల్లని శరీరమున మెదడు పూసుకొని, ఎముకలు పట్టుకొని, ఎడమచేతిలో పుర్రె నిండుగా రక్తముపట్టి, కొక్కిరి బిక్కిరి వేషముతో గూనిగానున్న భుజములపై త్రిశూలమును పెట్టుకొని, నిట్టతాడివలె పొడుగుగానుండి, పెద్దకోఱలు, మిడి గ్రుడ్లు కలిగియుండి మూడురోజులనుండి నన్ను చంపుటకై వెన్నాడుచున్నాడు.

క. ఏయెడ ననదల మొఱ వా
లాయము వినవలయు 'దుర్బ ♦ లస్య బలం రా
జా' యన వినవే ధరణీ
నాయకులకు నార్తరక్ష ♦ ణంబులె క్రతువుల్. 74

టీ: ఏయెడన్ = ఎప్పుడును; అనదల మొఱ = దిక్కుమాలిన వారి మొర; వాలాయము = తప్పక; వినవలయున్ = మీవంటివారు వినవలసినదే; దుర్బలస్య = బలములేనివారికి. రాజా = రాజే; బలం = బలము; అనన్ = అనగా; వినవే = విన లేదా? ధరణీనాయకులకున్ = రాజులైన వారికి; ఆర్తరక్షణంబులె = దీనులను రక్షించుటలే; క్రతువుల్ = యజ్ఞయాగాదులు; అనగా అనాథ రక్షణము రాజులకు క్రతువులు చేసిన దానితో సమమైనది. అలం. కావ్యలింగము, రూపకమును.

క. మరుదశ్వపుత్రి కిందీ
వరాక్షగంధర్వరాజు ♦ వలనఁబొడమితిన్
నరవర వెలసితిఁ గళలం
దు రమించుటఁ జేసి భువి మ ♦ నోరమ యనఁగన్. 75

టీ: నరవర = రాజా! మరుదశ్వపుత్రికిన్ = మరుదశ్వుడను గంధర్వుని కూతు రికి; ఇందీవరాక్షగంధర్వరాజువలనన్ = ఇందీవరాక్షుడను గంధర్వరాజునకును; పొడ మితిన్ = పుట్టితిని; కళలందున్ = విద్యలలో; రమించుటంజేసి = వినోదించుటచే; భువిన్ = భూమిలో; మనోరమయనగన్ = మనోరమయను పేరుతో; వెలసితిన్ = ప్రసిద్ధిపొందితిని.

తా: నేను మరుదశ్వుడను గంధర్వరాజు కూతురికిని ఇందీవరాక్షుడను గంధర్వరాజునకును పుట్టితిని. సమస్తవిద్యలు నేర్చితిని. మనోరమ నా పేరు.

శా. రారాపిల్ల భుజాంగదంబుల మణుల్ ♦ రాలంగ విద్యాధరుల్
గారా మొప్పగ నెత్తి కొండ్రు నను నం ♦ కస్థాయినిం జేయఁగా
వారి న్వీడ్కొని సింహపీఠికఁ జల ♦ త్వం బొందు మాతండ్రి మం
జీరం బించుక గల్లుమన్న నవి దాఁ ♦ జెప్పంగ నింకేటికిన్ .76

టీ: విద్యాధరులు = ఒకజాతి దేవతలు; రారాపిల్లన్ = ఒకరినొకరు త్రోసి కొని వచ్చుటచే; భుజ+అంగదమణుల్ = భుజకీర్తులందలి మణులు; రాలంగన్ = రాలగా; గారాము = ముద్దు; ఒప్పగన్ = ఒప్పునట్లు; ననున్ = నన్ను; ఎత్తికొండ్రు;

మాతండ్రి=ఇందీవరాక్షుడు; మంజీరంబు=నా కాలియందె; ఇంచుక గల్లుమనన్= కొంచెము గల్లుమని చప్పుడైనను; అంకస్థాయినిన్=తొడమీద కూర్చున్నదానిగా; చేయగాన్=చేయుటకు; వారిన్=విద్యాధరులను; వీడ్కొని=తొలగుమని; సింహపీఠికన్=సింహాసనమునందుండి; చలత్వంబొందుచున్=కదలుచు; అవి=ఆ సుఖానుభూతులు; తాన్=నేను; ఇంకన్=ఇప్పుడుకూడ; చెప్పంగన్+ఏటికిన్=చెప్పుటయెందులకు ?

తా: విద్యాధరులు నేను నేనని ముందుకు త్రోసికొనివచ్చి నన్నెత్తుకొందురు. నా కాలియందె చప్పుడై నేను వచ్చుచుంటినని తెలిసెనా నా తండ్రి వెంటనే సింహాసనమునందుండి లేచి నా కెదురుగా వచ్చి యెత్తుకొని యొడిలోనికి తీసికొనును. ఆ సుఖముల నిప్పుడు చెప్పుట యేటికిలే? అలం. స్వభావోక్తి, ఆక్షేపము, ఉదాత్తము.

తే. దేవ పారర్షిపట్టిక ♦ ళావతియును
నల్లమందార విద్యాధ ♦ రాత్మజన్మ
యగువిభావసియును నాకుఁ ♦ బ్రాణసఖులు
వారు నేనును నొకనాఁడు ♦ గారవమున. 77

టీ: దేవ=రాజా ! పారర్షిపట్టి=పారుడను ఋషియొక్క కూతురైన; కళావతియును; అల్ల=ప్రసిద్ధుడైన; మందార=మందారుడనెడు; విద్యాధర+ఆత్మజన్మయగు=విద్యాధరుని కూతురైన; విభావసియును; నాకున్; ప్రాణసఖులు=ప్రాణముతో సమమైనచెలులు; వారు; నేనును; ఒకనాఁడు; గారవమునన్=అన్యోన్యప్రేమతో...

సీ. నెత్తమ్ము లేకొండ ♦ నెత్తమ్ములం దాడు
విద్యాధరీకోటి ♦ విటులతోడ
నెచటిగాడ్పులఁ బుట్టు ♦ విచికిలామోదంబు
శబరికాంతలగుట్టు ♦ సళ్ళఁబెట్టు
నెన్నగేంద్రపుఁజఱుల్ ♦ మిన్నంది పెన్నంది
కోరాడుఁ దనగుబ్బ ♦ కొమ్ము లొడ్డి
యెం దుండుగురివెంద ♦ పందిళ్ళపూఁదేనె
జడి యిందుశిలలందు ♦ జాలువాఱు

గీ. నట్టికలధౌతశిఖరిఁ బు ♦ ష్పాపచయము
సేయువేడుకఁ బొదరిండ్ల ♦ చాయలందుఁ
దిరుగుచుండి యొకానొక ♦ దెసఁ దృణంబు
దళముగా వాతమొలచిన ♦ బిలమునందు. 78

టీ: ఏ కొండ నెత్తమ్ములం గున్ = ఏ కొండమీది ప్రదేశములందు; విద్యాధరీ కోటి = విద్యాధర స్త్రీల సముదాయము; విటులతోడన్ = కాముకులతో; నెత్తమ్ములు = జూదములను; ఆడున్ = ఆడుచుండునో; ఎచటి గాడ్పులన్ = ఎక్కడి గాలులచే; పుట్టు = పుట్టెడి; విచికిల+ఆమోదంబు = చిరుమల్లె పువ్వుల పరిమళము; శబరకాంతల గుట్టు = బోయవనితల రహస్యమును; సళ్ళబెట్టున్ = వదలించునో; ఎన్న గేంద్రదప్రజములో = ఏ కొండచరియలు; పెను+నంది = శివుని వాహనమైన నంది; మిన్ను+అంది = ఆకాశమునంటి—ఎక్కువ సంతోషించి; తనగుబ్బకొమ్ములు = గుబ్బగానున్న తన కొమ్ములను; ఒడ్డి = ఆన్చి; కోరాడున్ = పొడిచి మట్టిరొత్తిఆడు చుండునో; ఎం గున్ = ఏ కొండయందు; ఉండు = ఉండెడి; గురివెంద పందిళ్ళ = గురివెంద పందిళ్ళనుండి; పూదేనెజడి = పుష్పరసపుధార; ఇందుశిలలంబున్ = చంద్ర కాంతపురాళ్ళపై; జాలువాఱున్ = ప్రవహించునో; అట్టికలధౌతశిఖరిన్ = అటువంటి కైలాసమునందు; పుష్పాపచయము = పూలుకోసికొనుటను; చేయు వేడుకన్ = చేసెడి కోరికతో; పొదరిండ్లచాయలందుఁ = పొదరిండ్ల ప్రాంతమున; తృణంబు = గడ్డి; దళముగాన్ = ఒత్తుగా; వాతన్ = ముఖమునందు; మొలచిన బిలము నందున్ = మొలచి యున్న గుహలో...

తా: విద్యాధర స్త్రీలు విటులతో కలసి జూదము లాడునట్టియు, చిరుమల్లెల మీదనుండి వచ్చు పిల్లగాలుల కావేశము కల్గి కామోద్రేకము నాపుకోలేని శబర యువతులు కలట్టియు; నందీశ్వరుండు కొమ్ములతో మట్టిచిమ్ముచు కోరాడు చరి యలు కలట్టియు; బండిగురివెంద పందిళ్ళ నుండి తేనెకారి కాలువలుగా ప్రవహించు చంద్రకాంత మణులుకలట్టి కైలాసగిరిపైన ఒకచోట ద్వారమున దట్టనగా గడ్డి మొల చిన గుహలో...

ఉ. ఊసరవెల్లి చందమున ♦ నొక్కటఁ బీఱనరాలు దేఱఁగా
మీసలు గడ్డముం జడలు ♦ మే నుదరంబును వీనులున్ జరా
ధూసరమైన రోమతతి ♦ తోఁ బెనఁగంబడి దూదిరాశిగాఁ
జేసినరీతి నున్నయొక ♦ జీర్ణమునిం గని కౌతుకంబునన్. 79

టీ: ఊసరవెల్లి చందమునఁ = ఉడుమువలె; ఒక్కటన్ = ఒకేరీతిగా; బీఱ నరాలు = పెద్దపెద్దనరములు; తేఱఁగాన్ = తేలగా; మీసలు = మీసములు; గడ్డమున్ = గడ్డమును; జడలు; మేను = శరీరము; ఉదరంబును = కడుపును; వీనులున్ = చెవులును; జరాధూసరమైన = ముసలితనముచే తెల్లబడిన; రోమతతితోన్ = వెంట్రుకల సముదాయముతో; పెనగంబడి = పెనవైచుకొని; దూది; రాశిగాన్ = ప్రోవుగా; చేసినరీతిన్ = చేసినట్లు; ఉన్న; ఒకజీర్ణమునిన్ = ఒకముసలిమునిని; కని = చూచి; కౌతుకంబునన్ = వేడుకతో......

తా: ఉడుమువలె పెద్దపెద్ద నరాలు తేర మీసములు, గడ్డము, పొట్ట, ఒళ్ళు చెవులు అంతయు ఒకేరీతిగా జుట్టుతోనిండి దూది ప్రోగైనట్లున్న ముసలిమునిని చూచి వేడుకతో... అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

ఆ. ఇతనివదనకుహర ♦ మెద్ది నేత్రద్వయం
బెద్ది కర్ణయుగళ ♦ మెద్ది యనుచు
బూచివోలె నున్న ♦ వాచంయముని మోము
బాల్యచాపలమునఁ ♦ బట్టుటయును. 80

టీ: ఇతని వదనకుహరము=ఇతని నోరు; ఎద్ది=ఏది? కర్ణయుగళము=రెండు చెవులు; ఎద్దియనుచున్ = ఏదనుచు; బూచివోలెనున్న = దయ్యమువలె నున్న; వాచంయమునిమోము=వాక్కును నియమించిన—మునియొక్క ముఖమును; బాల్యచాపలమునన్=చిన్నతనపు లౌల్యముచే; పట్టుటయును=పట్టగా...

క. ధ్యాన స్తిమితుం డగు న
మ్మౌని మదీయాంగుళీ వి ♦ మర్శనములచే
మే నెఱిఁగి తొంటియను సం
ధానము చెడి కన్ను దెఱచి ♦ దారుణఫణితిన్. 80

టీ: ధ్యాన స్తిమితుండగు = ధ్యానముచే నిశ్చలముగానున్న; ఆ+మౌని= ఆముని; మదీయ=నాసంబంధమైన; అంగుళీ విమర్శనములచేన్=వ్రేళ్ళతో తడవుటలతో; మేను+ఎఱిగి=బాహ్యజ్ఞానము—మెలకువవచ్చి; తొల్లి+అనుసంధానము=మునుపటి సమాధి; చెడి; కన్ను; తెఱచి; దారుణఫణితిన్=క్రూరమైనరీతితో...

తా: సమాధిలోనున్న మహర్షి నా వ్రేలు తగిలి సమాధిచెడి కన్నువిప్పి కఠినముగా...

ఉ. ఓసి దురాత్మురాల గృహ ♦ మొల్లక సర్వసుఖంబులున్ నిరా
యాసమునం దొఱంగి మిహి ♦ రాంశు మరుచ్ఛద నీర నీరస
గ్రాసము దేహధారకము ♦ గా గుహలం దప మాచరించు మ
మ్మీసరణిన్ స్పృశించి నగ ♦ నేమి ఫలంబొనఁ గూడెఁ జెప్పుమా. 82

టీ: ఓసి దురాత్మురాల=చెడు స్వభావము కలదానా! గృహము=ఇల్లు; ఒల్లక=ఇష్టపడక—వదలి; సర్వసుఖంబులున్=అన్ని సుఖములను; నిరాయాసంబునన్=తేలికగా; తొఱంగి=వదలి; మిహిర + అంశు = సూర్యుని కిరణములును; మరుత్=గాలి; ఛద=ఆకులు; నీర=నీరు—నున్నగు; నీరసగ్రాసము=రసములేని యాహారమును; దేహధారకముగాన్=దేహము నిల్పు వానిగా; గుహలన్=గుహలలో; తపమాచరించు = తపస్సుచేసికొను; మమ్ము; ఈసరణిన్ = ఈరీతిగా; స్పృశించి=తాకి; నగన్=నవ్వగా; ఏమిఫలంబు = ఏఫలితము; ఒనగూడెన్= చేకూరెను. చెప్పుమా ?

తా: ఓసి దుర్మార్గురాలా! ఇల్లు—వాకిలి వదలి అన్ని సుఖములను తేలికగా విసర్జించి గాలి—నీరు, ఆకు—అలము దేహము నిల్పుకొనుటకై తినుచు జపము చేసికొను మమ్ము ముట్టుకొని పరిహసించుట వలన నీకేమి లాభము వచ్చునో చెప్పుము?

క. తిమిరంపువయసుగుబ్బల
కొమరాలవు నీకుఁ దగిన ♦ గోవాళ్ళ మహిన్
నెమకి నగరాదె ముదిసిన
మముఁ జెనఁకిన నేమి కలదు ♦ మద మేమిటికిన్. 83

టీ: తిమిరంపువయసు=పొగరెక్కు ప్రాయములో; గుబ్బలకొమరాలవు=బిగిచన్నులు కల పడుచు పిల్లవు; మహిన్=భూమిలో; నీకున్; తగిన; గోవాళ్ళన్=పడుచువారలను; నెమకి=వెదకి; నగరాదె=పరిహాసము చేయరాదా? ముదిసిన మమున్=వయసుమళ్ళిన మమ్ము; చెనకినన్ = తాకగా; ఏమికలదు? మదము=పొగరు; ఏమిటికిన్=ఏల?

తా: పొగరుచే కన్నుగానని వయసులో గబ్బిగుబ్బలుకల పడుచు దానవు నీకుతగిన యువకులను వెదకికొని వేళాకోళములు చేయవలెగాని ముసలివగ్గులైన మమ్ము ముట్టిన ఫలమేమున్నది? ఇంత పొగరేల?

క. ముసురుకొను జరభరంబున
నసు రుసురై యున్న మమ్ము ♦ నడకించితి వి
ట్లుసురు మనఁ బట్టువడు మొక
యసురకు నీ వనుచుఁ బలికె ♦ నాగ్రహ మెసఁగన్. 84

టీ: ముసురుకొను=పైబడిన; జర=ముసలితనము యొక్క, భరంబునన్=భారముచే; అసురుసురై=ఉక్కిరిబిక్కిరై; ఉన్నమమ్మున్; ఇట్లు; అడకించితివి=బాధించితివి; ఉసురుమనన్=ఉస్సురని శ్రమించునట్లు; నీవు; ఒకయసురకున్=ఒకరాక్షసునకు; పట్టువడుము=చిక్కుము; అనుచున్ = అని; ఆగ్రహము=కోపము; ఎసగన్=ఎక్కువకాగా; పలికెన్=శపించెను.

తా: 'ముసలి తనముచే తెగసతమత మగుచున్న మమ్ము పరిహాసించి నందులకు ఫలముగా రాక్షసునిచే పట్టువడి బాధనొందుము' అని శపించెను.

క. జననాథ యేమి చెప్పుదుఁ
గనలుచు నవ్వగ్గుతపసి ♦ కటము లదరఁగాఁ
దనచేతినాఁగబెత్తముఁ
గొని పసరముఁ గొట్టినట్టు ♦ గొట్టె నదయుఁడై. 85

టీ: జననాథ=రాజా! ఏమి చెప్పుదున్; ఆ+వగ్గుతపసి = ఆబక్కముని; కనలుచున్=కోపించుచు; కటములు=చెక్కిళ్ళు; అదరగాన్=చలింపగా; దయమాలినవాడై; తన చేతి నాగబెత్తమున్=తన చేతిలోనున్న యోగపు బెత్తమును; కొని=తీసికొని; పసరమున్ = పశువును; కొట్టినట్టు; కొట్టెను=బాదెను. అలం. ఉపమ.

క. కొట్టువడి యటకు మునుపే
తిట్టుంబడి యేడ్చు నాదు ♦ దెసఁ గని మదిలోఁ
గట్టలుక వొడమి నాసఖు
లిట్టనిరి మునీంద్రుతోడ ♦ నెత్తిన వెలుచన్. 86

టీ: కొట్టువడి=దెబ్బలుపడి; అటకుమునుపే=అంతకుముందే, తిట్టుంబడి=శాపమును పొంది; ఏడ్చునాదుదెసన్ = ఏడ్చుచిన్న నా వైపు; కని = చూచి; నాసఖులు=నా చెలికత్తెలు; మదిలోన్ = మనసునందు; కడు+అలుక=మిక్కిలి కోపము; పొడమి=పుట్టి; ఎత్తినవెలుచన్=కల్గిన కోపముతో; మునీంద్రుతోడన్ =మునితో; ఇట్టనిరి.

ఉ. ఓయి దయావిహీనమతి ♦ యూరక యీపసిబిడ్డఁ గొట్టఁ గాఁ
జే యెటు లాడె నీకు నిది ♦ చేసిన దేమి వృథా శపింతురే
బోయవె యాఁడుఁదోడు నను ♦ బుట్టవె శాపనిమిత్తమే తపం
బీయెడ నున్న శాంతిపరు ♦ మనువారి రిఁక నీచరిత్రకున్. 87

టీ: ఓయి దయావిహీనమతి = ఓ దయాహీనవాడా! ఊరక=నిష్కారణముగా; ఈపసిబిడ్డన్=ఈ చిన్నపిల్లను; కొట్టగాన్=కొట్టుటకు; చేయెటులాడెను =చేయెట్లువచ్చెను? నీకున్; ఇది=ఈమె; చేసినదేమి = ఏ బాధకల్గచేసినది? వృథా=అనవసరముగా; శపింతురే? బోయవె=కటికివాడవా? ఆడుదోడునను బుట్టవె=ఆడువారితో పుట్టలేదా? తపంబు = తపస్సు; శాపనిమిత్తమే = శాపమిచ్చుటకేనా? నీ చరిత్రకున్=నీ నడవడికకు; ఈయెడనున్న = ఇక్కడనున్న; శాంతిపరులు=శాంతికల మునులు; ఇకన్; ఏమనువారు=ఏమందురో?

తా: ఓ కటికివాడా! ఈ పసిపిల్ల నూరకే కొట్టుటకు నీకు చేయెట్లువచ్చెను? అంత తప్పీమె యేమి చేసినది? శపించుటయేనా తపస్సునకు ఫలము? కిరాతుడవా? నీ కాడువారు తోబుట్టువులు లేరా? ఈ నీ కోపము సంగతి విన్నచో శాంతిధనులైన మును లెంత నిన్ను దూషింతురో?

క. పాము కడు ముదిసి కడపట
గాముగు చందమున వార్ధ ♦ కంబునఁ గ్రోధం
బేమియు మానక మండెడు
నా ముని మునియే తలంప ♦ నదియుం దపమే? 88

టీ: పాము; కడున్=మిక్కిలి; ముదిసి=ముసలిదై; కడపటన్=ఆఖరికి; గాముగుచందమునన్=గ్రహమైనట్లు; వార్ధకంబునన్=ముసలితనమున; క్రోధంబేమియున్=కోప మే మాత్రమును; మానక=వదలక; మండెడు=ఆవేశముతో మండిపడెడు; ఆ మునియున్=ఆ మునికూడ; మునియే=మునిపదవాచ్యుడేనా? అదియున్=వాని తపస్సును; తపమే=తపస్సేనా?

తా: పాము వెయ్యేండ్లు బ్రదికి చివర గెక్కులువచ్చి మిన్నాగై నీడ సోకి నను జబ్బును కల్గజేయునట. అట్లే నీవు ముసలివాడవైకూడ కోపముతో మండిపడు చున్నావు. నీవు నొక మునివేనా? నీ తపమును తపమేనా?

క. పరుల యపరాధగతులకుఁ
గెరలక తనుఁ బొగడుచోటఁ ♦ గీడాడెడుచోఁ
బరితోషము రోషము నెడఁ
జొరనీని తపస్వి సుమ్ము ♦ సుకృతి ధరిత్రిన్. 89

టీ: ధరిత్రిన్=భూమిలో; పరుల=ఇతరుల; అపరాధగతులకున్=తప్పుడు నడకలకు; కెరలక=కోపింపక; తనున్=తన్ను; పొగడుచోటన్=స్తోత్రముచేయు నప్పుడు; కీడు+ఆడెడుచోన్=నిందించువేళను; ఎదన్ = మనసున; పరితోష మున్=సంతోషమును; రోషమున్=కోపమును; చొరనీని = ప్రవేశింపనియ్యని; తపస్వి=మునియే; సుకృతిసుమ్ము=ధన్యుడుసుమా!

తా: తన కెవ రపకారము చేసినను కోపింపక, పొగడుటకు సంతోషింపక, నిందించుటకు రోషములేని మునియే సుమా ధన్యుడు! అలం. అప్రస్తుతప్రశంస.

తే. బం డొకఁడవైన నిపుడు నీ ♦ పిండి యిడమె
బ్రాహ్మణుఁడ వౌట మాచేత ♦ బ్రదుకు గంటి
తడవఁ బనిలేదు నిన్ను గౌతముని గోవ
వనుచు వాదించి విడిచిన ♦ నాగ్రహించి. 90

టీ: బండొకడవైనన్=బ్రాహ్మణుడవుకాకమరొకడవైనచో; ఇపుడు;నీపిండి యిడమె=నిన్ను పిండిపెట్టమా? బ్రాహ్మణుడవౌటన్=బాపడవగుటచే; మాచేతన్ =మాచేతిలో; బ్రతుకున్+కంటివి = బ్రతికి పోతివి; నిన్నున్; తడవన్+పని లేదు=ఇట్టివాడవని చెప్పనక్కరలేదు; గౌతముని గోవవు = గౌతమ మహర్షి గోవు వంటివాడవు—ముట్టినంతనే క్రిందపడి చచ్చి గోహత్య రప్పించు పుణ్యాత్ముడవు; అను చున్=అని; వాదించి=వాగులాడి; విడిచినన్; అతడు = ముని; ఆగ్రహించి= కోపించి....

తా: నీవు బ్రాహ్మణుడవైపోతివి కాని లేకున్న పిండిచేసి వదలక పోదుమా? బ్రతికిపోతివిలే. నిన్ననుటయేటికి గౌతముని గోవవు. అని వాదించి వదలించగా అతడు కోపించి...అలం. రూపకము. (గౌతముని గోవుకథ. గౌతముడను ముని తపస్సు చేసికొను చుండెను. ఒకప్పుడు పండ్రెండేండ్లు కరువు వచ్చెను. మునులందరు నతని యాశ్రమమునకు వచ్చిరి. అతడు ధాన్యము చల్లి జపతపోనుష్ఠానములు చేసికొను సరి కాధాన్యము మొలచి పెరిగి కంకులు వేసి పండి యుండెడివి. ఆ ధాన్యపు బియ్య ముతో అతిథులైన మునులకు తృప్తిగా విందు చేసెడివాడు. క్షామము తగ్గిన తర్వాత వెళ్ళుచు అతనిని తమతో రమ్మనిరి. అతడొప్పుకొనలేదు. వారొక గోవును సృష్టించి పైరుమీదికి వదలిరి. అది మేయుచుండగా గౌతముడు దర్భకర్రతో కొట్టగా అది

చచ్చెను. అతనికి గోహత్యా దోషము వచ్చినది. దానిని తగ్గించుటకై వారతనిని తమతో రమ్మనిరి. ఆతడు విధిలేక వెళ్ళెను. వారతని మన్నించిరి. అట్లు ఊరకయే ప్రాణములు పోవువానిని చెప్పవలసి వచ్చినపుడు 'గౌతముని గోవు' అందురు.)

క. ముసలి శపియించె నపు డ
య ్యసితాబ్జేక్షణల రాజ ♦ యక్ష్మక్షోభం
బెసఁగ నశియింప నగు న
ద్దెసఁ బాటుఁడు సుగుణి గామి ♦ తెల్లమియ కదా ? 91

టీ: అపుడు; ముసలి=ఆ ముసలిముని; ఆ+అసిత+అబ్జ+ఈక్షణలన్= నల్లకలువలవంటి కన్నులుకల వారిని; రాజయక్ష్మక్షోభంబు = క్షయరోగము వలని బాధ; ఎసఁగ=ఎక్కువకాగా; నశియింపన్=నశించునట్లుగా; శపియించెన్= శపించెను; అగున్ = అట్లు శపించుటతనికి తగును; ఆ+దెసన్ = ఆ విషయమున; పాటుడు=బాపడు; సుగుడి=సగుడు; (పా. సుగుణి=మంచిగుణములు కలాడు.) కామి=కాకపోవుట; తెల్లమియకదా=స్పష్టమేకదా!

తా: అట్లు కోపించిన నా చెలికత్తెలను క్షయరోగముచే బాధపడునట్లు శపించెను. ఆ విషయమున సుగుణి కానంగున అదతనికి తగియే యున్నది. అలం. అర్థాన్తరన్యాస.

క. ఆరుజ యప్పుడ య య్యం
భోరుహాలోచనలఁ బొందె ♦ భూవర నన్నున్
వారత్రియమున నుండియు
దారుణగతి నొక్క యసుర తఱిమెడు వెంటన్. 92

టీ. భూవర=రాజా! అప్పుడ=అప్పుడే; అయ్యంభోరుహాలోచనలన్= ఆ స్త్రీలను; ఆరుజ=ఆ క్షయరోగము; పొందెన్=వచ్చెను; నన్నున్; వారత్రయమునుండియున్=మూడురోజులనుండియు; ఒక్కయసుర=ఒకరాక్షసుడు; దారుణగతిన్=క్రూరమైనరీతిలో; వెంటన్=వెంబడించి; తఱిమెడున్=తరుముచున్నాడు.

సీ. ఇచ్చెద నీకస్త్ర ♦ హృదయంబు నివ్విద్య
నరనాథ మున్న పి ♦ నాకపాణి
యగు రుద్రుఁడిచ్చె స్వా ♦ యంభువమనువున
కతఁ డిచ్చె మఱి వసి ♦ ష్ఠాఖ్యమునికి
నతఁ డిచ్చెఁ గరుణఁ జి ♦ త్రాయుధుం డనుపేరఁ
దనరు మదీయమా ♦ తామహునకు
నతఁ డిచ్చెఁ బెండ్లియా ♦ నపు డరణంబుగా
మాతండ్రి కతఁ డిచ్చె మమత నాకు

గీ. సకలరిపునాశకము యశ ♦ స్కరము నైన
దీని వేవేగ నాచేఁ బ్రి ♦ తిగ్రహించి
యడఁపుమా దైత్యు వీరు ♦ వారనఁగ వలవ
దనఘ సద్విద్య యెం దున్న ♦ గొనఁగవలయు. 93

టీ: నరనాథ=రాజా! నీకున్; అస్త్రహృదయంబు=అస్త్రహృదయమను విద్యను; ఇచ్చెదన్=ఇత్తును; ఈ+విద్య=ఈవిద్యను; మున్ను=మునుపు; పినాకపాణియగు=మేరువనుధనువు చేతియందుకల; రుద్రుడు; స్వాయంభువమనువునకున్=స్వాయంభువను మొదటి మనువునకు; ఇచ్చెన్. అతడు; వసిష్ఠ+ఆఖ్యమునికిన్=వసిష్ఠుడను మునికి; ఇచ్చెన్; ఆతడు; కరుణన్=దయతో; చిత్రాయుధుండను పేరన్=చిత్రాయుధుడను పేరుతో; తనరు=ఒప్పెడి; మదీయమాతామహునకున్=నా తల్లి తండ్రికి; ఇచ్చెన్. అతడు; పెండ్లియైనపుడు=పెండ్లియగు సమయమున; అరణంబుగా=కానుకగా; మాతండ్రికిన్; ఇచ్చెన్. అతడు; మమతన్=మమకారముతో; నాకున్; ఇచ్చెను. సకలరిపునాశకము = అందరి శత్రువులను చంపునదియు; యశస్కరమునైన=కీర్తినిచ్చునదియునైన; దీనిన్=ఈ విద్యను; వేవేగన్=తొందరగా; నాచేన్=నావలన; ప్రతిగ్రహించి=స్వీకరించి; దైత్యున్=రాక్షసుని; అడపుమా=చంపుము; వీరు—వారు=ఇచ్చెడివారెవరు? అనగవలవదు=అనరాదు; సద్విద్య=మంచిచదువు; ఎందున్నన్=ఎవరివద్దనున్నను; కొనగవలయున్=గ్రహింపవలెను; విద్యను గ్రహించునపుడు విద్యనిచ్చువారెవరు—స్త్రీయా? పురుషుడా? ఏ జాతివారు? అను శంకవలదు. 'నీచాదప్యుత్తమావిద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి' అన్నట్లుగా వెంటన్ గ్రహింపవలెను.

క. అనుటయు శుచియై నిలిచిన
జననాథునకుం బ్రయోగ ♦ సంహారంబుల్
వనిత రహస్యంబుగఁ జె
ప్పిన నాతఁడు నెఱిఁగె నంత ♦ భీషణభంగిన్. 94

టీ: అనుటయున్=అనగా; శుచియై=ఆచమనముచేసి పరిశుద్ధుడై; నిలిచి; నన్=స్వారోచినిల్వగా; వనిత=ఆస్త్రీ; జననాథునకున్ = స్వారోచికి; ప్రయోగసంహారంబుల్=ప్రయోగించుట; ఉపసంహరించుటలను; రహస్యంబుగన్=రహస్యముగా; చెప్పినన్=ఉపదేశించగా; అతడును=ఆరాజుకూడ; ఎఱిగెను=గ్రహించెను; అంతన్=అంతలో; భీషణభంగిన్=భయంకరమైన రీతిలో...

—: మహాస్రగ్ధర :—

గళగర్జత్క్రోడనిర్య ♦ త్కహాకహానినదో
♦ ద్గాఢహాసంబు భూభృ

ద్బిలముల్ మ్రోయింపఁ గాదం ♦ బినిగతిని బొగల్
♦ పెంప మి న్నెల్ల మైగాఁ
జలితాస్యక్రూరదంత ♦ క్షతరదవసన
♦ క్షారకీలాలవేల్ల
జ్వలనజ్వాలాభజిహ్వాం ♦ చలుఁ డగుచు గదన్
♦ జాళెముల్ ద్రిప్పుకొంచున్. 95

టీ: గళగర్త=కన్నమువంటి గొంతుయొక్క; క్రోడ=లోపలినుండి; నిర్యత్=బయటికి వచ్చుచున్న; కహకహనినద=కహకహమను చప్పుడులో; ఉద్గాఢ=ఎక్కువైన; హాసంబు=నవ్వు—వికటాట్టహాసము; భూభృత్+బిలముల్=కొండ గుహలు; మ్రోయింపన్=ప్రతిధ్వనింపగా; కాదంబినిగతిన్ = మేఘమాలవలె; పొగల్=పొగలను; పెంపఁగా = పెంచగా; మిన్నెల్లన్ = ఆకాశమంతయు; మైగాన్=శరీరముకాగా; చలిత+ఆస్య = కదల్పబడిన ముఖమునందు; క్రూర=భయంకరమైన; దంత = కోరలయొక్క; క్షత=గాట్లుకల; రదవసన=పెదవుల నుండి; క్షార=కారమైన; కీలాల=రక్తముతో; వేల్లత్=వ్రేలాడుచున్న; జ్వలన జ్వాలా+ఆభ=నిప్పుమంటవంటి; జిహ్వా+అంచలుడు=నాలుకచివరకలవాడు; అగుచున్; గదన్ = గదను; జాళెముల్ = పైకి నిబ్బరముగా; త్రిప్పుకొంచున్=త్రిప్పుచు...

తా: పెద్దకలుగువలె నోరుతెరచి కొండగుహలు ప్రతిధ్వనించునట్లు వికటాట్టహాసము చేయుచు, నల్లమబ్బు వ్యాపించినట్లు శరీరముయొక్క నల్లని కాంతులు వ్యాపించగా కోపాటోపమున కోరలతో పెదవులను కరచుకొన్న గాయములనుండి రక్తముకారుచు నాలుకపై బడగా నిప్పుమంటవలె క్రిందికి వ్రేలాడు నాలుకను నాకుచు గదను గిరగిర త్రిప్పుచు...అలం. స్వభావోక్తి, అతిశయోక్తి, ఉపమ.

ఉ. దానవుఁ డద్ధరారమణుఁ ♦ దాఁకె నుదగ్రపదాగ్రఘట్టన
గ్లానిసపాటమై యచటి ♦ కాన ఘరట్టవిఘట్టితాకృతిం
బూని చెడం గిరీశగళ ♦ మూలహలాహలకాలకాంతితో
మేనఱికంబు లాడు తన ♦ మేఁటి త్రిశూలముఁ బూని యుద్ధతిన్.

టీ: దానవుడు=రాక్షసుడు; ఉదగ్ర=భయంకరమైన; పద+అగ్ర=కాలి చివళ్ళయొక్క; ఘట్టన=త్రొక్కుటవలని; గ్లానిన్=బాధచే; సపాటమై=చదునై; అచటికాన=అక్కడియడవి; ఘరట్ట=తిరుగలిచే; విఘట్టిత=విసరబడిన; రూపమును; పూని=పొంది; చెడఁగా=నశింపగా; గిరీశ=శివునియొక్క; గళమూల=కుత్తికయందలి; హాలాహల = కాలకూటముయొక్క; కాలకాంతితోన్=నల్లని కాంతితో; మేనఱికంబులు=మేనత్త మేనమామ బిడ్డల మాటలు—పరిహాసములు;

ఆడు = చేసెడి; తనమేటి త్రిశూలమున్ = తనపెద్ద త్రిశూలమును; పూని = ధరించి; ఉద్ధతిన్ = విసురుతో; ఆ+ధరారమణున్ = ఆరాజును; తాకెన్ = ఎదుర్కొనెను.

తా: అట్లు రాక్షసుడు తనకాలితో ఘట్టించుటతో అడవి మెట్టపల్లములు లేక సమమై పిండిని విసరినట్లుకాగా నల్లని త్రిశూలమును భుజములపై పెట్టుకొని వచ్చి స్వరోచి నెదుర్కొనెను. అలం. అతిశయోక్తి, నిదర్శన, ఉపమ.

తే. నింగి నొరయు రాకాసిమ ♦ న్నినిమేని
నీడఁ జీఁకటిఁ గొనె నవ ♦ నీ తలంబు
చంద్రికలు గాంచె నట్టహా ♦ సముల వెడలు
నిశితదంష్ట్రిలచే నవ ♦ నీతలంబు. 97

టీ: నింగిని = ఆకాశమును; ఒరయు = అంటెడు; రాకాసిమన్నిని = రాక్షసరాజుయొక్క; మేనినీడన్ = శరీరపు నీడచే; అవనీతలంబు = భూమి; చీకటిగొనెన్ = చీకటిగా నయ్యెను. అట్టహాసములన్ = పెద్దపెద్దనవ్వులందు; వెడలు = బయటికి వచ్చు; నిశితదంష్ట్రిలచేన = వాడియగు కోరలతోనే; వనీతలంబు = అడవిప్రదేశము; చంద్రికలు = వెన్నెలలు; కాంచెన్ = పొందెను; అలం. అతిశయోక్తి.

తా: ఆ రాక్షసుని శరీరకాంతిచే చీకటి క్రమ్మినట్లుకాగా కోరలకాంతిచే వెన్నెలలు వచ్చినట్లయినది. అతడంత నల్లగాను, కోరలు తెల్లగాను నున్నవని భావము.

—:పంచచామరము:—

పలాసి డాసి రాజుఁ ♦ బల్కె నోరి! నోరి కీ
పొలానఁ బెన్ బొ లాన లేక ♦ పోవ నీవు దోఁచితౌ
బలా బలాలితోడఁ బాలఁ ♦ బట్టి బిట్టు చుట్టి నిన్
హాళాహళిన్ హాలాహాలాంభ ♦ యా బుభుక్షఁ దీర్చెదన్. 98

టీ: పల+అశి = మాంసము తినెడి రాక్షసుడు; డాసి = సమీపించి; రాజున్ = రాజును; చూచి; పల్కెన్. ఓరి = మానవా! ఈ పొలానన్ = ఈ యడవిలో; నోరికిన్ = నా నోటికి; పెన్+పొల = పెద్దమాంసము; అనన్ = తినుటకు; లేక పోవన్ = లేకపోగా; నీవు; దోచితి = కన్పడితివి; ఔన్. బలా = బాగున్నది! బల+అలితోడన్ = సేనలతోసహా; బాలన్ = కన్యను; పట్టి; బిట్టుచుట్టి = గట్టిగా పోకుండ చుట్టిపెట్టి; నిన్ = నిన్ను; హాలాహల+అభమా = కాలకూటమువంటి; బుభుక్ష = ఆకలి; తీర్చెదన్ = తీర్చుకొందును. అలం. ఉపమ.

'జ, ర, జ, ర, జ, గ' గణములు, 19 అక్షరము యతిస్థానము పంచచామరము.

తా: రాక్షసుడు రాజునుచేరి 'ఓరీ! ఇక్కడ నాకు మాంసము దొరకక బాధపడుచుండగా నీవు నేన దొరికితివి. నిన్ను సేనతోసహా పిల్లను పట్టి మండిపోయెడి నా యాకలి తీర్చుకొందును.

—: మహాస్రగ్ధర :—

అని బాహాస్ఫోటరావా ♦ హతపతగకులం
♦ బవ్వనీశాఖిశాఖా
జనితవ్యాకీర్ణజీర్ణ ♦ చ్ఛదములకరణిన్
♦ జల్లనన్ రాల భూషా
ర్చి నుదీర్ణాలాతచక్రా ♦ కృతిగఁ జిఱజిఱం
♦ ద్రిప్పి వైచెం గదన్ వై
చినఁ దేజిన్ రాజు గెంటెం ♦ చెఁ దొలఁగ నది య
♦ చ్చెంత కాంతార మేర్చెన్. 99

టీ. అని; బాహా+ఆస్ఫోటరావ=బాహువులప్పళించెడి చప్పుడుచే; ఆహత=కొట్టబడిన; పతగకులంబు=పక్షిసమూహము కలది; ఆ+వనీ=ఆయడవియందలి; శాఖిశాఖా=చెట్టుకొమ్మలనుండి; జనిత=పుట్టిన; వ్యాకీర్ణ=వ్యాప్తమైన; జీర్ణ+ఛదములకరణిన్=ప్రాతయాకులవలె; జల్లు+అనన్ = జల్లుమనునట్లు; రాలన్=రాలగా; భూష+అర్చిన్=అలంకారముల కాంతిచే; ఉదీర్ణ=గొప్పదైన; అలాత=కొరవియొక్క; చక్ర+ఆకృతిన్=చక్రముయొక్క ఆకారము కలదిగా; గదన్=గదను; జిఱజిఱ=జిఱ్ఱుమనునట్లు; త్రిప్పి; వైచెన్ = స్వరోచి మీదికి విసరెను; వైచినన్=వేయగా; రాజు; తొలగన్=గురితప్పునట్లు; తేజిన్ = గుర్రమును; గెంటించెన్=తప్పించెను; అది=ఆ గద; ఆ+చెంతకాంతారము=ఆ దగ్గరలోని యడవిని; ఏర్చెన్=దహించెను. 'స, త, త, న, స, ర, ర, గ' గణములు, 9, 16 అక్షరములు యతిస్థానములు కలది మహాస్రగ్ధర.

తా: అని భుజములప్పళించగా పక్షులు చెట్లనుండి ప్రాతయాకులు రాలినట్లు క్రిందికి డుల్లినవి. అప్పుడతడు గదను గిరగిర త్రిప్పి రాజుపైకి విసరెను. రాజుగురి తప్పునట్లుగా గుర్రమును దాటించెను. ఆగదపడి అక్కడి యడవి నుగ్గయ్యెను. అలం. ఉత్ప్రేక్ష, నిదర్శన. అతిశయోక్తియు.

—: పృథ్వి :—

గదాహతికి నాత్మఁ గొం ♦ కక యెదిర్చి రాఁ గా నిదొఁ
గదా యనుచుఁ ద్రిప్పి రా ♦ క్షసుఁడు వైచె గాఢభ్రమీ
నదత్కనకకింకిణీ ♦ నటనజాగ్రదుగ్రార్భటీ
వదావదమహాగుహా ♦ వలభియైన శూలంబునున్. 100

టీ: గదా+హతికిన్=గదదెబ్బకు; ఆత్మన్=మనసులో; కొంకక=జంకక; ఎదిర్చి=ఎదిరించి; రాగాన్; ఇది=ఈసాహసము; ఒకగద = యుక్తమేకదా! అనుచున్; రాక్షసుడు; గాఢ=ఎక్కువైన; భ్రమీ=తిరుగుడులచే; నదత్=

చప్పుడగు; కనకకింకిణీ=బంగరు చిరుగంటలయొక్క; నటనజాగ్రత్=తప్పకచలించుటచే; ఉగ్ర=భయంకరమైన; ఆర్భటీ=ధ్వనిచే; వదావద=మ్రోగెడి; మహా గుహా=గొప్పగుహాలయొక్క; వలభియైన=సుందరి భాగములుకల; శూలంబునున్=శూలమును; త్రిప్పి; పైచెన్=స్వరోచిపై విసరెను.

తా: స్వరోచి అగడదెబ్బ తప్పించుకొని తన్నెదుర్కొనగా ఆసాహసము యుక్తమే అని గిరగిర త్రిప్పినప్పుడు మ్రోగు చిరుగంటల మ్రోతకు కొండగుహాలు మారుమ్రోగునట్లు శూలమును త్రిప్పి రాజుపైకి విసరెను. పృథ్వీవృత్తమునకు 'జ, స, జ, స, య, ల, గ' గణములు. 9 అక్షరముమీదయతి. అప్పకవీయమున పంద్రెండవ యక్షరమును యతియనెను. ఇక్కడ అదికుదరకున్నది.

శా. ఆశూలం బవనీశమాళికులిశా ♦ హంకారహుంకారకృ
న్నైశిత్యం బభినుత్యమై నెగడు బా ♦ ణశ్రేణిఁ జెండాడి వేఁ
గాశశ్వేతగరుత్పరంపరల నా ♦ కాశంబు దుగ్ధాబ్ధి సం
కాశంబై వెలుఁగన్ శరావళులచేఁ ♦ గప్పెం గకుప్పంక్తులన్. 101

టీ: అవనీశమాళి=రాజశ్రేష్ఠుడు; కులిశ+అహంకార = వజ్రముయొక్క గర్వమునకు; హుంకారకృత్=హుంకారముచేయు; నైశిత్యంబు=వాడికల్గుటచే; అభినుత్యమై=పొగడదగినదై; నెగడుబాణశ్రేణిన్ = ప్రజ్వరిల్లు బాణముల పంక్తిచే; ఆశూలంబున్=రాక్షసుడు వేచిన శూలమును; చెండాడి=ముక్కలుచేసి; వేన్=వెంటనే; కాశ=రెల్లుపువ్వులవలె; శ్వేత=తెల్లని; గరుత్=రెక్కల; పరంపరలన్ = వరుసలచే; ఆకాశంబు; దుగ్ధ+అబ్ధి సంకాశంబై = పాలసముద్రముతో సమమై; వెలుగన్=ప్రకాశింపగా; శర+ఆవళులచేన్=బాణపంక్తులచే; కకుప్+సంక్తులన్=దిక్కుల సముదాయములను; కప్పెన్.

తా: స్వరోచి వాడియగు బాణములచే నా శూలమును ముక్కముక్కలుచేసి. ఆకాశమున పాలసముద్రమున్నదా అన్నట్లు తెల్లని రెక్కలుగల బాణములతో నింపెను. అలం. ఉపమ.

క. అవి యాతని పైతోలును
నవియింపఁగ లేక మిడిసి ♦ యల్లటువడఁ జూ
చి వనేచరు లేచిన వెఱ
దవిలినమతి నద్దిరయ్య ♦ దయ్యం బనుచున్. 102

టీ: అవి=ఆ బాణములు; అతని పైతోలున్ = రాక్షసుని చర్మమును; అవియింపగన్=భేదించుటకు; లేక=తాళక; మిడిసి=చెదరి; అల్లటుపడన్=దూరముగా పడగా; వనేచరులు=కోయలు; చూచి; ఏచినవెఱ=హెచ్చినభయము; తవిలినమతిన్=కల్గిన బుద్ధితో; అద్దిరయ్య=ఔరా! దయ్యంబు = ఇదిభూతము; అనుచున్...అలం. కావ్యార్థాపత్తి.

తా: రాజు ప్రయోగించిన బాణములతనిపై చర్మమునైనను తెగగొట్టలేక పైకెగిరి చెదరి పడినది. అది చూచి బోయలు 'అమ్మో! ఇది భూతము!' అనుచు...

సీ. పక్కుపక్కున నంఘ్రి ♦ పాశముల్ వెసఁ ద్రెంచి
జేగతండముల మింటికిని విడిచి
గళగళధ్వనులతోఁ ♦ గంఠశృంఖల లూడ్చి
సుడివడఁ గుక్కల ♦ నడవిఁ గలపి
గుప్పుగుప్పున మోచి ♦ కొనియున్న వలలతోఁ
బలలంపుఁబొత్తరల్ ♦ పాఱవైచి
కంగుకంగున నేలఁ ♦ గైదప్పగాఁ బడు
వేఁటమ్ము లేఱక ♦ దాఁటి దాఁటి

గీ. తిరిగి చూచుచు దట్లెగఁ ♦ దీసికొనుచు
దగలు దొట్టి యథాయథ ♦ లగుచు విఱిగి
యొకఁడు వోయినత్రోవ వే ♦ ఱొకఁడు వోక
చెట్టొకఁడు గాఁగఁ బఱచిరి ♦ చెంచు లప్పుడు. 103

టీ: అపుడు; చెంచులు=బోయలు; పక్కుపక్కునన్ = ఫుటుకు ఫుటుకున; అంఘ్రిపాశముల్ = కాళ్ళత్రాళ్ళు; వెసన్ = వెంటనే; త్రెంచి=త్రెంపి; జేగతండంబులన్ = జేగలగుంపులను; మింటికిన్ = పైకి; విడిచి; గళగళధ్వనులతోన్ = గలగలమను చప్పుడుతో; కంఠశృంఖలలు = కంఠములందలి సంకెలలు; ఊడ్చి= ఊడదీసి; సుడివడన్ = చిక్కుపడునట్లు; కుక్కలన్; అడవిగలపి=అడవిలో వదలి; గుప్పుగుప్పునన్ = గుప్పుమను చప్పుళ్ళతో; మోచుకొనియున్న వలలతోన్ = మోయుచున్న వలలతో; పలలంపుబొత్తరలు=మాంసపు కట్టలు; పారవైచి; కంగుకంగునన్ =కంగుమనుచప్పుడుతో; నేలన్ = నేలపై; కైదప్పగాన్ = చేమరపుచే; పడువేట +అమ్ములు=జారెడు వేటబాణములు; ఏఱక=ఏరికొనక; దాటిదాటి=పరుగులెత్తి; తిరిగిచూచుచున్ = వెనుకకు మరలి చూచుచు; దట్లు=కొనకోకలు; ఎగదీసికొనుచున్ = పైకెగాగికొనుచు; దగలు=దాహములు; దొట్టి=ఎక్కువై; యథాయథలు =ఎక్కడి వారక్కడనే సంబంధము లేనివారు; అగుచున్; విరిగి=చెదరి; ఒకడు పోయినత్రోవ వేఱొకడుపోక; చెట్టొకడుగాగన్ = చెట్టున కొకడుగా; పఱచిరి= పరుగెత్తిరి.

తా: అప్పుడు బోయలా రాక్షసుని గాంచి భయపడి డేగలను, వేటకుక్కలను వదలి, మాంసము పొత్తరలను పారవేసి, విల్లమ్ములు జారిపడగా, కొనకోకలెగదీసికొనుచు వెనుదిరిగి చూచుచు చెట్టునకొకడుగా పారిపోయిరి.

క. పోత్రిపుఁదలపోసి నిలువక
పాపాత్మకమై కిరాత ♦ బల మటు పాఱన్

భూపతి యయ్యింతిహాయ
స్థాపితఁగాఁ జేసి పలికెఁ ♦ దన్ముఖ్యులకున్. 104

టీ: ప్రోపు=పోషణమును; తలపోసి=ఆలోచించి; నిలువక=ఆగక; పాప+ఆత్మకమై=కృతఘ్నమైన మనస్సు కలిగినదై; కిరాతబలము=బోయల సేన; అటు=ఆరీతిగా; పాఱన్=పారిపోగా; రాజు; ఆ+ఇంతిన్=ఆ స్త్రీని; హయస్థాపిత గాన్ = గుఱ్ఱముపై నెక్కించుకొని బడిన దానిగా; చేసి; తత్+ముఖ్యులకున్= ఆ సేనలో ముఖ్యమైన వారితో; పలికెన్.

తా: రాజు తమ్ము పోషించుచున్నాడన్న కృతజ్ఞత యైనను లేక బోయసేన రాజును వదలి పారిపోగా రాజు ఆ సేనలో ముఖ్యులను గూర్చి యిట్లనెను.

ఉ. కైదువు సున్న పూజ్యములు ♦ కంకటఖేటశిరస్త్రలత్రిముల్
లే దరదంబు తత్తడి హుళిక్కి ♦ సహాయము సర్వమంగళం
బీ దనుజుండు చిక్కె భయ ♦ మేటికి లుబ్ధకులార యాత్మకుం
బేదతనంబు మేలె మఱి ♦ మృత్యువు డాఁగెడిచోట లేదొకో. 105

టీ: కైదువు=ఆయుధము; సున్న; కంకట = కవచము; ఖేట=డాలు; శిరస్త్రలత్రముల్=తలకు తొడిగికొను కవచములు; పూజ్యములు=లేవు; అరదంబు=రథము; లేదు; తత్తడి=గుఱ్ఱము; హుళిక్కి=లేదు; సహాయము = తోడు; సర్వమంగళంబు=లేదు; ఈదనుజుండు = ఈరాక్షసుడు; చిక్కెన్ = దొరికెను. భయము; ఏటికిన్? ఆత్మకున్=మనస్సునకు; పేదతనంబు=బీదపోవుట; మేలె=మంచిదా? మఱి=కాక: మృత్యువు; డాఁగెడి చోటన్ = దాగికొన్న చోట; లేదొకో=లేదా?

తా: ఈ రాక్షసుడు వాహనము, ఆయుధములు, సహాయము లేకుండ నొంటరి వాడు. ఇక మీకు భయ మెందుకు? మనసులో పిరికితన మేల? దాగికొన్న చోట మాత్రము వాని కేదా? మనము గాలించితే వాడు తప్పునా?

ఆ. నీడఁ గడవఁ బాఱ ♦ నేలకు వెలిగాఁగ
నడుగు వెట్టి తిరుగ ♦ నాత్మ మొఱఁగి
యొకటిఁ దలఁప నరుల ♦ కొదవిన నొదవ దే
కరణి మృత్యుదేవిఁ ♦ గన్నుఁ బ్రామ. 106

టీ: నరులకున్=మనుష్యులకు; నీడన్=తమనీడను; కడవన్=దాటునట్లు; పాఱన్=పారిపోవుటకు; నేలకున్=భూమికి; వెలిగాఁగన్ = దూరమగునట్లును; అడుగువెట్టి తిరుగన్=కాలుమోపి తిరుగుటకును; ఆత్మన్=మనస్సును; మొఱఁగి=వంచించి; ఒకటి=మరొకరీతిని; తలఁపన్=తలచుటకు; ఒదవినన్=సిద్ధించినను; ఏకరణిన్=ఏ రీతిగా; మృత్యుదేవిన్ = మృత్యుదేవతను; కన్నుఁబ్రామన్=కన్నుమూయుటకు; ఒదవదు=వీలుపడదు.

తా: ఏడను దాటుట, నేలనంటక తిరుగుట, మనసునకు తెలియక ఆలోచించుట మొదలైన పనులు చేయగల్గినను మృత్యువును సాగనించి తప్పించుకొనుటకు పాత్రము వీలుపడదు. అలం. అప్రస్తుతప్రశంస.

క. చావుఁ దలపోసి మానవుఁ
డేవగ దుష్కీర్తి వొరయ ♦ కే దినములు పొం
దై వెడలునట్లు నడవఁగఁ
దైవం బటమీఁద మేలు ♦ తాన ఘటించున్. 107

టీ: మానవుడు; చావున్=మరణమును; తలపోసి=ఆలోచించి; ఏవగన్=ఏరీతిగాను; దుష్కీర్తి=అపకీర్తిని; పొరయకే=పొందకే; దినములు=కాలము; పొందై=అనుకూలమై; వెడలునట్లు=వెళ్ళునట్లు; నడవగన్=ప్రవర్తించగా; అట మీదన్=అటుపై; దైవంబు=విధి; తాన=తానే; మేలు=మంచిని; ఘటించున్=చేకూర్చును.

తా: మనుష్యుడెట్లయినను చచ్చెడివాడనని నిశ్చయించుకొని అపకీర్తికిపోక జాగ్రత్తగా మెలగవలెను. ఆపై దైవమే మేలుకూర్చును. అలం. అప్రస్తుతప్రశంస.

సీ. బుద్ధీంద్రియక్షోభ ♦ ములకుఁ బెట్టని కోట
విపదంబురాశి దు ♦ ర్వికృతితోడ
ఖలదురాలాప మా ♦ ర్గణవజ్రకవచంబు
రణమహీస్థలికి శ్రీ ♦ రామరక్ష
శాత్రవదుర్గర్వ ♦ సంస్తంభనౌషధి
మొనయు చింతాశ్రేణి ♦ మూఁకవిప్పు
రోగాదిసంసిద్ధు ♦ లొనఁగూర్చు పెన్నిధి
ఘూలు నేకాకుల ♦ కోడునీడ

గీ. సకలసుగుణప్రధానంబు ♦ సకలకార్య
జాలసాఫల్యకరణైక ♦ సాధనంబు
ధైర్యగుణ మట్టిధైర్యంబు ♦ దక్కఁ పోరఁ
ద త్తఱింతురె యకట మీ ♦ తరమువారు. 108

టీ: ధైర్యగుణము=ధైర్యమనెడి మంచిగుణము; బుద్ధి=మనస్సు; ఇంద్రియ=ఇంద్రియముయొక్క; క్షోభములకున్=బాధలకు; పెట్టనికోట=రక్షకమైనది; విపత్+అంబురాశి=ఆపత్తులనెడి సముద్రముయొక్క; దుర్వికృతికిన్=చెడువికారములకు; ఓడ=దాటించునది; ఖల = నీచులయొక్క; దురాలాపమార్గణ=చెడుమాటలనెడి బాణములకు; వజ్రకవచంబు = వజ్రముతో తయారైన కవచము; రణమహీస్థలికిన్=యుద్ధభూమికి; శ్రీరామరక్ష=శ్రీరాముడు రక్షించునట్లు; శాత్రవ

=శత్రువులయొక్క; దుర్గర్వసంస్తంభన=చెడుగర్వమును నిలుపుటకు; ఓషధి=ఓషధివంటిది; మొనయు=వృద్ధిపొందెడి; చింతాశ్రేణి=విచారములను; దూరనిష్ప=దూరముగా తొలగించునది; యోగాదిసంసిద్ధులు=యోగము మొదలైన వాటియొక్కసిద్ధులను; ఒనగూర్చు=చేకూర్చెడి; పెన్నిధి=పెద్దనిధివంటిది; తూలు+ఏకాకుల=భయపడెడియొంటరివారికి; తోడునీడ=సహాయమైనది; సకలసుగుణప్రధానంబు=అన్నిమంచిగుణములకు ప్రధానమైనది; సకలకార్యజాల=అన్నిపనులను; సాఫల్యకరణ=సఫలముచేయుటకు; ఏకసాధనంబు=ముఖ్యమైన సరికరము; అట్టిధైర్యంబు; ఉక్కి=వదలి; పోవన్=యుద్ధమున; ఏతనమునాగు=నీవంటివారగు; తత్తఱిల్లుగా=తొందరపడుదురా? అకట=అయ్యో!

తా: ధైర్యమువంటి మంచిగుణములేదు. అట్టి ధైర్యమును వదలి నీవంటి వారెన్నడైన యుద్ధములలో పారిపోదురా?

క. అని తెలిపి తిరుగుడనుటయు
మనమున లజ్జించి యెఱుకు • మన్నె లిక నీ
జనపతితోఁ డీద లోకం
బని తమతమ మొనలు ద్రిప్పి • రవియును దిరిగెన్. 109

టీ: అని=ఇట్లు; తెలిపి=తెలివివచ్చునట్లుచెప్పి; తిరుగుడు=వెనుకకుమరలుడు; అనుటయున్=అనగా; ఎఱుకుమన్నీలు=బోయదొరలు; మనమునన్=లోపల; లజ్జించి=సిగ్గుపడి; ఇకన్=ఇకపై; ఈజనపతితోడిద=ఈ రాజుతోనే; లోకంబు=చావు-బ్రతుకులు; అని; తమతమమొనలు=వారివారిసేనలను; త్రిప్పిరి=వెనుకకు మరలించిరి. అనియున్=సేనలును; తిరిగెన్=మరలెను.

తా: స్వారోచి అట్లు బుద్ధిచెప్పుటతో బోయదొరలు తెలివి తెచ్చుకొని పారిపోవుచున్నందులకు సిగ్గుపడి, చచ్చినను బ్రతికినను రాజుతోపాటే అనుకొని తమ సేనలను వెనుకకు మరలించిరి.

వ. ఇట్లు తిరిగి యుక్కెక్కి రక్కసుం డెక్కడెక్కడ నని యక్కోటబలంబు లగుడంబులుఁ గటారులుఁ బందీలును విండ్లు గండ్రగొడ్డండ్లుఁ జిల్లకోలలుఁ బంట్రగోలలు మెఱయ రయ సముద్ధూతధూళిధూసరితధారాధరపథంబగుచు నొక్కపరియ చీమపరియునం గవిసె నందు. 110

టీ: ఇట్లు; తిరిగి=మరలి; ఆ+కోటబలంబు=ఆ బోయసేన; ఉక్కు+ఎక్కి=చేవకలిగి—ధైర్యము తెచ్చుకొని; రక్కసుండు=రాక్షసుడు; ఎక్కడెక్కడన్=ఎక్కడ నున్నాడు; అని; లగుడంబులు=కర్రలు; కటారులు=కత్తులు; బందీలు; విండ్లు; గండ్రగొడ్డండ్లును; చిల్లకోలలున్=చిన్నబల్లెములు; పంట్రగోలలు=పెద్దబల్లెములు; రయ=వేగముచే; సముద్ధూత=రేపబడిన; ధూళిధూసరిత=పరాగముచే బూడిదయైన; ధారాధరపథంబు+అగుచున్=ఆకాశము కలదై,

ఒక్కపరియా = ఒక్కసారిగానే; భీమపటు+ఆరవన్ = భీమమైన ఆరవమునట్లు; కవిసెన్ = ఎదుర్కొనెను. అంతన్ = అంతలో...

మ. శరసంధానముతోనె కొన్నియడుగుల్ ♦ జౌజవ్వనం బారి య
ద్ధరణిం గాల్కొని ద్రోణముల్ దివియుదో♦ర్దండంబులం జేది యే
సిరి కోయల్ దిను మంచు నార్చి పరఁగం♦ జిట్టాసలన్ డాయుచున్
గొరువంకల్ మొర వెట్టినట్లుగుణముల్ ♦ ఘోషింప రోషించుచున్.

టీ: కోయలు; రోషించుచున్ = కోపించుచు; శరసంధానముతోనె = బాణమును సంధించుటతోనే; కొన్నియడుగులు = కొన్ని అంజలు; జౌజవ్వనన్ = వేలజవ జవలాడునట్లు; పారి = పరువెత్తి; ఆ+ధరణిన్ = ఆ ప్రదేశమున; కాల్కొని = కాలదిమిపట్టి; ద్రోణముల్ = సన్నగా చెక్కబడిన దుంగలను; దివియుదోర్దండంబులన్ = బలమెక్కిన కర్రలవంటి బుజములతో; చేది = పట్టి; గొరువంకలు = గోరువంకలు; మొఱవెట్టినట్లు = అరచినట్లు; గుణము = నారి; ఘోషింపన్ = చప్పుడు కాగా; చిఱు+ఆసలన్ = చిఱునాసలతో; పరగన్ = ఒప్పగా; డాయుచున్ = రాక్షసుని సమీపించుచు; తినుము = వీనిని తినుము; అంచున్ = అనుచు; ఆర్చి = కేకలు వెట్టి; ఏసిరి = బాణముల వేసిరి.

తే. ఆశరావళి నమ్మను ♦ జాశనుండు
లీల మృగదంశకము మశ ♦ కాలి నొడిసి
చప్పరించు విధంబున ♦ శాతదీర్ఘ
దంష్ట్రికలఁ జప్పరించి రౌ ♦ ద్రమునఁ గెరలి. 112

టీ: ఆ+మనుజ+అశనుండు = ఆ మనుష్యులను తిను రాక్షసుడు; ఆశరావళిన్ = ఆ బాణపరంపరను; లీలన్ = విలాసముగా; మృగదంశకము = కుక్క; మశక+ఆలిన్ = దోమలను; ఒడిసి = పట్టి; చప్పరించు విధంబునన్ = చప్పరించునట్లు; శాత = వాడియైన; దీర్ఘ = పొడవైన; దంష్ట్రికలన్ = కోరపళ్ళతో; చప్పరించి; రౌద్రమునన్ = భయంకర రూపముతో; కెరలి = కోపించి... అలం. ఉపమ.

తా: ఆ రాక్షసుడు కోయలు వేసిన బాణములను కుక్క దోమలను తినునట్లుగా ఒడిసిపట్టి చప్పరించెను.

సీ. గళితశృంఖలమైన ♦ గంధనాగము వోలెఁ
బ్రజలపైఁ బేరెముల్ ♦ పాఱిపాఱి
కలశాబ్ధి మథియించు ♦ కైటభాంతకు లీల
జవ మొప్పఁ జేతులు ♦ సాఁచి సాఁచి
కన లూను కీనాశ ♦ కాసరమ్మును బోలెఁ
గమిచి తట్టువగుంపుఁ ♦ జమరి చమరి

యమృతాపహరణార్థ ♦ మరుగు పక్షిస్వామి
గతిఁ బుళిందశ్రేణిఁ ♦ గమిచి కమిచి
గీ. సెలవులు బిగించి నేత్రదం ♦ ష్ట్రికలు మెఱయ
నిడుదమొగ మెత్తి మీసల ♦ నెత్తు రొలుకఁ
బటబట కపాలపంక్తులఁ ♦ బగులఁ గోఱికి
బలము నెల్లను గడియలో ♦ పలన మ్రింగె. 113

టీ: గళితశృంఖలమైన=జారిన గొలుసులుంకల; గంధనాగముపోలెన్=మదపుటేనుగువలె; ప్రజలపైన్=సేనలమీద; పేరెముల్ పారిపారి = పలుసార్లు పరుగెత్తి; కలశాబ్ధి=పాలసముద్రమును; మథియించు=చిలికెడి; కైటభ+అంతకులీలన్ =విష్ణువవలె; జవము+ఒప్పన్=వేగముగా; చేతులు సాఁచి సాఁచి; కనలు+ఈను=కోపించిన; కీనాశ=యమునియొక్క; కాసరమ్మునుబోలెన్=దున్నపోతువలె; కమిచి=ఒడిసిపట్టి; తట్టువగుంపున్ = గుఱ్ఱముల మందను; చమరి చమరి= నేలరాచివేసి; అమృత+అపహరణార్థము=అమృతమును దొంగిలించుటకై; అరుగు పక్షిస్వామిగతిన్=వెళ్లెడి గరుడునివలె; పుళిందశ్రేణిన్=బోయలను; కమిచికమిచి =ఆక్రమించి; సెలవులుబిగించి = పెదవుల మొదళ్ళను నొక్కిపట్టి; నేత్రదంష్ట్రికలు=కన్నులు; కోరలు; మెఱయన్=ప్రకాశింపగా; నిడుదమొగము+ఎత్తి= పొడవైన మొగమును ఎత్తి; మీసలన్=మీసముల వెంట; నెత్తురు + ఒలుకన్= రక్తము కారగా; పటపటన్; కపాలపంక్తులన్=పుఱ్ఱెలను; పగులన్=పగులునట్లు; కోఱికి; బలము నెల్లను=సైన్యమునంతను: గడియలోపలనె = ఒక్కక్షణములోనే; మ్రింగెన్.

తా: గొలుసులూడిన మదపుటేనుగవలె సేనలపైబడి పరుగెత్తియు, పాల సముద్రమును మథించు విష్ణువవలె చేతులు బారలుచాపియు, కోపించిన యముని దున్నపోతువలె గుఱ్ఱముల నడిమియు, అమృతము తెచ్చుటకై వెళ్లెడి గరుత్మంతుని వలె బోయలనొడిసి పట్టియు సెలవులు బిగించి, కన్నులు, కోరలు మెరయగా మొగ మెత్తి మీసములవెంట నెత్తురుకారగా కపాలములు పగులునట్లు సేననంతను గడియలోపలనే మ్రింగెను. అలం. స్వభావోక్తి. ఉపమ.

క. ఆసమయంబున గీర్వా
ణీసుతుఁ డయ్యింతి నొక్క ♦ నికటనికుంజా
వాసమ్మున నిడి క్రమ్మఱి
వే సురరిపుఁ దాఁకెఁ దురగ ♦ వేగము మెఱయన్. 114

టీ: ఆసమయంబునన్=అప్పుడు; గీర్వాణీసుతుడు; స్వరోచి; ఆ+ఇంతిన్ =ఆస్త్రీని; ఒక్కనికటనికుంజ+ఆవాసమ్మునన్ = దగ్గరలోని యొకపొదరింటిలో; ఇడి=ఉంచి; క్రమ్మఱి = మరలి; తురగవేగము మెఱయన్ = గుఱ్ఱము వేగము మెగయునట్లు; వేన్=వేగముగా; సురరిపున్=రాక్షసుని; తాకెన్=ఎదిరించెను.

తా: స్వారోచి ఆస్త్రీనొక పొదరింటిలో కూర్చుండబెట్టి గుర్రముపై నాతని నెదిరించెను.

వ. ఇట్లు తలపడి యమ్మనుజదనుజులు బీరంబులు నోరంబులుగాఁ బోరుతఱిభీకరమణుండు గ్రుద్ధుండై సమిద్ధరణ బద్ధపరంపర యగు నంపఱం పెంపఱం జంపరాదు నిలింపారాతి నని వితర్కించి కించిత్తును గొంచక కాంచనద్రవకంచుకితంబును దరణి ఖరకిరణ కాండచండంబును నయి యాఖండలదోర్దండ సముజ్జృంభిత వజ్రాయుధచకచకం బకబక నవ్వ వజ్రభేదియలుంగు వెలుంగ మత్తారులకు నుత్తలం బిడు నత్తలంబును బద్మరాగమణిచూడం బగు కేడెంబునుంగొని వేడెంబునందురంగంబుఁ బఱపి తెఱపిగని తఱటుచేసియొరసి చనుఱెకించికఱకుటరిబరిపఱియవడంబొడిచికడచి నిలచినం బెలుచనం బరిగోలపోటున నాటోపించు మత్తకరివృత్తి నెత్తురొలుక నక్తంచరుం డుగ్రంచితగతి సవ్యదిశ కొత్తితఱుమ నపసవ్యగతిన్ జాళెంబుస హాయంబుఁ బోనిచ్చుచు నచ్చరకొడుకు దిరిగి తిరిగి సింగిణి నేయుచుఁ జుట్టుకొని రా మనుజాశియు నట్లట్ల వెనుక వెనుక కడు గిడుచు నడ్డంబుగా నడవికడ కొత్తికొనినడచి యొడుదొడు కగుడు బెడిదంపునడక నదరి కడకాళ్ళ కొడియంజిక్కి రక్కసునకుం దుక్ఖారంబను నాలోన నడిదంబునం బుడిమిపతి వెడ విసరు విసరి యసురవరు కరాంగుళంబులు దెగ నడిచె. నడచిన సుడివడక మడమలం దాటించిన ఘోటకంబు వెగ్గలంబుగ మ్రొగ్గియు నగ్గలిక చెడక మోకరించుకొని కొన్నియడుగులు చని సేకరించుకొని కంచుమించుగం బఱచుట గగన చరుల వెఱఁగుపఱిచె, నట్లు పరచినం గందంబుఁ జఱచి మొగంబు మడిచి ప్రస్తుతులఁ గుస్తరించి యతిరభసస్ఫూర్తాక్కార ఘోరారవంబుతో ఘోణారంధ్రనిశ్వాసగంధ వాహప్రవాహంబు వెడలువాహంబు దగ మట్టువడ నిట్టట్టు మట్టించుచునాస్వారోచి నిశాచరు నుద్యోగంబు చూచికొనవలసి నిలచి యంతన నతం డొక్క తరువుఁ గరయుగళినిఱియంబట్టి పెల్లగింప మల్లాడు నాలోనన గల్లునం గింకిణులు మొరయ మెఱుంగు మెఱసినగతి మరల హారిం బఱపి యొకటి రెండు మూఁడు గొరకల నెఱఁకులు గాఁడ గుబ్బకొలందికిం దిగవైచి మ్రాను విడిపించి యెలయించుకొని బయలు వెడలించి

నోపాచరుండు పాషాణమ్ముల కెపు డెపుడు వంగ నవ్వ నవ్వ డెల్లం
దురంగంబు నంటం దోలి గంటి యిడి వెంటంబడుటయు గెంటించి
పేమబంతి యన్నయట్లల్లంత నుండి వాగె సడలించి పగతునిపై నిగిడి
నాఁగెఁ గుదియింప ముంగాళ్ళ గగనంబున రా మగిడించి యందె
చప్పుడుం గింకిణీరవంబును నురుమ గీసినగతిం దేఁటి మోసినక్రియ
నాదాఱక యే దిక్కు జూచిన నాదిక్కునసే వినంబడ నెక్కడఁ
జూచినం దానయై నీడ యేర్పడక పార్శ్వంబులం గట్టు కెంబట్టు లాల
సరి సమకట్టు టెక్కెలుగా యాతుధానుం డనుకొండచిలువ నోడియ
నేల పఱుపుగా నాడు గరుడుండనం బాయుచు డాయుచు దవ్వులం
బొలసి కుఱంగటం దోఁచి కుఱంగట ననిచూడ దవ్వులం బొలసి దవ్వు
చేరువ లనిర్ధార్యంబుగా నొలంగం దేజికాశ్వంబు మెలంపుచు విం
నుం బంట్రికోలల నడిదంబున నత్తలంబున నేసియు వ్రేసియు నడఁచి
యుంబొడచియు గడపలం గానక మిడిసి మృతుంగనుంగాని దాన
వునిం జూచి వేసరి రోసంబున. 115

టీ: ఇట్లు; తలపడి=కలియబడి; ఆ+మనుజదనుజులు=ఆ రాజు, రాక్షసు డును; బీరంబులు=గొప్పలు; తోరంబులుగాన్=ఎక్కువకాగా; పోరుతఱిన్=యుద్ధముచేయునపుడు; భూరమణుండు=రాజు; క్రుద్ధుండై = కోపించినవాడై; సమిత్+ధరణిన్=యుద్ధభూమిలో; బద్ధపరంపరయగు+అంపఱన్=కట్టబడిన పంక్తి కల బాణములచే; నిలింప+అరాతిన్=రాక్షసుని; పెంపఱన్=చురుకుతనము తగ్గ నట్లు; చంపరాదు+అని = చంపుటకు వీలుపడదని; వితర్కించి = ఆలోచించి; కించిత్తు=కొద్దిగానైనను; కొంచక=సంకోచించక; కాంచనద్రవ =బంగారుద్రవ ముచే; కంచుకితంబును=పూయబడినదియు; తరణి=సూర్యునియొక్క; ఖర=తీవ్ర మైన; కిరణకాండ=కిరణములవలె; చండంబునై=తీక్ష్ణమైనదియునై; ఆఖండల= ఇంద్రునియొక్క; దోర్దండ=చేతియందు; సముజ్జృంభిత=వెలుగుచున్న; వజ్రా యుధచకచకన్ = వజ్రమను నాయుధముయొక్క కాంతిని; పకపకనవ్వు=పరిహ సించు—మించిన; వజ్రభేదియలుంగు=వజ్రమును భేదించు మొనగలబాణము; వెలుం గన్=ప్రకాశింపగా, మత్త+అహితులకున్=మదించిన శత్రువులకు; ఉత్తలంబునిడు =విచారమునిచ్చెడి; అత్తలంబును=ఈటెను; పద్మరాగమణిమాడంబగు=కెంపులు చెక్కిన పైభాగముకల; కేడెంబును=డాలును; కొని=చేతబట్టి; వేడెంబునన్= పరుగుతో; తురంగంబున్=గుర్రమును; పఱపి=పరుగెత్తించి; తెఱపి=అవకాశము; కని=చూచుకొని; తరటుచేసి=కొరడాతో కొట్టి; ఒరసిచనన్ = రాచుకొనిపోవు నట్లు; ఉఱికించి=దూకించి; కఱకు+అరిబరి=కఠినమైన శత్రువుయొక్క పార్శ్వ మును; పఱియావడునట్లు=చీలునట్లు; పొడిచి=ఈటెతో పొడిచి; కడచి=అవ్వలికి

గాక; నిలిచినన్ = నిలబడగా; వెలుచనన్ = కోపముతో; బరిగోలపోటునన్ = ప్రక్కలో పొడుచుచునే పోటుతో; ఆటోపించు = విజృంభించు; మత్తకరివృత్తిన్ = మదపుటేనుగువలె; నెత్తురు+ఒలుకన్ = రక్తము కారుచుండగా; నక్తంచరుండు = రాక్షసుడు; ఉదంచితగతిన్ = ఒకసరీతిగా; సవ్యదిక్కున్ = ఎడమవైపునను; ఒత్తితలుమన్ = గెంటిపరుగెత్తించగా; అపసవ్యగతిన్ = కుడివైపు నడకతో; జాగెంబునన్ = ప్రక్కవాటు నడకతో; హయంబున్ = గుఱ్ఱమును; పోనిమ్ముచున్ = తోలుచు; అయ్యశ్వరకోడుకు = ఆ స్వారోచి; తిరిగి తిరిగి; సింగిణిన్ = ధనుస్సుచే; ఏయుచున్ = కొట్టుచు; చుట్టుకొనిరాన్ = చుట్టుతిరిగి వచ్చుచుండగా; మనుజ+అశియున్ = రాక్షసుడును; అట్లట్ల = స్వారోచి యెట్లు వెళ్ళిననట్లే; వెనుక వెనుకకున్; అడుగిడుచున్ = వెళ్ళుచు; అడ్డంబుగాన్ = రాజునకడ్డుగా; అడవికడకున్ = అడవి చివరకు; ఒత్తుకొని నడచి = త్రోసికొనిపోయి; ఒకునొకరు = ఇరువురు; అగుడున్ = కాగా; పేరిదంపునడకన్ = చురుకైన నడకతో; అదరి = ఉత్సాహపడి; కడకాళ్లకున్ = కాళ్ళచివళ్ళకు; ఒడియన్ = పైకెగురగా; తుఖారంబు = గుఱ్ఱము; రక్కసునికిన్ = రాక్షసునికి; చిక్కెననులోనన్ = దొరికినదా అనుకొనునంతలో; పుడమిపతి = రాజు; పెడవిసరు = ప్రక్కగా విసరుటను; విసరి = ఈటెనువిసరి; అసురవరుకర+అంగుళంబులు = రాక్షసుని చేతివ్రేళ్ళను; తెగన్ = తెగునట్లు; అడిచెన్ = కొట్టెను; అడిచినన్; సుడివడక = బెదరక; మడుమలన్ = మడమలతో; తాటించినన్ = తన్నగా; ఘోటకంబు = గుఱ్ఱము; వెగ్గలంబుగన్ = మిక్కిలి; మ్రొగ్గియున్ = ముందునకువంగియు, అగ్గలిక = ఉత్సాహము; చెడక; మోకరించుకొని = మోకాళ్ళనునిలిచి; కొన్నియడుగులుచని = కొన్ని అడుగుల దూరము వెళ్ళి; సేకరించుకొని = తెప్పరిల్లి; కంచుమించుగన్ = కంటికి కనపడనట్లు; పఱచుట = పరుగెత్తుట; గగనచరులన్ = దేవతలను; వెఱగుపఱిచెన్ = ఆశ్చర్యపడునట్లు చేసెను; అట్లుపఱచినన్ = అట్లుపరుగెత్తగా; కందంబుంజఱచి = మూపుతట్టి; మొగంబుతుడిచి = ముఖము తుడిచి; ప్రస్తుతులన్ = పొగడెడి మాటలతో; ఉస్తరించి = లాలించి; అతిరభసఘూత్కార = వేగముగావచ్చు 'ఘూ' అను చప్పుడుతో; ఘోర = భయంకరమైన; ఆరావంబుతోన్ = ధ్వనితో; ఘోణారంధ్ర = ముక్కురంధ్రమునుండి (వచ్చు,) నిశ్వాసవాత = ఊపిరిగాలి యొక్క; ప్రవాహంబు = వరుస; వెడలువాహంబున్ = వెడలునట్టి గుఱ్ఱమును—అనగా రోజుచు—రొప్పుచున్న గుఱ్ఱమును; దగ = అలసట; మిట్టుపడన్ = తగ్గునట్లు; ఇట్టట్టు మట్టించుచున్ = ఇటునటు త్రిప్పుచు; ఆ స్వారోచి; నిశాచరు+ఉద్యోగంబున్ = రాక్షసుని ప్రయత్నమును; చూచికొనవలసి = తెలిసికొనవలసియుండి; నిలిచి; అంతన = అంతలోనే; అతండు = రాక్షసుడు; ఒక్కతరువున్ = ఒకచెట్టును; కరయుగళిన్ = రెండుచేతులతోను; ఇఱియంబట్టి = గట్టిగాపట్టుకొని; పెల్లగింపన్ = పెకలించుటకై; మల్లాడులోనన్ = ప్రయత్నించునంతలో; గల్లనన్ = గల్లుమని; కింకిణులు = చిరుగంటలు; మొరయన్ = మ్రోగగా; మెఱుంగు మెఱసిన గతిన్ = మెరుపుమెరసినట్లు; మరలన్; హరిన్ = గుఱ్ఱమును; సరపి = తోలి; ఒకటి, రెండు, మూడు; గొరకలన్ = బాణములతో; నెఱికులు = మర్మస్థానములు; కాడన్ = నాటునట్లు; గుబ్బకొలందికిన్ = గుబ్బలవరకు; దిగ

వైచి=దిగునట్లు వేసి; ప్రాను=పట్టిన చెట్టును; విడిపించి; ఎలయించుకొని=తన్ను తఱుమునట్లు చేసి; బయలు వెడలించి; దోషాచరుండు = రాత్రితిరుగువాఁడు—రాక్షసుఁడు; పాషాణమ్ములకున్=రాళ్ళకై; ఎపుడెపుడు; వంగెన్=వంగెనో; అపుడపుడెల్లన్; తురంగంబున్=గుఱ్ఱమును; అంటందోలి = దగ్గరగాతోలి; గంటియిడి=గాయముకల్గజేసి; వెంటంబడుటయున్=వెంటపడఁగా; గెంటించి = గుఱ్ఱమునుతోలి; లేదుబంతియన్నట్లు=నీకికదొరకదన్నట్లు; అల్లంతనుండి=కొద్దిదూరమునుండి; వాగెసడలించి=కళ్ళెమును వదలి; పగతుపైన్ = శత్రువుమీఁద; నిగిడి=కవిసి; వాగెన్=కళ్ళెమును; కుదియింపన్=బిగపట్టఁగా; ముంగాళ్లు=ముందరికాళ్లు; గగనంబునన్=ఆకాశముపైకి; రాన్=వచ్చునట్లు; మగిడించి=మరలించి; అంగెచప్పుడున్=గుఱ్ఱముకాళ్ళకు కట్టిన అందెలచప్పుడును; కింకిణీరవంబును=మువ్వల చప్పుడును; ఉరుమగిసినగతిన్ = ఉరుమయను వాద్యము వాయించినట్లు; తేఁటి=తుమ్మెద; మ్రోసినక్రియన్ = మ్రోగినట్లు; నాగు=నాదము; ఆఁక=ఆగక; ఏదిక్కుఁ జూచినన్=ఎక్కడ చూచినను; ఆ దిక్కునన్=అక్కడనే; వినంబడన్=వినపడఁగా; ఎక్కడఁజూచినన్; తానయై=తానేయుండి; నీడయేర్పడక=నీడయెక్కడనున్నదో తెలియనియ్యక; పార్శ్వంబులన్=ప్రక్కలందు; కట్టుకెంబట్టుజాలసరి=కట్టియెఱ్ఱపట్టు జాలరులు; సమకట్టు రెక్కలుగాఁ=జోడించిన రెక్కలువలెనుండి; యాతుధానుండనుకొండచిలువన్=రాక్షసుడనెడి కొండపామును; ఒడియన్=పట్టుటకు; నేలపఱపుగాన్=నేలమీదికి రెక్కలువాపుకొని; ఆడుగరుడండవన్=ఎగిరెడి గరుత్మంతుఁడోయనునట్లు; పాయుచున్=తప్పుకొనుచు; డాయుచున్=దగ్గరగావచ్చుచు; దవ్వులన్=దూరమునందు; పొలసి=మెలసి; కుఱంగటన్=దగ్గర; తోఁచి=కనబడి; కుఱంగటన్+అని = దగ్గరనేఅని; చూడన్=చూచునపుడు; దవ్వులన్=దూరమునందు; పొలసి; దవ్వుచేరువలు = దూరముచేరువలు; అనిర్ధార్యంబులు కాన్=నిశ్చయింప వీలులేనివై; మెలఁగన్; తేజికాశ్వంబున్=మేలుజాతిదైన తన గుఱ్ఱమును; మెలంపుచున్=త్రిప్పుచు; వింటన్=ధనుస్సుచే; పంత్రుకోలలన్=మాదిగసూఁదులవంటి బాణములతో; అడిదంబుననన్=కత్తితోను; అత్తలంబునన్=ఈటెచేతను; ఏసియుఁ=కొట్టియు; వ్రేసియు = విసరియు; అడచియున్=నఱకియు; పొడిచియున్; కడపలన్ = చివరను; కానక = చూడలేక; చిడిసి=మిట్టిపడి; మృతుండును కాని దానవునిన్ = దానవుని రాక్షసుని; చూచి; వేసరి=విసిగి; కోసంబునన్=కోపముతో...

క. భూపతి పావకబాణం
బేపున సంధించి తివిచి ♦ యేసిన మెయిఁ గీ
లాపటలి పొదువ నతఁ డా
రూపం బెడఁబాసి ఖేచ ♦ రులు వెఱఁ గందన్. 116

టీ: భూపతి=స్వరోచి; పావకబాణంబు=ఆగ్నేయాస్త్రమును; ఏపునన్=ఉత్సాహముతో; సంధించి; తివిచి = లాగి; ఏసినన్ = ప్రయోగించగా; మెయిన్=రాక్షసుని శరీరమును; కీలాపటలి=మంటల సముదాయము; పొదువన్=

క్రమ్మగా; అతడు = రాక్షసుడు; ఆ రూపంబు = రాక్షసరూపమును; ఎడబాసి = విడిచి; ఖేచరులు = దేవతలు; వెఱఁగందన్ = ఆశ్చర్యపడగా...

తా: రాజు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించగా రాక్షస శరీరము మంటలోబడి మాడగా ఆ రాక్షసుడు రాక్షసరూపమును వదలి దేవతలాశ్చర్యపడగా...

—: లయవిభాతి :—

ధగధగని దేహరుచి ♦ నిగనిగనికుందనపుఁ
దగడుఁ దెగడం జిగురు ♦ జిగి నెగుచుమోవిన్
నగవు నిగుడం గురులు ♦ పొగరు మగుడన్ నయన
యుగళి వెలిదామరల ♦ మగల మగలై డా
లెగయ మృగనాభి భుగ ♦ భుగ లెసఁగఁ జామరలు
మగువ లిడ మౌళిమణి మిగులఁగ వెలుంగన్
తెగలుగల హారముల ♦ జిగి చెలఁగఁగాఁ గొదమ
మొగులఁ దగుయానమున ♦ గగనచరుఁ డయ్యెన్.

టీ: ధగధగనిదేహరుచి = ధగధగమని వెలిగెడి దేహకాంతి; నిగనిగని కుంద నపుఁదగడున్ = నిగనిగలాడెడి బంగారురేకును; తెగడన్ = తిరస్కరింపగా; చిగురు జిగిన్ = చిగురుకాంతిని; ఎగుచుమోవిన్ = మించిన పెదవిని; నగవు = నవ్వు; నిగుడన్ = వ్యాపించగా; కురులపొగరు = తలవెంట్రుకలకాంతి; మగుడన్ = నయన యుగళి = రెండుకన్నులు; వెలిదామరల = తెల్లతామరపువ్వుల యొక్క; మగల మగలై = రాజులకు రాజులై; డాలు+ఎగయన్ = కాంతి హెచ్చగ; మృగనాభి భుగభుగలు = కస్తూరి సువాసనలు; ఎసగన్ = ఎక్కువకాగా; చామరలు = వింజామర ములను; మగువలు = పరిచారికలు; ఇడన్ = వేయగా; మౌళిమణి = కిరీటములోని మణులు; మిగులగన్ = మిక్కిలి; వెలుంగగన్ = ప్రకాశింపగా, తెగలుకల = తారతమ్యముకల్గిన; హారములజిగి = కంఠహారములకాంతి; చెలగగాన్ = అతిశయింపగా; కొదమమొగులన్ = చిన్నమబ్బులందు; తగుయానమునన్ = తగిన వాహనముపై; గగన చరుడు = గంధర్వుడు; అయ్యెన్ = అయెను.

తా: నిగనిగలాడు బంగారురేకువంటి శరీరము; నవ్వుమొగము, చిగురువంటి పెదవి, మెత్తిని పొడవైన జుట్టు, తెల్లతామర మించిన కన్నులు కలిగి కస్తూరి పరిమళము గుబాళించగా, పరిచారికలు వింజామరలు వీచుచుండ విమానముపై గంధర్వుడయ్యెను. అలం. ఉపమ, ఉదాత్తమును.

'న, స, న, న, స, న, న, స, న, న, స గ' గణములు, 10, 19, 25, అక్షరములయతియై చెల్లునది లయవిభాతి.

క. నవనవసౌరభముల నె
క్కువకువలయవర్ష మప్పుడు ♦ గురిసెన్ మొరసెన్
రవరవ మురజరవంబులు
దివి దివిషజ్జలజముఖులు ♦ తెలిసి నటింపన్. 118

టీ: అపుడు; దివిన్=ఆకాశమున; నవనవసౌరభములన్=క్రొంగ్రొత్తపరిమళములతో; ఎక్కువకువలయ వర్షము=ఎంతో కలువలవాన; కురిసెన్; దివిషత్+జలజముఖులు=దేవతాస్త్రీలు; తెలిసి=రాక్షసుడు గంధర్వుడగుట తెలియగానే; నటింపన్=నాట్యము చేయగా; రవరవమురజరవంబులు=రవరవమను మద్దెలచప్పుళ్లు; మొరసెన్=మ్రోగెను.

తా: రాక్షసుడు గంధర్వుడు కాగానే పుష్పవృష్టి కురిసెను. దేవతాస్త్రీలు నటించిరి. దేవదుందుభులు మ్రోగినవి.

వ. అనిన విని తరువాతి వృత్తాంతంబు వినుటకుం దివుటమై మదీయమానసంబు కౌతుకాధీనం బయ్యెడు వినిపింపుఁ డని యడుగుటయును. 119

టీ: అనినన్, విని=జైమినివిని; తరువాతి వృత్తాంతంబు=తర్వాతికథ; తివుటమైన్=పూనికతో; వినుటకున్; మదీయమానసంబు=నామనస్సు; కౌతుకాధీనంబు=వేడుకకలది; అయ్యెడున్=అయినది; వినిపింపుడు; అనియడుగుటయున్=అనియడుగగా...పంచమాశ్వాసములోని 'నీడోద్భవంబు లిట్లనియె' అనుదానితో నన్వయము.

శా. శ్లాఘాలంఘనజాంఘికోజ్జ్వలగుణా ♦ లంకారఘీంకారహే
షాఘోషోద్భటధాటికాగజఘటా ♦ శ్వక్షుణ్ణవిశ్వంభరా
మోఘీభూతభుజంగభోగభర సం ♦ ఫుల్లాబ్జపత్రేక్షణా
ద్రాఘీయఃప్రతిభావిచక్షణ త్రయీ ♦ ధర్మైకసంరక్షణా! 120

టీ: శ్లాఘా=పొగడ్తను; లంఘన=అతిక్రమించుటలో; జాంఘిక=పిక్కబలముకలవై; ఉజ్జ్వల=ప్రకాశించు; గుణ+అలంకార=గుణములే అలంకారముగా గలవాడా! ఘీంకార=ఏనుగుల కూతలును; హేషా=గుఱ్ఱపు సకిలింపుల; ఘోష+ఉద్భట=చప్పుడుతో నెక్కువైన; ధాటికా=జైత్రయాత్రయందలి; గజఘటా=ఏనుగుల మందలు; అశ్వ=గుఱ్ఱముల చేతను; క్షుణ్ణ=నలగద్రొక్కబడిన; విశ్వంభరా=భూమిచే; మోఘీభూత=వ్యర్థమైచేయబడిన; భుజంగ=శేషాహియొక్క; భోగభర=పడగల బరువు కలవాడా! సంఫుల్ల=బాగుగా వికసించిన; అబ్జపత్ర+ఈక్షణా=తామర రేకులవంటి కన్నులు కలవాడా! ద్రాఘీయః=ఎక్కువైన; ప్రతిభా విచక్షణ=బుద్ధిచే నేర్పరియైనవాడా! త్రయీధర్మ=వేదత్రయమున చెప్పబడిన ధర్మమునకు; ఏకసంరక్షణా=ఒక్కడవే రక్షకుడవైనవాడా!

తా: పొగడ శక్యముకాని గుణములు కలవాడా! జైత్రయాత్రలో వెళ్లెడి ఏనుగుల, గుర్రముల త్రొక్కుడిచే బరువుతగ్గిన ఆదిశేషుని పడగలపైని ధారము కల వాడా! వికసించిన తామరరేకులవంటి కన్నులు కలవాడా! ప్రతిభ కలవాడా! వేదధర్మరక్షకా!

క. బహువీరహననమిళిదఘ
వహనభ్రమకృత్కళంక ♦ వర్గోగ్రాసి
గ్రహీతభుజయుగళ గజప
త్యహిహరణతార్క్ష్య సజ్జ ♦ నావనదక్షా. 121

టీ: బహు...యుగళ—బహువీర=ఎక్కువ వీరులను; హనన=చంపుటచే; మిళిత్=కల్గిన; అఘవహన=పాపమును వహించునట్లు; భ్రమకృత్=భ్రాంతిని కల్గ చేయు; కళంకవర్గ=నల్లని రంగుకల; ఉగ్ర+అసి=క్రూరమైన కత్తిని; గ్రహీత=గ్రహించిన; భుజయుగళ=రెండు చేతులు కలవాడా! గజపతి+అహి = గజపతు లను పాములను; హరణ=హరించుటలో; తార్క్ష్య=గరుత్మంతుడైనవాడా! సజ్జన +అవనదక్షా=సజ్జనులను రక్షించుటలో నేర్పుకలవాడా!

తా: ఎక్కువ వీరులను చంపిన క్రూరమైన కత్తి కలవాడు, గజపతిని పట్టిన వాడు, సజ్జనులను రక్షించువాడు.

స్రగ్ధర—సుధీమధురవాక్సుధా ♦ సుముఖ! నాగమాంబాసుతా!
మధుప్రసవసాయక ♦ స్మయవిరామరమ్యాకృతీ!
దధీచవిధుకామధు ♦ గ్ధనదదుగ్ధసింధుప్రథా
వధీరణపరాయణో ♦ జ్జ్వలవదాన్యతాలంకృతా! 122

టీ: సుధీ=పండితులకు; మధుర=తియ్యనైన; వాక్+సుధా=మాటలను అమృతమునకు; సుముఖ=ప్రసన్నుడైనవాడా! నాగమాంబాసుతా = నాగమ్మ యను నామెయొక్క పుత్రుడా! మధు=వసంతుని యొక్క; ప్రసవసాయక= మన్మథునియొక్క; స్మయ=గర్వమునకు; విరామ=తగ్గించు; రమ్య+ఆకృతీ=సుందర మైన శరీరము కలవాడా! దధీచ = దధీచియొక్క; విధు = చంద్రునియొక్క; కామధుక్=కామధేనువుయొక్క; ధనద=కుబేరునియొక్క; దుగ్ధసింధు=పాల సముద్రముయొక్క; ప్రథా=ప్రసిద్ధిని (దానములో); అవధీరణ = తిరస్కరించు టలో; పరాయణ=ఆసక్తికల; ఉజ్జ్వల=గొప్పదైన; వదాన్యతా+అలంకృతా= దాతృత్వముచే నలంకరింపబడినవాడా!

తా: పండిత హృదయంగమమైన మాటలు పల్కువాడు, వసంతుని, కంతుని మించిన యందము కలవాడు, దధీచ్యాదుల మించిన దాతృత్వము కలవాడు శ్రీకృష్ణదేవరాయలు.

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస
శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితా మతల్లి
కాల్లసాని-చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధమునందు

చతుర్థాశ్వాసము

సంపూర్ణము.



శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

(టీకాతాత్పర్యసహితము)

## పంచమాశ్వాసము



నందనసౌందర్యసు
ధీనందన వితరణావ ♦ ధీరితబలిరా
డ్భానుజ పరరాజ్యస్వ
ర్భానుభుజాహీంద్ర కృష్ణ రాయనరేంద్రా! 1

టీ: శ్రీనందన సౌందర్య=లక్ష్మీదేవి కొడుకైన మన్మథునివంటి యందము కలవాడా! సుధీనందన=పండితుల నానందపెట్టువాడా! వితరణ=దానముచే; అవధీరిత=తిరస్కరింపబడిన; బలిరాట్=బలిచక్రవర్తియు; భానుజ = కర్ణుడును కలవాడా! పరరాజ=శత్రువులను చంద్రునికి; స్వర్భాను = రాహువైన; భుజ+అహీంద్ర=భుజములను పాములు కలవాడా! కృష్ణరాయ నరేంద్రా=శ్రీకృష్ణదేవరాయా.

తా: మన్మథునివంటి అందము, బలిచక్రవర్తిని, కర్ణుని మించిన దాతృత్వమును కలిగి శత్రువిజయముచేయు భుజములుకల కృష్ణదేవరాయా! అలం. రూపకనిదర్శనాతిశయోక్తులు.

వ. అవధరింపుము. జైమినిమునీంద్రచూడారత్నంబునకు నీడోద్భవంబు లిట్లనియె. 2

టీ: అవధరింపుము=చిత్తగింపుము; జైమిని మునీంద్ర చూడారత్నంబునకున్=జైమినియను మహర్షి శ్రేష్ఠునకు; నీడ+ఉద్భవంబులు=ధర్మపక్షులు; ఇట్లు+అనియెన్.

తే. అపుడు గంధర్వపతి మహి ♦ కవతరించి
రాజు విస్మయమున హయ ♦ రాజు డిగ్గ
నక్కు సేర్చి ముదంబుతో ♦ ననియె దంత
కిరణములు హారకాంతులు ♦ సరస మాడ. 3

ప్రతి: అపుడు; గంధర్వపతి=ఆ గంధర్వరాజు; మహికిన్ = భూమిమీదికి; అవతరించి=(విమానమునుండి) దిగి; రాజు=స్వరోచి; విస్మయమునన్ = ఆశ్చర్యముతో; హయరాజున్=గుఱ్ఱమును; డిగ్గన్=దిగగా; అక్కు+చేర్చి=రొమ్మునకు చేర్చుకొని—కౌగిలించుకొని; ముదంబుతోన్=సంతోషముతో; దంతకిరణములు=పలుకాంతులు; హారకాంతులు=ముత్యాల హారముల కాంతులును; సరసమాడన్=కలసికొనగా; అనియెన్=పల్కెను.

తా: అప్పుడు రాక్షసుడు గంధర్వుడుగా మారుటచూచి ఆశ్చర్యపడుచున్న స్వరోచిని గంధర్వరాజు విమానముపై నుండి నేలకుదిగి, రాజును కౌగిలించుకొని యిట్లనెను.

సీ. భద్రమా నీకు నీ ♦ బాహాభృతక్షితిఁ
బ్రజలకు లెస్స లా ♦ రాచవారు
ధన్యుండ నైతి నీ ♦ దర్శనంబునఁ జేసి
నాదుష్కృతము లెల్ల ♦ నాశ మొందెఁ
ఈజగత్త్రయి నన్ను ♦ నిందీవరాక్షాఖ్యఁ
గీర్తించు నప్సరో ♦ గీతసరణి
గాఁగాఁపుమీతల్లి ♦ కడవాఁడ గాని నే
గణుతింపఁ గడవాఁడఁ ♦ గాఁ జుమయ్య

గీ. పెండ్లికొడుకవు మాకు నీ ♦ బిసరుహాక్షి
మూర్తినందన యొక్కమాని ♦ ఘోరశాప
వికృతి మానిసిదిండినై ♦ యకట దీని
ప్రాణముల కల్గఁ దలఁచితిఁ ♦ బాపబుద్ధి. 4

ప్రతి: నీకున్; నీబాహాభృతక్షితిన్ = నీ భుజములచే రక్షింపబడిన రాజ్యమునందలి; ప్రజకున్=ప్రజలకు; భద్రమా=కుశలమా? రాచవారు=నీబంధువులైన రాజులు; లెస్సలా = క్షేమమేనా? నీదర్శనంబునన్+చేసి = నిన్ను చూచుటచే; ధన్యుండనైతిన్ = అదృష్టవంతుడనైతిని; నా దుష్కృతములు = నా పాపములు; ఎల్లన్=అన్నియును; నాశమొందెన్=నశించినవి; ఈ జగత్+త్రయిన్=ఈమూడు లోకములును; నన్నున్; ఇందీవరాక్షాఖ్యన్=ఇందీవరాక్షుడను పేరుతో; అప్సరోగీత

పరణిన్ = అప్సరసల పాటలవరుసలో; కీర్తించున్ = పిల్చును; గారాపు = ముద్దయిన; మీతల్లికడవాడన్ = మీతల్లివైపువాడను; కాని; నేఁ; గణుతింపన్ = లెక్కచూడగా; కడవాడన్ + కాన్చుమయ్యా = పైవాడనుకానుసుమా! మూడన్; పెండ్లికొడుకవు = అల్లుడవు; ఈ విపులపాక్షి = ఈమె; కూర్మినందన = నా కూతురు; ఒకమౌని ఘోరశాప వికృతిన్ = ఒకమహర్షి యొక్క శాపఫలితముగా; మానిసి దిండినై = మనుష్యులను తినెడి రాక్షసుడనై; పాపబుద్ధిన్ = చెడుబుద్ధితో; దీని ప్రాణములకున్ = నా కూతురి ప్రాణములపై; అల్గదలచితిన్ = కోపించదలచితిని—తినబోతిని; అకట = అయ్యో!

తా: నీకు నీదేశప్రజలకును క్షేమమా! నిన్ను చూచుటతో నాపాపములు నశించినవి. ధన్యుడనైతిని. నా పేరు ఇందీవరాక్షుడు. నేను నీతల్లివైపు బంధువనుకాని పైవాడను కాను. నీవు మాకు మేనల్లుడవు ఈమె నా కూతురే. మహర్షి శాపమున రాక్షసుడనై చెడుబుద్ధితో ఈమెను చంపదలచితి. అయ్యో!

క. అనునెడ వచ్చి మనోరమ
జనకుని పాదముల కెరఁగ ♦ సస్నేహమతిం
గనుఁగవ నీ రొలుకఁగ నం
దనమూర్ధాఘ్రాణ మతఁడు ♦ దయఁ గావించెన్. ౫

టీ: అనునెడన్ = అనుచుండగా; మనోరమ; వచ్చి = దగ్గరగావచ్చి; జనకుని పాదములకున్ = తండ్రి పాదములకున్; ఎరఁగన్ = నమస్కరింపగా; సస్నేహమతిన్ = ప్రేమతోకూడిన బుద్ధితో; కనుఁగవన్ = రెండు కన్నుల యందును; నీరు; ఒలుకగన్ = కారగా; అతడు = ఇందీవరాక్షుడు; దయన్ = దయతో; నందనమూర్ధాఘ్రాణము = కూతురి తలను మూర్కొనుటను; కావించెన్ = చేసెను.

తా: అంతలో మనోరమవచ్చి తండ్రి పాదములకు నమస్కరింపగా అతడు కన్నుల నీరు నింపుకొని సంతోషముతో కూతురి తలను మూర్కొనెను.

ఆ. అప్పుడు విస్మితాత్ముఁ ♦ డై వరూధినిసుతుఁ
డేమికారణమున ♦ నేతపస్వి
యిట్టిశాప మిచ్చె ♦ నెఱిఁగింపు విన వేడు
కయ్యె ననఘ యనిన ♦ నాతఁ డనియె. ౬

టీ: అప్పుడు; వరూధిని సుతుడు = స్వారోచి; విస్మిత+ఆత్ముఁడై = ఆశ్చర్యముగల మనస్సు కలవాడై; అనఘ = పాపములేనివాడా; ఏమికారణమునన్ = ఏకారణముచే; ఏముని; ఇట్టిశాపము = రాక్షసుడగు నంతటి శాపమును; ఇచ్చెన్. ఎఱిఁగింపు; విన వేడుక = వినుటకు కోరిక; అయ్యెన్; అనినన్; అతడు = గంధర్వుడు, అనియెన్.

తా: అదిచూచి ఆశ్చర్యముతో స్వరోచి 'అయ్యా! నీ వేల యింతటి శాపమును పొందితివి? వినగోరికగా నున్నది. చెప్పుము' అనగా ఇందీవరాక్షు డిట్లనెను.

మ. కలఁ డుల్లోకయశఃపురంధ్రి జగతిన్ ♦ గంధర్వవంశంబునన్
నలనాభాహ్వయుఁ డేఁ దదీయతనయుం♦డన్ బ్రహ్మమిత్రుండు శి
ష్యులకుం గంటను వత్తిఁ బెట్టుకొని యా♦యుర్వేద మోరంత ప్రొ
ద్దులఁ జెప్ప న్వినుచుండి మానసమునం ♦ దుం దజ్జిఘృక్షారతిన్. 7

టీ: జగతిన్=లోకములో; ఉల్లోక=లోకముల మించిన; యశఃపురంధ్రి=కీర్తికాంత కలవాడు; గంధర్వవంశంబునన్ = గంధర్వజాతిలో; నలనాభాహ్వయుడు=నలనాభుడను పేరు కలవాడు; కలడు; ఏన్=నేను; తదీయతనయుండన్=అతని సంబంధమైన కొడుకును; బ్రహ్మమిత్రుడు=ఒకముని; శిష్యులకున్=తన విద్యార్థులకు; కంటన్+వత్తిపెట్టుకొని=అతిశ్రద్ధగా; ఓరంతప్రొద్దులన్=ఎల్లప్పుడును; ఆయుర్వేదము=వైద్యశాస్త్రమును; చెప్పన్ = చెప్పగా; వినుచున్+ఉండి=జనులవంకవిని; మానసమునందున్=మనస్సులో; తత్+జిఘృక్షారతిన్=దానిని గ్రహించు కోర్కెతో...

తా: గొప్పకీర్తికల గంధర్వకులములోని నలనాభుని కుమారుడను. ఒకప్పుడు బ్రహ్మమిత్రుడను ముని శిష్యులకెంతో శ్రద్ధగా రేయింబవళ్ళు ఆయుర్వేదము చెప్పుచున్నట్లు విని, దానిని నేర్చెడి కోరికతో...

గీ. మౌనివరుఁ జేరి భక్తి న ♦ మస్కరించి
చెప్పవే నాకు నీవిద్య ♦ శిష్యకోటి
తోడఁ గూడంగ నేఁ గృతా ♦ ర్థుండ నగుదు
ననుచుఁ బ్రార్థింప నన్నుఁ జూచి ♦ యపహసించి.

టీ: మౌనివరున్=మహర్షిశ్రేష్ఠుని; చేరి=దగ్గరకువెళ్ళి; భక్తిన్=భక్తితో; నమస్కరించి; ఈవిద్య=ఈవైద్యమును; శిష్యకోటితోడన్+కూడంగన్=శిష్యులతోపాటుగా; నాకున్; చెప్పవే=చెప్పుమయ్యా! నేన్; కృతార్థుండనగుదున్=ధన్యుడనయ్యెదను. అనుచున్=అని; ప్రార్థింపన్ = ప్రార్థించగా; నన్నున్+చూచి; అపహసించి=వేళాకోళముగానవ్వి...

తా: నేను మహర్షి వద్దకువెళ్ళి భక్తితో నమస్కరించి 'అయ్యా! మీశిష్యులతోపాటు నాకును ఆయుర్వేదము నేర్పు' మనగా నతడు పరిహసించి...

క. నట విట గాయక గణికా
కుటిలవచ శ్శీధురసము ♦ గ్రోలెడు చెవికిం
గటు వీశాస్త్రము వల ది
చ్చోట నినుఁ జదివింప ♦ కున్న ♦ జరుగదె మాకున్. 9

టీ: నట=నటుల యొక్క; విట=విటుల యొక్క; గాయక=పాటకుల యొక్క; గణికా=భోగపువారియొక్క; కుటిలవచః=నీచపుమాటలనెడి; సీధురసమున్=మద్యమును; క్రోలెడు చెవికిన్=త్రాగెడి—వినెడి చెవికి; ఈశాస్త్రము=వైద్యము; కటువు = హితవుకాదు; వలదు = నీకిది అక్కరలేదు; ఇచ్చటన్; నిన్నున్; చదివింపకున్నన్=చదువు చెప్పనిచో; మాకున్; జరుగదా=గోజనముగదా? అలం. రూపకము.

తా: నటుల, విటుల, గాయకుల, వేశ్యల పరిహాసాది వాక్యములను అలవాటు పడిన చెవుల కాయుర్వేదము రుచింపదు. కాక నీకు చదువు చెప్పనిచో నాకు నడవకపోదులే.

తే. అనఁగ నే నట్టివాఁడఁ గా • ననఘచరిత
యించు కించుక మీవంటి • యెఱుక గలుగు
పెద్దవారలశిక్షలఁ • బెరిగినాఁడ
నవధరింపుము శిష్యుఁగా • ననిన నతఁడు. 10

టీ: అనగన్; అనఘచరిత=మంచి నడత కలవాడా! నేను; అట్టివాడన్=పరిహాసాదులతో మత్తిల్లినవాడను; కాను; ఇంచుక + ఇంచుక = కొద్దికొద్దిగా; మీవంటి; ఎఱుకకలుగు పెద్దవారల శిక్షలన్=జ్ఞానము కల్గిన పెద్దల అనుజ్ఞపాలలో; పెరిగినాడన్; శిష్యుగాన్=శిష్యుడనుగా; అవధరింపుము=స్వీకరింపుము. అనినన్; అతడు...

తా: 'అయ్యా! నేను మీరు చెప్పినటువంటివాడను కాను; మీవంటి జ్ఞానుల శిక్షలో పెరిగినవాడను. కనుక నాశిష్యుడనుగా నన్ను పరిగ్రహింపుడు' అంటిని. అప్పుడతడు...

క. ధన రాజ్య రమామదమునఁ
గనుగానని నిన్ను శిష్యుఁ • గాఁ గైకొను టం
టెను నేరమి గలదే యనుఁ
గనలించుచుఁ బ్రేలకిఁకఁ బో • పొమ్ము మటన్నన్. 11

టీ: ధన=డబ్బుతోను; రాజ్యరమా=రాజ్యలక్ష్మితోను (కల్గిన;) మదమునన్=గర్వముతో; కనుగానని=ఒళ్ళు తెలియని; నిన్నున్; శిష్యుగాన్, కైకొనుటంటెను=పరిగ్రహించుటకంటె; నేరమి=తెలివితక్కువ; కలదే; ఇకన్; ననున్; కనలించుచు=కోపింపజేయుచు; ప్రేలక=మాట్లాడక; పొమ్మనుము=పో పొమ్ము; అటన్నన్=అనగా...

తా: 'డబ్బు రాజ్యములతో మదమెక్కి ఒళ్ళు తెలియని నిన్ను శిష్యునిగా తీసికొనుటకంటె తెలివితక్కువయుండదు. ఇక మాటపై మాట పెంచి నను కోపింపజేయక పో పొమ్ము'. అనగా...

క. అచటన్ "ద్వేష్టి గతాయు
శ్చ చికిత్సక" మను నయోక్తి ♦ చర్చను నుచ్చా
వచవచనంబులఁ గోపము
ప్రచురముగానీక మాని ♦ పతి కి ట్లంటిన్. 12

టీ: అచటన్=అతనివద్ద; గతాయుశ్చ=ఆయువుతీరినవాడు; చికిత్సకం=వైద్యుని; ద్వేష్టి=ద్వేషించును; అను నయోక్తిచర్చన్ = అనునీతివాక్యమునుతలచి; ఉచ్చావచవచనంబులన్ = తిరస్కారపు మాటలతో; కోపము = నాకోపమును; ప్రచురముకానీక=ఎక్కువకానియ్యక; మానిపతికిన్ = ఆమహర్షికి; ఇట్లంటిని. అలం. లోకోక్తి.

తా: అప్పుడు నేను 'ఆయువునిండినవాడు కాని వైద్యునితో తగవులాడడు' అను సూక్తి తలచుకొని అతని మాటలకు కల్గిన కోపమును పైకి కనపరచక ఇట్లంటిని.

తే. నీవు సదివింతు వనుచు ♦ నిన్నియును విడచి
బిచ్చ మెత్తంగ రాదుగా ♦ బేలతపసి
కడవ నాడకుఁ జాలు నీ ♦ గొడవ యేల
వెజ్జుఁ దన మేల యని మది ♦ లజ్జ వొడమి. 13

టీ: బేలతపసి=తెలివితక్కువ ముని ! నీవు చదివింతువు=నీవు నాకు చదువు చెప్పెదవు; అనుచున్; ఇన్నియున్=రాజ్యభోగములను; విడిచి; బిచ్చమెత్తంగన్=ముష్టెత్తికొనుటకు; రాదుగా=వీలుపడదుకదా ! కడవన్=హద్దుమీరి; ఆడకుము=మాట్లాడకుము; చాలున్=అన్నవిచాలు; నీ గొడవయేల=నీతో నాకేమి? వెజ్జుఁదనమేల=వైద్యమెందుకు? అని; మదిన్ = మనస్సులో; లజ్జ; పొడమి= కల్గి......

తా: "ఓ తెలివి తక్కువవాడా! నీవు చదువు చెప్పెదువుకదా అని ఇప్పుడున్న భోగములను వదలి బిచ్చమెత్తుకొనలేము కదా ! అన్నమాటలు చాలులే. నీతో నాకేమి ? హద్దుమీరి అనకు. నాకు నీవైద్య మక్కరలేదులే." అని సిగ్గువేసి...

శా. కంటే బ్రాహ్మణుఁ డెన్నికాఱు లఱచెన్ ♦ గర్వించి వీరెల్ల నా
కంటెం బాత్రులె విద్య కెట్లు నిది నే ♦ నైకొందు నంచున్మదిన్
గెంటెంపుం జల ముప్పతిల్ల గపటాం ♦ తేవాసినై శాంబరిన్
గొంటుం జందము మీఱ శిష్యులగెడం ♦ గూర్చుండి చర్చారతిన్.

టీ: బ్రాహ్మణుడు; గర్వించి=పొగరెక్కి; ఎన్నికాఱులు=ఎన్ని అనరాని మాటలు; అఱచెన్=కూసెను; కంటే = చూచితివా ? వీరెల్లన్ = ఈ చదివెడి వారందరును, విద్యకున్=చదువుటకు; నాకంటెన్; పాత్రులె = తగినవారా ? ఎట్లును=ఏదోరీతిగా; ఇది=ఈవిద్యను; నేన్; కైకొందును=నేర్తును; అంచున్

=అనుకొని; మదిన్=లోలోన; గొంటెంపుజలము = ఎక్కువ పట్టుదల; ఉప్పతిల్లన్=కల్లగా; శాంబరిన్=మాయచే; కపట+అంతేవాసియై=విద్యార్థిరూపమును ధరించి; గొంటుంజందము = దుష్టునిరీతి—మోసము; మీఱన్ = ఎక్కువకాగా; శిష్యులగాడన్=శిష్యుల ప్రక్కన; కూర్చుండి; చర్చారతిన్ = విషయ విచారణ చేయు నాసక్తితో......

తా: 'ఈ పేదపారుఁడెంత గర్వముతో నన్ను తూలనాడెను. ఎట్లయినను నేనీ విద్యను నేర్చితీరవలెను' అనుకొని శాంబరీ మాయచే శిష్యుడనుగా మారి అతనిశిష్యుల ప్రక్కన కూర్చుండి విషయచర్చ చేయుచు......

తే. కాయబాలగ్రహోర్ధ్వాంగ ♦ కములు నాల్గు
శల్యదంష్ట్రాజరావృష ♦ సంజ్ఞ నాల్గు
నైనయష్టాంగకము తావు ♦ లారఁగల్గు
వైద్య మెనిమిది నెలల స ♦ ర్వమును నేర్చి. 15

టీ: కాయ=దేహము; బాల=పసిపిల్లలు; గ్రహ=క్షుద్రదేవతలు; ఊర్ధ్వ+అంగకములు=పై అవయములు; నాల్గు=నాల్గును; శల్య=ఎముకలు; దంష్ట్ర=పల్లు; జరా=ముసలితనము; వృష=రేతస్సు; సంజ్ఞన్=పేరులతో; నాల్గునైన=నాలుగైన; అష్టాంగకముతావులు=ఎనిమిది అంగములు; ఆరన్=బాగుగా; కల్గువైద్యము = కల్గిన వైద్యశాస్త్రమును; సర్వమున్ = అంతను; ఎనిమిది నెలలన్; నేర్చి......"కాయబాల గ్రహోర్ధ్వాంగ శల్య దంష్ట్రా జరావృషాన్। అష్టావంగాని తస్యాహు శ్చికిత్సా యేషు సంశ్రితాః" అను శ్లోక ప్రకారము కాయాది చికిత్స లెనిమిది విధములై యున్నవి.

తా: కాయ, బాల, గ్రహ, ఊర్ధ్వాంగ, శల్య, దష్ట్రా, జరా, వృషచికిత్సలను అష్టాంగ వైద్యమును ఎనిమిదినెలలో పూర్తిగా నేర్చితిని.

క. ఇరుమూఁడురుచుల దోషపు
విరసత మానన్ జ్వరాది ♦ వృష్యాంతంబై
పరఁగు చికిత్సయుఁ గని శాం
బరిఁ బాసి తపస్వితోడ ♦ మదమున నంటిన్. 16

టీ: ఇరుమూడురుచుల = 2×3=6 ఆరు రుచులయొక్క; (తీపి, పులుపు, ఉప్పు, కారము, వగరు, చేదు) దోషపువిరసత=దోషమువలని రసము లేకపోవుటను; మానన్=పోవునట్లును; జ్వరాది = జ్వరము మొదలు; వృష్యాంతంబై=ఇంద్రియ చికిత్సవరకు; పరగు=ఉన్న; చికిత్సయున్ = వైద్యమును; కని = తెలిసికొని; శాంబరి=మాయను; పాసి=వదలి; తపస్వితోడన్=మునితో; మదమునన్=గర్వముగా; అంటిన్=పల్కితిని.

తా: మధురాది రసముల లోపాలోపములను సరిచేయునట్టియు, జ్వరము మొదలు ఇంద్రియ చికిత్స వరకునున్న వైద్యము నంతను నేర్చి మాయావదలి గర్వముతో మునితో సల్కితిని.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపఁ గదె వైద్యం బంచుఁ బ్రార్థించినన్
గండ్రల్ గా నటులాడి ధిక్కృతులఁ బోఁ గాల్మంటి వోహో మదిన్
దీండ్రల్ గల్గిన వారి కేకరణి నే నీ విద్య రాకుండు నే
గుండ్రాడాచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కుం గష్ట ముష్టింపచా!

టీ: తండ్రీ=నాయనా! వైద్యంబు=వైద్యశాస్త్రమును; నాకున్; అనుగ్రహింపగదె=చెప్పుమయ్యా! అంచున్ = అని; ప్రార్థించినన్ = వేడుకొనగా; గండ్రల్ గాన్=పరుషముగా; అటుల=ఆ రీతిగా; ఆడి=పలికి; ధిక్కృతులన్=తిరస్కారములతో; పోఁ గాల్మంటివి=పో పొమ్మంటివి; ఓహో! మదిన్=మనస్సులో; తీండ్రల్=చొరవలు; కల్గిన వారికిన్=ఉన్న వారికి; ఏకరణి నేనిన్=ఏరీతిగానైనను; విద్య; రాకుండు నే=రాకపోవునా? కష్ట=చెడ్డవాడవైన; ముష్టింపచా=పిడికెడు బియ్యము వండుకొని తిను దరిద్రుడా!

తా: నాయనా! వైద్యము చెప్పుమయ్యా! అన్నను తోచినట్లు తిట్టితివే. అంతలో నేమైనది? పట్టుదల యున్నచో చదువు రాకపోవునా? సన్నికల్లు గానఁ నంతలో పెండ్లి ఆగిపోవునా? అలం. అర్థాన్తరన్యాసము.

మ. అనినం గన్నులు జేవుఱింప నధరం బల్లాడ వెల్లత్పునః
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీ ఫూత్కారఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకంబం దందఘర్మాంబువుల్
చినుకం గంతుదిదృక్షురూక్షనయన క్ష్వేళాకరాళధ్వనిన్. 18

టీ: అనినన్=అఁగానే; కన్నులు; జేవుఱింపన్=ఎఱ్ఱనకాగా; అధరంబు=పెదవి; అల్లాడన్=అదరగా; వెల్లత్=చలించెడి; పునః పునః=మాటిమాటికి; ఉద్యత్=పైకిలేచు; భ్రుకుటీ=కనుబొమ లనెడి; భుజంగయుగళీ=రెండుపాముల యొక్క; ఫూత్కార='ఉఫ్' అను బుసలచేనైన; ఘోర+అనిలంబనన్=భయంకర వాయువా అన్నట్లు; ఊర్పుల్=నిశ్వాసములు, నిగుడన్=ఎక్కువకాగా; లలాట ఫలకంబు=పలకవంటి మొగము; అందంద=మరిమరి; ఘర్మ+అంబువుల్=చెమట బిందువులు; చినుకన్=వర్షింపగా; కంతు = మన్మథుని; దిదృక్షు = చూచెడి; రూక్ష=కఠినమైన; నయన = కన్ను కల శివునియొక్క; క్ష్వేళా=సింహనాదము వంటి; కరాళధ్వనిన్=భయంకరమైన చప్పుడుతో......

తా: నేనట్లు గర్వముగా పల్కుటతో; కన్నులెఱ్రవారి, పెదవి అదరి, కనుబొమ్మలు పైకి క్రిందికి లేచుచుండగా పాముబుస కొట్టినట్లు ఫూత్కారములతో నిట్టూర్చుచు, మన్మథుని దహించువేళ రుద్రునివలె సింహనాదము చేసి......

వ. జటిలుండు గిటకిటం బండ్లుకొఱికి హుమ్మని కటమ్ములదర ముక్కుఁబుటమ్ములు నటింపఁ గటకటా 'కుటిలాత్మ! యటమటమ్మున విద్య గొనుటయుం గాక గుటగుటలు గురువుతోనా?'యని కటకటం బడి కకపాలలోని బూది కేలం గొని యాసురి యగుమాయ మామెడం బ్రయోగించి వంచించి యపహసించితివి గావున నసురవై పిశితంబును వసయును నసృగ్గ్రసంబు నశనంబులుగా మెసవి వసుధ వసియింపుమని బసుమంబు సల్ల గుండె జల్లుమని కల్లువడి మునితల్లజు పదపల్లవంబులం ద్రెళ్ళి యిట్లంటి. 19

టీ: జటిలుండు = ముని; కిటకిటన్ = కిటకిటమనునట్లు; పండ్లు = దంతములు; కొఱికి = పటపటలాడించి; హుమ్మని = హుంకరించి; కటమ్ములు = చెక్కులు; అదరన్ = అదరగా; ముక్కుఁబుటమ్ములు = దొన్నెలవంటి ముక్కులు; నటింపన్ = కదలగా; కటకటా = ఆఁ ఏమిరా! కుటిలాత్మ = మోసగించు స్వభావము కలవాడా! అటమటమ్మునన్ = మాయతో; విద్యగొనుటయుంగాక = విద్య నేర్చుకొనుటయే కాక; గుటగుటలు = వెక్కిరింతలు; గురువుతోనా = గురువుతోనేనా? అని; కటకటంబడి = కోపించి; కకపాలలోని = చంకలోనుండు విభూతి బుట్టలోని; బూది = విభూతి; కేలంగొని = చేతితో తీసికొని; ఆసురియగు మాయన్ = రాక్షస సంబంధమైన మాయను; (శంబరుడను రాక్షసుని సంబంధమైన మాయయే శాంబరి); మామెడన్ = మావిషయమై—నన్ను మోసగించుటకుగా; ప్రయోగించి = ఉపయోగించి; వంచించి = మోసగించి; అపహసించితివి = పరిహాసము జేసితివి; కావునన్ = కనుక; అసురవై = రాక్షసుడవై; పిశితంబును = మాంసమును; వసయును = మాంసభేదమును; అసృగ్గ్రసంబును = రక్తమును; అశనంబులుగాన్ = ఆహారముకాగా; మెసవి = తిని; వసుధన్ = భూమిపై; వసియింపుము = ఉండుము; అని; బసుమంబు = చేతనున్న బూదిని; చల్లన్ = చల్లగా; గుండె; జల్లుమని; కల్లువడి = రాయివలె నిలబడిపోయి; మునితల్లజు = మునిశ్రేష్ఠునియొక్క; పదపల్లవంబులన్ = చిగుళ్ళవంటి పాదములపై; ద్రెళ్ళి = అమాంతముగాపడి; ఇట్లంటిన్.

తా: అప్పుడుముని పండ్లు పటపట కొరుకుచు "ఓరీ మాయచే నావద్ద విద్య నేర్చుటయేగాక నన్నే పరిహసింతువటరా" అనుచు విభూతి తీసికొని "రాక్షస మాయచే నన్ను మోసగించితివి కాన రాక్షసుడవై రక్తమాంసముల తినుము" అని బూదిని నామీద చల్లెను. నాగుండె జల్లుమన్నది. అతని కాళ్ళమీద సాష్టాంగముగా పడి యిట్లంటిని.

శా. నాయజ్ఞానము సైచి సంయమివరేశ్యా! కావవే రాక్షసుం
డై యే నెట్లు భజించువాఁడ దురితంబయ్యో నృమాంసంబు నా
డై యే నేట్లుభరించువాఁడ నుదరంబాద్రాంతరంగుండనై
యో యయ్యా! దయసేయవే యవధి యే నోపంగ దేహింసనున్.

టీ: సంయమివరేణ్యా=మునిశ్రేష్ఠుడా! నా యజ్ఞానము=నా తెలివితక్కువను; సైచి=సహించి; కావవే=రక్షింపుమయ్యా! రాక్షసుండై=రాక్షసుడనై; ఏన్=నేను; దురితంబు=పాపమును; ఎట్లు; భజించువాడన్=అనుభవింపగలను; అయ్యో! నృమాంసంబు=మనుష్యమాంసము; కూడై = ఆహారమై; ఏన్; ఉదరంబు=పొట్టను; ఎట్లు; భరించువాడన్=నింపుకొందును? ఓ యయ్యా! ఆర్ద్ర+అంతరంగుండవై=దయచే తడిసిన మనస్సుకలవాడవై; అవధి=శాపము తీరుటకు హద్దును; దయసేయవే=చెప్పుమయ్యా! ఏన్; హింసకున్ = ప్రాణులను చంపుటకు; ఓపంగదే=సహింపలేను కదయ్యా!

తా: ఓ మునిప్రవరా! నేను తెలివిమాలి చేసిన తప్పును క్షమించుము. మనుష్యమాంసముతో పొట్టనింపుకొనలేను. ప్రాణులను చంపలేను. దయచేసి ఈశాపమునకు హద్దు చెప్పుము. నన్ననుగ్రహింపుము.

చ. అనినఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ నను నెత్తి వత్స! మ
త్సునిశితశాపశూలహతి స్రుక్కితిగా! యిఁక గొన్నినాళ్లపైఁ
దనయను మ్రింగఁబోయి యొక ధన్యుని దివ్యశరార్చిఁ బ్రేలి వే
కనియెదు భద్రమన్నఁ దురగంబు పయిం బడి ప్రొద్దుగ్రుంకగన్.

టీ: అనినన్=అనివేడగా; ప్రసన్నుడై = దయకల్గినవాడై; ముని; కర+అబ్జములన్=పద్మములవంటి చేతులతో; ననున్+ఎత్తి=పైకి లేవనెత్తి; వత్స=నాయనా! మత్=నాయొక్క; సునిశిత = వాడియైన; శాపశూలహతిన్=శాపమనెడి శూలపు దెబ్బచే; స్రుక్కితిగా=బాధపడితివి గదా! ఇక కొన్నినాళ్లపై=కొన్నాళ్లకు; తనయను = కూతురిని; మ్రింగబోయి; ఒకధన్యుని దివ్యశర+అర్చిన్=ఒక గొప్పవానియొక్క అస్త్రమునకు; ప్రేలి=కాలిపోయి; వే=వెంటనే; భద్రము=మేలును; కనియెదు=పొందెదవు; అన్నన్=అనగా; తురగంబుపయిన్=గుర్రముమీద; పడి=ఎక్కి; ప్రొద్దుగ్రుంకగన్=సూర్యాస్తమయము కాగా...

తా: అనివేడగా బ్రహ్మమిత్రుడు దయతలచి నన్ను లేవనెత్తి 'నాయనా! నా శాపముచే దుఃఖించితివి. కొన్నాళ్లకు నీవు నీ కూతురిని మ్రింగబోదువు. అప్పుడొక మహాత్ముడు అస్త్రముతో నిన్ను కొట్టును. నీ రాక్షస దేహము కాలిపోగా మేలు పొందుదువు' అని అనుగ్రహించెను. నేను వెంటనే గుర్రము నెక్కితిని. ప్రొద్దు గ్రుంకినది.

క. సన్నఁపుఁదలయేరున మయి
యన్నాకొనుచు నాము దిన్న యల్లై రాఁగా
ఖిన్నుఁడనై పురి కేగితిఁ
దిన్నఁదనం బుడిగి కొన్ని దివియలు వెలుఁగన్. 22

టీ: సన్నపుఁదలయేరునన్ = కొంచెము తల నొప్పిచే; మయి = దేహము; అన్నుకొనుచున్ = పరవశమగుచు; ఆముదిన్నట్లై = విషము దిన్న రీతిగానై; గాఁగాన్ = ఏర్పడఁగా; ఖిన్నుఁడనై = విచారము కలవాడనై; తిన్నదనంబు = గాఢ్యము; ఉడిగి = తగ్గి; కొన్నిదివియలు = కొన్ని దివిటీలు; వెలుఁగన్ = వెలుగు చుండఁగా; పురికిన్ = నా పట్టణమునకు; ఏఁగితిన్ = వెళ్ళితిని.

తా: అంతట నాకు విషము తిన్నట్లుగా మందమతి కల్గి తలనొప్పి వచ్చి ఒళ్ళువశము తప్పినది. విచారపడుచు దివిటీల వెలుగున పట్టణమున కేగితిని. అలం. స్వభావోక్తి.

క. అంపఁ దగువారిఁ గసరుచు
నంపి నగరు సొచ్చి వెలఁదు ౹ లారతు లీఁగా
నింపుఁ గశాభిహతులం
జంపించితి వారి నన్ని ౹ శామధ్యమునన్. 23

టీ: అంపన్ = సెలవిచ్చి పంపుటకు; తగువారిన్ = తగినవారిని; కసరుచున్ = అదలించుచు; అంపి = పంపి; నగరు = [illegible] చొచ్చి = ప్రవేశించి; వెలఁదులు = స్త్రీలు; ఆరతులీఁగాన్ = హారతులియ్యఁగా; ఇంపు + ఉఁజన్ = సొంపు చెడునట్లు; వారిలన్ = ఆ స్త్రీలను; తత్ + నిశామధ్యమునన్ = ఆ నడిరేయి వేళ; కశా + అభిహతులన్ = కొరడాల దెబ్బలచే; చంపించితిని.

సీ. అభ్రమండలి మోచు ౹ నందాఁక నూరక
పెరిగిన ట్లై మేను ౹ నరవరేణ్య!
యనధిభూధరసాను ౹ వం దాఁక నూరక
పఱచి నట్లై మేను ౹ పార్థివేంద్ర!
యబ్జభూభువనంబు ౹ నందాక నూరక
యెగసిన ట్లై మేను ౹ జగదధీశ!
యహిలోకతల మంటు ౹ నందాక నూరక
పడినయట్లవు మేను ౹ ప్రభువతంస!

తే. యఖిలజగములు మ్రింగునం ౹ తాఁకలియును
నబ్ధి లేమను జెడఁ గ్రోలు ౹ నంత తృషయు
నచలచాలనచణ మైన ౹ యదటుఁ గలిగె
నసురభావంబు ననుఁ జెందు ౹ నవసరమున. 24

టీ: నరవరేణ్యా = రాజా! అసురభావంబు = రాక్షసత్వము; ననుజెందు నవసరమునన్ = నన్ను పొందునపుడు; మేను = నా శరీరము; ఊరక = ఇట్టే; అభ్రమండలి

=ఆకాశమును; మోచునందాక=తగులు వరకు; పెరిగినట్లు+ఔను=పెరిగినట్లయినది; పార్థివేంద్ర=రాజా! నేను; అవధిభూధర=లోకాలోక పర్వతముయొక్క; సానువందాక=చరియవరకు; ఊరక; పఱచినట్లు+ఔ=చాపినట్లగును; జగత్+అధీశ=రాజా! మేను; అబ్జభూ=బ్రహ్మయొక్క; భువనంబునందాక=లోకము (సత్యలోకము) వరకు; ఎగసినట్లౌన్=పెరిగినట్లగును; ప్రభువతంస=రాజా! మేను; అహిలోకతలము=పాతాళలోకమును; అంటునందాక = తగులువరకు; పడినయట్లవున్=దించుకొని పోయినట్లగును; అఖిలజగములు=లోకములన్నియు; మ్రింగునంత=తినవలెనన్నంత; ఆకలియును; అబ్ధులు+ఏడును=ఏడు సముద్రములును; చెడన్=అయిపోవునట్లు; క్రోలునంత=త్రాగవలె నంతటి; తృషయును=ఆకలియును; అచల=పర్వతములను; చాలన=కదపుటకు; చణమైన=సమర్థమైన; అదటున్=బలగర్వమును; కలిగెన్.

తా: రాక్షసత్వము కల్గిన తోడనే నాయొడలు పరవశమై ఆకాశము నంటినట్లు, చక్రవాళ పర్వతమును తాకినట్లు, సత్యలోకమునంటినట్లు, పాతాళలోకమునంటునట్లునై లోకములన్నింటిని మ్రింగునంతటియాకలియు, సముద్రములేడును త్రాగునంతటి దాహమును, కొండలను కదపగలంత శక్తియు కల్గినవి. అలం. స్వభావోక్తి.

క. రక్కసుఁడనై నెపంబిడి
యొక్కొక యపరాధమునకు నొక్కొక్కఁడుగా
బొక్కఁగ లోకము పురపురఁ
బొక్కఁగఁ బాడయ్యె నంతిపురముం బురమున్. 25

టీ: రక్కసుడనై=అట్లు రాక్షసుడనై; నెపంబిడి=వంక పెట్టి; ఒక్కొక యపరాధమునకు = ఒక్కొక్క తప్పునకు; ఒక్కొక్కడుగాన్ = ఒక్కొక్కడు చొప్పున; బొక్కగన్=తినగా; లోకము=ప్రజలు; పురపురబొక్కగన్=బాధపడునట్లు; అంతిపురమున్=అంతఃపురమును; పురమున్=పట్టణమును; పాడయ్యెన్=నిర్మానుష్యమయ్యెను.

తా: రాక్షసుడనై కాగానే యేదోవంక పెట్టి ఒక్కొక్కతప్పున కొక్కొక్కనుగా అంతఃపురమును. పురములోని జనులందరిని మ్రింగితిని. దానితో నగరము పాడైనది.

తే. ఊరుపాడైనఁ గెళవుల యూళ్లకుఱికి
మెసవ దొరఁకొంటిఁ బ్రజ మారి మసఁగినట్లు
తీఱెఁగతిపయదినముల దేశమెల్ల
మల్లెవట్టినచేని క్రమంబుగాఁగ. 26

టీ: ఊరు=నా పట్టణము; పాడైనన్=పాడుపడగా; కెళవులయూళ్లకున్=ఇరుగు పొరుగు గ్రామములకు; ఉఱికి=పరుగెత్తి; ప్రజన్ = జనులను; మారి మసఁగినట్లు=మారియను దేవతపడు నాశనము చేసినట్లు; మెసవన్=తినుటకు; దొరఁ

కొంటిని = ప్రారంభించితిని; కతిపయదినములన్ = కొన్ని రోజులలోనే; దేశమెల్లన్ = దేశమంతయు; మల్లెపట్టిన = పురుగు పట్టిన; చేనిక్రమంబునన్ = పైరుచేనువలె; కాగన్ = అగునట్లు; తీఱెన్ = నాశనమయ్యెను.

తా: నా దేశము పూర్తికాగా ప్రక్కదేశములపైబడి మహామారి వ్యాపించి ప్రజలను నాశనము చేయునట్లు తినుట కారంభించితిని. చివరకు పురుగుపట్టిన చేనువలె కొద్దిరోజులలోనే దేశము పూర్తియైనది. అలం. ఉపమ.

వ. ఇవ్విధంబున విధివిధానంబున యాతుధానుండనై ధారాధరోత్సేధంబును నతినిశితరోమసంబాధంబును ధూమసమధామంబును ధృతాంత్రదామంబును జలితకపాలకుండలంబును జ్వలితసితదంష్ట్రామండలంబును నాగాయుతత్రాణంబును మస్తకోత్తుంగఘోణంబునునై యనవరతహింసానురూపం బగురూపంబుఁ దాల్చి శకటాంగభంగికమ్ములై యింగలము లొలుకు నపాంగమ్ములం బిశంగమ్ము లగుచుఁ బశ్యజనాసుమోచనమ్ములగు లోచనమ్ములు వెలుంగ బభ్రుకేశమ్ములు దూల సకలభూతభయంకరమ్మగుపటిమ నిచటి యుటజమ్ముల కుటికి జటి యనక వటు వనక యతి యనక వ్రతియనక గృహియనక సతియనక శిశువనక భక్షించి భక్షించి కుక్షింభరిత్వంబునం బ్రవర్తిల్లితి; నదియట్లుండె వినుము. తారలకు వర్షధారలకు నిసుములకుఁ గసవునకు లెక్కగలిగినం గలుఁగుఁగాని మదీయజఠరానల జీర్ణజంతుసంతానంబులకు లెక్కయిడ నక్కమలగర్భుండును సమర్థుండు గాఁడిట్టి కృత్రిమదనుజభావావిష్టుండనగు నాదౌష్ట్యంబుసవసవగాఁ దెలిసి ముదురకయమున్న మత్కళత్రంబులం బుట్టినింటికి నా సుత్సవావలోకనవ్యాజంబున ననిపించుకొని చని నిజగృహంబుల నునిచి రక్షించుకొని యుండి; రప్పుడే నశనంబు గానక కానక కన్న యిక్కన్నియం గైలాసకాననంబునం గుసుమంబులు గోయుదానిం గని కనికరం బుడిగి కడుపుఁజిచ్చునకు మ్రింగం దఱుముకొని వచ్చి యిచ్చోట భవదీయ దర్శనంబున వృజినరుజనలన విముక్తుండనై నిజప్రకృతిం బొంది కృతార్థుండనైతి. 27

టీ: ఈ+విధమునన్ = ఈ రీతిగా; విధివిధానంబునన్ = దైవవిలాసముచే; యాతుధానుండనై = రాక్షసుడనై; ధారాధర+ఉత్సేధంబును = మేఘముల యెత్తు పొడుగును; అతినిశిత = మిక్కిలివాడియైన; రోమసంబాధంబును = రోమములచే సందులేనిదియు; ధూమసమ = పొగతో సమమైన; ధామంబును = కాంతియు; ధృత

=ధరింపఁబడిన; ఆంత్రదామంబును=ప్రేవుల మాలలు కలదియును; చలిత=కదల్పఁబడిన; కపాల కుండలంబును=తలపుర్రెలను కుండలములు కలదియు; జ్వలిత=ప్రజ్వలించెడి; సిత=తెల్లని; దంష్ట్రామండలంబును=కోరల సముదాయము కలదియు; నాగ+అయుతత్రాణంబును=పదివేల ఏనుగుల బలమును; మస్తక+ఉత్తుంగ=తలవరకు పొడవైన; ఘోణంబునునై=ముక్కును కలదై; అనవరత=ఎల్లప్పుడును; హింసా+అనురూపంబగు రూపంబును=హింసకు తగిన రూపమును; తాల్చి=ధరించి; (అలం. స్వభావోక్తి.) శకటాంగ=బండి చక్రములయొక్క; భంగికమ్ములై=రీతికలవై; ఇంగలమ్ములొలుకు=నిప్పులు రాలెడి; అపాంగమ్ములన్=క్రీగంటితో; పిశంగమ్ములగుచున్=పచ్చనివై; పశ్యత్+జన=చూచెడి జనులయొక్క; అసుమోచనమ్ములగు=ప్రాణములు తీయునవియైన; లోచనమ్ములు=కన్నులు; వెలుంగన్=ప్రకాశింపఁగా; (అలం. ఉపమ, స్వభావోక్తి.) బభ్రుకేశమ్ములు=పచ్చని తలవెండ్రుకలు; తూలన్=కదలుచుండఁగా; సకలభూతభయంకరంబగు=ప్రాణులన్నిటి భయము కల్గించు; పటిమన్=సామర్థ్యముచే; ఇచటియుటజమ్ములకున్=ఇక్కడి మునుల పర్ణశాలలకు; ఉఱికి=దూకి; జటియనక=జడలు కల యోగియనుకోక; వటుఁడనక=బ్రహ్మచారి యనక; యతియనక=సన్న్యాసి యనియెంచక; వ్రతియనక=వ్రతము కలవాఁడని జంకక; సతియనక=పతివ్రతయని చూడక; శిశువనక=పసిబిడ్డయని చూడక; భక్షించి భక్షించి=తిని తిని; కుక్షింభరిత్వంబునన్=పొట్టనింపుకొనుటతో; ప్రవర్తిల్లితిన్=నడచితిని; అదియట్లుండెన్=నా నడక అట్లుండఁగా; వినుము=నే చెప్పునది వినుము; తారలకున్=నక్షత్రములకును; వర్షధారలకున్=వాన చినుకులకును; ఇసుమునకున్=ఇసుకకును; కసవునకున్=గడ్డిపరకలకును; లెక్కగలిగినన్=లెక్కయున్నచో; కలుగుఁగాని=ఉండవచ్చును కాని; మదీయ=నా సంబంధమైన; జఠర+అనల=జఠరాగ్నిచే; జీర్ణంబయిన=జీర్ణమైన; జంతుసంతానంబులకున్=ప్రాణుల సముదాయములకు; లెక్కయిడన్=లెక్కపెట్టుటకు; ఆ+కమలగర్భుండును=ఆ బ్రహ్మ (నాలుగు ముఖములు కల్గినను) కూడ; సమర్థుఁడు=చేతనైనవాఁడు; కాఁడు; ఇట్టి; కృత్రిమ=శాపముచే కల్గిన; దనుజభావ+ఆవిష్టుండనగు=రాక్షసత్వముచే నావేశింపబడిన వాఁడనగు; నాదౌష్ట్యంబు=నా చెడుచేష్టలు; సవసవగా=చూచాయగా; తెలిసి; ముదురకయున్న=ఎక్కువ కాకముందే; మత్+కళత్రంబులన్=నా భార్యలను; పుట్టినింటివారు; ఉత్సవ+ఆలోకనవ్యాజమునన్=వేడుకచూచెడిమిషతో; అనిపించుకొని=నాచే పంపెదనని చెప్పించి; చని=తీసికొనిపోయి; నిజగృహంబులన్=తమయిండ్లయందు; ఉనిచి=ఉంచుకొని; రక్షించుకొని; ఉండిరి; ఇప్పుడు; ఏన్=నేను; అశనంబు=ఆహారము; కానక=పొందక; కానకకన్న=లేక లేక కనిన; ఈ+కన్నియన్=ఈకన్యను; కైలాసకాననంబునన్=కైలాసపర్వతముమీదిఅడవిలో; కుసుమంబులు=పువ్వులు; కోయుచున్నదానిన్; కని=చూచి; కనికరంబు=దయ; ఉడిగి=విడిచి; కడుపుచిచ్చునకున్=కడుపులోనిఆకలిమంటకు; మ్రింగన్=మ్రింగుటకు; తలముకొని వచ్చి, ఇచ్చోటన్=ఇక్కడ; భవదీయ దర్శనంబునన్=నీ దర్శనముచే; వృజిన

నుజవలనజ = పాపమను రోగమునుండి; విముక్తుండవై = విడువబడిన వాడవై; నిజ ప్రకృతిన్ = సహజమైన భాగమును—గంధర్వుడగుటను: పొంది; కృతార్థుండ వైతిన్ = ధన్యుడవైతివి.

క. ఈయుపకారమునకుఁ బ్రతి
సేయఁగ శక్యంబె జంభ ✽ జిన్నిభ శఫరా
త్యాయతలోచనయైన మ
దీయాత్మజ నీకు నిత్తు ✽ దేవీమణిగన్. 28

టీ: జంభజిత్+నిభ=ఇంద్రుని పోలినరాజా! ఈ యుపకారమునకున్ = ఈ మేలునకు; ప్రతి = బదులుమేలు; చేయఁగన్ = చేయుటకు; శక్యంబె = సాధ్యమా? శఫర+అత్యాయత లోచనయైన = చేపలవలె విశాలమైన కన్నులుకల; మదీయ+ఆత్మజన్ = నా కూతురిని; నీకు; దేవీమణిగన్ = పట్టపు భార్యగా; ఇత్తున్ = ఇచ్చెదను.

తా: ఓ రాజా! నీవు నాకు చేసిన ఉపకారమునకు నేను ప్రతిమేలు చేయలేను. సుందరియైన నా కూతురిని నీకు దేవిగా నిత్తును.

క. ఆయుర్వేదముఁ గైకొని
యీయింతిం బెండ్లియాడు ✽ మెలమి రమా నా
రాయణపరిణయ గేయ వి
గాయకగంధర్వమైన ✽ కవ్వపుఁగొండన్. 29

టీ: ఆయుర్వేదమున్ + కైకొని = వైద్య శాస్త్రమును పరిగ్రహించి; ఈ యింతిన్ = ఈ కన్యను; రమా నారాయణ = లక్ష్మీనారాయణుల యొక్క; పరిణయ = పెండ్లికథకల; గేయ విగాయక = పాటల పాడెడి; గంధర్వమైన = గంధర్వులు కల; కవ్వపుగొండన్ = మందార పర్వతముపై; ఎలమిన్ = సంతోషముతో; పెండ్లియాడుము.

తా: నేను నా కూతురితో పాటుగ నా ఆయుర్వేదము నిత్తును. దీని పరిగ్రహించి మందర పర్వతమునకు విచ్చేసి అక్కడ నా పరిచారకులైన గంధర్వులు లక్ష్మీనారాయణుల పెండ్లి పాటలను పాడుచుండ నీమెను పెండ్లాడుము.

—: లయగ్రాహి :—

ఉన్నగముపై జరఠ ✽ పన్నగపతిస్ఫుట ల
✽ నన్నగసి కోటతుద ✽ లన్నగడుకొమ్మల్
మిన్నగలరాయ రుచిఁ ✽ జెన్నగు విమానముల
✽ పన్నగడ పన్నగఁ బ్రి ✽ భిన్నగజఘోటీ
చ్ఛన్నగమనాపణము ✽ లన్నగనిగమ్మ్యతి ర
✽ వి న్నగుమణిప్రకర ✽ మున్నగరిమం జే

రెన్నఁ గల యంగడుల ‡ వన్నె గని సంపదల
‡ మన్నగరి యొప్పు బల ‡ భిన్నగరి శేవన్. 30

టీ: ఆ+నగముపైన్=ఆ కొండమీద; జరఠ=ముసలివాడైన; పన్నగపతి=ఆదిశేషుని యొక్క; స్ఫటలనన్=పడగలనువట్లు; నెగసి=పైకిలేచి; కోట తుదలన్ = ప్రాకారపు గోడ చివరల; నెగడు కొమ్మల్=అతిశయించు శిఖరములు; మిన్ను+అగలన్=ఆకాశము పగులునట్లు; రాయఁగా=ఒరయుచుండగా; రుచిన్ = కాంతిచే; చెన్నగు=అందమైన; విమానముల=మేడలమీద చదరముగా కట్టబడిన కట్టడములయొక్క; పన్నగడ=రచన; పన్నుగన్ = బాగుగా; ప్రభిన్న=మదించిన; గజ=ఏనుగుల చేతను; ఘోట = గుర్రముల చేతను; ఛన్న = కప్పబడిన; గహన+ఆపణములన్ = ప్రవేశింపరాని యంగళ్లలో; నిగనిగద్యుతిన్ = నిగనిగని కాంతితో; రవిన్+నగు=సూర్యుని నవ్వెడి—సూర్యుని మించిన; మణిప్రకరమున్న గరిమన్ = మణుల సముదాయమున్న గౌరవముచే; పేరు+ఎన్నన్+కల=ప్రసిద్ధి నెంచగల; అంగడులన్=రచ్చపట్టులచే; వన్నెగని=పొగడ్తనుపొంది; సంపదలన్=వైభవములచే; బల భిన్నగరిశేవన్=ఇంద్రుని నగరమైన అమరావతివలె; మత్+నగరి=నా పట్టణము; ఒప్పున్=ప్రకాశించును.

తా: ఆ మందర పర్వతముపై నా పట్టణము మిక్కిలి యెత్తైన ప్రాకారపు గోడలతోడి కోటయును, మేడమీది పొడుగైన గోపురములు కలిగి, ఎల్లచోట్ల మదపు టేనుగులు, గుర్రములును నిండి యుండగా; అంగళ్ళలోనున్న రత్నముల కాంతితో సూర్యుని వెలుగును మించి వెలుగుచుండగా, గొప్పవైన రచ్చపట్లు వెలుగుచుండ నమరావతివలె వైభవములతో ప్రకాశించు చుండును. అలం. ఉపమ, అతిశయోక్తి, ఉత్ప్రేక్షయు.

తే. అని నిజోదంత మావంత ‡ యైన దాఁప
కంతయును జెప్ప నద్భుతం ‡ బంతరంగ
మంతయును నిండ హర్షించె ‡ నాస్వరోచి
యంత రవి యేగెఁ బశ్చిమా ‡ శాంతమునకు. 31

టీ: అని; నిజ+ఉదంతము = తనకథను; ఆవంతయైనన్=కొద్దియైనను; దాఁపక=దాచక. అంతయున్=సర్వమును, చెప్పన్ = చెప్పగా; ఆ స్వరోచి; అద్భుతంబు=ఆశ్చర్యము; అంతరంగము=మనస్సు; అంతయున్; నిండన్=నిండగా; హర్షించెన్=సంతోషించెను; అంతన్ = అంతట; రవి=సూర్యుడు; పశ్చిమ+ఆశా+అంతమునకున్=పడమటిదిక్కు చివరకు; ఏఁగెన్=పోయెను.

తా: ఇట్లు గంధర్వరాజు చెప్పగా విని స్వరోచి మిక్కిలి యాశ్చర్యమును, సంతోషమును పొందెను. అంతలో ప్రొద్దు గ్రుంకినది.

మ. వికసిల్లంబ్రిజ చక్రిపాలనము గా ‡ వించెం గరవ్యాపృతిం
గకుబంతంబుల నాక్రమించెఁ బాసఁగం ‡ గా నేర్చె వర్ణాళిఁ గాం

తికిఁ బాపెం బెఱరాజకోటిఁ దుది శాంతిం బొందె దైవంబు సేఁ
తకుఁ దాపం బిఁక నేల నంగ నినుఁ డస్తప్రాప్తుఁ డయ్యెం గడున్

టీ: (ఇందు రెండర్థము లున్నవి.) ఇనుడు = సూర్యుడు—రాజు; ప్రజ= జనులు; వికసిల్లన్ = తెలివినందగా—ఏ వస్తువేదో తెలిసికొనగా; సంతోషింపగా; చక్రపాలనము=చక్రవాకములను పాలించుటను; భూచక్రము నేలుటను; కావించెన్ =చేసెను; కరవ్యాప్ృతిన్ = కిరణములు వ్యాపించుటచే, చేతులు చాపుటచే; కకుప్ + అంతంబులన్ = దిక్కులకొనలను; ఆక్రమించెన్; వర్ణ + ఆళిన్ = తెలుపుమున్నగు రంగులను, బ్రాహ్మణాది జాతులను; పొసగంగాన్ = పొందుపడునట్లు; ఏర్చెన్ =ఏర్పాటుచేసెను; పెఱరాజకోటిన్ = ఇతరుడైన చంద్రుని యతిశయమును, శత్రురాజులను; కాంతికిన్ = ప్రతాపమునుండి; పాపెన్ = తొలగించెను; దైవంబు సేఁతకున్ = దైవనిర్ణయమునకు; ఇఁకన్ = ఇంకమీద; తాపంబు = వేడి; పరితాపము; ఏల = ఎందుకు? అనంగన్ = అనునట్లుగా; తుదిన్ = చివరికి; శాంతిన్ = వేడిలేకుండుటను; పొందెన్; కడున్ = మిక్కిలి; అస్తప్రాప్తుడు = అస్తమయ పర్వతమును పొందినవాడు, అస్తమయమును పొందినవాడు; అయ్యెన్.

తా: ఒక మహారాజు తన భుజబలముచే భూపరిపాలనచేసి, దిక్కుల నాక్రమించి, వర్ణాశ్రమ ధర్మములను చక్కజేసి, శత్రురాజుల నోడించి తుదకు దైవనిర్ణయ ప్రకారము శాంతుడై మృతుడగునట్లుగా సూర్యుడును చక్రవాకములను పాలించి, కిరణములచే దిగంతముల వ్యాపించి జనులకు యారంగుల విభాగము తెలియునట్లుజేసి, చంద్రుని వెలుగ నియ్యక తుదకు వేడి తగ్గి అస్తమించెను. అలం. అర్థాంతరన్యాసము, శ్లేష, ఉత్ప్రేక్షయు.

క. అసురవరుఁడైన యిందీవ రాక్షు మేన
నంటుకొన్న స్వరోచి బాణాగ్ని వోలె
నంతఁ గనుపట్టె శుకతుండ కాంతిఁ దెగడి
సాంధ్యరాగంబు పశ్చిమాచలమునందు. ౩౩

టీ: అసురవరుడైన = రాక్షసశ్రేష్ఠుడైన; ఇందీవరాక్షు మేనన్ = ఇందీవరాక్షుని శరీరముపై; అంటుకొన్న = తగిలియున్న; స్వరోచి బాణ + అగ్ని వోలెన్ = స్వరోచి యొక్క బాణముల యగ్నివలె; అంతన్ = అంతట; శుక = చిలుకయొక్క; తుండ కాంతిన్ = ముక్కుయొక్క కాంతిని; తెగడి = తిరస్కరించి; సాంధ్యరాగంబు = సంధ్యాకాలమందలి యెఱుపు; పశ్చిమ + అచలమునందున్ = పడమటి కొండపై; కనుపట్టెన్ = చూపట్టెను; అలం. ఉత్ప్రేక్ష, ఉపమయు.

తా: రాక్షసుని శరీరముపై బడిన స్వరోచి బాణాగ్ని జ్వాలలో యున్నట్లు ప్రొద్దు గ్రుంకగానే యెఱ్ఱని కాంతులు పడమటి దిక్కున వ్యాపించెను.

క. తలచూపె నప్పు డఖిలా
శల దట్టపుటిరులు చిలువ జవరాలు నభ

స్థలమండపకోపరిసీ
మల నిండిన సితాండపటలి మాడ్కిం జుక్కల్. 34

టీ: అప్పుడు; అఖిల+ఆశలన్ = అన్ని దిక్కులందును; దట్టపుటీరులు= దట్టమైన చీకటియనెడి; చిలువ జవరాలు = నాగవనిత; నభస్థల = ఆకాశమనెడి; మండపక = చావడియొక్క; ఉపరిసీమన్ = పై భాగములందు; ఇడిన = పెట్టిన; సిత = తెల్లని; అండపటలిమాడ్కిన్ = గ్రుడ్లసమూహామువలె; చుక్కలు; తలచూపెన్ = కన్పడెను.

తా: అప్పుడు చీకటియనెడి యాడుపాము ఆకాశముమీద పెట్టినగ్రుడ్లువలె చుక్కలు పొడిచినవి. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

ఆ. సాంధ్యనటనచండ చండీశపదహాతి
ధరణిచక్రి మొరగి శరధిఁ గ్రుంగ
నోగగల్లువడియె భూరథేతరభాగ
చక్రి మనఁగ నపుడు శశియుఁ దోఁచె. 35

టీ: అపుడు; సాంధ్యరాగ = సంధ్యాకాలమందలి; నటన = నాట్యమందు; చండ = ఉద్ధతుడైన; చండీశ = నటరాజు యొక్క; పదహాతిన్ = అడుగుల తాకిడిచే; తరణిచక్రము = సూర్యుడను చక్రము; ఒరగి = ఒక్క ప్రక్కకు వంగి; శరధిన్ క్రుంగన్ = దిగబడగా; భూరథ = భూమియను రథముయొక్క; ఇతరభాగ = రెండవవైపున; చక్రము దోరగల్లు వడియెన్+అనగన్ = ఒడ్డగిలపడెనో యన్నట్లు; శశియున్ = చంద్రుడును; తోఁచెన్ = ఉదయించెను.

తా అప్పుడు శివుని తాండవమున అతని కాలి దెబ్బలకు భూమియను రథము యొక్క సూర్యుడను నొక్క చక్రము సముద్రములో గ్రుంగగా రెండవవైపు చక్రము కూడ తిరుగబడినదా యన్నట్లుగా చంద్రుడు కన్పడెను. అనగా సూర్యాస్తమయము కాగానే చంద్రోదయ మైనది. సూర్య చంద్రులు భూమికి రెండు చక్రముల వలెనుండిరి. అలం. రూపకోత్ప్రేక్షలు.

క. తమ మను కాలాహి ప్రపం
చము నెరగొని యోషధీశ సద్యఃకృత దం
డమున మగుడంగఁ గ్రక్కుడు
క్రమమున నొయ్యొయ్య విచ్చి కడలకుఁ దొలఁగెన్. 36

టీ: తమమను = చీకటి యనెడి; కాల+అహి = నల్లత్రాచు; ప్రపంచమున్ = లోకమును; ఎరగొని = మ్రింగి; ఓషధి+ఈశ = చంద్రునిచే; సద్యఃకృత = అప్పుడే చేయబడిన; దండమునన్ = శిక్షచే; మగుడంగన్ = మరల; క్రక్కుడు క్రమమున్ = వెడలగ్రక్కు రీతిగా; ఒయ్యొయ్యన్ = మెల మెల్లగా; విచ్చి = విడిపోయి; కడలకున్ = దిక్కుల చివరలకు; తొలఁగెన్ = తప్పుకొనెను;

తా: నల్లగా తాచువలె చీకటి లోకమును క్రమ్మెను. అంతలో చంద్రుడుద యించి దానిని శిక్షించగా వదలి పోవునట్లుగా మెల్లమెల్లగా లోకమును వదలి దూర దూరములకు పోవుచుండెను. అలం. రూపకోత్ప్రేక్షలు.

వ. అనంతరంబ క్రమక్రమంబున. 37

టీ: అనంతరంబ=తర్వాత; క్రమక్రమంబునన్=వరుసగా.

సీ. కలయ వెల్లువఁ గట్టి జలజలఁ బ్రవహించు
శశికాంతవాంతని ర్ఝరము జలము
మలయానిలముచే దు మారంబు రేఁగు సౌ
గంధికంబు రజంబు కఱుకుదుమ్ము
నిండార విరసిన బొండుమల్లెల నుండి
వడియు మరందంబు గుడరసంబు
తొలఁకి మింటికిఁ బొంగు దుగ్ధపాథోరాశి
కరడులమీఁది మీఁ గడలమెఱుఁగు

గీ. తనకు రసవర్గములుగా సు ధాకరుండు
సారెసారెకుఁ గరములు సాఁచి సాఁచి
యచ్చతెలుపుగ నపుడు బ్ర హ్మాండ మండ
పంబు వెన్నెల సున్నసు న్నంబు సేసె. 38

టీ: సుధాకరుండు=చంద్రుడనెడి పాలగచ్చు చేయువాడు; అపుడు; కల యన్=అంతటను; వెల్లువగట్టి=ప్రవాహమై; జలజలన్+ప్రవహించు=జలజలమను చప్పుడు చేయుచు ప్రవహించెడి; శశికాంత=చంద్రకాంతపురాల నుండి; వాంత=పైకివచ్చు; నిర్ఝరము జలము=ఊటనీరును; మలయ+అనిలముచేన్=పైరుగాలిచే; దుమారంబు=దుమ్ము; రేఁగు=పైకెగిరెడి; సౌగంధికంబురజంబు = పరిమళించెడి కలువల పరాగమును; కఱుకుదుమ్ము=గరుకు దుమ్మును; నిండారన్=బాగుగా; విరి సిన=వికసించిన; బొండుమల్లెలనుండి=పెద్దమల్లెపువ్వులనుండి; వడియు=కారెడి; మరందంబు=పూదేనెయను; గుడరసంబున్=బెల్లపు నీటిని; తొలఁకి=ఎక్కువై; మింటికిన్=ఆకాశమునకు; పొంగు=పొంగెడి; దుగ్ధపాథోరాశి=పాలసముద్రము యొక్క; కరడులమీది=కెరటముల మీదనున్న; మీఁగడలమెఱుఁగు = మీగడల కాంతిని; తనకున్; రసవర్గములుగాన్ = కావలసిన పరికరములుగా; సారెసారె కున్ = మాటిమాటికిని; కరములు = కిరణము లనెడి చేతులను; చాఁచి చాఁచి; బ్రహ్మాండమండపంబు=బ్రహ్మాండ మనెడి మండపమును; అచ్చతెలుపుగన్=స్వచ్ఛ మైన తెల్లగా; వెన్నెల=వెన్నెలయనెడి; సున్నసున్నంబు=పాలగచ్చు; చేసెన్.

తా: అప్పుడు చంద్రుడు, సున్నము చేయువానివలె చంద్రకాంతి మణుల నుండి కారెడి నీటిని, పైరుగాలికి రేగు దుమ్మును, కలువ పుప్పొడిని, మల్లెల పూదేనెయను తెల్లపునీటిని, పాలసముద్రము కెరటములమీది మీగడ మెరుగును తీసికొని లోకమునంతను పాలగచ్చు చేసెను. అనగా చంద్రుడు వెన్నెల కాయు చుండగా చంద్రకాంత మణుల నుండి నీరు స్రవించినది. పైరుగాలికి కలువ పుప్పొళ్లు రేగినవి. మల్లెలనుండి పూదేనె స్రవించినది. పాలసముద్రము పొంగి కెరటములు వేయుచున్నది. లోకమంతయు పాలగచ్చు చేసినట్లు తెల్లగానైనది. అలం. రూపకము.

వ. ఆ సమయంబునం బరిశ్రాంతుండగు నమ్మహీకాంతుం డొక్క శశికాంత శిలామండపంబున దట్టంబుగా బఱచిన చిగురు పఱపుల గంధర్వరాజునుం దానును సుఖాసీనుండై యిష్టకథాగోష్ఠి నా రాత్రి గడపెనంత. 39

టీ: ఆ సమయంబునన్=అపుడు; పరిశ్రాంతుండగు=బడలినవాడైన; అమ్మహీకాంతుండు = ఆ స్వారోచి; ఒక్క మణికాంత ;శిలామండపంబునన్ = ఒక్క చంద్రకాంతపు మంటపములో; దట్టంబుగాన్ = ఎక్కువగా; పఱచిన చిగురుల పఱపునన్ = వేసిన చిగుళ్ళశయ్యపై; గంధర్వరాజునున్ = ఇందీవరాక్షుడును; తానును; సుఖ+ఆసీనుండై=సుఖముగా కూర్చున్నవాడై; ఇష్టకథాగోష్ఠిన్=ఇష్టమైన కథలను చెప్పుటతో; ఆ రాత్రిన్; కడపెన్=వెళ్ళించెను. అంత...

సీ. తనుఁ బాసి శశి దవ్వ చనిన నెవ్వగఁ బోలె
దొలిదిక్కుజవరాలు వెలుకఁ బాఱె
ప్రథమాద్రిసభయందు బఱచిన కెంబట్టు
జముకాణ మనఁగ రాగము జనించె
ధవుఁ గూర్మి కొసరుచున్నవివోలె ముఖరాళి
వనరుహాస్యములఁ బద్మినులు తెఱచె
భానూష్మభీత మున్పడిన చుక్కలభంగి
దొరలె వేకువగాలిఁ దరులమంచు

గీ. కాలగుణయుక్తి మింటి చక్కటికి నెగయు
వాసవునపట్టి పొడవుగా వైచియాడు
గచ్చుచమరిన దారుచక్రింపుబిళ్ళ
వోలె నొయ్యనఁ బ్రాచి లేఁ బ్రొద్దుపొడిచె. 40

టీ: తొలిదిక్కు జవరాలు=తూర్పుదిక్కనెడి యువతి; శశి=చంద్రుడు; తనున్=తన్ను; పాసి=విడిచి; దవ్వ=దూరముగా; చనిన నెవ్వగన్+పోలెన్ =

వెళ్ళిన విచారముతోవలె; వెలుకబాఱెన్ = వెలవెల పోయెను; ప్రథమాద్రిసభ యందున్ = తూర్పుకొండ యనెడి సభలో; పఱచిన = కూర్చుండుటకై వేసిన; కెంపు+పట్టు=ఎఱ్ఱని పట్టుతో చేసిన, జముకాణ మనగన్ = దళసరియైన పక్క బట్టయో యన్నట్లు; రాగము=ఎరుపుకాంతి; జనించెన్=పుట్టెను; పద్మినులు= తామరలనెడి మంచిరకపు వనితలు; ధవున్=భర్తను—సూర్యున; కూర్మి=ప్రేమను; కొసరుచున్నవి పోలెన్ = కొంచెకొంచెముగా నిమ్మని ప్రార్థించుచున్నట్లుగా; ముఖర=కూసెడి; ఆళి=తుమ్మెదలుకల; వనరుహ + ఆస్యములన్=పద్మములనెడి ముఖములను; తెఱచెన్=వికసింప చేసినవి; భాను + ఊష్మభీతిన్=సూర్యుని వేడి వలని భయముచే; మున్=ముందుగా; పడిన=రాలిన; చుక్కల భంగిన్=నక్షత్ర ములవలె; వేకువగాలిన్=తెల్లవారు జామున వచ్చెడి గాలిచే; తరులమంచు=చెట్ల మీద పడిన మంచు; దొరలెన్=బొట్లుబొట్లుగా రాలెను; వాసవునిపట్టి=ఇంద్రుని కొడుకగు జయంతుడు; కౌలగుణయుక్తిన్ = కౌలమనెడి త్రాటికి కట్టి; మింటి చక్కటికిన్=ఆకాశము మీదికి; ఎగయన్=ఎగురునట్లు; పొడవుగా వైచియాడు =పొడవుగా వేసి ఆడుకొనెడి; గచ్చుచమరిన=గచ్చుపూసిన; దారుచక్రంపు బిళ్ళ పోలెన్=కఱ్ఱతో చేసిన గుండ్రని బిళ్ళవలె, ఒయ్యనన్= మెల్లగా; ప్రాచిన్= తూర్పున; లేప్రొద్దు=బాల సూర్యుడు; పొడిచెన్=ఉదయించెను.

తా: తూర్పు తెలవారినది. తూర్పున నెరుపురంగు పట్టినది. తామరపూలు వికసించినవి. చెట్లమీద పడిన మంచు చిరుగాలికి క్రిందికి రాలినవి. సూర్యుడుదయించెను. అలం. ఉత్ప్రేక్ష.

క. ఈగతి నత్తఱిఁ దెలతెల
వేగిన గంధర్వపతికి వేగుట విని తా
రాగమున కేఁగి కాంచిరి
రాగమ్మునఁ గొలిచి మను పురాతన ఖచరుల్. 41

టీ: అత్తఱిన్=అప్పుడు; ఈగతిన్=ఈరీతిగా; తెలతెలవేగినన్=తెల్లగా తెల్లవారగానే; గంధర్వపతికిన్=ఇందీవరాక్షునికి; వేగుట=శుభము కల్గుట; విని; రాగమ్మునన్=అనురాగముతో; కొలిచి=సేవించి; మను=బ్రతికెడి; పురాతన ఖచరుల్=ఇదివరకటి గంధర్వులు; తారాగమునకున్=వెండికొండకు; ఏగి=వెళ్ళి కాంచిరి=చూచిరి.

తా: ప్రొద్దుపొడువగానే ఇందీవరాక్షునికి శాపము తీరినట్లువిని ఆ గంధర్వు లతనిచూచుట కేగిరి.

ఉ. కాంచినఁ బొంగి వారొసఁగు కానుక లర్థిఁ బరిగ్రహించి మ
న్నించి పురప్రయాణరతి నిక్క నరేంద్రుఁడు మున్నుగాఁ దటి
చ్చంచలవాహహైమ మణుల చాయల దిక్కు లలంకరించు హా
న్నంచు రథంబు చాఁగు బళియంచు నకీబులు ప్రామాయనెక్కనన్.

టీ: కాంచినన్ = వారు చూడగానే; పొంగి=సంతోషించి; వారు= ఆ గంధర్వులు; ఒసగు కానుకలు = ఇచ్చునట్టి కొన్కలు; అర్థిన్=ప్రీతితో; పరిగ్రహించి=పుచ్చుకొని; మన్నించి=గౌరవించి; పురప్రయాణరతిన్=పట్టణమునకేగవలెనని కోరిక; నిక్కన్=ఎక్కువకాగా; నకీబులు=వెండిబెత్తము ధరించిన బంట్రోతులు; 'బాఁగు, బళి' అంచున్; మ్రోయన్=కేకలు వేయగా; తటిత్=మెరుపులవలె; చంచల=చంచలమైన; వాహమై = గుర్రములు కలదై; మణుల చాయలన్=రత్నకాంతులచే; దిక్కులు=ప్రదేశములను; అలంకరించు = అలంకారముచేయునట్టి; హొన్నంచు = బంగారపుటంచులుకల; రథంబు=రథమును; నరేంద్రుడు=స్వారోచి; మున్నుగాన్=ముందుగా; ఎక్కినన్=ఎక్కగా...

తా: ఇందీవరాక్షుడు తన ప్రాచీన సేవకులు వచ్చి కానుకల నియ్యగా నందుకొని వారిని తగురీతిగా గౌరవించి, వేగములుకల గుర్రములు పూన్చి, బంగారుపూత పెట్టిన రథమును స్వారోచి ముందుగా నెక్కగా తా నెక్క...

క. నందనయు నుచితరత్న
స్యందనమునఁ జనియె నర్థి జనకునిబడి న
య్యిందీవరాక్షుఁ డీగతి
మందరమున కెగయ గగన మార్గమునందున్. 43

టీ: నందనయున్=కూతురైన మనోరమయు; ఉచిత=తగిన; రత్నస్యందనమునన్=రత్నములు పొదవిన రథముపై; అర్థిన్=ప్రీతితో; జనకునిబడిన్=తండ్రి వెంటనే; చనియెన్=వెళ్లెను; ఈ గతిన్ = ఇట్లు; ఆ+ఇందీవరాక్షుడు; గగన మార్గమునందున్=ఆకాశమువీద; మందరమునకున్+ఎగయన్=మందర పర్వతమునకేగుటకై యెగురగా......

సీ. మండిగా లిడి దంత శుండాగ్రహతిఁ జించి
జలధరాంభముఁ గరుల్ చల్లు లాడ
నహిమాంశుహయహేష లాలించి చెవి వంచి
కెరలి వాజులు బయల్ గోరిజఁ ద్రవ్వ
ధ్వజవాతహతి నార వైద్యుతాగ్నులఁ జూఁడి
పగలు దివిలయువారు పంజు లెత్త
బెటులు చప్పుడు లాత్మ భీరుస్వయంగ్రహ
పరిరంభసుఖము ఖేచరుల కొసఁగ

గీ. జామరప్రభ గగన గంగా మరాళ
చకచకభ్రమ మొదవింప శంకరాద్రి

కాననము మొదలు మందరా । గంబు దాఁకఁ
బౌజు వెట్టిరి దన్మూల । బలము నొగలు. 44

టీ: కరుల్ = ఏనుగులు; మండెగాలిడి = ఒకకాలు ముడిచి, ఒకకాలు వంచి కూర్చుండి; దంత = దంతములయొక్క; శుండా + అగ్రహతిన్ = తొండముయొక్క చివరతో కొట్టుటతో; చించి = మబ్బులను చినుఁగఁగొట్టి; జలధర + అంభములన్ = మేఘములలోని నీటిని; చల్లులాడన్ = చల్లుకొనుచు క్రీడింపఁగా; వాజులు = గుఱ్ఱములు; అహిమాంశు = వేడియైన కిరణములు కల సూర్యుని యొక్క; హయహేషలు = గుఱ్ఱముల సకిలింతలు; చెవివంచి = చెవియొగ్గి; ఆలించి = విని; కెరలి = కోపించి; బయల్ = ఆకాశమున; గొరిజన్ = గిట్టను; త్రవ్వన్ = దూయఁగా; పగలుదివియల వారు = పగటివేళ దివిటీలు వేసెడివారు; ధ్వజ = జెండాలయొక్క; వాతహతిక్ = గాలితాకుడుచే; ఆఱన్ = ఆరిపోఁగా; వైద్యుతాగ్నులన్ = మెఱుపుల నిప్పులచే; చూఁడి = వెల్గించి; పంజులు = దివిటీలును; ఎత్తన్ = ఎత్తిపట్టఁగా; పెటులు చప్పుడులు = కొమ్ముబూరల చప్పుళ్ళు; ఆత్మ = తమయొక్క; భీరు = భయపడెడి భార్యల యొక్క; స్వయంగ్రాహ = తమంతటతాము పట్టుకొనెడి; పరిరంభ సుఖము = కౌఁగిలింతల వలని సుఖమును; ఖేచరులకున్ = దేవతలకు; ఒసఁగన్ = ఇయ్యఁగా; చామర ప్రభ = వింజామరలకాంతి; గగనగంగా = ఆకాశగంగలోని; మరాళభ్రమము = హంసలేమో యన్న భ్రాంతిని; శంకరాద్రికాననము = కైలాసముమీఁది యడవి; మొదలు = మొదలు; మందర + అగంబుదాఁకన్ = మందరపర్వతము వరకును; తత్ + మూలబలము నొగలు = ఇందీవరాక్షుని ప్రధాన సేనాధిపతులు; పౌజువెట్టిరి = సేనల నడపిరి.

తా: ఇందీవరాక్షుఁడు ప్రయాణము కాఁగానే అతని సేనాపతులు కైలాసము మొదలు మందర పర్వతము వరకు సేనలను సాగించిరి. ఆ సేనలోని యేనుగులు దంతములతో పొడిచి, తొండములతో కొట్టి మేఘముల నుండి నీటి నెగురఁగొట్టి జల్లులు మీఁదపడునట్లాడు చున్నవి. గుఱ్ఱములు సూర్యరథాశ్వముల సకిలింపులు విని కయ్యమునకు కాలు ద్రవ్వుచున్నవి. దివిటీలవారు జెండాల గాలికి దివిటీలారిపోఁగా మెఱుపుల మంటలకు వెలిగించిరి. కొమ్ముబూరల చప్పుళ్ళ కదరి భార్యలు తమంతట తాము వచ్చి కౌఁగిలించు కొనఁగా ఆసుఖమును దేవత లనుభవించిరి. వింజామర లాకాశ గంగలోని హంసలేమో అన్నట్లున్నవి. అలం. ఉదాత్తము. ఉత్ప్రేక్షయు.

క. కుంజరశతాంగహయభట
రంజితమై పై రజఃప । రంపర లలగున్
మంజులకాంతిఁ గసీసపు
మాంజిష్టముఁ బోలె గగన । మండప మమరెన్. 45

టీ: గగనమండపము = ఆకాశమనెడి మంటపము; కుంజర = ఏనుగులతోను; శతాంగ = రథములతోను; హయ = గుఱ్ఱములతోను; భటరంజితమై = భటులతోను ప్రకాశింపబడినదై; పైన్ = వానిపై; రజఃపరంపరలు = దుమ్ము వరుసలు; అలమన్ =

వ్యాపించగా, మంజులకాంతిన్=మంచికాంతితో; కసీసపుమాంజిష్ఠముబోలెన్=ఎఱుపును మించిన పసుపు రంగు వేసిన నీలిచీరవలె; అమరెన్=ప్రకాశించెను.

తా: అప్పుడా సేన నడువగా సేన దొంతరలుగానుండి, పైన పరాగము క్రమ్మగా పసుపు నెఱుపు కలిసిన నీలిచీరవలె ప్రకాశించెను. అలం: ఉత్ప్రేక్ష.

తే. సారిది నీరీతి దివిఁ దోడు ౯ సూపి నట్టి
దొరలు గొలువంగ ఖచరేంద్రుఁ ౯ డరిగి యరిగి
మింట గ్రహరాజు తనసగ ౯ మింట వెలుఁగు
మంథగిరిఁ గాంచి పలికె న ౯ మ్మనుజపతికి. 46

టీ: ఖచరేంద్రుడు=గంధర్వరాజు; సారిదిగా=క్రమముగా; ఈరీతిగా=ఇట్లు; దివిన్=ఆకాశమున; తోడు=సహాయము; చూపినట్టి దొరలు=కనపరచిన సేనానులు; కొలువంగన్=తన్ను సేవింపగా; అరిగి యరిగి=వెళ్ళి వెళ్ళి; మింటన్=ఆకాశమున; గ్రహరాజు=సూర్యుడు; తనసగమింటన్=తన మధ్యభాగమున; వెలుగు=ప్రకాశించెడి; మంథగిరిన్; కాంచి=చూచి; ఆ+మనుజపతికిన్=ఆ స్వారోచితో; పలికెన్=అనెను.

తా: ఇట్లు సేనాపతులు సేవించగా ఇందీవరాక్షుడు ప్రయాణముచేసి తన మధ్యన వెలిగెడి సూర్యుడుకల మందర పర్వతమును చూచి స్వారోచితో ననెను.

సీ. జరఠకచ్ఛపరాజు ౯ చరమాంగగృహమేధి
భోగివేష్టనరేఖఁ ౯ బొలుచు జాణ
కులములోఁ దరితీపు ౯ గలిగి మించిన మేటి
మైనాకు నొరసిన ౯ మాసటీఁడు
తొలువేలుపులవేలు ౯ పులపనుల్ గొనుఱేఁడు
కడలిరాయలలోఁతు ౯ గన్న గబ్బి
సురరాజునకుఁ బాండు ౯ కరిఁ జేర్చు మరకాఁడు
కల్పకంబుల పంట ౯ కమ్మతీఁడు.
గీ. కంటె మథితసుధాధౌత ౯ కటకజాత
చంపకవనప్రకంపనా ౯ కంపవిసర
దఖరముఖరవమధుకర ౯ ముఖరశిఖర
నందరసమందిరం ౯ బగు మందరంబు. 47

టీ: జరఠకచ్ఛపరాజు = ముసలివాడైన ఆదికూర్మము యొక్క; చరమ+అంగము=వీపునందలి; గృహమేధి = గృహస్థు—కాపురము చేయువాడు; భోగివేష్టన రేఖన్=వాసుకిని చుట్టుటచే నేర్పడిన రేఖచే; పొలుచుజాణ=ప్రకాశించువాడు; కులములో=తనవారిలో; తరితీపు కలిగి=గొప్పతనముకల్గి; మించినమేటి=

అతిశయించెడి గొప్పవాడు; మైనాకున్ = మైనాకుడను హిమవంతుని కొడుకైన పర్వతమును; ఒరసినమాసటీడు = సరిపోలిన మల్లుడు; తోలువేలుపుల = రాక్షసుల యొక్క; వేల్పుల = దేవతలయొక్క; పనులు = మథించెడు పనులను; కొనరేడు = పరిగ్రహించినరాజు; కడలిరాయలలోతు = పాలసముద్రపులోతును; కన్నగబ్బి = చూచిన గొప్పవాడు; సురరాజునకున్ = ఇంద్రునకు; పాండుకరిన్ = తెల్లని యేనుగును—ఐరావతమును, చేర్చుమరకాడు = చేర్చినా యోడవాడు; కల్పకంబులపంట = కల్పవృక్షములను పండించిన; కమ్మతీడు = కమతగాడు—రైతు; మథిత...మందరంబు—మథిత = మంథింపబడిన; సుధాధౌత = అమృతముచే కడుగబడిన; కటకజాత = మధ్యనుండి పుట్టిన; చంపకవన = సంపెంగతోట యందలి; ప్రకంపన = గాలిచే; ఆకంప = కొద్దిగా కదల్పబడిన; విసరత్ = తిరిగెడి; అఖరముఖ = మృదువైన ముఖముల నుండి; రవ = ధ్వనిచేయు; మధుకర = తుమ్మెదలచే; ముఖర = మ్రోగుచున్న; శిఖర = శిఖరములచే; నందరసమందిరంబగు = ఆనందమునకు పుట్టిల్లైన; మందరంబు = మందరపర్వతమును; కంటె = చూచితివా ?

తా: రాజా! మందరమును చూచితివా? ఇది ఆదికూర్మము వీపునున్నది. వాసుకి చుట్టినరేఖకలది. కులపర్వతములలో గొప్పది. మైనాకమునకీడు—జోడైనది. దేవదానవులచే పనిచేయించుకొని పాలసముద్రము లోతు చూచి, ఇంద్రునకైరావతమును, కల్పవృక్షముల నిచ్చినది. అమృతముతో తడిసిన ప్రదేశములలో మొలచిన సంపెంగ తోటలమీదినుండి వచ్చు గాలులచే కొదసేయుచు పరుగెత్తు తుమ్మెదల ఝుంకారములతో ధ్వనించు శిఖరములతో ఆనంద రసమున కాటపట్టయినది. (ఇచ్చట సంపెంగ వాసనలకు తుమ్మెద లాకర్షింపబడినవని చెప్పబడినది. ఆ గాలి కాకర్షింపబడినను వాటిపై వ్రాలక తిరుగుచున్నవని యూహింపనగును.) అలం. ఉదాత్తము.

శా. వైకుంఠాంగదహేమ మాతతవల ద్వాతాశనాకృష్టరే
ఖాకారంబులఁ జుట్టు నంటి మొలనూ లై మేటి యొడ్డాణమై
శ్రీకారప్రభఁ గంఠమై శిఖరిరా ట్సింహాసనోల్లసత్పట్టమై
యాకొండం గనుఁగొంటె మాయ దిపుడున్ హేరాళఘుం గాం
తులన్. 48

టీ: వైకుంఠ+అంగదహేమము = విష్ణుని భుజకీర్తుల బంగారము; ఆతత = ఎక్కువగా; వలత్ = చుట్టిన; వాత+అశన = గాలిమేయు—వాసుకిచే; ఆకృష్ట = త్రిప్పబడిన; రేఖాకారంబులన్ = రేఖలయాకారములలో; చుట్టును+అంటి = చుట్టువారల నంటుకొని; మొలనూలై = మొలత్రాడై; మేటియొడ్డాణమై = గొప్పదైన నడుమునకు పెట్టుకొను నాభరణమై; శ్రీకారప్రభన్ = శ్రీకారముయొక్క కాంతిచే; కంఠమై = కంఠమున కాభరణము—కంటెయై; శిఖరిరాట్సింహా = పర్వతరాజుయొక్క; ఉల్లసత్ = ప్రకాశించెడి; పట్టమై = పట్టాభిషేకము వేళ నొసటకు

గట్టుకొను బాసికరైయై; ఈ కొండన్=మందరపర్వతమున; హేరాళ ఫుంగాంతులన్ =ఎక్కువైన కాంతులతో; ఇపుడున్=ఇప్పుడుకూడ; మాయదు=మాసిపోదు.

తా: మంధరపర్వతమునకు వాసుకిని చుట్టిన రేఖలు క్రిందినుండి పైకి నాల్గుగాట్లుగా నున్నవి. ఆ గంట్లలో విష్ణుమూర్తియొక్క భుజ కీర్తుల బంగార మంటుకొన్నది. అది మొల నూలుగాను, ఒడ్డాణముగాను, కంటెగాను, బాసికముగాను ఇప్పటికిని మెరయుచున్నది. అలం. ఉల్లేఖము.

తే. వేదవేదాంతముల వేధ ౯ వెదకి కనని
పద్మలోచను శ్రీపాద ౯ పంకరుహము
లబ్జరేఖాంకితము లవే ౯ యచల వంశ
వల్లభుని మేఖలాసీమ ౯ నెల్ల మెఱయు. 49

టీ: వేధ=బ్రహ్మ; వేద=వేదములందును; వేదాంతములన్=ఉపనిషత్తులందును; వెదకి; కనని=చూడలేని; పద్మలోచను=విష్ణుమూర్తియొక్క; శ్రీపాద పంకరుహములు = పద్మమువంటి పాదములు; అబ్జరేఖాంకితములు=పద్మరేఖలతో చిహ్నితమైనవి; అవే=అవిగో; అచలవంశ వల్లభుని = పర్వతములలో శ్రేష్ఠుడైన మందర పర్వతుని యొక్క; మేఖలాసీమన్=మధ్యప్రదేశమున; ఎల్లన్=అంతటను; మెరయున్=ప్రకాశించు చున్నవి.

తా: బ్రహ్మ యంతటి వానికి వేద వేదాంతముల వెదకినను కన్పడని శ్రీవిష్ణుమూర్తి పాదములు అవిగో! ఈ మందర పర్వతమున మధ్యప్రదేశమున అంతటను మెరయుచున్నవి. అలం. విశేషము.

ఉ. నాలుకబంతి వ్రేలఁబడి ౯ నంజునఁ దోఁగి తమాలపల్లవ
శ్రీల హసింప నుబ్బి కను ౯ గ్రేవల జేవుఱు పుక్కిలింపఁగా
వాలికమేని పేఁ చెగయ ౯ వాడినమాల్యము వోలె నాదిమ
వ్యాళము గీనిపగ్గమయి ౯ నట్టి యవస్థఁ దలంతు నెప్పుడున్. 50

టీ: ఆదిమవ్యాళము = మొదటి పామైన వాసుకి; నాలుకబంతి=నాలుకల వరుస; వ్రేలబడి=క్రిందికివ్రాలి; నంజునన్=విషముచే; తోఁగి=తడిసి; తమాల పల్లవశ్రీలన్=తాపింఛపుచెట్ల చిగుళ్ళ కాంతులను; పరిహసింపన్=నవ్వగా—ఖంచగా; జేవుఱుకనుఁగ్రేవలన్=ఎర్రనైన కనుగొలకులందు; ఉబ్బి=ఉబికి; పుక్కిలింపగాన్ = బయటికిరాగా; వాలికమేనుపేచు = పొడవైన శరీరముయొక్క పైచర్మము; ఎగయన్=పైకిలేవగా; వాడినమాల్యమువోలెన్ = వాడినమాలవలె; గీనిపగ్గము+అయినట్టి యవస్థన్=ఈ కొండకు కవ్వపు త్రాడైనదశను; ఎప్పుడున్; తలంతున్=తలచెదను.

తా: దేవాసురులు వాసుకిని కవ్వపు త్రాడుగా దీనికి చుట్టినప్పటి దానిబాధ నాకు మరపురాదు. అపుడా వాసుకి విషము క్రక్కుచు, విషముచే తడిసిన నాలుకల

వరుస తాపింఛపు చిగుళ్ళవలె వ్రేలాడు చుండగా పైచర్మము (కుబుసము) పైకి రేగగా కన్నులెఱ్ఱపడి నెత్తురు క్రక్కుచుండెను. అది వాడిన పూలమాలవలె నైనది. అలం. ఉపమ, భావికము.

చ. బిలముఖపంక్తినీధరణి భృత్పతివారిధినిర్భరభ్రమిన్
దళముగ మున్ను ద్రావిన సుధారసధారగుణంబునం జుమీ
పలితవికారదూరనిర పాయసుఖస్థితిఁ గాంచె నాఁగఁ గో
మలవిచలచ్ఛిరోరుహ తమాలవినీలిమరేఖ యొప్పెడిన్. 51

టీ: ఈ ధరణిభృత్పతి = ఈ కొండలరాజు; మున్ను = పూర్వము; బిలముఖ పంక్తిన్ = గుహలనెడి నోళ్ళ వరుసలచే; వారిధి = పాలసముద్రముయొక్క; నిర్భర = ఎక్కువైన; భ్రమిన్ = తిరుగుటలచే; దళముగన్ = ఎక్కువగా; ద్రావిన = త్రాగిన; సుధారసధార = అమృతధారయొక్క; గుణంబునన్ — శక్తిచే; చుమీ = సుమా; పలితవికార = తలనరయుట మున్నగు ముసలితనపు వికారములకు; దూర = దూరమైన—లేని; నిరపాయసుఖ = అపాయములేని, సుఖకరమైన; స్థితికిన్ = ఉండుటను; కాంచెన్ = పొందెను; నాగన్ = అనునట్లు; కోమల = మృదువైన; విచలత్ = కదలెడి; శిరోరుహ = తలవెంట్రుక లనెడి; తమాల = తాపింఛపుచెట్లయొక్క; నీలిమ = నలుపుయొక్క; రేఖ = గీత; ఒప్పెడిన్ = ప్రకాశించు చున్నది.

తా: ఈ మందర పర్వతము పూర్వము పాలసముద్రమున కవ్వమై తిరుగు నప్పుడు గుహలద్వారా అమృతమును త్రాగినందున నేమో పైన తాపింఛ వృక్షముల వరుస యనెడి నల్లని జుట్టు కల్గియున్నది. అమృతము త్రాగినందున తలనరయనట్లున్నది. అలం. ఉత్ప్రేక్ష, గూఢకము.

చ. జడధి మథింపఁ జిక్కు సుధ సౌరభ మానుటఁ జావు దక్కి యా
పడఁకులనుండి దుగ్ధభవ పాండిమ బొందుల నంద మొందఁ ని
దడవిమెకాలతోఁ గదుపులై చరియించును మేఁతకై బయల్
వెడలి ధునీకుళీరశకులీ మకరీముఖవారిజంతువుల్. 52

టీ: జడధి = పాలసముద్రమును; మథింపన్ = మథించగా; చిక్కు = తగుల్కొని; సుధసౌరభమున్ = అమృతపు సువాసనను; ఆనుటన్ = త్రాగుటచేత; చావుతక్కి = చావులేక; దుగ్ధభవపాండిమ = పాలనుండి పుట్టిన తెలుపు; బొందులన్ = శరీరములందు; అందమొందన్ = అందగించగా; ఇంగున్ = ఈ కొండయందు; ఆపడఁకులనుండి = రాళ్ళసందులనుండి; ధునీ = ఆడుతాబేళ్ళు; కుళీర = పీతలు; శకులీ = ఆడుచేపలు; మకరీ = ఆడుమొసళ్ళు; ముఖవారి జంతువుల్ = మొదలైన జలచరములు; అడవిమెకాలతోన్ = అడవి మృగములతో; మేఁతకై = మేత మేయుటకై; బయల్వెడలి = బయటికివచ్చి; కదుపులై = మందలై; చరియించున్ = సంచరించుచుండును.

తా: పాలసముద్రమును మథించినపు డడుగున చిక్కుకొని యుండుటచే అమృతపు సువాసన తగిలినందున చావులేనివై పీతలు, మొసళ్ళు, తాబేళ్ళు, మున్నగు నీటి జంతువులు నే డడవి మృగములతో పాటు మేతకై మెట్టన తిరుగు చున్నవి. అలం. ఉత్ప్రేక్ష.

మ. అనుచుం జందనపంకపంకిలతలం § బై కేతురుద్ధాతపా
ధ్వ నిరుష్ణంబయి మంచకోపరికుటీ § వాటీనటన్నర్తకీ
జనమై యూవతసర్వతఃకలితవీ § క్షాతోరణస్రఙ్నిబం
ధనమై యొప్పు పురంబు సొచ్చి భవన § ద్వారప్రఘాణంబునన్.

టీ: అనుచున్; చందనపంక=పల్చగానున్న మంచిగంధము నీళ్ళచే; పంకిల=బురదైన; తలంబై=భూప్రదేశము కలదై; కేతు=జెండాలచే; రుద్ధ=అడ్డపెట్టబడిన; ఆతప=ఎండకలదగుటచే; అధ్వ=దారిలో; నిరుష్ణంబయి = వేడిలేనిదై; మంచక+ఉపరి = చప్పరములపై; కుటీ=గుడిసెల యొక్క; వాటీ=వాడలందు; నటత్ = నాట్యముచేయు; నర్తకీజనమై=నాట్యముచేసెడు స్త్రీలు కలదై; యూవత=పడుచు స్త్రీల సముదాయము యొక్క; సర్వతః=అంతటను; కలిత=నిండిన; వీక్షాతోరణ = చూపులనెడి తోరణములైన; స్రక్+నిబంధనమై = మాలలకట్టు కలదై; ఒప్పు=ప్రకాశించెడి; పురంబు=పట్టణమును; చొచ్చి=ప్రవేశించి; భవన ద్వార=ఇంటిగుమ్మము ముందరి; ప్రఘాణంబునన్=చావడిలో...

తా: ఇందీవరాక్షు డిట్లు స్వారోచితో మందర పర్వతమును గూర్చి చెప్పుచు మంచిగంధము నొత్తుగా చల్లి, ఎండ తగులకుండునట్లు జెండా లెత్తి, ఎత్తైన మంచెలమీద కట్టబడిన చిన్న యిండ్లలో నాట్యముచేయు వనితల చూపులనెడి తోరణములు కట్టబడిన నగరమును ప్రవేశించెను. క్రమముగా తన భవనము ముందరి సావడిలో......

క. మంతుల బాంధవభటసా
మంతుల నాశ్రితుల నిలిపి § మహీకాంతు నిశా
కాంతమణికాంతికందళ
కాంతం బగు నొక్కదొరగ న § గర విడియించెన్. 54

టీ: మంతులన్=మంత్రులను; బాంధవ = బంధువులను; భట=బంట్లను; సామంతులను=చిన్నరాజులను; ఆశ్రితులన్ = ఆశ్రయించిన వారిని; నిలిపి=తగు చోట్ల నిలువ నాజ్ఞయిచ్చి; మహీకాంతుత్=స్వరోచిని; నిశాకాంతమణికాంతి=చంద్రకాంత మాణిక్యపు కాంతుల యొక్క; కందళకాంతంబగు = అంకురములచే సుందరమైన; ఒక్కదొరనగరన్=ఒకరాజగృహమున; విడియించెన్=విడియునట్లు చేసెను.

తా: ఇందీవరాక్షుడు మంత్రిసామంత బంధు పురోహితాదులను తగురీతిగా నాగుమని సెలవిచ్చి స్వరోచి నొక్క చంద్రకాంతపు రాజభవనము విడియించెను.

వ. విడియించి యనంతరంబ యంతఃపుర కాంతా కరాంత తంతన్యమాన మణిభాజన నీరాజన మంగళంబు లంగీకరించి ప్రియాంగనల సంభావించి మగుడ నాస్థానమండపంబున కేతెంచి మతంగమంకిమంకణ మందపాలమరీచి మాండవ్య మార్కండేయాది మహామునుల రావించి లగ్నంబు నిశ్చయించి గగనచరజంఘాలకర ప్రేషిత లేఖతరులేఖాముఖంబులఁ జిత్రరథ చిత్రాయుధ చిత్రసేనాదు లగు గంధర్వులను వరాహకర్ణ గజకర్ణ సుకేతు మాణిభద్ర ప్రముఖయక్షులను రేవంత ప్రముఖగుహ్యకులను మందార ముఖ్యవిద్యాధరులను బిలిపించి వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞాపనపత్రిక లిఖయించి నిజప్రధానులంబంచి నలకూబరు రావించె నంత. 55

టీ: విడియించి; అనంతరంబ = వెంటనే; అంతఃపురకాంతా = రాణివాసపు స్త్రీల యొక్క; కర + అంత = అరచేతులందు; తంతన్యమాన = విస్తరింపచేయబడు చున్న; మణిభాజన = మణిమయమైన పళ్ళెరములతోడి; నీరాజనమంగళంబులు = నివ్వాళులిచ్చు శోభన క్రియలు; అంగీకరించి = గ్రహించి; ప్రియా + అంగనలన్ = భార్యలను; సంభావించి = మన్నించి; మగుడన్ = మరల; ఆస్థానంబునకున్ = కొలువు కూటమునకు; ఏతెంచి = వచ్చి; మతంగ...మునులన్ = మతంగుడు, మంకి, మంకణుడు, మందపాలుడు, మరీచి, మాండవ్యుడు, మార్కండేయుడు మున్నగు మహర్షులను; రావించి; లగ్నంబు = వివాహ సుముహూర్తమును; నిశ్చయించి; గగనచర = దేవతలలో; జంఘాల = త్వరితముగా పోవునట్టివాని యొక్క; కర = చేతికిచ్చి; ప్రేషిత = పంపబడిన; లేఖతరు = కల్పవృక్షము వలన వచ్చిన; లేఖాముఖంబులన్ = శుభలేఖలమూలమున; చిత్రరథ...గంధర్వులను = చిత్రరథుడు, చిత్రాయుధుడు, చిత్రసేనుడు మొదలైన గంధర్వులను; వరాహ...యక్షులను = వరాహకర్ణుడు. గజకర్ణుడు, సుకేతుడు, మాణిభద్రుడు మున్నగు యక్షులను; రేవంతప్రముఖ = రేవంతుడు మొదలైన; గుహ్యకులను; మందారముఖ్య = మందారుడు మొదలైన; విద్యాధరులను; పిలిపించి; వినయపూర్వకంబుగా = వినయముతో; విత్త + అధిపతికిన్ = ధనపతియైన కుబేరునికి; విజ్ఞాపనపత్రికన్ = మనవి వ్రాసికొను లేఖను; లిఖియించి = వ్రాసి; నిజప్రధానులన్ = తనమంత్రులను; పంచి = ఆజ్ఞాపించి; నలకూబరున్ = కుబేరుని కొడుకును; రావించెన్. అంతన్...

క. పసుపుల నలుఁగిడి రైదువ
బిసరుహాలోచనలు పెండ్లి పెద్దల యాజ్ఞన్
వసుధాధ్యక్షుబుభుక్షున
కసితాలకభరకుఁ బేరఁ టాండ్రోగిఁ బాడన్. 56

టీ: వసుధా+అధ్యక్షుబుభుక్షునకున్ = రాజేంద్రుఁడైన స్వారోచికి, అసిత+అలకభరకున్ = నల్లని ముంగురులుకల మనోరమకును; ఐదవబిసరుహలోచనలు = ముత్తైదువలు; పెండ్లి పెద్దల యాజ్ఞన్ = పెండ్లి పెద్దలు చెప్పినట్లుగా; ఒగిన్ = వరుసగా; పేరఁటాండ్రు = పేరంటమునకు వచ్చిన ముత్తైదువలు; పాడన్ = పాటలు పాడగా; పసుపుల నలుఁగు = పసుపుకలిపిన నలుగును; ఇడిరి = పెట్టిరి.

తా: పేరంటమునకు వచ్చిన పుణ్యస్త్రీలు పాటలు పాడగా కొందరు పుణ్యస్త్రీలు స్వారోచికి, మనోరమకును పసుపుతో కలిపిన పిండితో నలుగులు పెట్టిరి.

ఉ. మజ్జన మాడె రాజు కృశ § మధ్యమ లింపున వంప గుంపులై
గొజ్జెఁగనీటివెల్లువలు § గోవజవాజుల నిగ్గుఁ జూపఁ జం
చజ్జరఠాహికంచుకము § చాయమడుంగుల నొత్తెఁ జెమ్మనీ
రుజ్జగిల న్వహించె మెయి § నూఁదిన బాఱు మకూలచేలముల్. 57

టీ: రాజు; కృశమధ్యములు = స్త్రీలు; ఇంపునన్ = ఆనందముతో; గుంపులై = గుమిగూడి; వంపన్ = పోయగా; గొజ్జెఁగ నీటి వెల్లువలు = పన్నీటి ప్రవాహములు; గోవజవాజులనిగ్గున్ = గోవాదేశపు జవ్వాది పరిమళమును; చూపన్ = చేయగా; మజ్జనమాడెన్ = స్నానము చేసెను; చంచత్ = ప్రకాశించెడి; జరఠ+అహి = ముసలి పామైన ఆదిశేషుని యొక్క; కంచుకముచాయ = కుబుసమువలెనున్న; మడుంగులన్ = చలువబట్టలతో; చెమ్మనీరు = నీటితడి; ఉజ్జగిలన్ = పోవునట్లు; ఒత్తెన్ = అద్దెను; ఊఁదినన్ = నోటితో ఊదినంత మాత్రాన; బాఱు = ఎగిరెడి; మకూలచేలముల్ = పట్టుబట్టలను; వహించెన్ = కట్టెను.

తా: స్వారోచి పరిచారికలు పన్నీరు ప్రవాహముగా పోయగా తాన మాడెను. చలువ బట్టలతో తడియొత్తికొని పాము కుబుసముల వంటి పట్టుబట్టల ధరించెను. అలం. నిదర్శన, అతిశయోక్తి.

చ. గరువున కొత్త జెంగలువ § కచ్చు ఘటించిన మాళిఁ జుట్టెఁ జెం
దిరిక చెఱంగునం బసిఁడి § తీఁగెలు నించిన జిల్గుపాగ బం
భరసభవాసనాపవన § పారణఁ దేల నలందెఁ గస్తురిన్
మరకతమౌక్తికాదిమణి § మండనమండితుఁ డయ్యె నయ్యెడన్. 58

టీ: అయ్యెడన్ = అప్పుడు; గరువునకున్ = ఒక చెంపకు; ఒత్తన్ = ఒరుగునట్లు; చెంగలువకచ్చు = ఎఱ్ఱకలువ పూలబంతి; ఘటించిన మాళికిన్ = ముడిచిన సిగపైన; చెందిరిక చెఱంగునన్ = చంద్రకావి బట్టకొంగున; పసిఁడితీఁగలు = బంగారు జలతారు; నించిన = గుప్పిన; జిల్గుపాగన్ = సన్నని తలపాగను; చుట్టెన్ = చుట్టుకొనెను; బంభరసభ = తుమ్మెదలగుంపు; వాసనాపవనపారణన్ = పరిమళించుగాలిని తినుటచే; తేలన్ = ఆనందింపగా; కస్తూరిన్ = కస్తూరిని; అలందెన్ = పూసికొనెను; మరకత = పచ్చలు; మౌక్తిక = ముత్యములు; ఆది = మొదలైనవి; మణిమండన = మణులు గుప్పిన ఆభరణములచే; మండితుఁడు = అలంకరింప బడినవాడు; అయ్యెన్.

తా: అప్పుడు ఎఱ్ఱకలువ పూలగుత్తి ఒక చెంప కొరగునట్లు సిగలో తురిమెను. చంద్రకావి బట్టపై బంగారు పోగులు గుప్పిన సన్నని తలపాగను చుట్టుకొనెను. కస్తూరి పూసికొనెను. మణులు గుప్పిన ఆభరణముల నలంకరించు కొనెను. అలం. స్వభావోక్తి.

మ. కదిసెన్ లగ్న మటంచు మంత్రులు దొరల్ గంధర్వరాజాజ్ఞ ను
న్మదవేదండఘటాభటాశ్వరథసేనాజైత్రవాదిత్రసం
పదమీఱం జనుదెంచి కాంచి ముద మొప్పం జేసి రారూఢుఁగాఁ
గదళీకాంచనకక్ష్యల న్మెఱయు లేఖస్వామిచౌదంతిపైన్. 59

టీ: మంత్రులు; దొరల్ = సామంతులును; లగ్నము = సుముహూర్తము; కదిసెన్ = సమీపించెను; అటంచున్ = అనుచు; గంధర్వరాజాజ్ఞన్ = ఇందీవరాక్షుని ఆజ్ఞ చే; ఉన్మద...పద—ఉన్మద = మత్తెక్కిన; వేదండఘటా = ఏనుగుల గుంపు; భట = కాల్బలము; అశ్వ = గుఱ్ఱములు; రథ = రథములు కల్గిన; సేనా వాదిత్ర = సేనలోని వాద్యముల యొక్క; సంపద = వైభవము; మీఱన్ = అతిశయింపగా; చనుదెంచి = వచ్చి; కాంచి = స్వరోచిని చూచి; ముద మొప్పన్ = సంతోషమొన గూడునట్లు; కదళీకాంచన కక్ష్యలన్ = టెక్కెములు, బంగారుఅంబారీలతో; మెఱయు = ప్రకాశించెడి; లేఖస్వామిచౌదంతిపైన్ = ఇంద్రుని నాల్గుదంతముల ఏనుగు—ఐరావతముపై; ఆరూఢుఁగాన్ = ఎక్కినవానిగా; చేసిరి.

తా. అంత నిందీవరాక్షుని యానతిపై సామంతులు, మంత్రులును, చతురంగ బల సమేతులై మంగళ వాద్యముల మ్రోయించుచు స్వరోచి వద్దకేగి ఐరావతముపై నతని నధిష్ఠింపజేసిరి.

ఉ. అత్తఱిఁ బట్టణంబు వికచాంబురుహాక్షులు కౌతుకంబునం
జిత్తము లుల్లసిల్ల గయిసేసి గృహాంగణసౌధమాలికల్
హత్తి నరేంద్రవీథిఁ జతురంగబలంబులుఁ గొల్వఁగా, మరు
న్మత్తగజంబుపైఁ జను కుమారశిరోమణిఁ జూచి రుబ్బునన్. 60

టీ: అత్తఱిన్ = అప్పుడు; పట్టణంబు = నగరములోని; వికచ+అంబురుహ+అక్షులు = వికసించిన పద్మములవంటి నేత్రములు కల స్త్రీలు; కౌతుకంబునన్ = వేడుకతో; చిత్తములు = మనస్సులు; ఉల్లసిల్లన్ = సంతోషింపగా; కయిసేసి = అలంకరించుకొని; గృహాంగణ సౌధమాలికల్ = ఇళ్ళ ముంగిళ్ళ యొక్క, మేడలయొక్క వరుసలను; హత్తి = చేరి; నరేంద్రవీథిన్ = రాజమార్గమున; చతురంగ బలంబులున్ = గజాశ్వరథపదాతి సేనలును; కొల్వఁగా = సేవింపగా; మరుత్+మత్తగజంబుపైన్ దేవతల మదించిన యేనుగుపై; చను = వెళ్లెడి; కుమారశిరోమణిన్ = పెండ్లికుమారుని; ఉబ్బునన్ = సంతోషముతో; చూచిరి.

తా: అప్పుడు నగరములోని స్త్రీలు మేడలమీదికి, ఇళ్ళ వాకిళ్ళలోనికివచ్చి చతురంగ బలములు సేవించు చుండగా నైరావతముపై వెళ్ళెడి స్వరోచిని చూచిరి.

ఉ. అంచెలు గట్టి కాలితొడు సైచన నీవు గదమ్మ ప్రోదిరా
యంచ లి వేటిసంగడము లయ్యెను దయ్యము యేటివేడ్క నా
కంచుఁ బదంబున న్మొరయు నందియ యూడఁగఁ దన్ని పోయి వీ
క్షించె లతాంగి యొర్తు మురజిన్నిభు సాగరమేఖలావిభున్. 61

టీ: లతాంగియొర్తు=ఒక స్త్రీ; ప్రోదిరాయంచలు=పెంపుడురాజహంసలు; అంచెలుగట్టి=వరుసలుతీరి; కాలితొడుసై=కాళ్ళతో సంబంధము కలవై; చననీవు గదమ్మ=పోనియ్యవుగదా! ఇవి = ఈహంసలు; ఏటిసంగడములు=ఏమి స్నేహితులు; అయ్యెన్=అయినది; దయ్యము=దైవమా! నాకున్ = నావంటిదానికి; ఏటివేడ్క=ఏమివినోదము? అంచున్=అని; పదంబునన్=కాలియందు; మొరయు నందియ = మ్రోగెడిఅందెను; ఊడగదన్ని = ఊడిపోవునట్లుగా కాలుజాడించి; పోయి; మురజిత్+నిభున్=కృష్ణునివంటి; సాగరమేఖలావిభున్ = స్వారోచిని; వీక్షించెన్=చూచెను.

తా: స్వారోచి పెండ్లికివచ్చు వేళ నొకస్త్రీ తనకాలి యందె చప్పుడువిని హంసధ్వనిగా భావించి కాలికి చుట్టుకొనుచున్న హంసల యడ్డంకు భరింపలేక విసిగి, కాలియందె ఊడిపోవునట్లు కాలు జాడించి వాకిటిలోని కేగి స్వారోచిని చూచినది. భ్రాంతి మదలంకారము.

చ. వలపులపల్లవుం డొకఁడు వట్టి చలంబున నేఁప దీనయై
యలుకలు తీర్చి తీర్చి యొక యచ్చర వచ్చి నృపాలు నన్నగ
ర్వెలువడి చూచెఁ గాముకుఁడు వెంటనె రా నపు డాత్తఘర్మయై
వెలువెలఁబాఱెఁ దన్ముఖము వెల్వెలఁబాఱెవిటాననాబ్జమున్. 62

టీ: ఒకయచ్చర=ఒకఅప్సరస; వలపులపల్లవుండొకడు = ప్రేమపాత్రుడైన విటుడొకడు; వట్టిచలంబునన్=అకారణ కోపముచే; ఏఁపన్=బాధించగా; దీనయై=దుఃఖించునదై; అలుకలు = కోపములు; తీర్చితీర్చి=తగ్గునట్లు చేసి చేసి; అన్నగరు+వెల్వడి = ఆ మేడనుండి వెలుపలికివచ్చి; నృపాలున్=స్వారోచిని; చూచెన్; అపుడు; కాముకుడు=వలపుకాడును; వెంటరాన్ = వెనుక నేరాగా; ఆత్తఘర్మయై=పొందబడిన చెమట కలదై; తత్+ముఖము=ఆమె ముఖమును; వెలువెలఁబాఱెన్=తెల్లనయ్యెను; విట+ఆనన+అబ్జమున్ = విటునిముఖముకూడ; వెల్వెలబాఱెన్=తెల్లపోయెను.

తా: ఒక యప్సరస విటుడు తనపై లేనిపోని కోపముతో యూతి ముడుచుకొనగా తెగబతిమాలి, ఊరేగింపు వచ్చుచుండగా వీధిలోనికి వచ్చెను. ఆమె వెనుకనే విటుడును వచ్చెను. అతనిని విదలించుకొని వచ్చినందుల కతడేమను కొనునోయని మేను చెమర్పగా ఆమె తెల్లపోయినది. బతిమాలి నప్పుడు వినక వెనుకనే వచ్చినందుల కతడును తెల్లపోయెను. అలం. స్వభావోక్తి.

చ. చిలుకల కొల్కి కల్కి యొక చేడియ నాటకసాలమేడపై
నిలువున నాడుచుండి ధర నేపతిఁ జూడఁ దలంచి యంచునన్

నిలచి రహిం గనుంగొనుచు నెయ్యమునం దనువల్లి యుబ్బ కం
చెల తెగిపడ్డఁ గేతనము చీర చెఱంగున మూసెఁ జన్నులన్. 63

తా: చిలుకలకొల్కి=చిలుకముక్కువంటి కనుకొనలుకల; కల్కి=సుందరియైన; ఒకచేడియ=ఒకస్త్రీ; మేడపైనిలువునన్=మేడపై అంతస్థులో; నాటకసాలన్=నృత్యమందిరమున; ఆడుచుండి = నాట్యము చేయుచు; ధరణీపతిన్=స్వారోచిని; చూడదలంచి; అంచునన్=మేడ చివరన; నిలిచి; రహిన్=ఆసక్తితో; కనుంగొనుచు=చూచుచు; నెయ్యమునన్=ఆనందముచే; తనువల్లి=తీగెవంటి శరీరము; ఉబ్బ=పొంగి; కంచెల=రవికె; తెగి=పికిలి; పడ్డన్=పడిపోగా; కేతనము చీర చెఱంగునన్=జెండాగుడ్డ చివరతో; చన్నులన్=స్తనములను; మూసెన్=కప్పుకొనెను.

తా: ఒక యువతి మేడపై యంతస్తులో నాట్యము చేయుచు చివరికివచ్చి స్వారోచిని చూచినది. ఆ యానందాతిరేకమున బిగిగా కట్టుకొన్న చనుకట్టు తెగియుండగా జెండా గుడ్డ చివరతో చన్నులు కప్పుకొనెను. (కంచెల యనగా నాట్యము చేయునపుడు స్తనములను బిగువగా కట్టుకొను వస్త్రము.)

ఉ. కీరమనోజ్ఞవాణి యొక కిన్నరి కిన్నెర మీటి మీటి యొ
య్యారపులీల నేఁగి వసు ధాధిపుఁ గన్గొనె జిల్గుపయ్యెదన్
హారముఁ జక్కఁబెట్టెడు కు చాహితహస్తము పైఁడిగోళ్లు హిం
సారతి సేయు దర్పకునిసంపెగములుకులుం బోలె మించఁగన్. 64

తా: కీరమనోజ్ఞవాణి=చిలుకవలె వినసొంపైన మాటలుకల; ఒకకిన్నరి=ఒక కిన్నరస్త్రీ; కిన్నెర=వాయించునది; మీటి మీటి=కొంతసేపు వాయించి; ఒయ్యారపు లీలన్=నిలాసగా; ఏగి=వెళ్ళి; జిల్గుపయ్యెదన్=సన్నపుపైటతో; హారము=ముత్యాలహారమును; చక్కబెట్టెడు=సవరించుకొనెడి; కుచ+ఆహిత=స్తనములపై నుంచబడిన; హస్తము పైడిగోళ్ళు=చేతియున్న బంగారుగోళ్ళు—వీణవాయించునపుడు గోళ్ళకు దెబ్బతగుల కుండుటకై పెట్టుకొన్న బంగారుగోళ్ళు; హింసారతి సేయు = బాధించుటయందాసక్తికల; దర్పకుని = మన్మథునియొక్క; సంపెగ ములుకులు బోలెన్=సంపెంగ బాణములవలె; మించగన్=తోచగా; వసుధా+అధిపున్=స్వారోచిని; కన్గొనెన్.

తా: ఒక కిన్నర వనిత కిన్నెరను మీటుచు మధ్యలో రాజును చూచుటకై వెళ్ళి బంగారు గోళ్ళతో పైటను, హారములను సవరించుకొనుచు చూచెను. అప్పుడామె వ్రేళ్ళకున్న బంగారుగోళ్ళు విరహిజనముల బాధించు మన్మథుని సంపెంగ మొగ్గలనెడి బాణములవలె నున్నవి. అలం. ఉత్ప్రేక్ష.

చ. పరవశదైన్య మాడుకొను పౌరిషలఁ గానదు ఘర్మవారిచేఁ
గరఁగి స్రవించు చిత్రికము గాన దనాదృతవీటిపాటలా

ధరమున సున్న మంటిన విధంబును గానదు నవ్వుటాల కా
భరణము గొన్నఁ గానదొక బాల నృపాలునిఁ జూచి నివ్వెఱన్.

టీ: ఒకజాల = ఒకముగ్ధస్త్రీ; నృపాలునిన్ = రాజును; చూచి; నివ్వెఱన్ = అద్భుతముతో; పరవశదైన్యము = ఒడలు తెలియని తనముచేనైన దీనత్వమును గూర్చి; ఆడుకొను ప్రౌఢలన్ = నిందించెడి ఆరితేరిన స్త్రీలను; కానదు = చూడదు; ఘర్మవారిచేన్ = చెమటనీటిచే; కరఁగి; స్రవించుచిత్రకము = దిగజారెడి తిలకమును; కానదు, అనాదృత = ఆదరింపబడని, వీటి = తాంబూల రసముచేత; పాటల+అధరమునన్ = లేయెరుపైన పెదవియందు; సున్నమంటిన విధంబును = సున్నమంటినట్లును; కానదు. నవ్వుటాలకున్ = పరిహాసమునకై; ఆభరణము గొన్నన్ = నగను లాగికొనగా; కానదు.

తా: ఒకపడుచుపిల్ల రాజును చూచి పరవశయై తనయొడలు తెలియని తనమును నిందించెడి వారిని, కారుచున్న బొట్టును, పెదవికంటుకొన్న సున్నమును, తనమెడలోనుండి తీసిన హారమును కూడ గమనింప లేకున్నది. అలం. స్వభావోక్తి.

చ. అలికులవేణి యొక్కతె రతాంతమునం దనయంగవల్లికం
బులకలు చొక్కు లేఁజెమరుఁ బుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ నా
పులకలు చొక్కు లేఁజెమరుఁ బోవక యట్టుల యుండె నట్టిదౌఁ
జెలువగు వానిఁ గన్గొనిన చెల్వకుఁ జూపులఁ గావె కూటముల్. 66

టీ: అలికులవేణి యొక్కతె = ఒకస్త్రీ; రత+అంతమునన్ = సురతము కాగానే; తనయంగవల్లికన్ = తీగెవంటి తన శరీరమును; పులకలు = గగుర్పాటులు; చొక్కు = పరవశత్వము; లేఁజెమరు = చిరుచెమట; పుట్టగన్ = కల్గగా; ఏఁగి = వెళ్ళి; నరేంద్రున్ = స్వారోచిని; చూడన్ = చూడగా; ఆపులకలు = ఇదివరలో కల్గిన గగుర్పాటులు; చొక్కు; లేఁజెమరున్ = చిరుచెమటయును; పోవక = అరిపోక; అట్టుల యుండెన్ = మునుపటివలెనే యుండిపోయెను; అట్టిది+ఔన్ = అట్లేయుండును; చెలువగువానిన్ = అందమైన వానిని; కన్గొనిన చెల్వకున్ = చూచిన స్త్రీకి; కూటముల్ — సంభోగములు; చూపులకావె = చూపులలోనే కదా. (కల్గును)

తా: ఒక వనిత సంభోగము కాగానే అకల్గిన పారవశ్యము, చిరుచెమట, గగుర్పాటును ఉండగనే వచ్చి రాజును చూచినది. రాజును చూచినంతన చూపులతోనే సంభోగము చేసినట్లయి ఆమెకు కల్గిన రోమాంచాదులట్లే నిల్చిపోయినవి. సుందరులకు కన్నులకింపైన వానిని చూచినచో చూపులతోనే సురతపారవశ్యము కల్గునుకదా! అలం. అర్థాన్తరన్యాసము.

చ. అలరులబంతి జృంభికకు నడ్డముసేయుచుఁ గర్ణపాళిపై
కలకలఁ ద్రోయుచుం దరఁగ లౌ ప్రమదాశ్రులు గోట మీటుచుం

జెలిభుజపీఠి నొత్తిగిలి కి చిల్కను మువ్వఁచు వాలుఁగన్నుఁ గో
వల కుదధార చేత నొక కి వారవిలాసిని చూచె రాసుతున్. 67

టీ: ఒకవారవిలాసిని = ఒక యప్సరస; అలరులబంతిన్ = పూలబంతిని; జృంభికమున = ఆవులింతకు; అడ్డగు చేయుచున్ = చాటుగా పెట్టుచు; కర్ణపాళ్ పైకిన్ = చెవితమ్మిమీదికి; అలకలన్ = ముంగురులను; త్రోయుచున్ = ఎగద్రోయుచు; తరఁగలా = కెరటములుగా నున్న; ప్రమద + అశ్రులు = ఆనందము వలనవచ్చు కన్నీటిని; గోటన్ = గోటితో; మీటుచున్ = ఎగజిమ్ముచు; చెలిభుజపీఠిన్ = చెలికత్తె యొక్క బుజముపై; ఒత్తిగిలి = ఒరిగి; చిల్కను = పెంపుడు చిలుకను; మువ్వఁచున్ = నిమురుచు; వాలుగన్ను గోనలకున్ = పొడవైన కన్నుప్రక్కలకు; ఉదధార = కన్నీటిధార; చేరన్ = చేయుకొనగా; రాసుతున్ = స్వరోచిని; చూచెను.

తా: ఒక యప్సరస ఆవులింతకు పూబంతి నడ్డము పెట్టుచు, ముంగురులను త్రోయుచు, చిలుకను చేతితో నువ్వఁచు, చెలికత్తె బుజముపై వానుకొని ఆనందము వలన కన్నుల నీరు నింపుకొనుచు రాజును చూచెను.

చ. జిలుఁగులఁ బెట్టుచుం దొడలఁ కి జెందిరికపావడ యంట మైతడిం
బెళపెళలేని చీరఁ గటి కి బింకపుఁజన్నులఁ జేర్చికొంచు వే
జలకము లాడి యాడి యొక కి చాన కరస్థిత కేశయై నృపు
న్వెలువడి చూచె లోపడితి కి నీ కని బాసకు నిల్చెనో యనన్. 68

టీ: ఒకచాన = ఒకస్త్రీ; జలకము లాడియాడి = స్నానముచేసి; జిలుఁగులన్ = సన్నని బట్టలను; పెట్టుచున్ = తడి యొత్తుకొనుటకై పెట్టుకొనుచు; తొడలన్ = తొడలమీద; చెంద్రికపావడ = చంద్రకావిపావడ; అంటన్ = తడిచే అంటుకొనగా; మైతడిన్ = శరీరపుతడిచే; పెళపెళలేని చీరన్ = తడియుటచే మెత్తగానున్న పైటను; కటిన్ = మొలను; బింకపు జన్నులన్ = బింకముకల చన్నులపై; చేర్చికొంచు = వేసికొనుచు; కరస్థితకేశయై = చేతిలో నుంచుకొనబడిన జుట్టుకలదై; వేన్ = వెంటనే; వెలువడి = బయటికివచ్చి; నీకున్; లోపడితిన్ = చిక్కితిని; అని = అనెడి; బాసకున్ = ప్రమాణమునకు; నిల్చెనో యనన్ = నిలబడినట్లుగా; నృపున్ = స్వరోచిని; చూచెన్. అలం. ఉత్ప్రేక్ష.

తా: ఒక స్త్రీ సగము స్నానముచేసి, అంతలో పెండ్లివారి రాకవిని సన్నని బట్టలతో ఒడలొత్తుకొని, ఆ తడిచే బట్టయొడలి నంటుకొనగా కట్టుకొని, పైటతో రొమ్ములు కప్పుకొని నీళ్ళు కారుచున్న జుట్టు నొకచేతిలో పట్టుకొని బయటికి వచ్చి రాజును చూచెను. అది 'నీకు నేను లోబడితి' నని ప్రమాణముచేయుటకై నిలబడినదా అన్నట్లుండెను.

మ. ఒక నేత్రాంబుజ మొక్కగల్ల మొకచ కి న్నొయ్యారపున్ లీల వీ
థికిఁ దోఁపన్ దలు పోరఁగా నొకపురంధి కి రత్న మీక్షించె రా

జ కిశోరంబుఁ దదీయలై వెలయు భాస్వాలక్ష్ములం జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచెనాన్. 69

టీ: ఒకపురంధ్రీరత్నము=ఒకస్త్రీ; తదీయలై=స్వారోచికి సంబంధించినవై; వెలయు భాస్వాలక్ష్ములన్=ప్రకాశించెడి లక్ష్మీ సరస్వతులను; చూచి; మైత్రికిన్=వారితోడి స్నేహమునకు; త్ర్యంబకభాగమున్=శివుని భాగమును; మొఱంగి=వంచనసేసి; శివాభాగంబ=పార్వతీ భాగమే; ఏతెంచెనాన్=వచ్చెనాయన్నట్లు; ఒకనేత్ర+అంబుజము = పద్మమువంటి యొకకంటిని; ఒకగల్లము=ఒక చెంపయు; ఒకచన్ను=ఒక స్తనమును; ఒయ్యారపున్ లీలన్=విలాసముగా; వీధికిన్=వెలుపలికి; తోఁపన్=కన్పడునట్లు; తలుపు+ఓరగాన్=తలుపు సగముమూసి—సగము తెరచి; నిలిచి; రాజకిశోరంబున్=రాకుమారుని; ఈక్షించెన్=చూచెను. అలం. ఉత్ప్రేక్ష.

తా: స్వారోచిలో లక్ష్మీ సరస్వతులు—విద్య—ధనమును, ఉన్నవి. వానితో తానుకూడ స్నేహము చేయఁగోరి శివుని సగము శరీరమును విడిచి వచ్చిన పార్వతీ భాగమా అన్నట్లుగా ఒక స్త్రీ తలుపు చాటున సగము శరీరము మాటుపడునట్లు సగము శరీరము బయటకు కన్పడునట్లును నిలిచి రాజును చూచెను.

మ. కలయం గూర్మిఁ జెమర్చు నంగముల లగ్నంబైన సన్నంపు మం
జులకౌశేయమునందు మించు కమలస్తోమంబుచేఁ జూచె నొ
క్క లతాతన్వి చెలంగి పొంగుమది కాంక్షల్ దీఱ మే నెల్లఁగ
న్నులు గావించి కుమారుజవ్వనము చెన్నుం జూచునందంబునన్.

టీ. ఒక్క లతాతన్వి = ఒకస్త్రీ; చెలంగి=ఉత్సాహముతో; పొంగు=ఉబ్బెడి; మదికాంక్షల్ = మనసులోని కోరికలు; తీఱన్ = నెరవేరునట్లుగా; మేనెల్లన్=ఒళ్ళంతయు; కన్నులు; కావించి=చేసికొని; చూచుచందంబునన్=చూచుచున్నట్లు; కుమారు=స్వారోచియొక్క; జవ్వనము చెన్నున్ = యౌవనపుటందమును; కూర్మిన్=ప్రేమచే; కలయన్=అంతటను; చెమర్చు+అంగములన్=చెమటపట్టెడి యవయవములందు; లగ్నంబైన = అంటుకొన్న; సన్నంపు=సన్నని; మంజుల=అందమైన; కౌశేయమునందున్=పట్టుచీరలో; మించుకమలస్తోమంబుచేక్=ప్రకాశించు పద్మములవంటి చూపులతో; చూచెన్.

తా: ఒకస్త్రీ ఒళ్ళంతయు కన్నులు చేసికొని తనివితీర స్వారోచిని చూచునట్లుగా; తామరపూల అద్దకమున్న చీర కట్టుకొని, అది చెమటచే శరీరమునంటుకొనగా చూచెను. అలం. పరిణామము, ఉత్ప్రేక్షయు.

వ. ఇత్తెఱంగునం గరంగు నంతరంగంబులుగల కురంగాక్షుల యపాంగంబులం దుఱంగలించు సితేతరతరళతరదృగ్రోచుల నభంగశృంగార రస వీచులచాలునం బోలెఁ బొదువంబడి యాలంబిత చీనాంబర ప్రాలంబమాలికాచిత్రమ్ము లగు నాతపత్రమ్ములు

మెఱయఁ బత్రిమ్ములడిగ్గి దుర్గాధిపతు లే మేమ యని త్రోపుత్రో
పాడుచు వీచువీచోపులచ్ఛమ్ము లగు కౌముదీ గుచ్ఛమ్ముల సంత
రింప సంతిక వైజయంతికలంగ్రాలు వలువలంబాలయు చిఱుగరువలిం
దూలు నీలాలకలయలక లుభయపార్శ్వసముత్తుంగ మత్తమాతంగ
మదసౌరభసంగి భృంగసంఘంబుల నెలయింప నింపారుకలపంబు
లబ్బాటునం జేటు లెత్తి యొండొరుల యొత్తడిం బొడిపొడియై
యెగయు విసృమరపరాగపూగంబు చదల నెల్లెడ నుల్లెడగట్టిన ట్టమర
దట్టదట్టమ్ముగ సాగు నాగరుల వాగారవమ్ములు నిగుడ నెడవడక
పొగడు పొగడికల కలకలమ్ములును బుంఖానుపుంఖ శంఖ భేరీపటహ
కాహళ వేణువీణాది వాదనధ్వానంబును గలమధురకిన్నరీనిక్వాణం
బుల రాణంద్రాఁ జెఱుచు విన్నాణంపుఁ గొల్పుబెలుంగులును
వేల్పుగాణలువాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁ బాటలం
దీటుకొన్ను తిన్ననిరవంబులుం గలసి బలసికొను కోలాహలమ్ము
లిమ్ముగ సందడుల నెడగలుగంజడియు వేత్రహస్తులప్రశస్తతర సాహో
నినాదంబు సంబంధించి సొంపొలయ నత్యంతకాంతంబయి నిరంతర
గతిం గ్రింతనడవ నడదివిలయై మకుటారవింద రాగంబులు వెలుంగ
నలుగడల సామంతసందోహంబు క్రిందుకొన మందమందగమనం
బునం జనుబృందారక వేదండంబుపై నుద్దండతనుచ్ఛాయాకలాపంబు
జంబేటి జంబాల కదంబకంబు డంబువిడంబింపఁ దిన్ననిరవంబునం
గలసి బలసిన కోలాహలంబు హంసాదివిహంగమ హృదయంగమ
రావంబును బెడంగువడ నడచు క్రింత నత్యంతదర్శనీయంబులై
మెఱయు మంగళద్రవ్యంబుల నెడనెడం దీండ్రించు పుండ్రేక్షు
దండంబుల కడలఁ గడలుకొను పసరుటాకుల డాలు శైవాలంబు
నందంద క్రిందుగా మందుచేదివియలు చెందొవలునుంగాఁ బార్శ్వ
ద్వయసముత్తుంగ మణిసౌధవీథికా రోదోంతరాళంబున గంధగజ
ఘటా ఘనాఘనకాంతిక ధూళి మాగధప్రవాహంబునం గూలం
కషం బగునృపతిపథ యమునా హ్రదంబు గగనగంగావగాహ
నాభ్యాసంబున నిండుకొనిపోవునదియునుంబోలె దనరఁ దనసముద్దామ
తేజోభరంబునన్ జడిసిన మేరుగిరిమోరులుం బోలెఁదీరుగల భుజం
బులం దాఱుమాఱుగా నిడిన తారతారంపుఁ బంచసరంబులుఁ

దోరంతర హారంబులు గేయూరహీరంబులుఁ గరకంకణ కురువింద కందళంబులుఁ గటికనకమేఖలాఘటితం బగుచేరు కరాచురీమరకతంపుఁ బిడిమెఱుంగులుం దరిసి వెన్నెలక్రొన్నారుపులు బోరన న్నగు నరపడుగు జిలుఁగు కంచుకంబునుమించి వెలుపలం దోఁప మంచుగవిసిన రోహణమహీధరంబునుంబోలె రాజభవనాంగణంబు చేరవచ్చె నంత నక్కడ. 71

టీ: ఈ+తెఱంగునన్ = ఈరీతిగా; కరంగు నంతరంగంబులుకల = ప్రేమతో కరగిన మనస్సులు కల్గిన; కురంగాక్షుల = స్త్రీలయొక్క; అపాంగంబులన్ = క్రీగన్నులలో; తుఱంగలించు = ప్రకాశించెడి; సితేతర = నల్లని; తరళతర = చంచలమైన; దృక్+రోచులన్ = కన్నుల కాంతులచే; అభంగ = ఎడతెగని; శృంగారరస = శృంగారమను ప్రవాహముయొక్క; వీచులచాలునం బోలెన్ = కెరటముల పంక్తిచే వలె; పొదువంబడి = క్రమ్మబడి; (అలం. ఉత్ప్రేక్ష.) ఆలంబిత = వ్రేలకట్టబడిన; చీనాంబర = చీనాదేశపు పట్టుగుడ్డలో కట్టబడిన; ప్రాలంబ = వ్రేలాడు జాలరుల యొక్క; మాలికాచిత్రమ్ములగు = వరుసలచే విచిత్రమైన; ఆతపత్రమ్ములు = గొడుగులు; మెఱయన్ = ప్రకాశింపగా; పత్రమ్ములన్ = వాహనములను; డిగ్గి = దిగి; దుర్గ+అధిపతులు = కోటుల కధిపతులైన సామంతులు; ఏము+ఏము+అ = మేము మేము అని; త్రోపు త్రోపాడుచున్ = త్రోచికొనుచు; వీచువీచోపులు = విసరునట్టి వింజామరలు; అచ్ఛమ్ములగు = తెల్లనైన; కౌముదీగుచ్ఛమ్ములన్ = వెన్నెల గుత్తులను; సంతరింపన్ = కల్గజేయగా; (అలం. ఉపమ) అంతికవైజయంతికలన్ = దగ్గరలోనున్న జెండాలయందు; క్రాలువలువలన్ = అల్లలనాడు గుడ్డలచే; పొలయుచిఱుగరువలిన్ = వ్యాపించెడి పిల్లగాలిచే; తూలు = కదలెడి; నీల+అలకల = నల్లని ముంగురులు కల స్త్రీల యొక్క; అలకలు = ముంగురులు; ఉభయపార్శ్వ = రెండు ప్రక్కలనుండు; సముత్తుంగ = మిక్కిలి ఎత్తైన; మత్తమాతంగ = మదపు టేనుగులయొక్క; సౌరభసంగి = సువాసనలను చేరెడి; భృంగసంఘంబులన్ = తుమ్మెదల గుంపులను; ఎలయింపన్ = దగ్గరకు రప్పింపగా; (అలం. భ్రాంతిమంతము) ఇంపారుకలపంబులు = ఇంపైన పరిమళ ద్రవ్యములు కలిపిన గంధపు బూతలు; అబ్బాటునన్ = జనుల సమ్మర్దము వలనికాకచే; పోటులెత్తి = ఎండి; బెల్లులెగసి; ఒండొరుల యొత్తిడిన్ = ఒకరొకరు రాసికొన్నందున; పొడిపొడియై = పొడిగానై; ఎగయు = ఎగురుచున్న; విసృమర = వ్యాపించెడి; పరాగపూగంబు = ధూళిరాశి; చదలన్ = ఆకాశమందు; ఎల్లెడన్ — అంతటను; ఉల్లెడగట్టినట్లు = మేలుకట్లు కట్టినట్లు; అమరన్ = ప్రకాశింపగా; (అలం: అతిశయోక్తి) దట్టదట్టమ్ముగన్ = మిక్కిలిదట్టనగా; సాగునాగరుల వాగారవమ్ములు = నడచెడి పౌరుల మాటల చప్పుళ్లు; నిగుడన్ = ఎక్కువకాగా; ఎడవడక = ఎడతెంపులేక, పొగడు = స్తుతించెడి; పొగడికల = పొగడ్తల యొక్క; కలకలమ్ములును; కోలాహలములును; పుంఖానుపుంఖ = ఒకదానివెంట నొకటిగా మ్రోయు; శంఖ, భేరీ, పటహ,

కాహళ, వేణు; వీణా+ఆది=శంఖము మొదలైన; వాదన ధ్వానంబును=వాద్యముల ధ్వనియును; కలమధుర=అవ్యక్తమధురమైన; కిన్నరీ=కిన్నర స్త్రీలయొక్క; నిక్వాణంబులరాణ=ధ్వనుల మనోహరత్వమును; త్రాణన్+చెఱచు=సామర్థ్యముచే చెరచెడి; విన్నాణంపు గొల్పు తెలుంగులున్=నేర్పుకల పాటకుల కంఠస్వరములును; వేల్పుగాణలు=అప్సరసలు; పాడు=పాడెడి; లక్ష్మీనారాయణుల=లక్ష్మీనారాయణుల యొక్క; కల్యాణంపుఁబాటలన్=పెండ్లి పాటలచే; దీటుకొను తిన్నని రవంబులున్=నిండుకొను చక్కని ధ్వనులును; కలసి బలసికొను=అన్నియు కలిసి ఎక్కువైన; కోలాహలమ్ములు=కలకలములు; ఇమ్ముగన్=బాగుగా; సంబడులన్=జనసమ్మర్దములను; ఎడగలుగన్=దూరమగునట్లు; జడియు=తొలగించెడి; వేత్రహస్తుల=బెత్తాలవారి యొక్క; ప్రశస్తతర=శ్లాఘ్యములైన; సాహోనినాదంబులన్=సాహో అను ధ్వనులను; సంబంధించి=కూడికొని; పెంపు+ఒలయన్=అభివృద్ధిపొందగా; అత్యంతకాంతంబై=మిక్కిలి సుందరమై; నిరంతరగతిన్=ఎడతెంపు లేనట్లు; క్రంతనడవన్=పెండ్లికూతురి కిచ్చు మంగళకర ద్రవ్యముల నెత్తించుకొని నడువగా; నడదివియలై=నడుచునట్టి దివిటీలై; మకుట+అరవిందరాగంబులున్=కిరీటములందలి పద్మరాగమణులు; వెలుంగన్=ప్రకాశించుచుండగా; నలుగడలన్=నాలుగుప్రక్కల; సామంతసందోహంబు=రాజులసముదాయము; క్రందుకొనన్=సందడికొగా; మందమందగమనంబునన్=మెల్లని నడకతో; చనుబృందారక వేదండముపైన్=వెల్లడి యైరావతము మీద; ఉద్దండ=ఎక్కువైన; తను+ఛాయాకలాపంబు=శరీరకాంతి; జంబు+ఏటి=జంబూనది యొక్క; జంబాల కదంబకంబుడంబున్=బురదయొక్క కాంతిని; విడంబింపన్=అనుకరింపగా; తిన్ననిరవంబునన్=చక్కని ధ్వనిని; కలసి=కూడి; బలిసినకోలాహలంబున్=ఎక్కువైన కలకలమును; హంసాదివిహంగమ=హంస మున్నగు పక్షుల యొక్క; హృదయంగమరావంబును=మనోహరమైన ధ్వనియును; బెడంగువడన్=అందగించునట్లు; నడచుక్రంతల=నడచెడి ప్రధానద్రవ్యములు తీసికొని వెళ్లెడి వారిలో; అత్యంత దర్శనీయంబులై=మిక్కిలిచూడదగినవై; మెఱయు=ప్రకాశించెడి; మంగళద్రవ్యంబులన్=మంగళకర ద్రవ్యములందు; ఎడనెడన్=మధ్యమధ్య; తీండ్రించు=వెలిగెడి; పుండ్రేక్షు=నామాలచెరకుయొక్క; దండంబులకడలన్=గడల కొనలయందు; కడలుకొను=ఎక్కువగు; పసరుటాకుల=పచ్చని యాకుల యొక్క; డాలు=కాంతి; శైవాలంబులు=నాచుతీగెలు; అందంద=అక్కడక్కడ; క్రందుగాన్=ఎక్కువగా; మందు చేదివియలు=వెలిగెడి చేతి దివిటీలు; చెన్ను+తొవలును=ఎఱ్ఱకలువలును, కాన్=కాగా; పార్శ్వద్వయ=రెండు ప్రక్కలను; సముత్తుంగ=ఎత్తైన; మణిసౌధవీథికా=మణులతో కట్టిన మేడల యొక్క నడుమనున్న వీథి యనెడి; రోదః+అంతరాళంబునన్=భూమ్యాకాశముల మధ్యభాగమందు; గంధగజఘటా=మదపు టేనుగుల సముదాయములనెడి; ఘనాఘన=వర్షాకాల మేఘముల యొక్క; కాంతిక=కాంతివంటి కాంతికల; ధూళి=

పరాగముకల; మాగధ = మగధదేశపు గుర్రముల యొక్క; ప్రవాహంబునన్ = ప్రవాహముచే; కూలంకషంబగు = ఒడ్డుల నొరసెడి; నృపతిపథ = రాజమార్గమనెడి; యమునాహ్రదంబు – యమునానదిలోని మడుగు; గగనగంగా = ఆకాశగంగలో; అవగాహన + అభ్యాసంబునన్ = స్నానముచేయు నలవాటుచే; నిండుకొని = నిండుగా నున్నదై; పోవునదియునుంబోలెన్ = వెళ్ళుచున్నదియువలె; తనరన్ = ప్రకాశింపగా; (అలం. రూపకోత్ప్రేక్షలు) తన = స్వారోచియొక్క; సముద్దామ = ఎక్కువైన; తేజోవిశేషంబునన్ = ఎక్కువ తేజస్సుచే; జడిసిన, మేరుగిరి మోరులుం బోలెన్ = భయపడిన మేరుపర్వతము యొక్క శిఖరములో యన్నట్లు; తీరుకలభుజంబులన్ = చక్కనైన భుజములందు; తాఱుమాఱుగాన్ = వ్యత్యాసముగా; ఇడిన = వేసికొన్న; తారతారంబు = మంచిముత్యాలయొక్క; పంచసరంబులున్ = అయిదుపేటల హారములును; దోరంతర హారంబులుం = భుజముల మధ్యను వ్రేలాడెడి హారములును; కేయూరహీరంబులున్ = భుజకీర్తులందలి ముత్యాలును; కరకంకణ = చేతి కంకణములందలి; కురువిందకందళంబులున్ = కెంపుల కాంతులును; కటిఘటితంబగు = మొలను కూర్పబడిన; చేరు = బంగరు మొలత్రాటితోడి; కరాచురీ = చురకత్తి యొక్క; మరకతింబుపిడి = పచ్చలు దాపిన పిడియొక్క; మెఱుంగులును = కాంతులును; తఱిసి = కలసి; వెన్నెలక్రొన్నురువులన్ = వెన్నెలల యొక్క క్రొత్తనురుగులను; బోరనన్ = వెంటనే; నగు = నవ్వెడి; అరపదుగు = సగము నేసిన; జిలుగు కంచుకంబు = సన్నని అంగీని; మించి; వెలుపలన్ = బయట; తోఁపన్ = కనపడగా; మంచుకవిసిన = మంచావరించిన; రోహణమహీధరంబునుం బోలెన్ = రత్నపర్వతము వలెనే; రాజభవన + అంగణంబు = రాజసౌధ ముంగిలిని; చేరవచ్చెన్; అంతన్ = అప్పుడు; అక్కడన్ = ఆ ఇందీవరాక్షుని యింటిలో......(అలం. ముద్ర, ఉపమయు)

క. కాంతాకదంబకిసలయ
కాంతకరావర్జ్యమాన కనకఘటీ ని
ర్వాంతసుగంధిజలంబుల
నింతి జలకమాడి జిలుఁగు లిడి తడి యొత్తెన్. 72

టీ: ఇంతి = మనోరమ; కాంతా = పరిచారికల యొక్క; కదంబ = సముదాయము యొక్క; కిసలయకాంత = చిగుళ్ళవలె సుందరమైన; కర = చేతులతో; ఆవర్జ్యమాన = పోయబడుచున్న; కనకఘటీ = బంగారు కుండలనుండి; నిర్వాంత = పడుచున్న; సుగంధి = పరిమళించెడి; జలంబులన్ = నీటితో; జలకమాడి = స్నానము చేసి; జిలుఁగులు = సన్నని బట్టలు; ఇడి = పెట్టి; తడియొత్తెన్ = ఒంటి తడి తుడిచెను.

తా: పరిచారికలు బంగారు కుండలతో పరిమళించెడి నీటిని పోయగా మనోరమ స్నానముచేసి పల్చని గుడ్డలతో తడి యొత్తుకొనెను.

చ. తళుకుదుకూలశాటిఁ గటిఁ దాల్చి పటీర మలంది హారకుం
డలమణిపారిహార్యరశనా కటకాంగుళిముద్రికాది భూ
షలు తొడి పారిజాతవికసత్ప్రసవావళిఁ బూని యొయ్యన
వ్వెలఁది వివాహవేది కలివేణులు దేఁ జనుదెంచె సిగ్గునన్. 73

టీ: ఆ+వెలది=ఆ మనోరమ; తళుకుదుకూలశాటిన్=తళతళలాడెడి తెల్లని పట్టుచీరను; కటిన్=నడుమున; తాల్చి = ధరించి; పటీరము = మంచిగంధము; అలంది=పూసి; హార=ముత్యాలహారములు; కుండల=కమ్మలు; మణిపారిహార్య =మణులు పొదివిన గాజులు; రశనా=మొలత్రాడు; కటక=కంకణములు; అంగుళి ముద్రికా+ఆది=వ్రేళ్ళ యుంగరములు మొదలైన; భూషలు=అలంకారములను; తొడి=ధరించి; పారిజాత=కల్పవృక్షము యొక్క; వికసత్=వికసించెడి; ప్రసవ +ఆవళిన్=పువ్వులను; పూని=పెట్టుకొని; ఒయ్యన్=తిన్నగా; అలివేణులు= స్త్రీలు; తేన్=వెంటబెట్టుకొని రాగా; వివాహవేదికిన్ = పెండ్లియరుగువద్దకు; సిగ్గునన్=సిగ్గుతో; చనుదెంచెను=వచ్చెను.

తా: మనోరమ పరిచారికలు తేగా ముత్యాలహారములు, కమ్మలు, కంకణ ములు మున్నగు నాభరణముల ధరించి స్త్రీలు వెంట బెట్టుకొనిరాగా పెండ్లియరుగు కడకు వచ్చెను, అలం. స్వభావోక్తి.

తే. ఇట గృహద్వారసీమకు నేఁగుదెంచు
నాకుమారున కిందీవ రాక్షుఁ డెదురు
సని మరుత్కరి డిగ్గి వం దన మొనర్చు
నతని దీవించి హితమంత్రి యుతము గాఁగ. 73

టీ: ఇటన్=ఇక్కడ; గృహద్వారసీమకున్ = నగరివాకిటి వద్దకు; ఏఁగు దెంచు+ఆ కుమారునకున్ = వచ్చినట్టి ఆ పెండ్లికుమారునకు; ఇందీవరాక్షుడు; ఎదురు+చని; మరుత్+కరిన్=ఐరావతమును; డిగి=దిగి; వందనము+ఒనర్చు+ అతనిన్ = నమస్కరించెడి వానిని; దీవించి, హిత, మంత్రియుతము గాగన్= హితులు; మంత్రులతో కూడునట్లుగా......

తా: నగరివాకిటికి పెండ్లికుమారుడు వచ్చుసరి కిందీవరాక్షుడు ఎదురు సన్నా హాము చేసి, ఐరావతమును దిగి తనకు నమస్కరించిన వరుని దీవించి హితులు మంత్రు లతో సహా అతనిని......

వ. భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతర గృహంబునకుం దోడ్కొని పోవునప్పు డప్పుడమిఱేఁ డెడనెడం బుణ్యాంగన లొసంగు నీరాజనోపచారమ్ము లాదరించుచుఁ గక్ష్యాం తరద్వారదేశంబుల మంగళార్థంబుగా నిడిన పూర్ణకలశ ముకురాది

పదార్థంబులఁ గనుఁగొనుచుఁ దోరణస్తంభాయమానరంభాతరు కిసలయోత్తాలతాళవృంతానిలంబులఁ గుంతలంబులు చలియింప మంథరగతిఁ గింపురుషవృషభుండగు గంధర్వరాజు ప్రధానుం డొసంగు కైదండగొని యల్లనల్లన నడచి పురోహిత బ్రాహ్మణ బంధుపురంధ్రీ సందోహనీరంధ్రంబయి వైవాహిక క్రియారంభ సంభార సంభ్రమద్రంభాదిమరుద్రంభోరువుల కలికి నును సోగ పలుకుల కలకలంబున గొలగొల మను కౌతుకాగారంబు సొత్తెంచి. 75

టీ: భూసుర+ఆశీర్వాదనాదంబులు=బ్రాహ్మణుల యాశీర్వచనఘోషలు; రోదసి=భూమ్యాకాశముల మధ్యభాగము; నిండన్=నిండగా; అభ్యంతర గృహంబునకున్=లోపలి యింటికి; తోడు+కొని=దగ్గరనుండి తీసికొని; పోవునప్పుడు; ఆపుడమిఱేఁడు=ఆ స్వారోచి; ఎడనెడన్=మధ్యమధ్యన; పుణ్యాంగనలు=ముత్తైదువలు; ఒసంగు=ఇచ్చునట్టి; నీరాజన+ఉపచారమ్ములు = నివ్వాళులు మున్నగు ఆచారములను; ఆదరించుచున్ = ప్రీతితో తీసికొనుచు; కక్ష్య+అంతర ద్వార దేశంబులన్=కక్షల లోపలి ద్వారములవద్ద; మంగళ+అర్థంబుగాన్ = మంగళము కల్గునిమిత్తమై; ఇడిన=ఉంచిన; పూర్ణకలశ=నీటితో నిండిన కుండలు; ముకుర =అద్దములు; ఆదిపదార్థంబులన్ -= మొదలైన వస్తువులను; కనుంగొనుచున్ = చూచుచు; తోరణ = ద్వారములకు; సంభాయమాన = స్తంభములుగానున్న; రంభాతరు=అరటి చెట్ల యొక్క; కిసలయ = లేతయాకులనెడి; ఉత్తాల=పెద్ద తాటిచెట్ల; తాళవృంత=వీవనకర్రలయొక్క; అనిలంబులన్=గాలులతో; కుంతలంబులు=కురులు; చలింపన్=ఎగురగా; మంథరగతిన్ = మెల్లని నడకతో; కింపురుషవృషభుడగు=కింపురుషులలో శ్రేష్ఠుడైన; గంధర్వరాజప్రధానుండు=ఇందీవరాక్షుని మంత్రి; ఒసంగుకైదండ=ఇచ్చెడి చేతి యూత; కొని = గ్రహించి— అనగా మంత్రి చేతిని తన చేతితో పట్టుకొని; అల్లనల్లనన్=మెలమెల్లగా; పురోహిత=వివాహము చేయించునట్టి బ్రాహ్మణుడు; బ్రాహ్మణ = ఆశీర్వదించుటకు వచ్చిన బ్రాహ్మణులు; బంధు = చుట్టాలు; పురంధ్రీ = ముత్తైదువల యొక్క; సందోహ=సముదాయముచే; నీరంధ్రంబై = సందులేనిదై; వైవాహికక్రియా= వివాహమునకు సంబంధించిన; క్రియా=పనులయొక్క; ఆరంభ=మొదటియందలి —చేయునప్పుడు కావలసిన; సంభార=వస్తువులను సమకూర్చుటకై; సంభ్రమత్ =తొందరపడెడి; రంభ+ఆది=రంభ మొదలైన; మరుత్+రంభా+ఊరువుల= దేవతా స్త్రీలయొక్క; కలికి=ఇంపైన; నును=మృదువైన; సోగ = ఎడతెగని; పలుకుల కలకలంబులన్=మాటల చప్పుళ్ళతో; గొలగొలమను = సందడియగు; కౌతుక+అగారంబు=పెండ్లిజరుగునింటికి; చొత్తెంచి=ప్రవేశించి......

చ. ప్రభలు నభోవిటంకమున భానుమరీచులఁ బోదిసేయఁ గా
స్తంభనిభనూత్నరత్నపరి శోభితమై గరుడాత్మవేది రు

గ్రీభవము పొల్పగుంజవిక • విద్రుమపాద సువర్ణపీఠిపైఁ
బ్రభుత దలిర్ప మామ పను • ప న్వసించె నుదంచితస్థితిన్. 76

టి: ప్రభలు = కాంతులు; నభః+విటంకమునన్ — ఆకాశము మందర; భానుమరీచులన్ = సూర్యకిరణములను; ప్రోదిసేయన్ = పెంచగా; కౌస్తుభనిభ = విష్ణుని రత్నమును పోలిన; నూత్నరత్న పరిశోభితమై = క్రొత్తరత్నాలతో ప్రకాశించెడి; గరుడ+అశ్మ = గరుడపచ్చలతో చేసిన; వేదిరుక్+విభవము = అరుగు యొక్క కాంతి సౌందర్యము; పొల్పగుంజవికన్ = ప్రకాశించు పెండ్లియరుగుపై; విద్రుమపాద = పవడాల కోళ్ళుకల; సువర్ణ పీఠిన్ = బంగారు పీటపై; ప్రభుత = ప్రాభవము—హోదా; తలిర్పన్ = ఒప్పగా; మామ = ఇందీవరాక్షుడు; పను పన్ = అనుజ్ఞ నీయగా; ఉదంచితస్థితిన్ = గొప్పఠీవితో; వసియించెన్ = కూర్చుండెను.

తా: తనలో పొదివిన రత్నాల కాంతులు సూర్యకాంతిని హెచ్చించగా, కౌస్తుభ మాణిక్యమువలె ప్రకాశించు మణులు కలదై, పచ్చల కాంతితో నిండైన పెండ్లియరుగుమీద పవడములతో చేసిన కోళ్ళుకల బంగారు పీటపై మామ చెప్పగా స్వరోచి కూర్చుండెను.

క. విధియుతముగ ఖచరుఁ డవ
న్యధినాధున కొసంగెఁ బసిడి • హరివాణమునన్
మధురమఖభుగ్గవీదధి
మధురస సంపర్కమయిన • మధుపర్కంబున్. 77

టీ: ఖచరుడు = ఇందీవరాక్షుడు; అవనీ+అధినాథునకున్ = స్వరోచికి; విధియుతముగన్ = శాస్త్రవిహితమైన రీతిగా; పసిడి హరివాణమునన్ = బంగారు పళ్ళెరములో; మధుర = తియ్యని; మఖభుక్+గవీ = కామధేనువు యొక్క; దధి = పెరుగుతోడి; మధురస = తేనెయొక్క; సంపర్కమయిన = కలయికకల; మధుపర్కమున్ = పాలు, పెరుగు, తేనె కలిపిన ద్రవ్యమును; ఒసగెన్ = ఇచ్చెను; పెండ్లిలో కన్యాదాత వరునకు మధుపర్క మియ్యవలెను; మధుపర్కమనగా పాలు, పెరుగు, తేనె కలిపినదే.

తే. అంచితాకృతి సాక్షాత్క • రించి నట్టి
రమకుఁ బ్రతివచ్చు సురమనో • రమ మనోర
మ యనుదాని ననుంగు జా • మాతఁ గైట
భారిసరి గాఁగ నర్చించి • దారవోసె. 78

టీ: (ఇందీవరాక్షుడు) అనుంగుజామాతన్ = ముద్దుటల్లుని; కైటభారిసరిగాఁగన్ = విష్ణువుతో సమముగా; అర్చించి = పూజించి; అంచిత+ఆకృతిన్ = ఇంపైన రూపముతో; సాక్షాత్కరించినట్టి రమకున్ = ప్రత్యక్షమైన లక్ష్మితో; ప్రతివచ్చు

=సాటివచ్చు; మరమనోరమ=దేవతలకు మనోహరమైన; మనోరమయనుదానిన్ =మనోరమ యను పేరు కల దానిని; దారవోసెన్=ధారాపూర్వకముగా దానము చేసెను. కన్యాదానము చేయునప్పుడు 'దాస్యామి విష్ణువేతుభ్యం' విష్ణుస్వరూపుడవైన నీ కిచ్చుచుంటినని వధూవరులను లక్ష్మీనారాయణులతో పోల్చుట సంప్రదాయము. అలం. ఉపమ.

క. తదనంతరంబ హర్షము
పొదలు మదిన్ మెట్టుఁబ్రాల ♦ పుట్టికలయెడం
గదియంబట్టిన పెందెరఁ
గదియించిరి బంధుజనులు ♦ కన్యావరులన్. 79

టీ: తదనంతరంబ=కన్యాదానము కాగానే; బంధుజనులు = చుట్టాలు; హర్షముపొదలు+సంతోషమెక్కువగు; మదిన్ = మనస్సుతో; మెట్టుఁబ్రాలపుట్టి కల యెడన్=అక్షతలున్న గంపలున్న చోటికి; కదియంబెట్టిన పెందెరన్=దగ్గరగా వేయించిన పెద్దతెరను; కన్యావరులన్ = వధూవరులను; కదియించిరి=దగ్గరగా కూర్చుండబెట్టిరి.

తా: కన్యాదానము కాగానే పెండ్లి పెద్దలు సంతోషించి వధూవరులను సేసల గంపలున్న పెద్దతెరకు ప్రక్కగా కూర్చుండ బెట్టిరి.

ఉ. అప్పుడు తూర్యముల్ మొరయ ♦ సమ్మిథునమ్ము విలోకనస్పృహం
దెప్పలఁ దేల వంపఁబడు ♦ తెల్లని చీర తెరం గ్రమంబునం
గొప్పు మొగంబు నబ్బుఁ జనుఁ ♦ గొండలుఁ దోప లతాంగి పోలెఁ జె
ల్వుప్పతిలన్ సుధారస ప ♦ యోనిధి పెందెరఁ బుట్టు నిందిరల్. 80

టీ: అప్పుడు; తూర్యముల్=వాద్యములు; మొరయన్ = వాయించగా; ఆ+మిథునమ్ము=ఆ దంపతులు; విలోకనస్పృహన్=ఒకరినొకరు చూచుకొను కోరి కతో; తెప్పలదేలన్ = తేలియాడగా; వంపఁబడు = క్రిందికి వంచబడుచున్న; తెల్లని చీర తెరన్=తెల్లని తెర చీరయందు; క్రమంబునన్=వరుసగా; కొప్పును; మొగంబున్; అబ్బున్=మెడయును; చనుఁగొండలున్=కొండలవంటి చన్నులును; తోఁపన్=కన్పడగా; లతా+అంగి=మనోరమ; చెల్వు=అందము; ఉప్పతిల్లన్ =ఎక్కువకాగా; సుధారస పయోనిధి=పాలసముద్రము యొక్క; పెను+తెరన్ =పెద్దకెరటమందు; పుట్టునిందిరన్=పుట్టుచున్న లక్ష్మీదేవిని; పోలెన్=పోలి యుండెను.

తా: అప్పుడు భేరీమృదంగాది మంగళ వాద్యములు మ్రోయగా ముత్తైదువలు తెరను కొద్దికొద్దిగా క్రిందికి దింపిరి. అంతట పెండ్లికూతురు కొప్పు, ముఖము, కంఠము, స్తనములుగా వరుసగా కన్పట్టెను. అట్లు కన్పడుట పాలసముద్రములో లక్ష్మీదేవి పుట్టుచున్నట్లున్నది. అలం. ఉపమ.

చ. కటకరవంబుఁ బోరు కలఁగగన్ రమణున్ తెరచీర వంచినన్
దటుకున రాజుమో మెదుటఁ దారసమైన లతాంగి నేత్రముల్
చటులత లజ్జఁ దల్లడిలె జాలరి చేవలఁ బాసి ధాత్రిపై
నటు నిటు మిట్టి మిట్టిపడు నంబుచరంబులుఁ బోలె నత్తరిన్. 81

టీ: అత్తఱిన్=అప్పుడు; కటకరవంబు=కంకణముల చప్పుడు; బోరుకలుగన్=గల్లున మ్రోయగా; రమణుల్=స్త్రీలు; తెరచీర=తెరగుడ్డను; వంచినన్=వంచగా; తటుకునన్=తటాలున; రాజుమోము = స్వరోచి ముఖము; ఎదుటన్; తారసమైనన్=దగ్గరపడగా; లతాంగి నేత్రముల్=మనోరమ కన్నులు; చటులతన్=కదలుటచే; లజ్జన్=సిగ్గుతో; జాలరిచే వలన్=పల్లెవాని చేతిలోని వలను; పాసి=తొలగి; ధాత్రిపైన్=భూమిమీద; అటునిటు; మిట్టిమిట్టిపడు = ఎగిరిపడెడి; అంబుచరంబులుఁ బోలెన్=చేపలు వలెనే; తల్లడిలెన్=చలించెను.

తా: స్త్రీలు తెరచీరను దింపగానే హఠాత్తుగా రాజు ముఖము కన్పడగానే సిగ్గుతో మనోరమ కన్నులు, చేపలవాని చేతివలనుండి క్రిందికి పడి అట్టిట్టు మెదలెడి చేపలవలె కదలినవి. అలం. ఉపమ.

మ. అవనీశత్రిదశేంద్రుచూపు బరి కన్యాగండపాళిద్వయీ
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతం జెంత ఫాలంపు రా
జు విలోకించి చలించి కైకొనిన యా సొమ్మెల్ల ఘర్మాంబుకై
తవ మొప్ప న్వెస డించి తూఱెఁ గబరీతాపింఛకుంజాంతమున్. 82

టీ: అవనీశత్రిదశేంద్రు=రాజులలో శ్రేష్ఠుడైన స్వరోచి యొక్క; చూపు బరి=చూపనెడి దొంగ; కన్యా=వధువు యొక్క; గండపాళిద్వయీ=చెక్కిళ్ళ జంట యొక్క; నవ=క్రొత్తదైన; లావణ్యరసంబున్=అందమును; కొల్లగొని=దోచుకొనిపోయి; అంతన్=దోచుకొనునప్పుడు; చెంతన్ = దగ్గరలో; ఫాలంపు రాజున్ = మొగమనెడి రాజును; విలోకించి=చూచి; చలించి=భయపడి; కైకొనిన యా సొమ్మెల్లన్=దోచుకొన్న ధనమంతను; ఘర్మ+అంబుకైతవము=చెమటయను మిష; ఒప్పన్=ఒప్పునట్లుగా; వెసన్=వెంటనే; డించి=దిగవిడిచి; కబరీ=కొప్పులనెడి; తాపింఛ=తాపింఛపు చెట్లయొక్క; కుంజ+అంతమున్=పొదరింటి లోనికి; తూఱెన్=దూరెను.

తా: స్వరోచి చూపు మనోరమ యొక్క చెక్కిళ్ళ కాంతిని దొంగిలించి వెళ్ళుచు దగ్గరలోనున్న ముఖమనెడి చంద్రుని(రాజును)చూచిభయపడిచెమటయను వంకతో దోచుకొన్న సొమ్మునంతను పారవిడిచి కొప్పనెడి చీకటిచెట్లగుంపులోనికి దూరి దాగెను. స్వరోచి చూపులతో చెక్కిళ్ళకాంతిని, ముఖమును, కొప్పును తనివార త్రాగగా, అప్పుడు కల్గిన యానందముతో చెమట పట్టినది. చెమటపట్టుట సాత్త్వికభావము. అలం. రూపకము, అపహ్నుతియు.

ఆ. రాజుచూడ్కి కపుడు రాజీవముఖిచూడ్కి
లెదురుకొనియె లజ్జఁ గొదికి కొదికి

జడిసి జడిసి జహ్ను సంభవాంభోవేణి
కెదురు లెక్కమీలఁ గొఁదమ లనఁగ. 83

టీ: అప్పుడు; రాజుచూడ్కికిన్ = స్వరోచి చూపునకు; రాజీవముఖి చూడ్కులు = మనోరమ చూపులు; లజ్జన్ = సిగ్గుచే; కొదికి కొదికి = జంకి జంకి; జడిసి జడిసి = చలించి; జహ్నుసంభవ+అంభః+వేణికిన్ = జహ్నుముని వలన పుట్టిన గంగయొక్క ప్రవాహమునకు; ఎగురులెక్క = ఎదురుగా వెళ్ళెడి; మీలకొదమలన గన్ = పడుచు చేపలా అనునట్లు; ఎగురుకొనియెన్ = ఎగురుగా వెళ్ళినవి.

తా: పెండ్లికొడుకు చూపులను పెండ్లికూతురి చూపు లెగుర్కొనుట గంగా ప్రవాహమునకు చేప లెగురీగు చున్నట్లున్నది. అలం. ఉత్ప్రేక్ష.

మ. తనుమధ్యత్రివళుల్ నటింప నిలమీఁదన్ మట్టియ ల్మ్రోవఁగాఁ
గనుపాపల్ పయిఱెప్పలం గదియ నుత్కంఠాగ్రయై నిక్కి నా
ధునిమౌళిం దలఁబ్రాలు వోసె నవలా దోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండలధళల్ సాహోనినాదం బిడన్. 84

టీ: తనుమధ్యత్రివళుల్ = సన్నని నడుము; మూడువళులును; నటింపన్ = అసియాడగా; ఇలమీదన్ = భూమిపై; మట్టియల్ = కాలిమెట్టెలు; మోవగాన్ = అనగా; కనుపాపల్ = కంటిలోని నల్లగ్రుడ్లు; పయిఱెప్పలన్ = పైనున్న రెప్పలను; కదియన్ = చేరగా; ఉత్కంఠ+అగ్రయై = ఎత్తబడిన చివరి భాగము కలదై; నిక్కి = పైకిలేచి, దోర్మూల = చంకలను; కూలంకష = ఒరయుచున్న; స్తనవిస్ఫూర్తికిన్ = స్తనముల యందమునకు; సందిదండలధళల్ = మెడలోని హారముల తళుకులు; సాహోనినాదంబిడన్ = సాహోఅను ధ్వనిచేయగా; నవలా = మనోరమ; నాథుని మౌళిన్ = భర్తతలపై; తలఁబ్రాలు = తలమీద పోసికొను ప్రాలను; పోసెన్.

తా: మనోరమ నడుము, వళులు అల్లలనాడగా, స్తనములు భుజమూలముల నొరయుచు నందగింపగా, మెడలోని దండలు చప్పుడుకాగా, కన్నులు పైకెత్తి చూచుచు మగనితలపై తలబ్రాలు పోసెను. అలం. స్వభావోక్తి.

చ. ముడివడు కంకణప్రభల ముత్తెపుసేసలు దోయిలించి యె
త్తెడుతఱి బాహుమూలకుచ దీప్తులపైఁ బతిదృష్టి పర్వ నం
బొడమిన లజ్జఁ బాణియుగళమున్ వెస వంచి యమౌళిమీఁదికై
పొడవునఁ జల్లె లేనగవు పొల్తుక ఱెప్పల నప్పళించుచున్. 85

టీ: ముడివడు = మెలికలు పడెడి; కంకణప్రభలన్ = కంకణముల కాంతులతో; ముత్తెపుసేసలు = ముత్యాల తలబ్రాలు; దోయిలించి = దోసిలితో తీసికొని; ఎత్తెడుతఱిన్ = పైకెత్తునపుడు; బాహుమూలకుచ దీప్తులపైన్ = బాహుమూలముల యొక్క; స్తనముల యొక్క కాంతుల మీదికి; పతిదృష్టి = భర్తచూపు; పర్వినన్ = వ్యాపించగా; పొడమినలజ్జన్ = కల్గిన సిగ్గుతో; పాణియుగమున్ = రెండుచేతులను; వెసన్ = వెంటనే; వంచియ = క్రిందికివంచియే; లేనగవు = చిరునవ్వు;

ఱెప్పలన్ = కనురెప్పలతో; అప్పళించుచున్ = కప్పుచు; మౌళిమీఁదికై = భర్త తల మీఁదికని; పొడువునఁ జల్లెన్ = పైకెగజల్లెను.

తా: అప్పుడు మనోరమ తలఁబ్రాలు పోయుటకై చేతుల నెత్తగా బాహువులు మెరయగా, స్తనములును భర్త చూచెనని సిగ్గిలి, చిరునవ్వు నవ్వుచు చేతులు క్రిందికుంచియే తలమీఁద పడునట్లు ముత్యాల నెగజల్లెను. అలం. స్వభావోక్తి. ఇందా కారగోపనము లక్షణము కల యవహిత్థము చెప్పబడెను.

క. సకలక్ష్మాపతి యిడఁ గొ
మ్మ కచంబులనుండి రాలె ◊ మౌక్తికములు సా
త్త్వికజనితగండఘర్మాం
బు కదంబాసారగరిమఁ ◊ బునరుక్తములై. 86

టీ: సకలక్ష్మాపతి = చక్రవర్తియగు స్వరోచి; ఇడన్ = తలఁబ్రాలు పోయఁగా; కొమ్మకచంబులనుండి = మనోరమ జుట్టునుండి; మౌక్తికములు = ముత్యాలు; సాత్త్విక = సాత్త్వికమను మనోభావమువలన కల్గిన; గండ = చెక్కిళ్ళయందలి; ఘర్మ + అంబు = చెమటనీటియొక్క; కదంబ + ఆసార = వర్షముయొక్క; గరిమన్ = ఎక్కువను; పునరుక్తములై = ఇనుమడించినవై; రాలెన్ = క్రిందికి పడినవి.

తా: స్వరోచి పోసిన ముత్యాలు మనోరమ తలనుండి చెక్కిళ్ళకు పట్టిన చెమటతో సహా క్రిందికి పడినవి. స్త్రీ పురుషులకు ప్రథమ దృష్టిపాతాదులు జరిగినపుడు కల్గెడి మనోభావములే సాత్త్విక భావములు. వానివలననే చెమట పట్టుట, గగుర్పాటు కల్గుట మున్నగునవి కల్గును. అలం. ఉపమ.

క. పతి సతిపై నిడు ముక్తా
వితతి పడం దొడఁగె వడి భ ◊ విష్యత్పురుషా
యిత నిర్దయరతిరభస
చ్యుతసితకబరీప్రసూన ◊ సూచక మగుచున్. 87

టీ: పతి = స్వరోచి; సతిపైన్ = మనోరమపై; ఇడు = పోసెడి; ముక్తావితతి = ముత్యాల సముదాయము; భవిష్యత్ = ముందుజరుగబోవు; పురుషాయిత = పురుషునివలె నాచరించు; నిర్దయ = దయమాలిన; రతి = గాఢమగునుపరతియొక్క; రభస = వేగముచే; చ్యుత = రాలిన; సిత = తెల్లని; కబరీప్రసూన = కొప్పునందలి పువ్వులను; సూచకమగుచున్ = సూచించునదై; వడిన్ = వేగముగా; పడందొడగెన్ = పడనారంభించెను.

తా: స్వరోచి పోయు ముత్యాలు తలనుండి, మున్ముందామె పురుషాయితము సేయు వేళ గాటమ్మగు వేగాన కొప్పునుండి జలజల రాలెడి తెల్లని పూలను సూచించునవై క్రిందికి పడినవి. అలం. ఉత్ప్రేక్ష.

శా. కట్టెన్మాంగళసూత్రమున్ శరధిశం ఖశ్రీలకున్ బొమ్మలం
గట్టం జాలెడు కంఠపీఠి నిఖిల క్ష్మాభర్త శోణద్యుతుల్
దట్టంబై నఖకోరకోత్కరము త ద్గ్రైవేయహైమస్ఫుర
త్పట్టస్థాపితపద్మరాగముల పం క్తంబుల్ విడంబింపఁ గాన్. 88

టీ: నిఖిలక్ష్మాభర్త = చక్రవర్తియగు స్వారోచి; శోణద్యుతుల్ = ఎఱ్ఱని కాంతులు; దట్టంబై = తరచై; నఖకోరక+ఉత్కరము = మొగ్గల వంటిగోళ్ళ సమూదాయము; తత్ = మనోరమయొక్క; గ్రైవేయ = కంఠాభరణమగు; హైమ = బంగారుతో చేయబడిన; స్ఫురత్ = ప్రకాశించెడి; పట్ట = పట్టెడయందు; స్థాపిత = పొదుగబడిన; పద్మరాగ = కెంపులయొక్క; పంతంబుల్ = ఎక్కువకాంతులను; విడంబింపగాన్ = అనుకరించగా; శరధి శంఖశ్రీలకున్ = సముద్రముతోని శంఖముల కాంతికి; బొమ్మలన్+కట్టన్ = వానిని జయించి, వాని ప్రతిరూపములను కట్టుకొనుటకు; జాలెడికంఠపీఠిన్ = సమర్థమైన కంఠమున; మంగళసూత్రమున్; కట్టెన్ = కట్టెను.

తా: స్వారోచి తన గోళ్ళకాంతి మనోరమ మెడలోని బంగారు ఆభరణములలో పొదుగబడిన కెంపులకాంతిని మించగా శంఖములను జయింపగలయామె మెడలో మంగళసూత్రమును కట్టెను. అలం. ఉపమ. మహాపురుషుల గోళ్ళెఱ్ఱగా ప్రకాశించు ననియు, కంఠము శంఖముతో సమముగా నుండుననియు సాముద్రిక శాస్త్రనిర్వచనము.

క. అట్టియెడఁ బెండ్లిపనులన్
దిట్టలగుపురంధ్రు లచట ని లిపిరి వహ్నిం
బెట్టిరి మణిపీఠి సురీ
పట్టముపైఁ బఱచి రందుఁ బతియున్ సతియున్. 89

టీ: అట్టియెడన్ = అప్పుడు; పెండ్లిపనులన్ = పెండ్లిపనులు చేయుటలో; దిట్టలగుపురంధ్రులు = నేర్పరులైన ముత్తైదువలు; అచటన్ = పెండ్లివేదికవద్ద; వహ్నిన్ = హోమములకై అగ్నిహోత్రమును; నిల్పిరి = తెచ్చియుంచిరి; మణిపీఠిన్ = మణులు పొదవిన పీటను; పెట్టిరి = తెచ్చివేసిరి; పైన్ = పెండ్లిపీటపై; సురీపట్టము = నూరతుపట్టుబట్టను; పరచిరి; అందున్ = దానిపై; పతియున్; సతియున్ = వధూవరులు; (కూర్చుండి)......

తా: మాంగళ్యధారణమైన తర్వాత ముత్తైదువలు పెండ్లి వేదికపై అగ్నిహోత్రమునుంచి, మణులు పొదివిన పెండ్లి పీటను వేసిరి. వధూవరులు దానిపై కూర్చుండి......

క. ఆశుద్విజహుతహరిత శ
మీశాఖాశకలనినద మేదురవిశదా

భీశు జ్వాలాజాల హు
తాశక్రోడమున వేల్చి ర్రాహుతు లెలమిన్. 90

టీ: ఆశు=తొందరగా; ద్విజహుత=బ్రాహ్మణులచే హోమము చేయబడిన; హారిత=పచ్చని; శమీశాఖాశకల=జమ్మిసమిధలయొక్క; నినదమేదుర=చిటపట ధ్వనితో ఎక్కువైన; విశద=స్వచ్ఛమైన; అభీశు=కాంతికల; జ్వాలాజాల=మంటలుకల; హుతాశక్రోడమునన్ = అగ్నిలో; ఎలమిన్ = సంతోషముతో; ఆహుతులు=హోమములు; వేల్చిరి=చేసిరి.

తా: బ్రాహ్మణులు మంత్రములు చెప్పుచుండగా దంపతులు జమ్మిసమిధలతో మండెడి జ్వాలలో ఆజ్యాద్యాహుతుల జేసిరి.

తే. తోయజామోదలాజలు దోయిలించి
ప్రమదమున వేల్వ నొకకొన్ని చెమట నంట
వ్రేళ్లు గనుపట్టెఁ గెంజాయ వీతిహోత్రు
నాలుకలు సాటి రాకున్న నవ్వె ననఁగ. 91

టీ: తోయజ+ఆమోద=మనోరమ; లాజలు=పేలాలను; దోయిలించి=దోసిలితో పుచ్చుకొని; ప్రమదమునన్=సంతోషముతో; వేల్వన్ = హోమము చేయగా; ఒకకొన్ని=కొన్ని పేలాలు; చెమటన్=చెమటతో; అంటన్=వ్రేళ్లనంటుకొనగా; వ్రేళ్లు; కెంపు+చాయన్=ఎర్రని రంగుతో; వీతిహోత్రునాలుకలు=అగ్నియొక్క నాలుకలైన మంటలు; సాటిరాకున్నన్=సరిపోలలేకపోగా; నవ్వెననగన్=నవ్వెనాఅన్నట్లు; కనుపట్టెన్=కన్పడెను.

తా: లాజహోమము చేయునప్పుడు చెమటచే వ్రేళ్ళనంటుకొన్న పేలాలు అగ్నిజ్వాలలు తమ్ము పోలవని వ్రేళ్ళు నవ్వుచున్నవా అన్నట్లున్నవి, అనగా ఆమె వ్రేళ్ళు ఎర్రగా అందముగా నున్నవని భావము.అలం. ఉత్ప్రేక్ష.

తే. స్తనగుళుచ్ఛవధూదేహ దాడిమీల
తామతల్లికపై హోమ ధూమ మడరె
భర్త నభిమతరతిమహా ఫలవిపాక
మగుటఁ గోరి ఘటించు దోహద మనంగ. 92

టీ: స్తనగుళుచ్ఛ=స్తనములను పూగుత్తులుకల; వధూదేహ=పెండ్లికూతురి దేహమును; దాడిమీలతామతల్లికపైన్ = దానిమ్మచెట్టుపైకి; హోమధూమము=హోమపుపొగ; భర్తకున్; అభిమత=ఇష్టమైన; రతి=సురతమనెడి; మహాఫల విపాకము=గొప్పపండు పండుటను; కోరి; ఘటించుదోహదము = చేసెడి దోహదము; అనంగన్=అనునట్లు; అడరెన్=వ్యాపించెను; 'మేషామిషాంబు సంసేక స్తత్కాలామిషధూపనం। శ్రేయానయం ప్రయోగస్స్యాద్దాడిమీఫల వృద్ధయే' అని లక్షణము.

తా: చెట్లు ఆకాలములో కూడ పూచుటకు, కాయుటకును చేయుపనులే దోహదము. అందులో దానిమ్మకు దోహదక్రియ పొగవేయుట. మనోరమ యనెడి దానిమ్మచెట్టు భర్త కిష్టమైన సురతఫలమును కాయవలెనని పొగ వేయుచున్నారా అన్నట్లు హోమధూమ మామె శరీరమంతటను వ్యాపించెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

మ. జగతీనాథవతంస మానతశిర స్సమ్మేళనన్ నెయ్యపుం
జగడంబుల్ ప్రియ యొప్పమాన్పడుతఱిం జంచత్కిరీటాగ్ర ర
త్నగణస్పర్శసహంబు గావలసియో నాకోర్కి దైవారఁ న
మ్మగువం బాదతలంబు వట్టి సనెకల్ మట్టించె మోదంబునన్.

టీ: జగతీనాథవతంసము = రాజశ్రేష్ఠుడగు స్వారోచి; ఆనత = వంచబడిన; శిరః + సమ్మేళనన్ = తలలు కలుపుటతో; నెయ్యపుంజగడంబుల్ = కలుగబోవు ప్రణయ కలహములు; ప్రణయ = ప్రేమ; ఒప్పన్ = ఒప్పునట్లు; మాన్పడుతఱిన్ = మానునప్పుడు; చంచత్ = ప్రకాశించెడి; కిరీట + అగ్ర = కిరీటము చివరనున్న; రత్నగణస్పర్శ = మణులతో స్పృశించుటకు; సహంబు = ఓర్చుకొనుట; కావలసియో నాన్ = కావలసియేమో అన్నట్లు; కోర్కి = తన కోరిక; దైవారన్ = అతిశయింపగా; మోదంబునన్ = సంతోషముతో; ఆ + మగువన్ = ఆ మనోరమను; పాదతలంబుపట్టి = అరకాలుపట్టుకొని; సనెకల్ = సన్నికల్లును; మట్టించెన్ = త్రొక్కించెను.

తా: స్వారోచి తలవంచుకొని మనోరమ కాలుపట్టుకొని సన్నికల్లు త్రొక్కించెను. అది ముందుకల్గబోవు ప్రణయకలహములను తీర్చుటకై తానామె పాదములకు కిరీటము సోకునట్లు మ్రొక్కగా రత్నములు తాకుట సలవాటు చేయుచున్నట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

క. కడు నవ్వించుచుఁ జెఱఁగులు
ముడి వెట్టెన్ బేరఁటాండ్రు ముదితకనుబొమల్
ముడివెట్టె నాలి సిగ్గున
ముడివెట్టెన్ నారి చెఱకు మోసున మరుఁడున్. 94

టీ: పేరఁటాండ్రు; కడున్ = మిక్కిలి; నవ్వించుచున్; చెఱఁగులు = వధూవరుల బట్టల కొంగులను; ముడివెట్టన్ = ముడివేయగా; ముదిత = మనోరమ; నాలి సిగ్గునన్ = దొంగసిగ్గుతో; కనుబొమల్ ముడివెట్టెన్ = కోపము వచ్చినట్లుగా కనుబొమ్మలు ముడుచుకొనెను. మరుడును = మన్మథుడుకూడ; చెఱకుమోసునన్ = తనకు విల్లగు చెఱకుగడకు; నారి = నారిని; ముడివెట్టెన్ = ముడివేసెను.

తా: పేరంటాండ్రు వధూవరుల కొంగులకు నవ్వు రప్పించు మాటలనుచు ముడి వెట్టిరి. పెండ్లికూతురు తెచ్చికొన్న కోపముతో మొగము ముడుచుకొనెను. మన్మథుడు తన వింటికి నారి బిగించెను. అలం. ఆవృత్తిదీపకము.

సీ. పరిణమించిరి ధరా మర పురంధ్రీహ స్త
ఘటితచేలాంచల గ్రంథికలనఁ
బరిపూర్ణనిష్ఠఁ గొ ల్చిరి ప్రదక్షిణపూర్వ
వినతి నాలుక లార్చు వేఁడివేల్పు
వీక్షించి రుడువీధి నక్షీణసుస్థితి
స్థాయిఁ దోషితరమా ధవుని ధ్రువునిఁ
బరిణయప్రాప్త స ప్తర్షిప్రియాప్రేక్ష్య
సాక్షా దరుంధతీ సతి కెరఁగిరి.

గీ. సకలసంయమిగణనమ స్కారకృత్య
మాచరించి తదీయహ స్తాభిమంత్రి
తాక్షతలు మౌళిఁ దాల్చి ర త్యాదరమున
దంపతులు బంధుకోటి కు త్సవ మెలర్ప. 95

టీ: దంపతులు=ఆ క్రొత్తజంట; బంధుకోటికిన్=చుట్టాలందరికిని; ఉత్సవము=వేడుక; ఎలర్పన్=ఎక్కువకాగా; ధరా+అమరపురంధ్రీ = బ్రాహ్మణ పుణ్యస్త్రీలయొక్క; హస్తఘటిత=చేతులతో వేయబడిన; చేల+అంచల=కొంగు చివరలనున్న; గ్రంథికలనన్=ముడివలన; పరిణమించిరి=సంతసించిరి; నాలుకలు +అర్చు=మంటలు చాపెడి; వేడివేల్పున్=అగ్నిని; ప్రదక్షిణ పూర్వవినతిన్= ప్రదక్షిణముగా తిరిగిచేయు నమస్కారములతో; పరిపూర్ణనిష్ఠన్=మిక్కిలి శ్రద్ధతో; కొల్చిరి=సేవించిరి; అక్షీణసుస్థితస్థాయిన్=ఉన్నత పదవిలోనున్నట్టియు; తోషితర మాధవుని=సంతోషపెట్టబడిన విష్ణువుకల; ధ్రువునిన్; ఉడువీధిన్=ఆకాశమున; వీక్షించిరి=చూచిరి; పరిణయ=పెండ్లికి; ప్రాప్త=వచ్చియున్న; సప్తర్షి=సప్త ఋషులలో; ప్రేక్ష్య=చూడదగిన; సాక్షాత్=ప్రత్యక్షమైన; అరుంధతీసతికిన్ =అరుంధతీదేవికి; ఎరఁగిరి=మ్రొక్కిరి; సకలసంయమిగణ=మునులందరికి; నమ స్కారకృత్యము=నమస్కరించుటను; ఆచరించి=చేసి; తదీయహస్త = వారిచేతు లతో; అభిమంత్రిత+అక్షతలు=మంత్రింపబడిన అక్షతలను; అత్యాదరమునన్= మిక్కిలి గౌరవముతో; మౌళిన్=తలపై; తాల్చిరి=ధరించిరి.

తా: ఆ దంపతులు బాపనముత్తయిదువలు వేసిన బ్రహ్మముళ్ళకు సంతోషించిరి. అగ్నిహోత్రునికి ప్రదక్షిణములు చేసిరి. ధ్రువుని దర్శించిరి. సప్తర్షులతో పాటుగావచ్చి అరుంధతీదేవిని ప్రత్యక్షముగా చూచిరి. మునుల కందరికిని నమస్కరించి వారు మంత్రించి చల్లిన దీవనబ్రాలను శిరసాధరించిరి. అలం. స్వభావోక్తి.

ఉ. కూరిమిమంత్రితోడ నల కూబరుఁ డేకత మాడి పెద్దబం
గారఘఁగోరఁ గల్పవని కా జని కాంతము లైనచీరలున్

హారవిభూషణావళియు ♦ నమ్మిథునంబునకుం బ్రియంబుతో
నారదమానిచేత నద ♦ నం జదివించెఁ గుబేరుపేరుగాన్. 96

టీ: నలకూబరుడు=కుబేరునికొడుకు; కూరిమిమంత్రితోడన్=తనకిష్టుడైన మంత్రితో; ఏకతమాడి=ఆలోచించి; పెద్దబంగారపుఁగోరన్=పెద్దదైన బంగారు పళ్ళెరములో; కల్పవనికొ=కల్పవృక్షమునుండి; జని = పుట్టుక కలిగిన—పుట్టిన; కొంతములైన = సుందరములైన; చీరలున్ = వస్త్రములను; హారవిభూషణావళియున్ = ముత్యాల హారముల,నగలవరుసలును; ప్రియంబుతోన్ = ఇష్టముతో; ఆ+మిథునంబునకున్=ఆ దంపతులకు; నారదమాని చేతన్ = నారద మహర్షి చే; అదను+అన్=తగిన సమయమున; కుబేరుపేరుగాన్=కుబేరుని పేరిట; చదివించెన్ =నల్గురికి తెలియునట్లుగా మంత్ర పూర్వకముగా చెప్పించెను.

తా: నలకూబరుడు మంత్రితో నాలోచించి బంగారు పళ్ళెరములనుంచి కల్ప వృక్షమునుండి పుట్టిన చీరలను, అలంకారములను తండ్రి యగు కుబేరుని పేరిట దంపతులకు కానుకలుగా చదివించెను.

క. కలిమి మెఱయంగ మఱియుం
గలబాంధవు లొసఁగి రపుడు ♦ కాంచనమణిభూ
షలుఁ జీరలు నరపతికిం
బొలఁతికి నుడుగరలు ముదము ♦ పొదలఁగ నంతన్. 97

టీ: అపుడు, మఱియున్=తర్వాత; కల బాంధవులు=ఉన్న బంధువులు; కలిమి=తమసంపత్తు; మెఱయంగన్=మెఱయునట్లు; కాంచన మణిభూషలును= బంగారు రత్నాల నగలును; చీరలున్ = వస్త్రములును; ముదముపొదలగన్= సంతోష మెక్కువకాగా; నరపతికిన్=స్వారోచికి; పొలఁతికిన్=మనోరమకును; ఉడుగరలు=కానుకలు; ఒసఁగిరి=ఇచ్చిరి; అంతన్=తర్వాత......

తా: నలకూబరుని తర్వాత మిగిలిన బందుగులు వారి సంపద కొలది బంగారు, రత్నాల నగలు, వస్త్రములు మున్నగు కానుకలను దంపతులకు చదివించిరి.

సీ. పొగడపూవంటికం ♦ పుల మదాంబువులును
మధువర్ణదంత శం ♦ బములు మెఱయ
భీకరస్వరచారు ♦ బృంహితంబులు ఘనాం
గారకగ్రహకాంతి ♦ కన్ను లమర
నిలఁ జుట్టువడు తొండ ♦ ముల మించు పూర్వాంగ
మెత్తరంబై పిఱుం ♦ దత్తమిల్లఁ
గటము లుత్కటములై ♦ నిటలముల్ బటువులై
సిబ్బెంపుమొగముల ♦ నుబ్బుమీఱ

సీ. స్వర్ణకక్ష్యాంకుశప్రాస శరధిశార్ఙ్గ
ఖేటకుథఘంటి కాద్యలంకృతులఁ జెలున
మెసఁగు గంభీరవేది భ ద్రేభశతము
నల్లునకు నిచ్చె గంధర్వ వల్లభుండు. 98

టీ: పొగడపూవంటి=పొగడ పూవువంటి; కంపుల=వాసనకల; మదాంబువులును=మదజలమును; మధువర్ణ=తేనెరంగుకల; దంతశంబములు=వజ్రమువంటి దంతములును; మెఱయన్=ప్రకాశింపగా; భీకరస్వర=భయంకరమైన స్వరములు; చారుబృంహితములు=చెవుల కింపైన ఘీంకారములును; ఘన + అంగారక గ్రహకాంతి=గొప్పదైన కుజగ్రహము యొక్క యెఱ్ఱని కాంతికల; కన్నులు; అమరన్=ఒప్పగా; ఇలన్ = భూమిపై; చుట్టువడు తొండములఁ = చుట్టుకొని పడెడి తొండములతోను; మించుపూర్వాంగము = గుంపుగానున్న తలయుండు ప్రదేశము; ఎత్తరంబై=ఎత్తుగానున్నదై; పిఱుందు=వెనుక భాగమును; అత్తమిల్లన్ = తగ్గియుండగా; కటములు=చెక్కిళ్ళు; ఉత్కటములై=విశాలములై; నిటలములు=ఫాలప్రదేశములు; బటువులై = వర్తులవగానుండి; సిబ్బెంపుమొగములన్ = పొడలున్న ముఖములపై; ఉబ్బు=ఎత్తు; మీఱన్=బాగుగా నుండగా; స్వర్ణ=బంగారుతో చేసిన; కక్ష్య=నడ్డికట్టు; అంకుశ=అంకుశము—ఏనుగును త్రోలెడి పరికరము; ప్రాస=ఈటె; శరధి=అమ్ములపొది; శార్ఙ్గ=విల్లు; ఖేట=డాలు; కుథ=ఏనుగు మీదపరచెడి కంబళి; ఘంటికా=గంట; ఆది=మొదలైన; అలంకృతులన్=అలంకారములతో; చెలువము+ఎసగు=అందముగానున్న; గంభీరవేది = మదమెక్కి దేహమున తూలాడినను; రక్తము కారినను, మాంసమూడినను తెలియని పరిస్థితిలో నున్న; భద్ర+ఇభ=మంచి జాతి యేనుగులు; శతమున్=వందలను; గంధర్వవల్లభుండు=ఇందీవరాక్షుడు; అల్లునకున్=స్వరోచికి; ఇచ్చెన్=అరణముగా నిచ్చెను. అలం. ఉదాత్తము. స్వభావోక్తియు.

శా. ఉర్వీజానికి మామ యిచ్చె శిఖిపింఛోద్భాసివర్ణంబుచే
నర్వాచీనఘనాళి రోహితసహస్రాకీర్ణగా మింటఁ బూ
పార్వస్తోమముఁ జిత్రయానముల నూర్పుటాడించు గాంధర్వ గం
ధర్వవ్యూహము దీప్తచండమణికాండస్వర్ణసన్నాహమున్. 99

టీ: మామ=ఇందీవరాక్షుడు; ఉర్వీజానికిన్=భూమి భార్యగాకల స్వరోచికి; శిఖిపింఛ=నెమలి పింఛమువలె; ఉద్భాసి = ప్రకాశించు; వర్ణంబుచేన్=రంగుచే; అర్వాచీన=నేలకు దిగిన; ఘన+ఆళి=మేఘముల పంక్తి; రోహిత=వంకరలేని యింద్రధనుస్సులయొక్క; సహస్ర + ఆకీర్ణగాన్ = సముదాయముచే వ్యాప్తమైనట్లుగా; దీప్తి = కాంతిచే; చండ=తీవ్రమైన—ఎక్కువగా వెలుగుచున్న; మణికాండ=మణులుపొదివిన; స్వర్ణసన్నాహమున్=బంగారు కవచముకల

దానిని; మింటన్=ఆకాశమున; పూష+అర్వస్తోమమున్ = సూర్యుని గుఱ్ఱముల సముదాయమును; చిత్రయానములన్ = విచిత్రమైన నడకలచేః ఊటాడించు= ఉఙ్ఘాతలూగించు; గాంధర్వ=గంధర్వులవైన; గంధర్వస్తోమమున్ = గుఱ్ఱముల సముదాయమును; ఇచ్చెన్.

తా: నెమలి పింఛపు రంగులు కలిగి, వంకరలులేని యింద్రధనుస్సులు కలిగి నేలకుదిగిన మేఘములవలె మెరసెడి రత్నకవచములు కలిగి నట్టియు, వింతనడకలచే సూర్యుని గుఱ్ఱముల ధిక్కరింపగల గంధర్వజాతి గుఱ్ఱములమంద నల్లుని కరణముగా నిచ్చెను. అలం. ఉపమోత్ప్రేక్షలు.

క. తళతళని తరణిమెఱుఁగులఁ
దలతల మను మణుల మెఱసి ౯ తలఁచినచోటన్
నిలుచు విమానము ఖేచర
కులతిలకుఁడు కూర్మి పెండ్లి ౯ కొడుకున కొసఁగెన్. 100

టీ: ఖేచరకులతిలకుడు=గంధర్వులలో శ్రేష్ఠుడగు ఇందీవరాక్షుడు; తళతళని తరణి మెఱుఁగులఁన్=తళతళమను సూర్యుని కాంతులను; తలతలమని = తొలగు తొలగుమను; మణులన్=మణులచే; మెఱసి=ప్రకాశించి; తలచినచోటన్=అను కున్న చోట; నిలుఁచువిమానమున్=ఆగెడి విమానమును; కూర్మిపెండ్లికొడుకునకున్ = గారాబుటల్లునికి; ఒసగెన్=ఇచ్చెను.

తా: తళతళలచే సూర్యకాంతులను మీఁచెడి కామచారమైన విమానము నల్లునికిచ్చెను.

వ. మఱియు రజత మహారజత శయ్యాసన భాజన డోలా కలాచికాఘటకటాహ పీటికాపేటికాది గృహోపకరణంబులును, మరకత కురువింద పుష్యరాగ పురందర మణిమౌక్తికాది మహా రత్న ఘటితకటక తులాకోటికంఠికాంగదైకావళీ కాంచికోర్మికాది కలాపకలాపంబులును, విచిత్రనేత్ర పేశలకౌశేయ చీనాంశుక ధట్టం బులం బెట్టినట్టి పెట్టియలును, అమూల్యాగరుమృగమద సంకుమద కుంకుమ పటీర కర్పూర హిమాంబుపూరంబులు దట్టపునుంగు నగరుసత్తును మంచిగందవొడిచాఁ దుదయభాస్కరంబు లోనుగా గల పరిమళద్రవ్యసంభారపరంపరలును, జవ్వనంపుఁగ్రొవ్వున నివ్వ టిల్లి మువ్వంపువాతెఱలు విప్పనవ్వునను సొగవెన్నెలలం గలసి పిపాళించు చంచల దృగంచల ప్రభలంబచారించి మెఱుంగుజన్నులఁ గన్నెతమ్మి మొగ్గలవన్నె నటమటించి వెన్నెఱుల మెఱుంగుఁ దుమ్మెదవన్నెఁ దటమటించి నెన్నడుముల విన్ను వెన్నుదన్ని

బటువు మిగిలి విటనికాయంబు రాయిడింబడిపుటపుటనైన కూలం
కష చాటువుల మాటకారితనంబు మెఱసి నాగరికపుఁ బనుల గర
గరికల గళరవ చ్ఛలాలాపాచరణంబుల రవణంబుల మిసమిసలఁ
బసకలిగి మేలిమైన కులుకులరసికజనంబుల మనంబుల మరులు
కొలుపంజాలి సురుచిరాభణం భూషితంబగు పరిచారికాసహస్రం
బును గూతునకు నరణంబుగా నిచ్చి మఱియును. 101

టీ: మఱియుఁ = ఇంకను; కూతునకున్ = కూతురికి; రజత = వెండివి; మహా రజత = బంగారువియగు; శయ్యా+ఆసన = మంచములు, పీటలు; భాజన = కంచములు; డోలా = ఊయెలలు; కలాచికా = తమ్మపడిగములు; ఘట = బిందెలు; కటాహ = నీరుకాచుకొను డేగిసాలు; వీటికాపేటికా = పోకలపెట్టెలు; ఆది = మున్నగు; గృహ+ఉపకరణంబులును = ఇంట్లోవాడుకొను పరికరములును; మరకత = గరుడపచ్చలు; కురువింద = కెంపులు; పురుషరత్న = వజ్రాలు; పురందరమణి = = ఇంద్రనీలములు; మౌక్తిక+ఆలి = ముత్యాలు మున్నగు; మహారత్న = గొప్పమణులతో; ఘటిత = కూర్పబడిన; కటక = కడియములు; తులాకోటి = అందెలు; కంఠికా = కంటెలు; అంగద = బాహుపురులు; ఏకావళీ = ఒంటిపేట హారములు; ఊర్మికా = ఉంగరములు; ఆది = మున్నగు; కలాపకలాపంబులును = ఆభరణ సముదాయంబులును; విచిత్ర = రంగురంగుల; పేశల = మృదువైన; కౌశేయ = పట్టుతో నేసిన; చీనాంశుక = చీనాదేశపు వస్త్రముల యొక్క; థట్టంబులన్ = ప్రోగులను; పెట్టినట్టి పెట్టియలును = పెట్టిన పెట్టెలను; అమూల్య = గొప్పవిలువైన; అగరు = అగరువత్తులు; మృగమద = కస్తూరి; సంకుమద = జవ్వాది; కుంకుమ = కుంకుమపువ్వు; పటీర = మంచిగంధము; కర్పూర = పచ్చకర్పూరము; హిమాంబుపూరంబులు = పన్నీటిసముదాయములు; తట్టుపునుగు = గడ్డకట్టిన పునుగు; అగరుసత్తు = అగరునుండి తీసిన అత్తరు; మంచిగంధవొడి = మంచి గంధపుపొడి; చాంగు = బొట్టుపెట్టుకొను ద్రవ్యము; ఉదయభాస్కరంబు = రంగు; లోనగాగల = మొదలైన; పరిమళద్రవ్య = సువాసనకల వస్తువులయొక్క; సంభారపటంసగలును = సముదాయములును; జవ్వనంపు గ్రొవ్వునన్ = యౌవనమదముతో; నివ్వటిల్లి = మత్తెక్కి; మవ్వంపు వాతెఱలు = మృదువైన పెదవులు; విప్పన్ = విచ్చుకొన్నట్లు; నవ్వు = నవ్వుల నెడి; నును = లేతలైన; సోగ = పొడవైన; వెన్నెలలన్ = వెన్నెలలను; కలసిపిసాళించు = కలసికొని ప్రకాశించెడి, చంచల = కదలెడి; దృక్ + అంచల = కనుకొనలయొక్క; ప్రభలన్ = కాంతులను; పచారించి = ప్రసరింపచేసి; మెఱుంగుజన్నులన్ = తళతళమను చన్నులచే; కన్నెతమ్మివన్నెన్ = లే తామరసాయను; అటమటించి = తిరస్కరించి; పెను+నెఱులన్ = పొడవైన జుట్టుచే; మెఱుంగు తుమ్మెద వన్నెన్ = మెరసెడి తుమ్మెదల కాంతిని; తటమటించి = తక్కువచేసి; నెఱ+నడుములన్ = అందమైన నడుములచే; విన్ను = ఆకాశమును; వెన్నుదన్ని = తిరస్కరించి; బటువు = దార్ఢ్యము; మిగిలి = హెచ్చి; విటనికాయంబు రాయిడిన్ = విటులసముదాయపు

సందడిని; పడి=పొంది; పుటపుటనైన = అరితేరిన; కూలంకష = హెచ్చిన; చాటువులన్ = చమత్కారపు మాటలచే; మాటకారితనంబు = మాటపైమాట చెప్పు నేర్పును; మెఱసి = చూపి; నాగరికపుబనుల గరగరికలన్ = మంచిపనులుచేయు నేర్పుచే; గళరవ = కూతలును; ఛల + ఆలాప = వంకతోడి మాటలాడుట యొక్కయు; ఆచరణ = చేయుటచే; రవణంబులమిసమిసలన్ = నగల కాంతులచే; పసగలిపి = అందగింపజేసి; మేలిమైన కులుకులన్ = మంచిరకపు టవయవచాలనములచే; రసికజనంబుల మనంబులన్ = సరసుల మనస్సులను; మరులుకొలుపక = మోహింపజేయుటకు; చాలి = సమర్థమై; సురచిర = బాగుగా ప్రకాశించు; ఆభరణ భూషితంబగు = నగలచే అలంకరింపబడిన; పరిచారికాసహస్రంబున్ = దాసీజనముల వేలను; అరణంబుగాన్ = హితవుగానిచ్చు కానుకగా; ఇచ్చి; మఱియును = ఇంకను......

తా: ఇందీవరాక్షుడు కూతురి కరణముగా వెండి బంగారులతో చేయించిన గృహోపకరణములను; రత్నములు పొదివిన నగలు—నాణెములను, పట్టుబట్టలును, వస్త్రములు పెట్టిన పెట్టెలను, అగరు జవ్వాది మొదలైన పరిమళ ద్రవ్యములను; ఒయ్యారము, అందముకల పరిచారికలను ఇచ్చెను. అలం. ఉపమ.

సీ. అవనతాంగుష్ఠాగ్రి హార్యనిర్యద్రత్న
ఖనిఘనాంతరితశృం గాటకములు
మదముదావహదివ్య మైరేయధారేయ
గోత్రభిద్విటపి ని ష్కుటయుతములు
మహిళాకదంబ డింభగాత్రిహ్యాగృహాచర
న్మృగనాభిసౌరభ్య నిర్భరములు
ప్రఖరాఖునఖరధా రా విదీర్ణోద్దీర్ణ
సౌవర్ణమృత్కీర్ణ జాంగలములు
గీ. కోకకలహంసముఖరితా బ్జాకరములు
సిద్ధచారణగంధర్వ సేవితములు
మందరద్రోణిఁ గొన్నిగ్రా మములు కూర్మి
తనయపసుపునఁ గొసఁగె గం ధర్వవిభుఁడు. 102

టీ: గంధర్వవిభుడు = ఇందీవరాక్షుడు; అవనత = వంచబడిన; అంగుష్ఠ + అగ్ర = కాలిబొటనవ్రేలి చివరచే; హార్య = తీయదగినవై; నిర్యత్ = వెలికివచ్చెడి; రత్న ఖని = రత్నాల గనులతో; ఘన + అంతరిత = దట్టముగా కప్పబడిన; శృంగాటకములు = నలువీధుల మొగలు కలవియు; మద = మదమును; ముద = సంతోషమును; ఆవహ = చేకూర్చెడి; దివ్య = శ్రేష్ఠమైన; మైరేయ = చెరకు రసము మున్నగు వానితో చేసిన మద్యమునకు; ధారేయ = బరువుకల; గోత్రభిత్ = పర్వతముల పగుల

గొట్టిన ఇంద్రునియొక్క; విటపి=కల్పవృక్షములతో కూడిన; నిష్కుటయుతములు =గృహోద్యానములు కలవి; మహిళాకదంబ=స్త్రీల గుంపు చేతను; డింభ=పిల్లల చేతను; గ్రాహ్య=పట్టుకొదగిన; గృహచరత్=ఇండ్లలో తిరిగెడి; మృగ=కస్తూరి మృగముల; నాభి = నాభియందలి కస్తూరియొక్క; సౌరభ్య = పరిమళములతో; నిర్భరములు=నిండినవి; ప్రఖర=వాడియైన; ఆఖు=ఎలుకలయొక్క; నఖరధారా =గోళ్ళకొనలచే; విదీర్ణ=త్రవ్వటచే; ఉద్గీర్ణ = వెలికివచ్చిన; సౌవర్ణమృత్= బంగారుమట్టిచే; కీర్ణ=వ్యాప్తమైన; జాంగలములు=మెరకలుకలవి; కోక=చక్రవాకములు; కలహంస=రాజహంసలుచే; ముఖరిత=ధ్వని కలదై చేయబడిన; అబ్జ+ఆకరములు=కొలకులు కలవియు; సిద్ధచారణ గంధర్వసేవితములు=సిద్ధులు, చారణులు, గంధర్వులచే సేవింపబడినవియునైన; మందరద్రోణిన్ = మందరపు లోయ లోని; కొన్నిగ్రామములు; కూర్మితనయపసుపునకున్ = ముద్దుబిడ్డయొక్క పసుపు కుంకుమలకై; ఒసగెన్=ఇచ్చెను.

తా: ఇందీవరాక్షుడు కూతురికి కొన్ని యూళ్ళ నరణముగా నిచ్చెను. అవి బాటన వ్రేళ్ళతో పెల్లగించగల రత్నపు గనులు గలవి. పూదేనెమద్యముల నిచ్చెడి కల్పకములు కలవి. పిల్లలు సైత మాడుకొనుటకు కావలసినపుడు తీసికొనుట కనువుగానున్న కస్తూరి మృగములు కలవి, ఎలుకలు త్రవ్విన బంగారు మన్నుతో నిండినవి, సిద్ధులు, చారణులు గంధర్వులు సేవించెడి వైన మందరపు లోయలోనిది. అలం. ఉదాత్తము.

తే. పౌరయాత్రికసురసిద్ధ ♦ చారణాహి
యక్షగంధర్వసాధ్య వి ♦ ద్యాధరులను
నిజపురంబుల కనిచె నిం ♦ దీవరాక్షుఁ
డుడుగర లొసంగి విభవంబు ♦ గడలుకొనఁగ. 103

టీ: ఇందీవరాక్షుడు; పౌరయాత్రిక=ఇంటికి వెళ్ళుచున్న; సుర=దేవతలు; సిద్ధ=సిద్ధులు; చారణ, అహి=నాగులు; యక్ష, గంధర్వ, సాధ్య, విద్యాధరులను; విభవంబు=సంపద; కడలుకొనగన్=అతిశయింపగా; ఉడుగరలు=కానుకలు; ఒసంగి=ఇచ్చి; నిజపురంబునకున్ = వారి వారి యూళ్ళకు; అనిచెన్= పంపెను.

వ. అనిన విని జైమినిమునీంద్రుండు మీఁదటివృత్తాంతం బానతీవలయు నని యడుగుటయును. 104

టీ: అనినన్=అని పక్షులు చెప్పగా; విని; జైమినిమునీంద్రుండు; మీదటవృత్తాంతంబు=తర్వాతికథ; ఆనతి+ఈవలయున్=చెప్పవలయును; అనియడుగుటయున్=అనియడుగగా; దీనికి షష్ఠాశ్వాసములోని 'ఇట్లనియె' తో అన్వయము.

మ. అతులక్షాంతిగభీర భీరహితచి ♦ త్తాంభోజ భోజక్షమా
వనివిద్యాపరిపాక పాకరిపుసం ♦ భద్భోగ భోగాశిప

త్రితరస్ఫూర్త్యనుభావ భావభరిత శ్రీకాంత కాంతార పా
తితకాళింగకులేశ లేశతరవృత్తి క్షీణవైరివ్రజా! 105

టీ: అతుల=సాటిలేని; క్షాంతి=ఓర్పుచేత; గభీర = గంభీరమైనవాడా! భీరహిత=భయములేని; చిత్త+అంభోజ=పద్మమువంటి మనస్సు కలవాడా! భోజ క్ష్మాపతి=భోజునివంటి; విద్యాపరిపాక = విద్యయొక్క పరిపాకము కలవాడా! పాకరిపు=ఇంద్రునియొక్క; శుంభత్=ఎక్కువైన; భోగ=అనుభూతి కలవాడా! భోగ+అశి, పత్త్రి-పాములను తినెడి పక్షియగు గరుత్మంతుని యొక్క; తరస్+స్ఫూర్తి=వేగముయొక్క ప్రకాశముయొక్క; అనుభావ=మహిమగలవాడా! భావ భరిత=మనసునందు నిల్పబడిన; శ్రీకాంత=విష్ణువు కలవాడా! కాంతార=కారడవులలో; పాతిత=పడవేయబడిన; కాళింగకుల = కళింగరాజైన గజపతి కలవాడా! లేశతర=మిక్కిలి తక్కువైన; వృత్తి=జీవికలచే; క్షీణ=నశించిన, వైరి వ్రజా=శత్రువుల సముదాయ కలవాడా!

తా: ఎక్కువ యోర్పు, విద్యాసంపత్తి, ఇంద్రభోగము, గరుడుని వేగము–చురుకుదనము. విష్ణుధ్యానము శత్రువుల నణచు శక్తియును కలవాడా! అలం. నిదర్శన. ముక్తపదగ్రస్తమును శబ్దాలంకారమును.

క. నాగాంబాసుత జితకద
నాగతమదనాగసంగ సానూపగృహా
భోగా భోగపురందర
భోగీంద్రశయానపురుష పూజాప్రవణా. 106

టీ: నాగాంబాసుత=నాగమ్మకు పుత్రుడైనవాడా! జిత=జయింపబడిన; కదన+ఆగత=యుద్ధమునకు వచ్చిన; మదనాగ=మదపు టేనుగుల యొక్క; సంగమ=సంబంధముచే; అనూప = తడియైన; గృహ = ఇంటియొక్క; ఆభోగ=పరిపూర్ణత్వము కలవాడా! భోగపురందర=భోగముల ననుభవించుటలో నింద్రునివంటివాడా! భోగీంద్ర=ఆదిశేషునిపై; శయాన=పరుండు; పురుష =విష్ణువుయొక్క; పూజాప్రవణా=పూజయందాసక్తి కలవాడా!

తా: నాగాంబాసుతుడు, యుద్ధమున జయించి తెచ్చిన ఏనుగులమద జలముతో తడిసిన యింటిపట్టు కలవాడును, ఇంద్రభోగముల ననుభవించువాడును, సదా విష్ణు పూజాసక్తి కలవాడునైనవాడా!

—: మాలిని :—

సరభసజయధాటీ చండవేదండకోటీ
కర వమథుహిమానీ కంపితాశావధూటీ
పరమహితహసంతీ భావభాగ్భూరి తేజః
పరుషదహనకీలా ప్రస్ఫురచ్చక్రవాళా. 107

టి: సరభస...చక్రవాళా—సరభస=తొందరతోడి; జయధాటీ=జైత్రయాత్రయొక్క; చండ=భయంకరమైన; వేదండ = ఏనుగుల యొక్క; కోటీ=గుంపుయొక్క; కర=తొండములనుండి; వమధు = తుంపురులనెడి; హిమానీ=ఎక్కువమంచుచే; కంపిత=వణకింపబడిన; ఆశావధూటీ=దిక్కులనెడిస్త్రీలకు; పరమహిత=మిక్కిలి హితమైన; హసంతీభావభాక్=కుంపటియైన; భూరి=ఎక్కువైన; తేజః=ప్రతాపమనెడి; పరుషదహనకీలా=తీవ్రమైన నిప్పు మంటలచే; ప్రస్ఫురత్=ప్రకాశించెడి; చక్రవాళా=చక్రవాళమనెడి లోకములన్నిటిపైననుండు పర్వతము కలవాడా!

తా: ఎక్కువ వేగముతో దిగ్విజయయాత్రచేయునపుడు సేనలోని యేనుగుల తొండములనుండి కారు నీటి తుంపురులచే వణకెడి దిక్కులనెడి స్త్రీలకు కుంపటిగానుండు ప్రతాపాగ్ని యొక్క మంటలచే ప్రకాశించు చక్రవాళ పర్వతము కలవాడు. లోకమునంతను జయించి ప్రతాపముచే లోకమెల్లెడల ప్రసిద్ధమైన వాడని భావము. అలం. రూపకము.

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస
శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితా మతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం
బనుమహాప్రబంధమునందుఁ

పంచమాశ్వాసము

సంపూర్ణము.



శ్రీ

# స్వారోచిష మనుచరిత్రము

(టీకాతాత్పర్యసహితము)

## షష్ఠాశ్వాసము



కృష్ణరాయమనుజేం
ద్రా కాంతాపంచబాణ నరసింహ ధరి
త్రీకాంతగర్భవార్నిధి
రాకాహిమధామ కర్వర దళవిరమా. 1

టీ: శ్రీకృష్ణరాయమనుజేంద్రా = శ్రీకృష్ణదేవరాయలనెడి మహారాజా! కాంతాపంచబాణ = స్త్రీలకు మన్మధునివంటివాడా! నరసింహధరిత్రీకాంత = నరసింహరాజుయొక్క; గర్భవార్నిధి = గర్భమనెడి సముద్రములకు; రాకాహిమధామ = నిండుపున్నమ చందురునివంటివాడా! కర్వర = తురకల యొక్క; దళవిరామా = సేనలకు అడ్డుతగిలెడివాడా!

తా: చక్కదనమున మన్మథుని వంటివాడు, నరసరాజునకు నందవర్ధనుడును, తురకసేనల నడ్డగించువాడునగు శ్రీకృష్ణదేవరాయా! అవధరింపుము.

వ. అవధరింపుము శకుంతంబు లబ్బాదరాయణాంతేవాసి కిట్లనియె నంత నొక్కనాఁడు. 2

టీ: అవధరింపుము = వినుము; శకుంతంబులు = ధర్మపక్షులు; ఆ + బాదరాయణ + అంతేవాసికిన్ = వ్యాసుని శిష్యుడైన జైమినికి; ఇట్లనియెన్ = ఇట్లు చెప్పినవి; అంతన్ = తర్వాత; ఒక్కనాడు = ఒక్కరోజున......

సీ. పాండురప్రభఁ గ్రిందు చీఁకటివోలె
జిగి నొప్పు నీలంపు జగతి మెఱసి

ఔన్నత్యమున మ్రింగి నట్టి నింగులు గ్రక్కు-
కరణి ధూపము గవా క్షముల వెడల
ధారుణీసతి సుగం ధ ద్రవ్యములు దాఁచు
నరల పేటికవోలెఁ బరిమళముల
నెలవులై చెలువారు నిలువుల విలసిల్లి
కోణిగఁ బారావత కులము వదరఁ

గీ. పసిఁడినీట లిఖించిన ప్రతిమ లమర
నీఁగ వ్రాలిన నందంద యెలుఁగు లొసఁగు
నట్టి సకినలమంచము లాదిగాఁగ
మెఱయు పరికరముల నొప్పు మేడమీఁద. 3

టీ: పాండురప్రభన్ = తెల్లని కాంతితో; క్రింగువడిన చీకటివోలెన్ = అడుగంటిన చీకటివలెను; జిగిన్ = కాంతితో; ఒప్పు = ప్రకాశించెడి; నీలంపుజగతిన్ = ఇంద్రనీలపుచప్టా చేసిన నేలచేతను; మెఱసి = ప్రకాశించి; ఔన్నత్యమునన్ = ఎత్తుచే; మ్రింగునట్టినింగులన్ = లోపలికి మ్రింగిన ఆకాశమును; క్రక్కు-కరణిన్ = వెడలగ్రక్కు-నట్లు; ధూపము = అగరుధూపము; గవాక్షములన్ = కిటికీలనుండి; వెడలన్ = బయటికి వచ్చుచుండగా; ధారుణీసతి = భూమియనెడి భార్య; సుగంధద్రవ్యములు = పరిమళించు వస్తువులు; దాచు+అరల పేటికవోలెన్ = దాచెడి అరలుకల పెట్టెవలె; పరిమళముల నెలవులై = పరిమళములకు స్థానములై; చెలువారునిలువులన్ = సొంపైన అంతస్తులచే; విలసిల్లి = అందముగానుండి; కోణిగన్ = ముంజూరునందు; పారావతకులము = పావురములగుంపు; వదరన్ = కూయుచుండగా; పసిడినీటన్ = బంగారు నీటితో; లిఖించిన ప్రతిములు = వ్రాసిన బొమ్మలు; అమరన్ = ప్రకాశించగా; ఈఁగవాలినను; అందంద = అక్కడక్కడ; ఎలుఁగులు = ధ్వనులు ఒసఁగునట్టి = చేసెడి; సకినలమంచములు = పందిరిపట్టెమంచములు; ఆదిగాగన్ = మొదలైన; మెఱయుపరికరములన్ = ప్రకాశించెడి సాధనములచే; ఒప్పుమేడమీఁదన్ = ప్రకాశించు మేడపై......

తా: నీలాలతో చప్టాచేసిన క్రింది నేలయు, అగరుధూపములు వెడలెడి కిటికీలును, పరిమళద్రవ్యములతో నిండిన అంతస్తులను, బంగారు నీటితో వ్రాసిన బొమ్మలుకల పట్టెమంచములు మొదలైన పరికరములుకల మేడపై.....

క. రమణునికడ కనుప మనో
రమకున్ మజ్జనము దీర్చి రవరవకచ పిం
ఛమునకుఁ గాలాగురు ధూ
పము వెట్టి జవాది నంటు వాపి నిపుణతన్ 4

టీ: రమణుని కడకున్ = భర్తవద్దకు; అనుపన్ = పంపుటకై; మనోరమకున్; మజ్జనము = అభ్యంగనము; తీర్చి = చేయించి; రవరవకచపింఛమునకున్ — తళతళ మెరసెడి జుట్టునకు; కాలాగరుధూపము = నల్లయగరు ధూపము; పెట్టి; జవాదిన్ = జవ్వాజి మెరుగుచే; అంటు+పాపి = చిక్కుతీసి; నిపుణతన్ = నేర్పుతో...

తా: చెలికత్తెలు మనోరమను ప్రియుని వద్దకు పంపుటకై తలంటుపోసి, అగరుధూపము వేసి, జవ్వాది మెరుగుతో చిక్కుతీసి నేర్పుతో......

సీ. చెంగల్వపూదండ - సేర్చి పెందుఱుముపై
ఘనసారమున సూస - కము ఘటించి
పన్నీటితోఁ గదం - బము చేసి మృగనాభిఁ
బూసి కుంకుమ సేస - బొట్టు తీర్చి
విశదముక్తాదామ - రశనఁ జందురకావి
వలిపఁపువలువపై - నలవరించి
యఱుత వెన్నెల గాయు - హార మొక్కటి పెట్టి
మణులసొమ్ములు - మేన మట్టుపఱచి

గీ. కన్నుఁగవ గెల్చి డాకాలఁ - గట్టె ననఁగ
ఘల్లుఘల్లునఁ బెండెంబు - గండుమీలు
గదల నల్లన నడపించి - పొదివి తెచ్చె
నెచ్చెలులపిండు యువతి నా - నృపతికడకు. 5

టీ: నెచ్చెలులపిండు = చెలికత్తెల సముదాయము; పెను+తుఱుము పైన్ = పెద్దకొప్పుపై; చెంగల్వపూదండ సేర్చి = ఎఱ్ఱకల్వలదండ పెట్టి: ఘనసారమునన్ = పచ్చకర్పూరముతో; సూసకము = పూలమాలలతో చేసిన కొప్పువలను; (కొందరు 'తిరుగుబిళ్ళ' అందురు.) ఘటించి = కూర్చి; పన్నీటితోన్; కదంబము చేసి = కలిపి; మృగనాభిన్ = కస్తూరిని; పూసి = దేహమునకు పూసి; కుంకుమన్ = కుంకుమపువ్వుతో; సేసబొట్టుతీర్చి = అక్షతలవలె సన్నని తిలకము పెట్టి; చందురకావివలిపపువలువపైన్ = కుసుమపూవన్నెకల సన్నని చీరపై; విశదముక్తాదామరశనన్ = తెల్లని ముత్యాల పేరుతోడి మొలత్రాటిని; అలవరించి = సరిచేసి పెట్టి; అఱుతన్ = మెడలో; వెన్నెలగాయు హారము = వెన్నెల కాంతిని విరజిమ్ము ముత్యాల హారమును; ఒక్కటి పెట్టి = ఒక్కదానినుంచి; మేనన్ = ఒంటిమీద; మణులసొమ్ములు = మణులు పొదివిన నగలు; మట్టుపఱచి = తగినచోట్ల సర్ది, కన్నుఁగవన్ = కంటి జంటచే; గెల్చి = జయించి; డాకాలన్ = ఎడమ కాలియందు; కట్టెననగన్ = కట్టెనా అన్నట్లు; ఘల్లుఘల్లునన్ = గలుగల్లుమని; పెండెంబుగండుమీలు = కాలియందె లందున్న చేపల బొమ్మలు; కదలన్ = కదలగా; యువతిన్ = పడుచును; అల్లనన్

=మెల్లగా; నడిపించి; పొదివి = చుట్టుకొని; నృపతికడకున్ = స్వరోచి యున్న గదిలోనికి; తెచ్చెన్=తీసికొనివచ్చిరి.

తా: మనోరమ చెలికత్తెలు ఆమె కొప్పుపై ఎఱ్ఱకలువల దండను పెట్టి; పచ్చ కప్పురపు కొప్పువలపెట్టి, కస్తూరి పన్నీరు కలిపి యొంటికి పూసి, కుంకుమపువ్వుతో అక్షతలబొట్టుపెట్టి, ఎఱ్ఱని సన్నని చీరపై తెల్లని ముత్యాల మొలనూలుకట్టి, మెడలో కొంతికల హారమొకటేవేసి, నగలను చక్కగా సవరించి, కాలియందెలు మ్రోయుగా మెలమెల్లగా నడపించుకొని వచ్చిరి. అలం. ఉత్ప్రేక్షా స్వభావోక్తులు.

క. తెచ్చుటయుఁ గేళిభవనముఁ
జొచ్చెనొ చొరదో యనంగ ‡ సుదతుల నీడం
జొచ్చి పయిఁ గొప్పు దోఁపఁగ
నచ్చేడియ తలుపుదండ ‡ నల్లన నిలిచెన్. 6

టీ: తెచ్చుటయును=అట్లు తీసికొనిరాగా; ఆ+చేడియ = ఆ మనోరమ; కేళిభవనమున్=విలాసగృహమును; చొచ్చెనొచొరదోయనంగన్ = ప్రవేశించెనో లేదోయన్నట్లుగా; సుదతుల నీడన్=చెలికత్తెల ప్రక్కనుండి; చొచ్చి = ప్రవేశించి; పయిన్=పైభాగము; కొప్పుతోఁపన్=కొప్పుకన్పడగా; తలుపుదండన్= తలుపువద్దనే; అల్లనన్=మెల్లగా; నిలిచెన్=ఆగెను.

తా: చెలికత్తెల వెనుకనే మెల్లగా చడీచప్పుడు కాకుండ వచ్చి మనోరమ తలుపువద్దనే తలవంచుకొని నిలబడెను.

క. తదనంతరంబ బోటులు
చదురుల నగవులను బ్రొద్దు ‡ జరిగినఁ గేళీ
సదనము నొక్కొక పని నెప
మొదవఁగ వెడలుటయుఁ జిత్త ‡ ముద్వేల్లూరన్. 7

టీ: తదనంతరంబ=తర్వాత; చదురులన్=నేర్పైన మాటలతోను; నగవులన్=నవ్వులతోను; ప్రొద్దు=కొంతసేపు; జరిగినన్ = కడవగా; బోటులు= చెలులు; ఒక్కొకపనినెపము=ఒక్కొక్కపని వంక; ఒదవగన్=కలగా; కేళీసదనమున్=క్రీడాగృహమును; వెడలుటయున్=బయటికి వెళ్ళగా; చిత్తము= స్వరోచి మనస్సు; ఉవ్విళ్లూరన్=కోరికలతో నుబ్బగా...అలం. పర్యాయోక్తము.

సీ. దట్టంబు నీ కట్టి ‡ నట్టి చెంగావికి
బాగు గా దని కేలఁ ‡ బయఁట నిమిరె
గోరంటా గోళ్ళ ని ‡ క్కువపుఁ గెంపో యని
చెయి పట్టి నయమున ‡ సెజ్జ సేర్చె

నగరుధూపముచేత నయ్యో తనూవల్లి
సెకసోఁకు నని యెదఁ జెయ్యి వెట్టి
మృగనాభికామకరికలఁ గప్రము మించె
నని మూరుకొనుచుఁ జుంబన మొనర్చె

గీ. హారమణు లిటు సూపు నాయఱుత నున్న
హారమణులకుఁ గాంతి నీడౌనో కావో
యనుచు నక్కునఁ గదియించు నానెపమునఁ
గంపమును బొందు సతిమేను గౌఁగిలించె. 8

టీ: (స్వారోచి) దట్టంబు=పావడ; నీకట్టిఁట్టి చెంగావికిన్=నీవుకట్టుకొన్న ఎఱ్ఱని చీరకు; బాగుకాదని=సరిగాలేదని; కేలన్=చేతితో; పయ్యెటన్=పైటను; నిమిరెన్=సర్దెను; గోరంటో=గోరింటాకు పెట్టినందున కల్గిన యెరుపో; నిక్కపుఁగెంపో=సహజమైన యెరుపో; అని=వంకపెట్టి; చెయిపట్టి = చేయిపట్టుకొని; నయమునన్ = మంచిమాటలతో; సెజ్జ+చేర్చెన్ = పక్కకు చేర్చెను; ; అగరుధూపముచేతన్; తనూవల్లి=తీగవంటి శరీరము; సెకసోకెను=వెచ్చగిలెను; అయ్యో! అని=వంకతో; చెయ్యి=చేతిని; ఎదన్=రొమ్మున; పెట్టెన్=ఉంచెను; మృగనాభికామకరికలన్=కస్తూరితో వ్రాసిన మకరికాకృతులైన రేఖలలో; కప్రము=కర్పూరము; మించెన్=ఎక్కువయ్యెను; అని; మూరుకొనుచున్ = మొగమును దగ్గరగా తీసికొనుచు; చుంబనమొనర్చెన్ = ముద్దిడుకొనెను; హారమణులు= ముత్యాలహారములోని మణులను; ఇటు + చూపు = దగ్గరగానుంచి చూపుము; నాయఱుతనున్న = నా మెడలోని; హారమణులకున్ = హారములోని మణులకు; కాంతిన్=కాంతితో; ఈడు+ఔనో, కావో=సరిపోవునో, పోవో; అనుచున్; అక్కునన్=రొమ్మునకు; కదియించు+ఆనెపమునన్=చేర్చెడి వంకతో; కంపమును పొందు సతిమేను=వణకుచున్న మనోరమ శరీరమును; కౌగిలించెన్.

తా: అంతట స్వారోచి పావడ చీరకు సరిగాలేదను వంకతో పైటసర్ది, గోళ్ళ యెరుపు సహజమో కాదో యనుచు చేయిపట్టుకొని మెల్లగా ఆ మాట—ఈ మాట చెప్పుచు పక్కకు చేర్చెను. చెక్కిళ్ళమీద వేసిన మకరికాపత్రరేఖలలో కస్తూరిలో కర్పూర మెక్కువైనదని ముద్దిడుకొనెను. హారములోని మణుల తారతమ్య పరీక్ష చేయునట్లు కౌగిలించుకొనెను. ఆమె దేనికిని ప్రతిచేయక సిగ్గుతో వణకినది. అలం. పర్యాయోక్తము.

వ. ఇట్లు కవియం దమకించి త్రిస్తరులఁ గుస్తరింప నింపు గలిగియు మునుమున్న మనంబునం బొడమియుండు నడలప్పుడు తలంపునం బాఱిన సమర్థుండగు నతనిచే నది తీర్పించుకొనం గలయది యైన నవోఢగావున మాటలం దేటపడం జెప్ప శంకించి స్త్రీస్వభా

వంబునం దొరఁగు కన్నీరు కంకణ క్రేంకృతులు మీఱ గోరఁ బాఱ మీటుచు నూరకయున్నం గనుంగొని యవనిపతిపుంగవుం డంతరంగంబునం జెంగలించు కౌతుకాంకురంబు కరఁగువడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సంభ్రమించుచుఁ జెక్కుటద్దంబులు నొక్కి కురులు చక్కం ద్రోయుచుం 'దోయజాక్షీ యక్షయానంద సంధాయకం బగునట్టి క్రీడాసమయంబున వగపునకుం గారణంబేమి? నాయెడం గల్ల యేమేనియుం బాటిల్లదుగదా! యెవ్వ రే మప్రియంబుగావించి రెఱింగింపు వారిన్ దండించెద' నేమి సాధింపవలయుఁ జెప్పు మదివేధచే నున్న సాధించెద, మదీయంబు లగునర్థజీవితంబులు భవదధీనంబు లుమ్మలిక యింత యేటి, కనుటయు నబ్బోటి గ్రేటుచు నిట్లనియె. 9

టీ: అట్లు=ఆ రీతిగా; కవియన్ = చేరుటకు; తమకించి=తొందరపడి; త్రస్తరులన్=వేళాకోళములతో; కుస్తరింపన్=సమాధానపరుపగా; ఇంపుగలిగియున్=ఇష్టముండికూడ; మునుమున్న=ముందుగానే; మనంబునన్=మనస్సులో; పొడమియుండునడలు=పుట్టియున్న దుఃఖము; అప్పుడు=భర్తలాలించుచుండగా; తలంపునన్+పాటిలన్ = జ్ఞాపకమురాగా; సమర్థుండగు+అతనిచేన్ = తగిన తన భర్తచే; అది=ఆ దుఃఖమును; తీర్పించుకొనం గలదియై=తగ్గించుకొన దలచినదై; నవ+ఊఢ కావునన్=క్రొత్త పెండ్లికూతురగుటచే; మాటలన్=విప్పిచెప్పు మాటలలో; తేటపడన్=లోపలిబాధ తెలియునట్లు; చెప్పన్=చెప్పుటకు; శంకించి=జంకి; స్త్రీస్వభావంబునన్ = ఆడుదియగుటచే; తొరఁగు కన్నీరు=కారెడి కన్నీటిని, కంకణక్రేంకృతులు=గాజుల చప్పుళ్ళు; మీఱన్=ఎక్కువకాగా; గోరన్=గోటితో; పాఱన్+మీటుచున్=పోవునట్లు ఎగజిమ్ముచు; ఊరకయున్నన్=మాటలాడకుండగా; కనుంగొని=చూచి; అవనిపతిపుంగవుండు=స్వరోచి; అంతరంగంబునన్=మనస్సులో; చెంగలించు=ఎక్కువగు; కౌతుక+అంకురంబు=తహతహ; కరఁగువడన్=తగ్గగా; వెఱఁగుపడి=ఆశ్చర్యపడి; ఉద్వేగసమన్వితుండై=తొందరగలవాడై; సంభ్రమించుచున్=కంగారు పడుచు; చెక్కుటద్దంబులు=అద్దములవంటి చెక్కిళ్ళను; నొక్కి; కురులు=జుట్టును; చక్కన్+త్రోయుచున్=సరిగాపైకి త్రోయుచు; తోయజ+అక్షీ = పద్మములవంటి కన్నులుకల ఓ మనోరమా! అక్షయ=తరుగని; ఆనందసంధాయకంబగునట్టి=ఆనందమునిచ్చు; క్రీడాసమయంబునన్=ప్రథమ సంభోగకాలమున; వగపునకున్=విచారమునకు; కారణంబేమి? నాయెడన్=నావలన; కల్ల=తప్పు; ఏమేనియున్=ఏదైనను; పాటిల్లదుకదా=రాలేదుకదా! ఎవ్వరు; ఏమి+అప్రియంబు=ఏమి నేరము; కావించిరి=చేసిరి; ఎఱింగింపు = తెల్పుము; వారికిన్; దండించెదన్ = శిక్షింతును; ఏమి; సాధింపవలయున్=చేయవలయును; చెప్పుము; అది=ఆ వస్తువు; వేధచేనున్నన్

=బ్రహ్మచేతిలోనున్నన; సాధించెదన్ = తెత్తును; మదీయంబులగు = నావైన; అర్థ జీవితంబులు = డబ్బు, ప్రాణమును; భవదధీనంబులు = నీవి; ఉమ్మలిక = బాధ; ఇంత యేటికిన్ = ఇంతెందుకు ? అనుటయున్ = అనగా; ఆ+బోటి = ఆ మనోరమ; క్రేటుచున్ = గొంతుక సవరించుకొనుచు; ఇట్లనియెన్.

ఉ. అక్కట నాయెడ న్మిగుల నక్కఱగల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందిన దుర్దమరోగబాధలం
బొక్కుచు నున్నవారు వనభూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడిసౌఖ్య మన్నఁ దరళేక్షణఁ జూచి స్వరోచి యిట్లనున్. 10

టీ: అక్కట = అయ్యో ! నాయెడన్ = నామీద; మిగులన్ = మిక్కిలి; అక్కఱ = హితవు; కల్గి చరించు = ఉండి మెలగెడి; నెఱ+చెలుల్ = ప్రాణస్నేహితురాండ్రు; మునీంద్ర శాపహతిన్ = మునియొక్క శాపపుదెబ్బచే; చెందిన = అవహించిన; దుర్దమ = సహింపరాని; రోగబాధలన్ = రోగములయొక్క బాధలచే; చిక్కి = తగుల్కొనబడి; పొక్కుచున్ = బాధపడుచు; వనభూములన్ = అరణ్యములలో; ఉన్నవారు = ఉన్నారు; తత్+దశ = వానిబాధను; మాన్పవేనిన్ = తగ్గింపనిచో; నాకున్; ఎక్కడి సౌఖ్యము = సౌఖ్యమెట్లువచ్చును? అన్నన్ = అనగా; తరళ+ఈక్షణన్ = చంచలమైన నేత్రములు కల మనోరమను; చూచి; స్వరోచి; ఇట్లనున్ = ఇట్లనెను.

తా: 'నాతో ప్రాణముతో ప్రాణముగా తిరిగెడి చెలులు మహర్షి శాపముచే అసాధ్యమైన రోగముల పాల్పడి అడవులలో బాధపడుచుండగా, వారి బాధతగ్గకుండ నాకు సుఖమెట్లు కల్గును ?' అనిన మనోరమతో స్వరోచి యిట్లనెను.

క. పరితాప మింక నేటికి
హరిణాక్షి మదీయసంచితాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద
నరు దనఁగ భవత్సఖీజనామయభరమున్. 11

టీ: హరిణ+అక్షి = లేడి కన్నుల వంటి కన్నులు కలదానా ! ఇంకన్ = ఇంకపై; పరితాపము+ఏటికిన్ = విచారమెందుకు ? మదీయ = నాదైన; సంచిత = సంపాదించబడిన; ఆయుర్వేదస్ఫురణమునన్ = వైద్యశాస్త్రము యొక్క శక్తిచే; భవత్ = నీయొక్క; సఖీజన = చెలికత్తెల యొక్క; ఆమయభరమున్ = రోగభారమును; అరుదు+అనగన్ = ఇట్లు చేయుట ఆశ్చర్యమనునట్లు; పరిహరించెదన్ = పోగొట్టెదను.

తా: ఓ ప్రియా ! ఇందుకే యింత విచారమేటికి ? నాసంపాదించిన ఆయుర్వేదశాస్త్రము యొక్క సామర్థ్యముచే అద్భుతముగా చేతితో తీసినట్లు రోగమును పోగొట్టెదను.

క. నా వెనుక రమ్ము నీసఖు
లే వనమున నున్నవార ? లిపుడ చికిత్సం
గావింతు ననుచు రయమున
నావనితయుఁ దాను నచటి ? కరిగి యొకయెడన్. 12

టీ: నీ సఖులు = నీ చెలులు; ఏవనమునన్ = ఏ యడవిలో; ఉన్నవారలు ? ఇపుడు + అ = ఇప్పుడే; చికిత్సన్ = వైద్యమును; కావింతున్ = చేసెదను; నా వెనుకన్ = నాతో; రమ్ము; అనుచున్ = అనిపలుకుచు; ఆవనితయున్ = మనోరమయు; తాను = స్వరోచియు; రయమునన్ = వేగముగా; అచటికిన్ = చెలులున్న వనములోనికి; అరిగి = వెళ్ళి; ఒకయెడన్ = ఒకచోట......

తా: ఇప్పుడే చికిత్స చేసెదను. వారెక్కడ నున్నారో చూపుము. నాతో రమ్మని స్వరోచి, మనోరమయు వారున్న వనములోనికి కేగి, అక్కడ...

ఉ. ఆరజనీశబింబరుచి ? రాస్యలఁ గాంచి తదామయవ్యథా
భారము మాన్పఁగాఁ దమి నృ ? పాలుఁడు తత్కలధౌతగోత్రకాం
తారపదంబునం దుపచి ? తం బగుమందును దత్క్రియోచితా
హారము నెమ్మి నిచ్చుచు న ? నామయవ్యథలఁ జేసె వన్నెగాన్. 13

టీ: ఆరజనీ + ఈశబింబరుచిర + ఆస్యలన్ = చంద్రునివంటి ముఖముకల ఆమనోరమ చెలులను; కాంచి = చూచి; నృపాలుడు = స్వరోచి; తత్ + ఆమయవ్యథా భారమున్ = వారిరోగబాధను; మాన్పగాన్ = మాన్పుటకు; తమిన్ = ఆసక్తితో; తత్ = ఆ; కలధౌతగోత్ర = వెండికొండయగు కైలాసమందలి; కాంతారపదంబునన్ = అరణ్యప్రదేశమున; ఉపచితంబగు మందును = పెరిగిన ఔషధమును; తత్ + క్రియా + ఉచిత + ఆహారమున్ = ఆ యౌషధమున కనువగు అహారమును; నెమ్మిన్ = బాగుగా; ఇచ్చుచున్; వన్నెగాన్ = తేజస్సు కల్గునట్లుగా; అనామయవ్యథలన్ = రోగబాధలేని వారలనుగా; చేసెన్.

తా: స్వరోచి మనోరమ చెలికత్తెలనుచూచి అక్కడి బలవత్తరమైన మందులతో వాటికి తగిన యాహారముతో వారి రోగబాధను పోగొట్టెను.

శా. ఆదివ్యౌషధరాజిచేఁ దమమహా ? వ్యాధివ్యథల్ దీఱినన్
మోదం బంది లతాంగు లంబుజకులం ? బున్ నవ్వు కందోయితో
సౌదామిన్యభిరామ దేహరుచితో ? సంపూర్ణచంద్రానన
శ్రీదర్పోన్నతితోఁ జెలంగి సురనా ? రీసూనుఁ గీర్తించుచున్. 14

టీ: లతా + అంగులు = ఆ స్త్రీలు; ఆదివ్యౌషధరాజిచేన్ = ఆ మందులచే; తమ మహావ్యాధివ్యథల్ = తమయొక్క ఎక్కువైన రోగములు; తీఱినన్ = పోగా; మోదంబు + అంది = సంతోషమును పొంది; అంబుజకులంబున్ = తామరల సము

దాయమును; నవ్వ్యకంబోయిణిలో=తిరస్కరించెడి కంటి జంటతో; సౌదామినీ=మెఱుపువలె; అభిరామ = సుందరమైన; దేహరుచిణిలోన్ = దేహకాంతితోను; సంపూర్ణ చంద్ర+ఆననశ్రీ = పూర్ణచంద్రునివంటి ముఖకాంతియొక్క; దర్ప+ఉన్నతిలోన్=ఎక్కువ గర్వముతో; చెలంగి=ప్రకాశించి; సురనారీసూనున్ = స్వారోచిని; కీర్తించుచున్=పొగడుచు......

తా: వారాయౌషధ సేవవలన రోగబాధలు తగ్గగా, సంతోషించి తామర పువ్వుల వంటికన్నులు, మెరుపులవంటి దేహకాంతులు, పూర్ణచంద్రునివంటి ముఖములు కలిగి ప్రకాశించుచు స్వారోచిని పొగడుచు......

క. మాకుపకార మొనర్చితి
నీకుం బ్రతిసేయ నెట్లు నేరుతు మైనన్
లోకోత్తర! మావలనను
జేకొను కార్యములుఁ గలవు చెప్పెద మెలమిన్. 15

టీ: లోక+ఉత్తర=జనులలో శ్రేష్ఠమైనవాడా! మాకున్; ఉపకారము; ఒనర్చితి=చేసితివి; నీకున్; ప్రతిసేయన్=ప్రత్యుపకారము చేయుటకు; ఎట్లు నేరుతుము=ఎట్లు సమర్థులము కాగలము? ఐనన్=కాని; మావలనను=మానుండి కూడ; చేకొను కార్యములున్ = పరిగ్రహించెడి పనులును; కలవు; ఎలమిన్=సంతోషముతో; చెప్పెదము. (వినుము.)

తా: రాజోత్తమా! నీవు మాకెంతో యుపకృతి చేసితివి. దానికి నీకు ప్రత్యుపకారమును చేయలేము. కాని మావలనకూడ నీవు పరిగ్రహింపదగినవి కొన్ని యున్నవి. చెప్పెదము వినుము.

క. మును మాదగువృత్తాంతము
వినిపింపఁగవలయు నీకు విశ్రుతముగ భూ
వినుత విను మనుచు నం దొక
వనజేక్షణ పలికె మధుర వాగ్జితశుకి యై. 16

టీ: భూమినుత = భూమిలో పొగడబడువాడా! మును = ముందుగా; మాదగువృత్తాంతము = మా కథను; విశ్రుతముగన్=స్పష్టముగా; నీకున్; విని పింపగవలయున్ = చెప్పవలెను; వినుము. అనుచున్=అని; అందున్ + ఒకవన జేక్షణ=వారిలో నొకస్త్రీ; మధురవాక్+జితశుకియై=తియ్యని మాటలచే జయింప బడిన యాడుచిలుక కలదై; పలికెన్.

తా: ముందుగా మా కథను స్పష్టముగా వినుమని వారిలో నొకామె చెప్ప నారంభించినది.

తే. అనఘ! మందారవిద్యాధ రాత్మభవను
నను విభావసి యందురు గం ధర్వవరులు

తెలిసియుండుదు నిమ్మహీ తలమునందుఁ
బరఁగు మృగపక్షిజాతుల భాషలెల్ల. 17

టీ: అనఘ=గొప్పవాడా! (నేను) మందారవిద్యాధర + ఆత్మభవను= మందారుడను విద్యాధరుని కూతురను; ననున్=నన్ను; గంధర్వవరులు = గంధర్వ శ్రేష్ఠులు; విభావసి; అంద్రు=అందురు; ఈమహీతలమునందున్ = ఈభూమిలో; పరగు=ఉన్న; మృగ, పక్షిజాతుల భాషలు=మృగములయొక్క, పక్షులయొక్క భాషలను; ఎల్లన్=అన్నిటిని; తెలిసియుండుదున్=తెలిసికొంటిని.

తా: ఓ రాజా! నేను మందారుడను విద్యాధరుని కూతురను. నాపేరు విభావసి. నాకు భూమిలోనున్న పక్షుల, మృగముల భాషలన్నియు తెలియును.

క. అమ్మేటివిద్య నాచే
నిమ్ముగ నంతయు నెఱింగి నృప నన్ను వివా
హ మ్మగు మనవుడు రెండవ
కొమ్మ మదిం బ్రేమ గడలు కొన నిట్లనియెన్. 18

టీ: నృప=రాజా! ఆ+మేటివిద్యన్=ఆ గొప్పవిద్యను; నాచేన్; ఇమ్ముగన్=బాగుగా; అంతయున్=సాకల్యముగా; ఎఱింగి = తెలిసికొని; నన్నున్; వివాహమ్మగుము=పెండ్లాడుము; అనవుడున్=అనిన తర్వాత; రెండవకొమ్మ=రెండవ స్త్రీ; మదిన్=మనసులో; ప్రేమ; కడలుకొనంగన్=వ్యాపించగా; ఇట్లనియెన్ =ఇట్లుపల్కెను.

తా: 'ఆ విద్యను పరిగ్రహించి నన్ను పెండ్లాడుము' అని ఆమె అనినాక రెండవయామె ప్రేమతో ఇట్లు చెప్పనారంభించినది.

ఆ. పారుఁ డనఁగ బరఁగు బ్రహ్మర్షి మాతండ్రి
యతఁడు విద్య లెల్ల నభ్యసించి
తపము నిచ్చఁ జేయఁ దలపోసి కీర భృం
గాలి రమ్య మైన యాశ్రమమున. 19

టీ: మాతండ్రి, పారుడు+అనగన్+పరగు+బ్రహ్మర్షి = పారుడని పిలువబడెడి బ్రహ్మర్షి; అతడు, విద్యలెల్లన్=అన్ని విద్యలను; అభ్యసించి = నేర్చి; ఇచ్చన్=మనస్సులో; తపమున్=తపస్సును; చేయన్=చేయుటకు; తలపోసి= నిశ్చయించి; కీర=చిలుకలతోను; భృంగ+ఆలి=తుమ్మెదల గుంపులతోను; రమ్యమైన=సుందరమైన; ఆశ్రమమునన్=ఆశ్రమమందు......

తా: నా తండ్రి పారుడనెడి బ్రహ్మర్షి. అతడు విద్య లన్నింటిని నేర్చి, తపస్సు చేయదలచి, చిలుకలు, తుమ్మెదలతో అందమైన ఆశ్రమమందు...

మ. ఫలమూలచ్ఛదనాంబుభుక్తిఁ బవనా । భ్యాసక్రియాయుక్తి ని
ర్దళితాంతర్గతశాత్రవప్రకర జా । గ్రద్గర్వసర్వస్వుఁడై
చలికిన్ వానకు నెండకున్ మన మను । త్సాహంబుఁగానీక కం
దళితానందమునన్ ముకుందచరణ । ధ్యానావధానంబునన్. 20

టీ: ఫల=పండ్లయొక్క; మూల = మొదళ్ళయొక్క; ఛదన = ఆకుల యొక్క; అంబుభుక్తిన్=నీరు—తినుటతో; పవన+అభ్యాసయుక్తిన్ = వాయుధారణము చేయు నభ్యాసము చేతను; నిర్దళిత=విడఁగొట్టబడిన; అంతర్గత=లోపల నుండు; శాత్రవప్రకర=శత్రువుల—కామాదులయొక్క; జాగ్రత్=ఎక్కువగు; గర్వసర్వస్వుఁడై = గర్వమంతయు కలవాఁడై; చలికిన్; వానకున్; ఎండకున్; మనము=మనస్సును; అనుత్సాహంబున్=ఉత్సాహము లేనిదానిని; కానీక=కానియ్యక; కందళిత+ఆనందమునన్=ఎక్కువైన సంతోషముతో; ముకుందచరణ=విష్ణుపాదము లందలి; ధ్యాన+అవధానంబునన్ = ధ్యానించుట యందలి యేకాగ్రతతో......

తా: కందమూల ఫలాకుల తినుచు, పవనధారణచేయు నలవాటుతో అంతశ్శత్రువులైన కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యముల నణచి, శీతవాతాతప సహిష్ణుఁడై, శ్రీమన్నారాయణ పాదపద్మ ధ్యానమేకాగ్రతగా జేయుచు...

క. అంగుష్ఠము నిల మోపి ప
తంగునిపైఁ జూపు సాఁచి । ధగధగ లర్చి
స్తుంగత నింగులు నాకెడు
నింగలములు నాల్గుదెసల । నిడుకొని కడఁకన్. 21

టీ: అంగుష్ఠమున్=కాలి బొటన వ్రేలిని; ఇలన్=భూమిపై; మోపి=ఆన్చి; పతంగునిపైన్=సూర్యునికేసి; చూపు=దృష్టిని; చాఁచి=నిగిడించి; ధగధగలు=ధగధగమను కాంతులు; అర్చిస్+తుంగతన్=కాంతియొక్క యౌన్నత్యముచే; నింగులు నాకెడు=ఆకాశమునంటెడి; ఇంగలములు=నిప్పులు; నాల్గుదెసలన్=నాలుగువైపులను; ఇడుకొని=ఉంచుకొని; కడఁకన్=పూనికతో...

తా: కాలిబొటన వ్రేలు నేలమోపి, సూర్యునికేసి చూచుచు, ఆకాశము నంటెడి మంటలు కల నిప్పులను నాల్గువైపుల నుంచుకొని పూనికతో......

క. సుర గరుడ యక్ష రాక్షస
నర కిన్నర సిద్ధ సాధ్య । నాగోత్కర మి
ట్లురు దనఁగఁ దప మొనర్చెం
బురుహూతుఁడు దాన నాత్మఁ । బొడమిన భీతిన్. 22

టీ: సుర...ఉత్కరము = దేవతలు, గరుడులు, యక్షులు, రాక్షసులు, నరులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, నాగుల సముదాయము; ఇట్లు=ఈరీతిగా

తపస్సు చేయుట: అరుదు=కష్టము; అనగన్=అని పొగడగా; తపము = తపస్సును; ఒనర్చెన్ = చేసెను: దానన్ = ఆ తపస్సు వలన; పురుహూతుడు= ఇంద్రుడు; ఆత్మన్=మనస్సులో; పొడమిన భీతిన్=పుట్టిన భయముతో...

తా: దేవతలు మున్నగు వారెవ్వరు తపస్సు చేయుటను మరెక్కడను చూడ లేదని పొగడునట్లుగా నతడు తప మాచరించెను. అని విని ఇంద్రుడు భయపడి...

క. తనయొద్దఁ బుంజికస్థల
యను నచ్చరలేమ యున్న ♩ నమ్మునికడకుం
జను మని యనిపిన పతి శా
సనమున వని కేఁగుదెంచె ♩ సంభ్రమలీలన్. 23

టీ: తనయొద్దన్=తనవద్ద; పుంజికస్థలయనునచ్చరలేమ = పుంజికస్థలయను పేరుకల అప్సరస; ఉన్నన్=ఉండగా; ఆ+మునికడకున్=ఆ మునివద్దకు; చను మని=వెళ్ళుమని; అనిపినన్=పంపగా; పతిశాసనమునన్=రాజాజ్ఞ చే; సంభ్రమ లీలన్=తొందరగా; వనికిన్=తపోవనమునకు; ఏఁగుదెంచెన్=వచ్చెను.

తా: తనవద్దనున్న పుంజికస్థలయను నప్సరసను తపో భంగము చేయుమని పంపెను. ఆమె యింద్రాజ్ఞను శిరసావహించి ఆ తపోవనమున కేతెంచినది.

చ. చిలుకలు ముద్దుఁబల్కులకుఁ ♩ జేరఁగ రా నెఱివేణి కాంతికిన్
మలయుచుఁ బైపయిన్ మధుప ♩ మాలిక వాయక సంచరింపఁగా
నలసవిలాసయానమున ♩ నమ్మునిపాలికి వచ్చె వేల్పుఁదొ
య్యలి నునుసానఁబట్టిన యన ♩ నంగుని మోహనబాణమో యనన్. 24

టీ: వేల్పుఁదొయ్యలి=అప్సరస; ముద్దుఁబల్కులకున్=ముద్దువచ్చు మాటలకు; చిలుకలు; చేరఁగన్=దగ్గరకురాగా; మధుపమాలిక = తుమ్మెదలపంక్తి; నెఱివేణికాంతికిన్=అందమైన జడయొక్క అందమునకు; పైపయిన్=మీదిమీదికి: మలయుచున్=వ్యాపించుచు; వాయక=విడువక; సంచరింపగాన్ = తిరుగగా; అలస=మందమైన; విలాస=ఒయ్యారమైన; యానమునన్ = నడకతో; నును= మెత్తని; సానపట్టిన; అనంగుని=మన్మథుని యొక్క; మోహన బాణమో=సమ్మోహన బాణమో; అనన్=అనునట్లు; ఆ+మునిపాలికిన్=ఆ ఋషిని వద్దకు; వచ్చెన్ =వచ్చెను.

తా: చిలకలకన్న ముద్దువచ్చు మాటలతో, నల్లని జుట్టును చూచి తుమ్మెదల గుంపేమో అని భ్రమసి వెన్నాడు తుమ్మెదలతో, ఒయ్యారమైన నడకతో పుంజికస్థల ఆ తపోవనమునకు వచ్చెను.

వ. ఆ సమయంబున... 25

చ. అనువగు సుళ్ల నొప్పు మలయానిలవాహము నెక్కి తేంట్ల న
ల్లిన నిడువాగెఁ బూని లవలీ నవవల్లిక లెమ్మె సొమ్ములై
పనుపడఁ జెట్టువట్టి మను ప్రాతదళమ్ములతోడఁ దోలె నా
మనిదొర మంచురాజు మడిమంచగఁ గోయిలగంటమ్రోయఁగన్.

టీ: ఆమనిదొర=వసంతర్తువనెడి రాజు; అనువగుసుళ్ళన్=అనుకూలమైన సుడులచే; ఒప్పు=బాగుగానున్న; మలయ+అనిలవాహము = పైరగాలి యనెడి గుర్రమును; ఎక్కి; తేంట్లన్=తుమ్మెదలతో; అల్లిన=పేనిన; నిడువాగెన్= పొడవైన కళ్ళెమును; పూని=పట్టుకొని; లవలీనవవల్లికలు=క్రొత్తవెన్నెల తీగలు; ఎమ్మెసొమ్ములు=అందమైన నగలై; పనుపడన్=కుదురగా; చెట్టు+పట్టి=చెట్టను పట్టుకొని; మనుప్రాతదళమ్ముతోడన్=బ్రతికెడి ప్రాతసేనతో—ఉండెడి ప్రాత యాకులతో; మంచురాజు=హిమమను రాజును; మడిమంచగన్ = బలహీనుడగు నట్లు; కోయిలగంట = కోకిలలనుగంటలు; మ్రోయగన్ = మ్రోగుచుండగా; తోలెన్=పారద్రోలెను.

తా: జయశీలుడగు రాజు శత్రురాజును చెట్టువట్టి పరుగులెత్తు ప్రాతసైన్యముతో సహా పారద్రోలినట్లుగా వసంతర్తువు వచ్చుటతో ప్రాతయాకులు రాలినవి, మంచుతెరలు పోయినవి. ఆదే మంచును జయించినట్లుగా వర్ణింపబడినది. అలం. రూపకము.

సీ. సానదేఱి పొటమరించి నెఱెవాసిన యట్టి
యాకురాలుపుగండ్ల యందుఁ దొలఁగి
యతిబాలకీరచ్ఛదాంకురాకృతిఁ బొల్చి
కరవీరకోరక గతిఁ గ్రమమున
నరుణంపుమొగ్గలై యర విచ్చి పికిలి యీఁ
కలదండులట్లు గుంపులయి పిదప
రేఖలేర్పడఁగ వర్ధిలి వెడల్పయి రెమ్మ
పసరు వాఱుచు నిక్కఁ బసరు కప్పు
గీ. పూఁటపూఁటకు నెక్కఁగ ప్వనరుఁ దగిన
మెఱుఁగు నానాఁటికిని మీఁద గిరిగొనంగ
సొగసై యాకువాలంగ జొంప మగుచుఁ
జిగురు దళుకొత్తెఁ దరులతా శ్రేణులందు. 27

టి: సాన=ద్రవము; తేఱి = స్వచ్ఛముగా కనిపించి; పొటమరించి=పైకి మొలక కన్పడి; నెఱె=బీట; వాసినయట్టి=తీసినటువంటి; ఆకురాలుపు గండ్ల యందున్=ఆకురాలుటచే పల్లముగా నున్న చోట్ల; తొలఁగి=పైకివచ్చి; అతి=

మిక్కిలి; బాలకీర=పిల్లలైన చిలుకల యొక్క; ఛద+అంకుర+ఆకృతిన్=మొలిచెడి రెక్కల యొక్క ఆకారములో; పొల్చి=అందముగానుండి; క్రమమునన్=క్రమముగా; కరవీర కోరకగతిన్=కరవీరపుమొగ్గలవలె; అరుణంపుమొగ్గలై=ఎఱ్ఱని మొగ్గలై; అరవిచ్చి=సగమువిడి; పికిలియీకలదండులట్లు=పికిలి పిట్టల యొక్క యీకలగుంపులవలె; పిదపన్=తర్వాత; రేఖలు=ఈనెలుండు చారలు; ఏర్పడగన్=స్పష్టముకాగా; వర్ధిలి = పెరిగి; వెడల్పంది = వెడల్పుగా పెరిగి; రెమ్మపసరువారుచున్ = పచ్చనిరంగు కలిగి; నిక్కన్ = నిలువగా; పసరు=ఆకుపచ్చరంగు; పూట పూటకున్=ఆ పూటకాపూటకు; కప్పు=నలుపు; ఎక్కన్=కాగా—ముదిరినకొలది ఆకులు నల్లగా మిసమిసలాడు చుండుట సాజము; కప్పునకున్=ఆ నలుపునకు; తగిన మెఱుంగు=తగినట్టి తళతళ; మీదన్=పైన; నానాటికిన్=ఒక్కొక్క రోజునకు; గిఱికొనంగన్=ఆవరించగా; సోగలై = పొడవై; ఆకు; వాలంగన్ = వెనుకకు విరగబడగా; జొంపము+అగుచున్ = గుబురుగా నగుచు, తరులతాశ్రేణులందున్ = చెట్లయొక్క; తీగెలయొక్క వరుసలందు; చిగురు; తళుకొత్తెన్=ప్రకాశించెను.

తా: ఇందు చిగురుపుట్టి పెరిగెడి క్రమము చక్కగా వర్ణింపబడినది. ఆకు రాలిన గంట్లనుండి సోనవచ్చి చిన్నబొటిమలవలె అంకురములు పైకి వచ్చి చిలుక పిల్లలకు మొదటవచ్చు చిన్న రెక్కలవలె నుండి, అవి క్రమముగా ఎఱ్ఱకరవీరపు మొగ్గలవలెనుండి, ఎఱ్ఱని మొగ్గలై సగమువిచ్చి, పికిలి పిట్టల యీకలవలె నుండి ఆకులపై నుండు నీనెల రేఖలు కన్పడునట్లయి, వెడలుపయి, ప్రక్కభాగములు పసరెక్కుచు నానాటి కా పసరురంగు నలుపెక్కి తళతళ వచ్చి ఆజోకగా వెనుకకు వ్రాలి గుబురుగా పెరిగినవి. ఇట్లు ప్రతి చెట్లు, తీగెలకు చిగురులు పుట్టి పెరిగినవి. అలం. స్వభావోక్తి.

క. హిందోళంబునఁ బాడిరి
బృందారకసతులు విరహి బృందార్తిగఁ ద్రేఁ
చెం దేటులు వాసంతిక
విందునఁ బికశిశువు దాది వెడలం దోలెన్. 28

టీ: బృందారకసతులు=దేవతాస్త్రీలు; విరహిబృంద+ఆర్తిగన్=విరహము కల జనులకు బాధకలుగు నట్లుగా; హిందోళంబునన్ = హిందోళమను రాగమున; పాడిరి=గానము చేసిరి; తేఁటులు=తుమ్మెదలు; వాసంతికవిందునన్ = బండిగురివెంద పూదేనె త్రాగుటయను విందుతో; త్రేఁచెన్=త్రేన్చెను. పికశిశువున్=కోయిల పిల్లను; దాది = పెంపుడు తల్లియైన కాకి; వెడలందోలెన్ = వెడలగొట్టెను.

తా: కోకిలలు వసంత ఋతువునందు పంచమ స్వరమున పాడును. ఆ పాట వినుట తోడనే దానిని పెంచెడి కాకి అది తన పిల్ల కాదనుకొని వెడలగొట్టును. అప్పటి

వరకు భేదము తెలియనందున అది తన పిల్లయే యనుకొను నా కాకి. 'శిశిరస్యవసంత స్యసంధౌహిందోళరాగకః' అని శిశిరవసంతర్తువుల సంధిలో హిందోళరాగ మాలాపించవలెను. దేవతాస్త్రీలు హిందోళరాగమున పాటలు పాడిరి. అలం. స్వభావోక్తి.

సీ. చలిగాలి బొండుమ ౹ ల్లెలపరాగము రేఁచి
నిబిడంబు సేసె వె ౹ న్నెలరసంబు
వెన్నెలరస ముబ్బి ౹ వెడలించె దీర్ఘికా
మందసౌగంధిక ౹ మధునదంబు
మధునదం బెగఁ బోసె ౹ మాకందమాలికా
క్రీడానుషంగిభృం ౹ గీరవంబు
భృంగీరవం బహం ౹ కృతిఁ దీఁగె సాగించెఁ
బ్రోషిత భర్తృకా ౹ రోదనముల

గీ. విపినవీథుల వీతెంచెఁ ౹ గుపితమదన
సమదభుజనత సుమధను ౹ ష్టాంకృతములు
సరసమధుపాన నిధువనో ౹ త్సవవిలీన
యువతియువకోటికోరికల్ ౹ చివురు లెత్త. 29

టీ: చలిగాలి = చల్లని పైరు గాలి; బొండుమల్లెల పరాగమున్ = బొండుమల్లె పూల పరాగమును; రేఁచి = రేగగొట్టి; వెన్నెల రసంబున్ = వెన్నెలయను నీటిని; నిబిడంబు చేసెన్ = చిక్కపడునట్లు చేసెను; వెన్నెల రసము = వెన్నెల నీరు; ఉబ్బి = పైకుబికి; దీర్ఘికా = దిగుడు బావులందలి; అమంద = ఎక్కువైన; సౌగంధిక = సువాసనకల యెఱ్ఱకలువల వలని; మధునదంబున్ = తేనె ప్రవాహమును; వెడలించెన్ = ప్రవహించునట్లు చేసెను; మధునదంబు = పూదేనె నదులు; మాకంద మాలిక = తియ్యని మామిడిచెట్ల వరుస లందలి; క్రీడా + అనుషంగి = ఆటలతో కలిసిన; భృంగీ = ఆడుతుమ్మెదల యొక్క; రవంబు = ధ్వనిని; ఎగఁబోసెన్ = ఎక్కువ చేసెను. భృంగీరవంబు = ఆడుతుమ్మెదల ఝంకారము; అహంకృతిన్ = గర్వముతో; ప్రోషితభర్తృకారోదనములన్ = పొరుగూరు వెళ్ళిన భర్తలుకల స్త్రీల యొక్క యేడుపులను; తీఁగెసాగించెన్ = వృద్ధి పొందించెను; కుపిత = కోపించిన; మదన = మన్మథుని యొక్క; సమద = మదముతో కూడిన; భుజ = బాహువుచే; నత = వంచబడిన; సుమధనుః = పువ్వుల వెడి వింటియొక్క; టాంకృతములు = టంకారములు; సరస = రుచియైన; మధుపాన = మద్యపానము చేసి; నిధువన = మైధునమను; ఉత్సవ = వేడుకయందు; విలీన = మునిగిన; యువతి = పడుచు దనము కల స్త్రీల యొక్క; యువ = యువకుల యొక్క; కోటి = సముదాయముయొక్క; కోరికలు; చివురులెత్తన్ = ఎక్కువగునట్లు; విపినవీథులన్ = ఉద్యానవనములలో; వీతెంచెన్ = వ్యాపించెను.

తా: వసంతఋతువున చల్లనిగాలి కెగిరి వచ్చిన మల్లెపూ పరాగముతో వెన్నెల చిక్కబడినది. వెన్నెల నీటి ప్రవాహములచే దిగుడు బావులలోని యెఱ్ఱ కలువల పూదేనె ఏరులై పారజొచ్చినది. ఆ పుష్పరసముతో తియ్యమామిళ్ళ మీద నుండు తుమ్మెదల ధ్వని హెచ్చినది. ఆ తుమ్మెదల రొదలతో ప్రోషిత భర్తృకల విచారము హెచ్చినది. దానితో మన్మథుని పూ బాణముల మోత ఉద్యానము లందు హెచ్చినది. ఆ ధ్వనులు హెచ్చగా మద్యము త్రావి రతి క్రీడసల్పుకొను యువతీ యువకుల కోరిక లీరికలెత్తినవి. అలం. కారణమాల, కావ్యలింగము.

క. అత్తఱి మురిపపునడఁ జెలి
కత్తియగమి గొలువ మృదుల కలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడనగవులతోఁ
జిత్తభవుం డార్వ ననలు చిదుము నెపమునన్. 30

టీ: అత్తఱిన్=అప్పుడు; మురిపపునడన్=ఒయ్యారమైన నడకతో; చెలికత్తియగమి=చెలికత్తెల గుంపు; కొలువన్=తన్ను చుట్టుకొనిరాగా; మృదులకల భాషలన్=మృదువైన మధురమైన పలుకులతో; తళ్కొత్తెడు వెడనగవులతోన్=వెలుగుచున్న చిన్న చిన్న నవ్వులతో; చిత్తభవుండు=మన్మథుడు; ఆర్వన్=అరవగా; ననలు=పువ్వులు; చిదుము నెపమునన్=త్రుంచెడి వంకతో......(మన్మథుడరచుట తన బాణములగు పూలు కోయవలదని కోపించునట్లని యెరుగునది.)

తా: ఆ వసంతర్తువులో ఒయ్యారమైన నడకతో చెలికత్తెలు సేవించుచుండగా ముద్దులు గుల్కెడి పలుకులతో అందగించు చిరునగవులతో మన్మథుడు కేకలు వేట్టునట్లు పూలను కోసెడి వంకతో.........

చ. అలకనిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁపఁ గొప్పు చెం
గలువలవల్పుఁ జన్నుఁగవ కస్తురి తావియుఁ ద్రస్తరింప నం
దెలరొద మీఱఁ బెన్నిధిగ తిన్ ప్రతికిం బొడకట్టె వేల్పుఁ దొ
య్యాలి చిఱుసానఁ బట్టిన యనంగుని మోహనబాణమో యనన్.

టీ: వేల్పుఁదొయ్యాలి=అప్సరసయను పుంజికస్థల; అలకనిజీబులోన్=పల్చని చీరలో; కుసుమ మద్దిన=కుసుంబారంగు వేసిన; పావడ = లోపల కట్టిన చీర; దోఁపన్=పైకి కన్పడగా; కొప్పు చెంగలువలవల్పున్ = కొప్పులో పెట్టుకొన్న ఎఱ్ఱకలువల పరిమళమును; చన్నుఁగవ కస్తూరి తావియున్=చంటిజంటకు పూసికొన్న కస్తూరి పరిమళమును; త్రస్తరింపన్=నలుదిక్కులకు వ్యాపించగా; అందెలరొద=అందెలమోత; మీఱన్=ఎక్కువకాగా; పెన్నిధిగతిన్=పెద్దనిధివలెను; చిఱుసానన్=చిన్న మెరుగు సానయందు; పట్టిన=పదనుపట్టిన; అనంగుని = మన్మథుని యొక్క; మోహనబాణమో యనన్ = సమ్మోహనముచేయు బాణమా అనునట్లు; ప్రతికిన్=మహర్షికి; పొడకట్టెన్=కన్పడెను.

మన్మథుని పంచబాణములలో నొకటి మోహన మనుటకు 'ఉన్మాదన స్తాపన శ్చైశోషణ స్తంభన స్తథా। సమ్మోహనశ్చ కామస్య పంచబాణాః ప్రకీర్తితాః॥' అని.

తా: ఆ యప్సరస ఎఱ్ఱని పావడ కట్టుకొని దాని అందము పల్చని చీరలో నుండి పైకగపడు చుండగా, పరిమళించు నెఱ్ఱకలువలను కొప్పున తుఱిమి, చంటికి కస్తూరి పూసికొని మన్మథుని మోహన కరమైన బాణమో అనునట్లు కాలియందెలు చప్పుడు చేయుచుండగా నొయ్యారముగా నడచుచు పార్శ్వ వద్దకు వెళ్ళి కన్పడెను.

తే. అత్తెఱంగున నదిరి పా ‖ టారజంపు
వన్నెఁ బొడకట్టి తాఁ బాడు ‖ సన్నరవళి
పాట లళిఝుంకృతి శ్రుతిఁ ‖ బాదుకొనఁగఁ
జూడకయ చూచుచూపుతో ‖ సుడియుటయును. 32

టీ: ఆ + తెఱఁగునన్ = ఆ రీతిగా; అదిరిపాటు = హఠాత్తుగా; ఆరజంపు వన్నెన్ = అందమైన కాంతితో; పొడకట్టి = కన్పించి; తాన్ = ఆమె; పాడు = పాడెడి; సన్నరవళి = సన్నని ధ్వని; అళిఝుంకృతిశ్రుతిన్ = తుమ్మెదల ఝుంకారమనెడి శ్రుతిలో; పాదుకొనంగన్ = కలియగా; చూడకయ = చూడనట్లుండు; చూచుచూపుతోన్ = చూచెడి చూపుతో; సుడియుటయును = తారాడగా...

తా: ఆమె యట్లు హఠాత్తుగా కన్పడి సన్నని గొంతుకతో పాటను తుమ్మెద ఝుంకారమను శ్రుతితో మేళవించి చూచియు చూడనట్లు చూచెడి యోరచూపులతో చూచుచు అతని చుట్టుప్రక్కల తచ్చాడుచుండెను.

చ. తలకొని దానితమ్మిలపుఁ ‖ దావియు మోవియుఁ గాను మేను న
గ్గలపు మెఱుంగు లీను తెలి ‖ గన్నులుఁ జన్నులు భృంగమాలికన్
గెలిచిన యారుతీరుఁ దగు ‖ నెన్నడలుం దొడలున్ వివేకముం
గలఁపఁగఁగాంచి పంచశర ‖ కాండవిఖండిత ధైర్యసారుఁడై. 33

టీ: దానితమ్మలపుఁదావియున్ = ఆమె వేసికొన్న తాంబూలపు సువాసనయు; మోవియున్ = అధరోష్ఠమును; కానున్ = నడుమును; మేనున్ = శరీరమును; అగ్గలపు మెఱుంగులు = ఎక్కువ కాంతులను; ఈను తెలి గన్నులున్ = వెదజల్లెడి తెల్లని కన్నులను; చన్నులున్; భృంగమాలికన్ = తుమ్మెదల పంక్తిని; గెలిచిన యారుతీరున్ = గెలువదగిన నూగారు టందమును; తగు నెన్నడలున్ = తగిన అందమైన నడకలును; తొడలున్; తలకొని = ఆరంభించి; వివేకముః = కార్యాకార్య జ్ఞానమును; కలఁపఁగన్ = కలచివేయగా; కాంచి = చూచి; పంచశరకాండ = మన్మథబాణములచే; విఖండిత = ఖండింపబడిన; ధైర్యసారుడై = ధైర్యబలము కలవాడై......

తా: ఆ యప్సరస యొక్క శరీరసౌష్ఠవము, తాంబూలపు సువాసన, ఒయ్యారంపు నడక మున్నగు వాటిని చూచి అవి యొకదాని కొకటి బలమై తన ధైర్యమును

సడలింపగా పారుడు మదన వేదనచే తూలినవాడై........అలం. కావ్యలింగము ఉపమయు.

క. మేను గరుపాఱఁ దమి న
మ్మౌని జపముఁ దపముఁ దన్ను ౯ మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు
హీనస్వర మెసఁగఁ బ్రోవ ౯ వే నన్ననుచున్. 34

టీ: ఆ+మౌని=ఆ పారుడు; మేను=శరీరము; గరుపాఱన్=పులకరింపగా; తమిన్=ఎక్కువ కోరికచే; జపమున్=మంత్రోచ్చారణను; తపమున్ = నియమముగా నుండుటను; తన్నున్=తన కృత్యమును; మఱచి; అనంగగ్లానిన్ = మన్మథవేదనను; పడి; కదిసి=ఆమెను సమీపించి; వడఁకుచున్ = కంపమునొందుచు; హీనస్వరము=తగ్గినకంఠధ్వని; ఎసగన్=ఎక్కువకాగా; నన్నున్; ప్రోవవే=రక్షింపవే; అనుచున్......

తా: ఆ పారర్షి శరీరము పులకరింపగా జపతపోనుష్ఠానములు మరచిపోయి, ఆమె వద్దకేగి వణకుచు 'నన్ను చేరదీసి బ్రతికించు మ' ని ప్రార్థించుచు...

తే. చెయ్యి పట్టినమాత్రన ౯ శిరము వంచి
యవశచందానఁ బైవ్రాలు ౯ నవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి ౯ బ్రాహ్మణుండు
కెరలు కోర్కులఁ గందర్ప ౯ కేళిఁ దేలె. 35

టీ: చెయ్యిపట్టిన మాత్రానన్ = చేతిని పట్టుకోగానే; శిరసువంచి=తలవంచి; అవశచందానన్ = పరవశయైనట్లుగా; పైవ్రాలు+ఆ+వధూటిన్ = మీదపడెడి ఆమెను; పర్ణశాలా+అంతరమున్=పర్ణశాలలోనికి; చేర్చి; బ్రాహ్మణుండు=ముని; కెరలు కోర్కులన్ = పెల్లుబికెడి కోరికలతో; కందర్పకేళిన్ = రతితో; తేలెన్=ఆనందించెను.

తా: చేయి పట్టుకోగానే యొడలు పరవశమైనట్లుగా అతని మీద పడగా ఆమెను పర్ణశాలలోనికి తీసికొనివెళ్ళి యథేచ్ఛముగా రతికేళి భోగించెను.

* క. తప మంతయుఁ బొలివోవఁగ
నపు డన్నియు నుజ్జగించి ౯ యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా
విపులైశ్వర్యంబు లనుభ ౯ వించుచు నుండెన్. 36

టీ: తపసి=ముని; తపమంతయున్=తా జేసిన తపస్సంతయును; పొలివోవగన్=వృథాకాగా; అపుడు; అన్నియున్=నిత్యకర్మలన్నియును; ఉజ్జగించి=విడిచి; ఆ+అంగనతోన్=ఆ యప్సరసతో; మనోజక్రీడా=రతివలని; విపుల=

ఎక్కువైన; ఐశ్వర్యంబులు=సుఖములను; అనుభవించుచునుండెన్ = అనుభవించుచుండెను.

తా: ఆ ముని తపస్సు విడిచి ఆమెతో సంభోగించుచు కాలము గడపుచుండెను.

క. ఈరీతిఁ గొంతకాలం
బారామ మహామహీధ్ర రారణ్యములం
దా రామవలలఁ దగిలి వి
హారము సలుపంగ గర్భ మై తఱియగుడున్. 37

టీ: ఈ రీతిన్ =ఇట్లు; కొంతకాలము = కొన్నాళ్ళు; ఆ రామవలలన్ = ఆయప్సరసయొక్క ప్రేమయను వలలో; తగిలి; ఆరామ=ఉద్యానములు; మహామహీధర=పెద్దకొండలు; అరణ్యములందున్ =వనములందును; విహారము సలుపంగన్ =విహరించగా; గర్భమై=ఆమెకు గర్భమువచ్చి; తఱియగుడున్ =ప్రసవించు సమయమురాగా......

తా: ఇట్లు కొంతకాలమా ముని యామె వలలో చిక్కుకొని కొండలు, వనములలో విహరింపగా నామె గర్భవతియై ప్రసవసమయము రాగా......

క. అంత ననుఁగాంచి యది విపి
నాంతగమునఁ బాఱవైచి యరిగెఁ గృపార్ద్రి
స్వాంతుఁ డగుసంయమీంద్రుఁడుఁ
జింతింపక పోయె నేమి సెప్పుదు నధిపా. 38

---

* పాఠాంతరము

తపనోదయాస్తమయము
లిపుడని కాలప్రమాణ మెఱుఁగని తమి న
చ్చపలాక్షిఁ గూడి రతిసుఖ
విపులైశ్వర్యంబు లనుభవించుచునుండెన్.

అ. ఇపుడు; తపన=సూర్యుని యొక్క; ఉదయ+అస్తమయములు; అని; కాలప్రమాణము = =కాలము యొక్క నడకను; ఎఱుగని తమిన్ = తెలియుని యొల్లు తెలియని కోరికతో; ఆ+చపలాక్షిన్+కూడి=ఆ యప్సరసతో కలిసి; రతిసుఖ= రతిసుఖము యొక్క; విపుల = ఎక్కువైన; ఐశ్వర్యంబులు; అనుభవించుచునుండెను.

తా: సూర్యోదయాస్తమయము లెరుగని రీతిగా నామెతో కలిసి సంభోగసుఖము లనుభవించు చుండెను. (ఈ పద్యము ప్రక్షిప్తమనికొన్నిట నున్నది.)

టీ: అధిపా=రాజా! అంతన్=పురుడురాగా; అది=ఆ యప్సరస; ననున్=నన్ను; కాంచి=కని; విపిన+అంతరమునన్=అడవిమధ్యలో; పాఱవైచి=దిగవిడిచి; అరిగెన్=స్వర్గమునకు పోయెను; కృపా+ఆర్ద్రస్వాంతుడగు=దయచే చల్లని మనస్సు కలిగిన; సంయమి+ఇంద్రుడు=మునిశ్రేష్ఠుడు; చింతింపకపోయెన్=నావిషయమై ఆలోచనయే చేయలేదు; ఏమిచెప్పుదున్=ఏమని చెప్పుదు నా కష్టదశను?

తా: అంతట నాతల్లి నన్ను కని నట్టడవిలో పారవేసి స్వర్గమునకు పోయినది. దయార్ద్రహృదయుడైన మునియు నా యోగక్షేమము నరయలేదు. ఏమని చెప్పను?

వ. అట్లు వైచి చనుటయు నాఁకటం గటకటంబడుచుండి తీండ్రించు శశిమండలంబున వెడలు శిశిరకిరణప్రణాళికామిళ దమృత రస గ్రాసంబునం జేసి కొన్ని పూఁటలం బుటపుటనైన నన్నుం గనుంగొని మునీంద్రుండు ప్రియం బంది నిజాశ్రమంబునకుం గొని చని శశికళాసంవర్ధిత నగుటం జేసి నాకుం గళావతియను నామం బిడి పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండు నంత. 39

టీ: అట్లు=ఆ రీతిగా; వైచిచనుటయున్=పాఱవైచిపోగా; ఆఁకటన్=ఆకలిచే, కటకటంబడుచుండి=బాధపడుచు; తీండ్రించు శశిమండలంబునన్=ఎక్కువగా ప్రకాశించెడి చంద్రమండలమునుండి; వెడలు=పుట్టెడి, శిశిరకిరణ=చల్లని కిరణములయొక్క; ప్రణాళికా=సముదాయములలో; మిళత్=కలిసిన; అమృతరస=అమృతముయొక్క; గ్రాసముచేతన్=తినుటచే; కొన్ని పూటలన్=కొన్ని రోజులలో; పుటపుటనైన=పెరుగుచున్న; నన్నున్; కనుంగొని=చూచి; మునీంద్రుండు=పారుడు; ప్రియంబంది=సంతోషించి; నిజ+ఆశ్రమంబునకున్=తన యాశ్రమంబునకు; కొనిచని=తీసికొనివెళ్ళి; శశికళాసంవర్ధిత నగుటంజేసి=చంద్రకళలచే పెంచబడిన దాననగుటచే; నాకున్; కళావతి; అనునామంబు=అనెడి పేరును; ఇడి=పెట్టి; పెనుచుచుండఁగ=పెంచుచుండగా; నేనును; జనకసేవాపరతన్=తండ్రియొక్క సేవయందలి ఆసక్తిచే; ప్రవర్తిల్లుచుండునంతన్=మెలగుచుండగా......

తా: అట్లు నన్ను వదలిపోగా నేను చంద్రకిరణముల నుండి వచ్చిన నమృతము ద్రాగి పెరిగితిని. అట్టి నన్నుచూచి పారర్షి సంతోషించి నన్ను తీసికొని వెళ్ళి చంద్రకళలచే పెరిగి నందున 'కళావతి' అను పేరు పెట్టి పెంచుచుండెను. నేను తండ్రిని సేవించుచుంటిని. అంత.........

ఉ. ఆసమయంబునం బొగులు ♦ చాఁకటిపెల్లున నంతకంతకున్
గాసిలి పైపయిన్ వదన ♦ గహ్వర మెండఁగ నేడ్చి యేడ్చి యే

మాసయుఁ గాన కంతఁ దుహి ◊ నాంశుఁడు దోఁచినఁ దత్కళారస
గ్రాసవిధిన్ శరీర మమ ◊ రంగ భజించితి దైవికంబునన్. 40

(క్రింది రెండు పద్యములును పైవచనములోని యర్థమునే చెప్పుచున్నందున ప్రక్షిప్తము లనియు, గద్యయే పెద్దనదనియు కొందరి మతము.)

టీ ఆ సమయంబునన్ = తల్లి విడిచి పోగా; ఆఁకటిపెల్లునన్ = ఎక్కువయాకలిచే; పొగులుచున్ = దుఃఖించుచు; అంతకంతకున్ = కొంతసేపయిన కొలది; గాసిలి = కష్టపడి; పైపయిన్ = ఎక్కువగా; వదనగహ్వరము = నోరు; ఎండగన్; ఏడ్చియేడ్చి = ఎక్కువగా నేడ్చి; ఏమి+ఆసయున్ = ఏ విధమైన ప్రాణముమీద ఆశయును; కానక = లేక; అంతన్ = అంతలో; దైవికంబుగన్ = అదృష్టమువలన; తుహినాంశుడు = చంద్రుడు; తోఁచినన్ = ఉదయించగా; తత్కళారస గ్రాసవిధిన్ = అతని కళలను తినుటతో; శరీరము; అమరగన్ = వృద్ధిపొందగా; భజించితిన్ = కాచుకొంటిని.

తా: తల్లి అట్లు కని పారవేసి పోగా ఆకలి బాధచే విచారించుచు ఇక బ్రతుకుపై ఆశలేక పోగా నా అదృష్టవశమున చంద్రోదయము కాగా చంద్రకిరణముల లోని అమృతరసపానము చేసి శరీరమును రక్షించుకొంటిని.

సీ. ఏ నవ్విధంబున ◊ మేను పెంచుచునుండ
నాచంద మంతయు ◊ నాత్మ నెఱిఁగి
కడుసంభ్రమమున న ◊ క్కడికి నేతెంచి యిం
పెసఁగ మైనిండిన ◊ కసటు దుడిచి
తనయురంబునఁ జేర్చి ◊ కొని పోయి యాశ్రమ
స్థలమున నిజపర్ణ ◊ శాల నునిచి
విధుకళాంశాహార ◊ విధి వసించితిఁ గాన
నాకుఁ గళావతీ ◊ నామ మొసఁగి

గీ. నయము మీఱంగఁ బెనుప నా ◊ నాఁటఁ బెరిఁగి
శైశవము మాని యౌవనో ◊ త్సవముఁ జెంది
జనకు నేమైన నడుగుచు ◊ సంతతంబు
నోపి శుశ్రూష చేయుచు ◊ నున్నచోట. 41

టీ: ఏను = నేను; ఆ+విధంబునన్ = ఆ రీతిగా; మేను = శరీరము; పెంచుచునుండన్ = నిలబెట్టుకొను చుండగా; ఆ చందము = ఆ నా పోషణ రీతిని; అంతయును; ఆత్మన్ = మనస్సులో; ఎఱిఁగి = తెలిసికొని; కడుసంభ్రమమునన్ = ఎక్కువ తొందరతో; అక్కడకున్ = నేనున్న చోటికి; ఏతెంచి = వచ్చి; ఇంపు+ఎసఁగన్ = ఆనంద మెక్కువకాగా; మైన్ = నాశరీరమున; నిండినకసటు = నిండుగానున్న

మంటిని; తుడిచి; తనయుఁరంబునన్ = తన రొమ్ముపై; చేర్చుకొనిపోయి = అంట నెత్తుకొని వెళ్ళి; ఆశ్రమస్థలమునన్ = తపోవనమున; నిజపర్ణశాలన్ = తనపర్ణశాలలో; ఉంచి; విధుకళా+అంశ+ఆహారవిధిన్ = చంద్రకళల నాహారముగాచేసికొనుటచే; వసించితిన్ = ఉంటిని; కానన్ = కాబట్టి; నాకున్; కళావతియను పేరును; ఒసగి = పెట్టి; సహము = ముద్దు; మీఱంగన్ = ఎక్కువకాగా; పెనుపన్ = పెంచగా; నానాఁటన్ = ఆ నాఁటి నుండి రోజు; పెరిగి; శైశవము = బాల్యము; మాని = వెళ్ళి; యౌవన+ఉత్సవమున్ = పడుచుదనము వలని సంతోషమును; చెంది = పొంది; జనకున్ = తండ్రిని; ఏమైన నడుగుచున్ = కావలసిన వడుగుచు; సంతతంబు = ఎల్లపుడును; ఓపి = ఓసికతో; శుశ్రూష = సేవ; చేయుచునున్న చోటన్ = చేయుచుండగా......

క. ఎవ్వారు చూచినఁ జూపులఁ
జివ్వకుఁ బద నడఁగి నడచు సిగ్గున నొఱపై
రవ్వకు మొదలగు పాపపు
జవ్వన మెదిరించె జిగి యెసఁగ నామేనన్. 42

టీ: ఎవ్వరు చూచినన్ = ఎవరు నన్ను తేరిపార చూచినను; చూపులన్ = తిరిగి వారిని చూచుటతో; చివ్వకున్ = పోరాటమునకు; పదను = వాడి; అడఁగి = తగ్గి; నడచు సిగ్గునన్ = నడచెడి సిగ్గుచే; ఒఱపై = అందమై; రవ్వకున్ = తిట్టుటకు; మొదలగు = కారణమైన; పాపపు జవ్వనము = పాడు యౌవనము; నామేనన్ = నాశరీరమున; జిగి = కాంతిని; ఎసగన్ = ఎక్కువకాగా; ఎదిరించెన్ = వచ్చిమీద పడినది.

తా: నన్ను చూచిన వారిని తిరిగి చూచుటకు సందేహము కల్గించెడి సిగ్గు కల్గగా, ఈమె అట్లున్నది—ఇట్లున్నది అని నల్గురును తిట్టుటకు వీలైన యౌవనము వచ్చిపడినది.

శా. ఆవేళం బొడఁగాంచి ఖేచరుఁ డొకం డాసక్తి దేవాపి సం
జ్ఞావంతుండు సబాంధవుం డగుచు నిశ్శంకన్ ననున్ వేడువాఁ
డై వాచంయముఁ డగ్నికార్యనిరతుం డై యున్నచోఁ బర్ణశా
లావాసంబున కేగుదెంచి నిజభావాకాంక్ష సూచించినన్. 43

టీ: ఆ వేళన్ = అట్టియౌవనము వచ్చినపుడు; ఒకండు = ఒక; ఖేచరుండు = గంధర్వుడు; దేవాపిసంజ్ఞావంతుండు = దేవాపియను పేరు కలవాడు; పొడగాంచి = చూచి; ఆసక్తిన్ = నన్ను పెండ్లాడవలె కోరికతో; సబాంధవుండగుచున్ = బంధువులతో కూడినవాడై; నిశ్శంకన్ = సందేహము లేకుండ; ననున్; వేడువాడై = తనకిమ్మని కోరువాడై; వాచంయముడు = మహర్షి; అగ్నికార్యనిరతుండై = అగ్నిహోత్రము చేయుటలో నిష్టను కలవాడై; ఉన్నచోన్ = ఉండగా; పర్ణశాలా+ఆవాసంబునకున్ = పర్ణశాలకు; ఏగుదెంచి = వచ్చి; నిజభావ+ఆకాంక్షన్ = తన మనసులోని కోరికను; సూచించినన్ = తెలియజేయగా......

తా: నాకు యౌవనము రాగా దేవాపియను గంధర్వుడు నన్ను చూచి పెండ్లి చేసికొన గోరి తపోవనమునకు బంధువులతో కలిసివచ్చి నిశ్శంకముగా నాతండ్రి అగ్నిహోత్రము చేసికొను చుండగా తన కోరికను తెలుపగా.........

సీ. శిఖిపింఛదళపరి ‡ ష్కృతములై సేమంతి
విరుల తీ రగుశిరో ‡ వేష్టనములు
నెఱగంటి చూడ్కిఁ దా ‡ యెతులబాహులు వంచి
నారాజు లల్లార్చు ‡ నారజములుఁ
గాదంబరీగంధ ‡ గర్భంబులై వల్చు
ఘనసారమిళదాస్య ‡ గంధములును
దరహాసములఁ దోఁచు ‡ తాంబూల సేవాంధ
కారితాధర రద ‡ క్షతుల యొఱపుఁ

తే. జిటులు గందంపుఁ బూఁతలు ‡ జిహ్వికలకు
ననుపు నెఱవాది బంటు పం ‡ తపుఁ బదరులు
ఘనమగుజుగుప్స పెనుప న ‡ జ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నస ‡ హ్యించుకొనుచు. 44

టీ: శిఖిపింఛదళ = నెమలిపింఛపు టీకలచే; పరిష్కృతములై = అలంకరింపబడినవై, చేమంతివిరులతీరగు = చేమంతి పూలవలె నున్న; శిరోవేష్టనములున్ = తలపాగలును; ఎఱగంటి చూడ్కిన్ = ఎర్రని కంటిచూపుతో; తాయెతులబాహులు = తాయెత్తులు కట్టుకొన్న చేతులను; వంచి; నారాజులు = కత్తులను; అల్లార్చు నారజములున్ = త్రిప్పెడి అందములును; కాదంబరీగంధగర్భంబులై = కల్లువాసనతో కూడినవై; వల్చు = వాసన వేసెడి; ఘనసారమిళత్ = పచ్చకర్పూరముతో కలిసిన; ఆస్యగంధములును = ముఖవాసనలును; దరహాసములన్ = చిరునవ్వులతో; తోఁచు = కనిపించెడి; తాంబూలసేవా = నిత్యము తాంబూలమును వేసికొన్నందున; అంధకారిత = గారకట్టి కన్పడని; అధర = అధరోష్ఠముమీది; రదక్షతులయొఱపు = పంటికాటుల గాటులును; చిటులుగందంపుఁబూఁతలున్ = బీటలు తీసెడి గంధపు పూతలును; జిహ్వికలకున్ = నాలుకలకు; ననుపు = అలవాటైన; నెఱవాది = నేర్పుకల; బంటుపంతపు బదరులును = శౌర్యము తెల్పుమాటలును; ఘనమగుజుగుప్స = ఎక్కువైన అసహ్యమును; పెనుపన్ = వృద్ధిచేయగా; ఆ+జనమున్ = ఆ గంధర్వులను; ఋషి; చూచి; మనంబునన్ = మనసులో; కడున్ = మిక్కిలి; అసహ్యించుకొనుచున్ = చీదరించుకొనుచు......

తా: నెమలి యీకలు గ్రుచ్చిన తలపాగలు, కల్లుత్రాగుటచే నెర్రనైన కన్నులు; దండలతో త్రిప్పబడుచున్న కత్తులును, కల్లువాసన పోవుటకై వేసి

కొన్న తాంబూలపు గారచే కప్పుకొని పంటికొంపుమను. పుణ్యశృంగములు; పెటలుతియును సంతిగా పూసికొన్న గంధపు పూతలు. తమ ప్రతాపము తెలిపెడి గర్వోక్తులు కలిగిన ఆ గంధర్వులను చూచి ముని ఆసహ్యించుకొనుచు.........

(తాను నియమనిష్ఠాపరుడై నందున, తనపద్ధతికి వ్యతిరేకముగా నున్న వారి ఆకార వేష భాషలను చూచునప్పటికి మహర్షి కసహ్యము జేసినది.) అలం. స్వభావోక్తి.

శా. ఆహా ధన్యుఁడ నైతి మద్విమలవంశాచార విద్యా తప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్ నాగవాసంబు మ
ద్గేహాళిందికి బిడ్డ వేఁడుటకు నేతేఁ గాంచుటన్ బ్రాహ్మ్య మిం
కోహో! చాలు బొకాలి పోయెదరొ పోరో నోటిక్రొవ్వేటికిన్.

టీ: ఆహా! నాగవాసంబు = భోగపుమేళము; మత్ + గేహాళిందికిన్ = నాయింటి వాకిటికి; బిడ్డన్ = నాకన్యను, వేఁడుటకున్ = కోరుటకై; ఏతేన్ + కాంచుటన్ = వచ్చునంతటి అదృష్టము కల్గుటచే; ధన్యుఁడనైతిన్ = అదృష్టవంతుడనైతిని; మత్ = నాయొక్క; విమల = స్వచ్ఛమైన; వంశ = వంశము; ఆచార = నడవడిక; తపశ్శ్రీ = తపస్సంపద; హోమాదులు = హోమము మొదలైనవి; నేఁడుగా = ఇప్పటికి కదా; తుది = చిట్టచివరికి; ఫలించెన్ = పండినవి; ఓహో! ఇకన్ = ఇంక; బ్రాహ్మ్యము = బ్రాహ్మణత్వము; చాలున్; నోటిక్రొవ్వు = నోటిపొగరు; ఏటికిన్ = ఏల; పొకాలిపోయెదరో = వెళ్ళిపోదురా? పోరా?

తా: ఆహాహా! నేను బ్రాహ్మణుడనై జపతపోనుష్ఠానములు చేయుచున్నందులకు ఈ భోగము మేళపురకమువారు పిల్లనిమ్మని నా గుమ్మము లోనికి వచ్చినందులకు నా నియమము లన్నియు ఫలించినవి. నేటికి ధన్యుడనైతిని. ఛీ ఛీ! పోయెదరా? లేదా? అలం. వ్యాజస్తుతి, విషమము.

క. మీ తరమువార లేతఱి
నేతరితనమునఁ దపస్వికన్యకలన్
వీతభయవృత్తి వేఁడిరొ
కో తముఁ దర్కింప కౌర క్రొవ్వు లటంచున్. 46

టీ: మీతరమువారలు = మీకులము వారు; ఏతఱిన్ = ఎప్పుడైనను; ఏతరితనమునన్ = దుడుకుతనముతో; తపస్వికన్యకలన్ = మహర్షుల కూతుండ్రను; వీతభయవృత్తిన్ = భయములేని రీతిగా; తమున్ = మీతాహతును; తర్కింపక = ఆలోచించుకొనక; వేఁడిరొకో = కోరిరా? ఔరా! క్రొవ్వులు = పొగరు? అటంచున్ = అనుచు......

తా: మీ వంశములోని వారెవరైన నెప్పుడైనను మా వంటి మహర్షుల కన్యలను తమతాహతు చూడక, కోరిరా? అంతపొగరా? అనుచు.........

క. వసుధేశ ముక్కు డుస్సిన
పసరముక్రియఁ గెరలి తిట్టెఁ బక్కున ఋషి వా
రుసురు మని వెడలిపోయిరి
ముసలిగదా పుట్టినిల్లు ముఖ్యోష్ణతకున్. 47

టీ: వసుధేశ=రాజా! ఋషి = నాతండ్రి; ముక్కుడుస్సిన = ముక్కుత్రాడూడిన; పసరము క్రియన్=ఎద్దువలె; కెరలి=కోపించి; పక్కునన్=హఠాత్తుగా; తిట్టెన్; వారు=ఆ గంధర్వులు; ఉసురుమని = కష్టపెట్టుకొని; వెడలిపోయిరి; ముఖ్య+ఉష్ణతకున్ = ఎక్కువ కోపమునకు; ముసలితనము; పుట్టినిల్లు కదా!

తా: ముసలితనమున కోపము హెచ్చుగా నుండును గదా! నాతండ్రి ముక్కుత్రాడూడిన యాబోతువలె ముందు వెనుక లాలోచింపక తిట్టెను. గంధర్వులు కష్టముతో వెళ్ళిపోయిరి. అలం. అర్థాన్తరన్యాసము.

వ. అట్టియెడం దనమనోరథంబు విఫలం బగుటకుఁ గ్రోధాంధుండై నన్నభిలషించు గంధర్వుం డిట్లనియె. 48

టీ: అట్టియెడన్=అప్పుడు; తనమనోరథంబు=తన కోరిక; విఫలంబగుటకున్=వ్యర్థమైనందులకు; క్రోధ+అంధుండై=కోపముచే నొడలు తెలియనివాడై; నన్ను+అభిలషించు=నన్ను కోరిన; గంధర్వుండు; ఇట్లనియెన్.

శా. నీవైశిష్ట్యము తిట్టుల న్మెఱయునే నీంకెు నేఁ దక్కువే
యీవే కన్యక నీవుగాక మఱి మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ విలఁ గానీ నిల్తుగా కేమి పో
పో విప్రాధమ నిన్నుఁ బోల నిఁక నల్పుల్ లేరు దంభవ్రతా. 49

టీ: నీవైశిష్ట్యము=నీ గొప్పదనము; తిట్టులన్=తిట్టుటలో; మెఱయునే=ఎక్కువగునా? నీకంటెన్; నేన్; తక్కువే? నీవు; కన్యకన్; ఈవేకాక=ఇయ్యవా? మఱి; మత్=నా యొక్క; వృత్త=నడవడిని; అన్వయ + ఆచారముల్ = వంశమును, ఆచారమును; నీవా? పేర్కొను పాటివాడవు = పేరెత్తువాడవు? ఇలన్=భూమిలో; నిల్తుకొకేమి = నిలువగలవా? పో పో=ఛీ ఛీ! విప్ర+అధమ = విప్రులలో నీచుడా! దంభవ్రతా = డాంబికమైన వ్రతము కలవాడా! ఇకన్=ఇంక; నిన్నుబోలన్=నీవంటి; అల్పుల్ = నీచులు; లేరు=ఉండరు.

తా: డాంబికుడా! విప్రాధమా! మమ్ము తిట్టినంతలో నీవు గొప్పవాడవగుదువా? నీకన్న నేను తక్కువా? నీవు నాకు పిల్ల నియ్యవేమి? నా వంశము నడవడి నెత్తుదువే? నీ వెన్నాళ్ళు భూమి మీద నుందువో చూచెదగాక! పో పో! నీచుడా! నీకన్న నీచులు పృథివిలో లేరు.

తే. అనుచుఁ బగచాటి పోయి నాఁ - డర్ధరాత్రి
సమయమున శస్త్రనిహతి మ - జ్జనకుఁ జంపె
నట్ల యగుఁగాక పుడమిఁ గా - మాంధచిత్తుఁ
డెవ్వరి వధింపఁ డెటు సేయఁ - డేమి గాఁడు. 50

టీ: అనుచున్=అని తిట్టుచు; పగచాటిపోయి=విరోధమున్నట్లు స్పష్టము చేసి వెళ్ళి; నాఁడు=ఆనాడే; అర్ధరాత్రసమయమునన్=అర్ధరాత్రి వేళ; శస్త్రనిహతిన్=కత్తిదెబ్బతో; మత్+జనకున్=నా తండ్రిని; చంపెన్. అట్లయగుగాక=అంతేఅగును; పుడమిన్=భూమిలో; కామ+అంధచిత్తుడు = కామముచే వివేకములేని మనస్సు కలవాడు; ఎవ్వరిన్=ఎంతపూజ్యులైనను; వధింపడు=చంపకుండునా? ఎటుసేయడు=ఏరీతిగా చేయుడు? ఏమిగాడు=ఎంత పాపికాడు.

తా: ఇట్లు గంధర్వుడు కోపమును ప్రకటించి వెళ్ళి ఆ నాటి రాత్రివేళ వచ్చి కత్తితో నాతండ్రిని చంపెను. కామాంధుడు చేయలేని దుష్కార్యమే ముండును? అలం. అర్థాన్తరన్యాసము.

తే. అప్పుడు మెడఁ గోయ ముని రో - జూటాలకించి
మేలుకొని దివ్వె యిడి సంభ్ర - మించి యేడ్చు
నన్నుఁ బొదివిరి పొరుగిండ్ల - నున్నతపసు
లా దురాచారుఁడును బాఱె - నటకు మునుప. 51

టీ: అపుడు=ఆ రాత్రివేళ; మెడగోయన్=మెడను కోయగా; ముని=నాతండ్రి; రోజుట=ఏడ్పుట; ఆలకించి=విని, మేలుకొని; దివ్వెయిడి=దీపము పెట్టి; సంభ్రమించి=కంగారుపడి; ఏడ్చునన్నున్=ఏడ్చెడినన్ను; పొరుగిండ్లనున్న తపసులు=ఇరుగు పొరుగున నున్న మునులు; పొదివిరి=దగ్గరగా తీసికొనిరి; అటకు మునుప=అంతకుముందే; ఆ దురాచారుడును=ఆ పాపాత్ముడు కూడ; పాఱెన్=పారిపోయెను.

తా: అతడు కంఠము కోయునపుడు నాతండ్రి యేడ్చుటను విని నేను మేల్కాంని దీపము పెట్టి చూచి కంగారు పడి ఏడ్చితిని. అంతలో ఇరుగు పొరుగు మునులువచ్చి నన్ను బుజ్జగించిరి. అంతకు ముందే ఆ దుర్మార్గుడు పారిపోయెను.

వ. అంతం దెలతెల వేగుటయుఁ బ్రభాతసమయంబున. 52

టీ: అంతన్; తెలతెల వేగుటయును=బాగుగా తెల్లవారగా; ప్రభాతసమయంబునన్=ప్రాతఃకాలమునందు...

క. ధారాళక్షతజోక్షిత
ఘోరజరాధవళితోరు - కూర్చముగఁ గరా

చూరిని మెడ దెగి యుటజా
గారంబునఁ బడిన మూఁడు గాళ్ళ ముసలికిన్. 53

టీ: ధారాళ = ధారగా కారుచున్న; క్షతజ+ఉక్షిత = రక్తముచే తడుప బడిన; ఘోర = భయంకరమైన; జరా = ముసలితనముచే; ధవళిత = తెలుపైన; ఉరు కూర్చముగన్ = పెద్దదైన గడ్డము మీసములు కల్గునట్లుగా; కరాచూరిన్ = పదనగు కత్తిచే; మెడతెగి; ఉటజ+ఆగారంబునన్ = పర్ణశాలలో; పడిన మూడుగాళ్ళ ముసలికిన్ = పడిపోయియున్న ముసలి వద్దనకు...

తా: కత్తితో కోయుటతో అవిచ్ఛిన్నముగా కారుచున్న రక్తముచే తడిసిన గడ్డము మీసములు కలిగి పర్ణశాలలో పడియున్న ఆ ముసలివద్దనకు......

ఆ. అగ్ని యిచ్చి యకట 'యాబాల్యముగ నన్నుఁ
బెనిచెఁ దల్లి వైచి చనిన పిదపఁ
దానె తల్లిమాఱునై నెమ్మి నట్టి మ
జ్జనకుఁ డీల్గె నేటి మనికి' యనుచు, 54

టీ: అగ్ని యిచ్చి = దహనము చేసి; అకట = అయ్యో! తల్లి; వైచిచనినపిదపన్ = పారవేసి వెళ్ళిన తర్వాత; తానె; ఆబాల్యముగన్ = చిన్నతనము నుండియు; తల్లిమాఱునై = తల్లికి బదులు రక్షకుడై; నెమ్మిన్ = ముద్దుగా; నన్నున్; పెనిచెన్ = పెంచెను; అట్టి; మత్+జనకుడు = నా తండ్రి; ఈల్గెన్ = చనిపోయెను; ఏటి మనికి = బ్రతుకుట ఏటికి? అనుచున్...

తా: నాతండ్రికి దహన సంస్కారము చేసి, పుట్టగానే తల్లి వదలిపోగా తానే తల్లివలె నన్ను గారాబముతో పెంచిన తండ్రి చనిపోయినాడని......

క. వందురి వగలన్ దేహము
పొం దెడలఁగఁ జూచు నన్నుఁ బొడగని దివిఁ దా
నెందుల కేఁగుచునో గిరి
నందన దిగి వచ్చి కరుణ నా కిట్లనియెన్. 55

టీ: వగలన్ = కష్టములతో; వందురి = పరితపించి; దేహముపొందు = శరీరము తోడి సంబంధమును; ఎడలగన్ = వదలుటకై; చూచుచున్నన్ = ఆలోచించుచున్న నన్ను; పొడగని = చూచి; దివిన్ = ఆకాశమున; తాను; ఎందులకున్ = ఎక్కడికో; ఏగుచునో = వెళ్ళుచుండెనో; గిరినందన = పార్వతి; దిగివచ్చి = భూమిమీదికి నావద్దకువచ్చి; నాకున్ = నాతో; కరుణన్ = దయతో; ఇట్లనియెన్.

తా: కష్టము లనుభవించుటకన్న చావే మేలని చావబోవుచున్న నన్ను చూచి ఆకాశముపై నెక్కడికో వెళ్ళుచున్న పార్వతి నావద్దకు దిగివచ్చి నాతో దయతో నిట్లన్నది.

మ. అతిసౌందర్యనిశాంత మీతను వలభ్యం బిట్లు శోకాతురా
న్వితవై దీనిఁ దొఱంగఁ గాఁ దగునె తన్వీ చాలు నీసాహసం
బతిలోకుండు స్వరోచి నీకుఁ బతియౌ నారాజుఁ జేపట్టి య
ప్రతిమశ్రీవిభవంబుఁ గాంచెదవు నా పల్కొండు గా నేర్చునే?

టీ: తన్వీ=పడుచుదానా! ఈతనువు=ఈ శరీరము; అతిసౌందర్యనిశాంతము=ఎక్కువ సౌందర్యము కలది; అలభ్యంబు=తిరిగి దొరకుట కష్టమైనది; ఇట్లు=ఈరీతిగా; శోక+ఆతుర+అన్విత వై=విచారముతో కూడినదానవై; దీనిన్=ఇంత చక్కని దేహమును; తొఱగంగాన్=విడువగా; తగునె=ఒప్పునా? ఈ సాహసంబు=ఈ చొరవ; చాలున్; అతిలోకుండు=జనులను మించినవాడు; స్వరోచి; నీకున్; పతి=భర్తగా; ఔన్=అగును; ఆ రాజున్; చేపట్టి=పెండ్లాడి; అప్రతిమశ్రీ=సాటిలేని సంపదయొక్క; విభవంబును=వైభవమును; కాంచెదవు=పొందెదవు; నాపల్కు=నామాట; ఒండు=మరొకరీతిగా; కానేర్చునే=అగునా?

తా: ఓ తరుణీ! నీశరీరమెంతో యందమైనది. ఇట్టిసౌందర్యము దుర్లభమైనది. ఇట్టి దేహమును విడుచుట మంచిపనికాదు. ఈ చొరవ మానుము. నిన్ను స్వరోచి యను లోకాతీతుడగు రాజు పెండ్లాడును. నీవెన్నో వైభవముల ననుభవింతువు. నామాటఅన్యథా కానేరదు. అలం. కావ్యలింగము.

క. విను మదియుఁగాక పద్మిని
యనఁ బరఁగిన విద్య నేఁ బ్రియంబున నిత్తుం
గొను నీవు తత్ప్రసాదం
బున నీకు నభీష్టసౌఖ్యములు సిద్ధించున్. 57

టీ: వినుము; అదియుఁగాక=మరియును; నేన్=నేను; ప్రియంబునన్=ఇష్టముతో; పద్మినియనఁబరఁగిన విద్యన్=పద్మిని యనబడు మంత్రమును; ఇత్తున్=ఇచ్చెదను; నీవు; కొను=స్వీకరింపుము; తత్+ప్రసాదంబునన్=దానిమహిమ వలన; నీకున్; అభీష్టసౌఖ్యములు=కోరిన సౌఖ్యములు; సిద్ధించున్=కల్గును.

తా: నీకు స్వరోచిని పెండ్లాడు నదృష్టమే కాక, నేను పద్మినియను మంత్రము నిత్తును. దాని మహిమవలన కోరిన కోరికలు పొందగలవు.

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి ముక్కంటి వాల్గంటి మింటిచొప్పునం జనియె. నేనును తద్వచనామృతాస్వాదనంబ యూఁతగాఁ బ్రాణంబులు పట్టుకొని యున్నదాన. నాస్వరోచి నీవ కాఁ దలంచెద. వంచనాలాపంబు లుడిగి యప్పద్మినీ విద్యారత్నంబుతోఁ గూడ నన్నుఁ బరిగ్రహింపు మనిన నంగీకరించి యమ్మహీవిభుండు. 58

టీ: అని; రహస్యంబుగాన్; ఆ విద్యన్ = ఆ మంత్రమును; నాకునే; ఉపదేశించి = చెప్పి; ముక్కంటి వాల్గంటి = భవాని; మింటిచొప్పునన్ = ఆకాశమార్గము వెంట; చనియెన్ = వెళ్ళెను; నేనును; తత్ + వంచనా + అమృత + ఆస్వాదంబు + అ = ఆమె మాటలనెడి అమృతమును త్రాగుటయే; ఊతగన్ = ఆధారముగా; ప్రాణంబులు + పట్టుకొని = ప్రాణాలు నిల్పుకొని; ఉన్నదానన్; ఆ స్వారోచి = ఆమె చెప్పిన స్వారోచియనురాజవు; నీవకాన్ = నీవేఅయినట్లు; తలంచెదన్ = అనుకొందును; వంచనా + ఆలాపంబులు = అడ్డుమాటలు; ఉడిగి = మాని ; ఆ + పద్మినీవిద్యారత్నంబు తోడన్ = విద్యలలో శ్రేష్ఠమైన పద్మినీ మంత్రముతో కూడ; నన్నున్; పరిగ్రహింపుము = పెండ్లాడుము; అనినన్; అంగీకరించి. ఆ + మహీవిభుండు = ఆరాజు...

క. ఏకాగ్రత నవ్విద్యలు
గైకొని పుణ్యాహపూర్వ కంబుగ గుణర
త్నాకరుఁ డయ్యిద్దఱ న
స్తోకోన్నతిఁ బెండ్లి యయ్యె సుముహూర్తమునన్. 59

టీ: గుణరత్నాకరుడు = మంచి గుణములకు సముద్రమువంటి స్వారోచి, ఏకాగ్రతన్ = శ్రద్ధతో; ఆ + విద్యలు = ఆ యిద్దరి వద్దనున్న మంత్రములను; కైకొని = తీసికొని; పుణ్యాహపూర్వకంబుగన్ = పుణ్యాహ వాచనము మంత్రపూర్వకముగా; సుముహూర్తంబునన్ = శుభలగ్నమున; అస్తోక + ఉన్నతిన్ = ఎక్కువ గౌరవముతో; ఆ + ఇద్దరన్ = ఆ యిద్దరికన్యలను; పెండ్లియయ్యెన్ = పెండ్లాడెను.

తా: అతడా యిద్దరినుండి రెండు విదకలను పరిగ్రహించి వేదోక్తవిధితో వారిద్దరిని శుభలగ్నమున పెండ్లాడెను.

ఉ. ఆసమయంబునన్ మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్
సేసలు చల్లి రచ్చరలు సిద్ధనికాయము చేరి సన్నుతుల్
సేసెఁ బ్రసూనవృష్టి గురిసెన్ జనరంజనకారి వాసనో
ల్లాసములై చెలంగె శుభలక్షణదక్షిణగంధవాహముల్. 60

టీ: ఆసమయంబునన్ = ఆ పెండ్లి వేళ; అభ్రపథంబునన్ = ఆకాశమున; దేవదుందుభులు; మొరసెన్ = చప్పుడయ్యెను; అచ్చరలు = అప్సరసలు; సేసలు = అక్షతలు; చల్లిరి; సిద్ధనికాయము = సిద్ధులు; చేరి; సన్నుతుల్ సేసెన్ = పొగడెను; ప్రసూనవృష్టి = పూలవాన; కురిసెన్; శుభలక్షణ = శుభసూచకములైన; దక్షిణగంధవాహముల్ = పైరుగాలులు; జనరంజనకారి = జనుల కానందము నిచ్చు; వాసనా + ఉల్లాసములై = ఎక్కువ సువాసన కలవై; చెలంగెన్ = వీచినవి.

తా: ఆ పెండ్లి వేళ దేవదుందుభులు మ్రోగినవి. అప్సరసలు అక్షతలు చల్లిరి. సిద్ధులు పొగడిరి. చల్లని పైరుగాలులు పరిమళించుచు వీచినవి.

క. ఈవిధమున నుద్వాహం
బై వేలుపు వెలఁదిపట్టి । యంచితమతి న
ప్పూవుంబోఁడులు మూవుర
తోఁ వివిధవిహారసంగ । తులఁ దత్పరుఁడై. 61

టీ: వేలుపువెలఁదిపట్టి=స్వరోచి; ఈవిధమునన్=ఇట్లు; ఉద్వాహంబై=పెండ్లియై; అంచితమతిన్ = సమానమైన ప్రేమతో; మూవురతోన్ = ముగ్గురు భార్యలతోను; వివిధవిహారసంగతులన్ = పలురకముల విహారములు చేయుటలో; తత్పరుండై=ఆసక్తికలవాఁడై......

తా: ఇట్లా యిద్దరినికూడ పెండ్లాడి ముగ్గురు భార్యలతోను సమబుద్ధితో విహరించుట యందాసక్తి కలిగినవాఁడై.........

సీ. గంగాతరంగిణీ । రంగత్తరంగ శీ
కరశీతసైకతో । త్కరములందు
మందారమాకంద । మకరందతుందిలేం
దిందిరానందకృ । న్నందనములఁ
గాంతనిశాకాంత । కాంతవితర్దికా
క్రాంతభూభృద్బృంద । కందరముల
మసృణబిసాహార । మాంసలహంసికా
సంసదాసారకా । సారతటులఁ

గీ. దమక తమకప్రియుం డని । తమక మెసఁగఁ
బడఁతు లుప్పొంగఁ గ్రీడించెఁ । బద్మినీ ప్రి
భావఘటితాన్నపాన భూ । షావిశేష
మాల్యవస్త్రానులేప సా । మగ్రిఁ జెంది. 62

టీ: గంగాతరంగిణీ=గంగానది యందు; రంగత్+తరంగ = కదలెడి కెరటముల యొక్క; శీకరశీత=నీటి బిందువులచే చల్లనైన; సైకత+ఉత్కరములందున్ =ఇసుక తిన్నెలందును; మందార=మందారపు చెట్లయొక్క; మాకంద = తియ్యమామిడి చెట్లయొక్క; మకరందతుందిల=పూదేనెచే మదించిన; ఇందిందిర=తుమ్మెదలతో; ఆనందకృత్=ఆనందమునిచ్చు; నందనములన్ = ఉద్యానములందును; కాంత=సుందరమైన; నిశాకాంత కాంతవితర్దికా+ఆక్రాంత=చంద్రకాంతపురాల అరుగులచే ఆక్రమింపబడిన; భూభృత్+బృంద=పర్వతములయొక్క; కందరములన్=గుహలలోను; మసృణ = స్నిగ్ధములైన; బిస+ఆహారమాంసల = తామర కాడలతినుటచే బలిసిన; హంసికాసంసత్ = ఆడురాజహంసలచే; ఆసారకాసార

తటులన్ = వ్యాప్తమైన సరస్సుల గట్టులందును; తమక తమక = తనుకే తనుకే; (ఎవరికి వారికే;) ప్రియుండని = ఇష్టుడని; తమకమెసఁగన్ = కాంక్ష పెరుగునట్లు; పడఁతులు = భార్యలు; ఉప్పొంగన్ = ఆనందించగా; పద్మినీప్రభావఘటిత = పద్మినీ విద్యామహిమచే సమకూర్చబడిన; అన్నపానభూషావిశేష = భోజనము, పానద్రవ్యములు, నగలును; మాల్యవస్త్ర + అనులేప సామగ్రిన్ = పూలమాలికలు, వస్త్రములు, మైపూతద్రవ్యములను; చెంది = పొంది; క్రీడించెన్ = విహరించెను.

తా: స్వరోచి ఆ ముగ్గురు భార్యలతో కూడి పద్మినీ విద్యా ప్రభావము వలన లభించిన అన్నపానములు, నగలు—వస్త్రములు కలిగినవాడై యథేచ్ఛముగా గంగానదీతరంగము నుండి వచ్చు నీటిబింగువులతో చల్లనైన ఇసుక తిన్నెలందును. మందార పుష్పరసముచే బలిసిన తుమ్మెదలచే నందమునిచ్చు నందనము లందును, చంద్రకాంతపు రాలతిన్నెలుకల పర్వతగుహాలందును, హంసలతో నందమైన సరస్సుల లోను విహరించెను. అలం. ఉదాత్తము.

మ. అరవిందాక్షులుఁ దాను నిట్లభిమత వ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుం డొకచోటఁ గాంచె లఘు శీత స్వచ్ఛవాఃపూరమున్
వర కీరవ్రజ చంచుపాటిత తట వ్యాకీర్ణ మందార కే
సర మాకంద వినిస్సర త్ఫలరసా సారంబుఁ గాసారమున్. 63

టీ: ఇట్లు; ధరణీశుండు = రాజు; అరవింద + అక్షులున్ = తామరలవంటి కన్నులుకల భార్యలును; తానును; అభిమత వ్యాపారములు = ఇష్టమైన క్రీడలను; సల్పుచున్ = చేయుచు; ఒక చోటన్; లఘుశీత = కొద్దిచల్లనైన; స్వచ్ఛవాఃపూరమున్ = స్వచ్ఛమైన నీరుకలిగినదియు; వరకీరవ్రజ = శ్రేష్ఠమైన చిలుకల యొక్క; చంచుపాటిత = ముక్కులచే బ్రద్దలు కొట్టబడిన; తటవ్యాకీర్ణ = గట్టునవ్యాప్తమైయున్న; మందార కేసర = మందార పుష్పకింజల్కములును; మాకందవినిస్సరత్ = తియ్యనిమామిడి పండ్లనుండి బయటికి కారెడి; ఫలరస + ఆసారంబున్ = గసము వలె వర్షముకల; కాసారమున్ = సరస్సును; కాంచెన్ = చూచెను.

తా: భార్యలతో కలిసి క్రీడించుచు గట్టుననున్న తియ్యమామిడి చెట్లపైనున్న చిలుకలచే కొట్టబడిన పళ్ళనుండి వర్షముగా కారెడి రసముకలదియు; మందార కింజల్కములు కలదియు, చల్లని, స్వచ్ఛమైన నీరుకల సరస్సును చూచెను.

క. కని తత్తటస్థలంబున
ననుమతి విహరించె సవిధ హరిహయ వర నం
దననందన హరిచందన
వనపవనార్భక వినోద వశగతుఁ డగుచున్. 64

టీ: కని = చూచి; తత్ + తటస్థలంబునన్ = ఆ గట్టుమీద; సవిధ = దగ్గరలోనున్న; హరిహయ = ఇంద్రుని యొక్క; వర = శ్రేష్ఠమైన; నందన = నందనవనమందున్న; నందన = తన యుద్యానమునందున; హరిచందనవన = కల్పవృక్షముల

నుండి వచ్చు; పవన+అర్భకై=పిల్లగాలులచే; వినోదవశగతుఁడగుచున్=క్రీడించు నాసక్తి కలిగినవాఁడై; అనుమతిన్=ఇష్టముగా; విహరించెన్=క్రీడించెను.

తా: స్వరోచి ఆసరస్సును చూచి దాని సమీపమున నున్న నందన వనమువలె నున్న తన యుద్యానములోని కల్పవృక్షముల నుండి వీచు పిల్లగాలులతో యథేష్టముగా క్రీడించెను.

ఉ. అందొకయంచలేమ గహనా ♦ నానిలసంచలదూర్మిమాలికా
మందవిహారసౌఖ్యమున ♦ మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగఁ జేరఁ బిల్చి పరి ♦ కించితె యెంతతపం బొనర్చి రీ
యిందునిభాస్యలుం బతియు ♦ నేకమతిం గవగూడి యుండఁగాన్.

టీ: అందున్=ఆ సరస్సులో; ఒకయంచలేమ=ఒక యాఁడుహంస; గహన=ఉద్యానము మీఁదినుండి వచ్చు; అనిలసంచలత్=గాలిచే కదలెడి; ఊర్మికామాలికా=కెరటముల పంక్తులయందు; మందవిహారసౌఖ్యమునన్=మెల్లని విహారము వలని సుఖముచే; మత్తిలి=మత్తెక్కి; దవ్వులనున్న=దూరముననున్న; చక్రవాకిన్=ఆఁడుచక్రవాక పక్షిని: తగన్=మెల్లగా; చేరన్+పిల్చి=దగ్గరకుపిలిచి; ఈ+ఇందునిభాస్యలున్=ఈ స్త్రీలును; పతియును=భర్తయును; ఏకమతిన్=ఏకమత్యముతో; కవగూడియుండఁగాన్=జంటగాకూడి యుండుటకు; ఎంతతపం బొనర్చిరి=ఎంతె తపస్సు చేసిరో కదా! పరికించితె=చూచితివా ?

తా: అందులోనున్న ఒకఆఁడుహంస దూరాననున్న ఆఁడుచక్రవాకమును పిల్చి ఈ వనితలు ముగ్గురును భర్తయు నింత కలిసి—మెలసి యుండుట కెంత పుణ్యము చేసిరో చూచితివా ?

క. మెలఁతకుఁ బతిపై నైనను
మెలఁతుకపైఁ బతికి నైన ♦ మే లగు టెందుం
గలయది మెలఁతకుఁ బతికిన్
వలపు సమం బగుట జన్మ ♦ వాసన చెలియా. ౮౮

టీ: చెలియా! మెలఁతకున్=స్త్రీకి; పతిపైననన్=భర్తమీఁద; మెలఁతుకపైనన్=భార్యపై; పతికినైనన్=భర్తకుగాని; మేలు=మంచి ప్రేమ; అగుట=కల్గుట; ఎందున్=ఎక్కడనైనను; కలయది=ఉన్నదే; మెలఁతకున్=భార్యకును; పతికిన్=భర్తకును; వలపు=ప్రేమ; సమంబగుట = సమముగా నుండుట; జన్మవాసన=పూర్వజన్మలోని సంస్కారము వలననే సుమా!

తా: భార్యపై భర్తకుగాని, భర్తపై భార్యకు గాని ఎక్కువ మక్కువ యుండుట సహజము గాని ఇట్లొకరిపై నొకరికి సమముగా ప్రేమ యుండుట మాత్రము పూర్వజన్మ సుకృతమే సుమా!

ఉ. కావున వీరియందు నధి ♦ కం బగుకూరిమి గల్గియుండు నీ
భూవలయాధినాథునకుఁ ♦ బొల్పుగ నీవిభునందు నగ్గలం

బీవనజాయతాక్షులకు ◊ నిచ్చఁ బ్రియం బది గాన పూవునుం
దావియుఁ బోలెఁ జాలఁ బ్రమ ◊ దం బొనరించిరి నాకు నెచ్చెలీ. 67

టీ: నెచ్చెలీ! కావునన్; వీరియందున్ = ఈ స్త్రీలపై; ఈభూవలయాధి నాథునకున్ = ఈ రాజునకు; అధికంబగుకూరిమి = ఎక్కువ ప్రేమ; పొల్పుగన్ = బాగుగా; కల్గియుండున్ = ఉన్నది; ఈ విభునందున్ = ఈ రాజుపై; ఈవనజాత + ఆయత + అక్షులకున్ = ఈ స్త్రీలకు; ఇచ్చన్ = మనస్సులో; అగ్గలంబు = ఎక్కువ; ప్రియంబు = ప్రేమ; అదిగానన్ = అందుచే; పూవునున్ = పువ్వును; తావియుఁ బోలెన్ = వాసనయువలె; నాకున్; చాలన్ = మిక్కిలి; ప్రమదంబు = సంతోషమును; ఒనరించిరి = చేసిరి.

తా: చెలీ! కావున వీరికి పరస్పరము ప్రేమ మిక్కుటము. కాననే పూవు, తావివలె నాకెంతో ఆనందము కలిగించిరి.

వ. అని పలుకు నమ్మరాళలోలనయనపలుకు లాలంబు చేసి చక్రవాకి యిట్లనియె. 68

టీ: అని; పలుకు + ఆ + మరాళలోలనయన పలుకులు = ఆ నెడి హంసవనిత మాటలను; ఆలంబుచేసి = పరిహాసముచేసి; చక్రవాకి; ఇట్లనియెన్.

చ. ముదమున నిమ్మహీశుఁ డొకకొ◊ముద్దియ చూడఁగ నొక్కకాంతతో
సదమదమై కడంగి రతి ◊ సల్పుట తెల్లమిగా నెఱింగియున్
మది వివరించి రోయ కభి ◊ మానము దక్కిన వీరికూరుముల్
వదలక పెద్ద సేసెదవు ◊ వందిగతిం దగ వీవిచారముల్. 69

టీ: ముదమునన్ = సంతోషముతో; ఈ మహీశుడు = ఈ రాజు; ఒకముద్దియ = ఒక భార్య; చూడగన్ = చూచుచుండగా; ఒక్కకాంతతోన్ = మరొక భార్యతో; సదమదమై = పెనవేసికొని; కడంగి = ప్రయత్నించి; రతిసల్పుట = సంభోగించుట; తెల్లమిగాన్ = స్పష్టముగా; ఎఱిగియున్ = తెలిసికూడ; మదిన్ = మనస్సులో; వివరించి = అన్యస్త్రీలోలుడని తెలిసి; రోయక = అసహ్యించుకొనక; అభిమానము తక్కిన = అభిమానము లేని; కూరుముల్ = వీరిప్రేమలను; వదలక; వందిగతిన్ = భట్టువలె; పెద్దచేసెదవు = ఎక్కువగా పొగడెదవే; ఈవిచారముల్ = ఈయాలోచనలు; తగవు = పనికిరావు.

తా: ఈ రాజొక స్త్రీతో భోగించుట తెలిసికొనియు అసహ్యించుకొనక అభిమానములేని వీరిప్రేమలను పెద్దగాపొగడుచుంటివే. ఈ మాటలు నాశింపును. అలం. ఉపమ.

చ. పలువురయందు నొక్కనికి ◊ బ్రీతియు నొక్కనియందుఁజూడ న
గ్గల మగుప్రేమ పల్వురకుఁ ◊ గల్గుట యద్భుత మట్లుగాన యి

వ్వేలఁదులయందుఁ గూర్మిపస ♦ వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గదీ జలరు ♦ హాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్. 70

టీ: చూడన్ = ఆలోచించగా; పలువురయందున్ = చాలమంది స్త్రీలపై; ఒక్కనికి = ఒక్కమగవానికి; ప్రాతియున్ = ప్రేమయు; ఒక్కనియందున్ = ఒక్కపురుషునిపై; పల్వురకున్ = చాలమంది స్త్రీలకు; అగ్గలమగు ప్రేమ కల్గుట = ఎక్కువ ప్రేమ యుండుటయు; అద్భుతము = విచిత్రము; అట్లుకానన్; ఈ + వెలదులయందున్ = ఈ స్త్రీలపై; వీనికిన్ = ఈ రాజునకు; కూర్మిపస = మంచిప్రేమ; ఏమియున్; లేదు. వీనియందున్ = వీనిపై; ఈ జలరుహాక్షులకున్ = ఈ స్త్రీలకును; ప్రియము = ప్రేమ; ఎవ్విధంబునన్ = ఏరీతిగానైనను; అలవడన్ = అనుభవపడుట; కల్గదు = సంభవింపదు.

తా: ఒకనికి చాలమంది స్త్రీలపైగాని, చాలమంది స్త్రీలకు ఒక్క పురుషునిపైగాని ప్రేమ మిక్కుటముగా నుండుట యసంభవము. కాన ఇతనికి వీరిపైగాని, వీరికి ఇతనిపైగాని మంచిప్రేమ అసంభవము.

'ఏకత్రైవానురాగశ్చేత్, తిర్యఙ్మ్లేచ్ఛగతో౽పివా।
యోషితాం బహుసక్తిశ్చేత్ రసాభాసస్త్రిధామతః'
అన్నట్లిది రసాభాసము కూడనగును.

క. మనుజేశుఁడు కొలిచిన పరి
జనములతో నిష్టగోష్ఠి ♦ సలిపెడిచో నె
ట్లనురాగ మట్ల కూరిమి
వనితలు పెక్కండ్రయందు ♦ వశ్యము పతికిన్. 71

టీ: మనుజేశుడు = రాజు; కొలిచిన పరిజనములతోన్ = తన్ను సేవించెడి పరివారముతో; ఇష్టగోష్ఠి = ఇష్టమైన మాటలాడుట; సలిపెడిచోన్ = చేయువేళ; అనురాగము = వారలపై ప్రేమ; ఎట్లు; అట్ల = అట్లే; వనితలు పెక్కండ్రయందున్ = ఎక్కువమంది భార్యలపై కూడ; పతికిన్ = భర్తకు; అవశ్యము = తప్పక; కూరిమి = ప్రేమ (ఉండును.)

తా: రాజు పరిజనులతో ఇష్టాలాపము లాడువేళ వారిపై రాజున కెట్లు ప్రేమ యుండునో అట్లే చాలమంది భార్యలున్నప్పుడు వారిపై ప్రేమ యుండును. అలం. ఉపమ.

క. ఈ నెలఁత లీమహీశు న
హీనగతిం దగిలిరేని ♦ నితఁ డొక లేమం
దా నెలమిఁ గూడు నెడ నే
మానిసి ప్రాణేశుమీఁది ♦ మమత మెలంగున్. 72

టీ: ఈ నెలఁతలు = ఈ స్త్రీలు; ఈమహీశున్ = ఈ రాజును; అహీనగతిన్ = ఎక్కువ ప్రేమతో; తగిలిరేనిన్ = ఆసక్తలైయున్నచో; ఇతడు; తాను; ఒకలేమన్

=ఒక స్త్రీని; కూడునెడన్=సంభోగించువేళ; ఏమానిని=అభిమానము కలయే స్త్రీ; ప్రాణేశుమీఁది మమతన్=భర్తమీఁది మమకారముతో; మెలంగున్=ప్రవర్తించును.

తా: ఈ స్త్రీ లందరికి రాజుపై ఎక్కువగా ఆసక్తి కల్గియున్నచో ఒకస్త్రీని కూడినపుడు రెండవ స్త్రీ సహింపగలదా? ప్రేమలో తారతమ్యముండి తీరును.

క. కావున దాసీనికరము
కైవసమై సంచరించు క్రమమున విద్యా
ప్రావీణ్యవైభవోన్నతి
చే వచ్చినవారి వీరిఁ జెప్పను మింకన్. 73

టీ: కావునన్; దాసీనికరము=దాసీజనము; కైవసమై=స్వాధీనమై; సంచరించు క్రమమునన్=ఉండునట్లు; విద్యాప్రావీణ్య = విద్యలందలి నేర్పు యొక్క; వైభవ+ఉన్నతిచేన్=ఎక్కువగా నుండుట వలని యతిశయముచే; వచ్చినవారిన్=దొరకినట్టి; వీరిన్; ఇంకన్; చెప్పకుము.

తా: దాసీ జనము స్వాధీనమైనట్లుగా ఇతని విద్యాప్రాభవములచే లభ్యులైన వీరిని గూర్చి ఇక నాయుంగు పొగడకుము.

ఆ. తగులు నెవ్వఁ డొక్క తరుణికి నొకనికి
మెలఁత వలచు నదియ మే లనంగ
వచ్చుఁగాని పెక్కు వనితలపైఁ గూర్మి
గలుగు ననుట బొంకు గాదె తరుణి. 74

తా: తరుణి=ఓ చెలీ! ఎవ్వడు=ఏ పురుషుడు; ఒకతరుణిన్=ఒకే స్త్రీని; తగులున్ = ప్రేమించియుండునో; మెలఁత=స్త్రీ; ఒకనికిన్=ఒక్కని; వలచున్=ప్రేమించునో; అదియ=అదే; మేలు=మంచిది; అనంగవచ్చున్; కాని; పెక్కు వనితలపై=చాలమంది స్త్రీలపై; కూర్మిగలుగుననుట=ప్రేమయుండునన్నది; బొంకు గాదె=అబద్ధము కదా!

తా: ఒక స్త్రీ కొక పురుషునిపై గాని, ఒక పురుషున కొక్క స్త్రీపైగాని ప్రేమయుండుట సహజము కాని చాలమంది స్త్రీలపై ఒక్క పురుషునకు ప్రేమ యుండుట అసంభవము కదా!

చ. పలుకులు వేయు నేమిటికి భాగ్యసమన్విత నేన మద్విభుం
డిలఁ గలధన్యుఁ డంచు నెలుఁ గెత్తి వరూథినిపట్టిముండటం
బలుకు రథాంగమానవతి పల్కు లతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్రవీణుఁడు గాన నెఱింగి సిగ్గునన్. 75

టీ: పలుకులు=మాటలు; వేయును=వేయి; ఏమిటికి=ఎందుకు? భాగ్యసమన్వితన్=అదృష్టవంతురాలిని; నేన=నేనే; ఇలన్=భూమిలో; కలధన్యుడు=ఉన్న అదృష్టశాలి; మద్విభుండు=నా భర్తయే; అంచున్= అని; వరూథినిపట్టి

నుందటన్=స్వారోచి ముందు; ఎలుఁగెత్తి = గట్టిగా కంఠమెత్తి; పలుకురథాంగి మానవతి పలుకులు=పల్కెడి ఆడుచక్రవాక పక్షి మాటలను; అతండు=స్వారోచి; ఇలన్=భూమియందలి; జంతుమండలీవిలసత్=జంతువులలోనున్న; అశేషభాషలన్ = అన్ని భాషలందును; ప్రవీణుడుగానన్ = నేర్పరికాన; ఎఱింగి = తెలిసి; సిగ్గునన్......

తా: పదిమాటలెందుకు? ఈపృథివిలో నేను, నాభర్తయే అదృష్టవంతులము. అని స్వారోచిముందు గట్టిగా అనెడి చక్రవాకము మాటలను స్వారోచి అన్ని జంతు భాషల నెరిగినవాడు కనుక తెలిసికొని సిగ్గుపడి......

కం. తల వాంచి యుస్సు రని మదిఁ
దలపోయుచు మానరాని తమకంబున నా
నెలఁతలతో నూఱేఁడులు
విలసితగతిసౌఖ్య మనుభవించుచు నెలమిన్. 76

టీ: తలవాంచి=తలవంచుకొని; ఉస్సురని=నిట్టూర్చి; మదిన్=మనస్సులో; తలపోయుచున్ = అదే ఆలోచించుచు; మానరానితమకంబునన్ = తగ్గింపలేని ప్రేమతో; ఆనెలఁతలతోన్=ఆ భార్యలతో; విలసితగతిన్=సంతోషమైనట్లుగా; నూఱేఁడులు = వందేళ్ళు; ఎలమిన్ = ఆనందముతో; సౌఖ్యము; అనుభవించుచున్.........

తా: అదివిని తలవాల్చుకొని నిట్టూర్చి అదేమననము చేయుచున విడువ రాని ప్రేమాతిరేకముతో వారి ముగ్గురితో కలిసి నూరేండ్లు యథేష్టక్రీడల వెళ్ళించెను.

శా. కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కనకాఖర్వప్రభామంజులా
స్యాంచన్మేచకరత్నవిభ్రమసనాథానూనదృగ్రోచులన్
మించుం బ్రాయపులేటిపిండు తనుఁ గూర్మిం జుట్టి రాఁ దద్వనో
దంచద్భూమిఁ జరించు నొక్కహరిణోత్తంసంబు నింపారఁగాన్.

టీ: భూవిభుడు=స్వారోచి; ఒక్కనాడు; కనక = బంగారముయొక్క; అఖర్వ=ఎక్కువైన; ప్రభామంజుల = కాంతిచే సంతోషకరమైన; ఆస్య=ముఖ మందు; అంచత్=ఒప్పెడి; మేచకరత్న = ఇంద్రనీలమణులయొక్క; విభ్రమ సనాథ=కాంతివంటి కాంతితో కూడిన; అనూనదృగ్రోచులన్ = ఎక్కువైన కను కాంతులతో; మించుంబ్రాయపు=యౌవనములోనున్న; లేటిపిండు=లేళ్ళగుంపు; తన్నున్; కూర్మిన్=ప్రేమతో; చుట్టిరాన్ = చుట్టును కొల్చిరాగా; తద్వన+ ఉందచద్భూమిన్=ఆ యరణ్య ప్రదేశమున; చరించు=సంచరించెడి; ఒక్కహరిణ+ ఉత్తంసంబు=ఒక మగలేడిని; ఇంపారగాన్=ఎక్కువ సంతోషముతో; కాంచెన్ =చూచెను.

తా: ఒకనాడు స్వరోచి బంగారు రంగుకల ముఖములును; నల్లని చూపులు కల పశుచునాడు లేళ్ళగుంపుతో చుట్టుకొన్న మగలేడిని చూచెను.

క. కని సతులకుఁ జూపెడు తఱి
ఘనముగఁ దమచెవుల వాలు గన్నులు సోలన్
మొనసెలవి యెత్తి ప్రియునా
ననమున్ మూర్కొనుచు నఱ్ఱు నాకెడువేళన్. 78

టీ: కని=చూచి; సతులకున్=తన భార్యలకు; చూపెడుతఱిన్=చూపించుచుండగా; ఘనముగన్ = గట్టిగా; తమచెవులన్ = తమ చెవుల మీదికి; వాలుఁగన్నులు=విశాలమైన నేత్రములు: సోలన్ = వ్రాలగా; మొనసెలవి = పెదవి మొదటిని; ఎత్తి = పైకెత్తి; ప్రియునాననమున్ = భర్తయొక్క ముఖమును; మూర్కొనుచున్ = వాసనచూచుచు; అఱ్ఱునాకెడు వేళన్ = మెడను నాకు నప్పుడు......

తా: ఆ లేళ్ళను స్వరోచి తన భార్యలకు చూపునప్పుడు ఆడులేళ్ళు కన్నులు చెవులవరకు వ్యాపించగా తమ మూతులెత్తి మగదాని మూతి నాకుచు, మెడ నాకు నప్పుడు......అలం. స్వభావోక్తి.

శా. హుంకారం బొనరించి వే తలఁగుఁడో హో నేను స్వారోచినే!
పంకేజాక్షులతోడ నెల్లపుడు ద ర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడఁగించినారు దలపో యన్ నాకు రోఁతయ్యె మీ
రింకం బోయి వరింపుఁ డొక్కరుని భో గేచ్ఛన్ నివారించితిన్. 79

టీ: హుంకారంబొనరించి = (ఆ మగలేడి) హుమ్మని; ఓహో=ఓ వనితలారా! వే=వెంటనే; తలఁగుడు=తొలగిపొండు; నేను; స్వారోచినే=స్వరోచి యను రాజు ననుకొన్నారా? ఎల్లపుడున్; దర్పస్ఫూర్తిన్=ఎక్కువ మదముతో; పంకేజాక్షుల తోడన్=స్త్రీలతో; క్రీడింపన్=భోగించను; లజ్జా+అంకూరంబు=కొంచెము సిగ్గునైనను; అడగించినారు=తగ్గించుకొన్నారు; తలపోయన్ = ఆలోచించగా; నాకున్; రోఁత+అయ్యెన్=అసహ్యము వేయుచున్నది; మీరు; ఇంకన్; పోయి=మరొకచోటకేగి; ఒక్కరుని=మరొక మగలేడిని; భోగ+ఇచ్ఛన్=సంభోగించు కోరికతో; వరింపుడు=కోరుకొనుడు; నివారించితిన్=ఇంద్రియ నిగ్రహము కల్గియుంటిని గదా!

తా: అప్పుడు మగలేడి హుమ్మని వారించి 'ఓ ఆడులేడులారా! తొలగి పొండి. నేను స్వరోచిని కాను. ఎప్పుడును భార్యలనుకూడి క్రీడింపను. పూర్తిగా సిగ్గువదలినారు. నాకసహ్యము వేయుచున్నది. మీరు క్రీడించుటకై మరొకమగలేడిని కోరుకొనుడు. ఇక నేను క్రీడింపను.

చ. బరువన కింతులం దనకుఁ ౹ బల్వురఁ గూర్చుట భోగవాంఛఁ గా
కరయఁగ నొండుగాదు ధన ౹ మన్న ధ్రువంబుగ నంగనాజనో
త్కరసముపార్జితం బటులు ౹ గావున వీనికి లే దిహంబునుం
బరమును నన్నె నట్ల పఱు ౹ పం బని లే దిది చెప్ప నేటికిన్. 80

టీ. బరువనక = కష్టమనియైన తలంపక; తనకున్; ఇంతులన్ = భార్యలను; కూర్చుట = సమకూర్చు కొనుట; భోగవాంఛన్ + కాక = సంభోగింపదలచియే కాని; అరయగన్ = ఆలోచింపగా; ఒండుగాదు = మరొకటిగాదు; ధనమన్నన్ = ధనమా; ధ్రువంబుగన్ = నిశ్చయముగా; అంగనాజన + ఉత్కరసముపార్జితంబు = స్త్రీలచే సంపాదింపబడినదే; అటులుగావునన్ = అట్లుకాన; వీనికిన్ = ఈ స్వరోచికి; ఇహంబున్ = ఈ లోకసౌఖ్యము కాని; పరమును = పరలోక సుఖమును; లేదు; నన్నున్; అట్ల = అతనివలెనే; పఱుపన్ = పాడుచేయుటకు; పనిలేదు = అంత అవసరము లేదు.

తా: బరువనియైన తలపక ఇంతమందిని పెళ్లాడుట భోగించుటకే కదా! ఇతని వైభవమంతయు స్త్రీల వలన సంపాదింప బడినదే. ఇతనికి ఇహ—పరములు లేవు. నన్ను కూడ అతనివలె చేయ నవసరము లేదు. పొండు, నాకే సుఖమును గూర్చి చెప్పకుడు.

క. వీనివిధంబున వనితా
ధీనుఁడనై పెంపు దక్కి ౹ తిరుగుచు నుండం
గా నే వెఱ్ఱినె తమకము
మాని చనుం డన్న నవియు ౹ మసలక చనియెన్. 81

టీ: వీని విధంబునన్ = ఇతడువలె; వనితా + అధీనుడనై = స్త్రీలకు వశుడనై; పెంపుతక్కి = అభివృద్ధితగ్గి; తిరుగుచున్ = క్రీడించుచు; ఉండగాన్ = ఉండుటకు; నేన్; వెఱ్ఱినె = వెఱ్ఱివాడనా! తమకము = మోహము; మాని; చనుండు = పొండు; అనన్ = అనగా; అవియున్ = ఆయాడులేళ్ళుకూడ; మసలక = ఆలసించక; చనియెన్ = వెడలినవి.

తా: ఈ స్వరోచివలె స్త్రీలోలుడనై తిరుగుటకు నేను వెఱ్ఱివాడనుగాను. నామీది మోహము మానుకొని వెళ్ళిపొండు. అని మగలేడి కసరగా ఆడులేళ్లు వెళ్ళి పోయినవి.

క. ఈకరణి దూఱు నాడి
యాకృష్ణమృగంబు పల్కె ౹ లట మున్నుగ న
క్కోకసతి యన్నమాటలు
నేకంబై తనమనంబు ౹ నెరియం జేయన్. 82

టీ: ఈకరణిన్=ఇట్లు; దూఱన్=నిందించునట్లుగా; ఆడిన = పల్కిన; ఆకృష్ణమృగంబు పల్కులు=ఆ లేడిమాటలను; అటువున్నగన్ = అంతకుముందు; ఆ+శోకసతి=ఆనుచక్రవాకము; అన్నమాటలును; ఏకంబై = ఒక్కటై; తన మనంబు=తనమనస్సును; నెరియం జేయన్=బాధింపగా......

తా: ఇట్లన్న లేడిమాటలును, ఆ నాడన్న చక్రవాకి మాటలును కలిసి తన మనస్సును వేధింపగా.........

ఉ. ఆరయ నిట్టిరోఁతలకు నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడి సంగ మిఁక వీడెద నంచుఁ దలంచి తోన దు
ర్వారములైన కోరికల వంక వివేకముచొప్పు దక్కి యిం
పారఁగ నాఱునూఱు సుర హాయనముల్ చరియించెఁ
గ్రమ్మఱన్. 83

టీ: ఆరయన్=ఆలోచింపగా; ఇట్టిరోతలకున్ = ఇట్టి అసహ్యములు కల్గుటకు; జలజాక్షులు=స్త్రీలు! ఆలయముల్ = స్థానములు; వీరలతోడిసంగము= వీరితో సంబంధము; ఏటికిన్=ఎందుకు? ఇఁకన్=ఇకమీద; వీడెదన్ = వదలుదును; అంచున్=అని; తలంచి=అనుకొని. తోన=వెంటనే; దుర్వారములైన= నివారింపలేని; కోరికలవంకన్=కోరికలపై; వివేకముచొప్పు=వివేకము కల్గిన రీతిని; తక్కి=వదలి; క్రమ్మఱన్=మరల; ఇంపారగన్ = ఎక్కువ ప్రేమతో, ఆఱునూఱుసురహాయనముల్=ఆరువందల దివ్యవత్సరములు; చరియించెన్=క్రీడించెను.

తా: 'ఇట్టి అసహ్యముల కన్నిటికి స్త్రీలే కారణమైనవారు, కాన వీరితోడి సంబంధము నింక మానుదు'ననుకొని, వెంటనే మరల్పరాని ప్రేమాతిరేకములతో కోరికల ననుభవించుచు ఆరువందల దివ్యసంవత్సరములు వెళ్ళించెను. మానవమానమున ఏడాదియైనచో దేవమానమున ఒక్కరోజు అగును. అట్టి ఏడాదికి 360 దినములుండును.

వ. తదనంతరంబ క్రమక్రమంబున మనోరమయందు విజయుండును విభావసియందు మేరునందనుండును కళావతియందు విభాసుండు నను నందనులం గాంచి పద్మినీ విద్యాప్రభావంబునం బాకశాసన దిశాముఖంబున విజయునకు విజయాఖ్యపురంబును గిన్నరేశ్వర హరిదంతంబున మేరునందనునకు గంధవతి యను పుటభేదనంబును దక్షిణంబున విభాసునకు ధారాహ్వయోదాగమనా నగరంబునుం గల్పించి యనల్పవిభవంబున నక్కుమారుల నప్పట్టణంబులకుఁ బట్టంబు గట్టి కృతార్థుండై యొక్కనాఁడు.

టీ: తదనంతరంబ=తర్వాత; క్రమక్రమంబునన్=క్రమముగా; మనోరమ యందు విజయుండును=మనోరమకు విజయుడను కొడుకును; విభావసియందు మేరు నందనుండును = విభావసికి మేరునందను డనెడి కొడుకును; కళావతియందు విభా వసుండును=కళావతికి విభావసుడనెడి కొడుకును; అనునందనులన్=అనెడి కొడు కులను; కాంచి=కని; పద్మినీవిద్యా ప్రభావంబునన్=పద్మిని మహిమచే; పాక శాసనదిశాముఖంబునన్=తూర్పుదిక్కున; విజయునకున్; విజయాఖ్యపురంబును= విజయమను పేరుగల పట్టణమును; కిన్నరేశ్వరహరిత్+అంతంబునన్ = ఉత్తరపు దిక్కు చివర, మేరునందనునకున్; గంధవతియను పుటభేదనంబును = గంధవతి యనెడి పట్టణమును; దక్షిణంబునన్=దక్షిణదిక్కున; విభావసునకున్; ధారా+ ఆహ్వయ+ఉదారమహానగరంబును=ధారానగరమును; కల్పించి = ఏర్పాటుచేసి; అనల్పవిభవంబునన్ = ఎక్కువ సంపత్తుతో; ఆ+కుమారులన్; ఆ+పట్టణంబుల కున్; పట్టంబుకట్టి=పట్టభిషేకము చేసి; కృతార్థుండై=చేయవలసిన పనిచేసినవాడై; ఒక్కనాడు......

ఉ. శాసితశత్రుఁడా నృపతి చంద్రుఁడు తూణధరుండు సజ్యబా
ణాసనపాణిపంకజుఁడునై మృగసంఘము లెల్లఁ బెల్లు సం
త్రాసము నొందఁ గ్రూరత నరణ్యమునన్ మృగయాకుతూహలో
ల్లాసమునం జరించెఁ జల లక్ష్యవిభేదవిధావధానుఁడై. 85

టీ: శాసితశత్రుడు = శిక్షింపబడిన శత్రువులుకల; ఆనృపతిచంద్రుడు= ఆస్వరోచి; తూణధరుండు = అమ్ములపొదిని ధరించినవాడు; సజ్య = నారితో కూడిన; బాణాసనపాణి పంకజుడునై; ధనువుచేతియందు కలవాడునై; మృగసంఘ ములు=జంతువుల గుంపులు; పెల్లు = ఎక్కువగా; సంత్రాసమున్=భయమును; ఒందన్=పొందగా; క్రూరతన్=క్రౌర్యముగా; మృగయా=వేటమీది; కుతూ హల=వేడుకతోడి; ఉల్లాసమునన్=ఉత్సాహముతో; అరణ్యమునన్=అడవిలో; చల=కదలెడి; లక్ష్య=గురియైన జంతువులను; విభేదవిధా=కొట్టెడి విధానమున; అవధానుండై=ఏకాగ్రతకలవాడై; చరించెన్=ప్రవర్తించెను.

తా: ఒకనాడు స్వరోచి విల్లు, అమ్ములపొది పుచ్చుకొని అడవికి వేటకేగి, కదలెడి మృగములను గురితప్పక కొట్టుచుండెను.

వ. ఆసమయంబున. 86

టీ: ఆ సమయంబునన్=అప్పుడు.

క. కుటిలకృశసాంధ్యరజనీ
విటకోరకకోమలచ్ఛవి స్ఫుటదంష్ట్రో
ద్భటపోత్రిఖనితాగ్రి
స్ఫుటితవనీధాత్రి నొక్క పోత్రిం గనియెన్. 87

టీ: కుటిల=వంకరదైన; సాంధ్య=సంధ్య వేళయందలి; రజనీవిటకోరక =చంద్రరేఖవలె; కోమలచ్ఛవిన్=మృదువైన కాంతితో; స్ఫుట=స్పష్టమైన;

దంష్ట్రా=కోరలచే; ఉద్భట=పైకెత్తిన; పోత్ర=ముట్టెయనెడి; ఖనిత్ర+అగ్ర=త్రవ్వుకోలయొక్క చివరచే; స్ఫుటిత=త్రవ్వబడిన; వనీధాత్రిన్=అడవిప్రదేశము కల; ఒక్కపోత్రిన్=ఒకఅడవి పందిని; కనిగొనెన్.

తా: వంకరదై సంధ్యాకాలమందలి చంద్రరేఖవంటి కాంతికల కోరలుకల ముట్టెతో పైకెత్తి త్రవ్వబడిన అడవిప్రదేశముకల అడవిపందిని చూచెను. అలం. నిదర్శన రూపకములు.

సీ. జంభారిభిదుర సంరంభంబు వీక్షించి
జరుగు నంజనమహా శైలమనఁగ
ఝంఝాప్రభంజనా స్ఫాలనంబున నుల్కి
యరుగు సంవర్త కాలాభ్ర మనఁగఁ
గఠినకంఠేకాల కంఠమూలము వాసి
వెసవచ్చు నుజ్జ్వల క్ష్వేళ మనఁగఁ
గలుషధూర్వహ ఖలోత్కరముపైఁ బఱతెంచు
దండధరక్రూర దండ మనఁగ

తే. ఘుర్ఘురారావసంఘాత ఘూర్ణమాన
సప్తపాథోధిపాథః ప్రచండ నక్ర
తిమితిమింగల మగుచు నభ్రమును మహియు
గ్రమ్ముకొని వచ్చు నొకయేక లమ్ముఁ గనియె. ౪౪

టీ: జంభారిభిదురసంరంభంబున్ = దేవేంద్రుని వజ్రము యొక్క అట్టహాసమును; వీక్షించి=చూచి; జరుగు=ముందుకుపోవు; అంజనమహాశైలమనంగన్=కాటుకకొండయో యన్నట్లుగా; ఝంఝాప్రభంజన=వర్షముతో కూడిన పెనుగాలి యొక్క; ఆస్ఫాలనంబునకున్=దెబ్బకు; ఉల్కి=భయపడి; అరుగు=వెళ్ళెడి; సంవర్తకాలాభ్రమనంగన్=ప్రళయకాలమేఘమా అన్నట్లును; కఠిన కంఠేకాల=కఠినమైన శివునియొక్క; కంఠమూలమున్=మెడమొదటిని; పాసి=వదలి; వెసన్=వేగముగా; వచ్చునుజ్జ్వలక్ష్వేళమనగన్=వచ్చెడి మండెడి గరళమాఅన్నట్లును; కలుషధూర్వహ = పాపపు బరువు మోయునట్టి; ఖల+ఉత్కరముపైన్=దుష్టుల గుంపుపైకి; పఱతెంచు=వేగముగా వచ్చు; దండధర=యమునియొక్క; క్రూరదండమనగను = భయంకరమైన దండమా అన్నట్లును; ఘుర్ఘుర = గురగురమను; ఆరావ=చప్పుడుయొక్క; ఘాత=దెబ్బచే; ఘూర్ణమాన=కదలుచున్న; సప్తపాథోధి=సప్తసముద్రముల యొక్క; పాథః=నీటినుండి బయల్దేరిన; ప్రచండ=భయంకరమైన; నక్ర=మొసళ్ళు; తిమి; తిమింగిల మగుచున్=పెద్దచేపలుకలదై; అభ్రమును=ఆకాశమును; మహియున్=భూమిని; క్రమ్ముకొని=ఆవరించు; వచ్చు నొకయేకలమ్మున్=వచ్చెడి పందిని; కనియెన్=చూచెను.

తా: ఇంద్రుని వజ్రపు దెబ్బకు భయపడి పరుగెత్తు కొటుక కొండవలెను, పెనుగాలివానకు పారిపోవు మేఘమువలెను, శివుని కంఠమునుండి వచ్చు కాలకూటము వలెను, పాపులను శిక్షించుటకై వచ్చు యమదండము వలెను, తన గురగురధ్వనిచే సప్తసముద్రములలోని జలచరములను కలత పెట్టుచు, భూమ్యాకాశముల నాక్రమించి వచ్చెడి పందిని చూచెను. అలం. ఉపమ, అతిశయోక్తియు.

మ. కని మార్వోనినదంబు సేయుచు భుజం ♦ గక్రూరనారాచముం
దనదోర్దండకృతాంతదండనిభ కో ♦ దండంబునం గూర్చి బో
తన నేయం దమకించుచుండ నొక సా ♦ రంగాంగనారత్న మ
జ్జననాథాగ్రణిం జేరి పంచజనభా ♦ షాఘోషిమై నిట్లనున్. 89

టీ: కని=చూచి; మార్వోనినదంబు=నారిచప్పుడు: చేయుచున్; భుజంగక్రూరనారాచమున్=పాముపలె భయంకరమైన బాణమును; తనదోర్దండ=తన చేతిలోని; కృతాంతదండనిభ=యమదండమువంటి; కోదండంబునన్=వింటిని; కూర్చి=సంధించి; బోరనన్=వేగముగా; ఏయన్=కొట్టుటకు; తమకించుచుండన్=ప్రయత్నించు చుండగా; ఒకసారంగాంగనారత్నము=ఒక యాడులేడి; అ+జననాథ+అగ్రణిన్= ఆ రాజునుగూర్చి; పంచజన= మానవుల; భాషాఘోషిమన్=మాటల నేర్పుతో; ఇట్లనున్=ఇట్లనెను.

తా: స్వరోచి ఆ పందిని చూచి వాడియైన బాణమును వింటిని సంధించి వదలబోవుచుండగా ఒక యాడులేడి యెదుట నిలబడి మనుష్యభాషలో నిట్లన్నది.

క. నృప యీక్రోడము నీ కే
యపకారము సేసె దీని ♦ కలుగంగ నేలా
కృప మదిం జొనుపక నాపై
నిపు డీశర మేసి నిగ్ర ♦ హించుట యొప్పున్ 90

టీ: నృప=రాజా! ఈ క్రోడము = ఈ అడవి పంది; నీకున్; ఏ యపకారము చేసెన్=ఏమి కీడుచేసినది? దీనికిన్=దీనిపై; కృప=దయను; మదిన్=మనస్సులో; చొనుపక=పెట్టక; అలుగంగన్=కోపించుట; ఏలా=ఎందుకు? ఇపుడు; ఈశరమునన్=ఈ బాణమును; నాపైన్=నామీద; ఏసి=వేసి; నిగ్రహించుట=చంపుట; ఒప్పున్=తగును.

తా: రాజా! ఈపంది నీకే మపకారము చేసినది? దానిపై దయచూపక కోపపడ నేల! ఆ బాణముతో నన్ను కొట్టి చంపిన మంచిది.

క. అని పలుక నతఁడు నీ వీ
తనువుపయిన్ రోయ నేల ♦ తద్దయుఁ గృశమై
యునికియుఁ గాదుఁ గదా చెప్పు
మనవుఁడు నాహరిణి వల్కె ♦ నవనీపతికిన్. 91

టీ: అని పలుకఁగ=అని లేడి అనగా; అతడు=స్వరోచి; నీవు; ఈతనువు పైన్=ఈ శరీరముమీద; రోయ నేల = అసహ్యించుకొంటి వేల ? తద్దయున్= మిక్కిలి; కృశమై=చిక్కి; ఉనికియున్=ఉండుటయున్ కాదుకదా ! చెప్పుము; అనవుడున్=అనగా; అహరిణి = ఆ యాడులేడి; అవనీపతికిన్ = రాజుతో; పల్కెన్=అన్నది.

తా: స్వరోచి ఆలేడిని చూచి 'నీ శరీరము చిక్కి బక్కయైపోయినది కదా! అంత అసహ్యమేల కల్గినదో చెప్పు' మనగా అదిట్లన్నది.

తే. అన్యసతులయందు నాసక్తుఁ డగువానిఁ
దమక మొదవి కూడఁ దలఁచుకంటె
మరణమైన మేలు మఱి వితర్కింపంగ
ననుచుఁ బలుకుటయును నవనివిభుఁడు. 92

టీ: అన్యసతుల యందున్=ఇతర స్త్రీలపై; ఆసక్తుడగువానిన్=ప్రేమకల వాని; తమక మొదవి=ప్రేమపుట్టి; కూడన్=అతని కూడుటకు; తలచుకంటెన్= అనుకొనుటకన్న; వితర్కింపగన్ = ఆలోచింపగా; మరణమైనన్ = చావైనను; మేలు=అనుచున్=మంచిదే అని: పలుకుటయున్ = పల్కగా; అవనివిభుడు= స్వరోచి......

తా: అన్యస్త్రీలపై నాసక్తికల పురుషునిపై ప్రేమ కలిగి అతనిని కలియదలచుటకన్న మరణమే మేలు' అని లేడిపల్కగా స్వరోచి......

క. తావకహృదయం బెవ్వని
పై వదలక నిలిచె నీదు భావము తెలియం
గా వలయుఁ జెప్పుమన్న ధ
రావల్లభుతోడ హరిణి క్రమ్మఱ ననియెన్. 93

టీ: తావక హృదయంబు=నీమనస్సు ఎవ్వనిపైన్=ఏ పురుషునిపై; వదలక; నిలిచెన్=తగిలియున్నది ? నీదు భావము = నీఅభిప్రాయము; తెలియంగా వలయున్=తెలిసికోవలెను. చెప్పుము; అన్నన్=అనగా, హరిణి = ఆడులేడి; ధరావల్లభుతోడన్=రాజుతో; క్రమ్మఱన్=మరల; అనియెన్.

తా. నీ మనస్సే పురుషునిపై లగ్నమైనదో తెలియ జెప్పుము. అనగా మరల నా స్వరోచితో నిట్లన్నది.

చ. చెదరక నామనంబు నృప శేఖర నీయెడ నిల్చి మన్మథ
ప్రదరపరంపరానిహతి పాల్పడి వేఁగెడు నట్లు గాన నా
యెద టడఁగింపు మన్న హరి ణాంగన వీవు నరుండ నే ముదం
బొదవఁగ నీకు నాకు మిథు నోచితకృత్యము లెట్లు చేకుఱున్.94

టీ: నృపశేఖర=రాజా! నామనంబు; నీయెడన్=నీపై; చెదరక=నిశ్చలముగా; నిల్చి = లగ్నమై; మన్మథప్రదరపరంపరా= మన్మథబాణముల యొక్క; నిహతి=దెబ్బలకు; పాల్పడి=అధీనమై; వేగమున్=పరితాపము నొందుచున్నది; అట్లుగానన్=కావున; నాయుదటు = నా బాధను; అడగింపుము = తగ్గించుము; అన్నన్; ఈవు=నీవు; హరిణాంగనవు=ఆడులేడివి; నేన్; నరుండను=మనుష్యుడను; నీకున్ నాకున్=మనఇద్దరికిని; ముదంబొదవగన్ = వేడుక కల్గునట్లు; మిథునోచితకృత్యములు=సంభోగములు: ఎట్లుచేకురుఉన్=ఎట్లుగా చేయవీలగును.

తా. రాజా! నీపై నా మనస్సు లగ్నమై పరితాపము నొందుచున్నది. నా తాపము తగ్గించుము. అపుటతో స్వరోచి 'నీవు లేడివి. నేను మనుష్యుడను, మనిద్దరకు సంభోగమెట్లు కుదురును.'

క. నావుడు నను నాలింగన
మీ వనురాగమునఁ జేయు ♦ మింతియ చాలున్
భూవర యన్నఁ గృపార్ద్రుఁడు
గావున నానృపతి హరిణిఁ గౌఁగిటఁ జేర్చెన్. 95

టీ: నావుడున్=అనగా; భూవర=రాజా! ఈవు=నీవు; ననున్; అనురాగమునన్=ప్రేమతో; ఆలింగనము చేయుము=కౌగిలించుకొనుము; ఇంతియ=కౌగిలించుకొనుటయే; చాలున్. అన్నన్=అనగా; ఆ నృపతి; కృపా+ఆర్ద్రుడు=దయచే మెత్తనైనవాడు; కావునన్; హరిణిన్=ఆడులేడిని; కౌగిటన్+చేర్చెన్=కౌగిలించుకొనెను.

తా: అనగానే లేడి 'నీవు నన్ను ప్రేమగా కౌగిలించుకొన్నచో అదే చాలు' అన్నది. రాజు ప్రేమచే మెత్తబడి దానిని కౌగిలించుకొనెను.

సీ. వల్లీమతల్లి లా ♦ వణ్యసర్వస్వంబు
విమలాంగరేఖ నా ♦ విర్భవింప
మంజులమంజరీ ♦ మహిత సౌభాగ్యంబు
పరివృత్తకుచవృత్తిఁ ♦ బరిణమింపఁ
బల్లవచ్ఛదచారు ♦ భావానుభావంబు
మృదుహస్తలీల మూ ♦ ర్తీభవింప
రమణీయముకుళవి ♦ భ్రమభాగధేయంబు
కరరుహస్ఫూర్తి సా ♦ క్షాత్కరింపఁ

తే. జేసి మృగియై వహించు న ♦ క్షిద్వయంబు
భాసురంబుగఁ దనయంక ♦ పాళిలోన

మించు క్రొమ్మించు నుపమించు మెలఁత యగుచు
నిలుచు నవ్వనదేవత నృపతి సూచి. 96

టీ: వల్లీమతల్లి=మంచి తీగలయొక్క; లావణ్యసర్వస్వంబు = అందమంతయును, విమల+అంగరేఖన్ = స్వచ్ఛమైన శరీరమున; ఆవిర్భవింపన్=కల్గగా; మంజుల=అందమైన; మంజరీ=పూగుత్తుల యొక్క; మహితసౌభాగ్యంబు = గొప్పదైన అందము; పరివృత్తికుచవృత్తిన్ = గుండ్రని స్తనములుగా; పరిణమింపన్ = కాగా; పల్లవ+ఛద=చిగురుటాకులయొక్క; చారుభావ+అనుభావంబు=అందముయొక్క గొప్పదనము; మృదుహస్తలీలన్=మెత్తని చేతులుగా; మూర్తిభవింపన్ = మారగా; రమణీయ = అందమైన; ముకుళ = మొగ్గలయొక్క; విభ్రమభాగధేయంబు=విలాసలసంపద; కరరుహస్ఫూర్తిన్=గోళ్ళకాంతులుగా; సాక్షాత్కరింపన్=కన్పడగా; చేసి=మార్చి; (వనదేవత) మృగియై=ఆడలేడియై; వహించు నక్షిద్వయంబు=కల్గియున్న రెండుకన్నులును; భాసురంబుగన్ = ప్రకాశింపగా; తనయంకపాళిలోనన్=తన కౌగిలిలో; మించుక్రొమ్మించున్=ప్రకాశించెడి క్రొత్త మెరుపును; ఉపమించు మెలతయగుచున్=పోలిన స్త్రీయై; నిలుచు+ఆ+వనదేవతన్=నిలిచిన ఆ వనదేవతను; నృపతి=స్వారోచి. చూచి......

తా: అదివరలో ఆడులేడిగా వచ్చిన వనదేవత వనములోని లతలే శరీరము, పూలగుత్తులే స్తనద్వయము, చిగుళ్ళే చేతులు, మొగ్గలే గోళ్ళు, లేడికన్నులే కన్నులుగా మార్చి,తళుకుమను క్రొత్త మెరుపువంటి శరీరముతో స్త్రీయై కౌగిటిలో నిలువగా చూచి స్వారోచి......

క. పూనిన విస్మయరసమున
మానిని మృగివై చరించి మఱి యంగనవై
కానంబడితివి చిత్రం
బే నెన్నఁడు నెఱుఁగఁ జెప్ప వే తెలియంగన్. 97

టీ. పూనినవిస్మయ రసమునన్=కల్గిన ఆశ్చర్యముతో; మానిని=ఓ వనితా! మృగివై=ఆడులేడివై; చరించి=ఉండి; మఱి=తర్వాత; అంగనవై = స్త్రీవై; కానంబడితివి=కనపడితివే; చిత్రంబు=ఇది ఆశ్చర్యముగానున్నది; ఏన్ = నేను; ఎన్నడున్; ఎఱుగన్; తెలియంగన్ = దీనికారణము తెలియునట్లుగా; చెప్పవే= చెప్పుము ?

తా: ఆమెను చూచి స్వారోచి ఆశ్చర్యమంది 'ఓ తరుణీ! నీ వాడులేడివై కొంతసేపుండి మరిప్పుడు స్త్రీ వేలనైతివో కారణమును నాకు తెలియజెప్పుము ?

సీ. నావుడు నమరకాంత తా తనూభవుఁ జూచి
యివ్వనదేవత నే నరేంద్ర
సకలభూభవన రక్షాదక్షు మనువర్యు
నీయందుఁ బడయ నెన్నిక సమస్త

దివిజులు నన్నుఁ బ్రార్థించిన వచ్చితి
నను రాగవతి నైన నను వరించి
పడయుము నాయందు నపత్యంబు దీన నీ
కగుఁ బుణ్యలోకసంప్రాప్తి యనిన

గీ. నట్లకాకని యయ్యంబుజాయతాక్షి
నేకచిత్తంబుతోడ నంగీకరించె
బాల యిట్లు సుఖాంబుధిఁ దేలుచుండి
యంత గర్భిణియై శుభంబగుదినమున. 98

టీ: నావుడున్=అనగా; అమరకాంతాతనూభవున్=స్వరోచిని; చూచి; నరేంద్ర=రాజా! ఏన్=నేను; ఈ+వనదేవతన్; సకలభూభువన = అన్ని లోకములయొక్క; రక్షాదక్షున్=రక్షింప సమర్థుడైన వానిని; మనువర్యున్=మనువులలో శ్రేష్ఠుని; నీయందున్=నీ ద్వారా, పడయు+ఎన్నికన్ = పొందెడి కోర్కతో; నన్నున్; సమస్తదివిజులు=దేవతలందరును; ప్రార్థించినన్=కోరగా; వచ్చితిన్; అనురాగవతినైన ననున్=ప్రేమకలనన్ను; వరించి=ప్రేమించి; నాయందున్; అపత్యంబు=సంతానమును; పడయుము=పొందుము; దీనన్=దీనివలన; నీకున్; పుణ్యలోకప్రాప్తి=పుణ్యలోకములు కల్గును; అగున్. అనినన్=అనగా; అట్లకాక=అట్లేయగుగాక; అని; ఆ+అంబుజాతాయతాక్షిన్=ఆవనదేవతను; ఏకచిత్తంబుతోడన్=సమమైన ప్రేమతో; అంగీకరించెన్=పరిగ్రహించెను; బాల=ఆ పడుచు; ఇట్లు; సుఖ+అంబుధిన్=సుఖసముద్రములో; తేలుచున్=ఈదులాడుచు; ఉండి; అంతన్ = తర్వాత; గర్భిణియై = గర్భముకలదై; శుభంబగు దినంబునన్=మంచి రోజున......

తా: అట్లు స్వరోచి యడుగగా నా పడుచు 'నే నీ వనదేవతను. దేవతలు లోకములను రక్షింప సమర్థుడైన మనువుకాదగిన పుత్రుని నీవలన పొందుమని నన్ను కోరగా నీవద్దకు వచ్చితిని. నీపై ప్రేమకల దానను నన్ను వరించి పుత్రుని పొందుము. దాని వలన నీకు స్వర్గలోక సుఖములు కల్గునని చెప్పగా అతడు ప్రేమతో అంగీకరించెను. ఆమె అతనితో సౌఖ్యములందేలి ఒక్క శుభదినమునందు......

శా. కాంచెం బుత్త్రు విశాలనేత్రుఁ బృథువక్షఃపీఠ విభ్రాజితుం
బంచాస్యోద్భటశౌర్యధుర్యఘనశుంభద్బాహుఁ దేజోనిధిం
బంచాస్త్రప్రతిమాను మానఘను సామ్రాజ్యైక హేతుప్రభూ
తాంచల్లక్షణలక్షితున్ సుగుణరత్నానీక రత్నాకరున్. 99

టీ: విశాలనేత్రున్=విశాలమైన కన్నులుకల్గినట్టియు; పృథు=విశాలమైన; వక్షఃపీఠ విభ్రాజితున్=పీఠమువంటి రొమ్ముతో ప్రకాశించునట్టియు; పంచాస్య=సింహముయొక్క; ఉద్భటశౌర్యధుర్య = గొప్పపరాక్రమముకల; ఘనశుంభద్బా

హువన్ = గొప్పవైన బాహువులు కలిగినట్టియు; తేజోనిధిన్ = తేజస్సునకు నిధివంటియు; పంచాస్త్రప్రతిమానున్ = మన్మథునితో సమమైనట్టియు; మానఘనున్ = ఎక్కువ అభిమానముకలట్టియు; సామ్రాజ్య = మహామండలాధిపత్యమే; ఏకహేతు = ముఖ్య కారణముగా; ప్రభూత = ప్రచురమైన; అంచత్ = మంచి; లక్షణ = చిహ్నము లతో; లక్షితున్ = చిహ్నితుడైనట్టియు; సుగుణరత్న + ఆకర = మంచిగుణము లనెడి రత్నముల ప్రోవునకు; రత్నాకరున్ = సముద్రమువంటివాడైన; పుత్రున్ = కొడుకును; కాంచెన్ = కనెను.

తా: విశాలమైన నేత్రములు, రొమ్మును, సింహబలము, గొప్పతేజస్సు, మన్మథునివంటి యందము, చక్రవర్తి లక్షణములు కలిగిన కుమారుని కన్నది. అలం. రూపకము.

క. వేడుక నయ్యవసరమున
నాడిరి సురసతులు కిన్న ♦ రాంగన లర్థిం
బాడిరి గంధర్వులు గొని
యాడిరి సురతూర్యనినద ♦ మగ్గల మయ్యెన్. 100

టీ: అయ్యవసరమునన్ = ఆ పుత్రుడు పుట్టినపుడు; వేడుకన్ = సంతోష ముతో; సురసతులు = దేవతాస్త్రీలు; ఆడిరి = నాట్యము చేసిరి; అర్థిన్ = ప్రేమతో; కిన్నరాంగనలు = కిన్నరస్త్రీలు; పాడిరి. గంధర్వులు; గొనియాడిరి = స్తుతులను చేసిరి; సురతూర్యనినదము = దేవదుందుభులధ్వని; అగ్గలమయ్యెన్ = ఎక్కువయ్యెను.

తా: ఆ పుత్రుడు జన్మించినపుడు దేవతలాడిరి, కిన్నరులు పాడిరి. గంధర్వులు పొగడిరి. దేవదుందుభులు మ్రోగినవి.

తే. అట్లు జనియించి స్వారోచి ♦ షాఖ్య నతఁడు
శాంతి దాంతి దయాసత్య ♦ శౌచనిరతుఁ
డై యకామతఁ జిర తపం ♦ బాచరించె
నచ్యుతునిఁ గూర్చి యంతఁ గృ ♦ పార్ద్రుఁ డగుచు. 101

టీ: అట్లు = ఆరీతిగా; జనియించి = పుట్టి; అతడు = ఆ బాలుడు; స్వారోచి షాఖ్యన్ = స్వారోచిషుడను పేరుతో; శాంతి = అంతరింద్రియ నిగ్రహము; దాంతి = బహిరింద్రియ నిగ్రహము; దయా, సత్య, శౌచ = శుచిగానుండుటయందు; నిర తుడై = ఆసక్తికలవాడై; అకామతన్ = కోరికలు లేకుండ; అచ్యుతుని గూర్చి = విష్ణుమూర్తినిగురించి; చిరతపంబు = చాలకాలము తపస్సును; ఆచరించెన్ = చేసెను; అంతన్ = అట్లుచేయగా; కృపార్ద్రుడగుచున్ = దయతో కరగినవాడై......

తా: అట్లు పుట్టిన బాలుడు స్వారోచిషుడను పేరుతో ప్రసిద్ధుడై, దయా సత్యశౌర్యములందాసక్తి కలవాడై అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము కలవాడై నిష్కామముగా విష్ణువునుగూర్చి చిరకాలము తపస్సు చేసెను. అంతట నాతడు దయతో కరగినవాడై......

సీ. నీలమేఘముడాలు ✱ డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామనచాయ ✱ మేనితోడ
నరవిందముల కచ్చు ✱ లడగించు జిగి హెచ్చు
నాయతంబగు కన్ను ✱ దోయితోడఁ
బులుఁగురాయని చట్టు ✱ పలవన్నె నొరవెట్టు
హొంబట్టు జిలుఁగు గెం ✱ టెంబుతోడ
నుదయార్క బింబంబు ✱ నొఱపు విడంబంబు
నొరలంగ నాడు కౌ ✱ స్తుభముతోడ
గీ. జయజయధ్వని మౌళి సం ✱ జలులు సేర్చు
శర్వ శతధృతి శతమన్యు ✱ శమన శరధి
పాల కైలబిలాది దే ✱ వాలితోడ
నెదుటఁ బ్రత్యక్షమయ్యె ల ✱ క్ష్మీశ్వరుండు. 102

టీ: లక్ష్మి+ఈశ్వరుండు=విష్ణుమూర్తి; నీలమేఘముడాలు = నీలమేఘపు కాంతిని; డీలుసేయగజాలు మెఱుఁగున్=జయింపగల్గి ప్రకాశించెడి; చామనచాయ =నీలమైన రంగుతోడి; మేనితోడన్ = శరీరముతోను; అరవిందముల కచ్చులు= పద్మపురేకులను; అడగించుజిగిన్=అణగఁజేయు కాంతితో; హెచ్చునాయతంబగు= అతిశయము కల్గిన; విశాలమైన; కన్నుదోయితోడన్=రెండుకన్నులతోను; పులుఁగురాయని=గరుత్మంతుని యొక్క; చట్టుపలవన్నెన్=రెక్కలరంగును; ఒరపెట్టు =తక్కువచేయు; హొంబట్టు=బంగారురంగు పట్టువైన; జిలుగుగెంటెంబుతోడన్ =సన్నని జములు నేత బట్టతోను; ఉదయార్క బింబంబు మెఱపు = లేతసూర్యుని కాంతియొక్క; విడంబంబు=పోలికను; తొరలంగనాడు = పోద్రోసెడి; కౌస్తుభము తోడన్=కౌస్తుభమను మణితోను; (కౌస్తుభము పద్మరాగము కాన ఎఱ్ఱనిది.) జయజయధ్వనిన్=జయజయఅనుటతో; మౌళిన్=కిరీటమందు; అంజలులు=దోసిళ్లు; చేర్చు=చేర్చెడి; శర్వ=శివుడు; శతధృతి=బ్రహ్మ; శతమన్యు = ఇంద్రుడు; శమన=యముడు; శరధిపాలక=వరుణుడు; ఐలబిలాది = కుబేరుడు మొదలైన; దేవ+ఆలితోడన్=దేవతల సముదాయముతోను; ఎదుటన్=స్వాగ్రోచిషునిముందట; ప్రత్యక్షమయ్యెను.

క. ఈ తెఱఁగునఁ దోఁచిన హరి
కాతఁడు సాష్టాంగ మెరఁగి ✱ యంగము పులకా
న్వీతంబుగ హర్షాశ్రు
లేతేరఁగఁ జూచి భక్తి ✱ నిట్లని పొగడెన్. 103

టీ: అతఁడు=ఆ స్వారోచిషుఁడు; ఈ తెఱగునన్=ఇట్లు; తోఁచినహరికిన్=ప్రత్యక్షమైన విష్ణువునకు; సాష్టాంగము = ఎనిమిదవయవములతో కూడినట్లు; ఎరఁగి=నమస్కరించి; అంగము=శరీరము; పులక+అన్వితంబుగన్=గగిపాటుతో కూడికొన్నట్లుగా; హర్షాశ్రువులు = సంతోషముచే వచ్చు కన్నీళ్ళు; ఏతేరన్ = రాగా; చూచి=విష్ణునిచూచి; భక్తిన్=భక్తితో; ఇట్లని = చెప్పబోవుగీతిగా; పొగడెన్.

తా: ఇట్లు ప్రత్యక్షమైన విష్ణునిచూచి స్వారోచిషుఁడు శరీరము గగుర్పొడువగా, ఆనందబాష్పములురాగా ఇట్లు స్తుతించెను.

కవిరాజవిరాజితము

జయజయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా
జయజయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహఃప్రసరా
జయజయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా
జయజయ కేశవ కేశినిషూదన శౌరి హరీ దురితాపహరా. 104

టీ: దానవ=రాక్షసుల యొక్క, దారణకారణ=చంపుటకు సాధనమైన; శార్ఙ్గ=విల్లు; రథాంగ=చక్రము; గదా=కౌమోదకి; అసి=నందకమును; ధరా=ధరించినవాఁడా; చంద్ర=చంద్రులయొక్క; దినేంద్ర=సూర్యులయొక్క; శత+అయుత = వందవేలుకంటె; సాంద్ర = ఎక్కువైన; శరీరమహః = శరీరకాంతి యొక్క; ప్రసరా=ప్రసారము కలవాఁడా! తామరస+ఉదర=తామరపువ్వులోని లోపలి భాగమునకు, సోదర = సమమైన; చారుపద = సుందరమైన కాలిచే; ఉజ్ఝిత=విడువబడిన; గాంగఝరా=గంగాప్రవాహము కలవాఁడా! కేశవ=మంచి జుట్టుకలవాఁడా! కేశినిషూదన=కేశియను రాక్షసుని చంపినవాఁడా! శౌరి=శూరులను యాదవుల వంశములోనివాఁడా! దురితాపహరా=పాపముల పోఁగొట్టువాఁడా! 'నజజజజజజలగ' ములు గణములు 14 వ అక్షరము యతి కలది కవిరాజ విరాజిత వృత్తము. అలం. ఉపమ.

సీ. అవ్యయానంత విశ్వాత్మక విశ్వేశ
బ్రహ్మవు నీవు కపర్ది వీవ
యింద్రుండ వీవ వహ్నివి యనిలుఁడ వీవ
వరుణుండ వీవ భాస్కరుఁడ వీవ
యముఁడ వీవ వసూత్కరము నీవ రుద్రులు
నీవ యాదిత్యులు నీవ విశ్వే
లీవ మరుత్తులు నీవ మంత్రములు నోం
కృతి వషట్కృతి శ్రుతి స్మృతులు నీవ

తే. వేద్య మీవ యీవచ్చిన ✽ విబుధగణము
సర్వమును నీవ యెట్లన్న ✽ సర్వగతుఁడ
వగుట మఱి నీవు గానివాఁ ✽ డనఁగ నెవ్వఁ
డరయఁగను శేషభూత స ✽ మస్తశేషి. 105

టీ: అవ్యయ = నాశనము లేనివాడా! అనంత = అంతము లేనివాడా! విశ్వాత్మక = ప్రపంచ స్వరూపమైనవాడా! విశ్వేశ = జగత్తునకు ప్రభువా! నీవ = నీవే; బ్రహ్మవు; ఈవ, కపర్దివి = శివుడవు; ఇంద్రుడవు; వహ్నివి; అనిలుడవు = గాలివి; వరుణుండవు; భాస్కరుడవు; యముడవు; వసు + ఉత్కరము = వసువుల సముదాయము; రుద్రులు = రుద్రులనెడి గణములు; ఆదిత్యులు = ఆదిత్యులను దేవతలు; విశ్వులు = విశ్వేదేవతలు; మరుత్తులు = మరుద్గణములు; మంత్రములు; ఓంకృతి = ఓంకారము; వషట్కృతి = వషట్కారము; శ్రుతిస్మృతులు = వేదములు: ధర్మశాస్త్రములు; వేద్యము = తెలియదగిన వాడవు; ఈ వచ్చిన = ఇక్కడకు వచ్చియున్న; విబుధగణము = దేవతాసమూహము; సర్వమును = అంతయు; నీవ = నీవే; ఎట్లన్నన్ = ఇదంతయు నెట్లకు కారణమనగా; సర్వగతుడవగుటన్ = అంతను పొందినవాడ వగుటచే; నీవు కానివాడనగన్ = నీస్వరూపము కాని వాడనువాడు; ఎవ్వడు? అరయగను = ఆలోచింపగా; శేషభూతసమస్త = శేషమైన సర్వప్రపంచము కలవాడా! శేషి = లోకమున ముఖ్యమైనవాడా! అంతయు నీ స్వరూపమే కనుక నీ స్వరూపము కానివాడే లేడు.

మ. పరతత్త్వంబగు నీకు మోడ్పుఁ గరముల్ ✽ పద్మాక్ష కీర్తించెదం
బురుషార్థస్థితి నొప్పు నిన్నుఁ గరుణాం ✽ భోధిన్ భవార్తున్ జడున్
శరణార్థిన్ ననుఁ గావఁగాఁ దగుఁ బ్రధా ✽ నవ్యక్త కాలాత్మ యీ
శ్వర భూతంబుల కీవె కర్తవును బ్రో ✽ వన్ భర్తవున్ హర్తవున్.

టీ: పద్మాక్ష = పద్మములవంటి కన్నులు కలవాడా! పరతత్త్వంబగు నీకున్ = పరబ్రహ్మవైన నీకు; మోడ్పుగరముల్ = నమస్కారము; పురుషార్థస్థితిన్ = ధర్మార్థకామమోక్షముల ఉనికిచే; ఒప్పు నిన్నున్ = ప్రకాశించు నిన్ను; కరుణా + అంభోధిన్ = దయాసముద్రుని; కీర్తించెదన్ = పొగడుదును; భవార్తున్ = పుట్టుకచే పీడింపబడిన; జడున్ = మూఢుడైన; శరణార్థిన్ = శరణుకోరిన; ననున్; కావగా దగున్ = రక్షింపవలెను; ప్రధానవ్యక్త = ప్రధానముగా వ్యక్తమైనవాడా! కాలాత్మ = త్రికాలస్వరూపమైనవాడా! ఈశ్వర = ప్రభువా! భూతంబులకున్ = జీవులకు; కర్తవు = సృష్టించువాడవు; ప్రోవన్ = రక్షించుటకు; భర్తవున్ = భారము వహించిన వాడవు; హర్తవున్ = నాశనము చేయువాడవును; ఈవ = నీవే.

చ. విలయతమిస్రవేళ నతి ✽ వేలమహాంబుధి నూర్ధ్వలోకవా
సులు నతులై కనుంగొనెడు ✽ మూఁడ్కుల కౌర్వహుతాశనక్రియా

కలితగతిన్ వెలుంగు ఘన | కాయవిజృంభణం జోఅమీనవై
కలయఁగఁ గ్రాలు నీవెడఁద | కన్నులు బ్రోచు మమున్
మురాంతకా. 107

టీ. మురాంతకా=మురుడను రాక్షసుని చంపినవాడా! విలయతమిస్రవేళన్=ప్రళయకాలమందలి రాత్రియందు; అతివేలమహాంబుధిన్=హద్దులుమీరిన మహాసముద్రమున; ఊర్ధ్వలోకవాసులు=స్వర్గలోకమున నివసించువారు; నతులై=నమస్కరించువారలై; కనుంగొనెడు చూడ్కులకున్=చూచెడి చూపులకు; ఔర్వహుతాశన=బడబాగ్నియొక్క; క్రియాకలితగతిన్=పనివలె; వెలుంగు=ప్రకాశించెడి; ఘన=పెద్దదైన; కాయవిజృంభణన్=శరీరము పెంచుటచే; చోఅమీనవై=సొరచేపవై; కలయగన్=అంతట; క్రాలునీవెడఁదకన్నులు=వెలిగెడి నీకన్నులు; మమున్; ప్రోచున్=రక్షించుగాత!

తా: హరీ! ప్రళయకాలపు రాత్రివేళ జలమయ ప్రపంచమున బడబాగ్నులవలె వెలిగెడి మీనాకారమైన నీ విశాల నేత్రములు మమ్ము రక్షించుగాక! అలం. రూపకము.

చ. చటులకృపీటసంస్థితర | సాస్థలి పీలిక యుండ గార యి
చ్చుటకును బోలె శంఖమణి | శుక్తికదంబము నుగ్గుగా విశం
కటచరమాంగమంథగిరి | ఘట్టనఁ జేసి ఘురట్టమై కృపా
పటిమ జగంబుఁ బ్రోచు నలప్రాక్కమఠంబు నినున్ భజించెదన్.

టీ: చటుల=కదలెడి; కృపీటసంస్థిత=నీటిలోనున్న; రసాస్థలి=భూమి; ప్రీలకయుండన్=పగులకుండుటకై; గారయిచ్చుటకును బోలెన్=సున్నపుపట్టు వేయుటకువలె; శంఖ; మణి; శుక్తి=ముత్యపుచిప్పలయొక్క; కదంబము=సముదాయము; నుగ్గుగాన్=చూర్ణమగునట్లు; విశంకట=విశాలమైన; చరమాంగ=వీపుయొక్కయు; మంథగిరి=మందరపర్వతము యొక్కయు; ఘట్టనజేసి=రాపిడివలన; ఘురట్టమై=తిరుగలియై; కృపాపటిమన్=ఎక్కువదయచే; జగంబున్=లోకమును; ప్రోచు=రక్షించెడి; అలప్రాక్కమఠంబున్=ఆ ఆదికూర్మమైన; నినున్; భజించెదన్=సేవింతును.

తా: కదలెడి నీటిలోనున్న భూమిపగులకుండ సున్నపుపట్టు వేయుటకో అన్నట్లు తన వీపును మందరపర్వతమును తిరుగలిగా జేసి మణులను, శంఖములను, ముత్తెపుచిప్పలను పిండి చేసి లోకముల రక్షించిన యాదికూర్మావతారుడవైన నిన్ను సేవింతును. అలం. ఉత్ప్రేక్ష.

చ. ఉరుతరవిగ్రహస్ఫురణ | నుబ్బిన నీదు పరిచ్ఛదాముఖాం
తరమునఁ బోరమై యెగయు | ధార నరజాండము గాజుకుప్పెతో
సరియనఁగాఁ దలాతలర | సాతలసీమలు నిండి ధాత్రి ను
ద్ధరణ మొనర్చి నట్టినిను | నాదివరాహము నాశ్రయించెదన్. 109

టీ: ఉరుతర = మిక్కిలి గొప్పదైన; విగ్రహస్ఫురణన్ = శరీరపు కదలికచే; ఉబ్బిననీరు = పైకుబికిన నీరు; ఉపరి + భిదా = పైన కోయబడిన; ముఖ + అంతరమునన్ = ద్వారమధ్యమునుండి; తోరమై = ఎక్కువగా; ఎగయు ధారన్ = పైకివచ్చు ధారచే; అజాండము = బ్రహ్మాండము; గాజుకుప్పెతోన్ = గాజుబుడ్డితో; సరియనగాన్ = సమానమనునట్లుగా; తలాతల రసాతలసీమలు = తలాతలము, రసాతలము అను లోకముల ప్రదేశములు; చించి = చీలికలు చేసి; ధాత్రిన్ = భూమిని; ఉద్ధరణ మొనర్చినట్టి నినున్ = ఎత్తిన నిన్ను; ఆదివరాహమున్ = మొదటి అడవిపంది యాకారమును; ఆశ్రయించెదన్ = కొల్తును.

తా. ఆదివరాహమూర్తి బ్రహ్మాండమును నిండియున్న నీటిలోనికి ప్రవేశింపగా దాని దేహము పెద్దదగుటచే నీరు పైకి అది వచ్చిన త్రోవనే పైకెగయగా లోకములు గాజుబుడ్డివలెను, ఆ నీటిధార ఆ బుడ్డి మెడవలె కనపడగా తలాతలాదులగు అధోలోకములను చీల్చుకొని క్రిందికి పోయి భూమి నుద్ధరించిన యజ్ఞవరాహమూర్తివగు నిన్ను కొల్తును. అలం. ఉపమ.

మ. కరుణించున్ మము నట్టినీదుభుజయుగ్మం బెద్ది పూనెన్ నభోం
తరసీమన్ దితిజాంత్రసక్తనఖ సంతానంబుతోన్ నో నృకే
సరి రాత్రించరభీతికై త్రిభువనాస్థానీయవీథిన్ విక
స్వరశోణస్రగలంకృతక్రకచ భాస్వత్తోరణస్తంభతన్. 110

టీ: నృకేసరి = నరసింహమూర్తీ! ఎద్ది = ఏది; నభః + అంతరసీమన్ = ఆకాశమధ్యప్రదేశమున; దితిజ = హిరణ్యకశిపునియొక్క, ఆంత్రసక్త = ప్రేవులతో కలిసిన; నఖసంతానంబుతోన్ = గోళ్ళ సముదాయముతో; రాత్రించర భీతికై = రాక్షసుల భయమునకై; త్రిభువన + ఆస్థానీయవీథిన్ = ముల్లోకముల సభామండపమున; వికస్వర = వికసించిన; శోణస్రక్ + అలంకృత = ఎఱ్ఱనిపూలమాలలచే నలంకరింపబడిన; క్రకచ = రంపములతో; భాస్వత్ = ప్రకాశించెడి; తోరణస్తంభతన్ = బహిర్ద్వారపు స్తంభములగుటను; పూనెన్ = వహించెనో; అట్టి నీదు భుజయుగ్మంబు = అట్టి నీ రెండు భుజములు; మమ్మున్; కరుణించున్ = దయజూచును గాక!

తా. ఓ నరసింహమూర్తీ! నీవు హిరణ్యకశిపుని ప్రేవులను గోళ్ళకు తగిలించుకొని రాక్షసులకు భయము కల్గించుటకై స్వర్గ సభాద్వారమున నిలుచుండగా నవి సభాస్తంభములవలెనుండెనో అట్టి నీ రెండుభుజములు మమ్ము దయజూచును. అలం. నిదర్శనము.

చ. దనుజకులేంద్రదత్త కరతామరసస్థిత దానధారచే
ననిమిషదైన్యదుఃఖిత మహామునిమండల దృశ్యకశ్యపాం
గన నయనాంబువుల్ గడిగి కంజభవాండము మోవ లీలమైఁ
బెనిచినదంభవామను నుపేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్.

టీ: దనుజకులేంద్రదత్త = బలిచక్రవర్తిచే నియ్యబడిన; కరతామరసస్థిత = హస్తపద్మములందున్న; దానధారచేన్ = దానముచేసిన నీటిధారచే; అనిమిష = దేవతల

యొక్క; దైన్యగుణఖిత = దైన్యముచే విచారించుచున్న; మహామునిమండలదృశ్య = సప్తర్షిమండలముచే చూడదగిన; కశ్యపాంగన = అదితియొక్క; నయనాంబువుల్ = కన్నీటిని; కడిగి; కంజభవాండము = బ్రహ్మాండము; కావన్ = అనునట్లు; లీలన్ = విలాసముగా; మైన్ = శరీరమును; పెంచినదంభవామనున్ = పెంచినమాయావామనమూర్తిని; ఉపేంద్రునిన్ = ఇంద్రుని తమ్ముడైనవానిని; నిన్నున్; సమాశ్రయించెదన్.

తా. బలిచక్రవర్తి మూడడుగుల నేలను దానముచేసిన నీటితో విచారించెడి తన తల్లియగు నదితి కన్నులుతుడిచి చూచుచుండగా బ్రహ్మాండము నాక్రమించిన పెరిగిన మాయావామనమూర్తివైన నిన్ను సేవింతును. అలం. పర్యాయోక్తము.

చ. తనదగు సంతతిం గనలి తానె వధించిన పాపముల్ చెడన్
మునిఁగెడు నా గుణోగ్రకిణముల్ మొనయంగ శమంతపంచక
మ్మునఁ బితృతర్పణచ్ఛలన మున్కలు వెట్టు భవద్భుజాయుగం
బున కిదె వందనంబు భృగుపుంగవరూప విహంగవాహనా.

టీ: భృగుపుంగవరూప = భార్గవరాముని రూపముగలవాడా; విహంగవాహనా = విష్ణుమూర్తీ! తనదగు సంతతిన్ = తనదైన సంతానమును; క్షత్రియజాతిని; కనలి = కోపించి; తానె; వధించిన పాపమున్ = చంపిన పాపమును; చెడన్ = పోవుటకై; మునిగెడు నాన్ = మునుగుచుండెనా యన్నట్లు; గుణ+ఉగ్రకిణముల్ = నారిచే పెద్దవైన కాయలు; మొనయంగన్ = మొగ్గగా; శమంతపంచకమ్మునన్ = క్షత్రియుల నెత్తురులచే నింపిన యైదు చెరువులలో; పితృతర్పణ+ఛలనన్ = పితృతర్పణముచేయు మిషతో; మున్కలువెట్టు = స్నానముచేసెడి; భవత్ = నీయొక్క; భుజాయుగంబునకున్ = రెండుభుజములకును; వందనంబు = నమస్కారము.

తా. భగవానుని బాహువులనుండి క్షత్రియులు పుట్టిరి. కనుక వారిని సృష్టించిన తానే వారిని చంపినందున వచ్చిన పాపమును పోగొట్టుకొనుటకై వారి గత్తములతో నింపిన శమంతపంచకమను నైదు చెరువులలో పితృతర్పణము చేయువలెనను వంకతో మునిగిన పరశురామావతారుడవైన నీ భుజద్వంద్వమున కిదే నా నమస్కారము. అలం. ఉత్ప్రేక్ష.

మ. పవిధారాపతనంబు గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించెనా సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక సలీలం బన్న యుష్మన్నగు
జవనాస్త్రం బొసఁగున్ సిరుల్ రఘుకులస్వామీ! రమావల్లభా!

టీ: రఘుకులస్వామీ = రఘువుయొక్క కులములోని ప్రభువా! రమావల్లభా = లక్ష్మీదేవికి ప్రియుడైనవాడా! పవిధారాపతనంబు = వజ్రపుదెబ్బను; గైకొనని = లెక్కసేయని; ఆ+పౌలస్త్యుమైన్ = ఆ రావణుని శరీరమునందున్న; సప్తధాతువులన్ = ఏడురకముల ధాతువులను; దూఱుపరిశ్రమంబునకున్ = దూరెడి అభ్యాసము నకై; ఉద్యోగించెనాన్ = ప్రయత్నించెనా అన్నట్లు; సప్తసాల = ఏడు మద్దిచెట్ల

యొక్క; విచ్ఛేదంబు=తెగఁగొట్టుటను; ఒనరించి=చేసి; నిల్వక=ఆగక; సలీలన్=విలాసముగా; చిన్న=భూమిలోనికిపోయిన; యుష్మత్=మీయొక్క; మరుత్+జవన+అస్త్రంబు=వాయువేగముకల బాణము; సిరుల్=సంపదలను; ఒసంగున్=ఇచ్చుగాక!

సప్తధాతువులనగా 'రోమములు, త్వక్కు, మాంసము, అస్థి, స్నాయువు, మజ్జ, ప్రాణములు' అని కొందరును; 'వస, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్లములు' అని కొందరును చెప్పుచున్నారు.

తా: వజ్రాయుధము దూరని గాకణుని శరీరమునగల సప్తధాతువులలో దూరుటకై అభ్యాసము చేయుచున్నట్లు సప్తసాలములను నరుకగా అంతటితో ఆగక భూమిలోనికి పోయిన వాయువేగముకల నీ బాణము మాకు సిరి-సంపదల నిచ్చుగాక! అలం. ఉత్ప్రేక్ష.

క. పెరుగుప్రలంబునివీఁపునఁ
గరిపై హరివోలె విశద కాంతి నిలిచి త
త్కరణం బారాటముగాఁ
బరిమార్చిన నీదుబలిమిఁ బ్రణుతింతు హరీ. 114

టీ: హరీ! పెరుగు ప్రలంబునివీఁపునన్ = వృద్ధిపొందెడి ప్రలంబాసురునివీపునందు; కరిపైన్=ఏనుగు మీదికి; హరివోలెన్=సింహమువలె; విశదకాంతిన్=స్వచ్ఛమైన కాంతితో; నిలిచి; తత్కరణంబు=వానిదేహమును; ఆరాటము కాన్=బాధపడునట్లుగా; పరిమార్చిన నీదు బలిమిన్=చంపిన నీబలమును; ప్రణుతింతున్=పొగడెదను.

తా: పైకెగుగుచున్న ప్రలంబాసురుని వీపుమీదికి ఏనుగుమీదికి దూకు సింహము వలె దూకి వాని దేహము బాధపడునట్లుగా కొట్టిన బలరామమూర్తివగు నీబలమును స్తుతింతును. బలరాముడు ప్రలంబాసురుని చంపెను. అలం. ఉపమ.

తే. కొలుతుఁ దాదృగ్భవద్బాహు కులిశయష్టి
నెద్ది గిరివోలెఁ గడుపులో వృద్ధిపొందఁ
బగిలి రాకాసిదేహంబు మొగపుముత్య
మయ్యె ముంగామురారి రంగై మురారి. 115

టీ: మురారి! ఎద్ది=ఏచేయి; కడుపులోన్=పొట్టలో; వృద్ధిచెందన్=ఎదుగగా; రాకాసిదేహంబు=కేశియను రాక్షసుని దేహము; గిరివోలెన్=కొండవలె; పగిలి; ముంగామురారిరంగై; ముంజేతికంకణమువలె; (పా. ముంగై మురారి) మొగపుముత్యమయ్యెన్ = ముఖమున నున్న ముత్యమయ్యెనో; తాదృక్=అట్టి; భవత్=నీదైన; బాహుకులిశయష్టిన్=చేయియను వజ్రమును; కొలుతున్=సేవింతును.

తా. ఓ బుద్ధమూర్తీ! నీవు కేశియను రాక్షసుని నోట చేతిని చొనిపి పొట్టలోనికి పోగానే దానిని పెద్దదిగా పెంచి వానిని చంపితివి. అట్టి వజ్రాయుధమువంటి నీ భుజమునునే సేవింతును. అలం. రూపకము.

క. కృతయుగ మేతేర నలం
కృతికై కాశ్మీరపంక ౫ మిడి యలుకు క్రియన్
క్షితి యెల్ల మ్లేచ్ఛరక్త
ప్లుతముగఁ గావించు రౌతుఁ ౫ బొగడెద నిన్నున్. 116

టీ. కృతయుగము; ఏతేరన్ = రాగా; అలంకృతికై = పుడమి కలంకారముగా; కాశ్మీరపంకము = కుంకుమపువ్వుతో కలిపిన పల్చని గంధము; ఇడి = వేసి; అలుకు క్రియన్ = అలుకునట్లు; క్షితియెల్లన్ = భూమినంతను; మ్లేచ్ఛరక్తప్లుతముగన్ = సంకరులరక్తముతో తడియునట్లుగా; కావించురౌతున్ = చేసెడి గుఱ్ఱపురౌతైన; నిన్నున్; పొగడెదన్ = స్తుతింతును.

తా. కలియుగాంతమై కృతయుగము రాగా ఆ శుభోదయమున భూమిని కుంకుమపువ్వు కలిపిన గంధపు నీటితో అలుకునట్లుగా సంకరుల రక్తముతో తడియునట్లు చేయునట్టి గుఱ్ఱపు రౌతైన కల్కిమూర్తివైన నిన్ను పొగడుదును. అలం. ఉపమ.

వ. అని ప్రస్తుతించినం బ్రసన్నుండయి పాంచజన్యధరుండు వాత్సల్యంబున 'వత్సా వరంబు వేఁడు' మనుటయుఁ బ్రసాదం బని స్వారోచిషుం డిట్లనియె. 117

టీ: అని = ఇట్లు; ప్రస్తుతించినన్ = పొగడగా; పాంచజన్యధరుండు = విష్ణువు; వాత్సల్యంబునన్ = భక్తునియెడ ప్రేమతో; వత్సా! వరంబు వేఁడుము = వరమును కోరుకొనుము; అనుటయుఁన్ = అనగానే; ప్రసాదంబు + అని = మీఅనుగ్రహమని; స్వారోచిషుండు; ఇట్లనియెన్.

క. దేవ భవద్దాస్యసుఖం
బే వేఁడెద దయకుఁదగుదు ౫ నే సాలోక్యం
బీవే యితరము లొల్లన్
నావుడు నాతనికిఁ బద్మ ౫ నాభుం డనియెన్. 118

టీ: దేవ! భవత్ + దాస్యసుఖంబు = నీ సేవవలని సుఖము; ఏన్ = నేను; వేఁడెదన్; దయకున్ = నీదయకు; తగుదునేన్ = తగినవాడనైనచో; సాలోక్యంబు = నీవున్న లోకమున నుండుటను; ఈవే = ఇమ్ము; ఇతరములు = మరొక కోరిక; ఒల్లన్ = అంగీకరింపను; నావుడున్ = అనగా; అతనికిన్ = ఆస్వారోచిషునకు; పద్మనాభుండు = విష్ణువు; అనియెన్.

తా: 'దేవా! ఎల్లప్పుడు నీకు సేవచేయుటయే నాకు సుఖము నిచ్చును. కాన నీదయకు నేను పాత్రుడనేని నీవున్న లోకమున నుండునటుల (సాలోక్యము చతుర్విధ ముక్తులలో నొకటి) కరుణింపుము. అంతకన్న నాకేమియు నక్కరలేదు' అనగా నతనితో విష్ణు విట్లనెను.

క. సాలోక్యముఁ దుది నిచ్చెద
నేలు మిల ద్వితీయమనువ ! నీ వైనయధ
ర్మాలోలబుద్ధిఁ దిరముగ
వేలుపులకుఁ దపసులకును ! విధికిఁ బ్రియముగాన్. 119

టీ. సాలోక్యము; తుదిన్ = ఆఖరున; ఇచ్చెదన్ = ఇత్తును; ఈవు = నీవు; ద్వితీయమనువవై = రెండవమనువైన వాడవై; నయ = నీతియందును; ధర్మ = ధర్మమునందును; ఆలోల = ఆసక్తికల; బుద్ధిన్ = బుద్ధితో; తిరముగన్ = స్థిరముగా; వేలుపులకున్ = దేవతలకు; తపసులకున్ = మునులకును; విధికిన్ = బ్రహ్మకును; ప్రియముగాన్ = ఇష్టమగునట్లు; ఇలన్ = భూమిని; ఏలుము.

తా: నీవు రెండవమనువవై నీతి–ధర్మముల పాటించి బ్రహ్మాదుల కిష్టముగా భూరాజ్యమేలుము. తుదను సాలోక్యముక్తి నిత్తును.

చ. అని మహిమన్ మనుత్వమున ! కాతనిఁ బట్టముగట్టి పద్మలో
చనుఁడు విరించి శర్వముఖ ! సర్వసుపర్వులతో నదృశ్యుఁడై
చనియె నిజాలయంబునకు ! శాస్త్రవినిశ్చయయుక్తి దండపా
లనముల నవ్విభుండుఁ బ్రజకెలం బ్రజల ట్లరసెం గృపామతిన్. 120

టీ. అని; పద్మలోచనుడు = విష్ణువు; మహిమన్ = మహిమతో; మనుత్వమునకున్ = మనువుయొక్క పదవికి; అతనిన్ = ఆస్వారోచిషుని; పట్టముగట్టి = అభిషిక్తుని చేసి; విరించి = బ్రహ్మ; శర్వముఖ = శివుడుమున్నగు; సర్వసుపర్వులతోన్ = అందరు దేవతలతోను; అదృశ్యుడై = అంతర్ధానమై; నిజ + ఆలయంబునకున్ = తన సత్యలోకమునకు; చనియెన్ = వెళ్ళెను; ఆ + విభుండును = ఆస్వారోచిషమనువు కూడ; శాస్త్ర వినిశ్చయయుక్తిన్ = శాస్త్రములో చెప్పబడిన రీతిగా; దండపాలనములన్ = దుష్టశిక్షణ, శిష్టరక్షణలతో; ప్రజలన్ = మనుష్యులను; ప్రజలట్లు = తన సంతానమువలె; కృపామతిన్ = దయకల బుద్ధితో; అరసెన్ = పాలించెను.

తా: అని విష్ణువు అతనిని మనుపదవి పట్టాభిషిక్తునిచేసి బ్రహ్మాది దేవతలతో అంతర్ధానమై వైకుంఠమునకేగెను. స్వారోచిషమనువు శాస్త్రములో చెప్పబడినరీతిగా దుష్టశిక్షణ, శిష్టరక్షణములజేయుచు ప్రజలనుతనసంతానమువలె రక్షించుచు పాలించెను.

సీ. వానలు సరవితో ! వర్షించె సస్యముల్
వేళ్ళఁ గొల్చుగ విఱ్ఱ ! వీఁగి పండె
నారోగ్యపుత్రపౌ ! త్త్రైశ్వర్యవంతులై
బ్రదికిరి నూఱేండ్లుఁ ! బంచజనులు
పూవుఁబోఁడులు పతి ! దేవతలై రగ్ని
భయతస్కరవ్యాధి ! భయము లడఁగె
ఫలపయఃకుసుమాది ! బహుపదార్థంబులు
రసగంధసామగ్రి ! నెసకమెసఁగె

తే. గీ. నీత్యుపద్రవమృత్యురా ∮ హిత్యయుక్తి
ధరఁ బ్రజావృద్ధి తామర ∮ తంపరయ్యె
న్యాయపథమున స్వారోచి ∮ షాఖ్య మనువు
శ్రీలఁ బెంపొంది పాలించు ∮ కాలమునను. 121

టీ: స్వారోచిషాఖ్యమనువు = స్వారోచిషుడను పేరుగల మనువు; సంపదలతోఁ; పెంపు+ఒంది = అభివృద్ధినిపొంచి; న్యాయపథమునన్ = న్యాయమార్గమున; పాలించుకాలమునన్ = పరిపాలించెడి రోజులలో; వానలు; సరవితోన్ = క్రమముగా; వర్షించెను. సస్యముల్ = పైరులు; వేళ్ళన్ = వేరులంటుకూడ; కొల్చుగన్ = ధాన్యము కల్గునట్లుగా; విఱ్ఱవీఁగి = చాలపొడవుగా పెరిగి; పండెన్; పంచజనులు = మనుష్యులు; ఆరోగ్య, పుత్రపౌత్ర, ఐశ్వర్యవంతులై; నూఱేండ్లు; బ్రదికిరి. పూవుఁబోఁడులు = స్త్రీలు; పతిదేవతలైరి = పతియే దేవతగాకల పతివ్రతలైరి; అగ్నిభయ = నిప్పువలని భయము; తస్కరవ్యాధి భయములు = దొంగలు, రోగములవలన భయములు; అడఁగెను = తగ్గెను; ఫల = పండ్లు; పయః = పాలు; కుసుమాది = పూలు మొదలైన; బహుపదార్థంబులు = చాలవస్తువులు; రసగంధసామగ్రిన్ = రుచి, వాసనసమృద్ధితో; ఎసకమెసఁగెన్ = వృద్ధిపొందెను; ఈతి = అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడుతలు, చిలుకలు, మీదికి దండెత్తిన రాజులునను నారు; ఉపద్రవ = బాధలును; మృత్యురాహిత్యయుక్తిన్ = అపమృత్యువులేక పోవుటతో; ధరన్ = భూమిలో; ప్రజావృద్ధి = ప్రజలవృద్ధి; తామరతంపరయ్యెన్ = తెగపెరిగెను. (పా. తామరతంపమయ్యెన్.)

తా: స్వారోచిషమనువు పరిపాలించు రోజులలో సక్రమముగా వానలు కురిసెను. పంటలు బాగుగా పండెను. జనులు పుత్రపౌత్రాయురారోగ్యైశ్వర్యములు కల్గి నూఱేండ్లు బ్రతికిరి. స్త్రీలు పతివ్రతలైరి. అగ్న్యాదిబాధలు లేవు. ఈతిబాధలు లేవు. ఫలకుసుమాది వస్తువులు రససమృద్ధికల్గియున్నవి. అంతయు సర్వసమృద్ధముగా సుఖముగా నుండెడిది.

క. కోరిక నీస్వారోచిషు
చారిత్రము వినిన వ్రాయఁ ∮ జదివిన ధన ధా
న్యారోగ్యపుత్రవంతులు
నై రూఢిగఁ గంద్రు పిదప ∮ నమరత్వంబున్. 122

టీ: ఈ స్వారోచిషు చారిత్రము = ఈస్వారోచిషమనువుయొక్క చరిత్రను; వినినన్; వ్రాయన్ = వ్రాసినను; చదివినన్; ధన; ధాన్య, ఆరోగ్య, పుత్రవంతులునై = ధనాదులు కలవారై; పిదపన్ = చనిన తర్వాత; రూఢిగన్ = తప్పక; అమరత్వంబున్ = దేవత్వమును; కంద్రు = పొందుదురు.

తా: ఫలశ్రుతి. ఈ స్వారోచిషమను చరిత్రను వ్రాసినను, చదివినను, విన్నను జనులు పుత్ర పౌత్రాయురారోగ్యవంతులై చనిపోయినాక దేవత్వము నందుదురు.

తే. అని మృకండుతనూభవుఁ ∮ డనుఁగుశిష్యుఁ
డైన క్రోష్టికి వినిపించి ∮ నట్టి యాక

థా సుధాధార నించిరి ♦ దయ దలిర్ప
జైమిని శ్రుతిపటముల ♦ శకునివరులు. 123

టీ: అని; మృకండుతనూభవుఁడు=మార్కండేయుఁడు; అనుగుశిష్యుఁడైన=ప్రియశిష్యుఁడైన; క్రోష్టికిన్=క్రోష్టియను నాతనికి; వినిపించినట్టి=చెప్పిన; ఈకథాసుధాధారన్=అమృతధారవంటి యీ కథను; శకునివరులు=పక్షిశ్రేష్ఠములైన ధర్మపక్షులు; దయదలిర్పన్=దయఎక్కువకాఁగా; జైమిని శ్రుతిపుటములన్=జైమిని చెవులను; నించిరి=నింపిరి.

తా: మార్కండేయుఁడు క్రోష్టికి చెప్పిన ఈ కథామృతముతో ధర్మపక్షులు జైమిని చెవులను నింపినవి.

శా. వ్యాయామస్థిరసంధిబంధ కటకా ♦ ధ్యక్షానుగక్షోణిభృ
త్కాయగ్రావభిదావిధాభిదురదోః ♦ ఖడ్గాగ్ర యుగ్రాద్రిచల
జ్జ్యాయఃకీర్తిభరప్రపంచ వరపం ♦ చారామరామామణీ
గేయామేయజయాంక పంకజదృగం ♦ గీకారధీరాకృతీ. 124

టీ: వ్యాయామ=సాముచేయుటవలన; స్థిర=గట్టిపడిన; సంధిబంధ=కీళ్ళ సంధులుకలవాఁడా! కటక+అధ్యక్ష=కటకపురాధీశ్వరుఁడైన గజపతిరాజును; అనుగక్షోణీభృత్=అనుసరించిన రాజుల యొక్క; కాయగ్రావ=శరీరములనెడి పర్వతముల యొక్క; భిదావిధా=భేదించుటయను విధానమున; భిదుర=వజ్రాయుధమైన; దోఃఖడ్గాగ్ర=చేతిలోని కత్తి మొనకలవాఁడా! ఉగ్రచల=కైలాసముకన్న; జ్యాయః=పెద్దదైన; కీర్తిభరప్రపంచ=కీర్తితో నిండిన లోకముకలవాఁడా! వర=శ్రేష్ఠమైన; పంచారామ=అమరారామ, కుమారారామ, భీమారామ, క్షీరారామ, దక్షారామములతో కూడినదేశమందలి; సుందరీమణీ=స్త్రీలచే; గేయ=గానముచేయదగిన; అమేయ=ఊహింపరాని; జయాంక=జయచిహ్నములు కలవాఁడా! పంకజదృక్=స్త్రీలకు; అంగీకార=ఇష్టమైన; ధీర=ధైర్యముకల; ఆకృతీ=ఆకారము కలవాఁడా!

తా: సాము గరిడీలతో గట్టిపడిన శరీరము కలవాఁడును, గజపతి రాజును, అతని యనుచరులను ఖండించు కత్తి కలవాఁడును, కైలాసమువలె ప్రకాశించు కీర్తితో నిండిన ప్రపంచముకలవాఁడును, పంచారామావృతమైన దేశమును జయించి అక్కడి స్త్రీలచే పాడఁబడు జయగీతములు కలవాఁడును, స్త్రీమనోహరమైన ధీరసుందరాకృతి కలవాఁడునగు శ్రీకృష్ణదేవరాయా! అలం. రూపకము.

క. కాంతాలతాంతశర యే
కాంతికభక్తిప్రతోషి ♦ తాంభోధిసుతా
కాంతా ప్రతాపరవి శశి
కాంతాయితవిమతనృపతి ♦ కాంతాహృదయా. 125

టీ: కాంతాలతాంతశర=స్త్రీలకు మన్మథుని వంటివాఁడా! ఏకాంతిక=నిశ్చలమైన; భక్తిప్రతోషిత=భక్తిచే సంతోషింపజేయబడిన; అంభోధిసుతాకాంతా=విష్ణుమూర్తికలవాఁడా! ప్రతాపరవి = ప్రతాపమనెడి సూర్యునిచే, శశికాంతా

యిత=చంద్రకాంతమణిగా చేయబడిన; విమతనృపతి = శత్రురాజుల యొక్క; కాంతాహృదయా=కాంతాహృదయములు కలవాడా!

తా: మన్మథునివంటివాడును, విష్ణుమూర్తియందు నిశ్చలభక్తి కలవాడును, శత్రురాజపత్నుల హృదయవికాసమును పోగొట్టు ప్రతాపము కలవాడునగు శ్రీకృష్ణ దేవరాయా! అలం. రూపకము.

వనమయూరము

రాజపరమేశ ఫణి రాజబల ఫుల్లాం
భోజముఖ భోజముఖ భూపవిపులాంసో
త్తేజితధరాభరణ దీక్షితభుజా ని
ర్వ్యాజభయదాజివిజి తారినృపరాజీ. 126

టీ. రాజపరమేశ='రాజపరమేశ్వర' బిరుదము కలవాడా! ఫణిరాజబల= ఆదిశేషునివంటి బలము కలవాడా! ఫుల్ల+అంభోజముఖ=వికసించిన పద్మమువంటి ముఖము కలవాడా! భోజముఖ=భోజరాజు మొదలైన; భూప=రాజులయొక్క; విపుల+అంస=విశాలమైన భుజములచే; ఉత్తేజిత=మెరుగుపెట్టబడిన; ధరా= భూమిని; భరణ=భరించుటయందు; దీక్షిత=దీక్షకల; భుజా=భుజములు కలవాడా! నిర్వ్యాజ=నెపములేని; భయద=భయమునిచ్చు, ఆజివిజిత=యుద్ధములో జయింపబడిన; అరినృపరాజీ=శత్రురాజుల సముదాయము కలవాడా!

తా. రాజపరమేశ్వర బిరుదాంకుడును, ఆదిశేషునివంటి బలము కలవాడును, వికసించిన పద్మమువంటి వికాసముకల ముఖము కలవాడును, భోజరాజుమున్నగురాజులచే పాలింపబడిన భూమిని సమర్థతతో పాలించువాడును, భయమును కలిగించు శత్రువులనుగెల్చి కీర్తిపొందినవాడునైన శ్రీకృష్ణదేవరాయా!

ఇది శ్రీశాండిల్యసగోత్ర కంభంపాటి వ్యూపపదగామకృష్ణపుత్ర రామగోపాలకృష్ణమూర్తి ప్రణీతంబగు ప్రతిపదార్థ టీకాతాత్పర్య రూపంబగు మనుచరిత్ర వ్యాఖ్యానము సర్వము సంపూర్ణము.

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీనమానసేందిందిర నందవరపుర వంశోత్తంస
శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితా మతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబైన స్వారోచిష మనుసంభవం
బను మహాప్రబంధమునందు
షష్ఠాశ్వాసము
సంపూర్ణము.

(★)